ప్రతులు 1000
ప్రథమ ముద్రణము - ఆగష్టు 1983
వెల - రూ, **22**/- మాత్రమే

This book is published with the financial assistance of Tirumala Tirupati Devasthanams under their scheme aid to publish religious books.



ప్రతులకు :
గుండవరపు లక్ష్మీనారాయణ M. A., Ph. D.,
9వ లైను, అరండల్‌పేట, గుంటూరు.

ముద్రణము :-
పద్మిని ప్రింటర్స్
1వ లైను, బ్రాడీపేట, గుంటూరు.

# దర్శన దిగ్దర్శనం

"కరుణశ్రీ"

★ ★ ★ ★ ★

ఇది నారాయణ దర్శనం.
ఇది నారాయణ కళాప్రదర్శనం.
ఇది నారాయణ ప్రతిభా వైభవ నిదర్శనం.

"ఎవరీ ముగ్ధ మనోజ్ఞ దర్శనుడు?
ఎవం డీశారదామూర్తి?
ఈ నవ శృంగారరసావతారు డెవరన్నా!
శ్రీమదజ్ఞానహేమ యెవ్వనా!
ఆ దరహాసము - ఆ నడక తీరు -
ఆ తీవి - ఆ దర్పము -
ఆ కవితాదీప్తి -
అనన్య సాధ్యములుగా!
కైమోడ్పు లందింపరా!"

అంటూ ముక్కోటి ఆంధ్రులూ ముగ్ధులై ఏ మహాత్ముణ్ణి తిలకించి పులకించి స్పందించి అభినందించారో ఆ శృంగార సర్వజ్ఞుడు - ఆ సంగీత సాహిత్యసార్వభౌముడు - ఆ హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు.

కాలికి గజ్జె కట్టిన కథకు లందరికీ "ఒజ్జబంతి" అయిన అజ్జాడ వారి సమగ్ర సారస్వత సర్వతోముఖ సందర్శన మిది.

సరసకవిశిరోమణి జన నారాయణదాసుగారి సంపూర్ణ సాహిత్యాన్ని సహృదయశిరోమణి అయిన డా॥ గుండవరపు లక్ష్మీనారాయణగారు నిండు మనస్సుతో సావధానంగా సమీక్షించి తమ అనుభూతితో కూడిన సంప్రీతిని ఈ పుస్తకంలో విన్యస్తంచేసి మనందరికీ అందించారు. అందువల్లనే ఇది అక్షరాలా "నారాయణ దర్శనం"

ఆలంకారిక మూర్ధన్యుడైన రాజశేఖరుడు 'కావ్యమీమాంస' లో 'ప్రతిభ' ను రెండువిధాలుగా వింగడించాడు – 'కారయిత్రీ' 'భావయిత్రీ' అని. కారయిత్రీ ప్రతిభ కవులకు కావ్య నిర్మాణంలో ఉపకరిస్తుంది. భావయిత్రీ ప్రతిభ భావుకులయిన వారు ఆ కావ్యాన్ని చక్కగా చదివి ఆనందించటానికి ఉపయోగపడుతుంది. కవి – సహృదయుడు – ఈ ఇద్దరి సరససమ్మేళనంలోనే సరస్వతీదేవి సమగ్ర సౌందర్యం సాక్షాత్కరిస్తుంది. అందుకనే ఆచార్యపాదులు అభినవగుప్తులు "సరస్వత్యాస్తత్త్వం కవి సహృదయాఖ్యం విజయతే' అని అన్నారు.

బంగారానికి పరిమళంలాగా పాటకు పల్లవిలాగా పరమ పట్టభద్రపదానికి పరిశోధక పట్టం కలికితురాయి వంటిది. మన విశ్వవిద్యాలయాలలో ఎందరో ఎమ్. ఏ. పట్టభద్రులు ఎన్నెన్నో విషయాలపై వివిధ కోణాలలో పరిశోధనలు చేశారు, చేస్తున్నారు.

కొన్ని పరిశోధనలు పరిధి ఎక్కువ, లోతు తక్కువ. కొన్ని పరిశోధనలు పరిధి తక్కువ, లోతు ఎక్కువ. మరి కొన్ని పరిశోధనలు తగినంత విస్తృతమైన పరిధి కలిగి తగినంత లోతు కలిగి ఉంటాయి. ఇదిగో ఈ జాతికి చెందుతుంది గుండవరపు వారి ఈ పరిశోధన గ్రంథం.

డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణగారు గుంటూరు పట్టణంలోని జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పేరెన్నిక గన్నవారు. ఇంతకుముందు వీరు మంచి వక్తలుగా, కవులుగా, వ్యవహార వేత్తలుగా, నాటక నిర్మాతలుగా, సరస్వతీ పుత్రులుగా, అభిమాన పాత్రులైన మిత్రులుగా మాత్రమే నాకు పరిచితులు.

ఇప్పుడు శ్రీ లక్ష్మీనారాయణగారిని సౌందర్యదర్శకులైన సాహిత్య విమర్శకులుగా సైతం గుర్తించి ఎంతో సంతోషంతో ఈ ముందుమాటలు వ్రాస్తున్నాను.

శ్రీ లక్ష్మీనారాయణగారు సంగీత సాహిత్య సార్వభౌములైన ఆదిభట్ల నారాయణదాసుగారి "సమగ్ర సాహితీ సమీక్షాకృతి" అయిన ఈ కృతిని 1) జీవిత రేఖలు 2) హరికథ కథ 3) హరికథాగ్రంథములు 4) హరికథేతరగ్రంథములు 5) సాహితీ కోణములు 6) సంస్కారభూమికలు 7) స్థానప్రతిష్ఠ అని ఏడు విభాగాలుగా వింగడించటం, ఆ సప్త విధ విభాగాలనూ "స, రి, గ, మ, ప, ద, ని" అనే సంగీతంలోని సప్తస్వర సంకేతాక్షరాలను మేళవించటం చాలా సరసంగా, సముచితంగా సందర్భశుద్ధిగా ఉంది.

ఎందువల్లనంటే సంగీతసాహిత్యాలు రెండూ అవినాభావ సంబంధం కలవి. అవి రెండూ సరస్వతీదేవి నిండుగుండెలలోని అమృతధారలను అభివ్యక్తం చేసే అవ్యక్త మధుర రసకలశాలు. అవి ఒకదానికొకటి ఎంతదగ్గరగా అంటిపెట్టుకుని ఉంటే అంత అందం. అంత ఆనందం.

" (స) జీవితరేఖలు" అనే మొదటి విభాగంలో శ్రీ నారాయణ దాసుగారి పుట్టుపూర్వోత్తరాలూ, 'అజ్జాడ' 'ఆదిభట్ల' అనే గృహనామాలూ, బాల్యలీలలూ, చదువు సంధ్యలూ, హరికథాకథనాలూ, దేశసంచారాలూ, సత్కారాలూ, వాదు వాదాలూ, రాజసన్మానాలూ, విజయయాత్రలూ, వీరవిహారాలూ, విచిత్రసన్నివేశాలూ ఎన్నో, ఎన్నెన్నో కన్నులకు కట్టించారు పరిశోధకులు. ఈ విభాగంలో దాసుగారి ఎనభై సంవత్సరాల అశేషజీవిత విశేషాలు చోటుచేసుకున్నాయి.

ఇక రెండవ విభాగమైన " (రి) హరికథ కథ" లో హరికథ పుట్టుపూర్వోత్తరాలు, హరికథా శబ్ద నిర్వచనం, మహారాష్ట్ర తమిళ కర్ణాటక సాహిత్యాలలోని హరికథాలక్షణం, ఒక సరససాహితీ ప్రక్రియగా హరికథా స్వరూపనిరూపణం, హరికథలోని ప్రధానాంగాలు, యక్షగాన హరికథల భేదసామ్యాలు, సమగ్రంగా చర్చింపబడినాయి. దాసుగారు "కథక కథనైక మాత్రాశ్రితమైన హరికథాప్రక్రియను" సర్వాంగసుందరంగా దిద్ది తీర్చిన తీరు వర్ణింపబడింది. ఉత్తమ హరిదాసులక్షణాలు వివరింపబడినాయి. దాసుగారి చేతిలో హరికథ ఒడుపులూ ఒయ్యారాలూ అలవర్చుకొని, అందచందాలు నేర్చుకొని ఒక విజ్ఞానవేదికగా ఒక సకలకళాసంస్థగా రూపొందిన విధం నిరూపితమయింది,

మూడో విభాగం "(గ) హరికథాగ్రంథములు".

ఈ విభాగంలో శ్రీ నారాయణదాసుగారు రచించిన ధ్రువచరిత్రం, అంబరీషచరిత్రం, సావిత్రీ చరిత్రం, రుక్మిణీకల్యాణం, యథార్థరామాయణం, జానకీశపథం, గౌరమ్మ పెండ్లి మొదలైన 14 హరికథలనూ, వాని స్వరూప స్వభావాలనూ సోదాహరణంగా అభివర్ణించారు శ్రీ లక్ష్మీనారాయణగారు. అంతే కాకుండా ఈ హరికథలలోని రచనారామణీయకాన్నీ, వస్తుగ్రహణంలో వైవిధ్యాన్నీ కథలకు పేర్లు పెట్టటంలోని ఔచిత్యాన్నీ, విహంగవీక్షణంతో పరామర్శించారు. రచనా లక్ష్యాన్ని ఉగ్గడించారు. ప్రేరకరచనలను పేర్కొన్నారు. అంశాలనుగూర్చి, కథనధోరణిని గూర్చి చర్చించారు. "అంతర్ విభజన" చేశారు. భాషాదృష్టితో వింగడించిచూశారు. సంగీతం మేళవింపులను పేర్కొన్నారు. "అన్యథా మూలకములు-అమూలకములు" విభజించి చూపించారు.

"(ఘ) హరికథేతర గ్రంథములు" అనేది నాలుగో విభాగం.

ఇందులో రచయిత నారాయణదాసుగారి హరికథలు గాక మిగిలిన ముప్పయి రెండు గ్రంథాలనూ" స్వతంత్రములు - అస్వతంత్రములు - స్వతంత్రా స్వతంత్రములు" అని మూడువిభాలుగా విభజించారు.

కాశీశతకం, రామచంద్రశతకం, సూర్యనారాయణ శతకం, మొదలైన ఏడు శతకాలనూ, 'బాటసారి' మొదలైన నాలుగు ప్రబంధాలనూ, సారంగధర, దంభపుర ప్రహసనం అనే రెండు నాటకాలనూ, 'నాయెఱుక' మొదలైన ఐదు వివిధకృతులనూ "స్వతంత్రగ్రంథా"లలో చేర్చారు.

'నవరస తరంగిణి' మొదలయిన అనువాదకృతులు అరింటినీ 'అస్వతంత్ర గ్రంథా'లలో చేర్చారు. ఇకపోతే 'తర్కసంగ్రహం' మొదలైన శాస్త్రగ్రంథాలు ఎనిమిదింటినీ 'స్వతంత్రాస్వతంత్ర గ్రంథాలు" గా పేర్కొన్నారు.

ఈ విధంగా ఈ విభాగంలో హరికథేతరాలయిన 32 గ్రంథాలలోని కవితా విశేషాలనూ, రచయిత ఎంతో స్పృహణీయంగా రమణీయంగా సవిమర్శంగా తలస్పర్శంగా ప్రదర్శించారు.

ఇక ఐదో విభాగం "(ప) సాహితీ కోణములు"

ఈ విభాగంలో శ్రీ లక్ష్మీనారాయణగారు నారాయణదాసుగారి గ్రంథాలను అన్నింటినీ పేరుపేరు సాహితీకోణాలతో నిశితంగా దర్శించి పరామర్శించారు. ఈ దర్శనంలో 1) వస్తుస్వీకరణం 2) రసనిర్వహణం 3) పాత్రపోషణం 4) వర్ణనా వైభవం 5) కల్పనా శిల్పం 6) అలంకారశోభ 7) భాషావేషం 8) సూక్తిశుక్తి జములు 9) అనువాదావతారం అనే నవకోణాలూ నవనవభంగుల్లో ప్రధాన స్థానం వహించాయి. ఈ సందర్భంలో రచయిత లేఖిని సుమనోమనోజ్ఞంగా నాట్యం చేసింది.

"(ద) సంస్కార భూమికలు" అనేది ఆరోవిభాగం.

ఇందులో భక్తిపథం, కళాకేళి. లోకాలోకనం, చమత్కారచారుత్వం, విమర్శన వాదర, ధిషణావిశ్లేషణం, అనే శీర్షికలు భూమికారూపంలో దాసుగారి కృతులలోని భక్తి వైభవాన్ని, కళాసౌందర్యాన్ని, లోకజ్ఞతనూ, చమత్కార సౌభాగ్యాన్ని, విమర్శనా దృష్టినీ, నిశితదర్శనాన్ని పుష్కలంగా ఆవిష్కరించాయి.

"(ని) స్థానప్రతిష్ఠ" సప్తమ విభాగం.

ఆంధ్ర సాహిత్య రంగంలో ఆదిభట్ల వారి స్థానాన్ని, సప్రమాణంగా సంస్థాపించిన చిట్టచివరి విభాగమిది.

ఈ విధంగా శ్రీ లక్ష్మీనారాయణగారు మహావిద్వాంసులైన నారాయణదాసుగారి సమస్త సారస్వత సంపదను వివిధ విభాగాలుగా విభజించి, వివిధ కోణాలతో వీక్షించి, వివిధ భూమికలతో సమీక్షించి, శ్రీవారి "సంగీత సాహిత్య సార్వభౌమ త్వాన్ని" సమర్థించారు.

లక్ష్మీనారాయణగారి శైలి అరవిచ్చిన విరజాజుల పరిమళాన్ని మోసుకువచ్చే మలయమారుతం మాదిరిగా చల్లగా మెల్లగా సాగుతుంది.

సుండవరపు వారి వాక్యవిన్యాసాలు "బొండుమల్లె దండల" వలె పఠితల గుండె లకు మెత్త మెత్తగా హత్తుకుంటాయి. చిత్తగించండి ఈ క్రింది పంక్తులు-

దాసుగారు భారద్వాజగోత్రజులు. అందుకనే వారి కృతులు రసప్రియు లకు "భరద్వాజుని విందులు"

సూర్యోపాసకుని కుమారుడగుటచేకాబోలు దాసుగారి గాత్రము జనులకు "కర్ణపర్వ" మైనది.

వీరు అగర్భ భక్తులయిన అపరప్రహ్లాదులు. అందులకే కాబోలు వీరి గ్రంథ కథలు 'భాగవతములు'.

చీకటి యెరుగని సూర్యునివలె కపటమెరుగని హృదయముతో ప్రవర్తించుట సూరన్న (దాసుగారి) శైశవలక్షణము.

అకారణ వైరము, నిష్కారణ ప్రేమయు వీరికి వెన్నెముక ముదరక ముందే ముదిరిన గుణములు.

తొమ్మిదేండ్ల వయస్సులో సూరి శరీరమునకు మశూచికము 'అతిథి' యైనది. పదేండ్ల ప్రాయమునకు తాళపత్రములపై గంటముతో వ్రాయగల నైపుణ్యము "అభ్యాగత" మైనది.

విజయనగరము వచ్చువరకు సూరన్న కౌపీనవంతుడే. "కౌపీనవంతః ఖలు భాగ్యవంతః" అని కదా శంకరాచార్యసూక్తి.

ఆంగ్లభాషాగురుత్వ మెట్లున్నను దాసుగారికి చుట్టనేర్పిన గురు వితడే.

అప్పటి విజయనగరమున విలువ వలువ కప్పించుకొన్నవాడే విద్వాంసుడని నాటి విశ్వాసము.

అప్పటికే సూరన్నను పద్యరచనాశక్తి 'పాణిగ్రహణము' చేసినది. ఇక అనుకరణము, అభినయము నడకతో నడిచివచ్చిన నమ్మిన బంట్లు.

తః అవధానముతో ప్రతిభాకాంత దాసుగారికి 'సహధర్మచారిణి' గా నున్నను, వారి యశః కాంత దిక్కులు చూచుట మొదలుపెట్టినది.

సభలో పండితు లెక్కువగా కనిపించుటచే దాసుగారి పాండిత్యవీరము విజృంభించి పరవళ్లు త్రొక్కినది.

మద్రాసు పత్రికలు దాసుగారి ప్రతిభకు 'ప్రభకట్టినవి'.

బ్రహ్మ సృష్టిలో ముందు కాంతి దాని వెనుక శబ్దము పరువు లెత్తును. కవిబ్రహ్మ సృష్టిలో ముందు శబ్దము, తరువాత శబ్దము ననుసరించి కాంతి పరువు లెత్తును.

పతివ్రతకు గుణసౌందర్యముతోపాటు సౌందర్యగుణము కూడ నుండిన భర్త యెట్లు అధికతరముగా స్వాధీనుడగునో, అట్లే భాషకూడ లక్షణానుకూలతతోపాటు రసిక హృదయాకర్షణ లక్షణముకూడ కల్గినచో పాఠకులు కవికి పాత్రల వలె వశులగుదురు.

వాగ్గేయకారుని యందు సంగీతజ్ఞానముండుట దృష్ట విషయము. గాత్ర మాధుర్యముండుట 'అదృష్ట' విషయము.

కథకు అనవసరమైన పట్టులందు కవి కల్పించు పాత్రలు కవి వ్యక్తిత్వము నకు ఆయువు పట్టులు.

ఆయన అసాధారణ చమత్కారశక్తిని కొలవబూనుట మిన్నందినవాని పొడ వును కొలవ బూనుటే. కడలిరాయని యొడినుండి బయల్వెడలు అలలను గణింప బూనుటే.

'వేల్పుమాట' తేటతెనుగులోగల దాసుగారి వేదాంతసారసుధాట.

'మేలుబంతి' చాటుగ్రంథమేకాదు, చాటు గ్రంథములకు మేలుబంతి.

'భీష్మచరిత్ర' హరికథను నిర్వచనముగా వ్రాయుట దాసుగారి భీష్మప్రతిజ్ఞ.

కథాగానములు రెండును ఆలాపన ప్రధానములే. మానవునకు ఆనందభిక్ష పెట్టిన మొదటి జంటకవులు ఈ కథా గానములే.

ఈ విధంగా చెప్పుకుంటూపోతే గ్రంథమంతా ఉదాహరింపవలసి వస్తుంది. శ్రీ లక్ష్మీనారాయణగారు స్వీకరించిన స, రి, గ, మ, ప, ద, ని, అనే సప్తస్వర విభాగాలకూ ప్రారంభంలో దాసుగారి అప్రతిమాన ప్రతిభా సంపదకు అద్దం పట్టే

ఒక చక్కని పద్యాన్ని చిత్రీకరిస్తూవచ్చారు. పద్యంలో ప్రకరణాన్ని ప్రారంభిం చటం చాలా హృద్యంగా ఉంది.

అక్కడక్కడ దాసుగారి సిద్ధాంతాలను కొన్నింటిని రచయిత ఎత్తిచూపటం చాలా సముచితంగా ఉంది.

'రసము చెడనీక యమక పుష్టిగ చెప్పుట, సందర్భశుద్ధిగల పదప్రయోగము, స్వతంత్రముగ కథను కల్పించి యపూర్వమగు నూహలందెల్పుట, అతుకులుంచక పద్యములల్లుట, పండితపామరరంజకముగ మృదుమధురోచిత శబ్దంబులం బొందు పర్చుటయుం గవిత్వమున ముఖ్యాంశములు'.

'ఆస్తిక్యమును ధర్మాధర్మములను సర్వ జనమనోరంజకముగ నృత్యగీత వాద్యములతో నుపన్యసించుట హరికథ యనబడును. దైవభక్తియు, సత్యము, భూతదయయు హరికథ యందలి ముఖ్యాంశములు'.

'సాత్వికాహారనిరతః సర్వభూతదయాపరః
సంసార విముఖో యోగీ హరిదాస ఇతి స్మృతః'

'సంగీతము ముక్కుచెవులట్లు మేనితో పుట్టవలయును "ఈవు దంచుము-ప్రక్కలేనెగురవైతు" అనునట్లుండరాదు. పరిశ్రమ ప్రదర్శనముగా కాక ప్రకృతి సిద్ధముగా నుండవలెను."

ఇదేవిధంగా దాసుగారి జీవిత లక్ష్యాలనూ, సిద్ధాంతలనూ ఎన్నింటినో రచయిత వెల్లడించారు. బాల్యవివాహాలు, కన్యాశుల్కాలూ, జంతుబలులూ మొదలగు వాటిపై దాసుగారి అభిప్రాయాలను సోదాహరణంగా ప్రకటించారు.

దాసుగారి కవితా మాధుర్యాన్నీ సంగీతసౌభాగ్యాన్నీ సారస్వత సామ్రాజ్య వైభవాన్నీ శ్రీ లక్ష్మీనారాయణగారి పలుకులలో తిలకించండి.

"పిఠాపురంరాజా దాసుగారి గానమాధుర్యమునకు పరవశులై "దాసుగారూ! మీ సంగీతము లడ్డుమీద పన్నీరు చల్లినట్లున్న" దని ప్రశంసించిరి."

"రెంటాల సుబ్బారావుగారు దాసుగారి 'బాటసారి' కావ్యమును విని 'మంచి గంధపు చెక్క పై నునుపువలె" మీ తెనుగు మెత్తగనున్నదని శ్లాఘించిరి."

"విజయనగర సంస్థానం దివాన్జీగారు దాసుగారి పొట్ట నవరించుచు "ఇంత చిన్న బొజ్జలో ఇన్ని గొప్పకళలు ఎట్లు నిండియుండెనో" అని చమత్కరించిరి."

"మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు దాసుగారి 'టాటసారి' కావ్యమును 'క్షీరాన్నము' వలెనున్నదని పొగడిరి."

"విజయనగరాధీశ్వరులు ఆనందగజపతి నారాయణదాసుగారి సంగీతమువిని "నీ గాత్రము కోటపేట పట్టదు" అని కొనియాడిరి.

"విశ్వకవి రవీంద్రనాథుడు విజయనగరము వచ్చినపుడు దాసుగారిని గుర్తు పట్టి 'ఆనాడు మీరు పాడిన బేహాగ్‌రాగము ఇప్పటికిని నా చెవులలో మ్రోగుచునే యున్నదని ప్రశంసించెను."

"కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో దాసుగారి హరికథను విని సరోజినీదేవి వారి ప్రతిభను పరిపరి విధముల ప్రశంసించెను."

"డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు దాసుగారి బహుభాషాపేత్రుత్వమును బహుధా ప్రశంసించెను."

"నందిగ్రామములో దాసుగారి సరస్వతికి మహానందముతో బ్రహ్మరథము పట్టిరి."

"చల్లపల్లి జమిందారు రాజా అంకినీడు మల్లికార్జున ప్రసాదరావు బంగారు గండపెండెరమును దాసుగారి కాలికి స్వయముగా తొడిగి తమ రసికతను వెల్లడించు కొనెను."

"శివారాణి రుక్మిణీకల్యాణము దాసుగారిచే హరికథ చెప్పించుకొని అమందానందముతో నలుబది పెద్దకాసులు కానుకనిచ్చి తృప్తిచెందెను."

"బరంపురం పురప్రముఖులు ముప్పది తులముల బంగరు కడియము బహూకరించిరి."

"కాకినాడ పౌరులు దాసుగారి గానమునకు తన్మయులై ముత్యాలకర్ణ కుండలములిచ్చి పూజించిరి."

"చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు బందరు పట్టణములో విద్వత్సభాసమక్షమున 'హరికథాపితామహ" బిరుదము నిచ్చిరి.

"శ్రీ వీరేశలింగం పంతులుగారు ఆంధ్రసారస్వత పరిషత్పక్షమున నవరత్న ఖచిత భుజకీర్తిని దాసుగారికి సమర్పించిరి."

"విశాఖపట్టణములో జరిగిన ఒక మహాసభలో పెద్దలు దాసుగారికి 'శృంగార సర్వజ్ఞ' బిరుదము నిచ్చిరి."

"విజయనగరములో 'భారతీతీర్థ' సంస్థవారు 'ఆటపాటలమేటి' అను బిరుదమునిచ్చి గౌరవించిరి."

"బెంగుళూరుగాయక మహాసభలో 'లయబ్రహ్మ' అను బిరుదమిచ్చి గౌరవించిరి."

"విజయనగరములో ఐదుతాళములతో పల్లవిపాడి దాసుగారు దాక్షిణాత్య పండితుని ఓడించిరి. ఆనాటి మహాసభ దాసుగారికి 'పంచముఖీపరమేశ్వర' అను బిరుదమునిచ్చి గౌరవించెను."

"జయపురాధీశ్వరులు విక్రమదేవవర్మగారు దాసుగారిని "సంగీతసాహిత్య సార్వభౌమ" అను బిరుదముతో సత్కరించిరి."

"'నారాయణదాసు' అనగానే హరికథ యనియు, 'హరికథ' యనగానే నారాయణదాసనియు వెంటనే స్ఫురించు విషయమైనది."

ఈ విధంగా రచయిత దాసుగారి మహానుభావత్వాన్ని పెక్కువిధాల వక్కాణించి వారి వైదుష్యానికి కర్పూరనీరాజన మెత్తినారు.

"దాసుగారికి పూర్వము హరిదాసులు హరికథనాశ్రయించుకొని బ్రతికిరి. దాసుగారు చేపట్టిన తర్వాత హరికథయే దాసుగారిని ఆశ్రయించుకొని బ్రతికినది."

"హరికథాప్రక్రియకు పండితమండలిచేతకూడ ప్రణామములు చేయించిన ప్రజ్ఞా స్వరూపులు దాసుగారు."

"దాసుగారి హరికథ పామరులకే కాదు, పండితులకుగూడ ఆనందప్రదము. విజ్ఞానప్రదము. విద్యా శూన్యులనేకాదు, విద్యామాన్యులనుకూడ సద్యః వరవశులను జేయు పరుసవేది."

"దాసుగారి వేషము, భాష, వృత్తి, ప్రవృత్తి, అవి యివి అననేల, సర్వము భగవంతుని నమ్మిన భక్తుని లక్షణానుసారులే. దాసుగారు "పొట్టభక్తులు" గారు, "పుట్టుభక్తులు".

"ఈ సంగీత కళారహస్యనిధికి నామమాత్రముగానైనను గురువు అనుస్వారమే (శూన్యమే) యైనను, ఈ సంగీతకళ అనుస్వారము (స్వరమునననుసరించి వచ్చుట) అగుట దైవ కృప."

"నాట్యకళను కూడ ఏ గురువు చెంత చిరతల దెబ్బలు తిని నేర్చుకొనలేదు. దేవదత్తమువంటి గాత్రముతోపాటు ఈ నాట్యకళకూడ దైవదత్తమే"

"త్యాగరాజు సంగీతమును, పోతరాజు సాహిత్యమును భగవదన్వేషణ కరదీపికలు చేసికొనగా, ఈ హరిదాసరాజు సంగీత సాహిత్యముల రెండింటిని రెండు నేత్రములుగా జేసికొని భగవంతుని అన్వేషించిన మహాభక్త శిఖామణి."

శ్రీ లక్ష్మినారాయణగారు నారాయణదాసుగారి చమత్కారచారుత్వమును అనేక ఉదాహరణాలతో అత్యంతమనోహరంగా అభివర్ణించారు.

ఆనందగజపతిగారు దాసుగారికి బహుమానమిచ్చి "అసంతుష్టో ద్విజోనష్టః" అన్నప్పుడు దాసుగారు వెంటనే అందుకొని "సంతుష్టఇవ పార్థివః" అంటం వారి సద్యస్ఫూర్తికి నిదర్శనం.

చక్రభ్రమణకరత్వాత్ కుదృష్టిభిః దూరం వర్జ్యమానత్వాత్
శ్రుత్యంత ఖేలనత్వాత్ మశక! త్వామేవ మాధవం మన్యే.

అన్నమశక వర్ణనంలో మాటలగారడీ దాసుగారి శ్లేషాలంకార ప్రీతికి చమత్కార రీతికి మచ్చుతునక.

జలమహాత్మ్యానికీ స్థలమహాత్మ్యానికీ ఒకటి రెండు అక్షరాలు ముందుచేర్చి చెప్పిన పద్యం దాసుగారి కొంటెతనానికి ప్రతీక.

సూర్యనారాయణ శతకంలో నుంచి ఉదాహరించిన పద్యాలన్నీ రత్నమాణిక్యాలు. దాసుగారి శయ్యాసంపదకు వెయ్యార్లు చేసే రసగుళికలు.

దాసుగారి వర్ణనావైభవం భాషాప్రాభవం సాటిలేనివి. సహృదయసమ్మాన్యాలూ అనన్య సామాన్యాలూ. దాసుగారి అచ్చతెనుగుముచ్చట హద్దులు దాటినా అది అనితరసాధ్యం.

తమ పరిశోధన గ్రంథాన్ని ఇంత సమగ్రంగా, ఇంత సమర్థంగా, ఇంత సర్వాంగ సుందరంగా సిద్ధం చేసిన శ్రీ లక్ష్మీనారాయణగారు సంకల్పసిద్ధులు.

వాల్మీకుల వారికి గోవిందరాజులు వలెనూ
వ్యాసులవారికి శ్రీధరాచార్యులవలెనూ
కాళిదాసుకు మల్లినాథసూరి వలెనూ
నారాయణదాసుకు లక్ష్మీనారాయణ లభించటం
సాహితీరసజ్ఞులు సంతోషింపదగిన విషయం.

శుభం భూయాత్

తిరుపతి
24-6-83

జంధ్యాల పాపయ్యశాస్త్రి
"కరుణశ్రీ"

# విషయ వేదిక

అచ్ ఇ య త్తు

హల్ స రి గ మ లు

## మ  హరికథేతర గ్రంథములు.  180-350



## ప  సాహితీ కోణములు.  351-486

ప్లుతము - సంబంధ సమాచారము

త. దాసుగారి జాతకము
కి. చెళ్లపిళ్ల - ఆదిభట్ల
ట. పద్యావృత్తులు
ఘి. దస్తూరి
ఖి. పంచముఖీ ప్రదర్శని
తో౦. దాసుగారి గ్రంథములు



# యియక్ష

1974 లో ఆచార్య యస్. వి. జోగారావుగారు శ్రీ కట్టా రఘుశ్వరరావుగారి (దాసుగారి దౌహిత్రీభర్త) ప్రోత్సాహమున దాసుగారినిగూర్చి ఒక బృహద్గ్రంథ మును (ఆదిభట్టనారాయణదాస సారస్వత నీరాజనము) వెలయింపదలచి, దేశములో గల ప్రముఖ పండితులకు వారివారి అభిరుచులను బట్టి, కర్మక్షేత్రములను బట్టి వ్రాయుటకు విషయముల నిచ్చుట జరిగినది. ఆ ప్రణాళికలో 'అపూర్వసాహిత్య స్రష్ట – ఆదిభట్ట', సంగీతము–దాసహృదయము' అను రెండంశములను గూర్చి నన్నుగూడ వ్రాయుమనిరి. ఈ కారణముగా దాసుగారి సకల లభ్యకృతులను పైపైని తిరుగవేయు యోగము పట్టినది. అప్పటివరకు దాసుగారిని గూర్చి నేను విన్నది, అనుకొనుచున్నది సామాన్యహరిదాసు అని మాత్రమే. ఆ విహంగమ విలోకనముననే కలిగిన భావము 'ఈయన ఇంతటి ప్రతిభా వంతుడా?' అని. నా శక్తి పరిధిలో ఆ రెండు వ్యాసములను కూర్చి యిచ్చుచు, శ్రీ జోగారావుగారితో "మాష్టారూ! 1965 లో ఎమ్. ఎ. అయిన దగ్గరనుంచి రీసర్చి చేద్దామనుకుంటూనే వున్నాను గాని ప్రతిటాపిక్ పాతవాసనలతో సోఽయందేవదత్తః గా అనిపించి టాపిక్ నిర్ణయించుకోలేకపోయాను. నా కిప్పుడు దాసుగారిపై చెయ్యాలని వుంది" అని యన, వారు కొన్నిరోజులు ఆలోచించి "మీకేదైనా లక్షణశాస్త్ర విషయం యిద్దామనుకున్నా, సరే" అని అనుమతించిరి. ఇది నేను దాసదాసుడనైన విధము.

నేను స్వస్తిశ్రీయని ప్రారంభింపగనే నేను గురియైన విమర్శలు రెండు. దాసుగారితో ప్రత్యక్ష పరిచయభాగ్యమున్నవారు 'దాసుపై వ్రాసేది నువ్వా?' అన్న చిన్నచూపు. నా సాహిత్యపరిశ్రమపై కొంచెము సదభిప్రాయమున్నవారు, దాసు గారిని గూర్చి యెరుగనివారు, 'ఏదైనా మంచి టాపిక్ తీసుకోక ఈ నారాయణదాసు నీకెక్కడ దొరికాడు?" అని నన్ను నిరుత్సాహ పరచు విమర్శ. ఈ విమర్శలు వారివారి దృష్టులను బట్టి సూటిమాటలు కావచ్చునేమోకాని, నాకు మాత్రము సూటి పోటులైనవి. కాని నాకుదాసుగారి గ్రంథ దర్పణముల దర్శన మధికమగుచున్న కొలది దాస ప్రతిభారూపము త్రివిక్రమాకారముదాల్చుచు, నన్ను ఆకర్షించుచు, ఆ

రెండు రకాల విపర్యాలు వామనాకారములైనవి. అల్పజ్ఞుడ నన్నది అధికారసూత్రమే యైనను, అప్పటికే పదునైదు వసంతాలనుండి నాతో వసంతమాడుచున్న వ్యాస రచనా వ్యాసంగ వాసవసజ్జిక అభయ మీయగా యథాశక్తి సామగ్రీ సమీకరణమునకు నడుముకట్టితిని. ఇది కృత్యాద్యవస్థ.

ఈ పరిశోధన నిబంధరచనకు తోడుపడినవి దాసభారతీ ప్రచురణములు. ప్రాణములు తోడినవి అచ్చుతప్పుల కుప్పలైన దాసుగారి ముద్రిత గ్రంథములు. ముద్రితములైన లభ్యగ్రంథముల పరిస్థితియే యిట్లుండగా, ఇక అలభ్యగ్రంథ గవేషణము ఒక విశ్వవిద్యాగమైనది. ఈ గ్రంథాటనమున దాససామ్రాజ్యమునకు రాజధాని యైన విజయ నగరము కన్న సమాచారమిచ్చుటలో విజయవాడయే మిన్న అన్నది నా పరిశోధన సాధ్వికి చిరాయువైన తొలిచూలు. ఇక లభ్యములై ముద్రితములైన గ్రంథములుకూడ నిప్పటికే అసూర్యంపశ్య లగుచున్నవి. అందులకే కావలెనని దాసుగారి గ్రంథకోశాగారమందలి పద్యప్రవాళములను, సూక్తిశుక్తిజములను సాధ్యమైనంతవరకు సమయోచితముగా సంగ్రహించి, ఈ ప్రబంధమున బంధించి భద్రపరిచితిని. నా సాహితీ తీర్థయాత్రా ఫలములైన దాసుగారి 'దస్తూరి'తో లభించిన అంశములతోగూడ వదలక 'యనుబంధ' సంబంధము కల్పించు కొన్నదిందులకే. ఇది సేకరణసేవ.

విషయ స్పష్టత లాభముకొరకు విసంధిని చేరదీసితిని. అర్ధానుస్వార శకట రేఫములు విషయస్పష్టతకు విరోధులు కాకున్నను, విసంధి రచనతో సంధి సడలునని వదలి వైచితిని. ఇది భాషాయోషావేషము.

ఈ నా పరిశోధన యజ్ఞమునకు అనుమతించుటయేకాక, 'దక్షిణ' అవకాశమును 'యు. జి. సి' కల్పింపగా, ఉత్తర దక్షిణలు (సెలవు, జీతము) ఇచ్చి నన్ను సంభావించిన జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాల పాలక వర్గమునకు, ఈ పరిశోధన ప్రబంధమును సమర్పించుకొనుటకు అవకాశమిచ్చిన ఆంధ్ర విశ్వవిద్యాలయాధినేతలకు, నేను వ్రాసిన ప్రత్యంశమును ఆదిమాంతము పట్టిచూచి విలువైన సూచనలిచ్చిన గురువర్యులు, నా పరిశోధనకు పర్యవేక్షకులునైన ఆచార్య యస్. వి జోగారావుగారికి, లభింపని అముద్రిత సమాచారమును అందజేసిన దాస భారతీ ప్రచార ప్రియులైన శ్రీ కట్టా ఈశ్వరరావుగారికి, ఇక అడుగడుగున నన్ను పీడించిన

శంకాశల్యములను పీకివైచిన ఎందరో మహానుభావులకు – నా మనః పూర్వక నమః కారములు.

ఒక్క టిక్కమొగముతో నా ప్రక్క మూతి బిగించుకొని మూలుగుచున్న ఈః గ్రంథ సుభాషిణికి సహస్రాధిక వాక్ప్రసారావకాశ వరమును పంచ సహస్ర రూప్య ప్రసాదముతో అనుగ్రహించిన తిరుమల తిరుపతి దేవస్థానాధిపతులకు, నామ కరణముచేసి అక్షరాక్షతలు చల్లి ఆశీర్వదించిన గురుకల్పులు కవిత్రమ కవితా శిల్పులు కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారికి కృతజ్ఞతాలంకృతానేకాంజలులు.

ఈః 'యియక్ష' కు గుణముల యెడల శతముఖులైన వారలు శతమఖులు.



# సరిగమలు

సమము గగన సుమముని పం
డెమూని దినదిన మనంగ నిస్నన్ నీ గా
నము నీ నాదము నీ రూ
పమును గనిన జనమిఁగ సరిపన్నఁగఁ దగునే?

రిపు సారస మద నాగము
నృప మందిర సార సరము-ప్రేమాసన స
స్న పరముని - గురుపరంపర
నెపముగ నొందిన గురు సరి నింపఁగఁ దరమే!

గగనము మార్మ్రోఁగఁగ నీ
దగు గానపు సద్దును నెదిరదిరి, సదము మూ
గగు గగురుపారి ముదమున,
సిగ సొగసుం గందదేరు సేమ మొసగిరో?

మది సరసరాగ సదనము
పద సంపద రసన - సూరి పామర మోద
మ్మది నీ నామ మపర నా
రదమూనీ! సూరదాస! రంగానందా!

చతురవచో విలాస విలసత్కృ-ఘనమ్ముల - రాగ తాళ రం
జిత శుభ భావ కీర్తనల - చిత్త వశీకరణైక బుద్ధ్యలం
కృతుల-మహాస్మృహా స్తుతి నిరీక్షణ చేష్టల-నీ సుగాత్ర సం
గతుల గతిన్ సృజించిన సుగాత్రి నిబంధమదయ్యె నేఁడిటుల్

శ్రీ యఖిలేశ్వరీ కరుణచే బహుళప్రతిభా ప్రభావ నా
గేయమ్ములైన నీ కృతుల కీర్తనఁ జేసితి నిట్లు, లక్ష్మినా
రాయణుఁడన్ గళాధన ప్రియాత్ముఁడ, నైకకళాకళత్ర! నా
రాయణ దాస! ఈకృతి త్వదాకృతికిన్ గరదీపికయ్యెడున్

నాదము నందు స్వరాదులున్న విధాన
పద్యాన గణములు పరగు పగిది
వర్ణాల భావ సర్వస్వ మొదిగినట్లు
సత్కవిత్వమున రసమ్ము భాతి
సౌఖ్యము నందు కష్టమ్ము డాగినరీతి
జీవులన్ ప్రాణాలు చెలగు కరణి
బుద్ధిలోఁ గర్మంబు మునిగి యుండిన పోల్కి
కాంతిని కిరణ సంఘంబు భంగి

నరనరమ్ము నందంతరాంతరములందు
నక్కి నాలోనఁ బైకిఁ గన్పడక యుండి
సరిగమల్ పలికెడి జగజ్జనని శక్తి
సకల శుభము లీ కృతికి నొసంగుగాక.

రెండు రకాల విమర్శలు వామనాకారములైనవి. అల్పజ్ఞుడ నన్నది అధికారసూత్రమే యైనను, అప్పటికే పదునైదు వసంతాలనుండి నాతో వసంతమాడుచున్న వ్యాస రచనా వ్యాసంగ వాసవసజ్జిత అభయ మీయగా యథాశక్తి సామగ్రీ సమీకరణమునకు నడుముకట్టితిని. ఇది కృత్యాద్యవస్థ.

ఈ పరిశోధన నిబంధరచనకు తోడ్పడినవి దాసభారతి ప్రచురణములు. ప్రాణములు తోడినవి అచ్చుతప్పుల కుప్పలైన దాసుగారి ముద్రిత గ్రంథములు. ముద్రితములైన లభ్యగ్రంథముల పరిస్థితియే యిట్లుండగా, ఇక అలభ్యగ్రంథ గవేషణము ఒక విశ్వజిద్యాగమైనది. ఈ గ్రంథాటనమున దాససామ్రాజ్యమునకు రాజధాని యైన విజయ నగరము కన్న సమాచారమిచ్చుటలో విజయవాడయే మిన్న అన్నది నా పరిశోధన సాధ్వికి చిరాయువైన తొలిచూలు. ఇక లభ్యములై ముద్రితములైన గ్రంథములుకూడ నిప్పటికే అసూర్యంపశ్య లగుచున్నవి. అందులకే కావలెనని దాసుగారి గ్రంథకోశాగారమందలి పద్యప్రవాళములను, సూక్తిశుక్తిజము లను సాధ్యమైనంతవరకు సమయోచితముగా సంగ్రహించి, ఈ ప్రబంధమున బంధించి భద్రపరిచితిని. నా సాహితీ తీర్థయాత్రా ఫలములైన దాసుగారి 'దస్తూరి'తో లభించిన అంశములతోగూడ వదలక 'యనుబంధ' సంబంధము కల్పించు కొన్న దిందులకే. ఇది సేకరణసేవ.

విషయ స్పష్టత లాభముకొరకు విసంధిని చేరదీసితిని. అర్ధానుస్వార శకట రేఫములు విషయస్పష్టతకు విరోధులు కాకున్నను, విసంధి రచనతో సంధి సడలునని వదలి పైచితిని. ఇది భాషాయోషావేషము.

ఈ నా పరిశోధన యజ్ఞమునకు అనుమతించుటయేకాక, 'దక్షిణ' అవకాశ మును 'యు. జి. సి' కల్పింపగా, ఉత్తర దక్షిణలు (సెలవు, జీతము) ఇచ్చి నన్ను సంభావించిన జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి కళాశాల పాలక వర్గమునకు, ఈ పరిశోధన ప్రబంధమును సమర్పించుకొనుటకు అవకాశమిచ్చిన ఆంధ్ర విశ్వవిద్యా లయాధినేతలకు, నేను వ్రాసిన ప్రత్యంశమును ఆదిమాంతము పట్టిచూచి విలువైన సూచనలిచ్చిన గురువర్యులు, నా పరిశోధనకు పర్యవేక్షకులునైన ఆచార్య యస్. వి జోగారావుగారికి, లభింపని అముద్రిత సమాచారమును అందజేసిన దాస భారతీ ప్రచార ప్రియులైన శ్రీ కట్టా ఈశ్వరరావుగారికి, ఇక అడుగడుగున నన్ను పీడించిన

శంకాశల్యములను పీకివైచిన ఎందరో మహానుభావులకు – నా మనః పూర్వక నమః కారములు.

ఒక్క దిక్కు మొగముతో నా ప్రక్క మూతి బిగించుకొని మూలుగుచున్న ఈ గ్రంథ సుభాషిణికి సహస్రాధిక వాక్ప్రసారావకాశ వరమును పంచ సహస్ర రూప్య ప్రసాదముతో అనుగ్రహించిన తిరుమల తిరుపతి దేవస్థానాధిపతులకు, నామ కరణముచేసి అక్షరాక్షతలు చల్లి ఆశీర్వదించిన గురుకల్పులు కమ్ర కవితా శిల్పులు కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారికి కృతజ్ఞతాలంకృతానేకాంజలులు.

ఈ 'యియక్ష' కు గుణముల యెడల శతముఖులైన వారలు శతముఖులు.



# సరిగమలు

సమము గగన సుమమని పం
దెమూని దినదిన మనంగ నిన్నున్ నీ గా
నము నీ నాదము నీ రూ
పమును గనిన జనమిఁగ సరిపన్నఁగఁ దగునే ?

రిపు సారస మద నాగము
సృప మందిర సార సరము-ప్రేమాసన స
స్న పరముని - గురుపరంపర
నెపముగ నొందిన గురు సరి నింపఁగఁ దరమే !

గగనము మార్మ్రోఁగఁగ నీ
దగు గానపు సద్దును నెదిరదిరి, సదము మూ
గగు గగురుపారి ముదమున,
సిగ సొగసుం గందదేరు సేమ మొసగిరో ?

మది సరససరాగ సదనము
పద సంపద రసన - సూరి పామర మోద
మ్మది నీ నామ మపర నా
రదమానీ! సూరదాస! రంగానందా!

చతురవచో విలాస విలసత్కథనమ్ముల - రాగ తాళ రం
జిత శుభ భావ కీర్తనల - చిత్త వశీకరణైక బుద్ధ్యలం
కృతుల-మహాన్మహా స్తుతి నిరీక్షణ చేష్టల-నీ సుగాత్ర సం
గతుల గతిన్ సృజించిన సుగాత్రి నిబంధమదయ్యె నేఁడిటుల్

శ్రీ యఖిలేశ్వరి కరుణచే బహుళప్రతిభా ప్రభావ వా
గ్గేయములైన నీ కృతుల కీర్తనఁ జేసితి నిట్లు, లక్ష్మినా
రాయణుఁడన్ గళాధన ప్రియాత్ముఁడ, నైకకళాకళత్ర! నా
రాయణ దాస! ఈకృతి త్వదాకృతికిన్ గరదీపికయ్యెడున్

నాదము నందు స్వరాదులున్న విధాన
    పద్యాన గణములు పరగు పగిది
వర్ణాల భావ సర్వస్వ మొదిగినట్లు
    సత్కవిత్వమున రసమ్ము భాతి
సౌఖ్యము నందు కష్టమ్ము డాగినరీతి
    జీవులన్ ప్రాణాలు చెలగు కరణి
బుద్ధిలోఁ గర్మంబు మునిగి యుండిన పోల్కి
    కాంతిని కిరణ సంఘంబు భంగి

నరనరమ్మునందంతరాంతరములందు
నక్కి నాలోనఁ బైకిఁ గన్పడక యుండి
సరిగమల్ పలికెడి జగజ్జనని శక్తి
సకల శుభములీ కృతికి నొసంగుగాక.

# స. జీవిత రేఖలు

ఈ యఖిలమ్ము నంపూఁ బరమేశ్వరుఁ డెట్టులు నింపియుంచెనో
యా యఖిలమ్ము నచ్చి తన యందున నుంచెను నాదిభట్ల నా
రాయణదాసులో హరికథాకృతి భారతి సర్వ శిల్ప వి
ద్యాయుతి సంస్కృతాంధ్రముల యాకృతియు పెఱమూర్తులై నటిన్.[1]

శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు హరికథా పితామహులు. ఆట పాట మాట మీటలు ఏకగ్రీవముగా నెన్నుకొన్న చతురాస్యులు. హరికథలను తెలుగుదేశములోని ప్రతి వీథికి పరిచయము చేసిన కళాకళత్రులు. హరికథల మిషతో రాజాస్థానములను శారదాపీఠములుగా మలచిన సరస్వతీ పురోహితులు. లయ యను సహజ కవచముతో, పరిశీలన ప్రదర్శనములను సహజ కుండలములతో నుదయించిన అపర కర్ణులు. అందులకే వీరి కృతులు భారతమునకు కర్ణపర్వములు. వీరు ఆగర్భ భక్తులైన అపర ప్రహ్లాదులు. అందులకే వీరి గ్రంథకథలు భాగవతములు. వీరి జీవితకథలు భాగవతులకు పరమ ప్రహ్లాద చరిత్రములు.

1. కళాప్రపూర్ణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ - ఆదిభట్ల నారాయణదాస సారస్వత నీరాజనము-పుట-2

గృహనామము

నారాయణదాసుగారు వారి గృహ నామమగు 'ఆదిభట్ల' కు ముందు 'అజ్జాడ' అని కలుపుట మనకు వారి నామములో కన్పడు ఒక విలక్షణ విషయము. దానికొక కారణమున్నది. శ్రీకాకుళమండల మందలి బొబ్బిలి తాలూకాలోగల అజ్జాడ గ్రామము వారి అభిజనము. 'ఆదిభట్ల' ఇంటిపేరుగల ద్రావిడ శాఖీయులైన వైదిక బ్రాహ్మణులు, ఈ అజ్జాడ గ్రామమునందేకాక పలుతావులందున్నారు. కాని అజ్జాడలోగల ఆదిభట్ల వారిదొక విశిష్ట స్థానము. పైగా 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అనికదా పెద్దల సుద్ది. అంతేకాక సువర్ణముఖీ జీవద్వాహినీ తీరస్థమైన ఆ అజ్జాడ గ్రామప్రకృతి రామణీయకము దాసుగారిని ఆజన్మాంతము మరువలేనట్లుగా ప్రభావితము చేసినది. ఆ విశిష్టత, ఆ జన్మస్థలానుబంధము, ఆ గ్రామప్రకృతి రామణీయాకర్షణము దాసుగారు 'ఆదిభట్ల' కు ముందు 'అజ్జాడ' అని కలుపుకొనుటకు ప్రేరేపించిన కారణత్రయము.

ఇక 'ఆదిభట్ల' యను ఉపనామ మేర్పడుటకు కూడ నొక కారణ మున్నది.[2] రెండు వందల యేబది యేండ్ల పూర్వము జయపురాధీశుడైన కృష్ణచంద్ర దేవుని ఆహ్వానమును పురస్కరించుకొని 'పేరూరు' అను గ్రామమునుండి ఆదిభట్టు అను పేరు గల ఒక అఖిల వేదశాస్త్ర నిపుణుడు అజ్జాడ గ్రామమునకు వచ్చి స్థిరపడెను. ఆతడెంత శాస్త్రనిష్ణాతుడో అంత తపశ్శాలి. గురుతుల్యుడగు ఈ ఆదిభట్టు గురువు అగుటచే కృష్ణచంద్రదేవ రాజేంద్రుని రాజ్యము సురక్షితముగ నున్నది. కాని ప్రజాపతియైన ఈ కృష్ణచంద్రునకు ఎంతకాలమునకు సంతానము కలుగలేదు. తాను అనపత్యుడనను బాధ ఎక్కువై, కృష్ణచంద్రు డొకనాడు తన సంతాన వాంఛను గురువైన ఆదిభట్టునకు విన్నవించుకొని 'యేదైన శాస్త్ర మార్గమున్నదేమో యోజింపుడు' అని అర్థించెను. దానికి ఆదిభట్టు "తపము కావించి యొక్క వత్సరము లోన పుత్రు నీ కలరింతు గాయత్రి సాక్షి" అని ప్రతిన చేసి తపస్సు ప్రారంభించెను. ఆదిభట్టు తపఃఫలితముగ ప్రభువునకు పుత్త్రి సంతాన భాగ్యము కలిగెను. ఆదిభట్టు తపశ్శక్తికి ప్రభువు ఆశ్చర్యమంది ఆనందముతో అర్ధరాజ్యమిచ్చెను. ఆదిభట్టు కుమారుడైన హయగ్రీవుడు కూడ కొంతకాలము పాలించి సద్బ్రాహ్మణులకు రాజ్య రక్షణ బాధ్యత అనవసరమైన శ్రమయని తలచి, ఆ రాజ్యమును కృష్ణచంద్రదేవుని

---

2. జగజ్జ్యోతి-ప్రథమ సంపుటము-వంశావళి.

కుమారుడైన రామచంద్ర దేవునకు మరల తిరిగి యిచ్చెను. ఇట్లు సంసార వృక్షమును పండింపగల, రాజ్యమును గడింపగల తపశ్శక్తికి ఆటపట్టు ఆదిభట్టు. వంశములో పూర్వతరములందు ప్రసిద్ధికెక్కిన మహాపండితుల పేర గృహనామము లేర్పడుట పరిపాటియే కదా. భాస్కరుని, శ్రీనాథుని, పోతరాజు, మదునాపంతుల, అనంతపంతుల ఇంటిపేరు లిట్టివే కదా. అట్లే ఆదిభట్టు వంశీయుల ఇంటి పేరు 'ఆదిభట్ల' యైనది.[3]

దాసుగారు భారద్వాజ గోత్రజులు, అందుకే వారికృతులు రసప్రియులకు భరద్వాజుని విందులు.

పుట్టుపు-పూర్వోత్తరములు

నారాయణదాసుగారి తండ్రి వేంకటచయనులు. అజానుబాహుడు. 'కుండల మండిత గండ వికాసుడు, పండిత మండల మోదనివాసుడు'. అప్రతిగ్రహీత. మహా పౌరాణికుడు, సంస్కృతమున ధనంజయ విజయమను ప్రబంధమును వ్రాసిన కవి, వ్యాఖ్యాత, సత్యాయుడుడు, భాస్కర భక్తుడు. ఒకసారి 'ఏహ్యేహి గంగే ఁవ దర్శనం హతాత్' అను మకుట శ్లోకాష్టకస్తుతిచే గంగాభవాని అనుగ్రహమును బొంది నీరు పడని నూతిని నుదకల పూరితముగా జేసిన మహా భక్తుడు. దాసుగారి తల్లి సరసమ్మ, బహుపురాణజ్ఞ, పురాణాల సరసమ్మ అనియు, చదువులవ్వ అనియు అచ్చట ప్రాంతమున ప్రఖ్యాతి గాంచిన విద్యావతి.

ఆ దంపతులకు సంతానము తొమ్మిదిమంది. ఐదుగురు పుత్రులు, నలుగురు పుత్రికలు, మొదటి కుమారుడు క్రమాంత స్వాధ్యాయవేత్తయు మహాబలాఢ్యుడు నైన జగ్గావధాని.[4] రెండవకుమారుడు న్యాయవాదియు పరతంత్ర వేత్తయు నైన సీతారామయ్య. మూడవకుమారుడు నాటకాలంకార రహస్యజ్ఞుడు, గోత్రపావనుడు నైన అగ్నిహోత్రావధాని, నాలుగవ కుమారుడు దాసుగారితో కలసి పాడి అందరి మన్ననల నందుకొన్న పేరన్న. ఐదవకుమారుడు సూర్యనారాయణ. ఆ సూర్య

3. దాసుగారు వారి గృహనామము 'ఆదిభట్టు' అనియు, 'ఆదిభట్ల' అనియు వ్రాయుదురు.

4. జగ్గావధాని బల విశేషములు 'నాయెఱుక' సమీక్షలో గలవు.

నారాయణయే నారాయణదాసు. దాసుగారు నరసాంబా వేంకటచైనుల పుత్త్రి సంతానములో కడపటి వాడైనను సంతాన క్రమమునందు ఎనిమిదవవాడు[5].

నారాయణదాసుగారికి తల్లిదండ్రులు సూర్యనారాయణ అను పేరు పెట్టుట కొక బలమైన కారణమున్నది. దాసుగారు జన్మించుటకు కించిత్పూర్వము వారి తండ్రియైన చైనులుగారు క్షయ వ్యాధి పీడితులైరి. అప్పుడు మహాభక్తులైన వేంకట చయనులుగారు సూర్యోపాసనచే ఆ వ్యాధిని నిర్మూలము చేసికొనిరి. ఆ కారణముచే వెంటనే పుట్టిన బిడ్డకు సూర్యనారయణ అని నామకరణము చేసిరి. కాని ఇంట బయట వారిని పిలిచెడి ముద్దుపేరులు సూరన్న, చిన్నసూరి. లోకము దాసుగారి సూర్యనారాయణ అను నామము నుండి నారాయణ అనునది మాత్రమే గ్రహించి దానికి దాసును జేర్చి, నారాయణదాసుగా చేసినది.

పేరు పెరిగినకొలది పేరు తరుగుట పెద్దల యందు కనబడు వింత విషయము. సూర్యోపాసకుని కుమారుడగుటచే కాబోలు దాసుగారి గాత్రము జనులకు కర్ణపర్వమైనది.

దాసుగారు రక్తాక్షి సంవత్సర శ్రావణ కృష్ణ చతుర్దశీ బుధవాసరమున మఘా నక్షత్ర చతుర్థ చరణమునందు వృషభ లగ్నమున శ్రీకాకుళమండలమునగల సువర్ణముఖీనదీ ప్రాంతమైన అజ్జాడ గ్రామమునందు జన్మించిరి. క్రైస్తవుల లెక్క ప్రకారము 31-8-1864[6]

## విద్యావ్యాసంగము

దాసుగారి విద్యాశక్తులు ప్రధానముగా భగవద్దత్తములు. గురుశుశ్రూషాలబ్ధములు కావు. పరమేశ్వరుడే వీరికి పరమ గురువు. ప్రకృతి పరిశీలనమే వారి ప్రధానమైన సాధన. ప్రపంచమే వారి ప్రామాణిక పఠన గ్రంథము. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు, ఒక సందర్భములో 'దాసుగారు పాణినీయంలో గూడా తగు మాత్రం ప్రవేశం సంపాదించారన్నది సత్యదూరం కాదు. అయితే అందులో యెవరి శిష్యులు అంటే,

5. వేంకట చైనులుగారి సంతానక్రమము. 1. ఆదిలక్ష్మమ్మ 2. జగ్గావధాని 3. సీతారామయ్య 4. పార్వతమ్మ 5. అగ్నిహోత్రావధాని 6. కామమ్మ 7. పేరన్న 8. సూరన్న 9. సుందరమ్మ.

6. బందరు ఉప్పెన వచ్చినది ఈ రక్తాక్షి సంవత్సరమునందే.

అందులోనేకాదు, ఎందులోను కూడా యెవరి శిష్యులుకాదు' అని పత్రికా ముఖమున పలికిన పలుకులు ప్రత్యక్షర సత్యములు [7]

లాంఛన ప్రాయముగా అజ్జాడలో నున్న వీధుల పాఠశాలకు పోవు చున్నను సూరన్నకు అక్షర జ్ఞాన భిక్ష పెట్టినది తనూ భిక్ష పెట్టిన తల్లిదండ్రులే. నాలుగేండ్ల ప్రాయము నందే చిన్న సూరికి భాగవత మందలి పద్యములు శ్రవణా నందముగా చదువుట, పదులకొలది పద్యములు కంఠస్థములగుట పూర్వజన్మ సంస్కార వశమున భవిష్యదుజ్జ్వల జీవితమునకు సూచనయో అన్నట్లు అబ్బినది. చదువులవ్వ నిరంతర సాన్నిధ్యము ఈ ప్రతిభకు ప్రధాన లౌకిక కారణము. గడ గడ సంస్కృతాంధ్రభాషలను చదువుట అబ్బినను అప్పటికింకను సూరన్నకు లిపిని కలిపి వ్రాయుట చేతికి అలవాటుకాలేదు.[8]

మొదటి బహుమతి

ఐదవయేట చిన్నసూరికి ఉపనయనము జరిగినది. ఈ వయస్సునందే చిన్నసూరి ప్రతిభ ప్రథమ పారితోషికమందుకున్నది.

పార్వతీపుర ప్రాంతమునందు గుంప అనునొక క్షేత్రమున్నది. నాగావళీ జంఝావతీ నదులనడుమనున్న దీవి ఈ గుంపక్షేత్రము. అక్కడ మహాశివరాత్రి నాడు ప్రతి సంవత్సరము ఉత్సవము జరుగుచుండును. చిన్నసూరిని చంకనెత్తుకొని చదువలవ్వకూడ శివరాత్రి పర్వదినమున ఆ క్షేత్రస్వామిని సేవించుటకు వెళ్లెను. శివుని సేవించి ఆ రాత్రి జాగరణముచేసి మరునాడు ఉదయము బయలుదేరి కొండల నడుమ నడచి పార్వతీపురము చేరిరి. పార్వతీపురమునందు రామానుజుల రంగయ్య యనునొక పుస్తకవిక్రేత దగ్గరకు వెళ్లి, చదువలవ్వ 'భాగవత మున్నదా?' అని ప్రశ్నించెను. ఆ ప్రశ్నకు సాతాని రంగయ్య ఆశ్చర్యముతో 'ఆడుదానవు

7. కథలు—గాథలు—ద్వి. భా. పుట-664

8. దాసుగారు వారి అక్షరాభ్యాస విషయమును గూర్చి వారి అక్కమనుమ డగు శంభర సూర్యనారాయణ శాస్త్రిగారితో 'ఒరే! తాత! మూడు మనువులు వెళ్ళి నాల్గవ మనువుకు సిద్ధముగా నున్న ఆడుదానికి పెండ్లి చేయునట్లు నా కక్షరాభ్యాసము చేసినారురా' అని అనిరట.
నారాయణదాస శత జయంత్యుత్సవ సంచిక పుట-48

నీకెందుకమ్మా భాగవతము? చదువురాదు గదా' అని యన, నరసమ్మగారు అభిమానముతో చంకనున్న చిన్నసూరిని చూపించి 'ఈ పిల్లవాడు చదువును నేనర్థము చెప్పెదను' అని అనెను. అట్లుచేసిన పుస్తకము నూరకయే ఇచ్చెదను అని రంగయ్య పలికి తెల్లనిగుడ్డ యట్టతో గూడిన భాగవత గ్రంథమును సూరన్న చేతిలో పెట్టెను. చిన్నసూరి వెంటనే గ్రంథమును తెరచి దశమస్కంధమునందలి వర్షర్తు వర్ణనమున గల వచనమును శరవేగముతో అప్పటికే అక్కడ చేరిన జనసమూహమునకు ఆశ్చర్యము కలుగునట్లుగా చదివెను. సూరన్న చదివినవెంటనే చదువులవ్వ మంచినీళ్ళ ప్రాయముగ వ్యాఖ్యానించెను. ఆ విచిత్రదృశ్యమునకు వీథి యంతయు సదస్సుగా మారినది. రంగయ్య సంతోషముతో ఆ భాగవతగ్రంథమునకు తోలు అట్ట వేయించి వారికి బహుమానముగా నిచ్చెను. దాసుగారి జీవితమునందు ఈ భాగవతగ్రంథము ప్రథమ ప్రజ్ఞా పరిపణము. దానిని దాసుగారు తుదివరకు బహు భద్రముగ పదిల పరచుకొనిరి.

దాసుగారి తండ్రి సంస్కృత విద్వాంసులు. కనుక తండ్రికడనే ఈ యైదేండ్ల యీడునందే దాసుగారు రఘువంశమును చదువుకొనిరి. అప్పుడు గంటి నీలకంఠావధాని, న్యాయతీర్థ అదిభట్ట రామమూర్తిశాస్త్రిగారు వీరి సహాశ్రోతలు. తెలుగుపాఠము చెప్పుట వేంకట చయనులుగారికి అలవాటు లేదు. ఆ కారణముచే దాసుగారు వేంకట చయనులుగారి శిష్యులైన తాతన్నగారి చెంత దాశరథీ శతకము, భూషణ వికాస శతకము, రుక్మిణీ కల్యాణము నేర్చుకొనిరి.

ఎనిమిదేండ్ల యీడునందు ఒకసారి నీటి గండమునుండి జ్యేష్ఠ సోదరుడైన జగ్గావధాని రక్షించుట జరిగినది. సూరన్న అల్లరికి విసుగెత్తి సూరన్నను వేంకట చయనులుగారు వేదపాఠమునకై పేరయ్య యొజ్జ యొద్దకు నెట్టిరి. పేరయ్య యొజ్జ అప్పటికి అరువదియేండ్లవాడు. ముక్కుపై కోపము కలవాడు. బోధించినదానికన్న దర్భలతో చింత బరికలతో బాది బాధించినది అధికము.

చెల్లెక్కుట, నదిలో ఈతలు కొట్టుట, దేవెలపై నెక్కి తిరుగుట చిన్న సూరికి చిన్నవయసులోని సరదాలు. ఆటలు, అల్లరి చేష్టలు, చిక్కినదెల్ల మెక్కుట నాటి మక్కువలు. మనుష్యులనుతప్ప తక్కిన సర్వలోకమును చోద్యముగా పరిశీలించుట, సంకల్ప శరీరముతో ఊహాప్రపంచములో అతిమానుష చర్యలతో విహరించుట, చీకటి యెరుగని సూర్యునివలె కపటమెరుగని హృదయముతో

ప్రవర్తించుట సూరన్న శైశవ లక్షణములు. ఇక అకారణవైరము, నిష్కారణ ప్రేమయు వెన్నెముక మువరకముందే ముదిరిన గుణములు.

తొమ్మిదేండ్ల వయసులో సూరి శరీరమునకు మశూచికము అతిథియైనది. పదేండ్ల ప్రాయమునకు తాళపత్రములపై గంటముతో వ్రాయగల నైపుణ్యము అభ్యాగతమైనది.

ఈ పదేండ్ల వయస్సు నందొకసారి సూరి మాతామహ స్థలమైన వంతరాము వెళ్లుట తటస్థించినది. అప్పుడు భగవత్ప్రేరణమో యన్నట్లుగ ఆ గ్రామమునకు బొబ్బిలి సంస్థాన వైణికుడైన వాసా సాంబయ్యగారు వచ్చుట జరిగినది. ఆ సాంబయ్య గారు ఎక్కడకునైనను కావడిలో ఒకవైపు వీణను మరియొక వైపు గుడ్డలమూటను పెట్టుకొని స్వయముగా మోసికొని తిరుగు సంగీత ప్రియులు. ఆ గ్రామమునకు కూడ వచ్చేవచ్చిరి. ఆ సంగీత కళారహస్యనిధి యెదుట అక్కడ చేరిన పెద్దలు మహాభారతములోని కొన్ని పద్యములను సూరన్నచే పాడించిరి. సంగీత శాస్త్ర జ్ఞానము లేకపోయినను యథేచ్ఛరాగలయలతో కూడిన సూరన్న పర్జన్య గర్జాగంభీర గాత్రమునకు సంగీత సాగరము నాపోశనము పట్టిన అంతటి సాంబయ్యగారుకూడ దిగ్భ్రాంతులై 'ఈ అబ్బాయిలో అసాధారణ ప్రతిభ దాగుడుమూతలాడు చున్నది. నాతో పంపుము. ఇతని ప్రతిభకు స్వరశాస్త్రమును చెలిమి చేసెదను. గొప్ప విద్వాంసుడగును' అని పలికెను. తల్లి నరసమ్మ సంతోషముతో సూరన్నను సాంబయ్యగారితో బొబ్బిలికి పంపెను. బొబ్బిలిలో వారములు చేసికొనుచు సూరన్న ఒక నెల రోజులు మాత్రమే యుండి అజ్జాడకు తిరిగి వచ్చెను. నారాయణదాసుగారు వారి జీవితములో గురుముఖముగా సంగీత మభ్యసించినది ఈ నెల రోజులు మాత్రమే.

సూరన్న పదునాలుగేండ్లు దాటు వరకు ఏ ఆంగ్ల పాఠశాలలో ప్రవేశింప లేదు, తరువాత రెండవ కుమారుడైన సీతారామయ్య యొత్తిడి వలన వేంకట నైనులుగారు సూరన్నను ఆంగ్ల విద్యాభ్యాసమునకై విజయనగరము పంపిరి. ఇట్లు విజయనగరము వచ్చువరకు సూరన్న కౌపీనవంతుడే.[9] పట్టణమునకు వచ్చిన తరువాత గోచి మంచిది కాదని యెంచి గావంచ ధరించుట క్రొత్తగా అలవాటు చేసి

9. ఇట్లు కౌపీనముతో మాత్రమే యుండు అలవాటు దాసుగారికి జీవితాంతము వరకు వదల లేదు. కౌపీనవంతః ఖలు భాగ్యవంతః అని కదా శంకరాచార్య సూక్తి.

క్రొనెను. సూరన్న విజయనగరములోని ఆంగ్లపాఠశాలలో మొదటి తరగతిలో చేరెను. అప్పుడు కడియాల వెట్టి క్రామయ్య లెక్కలకు, వంతుల నరసింహశాస్త్రి తెలుగునకు ఉపాధ్యాయులు. శీలము వెంకటాద్రి నాయుడుగారు మంచి పలుకుబడి గల ప్రధానోపాధ్యాయులు (హెడ్‌మాస్టరు). ఇంగ్లీషు ఫస్టు రీడరులోని కొన్ని పాఠములను ఏకుమళ్ళ గోవిందరావుగారు బోధించిరి. మధ్యమధ్యలో రెండవ అన్నగారైన సీతారామయ్యగారి భార్యా సోదరుడగు గంటి లక్ష్మీనరసింహరావు కూడ కొంత ఆంగ్లము బోధించినాడు. ఈ లక్ష్మీనరసింగరావు యొక్క ఆంగ్లభాషా గురుత్వ మెట్లున్నను దాసుగారికి చుట్టనేర్పిన గురువితడే.

సూరన్న ఆ తరగతి విద్యార్థులందరలోను వయస్సులో పెద్దవాడు, ఏక సంథాగ్రాహి యగుటచే మొదటి తరగతి నుండి 'డబుల్ ప్రమోషన్'తో మూడవ తరగతిలోనికి అధ్యాపకులు చేర్చిరి ఇట్లు సూరన్న ఆంగ్లవిద్యాభ్యాసము సాగుచుండగా 1880 లో దాసుగారి తండ్రియైన వేంకట చయనులుగారు క్షయవ్యాధితో పరమపదించిరి. అప్పటికి వేంకట చయనులుగారి వయస్సు ఏబదితొమ్మిది. సూరన్న వయస్సు పదునారు.

ఆంగ్లవిద్యకై విజయనగరము ప్రవేశించుటతో చిన్నసూరి జీవితనాటకమునందొక క్రొత్త యంకము ప్రారంభమైనది. అప్పటి విజయనగరమునకు రాజయోగముండుటచే సర్వవిద్యల కక్కడ రాజయోగము పట్టినది. శాస్త్రములకు రెండవ కాశిగా ప్రకాశించినది. మహారాజ పోషణ ముండుటచే ఎందరెందరో సంగీత విద్వాంసులు, సాహిత్యస్నాతకులు, నటులు, నట్టువరాండ్రు ఆ పట్టణమును అంటిపెట్టికొని పీఠములు కట్టుకొనిరి. ఇక నెందరో ఆ పట్టణమున జరుగుచుండెడి ఉత్సవ సమయములందు వచ్చి శక్తిసామర్థ్యములను వెలార్చించుకొని వెడలుచుండెడివారు. విజయనగరమందు విలువ వలువ కప్పించుకొన్నవాడే విద్వాంసుడని నాటి విశ్వాసము. అప్పటి విజయనగరము విద్యా విజిగీషువుల కొక పరీక్షా కేంద్రము.

సూరన్నలో బీజముగానున్న ప్రతిభ విజయనగర మందలి మహబత్‌ఖాన్, దుర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు, పప్పు వెంకన్న, వీణా వేంకటరమణదాసు, కలిగొట్ల కామరాజు మొదలగు మహాసంగీత విద్వాంసుల పరిచయ దోహద క్రియలచే మహావృక్ష మగుటకు అవకాశమేర్పడినది. సూరన్నకు వీణా వాదన

మందు అభిరుచి కల్గించినది నైణిక శ్రేష్ఠుడగు వీణా వేంకట రమణదాసు, కలిగొట్ల కామరాజు లయ యందు దీటు లేని మేటి. కామరాజు సాన్నిధ్యము సూరి లయ సాధనమునకు నిలయమైనది.

వాసా సాంబయ్యగారి యొద్ద ఒక మాస కాలము నేర్చుకొన్న ప్రాథమిక జ్ఞానము, విజయనగర మందలి ఈ విషయజ్ఞుల విద్యాసాంగత్యము దాసుగారి భవిష్య దుజ్జ్వల సంగీత జీవిత రూపకమునకు పూర్వరంగము సిద్ధము చేసిన నాందీ ప్రస్తావనలు. సూరన్న ఈ విద్యార్థి దశ యందే ఈ స్వల్పావకాశ సంపాదిత సామగ్రితో సరికరువగు స్వప్రతిభను జోడించి సంగీతముచే కాలక్షేప కథా కథనములచే కంటికి కనపడిన వారినెల్ల కళా ప్రియులుగా మలచెడివాడు. దీనితో విజయనగర మందే కాక పరిసర ప్రాంత గ్రామములందు కూడ సూరికి వంది మాగధుల బృంద మెక్కువైనది. అప్పటికే సూరన్నను పద్య రచనా శక్తి పాణిగ్రహణము చేసినది. ఇక అనుకరణము, అభినయము నడకతో నడచి వచ్చిన నమ్మిన బంటులు.

మొదటి హరికథ

సూరన్న స్వభాను సంవత్సరములో (1883) మెట్రిక్యులేషను చదువు చుండగ హరిదాసగుటకు అంకుర మేర్పడినది. తిప్పస్వామినాయుడు అను భాగవతారు చెన్నపట్టణము నుండి విజయనగరమువచ్చి కానుకుర్తి హనుమంతరావుగారి యింటియందు ఆడుచు పాడుచు ధ్రువ చరిత్ర హరికథ చెప్పెను. అది చూచిన క్షణమే సంగీత నృత్య సాహిత్యములను ఒకచోట అనుసంధించి ప్రదర్శించుటకు అనువైన ప్రజారంజకమైన ఏకైక సకలేంద్రియ సంతర్పణ ప్రక్రియ హరికథ అను భావము సూరన్న దహరాకాశమున మెరసినది. వెంటనే హరికథ వ్రాయవలెనని సంకల్పించి తాను కూడ నొక ధ్రువ చరిత్రమును వ్రాసెను. ఈ ధ్రువ చరిత్రము దాసుగారి మొదటి రచన. ఈ ధ్రువ చరిత్రమునందు సొంత కీర్తనలతోపాటు విశాఖపట్టణ వాసుడైన ధూళిపాళ కృష్ణయ్య పద్యములు, ఆంధ్ర భాగవత పద్యములు, పంచ తంత్రములోని కథలు కూడ సూరన్న చేర్చెను. అట్లు చేర్చి కూర్చిన హరికథను సోదరుడైన పేరన్నతో కలిసి రెండవయన్నయైన సీతారామయ్యగారింట మొదట 'రిహార్సలు' వేసెను. సీతారామయ్యగారు సూరన్న సామర్థ్యమును జూచి సంతోషముతో కాళ్లకు గజ్జెలు కట్టి సత్కరించిరి. సూరన్న

ఆ గజ్జెలను కట్టుకొని వేణుగోపాలస్వామి మఠములో మిత్రుల యెదుట ఆడుచు పాడుచు హరికథ చెప్పెను. సూరన్న హరిదాసయిన శుభలగ్నమిది. సూరన్న ఇట్లు హరిదాసుగా నవతారమెత్తినపుడు వయసు పందొమ్మిదేండ్లు.

దాసుగారి ఈ ప్రథమ హరికథా ప్రదర్శనమును పరికించిన పండితులు 'ఈ కుఱ్ఱవాని బహుముఖ ప్రతిభకు సరియైన సాధనము హరికథయే' అని ప్రశంసించి ప్రోత్సహించిరి.

మొదటి దేశ సంచారము

విజయనగర పౌరుల ప్రోత్సాహముతో, అంతకుముందే కల్గిన పరిసర గ్రామ సంచారానుభవముతో, ఆత్మ విశ్వాసధనముతో దాసుగారు పేరన్న యన్నతో దేశ సంచారమునకు బయలుదేరిరి. ఆ రోజులలో ఉర్లాము కళాపోషణ కేంద్రములలో నొకటి. ఆ ఉర్లాము జమీందారిణియైన కందుకూరి మహాలక్ష్మమ్మగారికి కళా ప్రియత్వ మెక్కువ. దాసుగారు ఉర్లాము వెళ్లి ఆ జమీందారిణిని అక్కడ నున్న ఆస్థాన పండితులను ఆశు కవిత్వములతో, హరికథా ప్రదర్శనముతో మెప్పించిరి. అక్కడనున్న పండితులు దాసుగారి ఆశుకవితా ప్రతిభను జూచి అష్టావధానము చేయగలరా? యని ప్రశ్నింప, దానికి దాసుగారు నిస్సంశయముగ చేయగలనని చెప్పిరి. జమీందారిణి మరునాడే అవధానము నేర్పాటు చేయింపగా దాసుగారు తొలి సారిగా సాహిత్యావధానమును చేసి మెప్పించిరి. ఆ అవధాన విధాన సామర్థ్యము, ఆ హరికథా ప్రదర్శన నైపుణ్యమును జూచి జమీందారిణి వార్షిక మిచ్చి హర్షము తెలియజేసెను.

అక్కడినుండి పేరన్నతో గూడి దాసుగారు నరసన్నపేటకు వెళ్లి పుర ప్రముఖుల సమ్ముఖమున ధ్రువ చరిత్రను చెప్పిరి. ఆ సభలో శ్రీకాకుళ మండల ఉపమండలాధికారి (Sub-Collector) యైన H. D. Bardswell ఒకడు. ఆ హరికథకు ఆ అధికారి ఎంత ఆనందించెనన్న జీవితాంతము వరకు దాసుగారి హరికథ యన్నచో చెవికోసికొనెడివాడు. దాసుగారి ముఖ్య మిత్రులలో నొకడైనాడు.

నరసన్నపేటలో నుండి బరంపురమునకు బయలుదేరి త్రోవలో ఇచ్ఛాపురము నందొక కథ చెప్పిరి. బరంపురము నందు మరువాడ జగన్నాథమను నొక ప్రముఖ

న్యాయవాది కలడు. అతడు దాసుగారికి బంధువు. ఆయన ప్రముఖ వ్యాపారియైన నాళము భీమరాజింట దాసుగారి హరికథ నేర్పాటు చేయించెను. ఆ హరికథకు భీమరాజు పట్టు వస్త్రములు, నూటపదారులిచ్చి మెచ్చుకొనెను. ఆ హరికథను జూచిన ప్రేక్షకులలో కప్పుస్వామినాయుడు ఒకడు. నాయుడు హరికథానంతరము దాసుగారిని జూచి 'మీకు హరికథనేర్పిన గురువులెవరు?' అని యన, దాసుగారు 'మీరే' అని నవ్వుచు విజయనగరమున నాయుడుగారి హరికథ తమ్మెట్లు ప్రభావితము చేసెనో వివరించిరి. అప్పుడు నాయుడుగారు ఆనందమును ఆపుకొనలేక దాసుగారిని కౌగలించుకొన్న దృశ్యము బ్రహ్మానంద సదృశము.

ఈ బరంపుర పర్యటనము నందు దాసుగారికి పరిచయమైన మహామనీషి జయంతి కామేశము పంతులు. ఈయన ప్రముఖ న్యాయవేది, రసికుడు, విద్యావేత్త, దాత, జానకీవర శతకము వ్రాసినకవి. దాసుగారిని బరంపురము నందు అనేక విధముల సత్కరించిన 'త్యాగభోగరాయుడు'. దాసుగారిని బరంపురము నుండి సాగనంపుచు దాసుగారూ! మీ ప్రతిభను లోకము సరిగా గుర్తింపలేక మిమ్ముల నవమానించునేమో' యని పసిపిల్లవాని వలె రోదించిన ప్రతిభాభిమాని.[10]

దాసుగారి ఈ యాత్రయందు ఛత్రపురములో నొక చిత్రము జరిగినది. ఒక ధనవంతుని యింటియందు ధ్రువచరిత్ర చెప్పగా, సభ్యులలో నొకడైన ఒక అధికారి 'ఈ హరికథ మీరు వ్రాసినదే యగునా?' అని సందేహమును వెలిబుచ్చెను. దానికి దాసుగారు 'నేను వ్రాసినదే' యనిరి. అట్లయిన అంబరీషోపాఖ్యానమును వ్రాసి చెప్పుము' అని అధికారి యనగా దాసుగారు పట్టుదలతో ఆ రాత్రికి రాత్రియే అంబరీషోపాఖ్యానమును వ్రాసి ధారణచేసి మరునాడుదయమే గజ్జెకట్టి ఆ హరికథను ఆశ్చర్యజనకముగా చెప్పిరి. అంబరీషోపాఖ్యానము దాసుగారి రెండవ రచన (1884) ఇది ప్రాయువరకు దాసుగారు చెప్పిన హరికథ లన్నియు ఒక్క ధ్రువ చరిత్రయే.

ఈ సంచారము నందే దాసుగారు 'లోకనాథము' అను గ్రామములో మొట్టమొదటసారిగా సంగీత సాహిత్యాష్టావధానమును చేసిరి. అక్కడినుండి సుబ్బామ్మ

10. జయంతి కామేశము పంతులుగారు చూపిన ప్రేమాభిమానములను మరువలేక దాసుగారు కామేశముగారు మరణించిన తరువాత 'నా యెఱుక' (స్వీయచరిత్ర) గ్రంథము అంకితమిచ్చిరి.

పేటలో, పర్లాకిమిడిలో, శ్రీకాకుళములో, అరసవిల్లిలో ఎన్నియో హరికథలు చెప్పి మహాపండితుల పొగడ్త లెన్నింటినో ప్రోగుచేసికొని నారాయణదాసు అను నామముతో ప్రసిద్ధిచెంది విజయనగరము చేరిరి. దాసుగారి కప్పటికి ఇరువదేండ్లు.

దాసుగారికి నిరువది యొకటవ సంవత్సరము నందు వడ్లమాని అన్నప్పగారి పుత్త్రిక యగు లక్ష్మీనరసమ్మ నిచ్చి వివాహము చేసిరి.

కళాశాల చదువు

దాసుగారికి ఆటపాటలపై నున్న శ్రద్ధలో అవగింజతయైన బడి చదువుపై లేదు. ఆ కారణముచే 'మ్రటిక్యులేషను' పరీక్ష ఇంతకు ముందే తప్పిరి. ఈ పెండ్లియైన సంవత్సరమందే పీతాంబరము హనుమంతరావు, పూడిపెద్ది సోమనాథము అను సహపాఠులతో సొంతముగా జదివి 'మ్రటిక్యులేషన్' పరీక్షలో నుత్తీర్ణులైరి. కాని పై చదువులు చదువుట దాసుగారికి ఇష్టము లేదు. హరికథలు చెప్పి జీవించవలెనని వారి వాంఛ. వారి కిష్టము లేకపోయినను పై చదువులకు కళాశాలలో చేరిరి. దానికి కొన్ని కారణము లున్నవి. అప్పటి విజయనగర కళాశాల ప్రధానోపన్యాసకులు (ప్రిన్సిపల్) చంద్రశేఖరశాస్త్రిగారు. వారు సంగీత ప్రియులు. దాసుగారు ఒకసారి బొంకులదిబ్బపై హరికథ చెప్పుచుండగా విని ఆనందించి దాసుగారిని పై చదువులకు ప్రోత్సహించిరి. చంద్రశేఖరశాస్త్రిగారి ప్రోత్సాహమునకు తోడు అన్నయైన సీతారామయ్య యొత్తిడి యెక్కువైనది. ఈ రెండింటిని మించిన బలవత్తర కారణము మరియొకటి యున్నది. అప్పటి విజయనగర సంస్థానమునకు దివాన్జీ శ్రీ పెనుమత్స జగన్నాథరాజు. ఈయన కూడ దాసుగారి హరికథను ఒకసారి వినుట తటస్థించినది. విని ముగ్ధుడై జగన్నాథరాజు దాసుగారి పొట్టను సవరించుచు 'ఇంత చిన్న బొజ్జలో ఇన్ని గొప్ప కళలు ఎట్లు నిండి యుండెనో' అని చమత్కరించెను. అంతేకాదు. కళాశాలలో ఉపకార వేతనము (స్కాలర్‌షిప్) ఇప్పింతునని వాగ్దానము చేసెను. ఈ కారణ త్రయము దాసుగారు కళాశాలలో పై చదువులు చదువుటకు మూలములైనవి. 1886 లో విజయనగర కళాశాలలో ఎఫ్. ఏ. లో చేరిరి.

కళాశాలలో ప్రవేశించినను దాసుగారు హరికథలు చెప్పుట మానలేదు. ఈ సంవత్సరమునందే (1886) గజేంద్ర మోక్షణ మను హరికథను రచించిరి.

ఉపకార వేతనము ఇప్పించిన దివాన్జీ, పిఠాపురము రాజయిన గంగాధర రామారావుగారిని దర్శింపుమని దాసుగారికి ఒక సిఫార్సు ఉత్తరము నిచ్చెను. దివాన్ సాహెబ్ చేసిన రెండవ యుపకారమిది. దాసుగారు పేరన్నతో కలసి పిఠాపురము బయలుదేరిరి. త్రోవలో కాశింకోట జమీందారుగారిని హరికథ చెప్పి మెప్పించిరి. పిఠాపురము వెళ్లి అక్కడ దివాన్జీగారికి సిఫార్సు ఉత్తరము చూపింపగా, పిఠాపురము దివాన్జీ మాధవస్వామి ఆలయములో హరికథ నేర్పాటు చేసెను. ఇంతలో అనుకోకుండగ విజయనగరము దివాన్జీ పిఠాపురము వచ్చుట జరిగినది. అతడు కోటలో హరికథ నేర్పాటు చేసెను. గంగాధర రామారావు దాసుగారి హరికథకు ముగ్ధుడై మరల మరియొక హరికథను కోరిచెప్పించుకొనిరి. రెండవసారి దాసుగారు వారి సంగీత వైదుష్యముతో హరికథను శ్రవణపర్వముగా జేసిరి. పిఠాపురము రాజా దాసుగారి గాన మాధుర్యమునకు పరవశము చెంది 'దాసుగారూ! మీ సంగీతము లడ్డుమీద పన్నీరు చల్లినట్లున్నది'. అని ప్రశంసించిరి, వారి సంప్రదాయానుసారము 'కైజారు' పైనుండి నూటపదారు లిచ్చి సత్కరించిరి. దాసుగారు పొందిన ఘన సత్కారములలో నిది యొకటి.

నారాయణదాసుగారు పిఠాపురము వెళ్లివచ్చిన కొలది దినములకే ప్రధానోపన్యాసకులైన చంద్రశేఖరశాస్త్రిగారు స్వర్గస్థులైరి. అది యేమి దైవ దుర్విపాకమో కొన్నినాళ్ళకే దివాన్జీ జగన్నాథరాజుగారు కూడ తనువు చాలించిరి. శ్రేయోభిలాషులు ఇరువురిట్లు నామశేషులగుటతో దాసుగారు దుర్వ్యాఖ్య చేయబడిన కవి వలె హతాశులైరి.

తరువాత కళాశాలకు ప్రధానోపన్యాసకులయిన వారు కిళాంబి రామానుజాచారి గారు. ఈయన సంస్కృతాంధ్రము లందు గట్టిదిట్ట. శతావధాని. కాని సంగీత ప్రియత్వము లేదు. అందువలన చదువక హరికథలు చెప్పుచు తిరుగువానికి వేతన సహాయ మెందులకని దాసుగారి ఉపకార వేతనము తొలగించెను. దాసుగారప్పుడు విజయనగరము కళాశాల నుండి ధ్రువ పత్రము (Evidence Certificate) తీసికొని ఎఫ్. ఏ. రెండవ సంవత్సరము చదువుటకు విశాఖపట్టణము హిందూ కళాశాలకు వెళ్లవలసి వచ్చినది. అప్పుడు (1887-88) ఆ కళాశాలకు ప్రధానోపన్యాసకులు రామయ్యగారు, వారు లబ్ధ ప్రతిష్ఠులైన దాసుగారిని గూర్చి విని ఉపకార వేతనము ఇప్పించగా ఎఫ్. ఏ. రెండవ సంవత్సరము చదివిరి. మద్రాసు హైకోర్టు న్యాయాధిపతులైన శ్రీ పేపా రామేశముగారు, దాసుగారు అప్పుడక్కడ సహపాఠకులు.

విశాఖపట్టణమందు చదువుకొనునప్పుడు దాసుగారిని కాశింకోట జమీం దారు పిలిపించుకొని రెండు హరికథలను చెప్పించుకొని నూటపదారులతో వారి ఆనందమును తెలియజేసిరి. ఆ రోజులలో సోమంచి భీమశంకర మను సాహిత్యాభి రుచి కల ప్రముఖ న్యాయవాది విశాఖపట్టణ మందున్నాడు. దాసుగారి ప్రతి హరికథకు మొదటి సభ్యుడు ఈ భీమశంకరము. దాసుగారు ఒక సంవత్సరములో నలువది హరికథలు చెప్పుటకు ప్రధానకారకుడు. అప్పుడు విశాఖపట్టణమందు అంకితము వెంకట నరసింగరావు అనునొక జమీందారు కలడు. అతడు విద్యా పోషకుడు.[11] దాసుగారి హరికథలను విని యానందించెడి నిత్యసభ్యులలో నొకడు. నరసింగరావు దాసుగారి అష్టావధానమును తన నివాసము నందేర్పాటు చేసెను. ఇది క్లిష్టాంశములతో కూడిన అష్టావధానము.[12] ఈ కష్టమైన అష్టావధానమును అనాయాసముగ నిర్వహించిన దాసుగారి ప్రతిభకు పరమానందముచెంది జమీందారు నూటపదారులు వార్షికమిచ్చుచుంటినని సభాముఖాన ప్రకటించెను. ఈ యవధానముతో ప్రతిభాకాంత దాసుగారికి సహధర్మచారిణిగా నున్నను యశఃకాంత దిక్కులుచూచుట మొదలు పెట్టినది. ప్రతిభాకాంత ఒక్కసారి బైట దర్శనమిచ్చిన చాలును.అదెక్కడి సాపత్న్యమో ! యశఃకాంత తిరిగినచోట తిరుగక దేశమంతయు తిరిగి రావలసినదే.

ఇట్లు అష్టావధానముల నిర్వహణములతో. హరికథల వ్యాసంగములతో దాసుగారు కళాశాల చదువులపై శ్రద్ధచూపక ఎఫ్. ఏ. పరీక్షను లెక్కలలో తప్పిరి. ఎఫ్. ఏ. రెండవ సంవత్సరము చదువుచున్న ఇరువది నాల్గేండ్ల ప్రాయమునందే కాళిదాసు షేక్స్పియరు రచనలను కొంత కొంత అనువదించుట జరిగినది. బాటసారి యను కల్పిత గ్రంథములను వ్రాసినదికూడ నిప్పుడే (1888). శ్రద్ధలేకపోవుట వలన దాసుగారు రెండవ పర్యాయముకూడ లెక్కలలో తప్పిరి. అంతే, దీనితో దాసుగారు కళాశాల చదువునకు స్వస్తి చెప్పిరి. దాసుగారు వారి విద్యార్థిజీవితమునందు ఒక్క ఆంగ్లము తప్ప మరి ఏ విద్య గురుముఖమున నేర్చుకొనలేదు.

---

11. విశాఖపట్టణమందలి నేటి A. V. N. College వీరిపేర వెలసినదే.

12. అంశములు :— 1. గ్రీకు భాషలో ఏబది మాటల వ్యస్తాక్షరి చేయుట 2. కోరిన పురాణఘట్టములను జదివి వానికి వెంటనే రాగములు కూర్చుట 3. పుస్తకము గిరగిర త్రిప్పుచుండగా చదువుట, 4. బీజగణితము నం దిచ్చిన చిక్కులెక్కలను విప్పుట. 5. విసరు పుష్పములను లెక్కిం చుట. 6. ఛందస్సంభాషణము. 7. తెనుగులో సంస్కృతములో ఆశుకవిత్వము. 8. నిషేధాక్షరి.

దేశ సంచారము

దాసుగారు చదువు మాని విశాఖపట్టణము నుండి విజయనగరము వచ్చిరి. వీలు దొరికినపుడెల్ల హరికథలను చెప్పుచుండిరి. అప్పటికే దాసుగారిలో హరికథలు చెప్పుచు జీవితము గడుపవలెనను భావము వేరు ప్రాకి స్థిరపడినది. విద్యా వ్యాసంగమను అటంకము తొలగుటచే అవకాశము కూడ పెచ్చైనది. దీనికి తోడు 'వీడు హరికథలు చెప్పుకొని బ్రతుకగలడులే' అని సోదరుడైన సీతారామయ్య కూడ అడ్డము రాలేదు. ఇక మిత్రుల ప్రోత్సాహము సరేసరి. ఈ కారణముల బలముతో దాసుగారు తమ కథా కథనశక్తి తెలుగు నేలను నాలుగు చెరగులను చూపింపవలెనని సంచారమునకై బయలుదేరిరి. ఈ సంచారకాలము పదునాలుగు నెలలు (1888-89). ఈ సంచారములో పేరన్న తోడులేడు.

ఈ సంచారములో దాసుగారు మొదట కాలు మోపిన చోటు రాజమహేంద్రవరము. అవి వీరేశలింగము పంతులుగారి సంఘసంస్కరణోద్యమములతో ఆంధ్రదేశమంతయు ఉడికిపోవుచున్న రోజులు. పంతులుగారి ప్రభకు పట్టపగ్గములు లేని రోజులు. ఆ సంస్కరణోద్యమములకు రాజమహేంద్రవరము రాజధాని. దాసుగారి హరికథా పద్ధతి క్రొత్తది యగుట వలన రాజమహేంద్రవర పురపౌరులు ఆకృష్టులైరి. వారు వీరనక కథ విన్న వారందరు దాసుగారిని నెత్తిపై పెట్టుకొనిరి. అట్టి అభిమానులలో ప్రథమ గణ్యులు ప్రముఖ న్యాయవాదులైన శ్రీ న్యాపతి సుబ్బారావుగారు. ఇట్లు ప్రముఖు లందరు దాసుగారికి అరతి పట్టుచున్నను వీరేశలింగముగారు మాత్రము తగిన గౌరవమీయలేదు. దీనికి కారణము పంతులుగారికి సంఘ సంస్కరణోద్యమములపై నున్న చూపు సంగీతముపై లేకుండుటయే. దాసుగారికి కూడ పంతులుగారి సంస్కరణోద్యమములపై మంచి చూపు లేదు. ఇట్లు ఈ మహావ్యక్తు లిరువురు భిన్న రుచులు కలవారగుటచే ఒకరిపై నొకరికి అంత సద్భావము లేక విమర్శించుకొనుచుండిరి.[13]

---

13. దాసుగారు వారి స్వీయ చరిత్రలో (పుట-154) పంతులుగారి పేరుకూడ ఉచ్చరింపుట నచ్చక 'విచిత్ర వివాహకర్త' అని వ్రాసిరి. తొలిరోజులలో ఇట్లు విమర్శించు కొన్నను తరువాత ఒకరినొకరు గౌరవించుకొన్నట్లు ఆధారములున్నవి. పంతులుగారు దాసుగారి బాటసారి గ్రంథమును మెట్రిక్యులేషను పరీక్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయించుట (1902); రాజమండ్రిలో సభాసమక్షమున (1912) దాసుగారికి నవరత్నఖచిత భుజకీర్తిని సమర్పించుట మంచి సాక్ష్యములు.

రాజమండ్రి నుండి న్యాపతి సుబ్బారావుగారు, సోమంచి భీమశంకరముగారు తోడు రాగా దాసుగారు పడవపై అమలాపురము వెళ్లిరి. సుబ్బారావుగారు అక్కడ గల న్యాయవాదులకు పరిచయము చేయగా వారు కొన్ని కథల నేర్పాటు చేసిరి. అప్పటికే రసికులను వశపరచు కొనుటలో గడితేరిన దాసుగారి హరికథా విలాసినీ విలాసములకు అమలాపుర పౌరులు ఆటబొమ్మలైరి. అక్కడ కీర్తి ధ్వజము నాటి తిరిగి రాజమండ్రి చేరిరి.

రాజమండ్రిలో కొన్నినాళ్లుండి అక్కడనుండి కాకినాడకు వెళ్లిరి. హరికథల చెప్పుటకు వెళ్లిన దాసుగారికి అనుకోకుండగ కాకినాడ నాటక సమాజము నిర్వహించుచున్న విక్రమోర్వశీయ నాటకమున రాజు పాత్ర కట్టవలసి వచ్చినది. వేష ధారణము లేకుండగనే అభినయము మాత్రము చేతనే పాత్రలను సాక్షాత్కరింప జేయుచున్న ఈ దాసునకు ఇది యొక లెక్కయా? దాసుగారు వేషధారణముతో పాత్ర పోషణము చేసిన సందర్భమిది యొక్కటియే. కాకినాడలో కొన్ని కథలను చెప్పి మరల రాజమండ్రి వచ్చిరి.

రాజమండ్రిలో కొన్ని కథలు చెప్పి భీమశంకరముగారితో ఏలూరు వచ్చిరి. అప్పుడు ఏలూరులో దాసు గారి హరికథ వినని న్యాయవాది యున్నాడన్న అంతకన్న అన్యాయవాదముండదు. సభలలో పండితులతోపాటు న్యాయవాదు లెక్కువగా నుండుటచే కాబోలు, ఏలూరు కథలలో కాళిదాసు. షేక్స్పియరు తెలుగు గొంతు లతో కన్పడుట ప్రారంభమైరి. ఈ లక్షణము బాగుగా ప్రారంభమైనది ఏలూరు నుండే.

ఏలూరు నుండి పండితమండలీమండితమైన బందరు చేరిరి. సభలలో పండితు లెక్కువగా కన్పడుటచే అక్కడ దాసుగారి పాండిత్య వీరము విజృంభించి పరవళ్లు త్రొక్కినది. అక్కడ దాసుగారు చెప్పినవి కేవలము హరికథలు కావు. శాస్త్ర సభలు. కొన్ని స్వరశాస్త్ర సామర్థ్య ప్రదర్శన ప్రధానములు. కొన్ని సాహిత్య విద్యా విభవనిధానములు.

బందరు పట్టణములో హరికథలకన్న దాసుగారికి ఎక్కువ కీర్తి తెచ్చిపెట్టి నది వారు పంతులుగారి మేడపై చేసిన అసాధ్యాష్టావధానము. అష్ట క్లిష్టాంశములతో గూడిన ఈ అసాధ్యాష్టావధానమును దాసుగారికి పూర్వమేఅవధానియు చేసినట్లు

కన్పడదు. 'నావంటివాడు వేయి సంవత్సరాలకు ఒకడు కూడ పుట్టడు' అని దాసుగారు సన్నిహితులతో ననుచుండెడివారట. ఆ మాటకు నిదర్శనమైనది ఈ అసాధ్యాష్టావధాన నిర్వాహణము.[14]

కాని అప్పటికే బందరులో కొందరు సంగీత విద్వాంసులు దాసుగారి ప్రతిభపై అసూయ పడుచుండిరి. అట్టి పండితులకు అండగానున్న బుధవిధేయినీ పత్రికా సంపాదకుడైన పురుషోత్తమశాస్త్రి, ఈ యవధానమును 'చిన్న పనుల గుంపు' అని వెక్కిరించెను. ఆ విమర్శనమును జూచి దాసుగారు అగ్గిమీద గుగ్గిలమై 'కలుషహారిణి' పత్రికలో విరుచుకొనిపడిరి. అందులో విష్ణుస్తుతివలె నుండి నిందాగర్భముగ పురుషోత్తమశాస్త్రిని విమర్శించిన పద్యము నాడు అతి ప్రసిద్ధము.[15] దాసుగారి ప్రతివిమర్శాత్మక సమాధానముతో బందరు పట్టణము రెండు చీలికలైనది. నారాయణదాసునకు కృతులు కూడ రావని కొందరు, అంతటి ప్రతిభావంతుడింత వరకు పుట్టలేదని కొందరు వాదములు చేయసాగిరి. వాదోపవాదములు ప్రశతిమించినవి. పోటీ సభ తప్పనిసరియైనది. గొప్ప పోటీ సభ నేర్పాటుచేసిరి. ఆ సభకు 'సప'లు వచ్చిన ప్రతి సంగీతప్రియుడు వచ్చెను. తగాదాలు లేకుండ సభ సక్రమముగ సాగుటకు 'పోలీసు బందోబస్తు' కూడ అవసరమైనది. సభ

14. ఇరు హస్తములతోడఁ జెరియొక తాళంబు
చరణద్వయాన నేమరక రెండు
పచరించి, పల్లవిఁబాడుచుఁ గోరిన
జాగాకు ముక్తాయి సరిగ నిడుట
నయమొప్ప న్యస్తాక్షరియును వ్యస్తాక్షరి
ఆంగ్లంబులో నుపన్యాస, మవల
నల్వురకున్ దెల్గునన్ నల్వురకు సంస్కృ
తంబున వలయు వృత్తాలఁగైత,
సంశయాంశమ్ము శేముషీశక్తితోఁ బ
రిష్కరించుట, గంటలు లెక్కఁ గొంట
మఱియు ఛందస్సుతోడి సంభాషణంబు
వెలయ నష్టావధానంబు సలిపె నతఁడు'

నారాయణదాస జీవిత చరిత్ర (యక్షగానము) పు. 20

15. ఈ పద్యము "చమత్కారములు" అను నంశము వెంత చోటు చేసికొన్నది.

ప్రారంభమైన తరువాత, దాసుగారి ప్రతిపక్షులకు సూత్రధారుడైన ఒక న్యాయవాది లేచి, "నారాయణదాసుగారు ఇచట గల యీ యిరువదిమంది సంగీత విద్వాంసులు విద్యయందు దనకు జాలరని పబ్లిక్‌గా నుడివినందున నీ సభ జరిగింపబడెను. కనుక ఈ విద్వాంసులు వేయు ప్రశ్నముల కతడుత్తరములు చెప్పవలసినది. వీరు చేయు శాస్త్ర పరీక్ష కాగినచో నితడందరికన్న గొప్ప విద్వాంసుడని యంగీకరింపబడును. లేనిచో నితడు వీరి నందరిని క్షమాపణ కోరుకొనవలసినది" అని కూర్చుండెను. అంత దాసుగారు లేచి "సభికులారా! యీ విద్వాంసు లందరును సంగీతమున నాకు లోకువ యని వీరలు నన్ను దిరస్కరించునపుడెల్ల వాక్రుచ్చుట నిజము. సంగీత విద్వాంసుల మనుకొన్నవారిలోనే సంగీత తత్త్వము తెలిసిన వారుంట యరుదన దక్కిన వారిం జెప్పనేల? కావున మాకు మధ్యస్థులై వీరుంట యసాధ్యము కదా! ఇప్పుడు వీరు సంగీత శాస్త్రమున ప్రశ్నించి పరీక్షించుట కనర్హులు. కారణమేమన సంగీత శాస్త్రము సంస్కృతమున వ్రాయబడినది. వీరి కందరికిని సంస్కృత భాష కొంచెమయినను దెలిసినట్లు కాన్పించదు. సంస్కృత భాషాజ్ఞాన మిసుమంతయు లేనివారికి సంస్కృతమున వ్రాయబడిన సంగీత శాస్త్ర మన్వయింపబడదు కదా! కావున సంగీత శాస్త్రము నందలి సూత్రములు కాని పద్యములు కాని నే జదువ వీరల కర్థమే కాదు గనుక శాస్త్ర చర్చ నాతో చేయుటకు వీరు తగరని స్పష్టము. ఇక శ్రోతృరంజక స్వర సందర్భము సంగీతము. కనుక వీరందరు కాని వీరిలో కొందరు కాని యొక గంట పాడనిండు. పిదప నేనొక గంట పాడెదను. ఎవ్వరి పాట మిక్కిలి రంజకముగా మీకు దోచునో వారధికులుగ నిర్ణయింపబడుదురు. ఇది నా మనవి"[16] అని పరీక్షా పద్ధతి తెల్పిరి. ఆ మాటలకు వాదోపవాదములు జరిగినవి. కాని తుదకు ప్రతిపక్షులు పాడుటకు ధైర్యములేక కుంటిసాకులతో నింటిమొగము పట్టిరి. దాసుగారికి విజయము లభించినది. ఈ పర్యటనమందే కాదు, దాసుగారి జీవితమునందే గణింపదగిన ఘనవిజయ మిది.

ఇట్లు ఆంధ్ర దేశములోని కొన్ని ప్రముఖ పట్టణములలో విజయభేరి మ్రోగించి దాసుగారు విజయనగరము చేరిరి. ఇప్పటికి దాసుగారి వయస్సు ఇరువది యైదేండ్లు మాత్రమే. తరువాత మూడు సంవత్సరములు ఎక్కువగా దేశ సంచారము చేయక పరిసరప్రాంతములందు మాత్రము హరికథలు చెప్పుచు, విజయనగరమందే యుండి తీరికను గ్రంథ రచన కప్పగించిరి. ఈ మూడేండ్లలో

16. 'నా యెఱుక'—పు॥లు 142-43

(1890–'93) వ్రాసిన గ్రంథములే. దంభపురప్రహసనము, సారంగధర నాటకము, మార్కండేయ చరిత్రము. ఈ యేడే రామేశ్వరయాత్రకు పోవుచున్న చోడవరపు మునసబుగారైన బుఱ్ఱా రామలింగశాస్త్రితో మద్రాసు చూచుటకు దాసుగారు, పేరన్నగారుగూడ వెళ్లిరి. మద్రాసులో అప్పుడు ప్రముఖ న్యాయవాదియైన రెంటాల సుబ్బారావుగారి పరిచయ మేర్పడినది. సుబ్బారావుగారు దాసుగారి బాటసారి కావ్యము విని 'మంచిగంధపు చెక్కపై నునుపువలె మీ తెలుగు మెత్తగనున్న'దని ప్రశంసించి, కపాలేశ్వరాలయము చెంత అంబరీషోపాఖ్యానము చెప్పించిరి. దాసుగారు లెక్కలేనన్నిసారులు అంత బాగుగ చెప్పినను, ఈ హరికథకు వచ్చిన కీర్తి మరి ఏ హరికథకు రాలేదు. మద్రాసు పత్రికలు దాసుగారి ప్రతిభకు ప్రభకట్టినవి.[17]

అప్పుడు మద్రాసులో వనప్పాకము అనందాచార్యులుగారొక ప్రముఖ న్యాయవాది. ఆయన అటు రాజకీయ ప్రపంచమునందు, ఇటు సాహిత్య ప్రపంచమునందు అందె వేసిన చేయి.[18] ఈయనను దాసుగారికి పరిచయము చేసినవాడు సోమంచి భీమశంకరము. అనందాచార్యులు దాసుగారి ప్రతిభను గ్రహించి సత్కరించుటయేకాక 'రెవిన్యూ బోర్డు మెంబరు' గ్రోలుదొర, మొదలగు పుర ప్రముఖులనేకులతో పరిచయము చేసెను. గ్రోలుదొర సతీసమేతుడై దాసుగారి పాట విని పొందిన ఆనందమునకు మేరలేదు. గ్రోలుదొర దాసుగారి పరిస్థితిని గమనించి 'రామనాథరాజాగారికి సిఫార్సు నిచ్చెదను. అక్కడికి పోయెదరా?' అని యన

---

17. 30-6-1894 తేదీనాటి హిందూపత్రిక చేసిన ప్రశంస –

> '....... an exquisite poet, a versatile genius conversant with English a profound scholar in Telugu and Sanskrit and an accomplished musician of the most enchanting type. While this pride of Vizianagaram was unfolding the story with his inimitable skill, the audience was beside itself with joy. Not only was he applauded time and again, but, at the close, there was a spontaneous outburst from every one present exclaiming that it was a rare and excellent treat. Of the gifted expounder, it may be well and truly said, that he is entitled to be spoken of in glowing terms by the best of Pundits, by the most skillful songsters, by the most ardent lovers of music and by the most reputed of elocutionists. The rhythmic cadences of his harmonious voice, the melodious intonations of his musical flight, and the snatches of vivid and picturesque representations of nature, conjured up by his lively and construc ive faculty of imagination and his powerful command of the language appealed to the listeners' spiritual sensibilities'.

18. దాసుగారు వారి బాటసారి కావ్యమును అంకిత మిచ్చినది వీరికే.

దాసుగా రంతదూరము ప్రయాణము చేయుట కిష్టపడలేదు. దాసుగారు అంగీక రింపకపోయినందులకు ఆచార్యులుగారు బాధపడి, 'సరే, మైసూరు పోయిరండు. నేను సిఫార్సు నిచ్చెదను' అని దాసుగారి మెడలు వంచి ప్రయాణమునకు అంగీక రించునట్లు చేసిరి.

బిల్వేశ్వరీయకర్త, మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజి ఆంధ్రోపాధ్యాయులు మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు దాసుగారి పాట పాడి కావ్యమును విని 'క్షీరాన్నము'వలె నున్నదని పొగడిరి. రెంటాల సుబ్బారావు గారి మిత్రుడైన అచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ, దాసుగారి కవిత్వము విని ఆనందించినవారిలో ఒకరు. ఇట్లు దాసుగారు ఆనాడు మద్రాసులో గల అనేక పండిత ప్రశంసలను మూటకట్టుకొని మైసూరు ప్రయాణమునకు సిద్ధమైనారు.

ఆనందాచార్యులుగారి సోదరు డొకడు బెంగుళూరులో నున్నాడు. ఆయనకు ఆచార్యులుగారు లేఖ నిచ్చిరి. అది తీసికొని దాసుగారు బెంగుళూరు బయలుదేరి పొగబండిలో వెళ్ళుచుండగా 'పోలీసు కమీషనరుగారింట గొప్ప సంగీత సభ కలదు. వెంటనే వెనుకకు రావలసినది' అని రెంటాల సుబ్బారావుగారు తంతి నిచ్చిరి. దానితో దాసుగారు మరల మద్రాసు వచ్చి సభలో పాల్గొని 'సంగీతమున దక్షిణా త్యులకన్న ఔత్తరాహులు తక్కువ' అను అభిప్రాయమును వమ్ము చేసిరి. ఈ సభ జరిగిన మరునాడు మరల బెంగుళూరు వెళ్ళిరి. అక్కడ ఆచార్యులుగారి సోద రుని పరపతితో దాసుగారు పేరన్నతో గూడి రాజభవనమునకు వెళ్ళిరి. శ్రీ శ్యామ రాజేంద్ర వొడయారు రాజావారు దాసుగారి కంఠమును విని ఆ రాత్రి హరికథ వినుట కంగీకరించిరి. ఆ రాత్రి మహారాజావారి 'బంగళా'లో అంబరీష చరిత్రము చెప్పగా, దాసుగారి సంగీతమును, రాజావారు 'your music is very sweet' అని మెచ్చుకొని మరియొక కథను చెప్పుమని కోరిరి. రెండవనాటి రాత్రి గజేంద్ర మోక్షము చెప్పిరి. ఆనాడు పేరన్నగారి పాటను 'it lulls me to sleep' అని రాజావారు ప్రశంసించి, 'దసరాకు మైసూరు రండు. సింహాసనముపై కూర్చుండి మిమ్ములను సత్కరింతును' అని సెలవిచ్చిరి,

దాసుగారు బెంగుళూరులో రెండు నెలలుండి అక్కడక్కడ మరికొన్ని హరి కథలు చెప్పి గుంటూరు వచ్చిరి. గుంటూరులో రెండు హరికథలు చెప్పి విజయ నగరము చేరుకొనిరి. దాసుగారు విజయనగరము రాకముందే వారిని మైసూరు

ప్రభువు గౌరవించినట్లు పత్రికలలో వచ్చినది. ఆ వార్తలను కళాశాల ప్రధానోపన్యాసకులైన రామానుజాచారిగారు విజయనగర ప్రభువునకు తెలిపిరి. పండితుల పట్టికలో దాసుగారి పేరుగూడ చేర్చి నెలకు పదేను రూప్యముల పండిత వేతనము ఆనందగజపతి యేర్పాటు చేసెను. దాసుగారు విజయనగరము వచ్చిన తరువాత రామానుజాచారిగారు కళాశాలలో ఒక హరికథ నేర్పాటు చేసి, హరికథానంతరము సభా సమక్షమున పండిత వేతనము సంగతి ప్రకటించెను. దాసుగారు అప్పటివరకు ఆనందగజపతి దర్శనము చేయలేదు దాసుగారి కప్పుడు మున్నదియేండ్లు.

'దసరాకు మైసూరు రావలసిన'దని దాసుగారికి మైసూరునుండి తంతి రాగా మైసూరు వెళ్లిరి. మైసూరు మహారాజు వారల రెండు హరికథలు చెప్పించుకొని దాసుగారికి 'గవర్నమెంటు డిజైనులో నున్న బంగారు మురుగులు, రెండు జతల సాలువులు, ఒక వీణ, ఒక తంబురా, సేయిసూటపదారుల్లు, రెండవ క్లాసు రైలు చార్జీలు' ఇచ్చి సత్కరించి 'మిస్టర్ నారాయణదాస్! మీకు ఫస్టు క్లాసు బహుమతి నిచ్చితి'నని పల్కిరి. దాసుగారి ఆనందమునకు అవధులు లేవు. కల్గిన ఆనందము నోట మాటలేక చేతులెత్తినదా యన్నట్లుగ దాసుగారు కృతజ్ఞతతో మహారాజును కంజలించిరి. 'మా దర్బారులో సర్వీసు చేసెదరా?' యని ప్రభువన 'మర్త్యులను గొల్వ నొల్లను' అని స్వతంత్ర ప్రవృత్తిని నిరాతంకముగ వెల్లడి చేసిన స్వేచ్ఛా జీవిత ప్రియులు దాసుగారు. దాసుగారు సెలవు తీసికొనబోవుచుండగ మహారాజా వారు ఒక ఫోనోగ్రాఫు యంత్ర సహాయముచే దాసుగారి గాత్రమును కోరి మూడు ప్లేట్లపై రికార్డు చేయించిరి. ఒక ప్లేటు జంఝాటీ రాగముతో పాడిన వెంగళూరు పై వ్రాసిన "అలరు తేనియలూరు" అను సీస పద్యము; ఒక ప్లేటు తన్నడరాగము మరియొక ప్లేటు 'సయ్యా జావో నహి బోలుం' అను టుమ్రీ.

దాసుగారిట్లు మైసూరులో ఘన సన్మానమును బొంది, అక్కడనుండి బెంగుళూరులో, మద్రాసులో కొన్ని హరికథలు చెప్పి బళ్ళారి వెళ్లిరి. అక్కడ సుప్రసిద్ధ నాటక కర్తలు, సరస వినోదినీ సభాధ్యక్షులు, న్యాయవాదులు అయిన ధర్మవరము రామకృష్ణమాచార్యులుగారిని కలసికొనిరి. వారు నారాయణదాసుగారిని గౌరవించి 'టిక్కట్టు' పెట్టి రెండు హరికథలు చెప్పించిరి. బళ్లారినుండి బయలు దేరి త్రోవలో గుంటూరులో, అమలాపురములో, చోడవరములో కొన్ని హరికథలు చెప్పి విజయనగరమునకు చేరిరి.

నారాయణదాసుగారు మైసూరులో పొందిన ఘన సన్మాన విషయము పత్రికల వలన ఆంధ్ర దేశ మంతయు వాయువు వలె వ్యాపించినది. ఆంధ్ర దేశములో నారాయణ దాస నామము నెరుగని వ్యక్తి లేడు. నారాయణదాసు అనగనే హరికథ యనియు, హరికథ అనగానే నారాయణదాసనియు వెంటనే స్ఫురించు విషయమైనది. విజయనగరము వచ్చుటతోడనే దాసుగారిని చూచిపోవు మిత్రులతో వారి యిల్లు తీర్థముగా మారినది. ఇట్లు హరిదాసుగా సర్వాంధ్ర దేశ ప్రసిద్ధుడగు నప్పటికి దాసుగారికి ముప్పదేండ్లు.

ఆనంద గజపతి సంబంధము

విజయనగరము రాకముందే విజయనగర ప్రభువైన ఆనంద గజపతి యేర్పాటు చేసిన పండిత సేతన మందుచున్నను దాసుగారికి ఆస్థాన ప్రవేశ భాగ్యము కలుగలేదు. విజయనగర మంతయు దాసుగారి 'శంభో' నినాదముతో మారుమ్రోగు చున్నను అప్పటివరకు కోటలో హరికథ జరగలేదు. ఆనంద గజపతి దాసుగారి మాట నెపుడెత్తినను అక్కడనున్న విద్వాంసులు అతడు పొగరుపోతనియు, అతని గానము పవిత్రము కాదనియు, అతని గానము విని మైసూరు ప్రభువు అకాల మరణము నొందెననియు అసూయతో ప్రచారము చేయుచుండిరి. అట్టి దుష్ప్రచారము చేసినవారిలో వృద్ధుడైన ఆస్థానవైణికుడు ముఖ్యుడు. పండితుడు, రసికుడైన ఆనంద గజపతి కూడ ఆ ముదుసలి మాటకు నెదురు చెప్పలేక మౌనముగా నుండి అలస్యము చేసిన కళంకమునకు గురి యయ్యెను. కొంతకాలము గడచిన తరువాత [19] శ్రీ లింగం లక్ష్మాజీ 'సిఫార్సు'వలన దాసుగారికి రాజదర్శనభాగ్యము కల్గినది. దాసుగారు కొలువున కేగి నారికేళఫలము సమర్పించి

'ఆశ్రితులపాలి దాక్షిణ్య మనుల నెద్ద
శౌర్యముం గోవిదులకడ సాత్వికతయు
నెసగు నేలినవారి కభీష్ట జయము
నిచ్చుగావుత సంతత మీశ్వరుండు'[20]

19. శ్రీ లింగం లక్ష్మాజీ పంతులు గ్రీకు, లాటిన్, జర్మన్, ఆంగ్లములందు మంచి పాండిత్యమున్నవాడు, గురువు. ఇతడు దాసుగారి హరికథను విని సదభిప్రాయము నేర్పరచుకొనియుండుటచే 'సిఫార్సు' చేసెను.

20. నా యెఱుక – పు – 272

అని ఆశువుగా నాశీర్వచనము చేసి తహార్చుండిరి. దాసుగారితో ఆనంద గజపతి గౌరవపూర్వకముగ ప్రసంగించుట ఆస్థాన వైణికునకు బాధ కల్గించి కొంత గడబిడ చేసెను. ఆ రోజు దాసుగారు వ్రాసిన కొన్ని పద్యములను, సంగీతమును ఆనంద గజపతి విని సంతసించెను. ఇది వారి ప్రథమ సమావేశము. దాసుగారిని ఆనంద గజపతి ప్రత్యక్షముగ జూచిన తరువాత కూడ ఆస్థాన విద్వాంసుడు కొండెములు చెప్పుట మానలేదు. ముదుసలియైన ఆస్థాన వైణికుడు మరణించువరకు దాసుగారిని ఒక్కసారి తప్ప పిలిపింపనేలేదు. ఆ ఒక్కసారి కూడ ఒక కొండెమును విచారించుటకు మాత్రమే.

ఆస్థాన వైణికుని మరణానంతరము ప్రభువు దాసుగారిని వెంటనే పిల్పించెను. అది మొదలు ఆనందగజపతి బ్రతికియున్నంతవరకు వీలుచిక్కిన చాలు దాసుగారితో గడిపెడివాడు. ఒక పర్యాయము 'సతతము సంతస మొసంగు సత్య వ్రతికిన్' అను సమస్య నిచ్చి పూరింపుమని కోరగా, కోరుటయే ఆలస్యము, దాసుగారు ఆ సమస్యను మకుటముగా మార్చి నూరు విధాల ఆశువుగా పూరించి ఆనంద గజపతికి ఆనందగజారోహణము చేయించి, నూరవ పద్యమున

చతురకళా విద్యాసం
గతికిన్ స్థిర ధృతికి ప్రకట కరుణామతి కీ
కృతి యానందగజపతికి
సతతము సంతస మొసంగు సత్యవ్రతికిన్

అని ఆనంద గజపతికి కృత్యంకితము కూడ ముడి పెట్టిరి. దాసుగారి సంగీతము విని 'మీ గాత్రము కోటా పేటా పట్టదు' అనియు, వారి ప్రసంగము వచ్చినపుడు 'మనందరి కొకకన్నే. దాసుగారికి సంగీత సాహిత్యము లను కన్నులు రెండు' అనియు చెప్పుచుండెడివారు. ఆనంద గజపతి దాసుగారికి ఎంత చనవు ఇచ్చిరన్న వారితో చదరంగము, పేకాట ఆడుచుండెడివాడు. దాసుగారు కూడ సేవకునివలె గాక స్నేహితునివలె ప్రవర్తించెడివారు. కాని వీరి యీ సాహిత్యానుబంధము రెండు సంవత్సరములకన్న సాగలేదు.[21]

1895—'98 సంవత్సరముల మధ్యకాలమునందు సూర్యనారాయణ శతకమును, రుక్మిణీ కల్యాణము, హరిశ్చంద్రోపాఖ్యానము, ప్రహ్లాద చరిత్రమును వ్రాసిరి.

21. 1895 లో ఆనందగజపతిని దర్శించెను. 1897 లో ఆనందగజపతి మరణించెను.

## తిరుపతి వేంకట కవులతో మొదటి కలయిక

వికారి సంవత్సరములో 1899 లో కాశింకోట జమీందారుగారి తోబుట్టువు వివాహము జరిగినది. ఆ వివాహమునకు దేశమందలి జమీందారు లందరు వచ్చిరి. కిర్లంపూడి జమీందారుగారితో శతావధానులైన తిరుపతి వేంకటకవులు వచ్చిరి. హరికథ చెప్పుటకు దాసుగారికి ఆహ్వానము వచ్చినది. తిరుపతి వేంకట కవులు అవధాన సరస్వతిని, నారాయణదాసు హరికథాసరస్వతిని ఆంధ్రదేశ మందలి ప్రతి వీథి యందును ఊరేగించిన శారదాభక్తులు ఈ మహామహుల కలయికతో ఆంధ్రసరస్వతి సంపూర్ణావతారముతో కాశింకోటలో సాక్షాత్కరించినదైనది. దాసుగారి నృత్యసంగీతములతో గూడిన హరికథలతో, తిరుపతివేంకటకవుల ఆశుకవిత్వము లతో సరస్వతి అనంతముఖయై వీరవిహారము చేసినది. ఇది దాసుగారు తిరుపతి వేంకట కవులు కలసిన ప్రథమసన్నివేశము.[22]

## విచిత్ర సంఘటన

దాసుగారు తమ ముప్పదియారవ యేట ఒక మౌల్వీ సాహాయ్యమున ఉర్దూ, పార్సీ, అరబ్బీ భాషల నభ్యసించు చుండిరి. అప్పుడు దాసుగారి జీవితము నందొక విచిత్రసంఘటన జరిగినది.[23] ఒకనాడు తెల్లవారుజామున ఒక బ్రాహ్మణమిథునము వచ్చి దాసుగారికి నమస్కరించినది. 'మీరెవ్వరు? ఎందులకు వచ్చితిరి?' అని దాసుగారడుగగా, వారు, సంతానార్థమై వచ్చితిమనియు, క్రితము రాత్రి కలలో ఒక మహనీయుడు కన్పడి 'నారాయణదాసుగారి ప్రసాదమును పొందుడు. సంతానము కల్గును' అని చెప్పెననియు, అందులకై మీ యనుగ్రహమును బొందుటకై వచ్చితిమి అనియు చెప్పిరి. దాసుగారు ఆశ్చర్యపడి 'ఈరోజు ఏకాదశి. మీరిరువురు ఉపవసించి, పరమేశ్వరధ్యానము చేసి, రేపు ఉదయము స్నానము చేసి, రాగి చెంబుతో నీటిని పట్టుకొనిరండు' అని చెప్పగా, వారట్లే చేసిరి. వచ్చినవారిని జూచి దాసుగారు 'నీభార్య నీటపోయుచుండ నాపాదములు నీవు కడుగుము' అని చెప్పగా, ఆదంపతులు అట్లేచేసిరి. పిదప దాసుగారు ఆచమనము చేసి వారి దోసిళ్లలో నీరు

---

22. 'కథలు - గాథలు' – ప్ర. భా, పు. 906
23. 'నారాయణదాసు జీవిత చరిత్రము' – శ్రీ మరువాడ వేంకటచయనులు, పు. 128

పోసి త్రాగించి, 'మీకు సంతానము కల్గును. మరి వెళ్లి రండు' అని సాగనంపిరి. ఆ దంపతులకు కొంతకాలమునకు పుత్రసంతానము కల్గెను.

దాసుగారి కప్పటికి సంతానము లేదు. బ్రాహ్మణదంపతుల విషయము తెలిసికొని దాసుగారి భార్య తనకు గూడ నేదైన మంత్రముపదేశింపు మని గోల చేసెను. దాసుగారు నవ్వుకొని, తనయొద్ద ఏ మంత్రము లేదనియు, వారికి విశ్వాసము చెడకుండమాత్రమే ప్రవర్తించితిననియు సమాధానము చెప్పిరి. దాసుగారి భార్య పరిస్థితి గ్రహించి చదువులవ్వ 'నాయనా ! సావిత్రి చరిత్రము వ్రాయుము, సంతానము కలుగును' అని చెప్పగా, దాసుగారు తరువాత భీష్మచరిత్రముతోపాటు సావిత్రీచరిత్రము గూడ వ్రాసిరి. ఇది జరిగినది 1902 లో. 1903 లో దాసుగారి కొక పుత్రిక కల్గినది. ఆ బిడ్డకు సావిత్రి అని నామకరణము చేసిరి.

సత్కారములు - సాధువాదములు

1904 లో బెంగుళూరులో గొప్ప గాయక మహాసభ జరిగినది. ఆ మహాసభకు భారతదేశమందలి గాయకులందరు వచ్చిరి. దాసుగారికి కూడ ఆహ్వానము రాగా పేరన్నతో గూడి వెళ్లిరి. రోజు కొక మహా గాయకుని కచ్చేరి. దాసుగారి వంతు వచ్చినది. దక్షిణ దేశములో ప్రసిద్ధి పొందిన దక్షిణామూర్తి పిళ్లె నాటి దాసుగారి హరికథకు మార్దంగికుడు. నాడు దాసుగారు రుక్మిణీ కల్యాణ కథ చెప్పిరి. అంతటి మహావిద్వాంసుడైన మార్దంగికునకు కూడ 'జాగా' దొరకనీయక దాసుగారు సభలో తమ లయ ప్రతిభను ప్రదర్శించిరి. దక్షిణామూర్తి దాసుగారికి రెండు చేతు లెత్తి నమస్కరించెను. దాసుగారికి ఆ మహాసభ 'లయ బ్రహ్మ' బిరుదముతో సత్కరించినది.

1905 లో దాసుగారి తల్లి పరమపదించినది. 1908లో పేరన్నకు గొప్ప జబ్బు చేసినది. వైద్యులు ఆశ వదలుకొనిరి. వైద్యులకు వశముకాని ఆవ్యాధి నిర్మూలనమునకై 'మృత్యుంజయ శివ' శతకము ఆశువుగా పేరన్న దగ్గర కూర్చుండి చెప్పిరి. దాసుగారి దృఢవిశ్వాస బలమో, దైవ బలమో పేరన్నకు మాత్రము ఆరోగ్య మబ్బినది. పేరన్నలో మరునాటికీ మార్పు కన్పడుట వైద్యులకు గూడ ఆశ్చర్యము కల్గించినది.

1910 లో దాసుగారు వ్రాసిన 'తారకము' అను సంస్కృత గ్రంథమును జూచి గీర్వాణ పండితలోకమెల్ల ప్రణమిల్లినది. 'గెల్డ్నర్' అను జర్మన్ పండితుడు ఆశ్చర్యపోయి శ్లోకద్వయరూపమున ప్రశంసించెను.

1911 లో బరంపురమునందు హరికథలు చెప్పగా శ్రీ బి. సదాశివయ్యగారు, మొదలగు పురప్రముఖులు దాసుగారి ప్రతిభకు మున్నూది తులముల బంగరుకడియము లను బహుమాన మిచ్చిరి.

1912 లో రాజమండ్రిలో ఆంధ్రభీష్ములైన న్యాపతి సుబ్బారావుగారు, వడ్డాది సుబ్బరాయకవి, గంటి లక్ష్మన్న మొదలగు మహామహులు ఘనసన్మానము చేసిరి. శ్రీ వీరేశలింగము పంతులుగారు ఆంధ్ర సారస్వత పరిషత్ పక్షమున నవరత్నఖచిత భుజకీర్తిని దాసుగారికి సమర్పించిరి.

1913 లో ఆనంద గజపతి సోదరియైన అప్పలకొండయాంబ (రీవాళాణి) దాసుగారి హరికథ విని 'దాసుగారూ! ఏమాత్రము దుఃఖవాసనలేని హరికథ మరి యొకటి చెప్పుడు' అని యన, దాసుగారు రెండవసారి రుక్మిణీకల్యాణకథను జెప్పిరి. రాణి అకథ విని అమందానందముతో ఏమి కావలెనో కోరుకొనుమనెను. దానికి దాసుగారు 'ఈశ్వరకటాక్షముకన్న కోరదగిన వస్తువేమి యున్నది' అని చెప్పినను రాణి నలువది పెద్దకాసులు కానుక నిచ్చి తృప్తి చెందెను.

1913 లో కాకినాడలో గొప్ప గానసభ జరిగినది. ఆ ఉత్సవము లందు దాసుగారి గానమునకు కాకినాడ ప్రజలు తన్మయులై ముత్యాలకర్ణకుండలము లిచ్చి పూజించిరి.

1913 లో దాసుగారు తమ ఏకైక పుత్త్రిక పెండ్లి చేసి కాశీ వెళ్లి తిరుగు ప్రయాణములో అలహాబాదులో ప్రసిద్ధ గాయనీమణియైన జానకీబాయిని తమ రాగా లాప నైపుణ్యముచే జీవస్థాణువుగా జేసిరి. దాసుగారు జానకీబాయిని గొప్ప విద్వాంసురాలుగా స్థాలీపులాకపరీక్ష చేతనే గుర్తుపట్టిరి. అట్టి ఆమె ప్రశంసలు దాసుగారికి అమితానందదాయకములైనవి.

అలహాబాద్ నుండి కలకత్తా వచ్చి, తెలుగురాని దేశమున హరికథ చెప్పిన నెట్లుండునో చూడదలచి దాసుగారు కలకత్తాలో శ్రీకృష్ణజనన మను సంస్కృత హరికథను హిందీలో నుపన్యసించుచు చెప్పిరి. ఆనాటి సభాసభ్యులలో విశ్వకవి రవీంద్రుడు లొకరు. నాటి సభలో రవీంద్ర కవీంద్రు లెంత ఆనందించిరన్న, తరు వాత కొన్ని సంవత్సరములకు విజయనగరము వచ్చి దాసుగారిని చూడగనే గుర్తు

పట్టి నమస్కరించి 'ఆనాడు మీరు పాడిన బేహాగు రాగ మిప్పటికిని నాచెవులలో మ్రోగుచునే యున్నది' అని ప్రశంసించిరి.

1914 లో కాశీయాత్ర చేసి వచ్చి కాశీశతకము వ్రాసిరి. అంతలో దాసుగారిని చల్లపల్లి జమీందారు శ్రీ రాజా అంకినీడు మల్లికార్జున ప్రసాదరావుగారు హరికథ చెప్పుటకు ఆహ్వానించిరి. రాజాగారు గొప్ప గొప్ప విద్వాంసుల నాహ్వానించిరి. ఆ పండితసభలో దాసుగారు పరవశించి హరికథ చెప్పిరి. కుడియెడమ చేతుల సమవిషమజాతుల వీణను వాయించిరి. ఆ అనన్యసాధారణ ప్రతిభకు పండితమండలి పరవశము చెందినది. జమీందారుగారు ఇరువదినాలుగు నవరసుల బంగారముతో గూడిన గండపెండెరమును దాసుగారి కాలికి స్వయముగ తొడిగి తమ రసికతను వెల్లడించుకొనిరి.

1914 లో శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు బందరు పట్టణమునందు విద్వత్సభా సమక్షమున ప్రశంసించి దాసుగారికి 'హరికథా పితామహ' అను బిరుదము నిచ్చిరి.

ఈకాలమునందే వేంకటగిరి, హైదరాబాదు, విశాఖపట్టణము, భద్రాచలము మొదలగు పట్టణములందు దాసుగారికి ఘనసన్మానములు జరిగెను. నందిగ్రామము నందు దాసుగారికి 'మహానందంబుతో స్వస్తి వాక్సందోహంబులు మిన్నుముట్టఁ గ నోజన్ మంగళధ్వానముల్ దిం దిం మ్రోయఁగ' బ్రహ్మరథము పట్టిరి. 'వ వేదండ నివిష్టుజేసి మరియుం బాజాబజంత్రీలతో' నూరివీధులలో దాసుగా ఊరేగించిరి.

ఈకాలమునందే సుబ్రహ్మణ్యయ్యరు అను నొక దాక్షిణాత్యుడు వచ్చె అతడు సువర్ణఘంటాకంకణమును ధరించి విజయనగరమునకు రాగా, దాసుగ వారికి గొప్ప సభ నేర్పాటు చేసిరి. సభానంతరము దాసుగారు దాక్షిణాత్యు 'మూడు గాని నాల్గు తాళములతో గాని పాడగలరా?' యని యడుగగా, 'నా రెండు తాళములతో పల్లవి పాడినవారిని ఎందును జూడలేదు. ఎక్కడనైన యెడల నావీరఘంటాకంకణము తీసివేసెదను' అని గర్వముగా సమాధాన మిచ్చె అప్పుడు దాసుగారు వానికి గర్వభంగము చేయదలచి అయిదు తాళములతో ప పాడి చూపించెను. ఆ పండితు డాశ్చర్యపోయి తన వీరఘంటాకంకణము

దీసి దాసుగారికి నమస్కరించెను. సభ దాసుగారికి 'పంచముఖీ పరమేశ్వరుడు' అను బిరుదు నిచ్చి సత్కరించెను.

1915 లో దాసుగారికి భార్యావియోగము తటస్థమైనది. లక్ష్మీనరసమ్మ గారికి రామాయణకథపై మక్కువ యెక్కువ. ఆమె ఆత్మశాంతికై దాసుగారు యథార్థ రామాయణమును వ్రాసి ఆమెకే అంకిత మిచ్చిరి.

1919 లో సంగీతప్రియులు, ఘూస్వామియైన కానుకుర్తి లక్ష్మీనరసింగరావు ప్రోత్సాహముతో విజయరామగజపతి విజయనగరమందు సంగీతకళాశాలను స్థాపించెను. (5-2-1919). ఆ విజయరామ గానపాఠశాలకు దాసుగారిని ప్రిన్సిపల్‌గా నెన్నుకొనిరి.[24]

1921 లో దాసుగారు రామచంద్రశతకము వ్రాసిరి. ఈ సంవత్సరమునందు నందిగామలో హరికథాభివర్ధనీ సమాజము దాసుగారి రుక్మిణీకల్యాణ హరికథ 'పోటీ'లు నిర్వహించినది.[25] దాసు గారు తమకు జరిగిన సత్కారములలో నిది మరచిపోలేని సత్కారముగా నెంచిరి.

1922 లో బరంపురమందలి కల్లికోట కళాశాల పండితుడు, హరిదాసు, దాసుగారికి ఏకలవ్యశిష్యుడును అయిన పసుమర్తి కృష్ణమూర్తి పార్వతీపరిణయము యక్షగాన ప్రబంధమును వ్రాసి దాసు గారికి అంకిత మిచ్చెను.

1923 లో కాకినాడలో కాంగ్రెస్ మహాసభ జరిగినది. గొప్ప గొప్ప దేశ నాయకులు చేరిన ఆ మహాసభలో దాసు గారు హరికథ చెప్పిరి. సరోజినీదేవి ఆ హరికథను విని అనేక విధముల దాసుగారి ప్రతిభను ప్రశంసించెను. ఈ సంవత్సరమే దాసుగారికి ఇంగ్లండులోని 'ఎంపైర్ ఎగ్జిబిషన్' కార్యకర్తలు భారతీయ ప్రతినిధిగా ఆహ్వానించిరి. కాని వెళ్లలేదు.

---

24. ఆ కళాశాలలో ఆరు శాఖ లుండెను — 1. వయొలిన్ - ద్వారం వేంకటస్వామి నాయుడు, 2. మృదంగము - లింగము లక్ష్మా్జీ, 3. వీణ - వాసా వేంకటరావు, కట్టు సూరన్న. 4. నాదస్వరము - మునుస్వామి, 5. గాత్రము - పేరి రామమూర్తి, వరహాలుదాసు, 6. హరికథ-నారాయణదాసు, ప్రిన్సిపలు.
25. మొదటి బహుమతి వాజపేయయాజుల సుబ్బయ్యకు వచ్చినది.

1924 లో విజయరామగజపతి కుమారుడైన అలకనారాయణగజపతి ఉదక మండలము వెళ్లెను. అప్పుడు బరోడా మహారాజు కూడ నక్కడకు వచ్చెను. వారిరువురి సంభాషణములో దాసుగారి ప్రస్తావన వచ్చి వెంటనే దాసుగారిని అక్కడకు రప్పించుకొనిరి. దాసుగారితో వేంకటరమణదాసు కూడ వెళ్లెను. వీరి ప్రతిభను జూచి ఆ యిద్దరు జమీదారులే కాక, అప్పు డక్కడనేయున్న మైసూరు మహారాజు మరికొన్నిసారులు వీరిని తమ వసతి గృహమునకు రప్పించుకొని, విని, ఆనందించి ఘనముగా సత్కరించిరి. ఆ పర్యటనమున దాసుగారు ఉదకమండలముపై చెప్పిన సీసములు మోదమోదకములు.[26]

1924 లో దాసుగారి షష్టిపూర్తి మహోత్సవము సంప్రదాయబద్ధముగ ఘనముగ జరిగినది. విజయనగరమున నాటి (30-8-'24) ఉత్సవమునకు రాని పాటగాడు లేడు. దాసుగారి శిష్యప్రశిష్య ఏకలవ్య శిష్యులతో విజయనగరము క్రిక్కిరిసి ఉక్కిరిబిక్కిరి యైనది.

1926 లో బహుగ్రంథకర్త, కవిపండితపోషకుడు నైన రాజా మంత్రిప్రెగ్గడ భుజంగరావు తన పుత్త్రిక వివాహసమయమున దేశములో గల విద్వాంసులనెల్ల ఆహ్వానించెను. దాసుగారిని హరికథ చెప్పుటకు ఆహ్వానించెను. పండిత సభయన్నచో ఉరుము విని పురివిప్పు మయూరము వలె పరవశించుట దాసుగారి లక్షణముకదా ! నాడు దాసుగారు తమ హరికథామృతముచే రాజావారికి చరిత్రలో అమరత్వము ప్రసాదించిరి. భుజంగరావుగారు అందరను ఆదరించినది యొకయెత్తు. దాసుగారిని సత్కరించినది యొక యెత్తు. అదిఘట్టు కదా !

1927 లో విష్ణుసహస్రనామ సంకీర్తనము అచ్చతెనుగున అనువదించిరి. ఆ సంవత్సరమే మద్రాసులో ఏర్పరచిన అఖిలభారతసంగీత పరిషత్తును ప్రారంభించుటకు దాసుగారిని ఆహ్వానించిరి. ఆ ప్రారంభోత్సవములో దాసుగారు కూర్చిన 'స్వరాక్షరకృతులను' పాడిరి ఆ గానమునకు సభ నిస్తరంగ నీరధి యైనది.

1928 లో వీరి హరికథలను విని మద్రాసు విద్వాంసులు 'ఆంధ్రదేశ భూషణము' అని ప్రశంసించిరి.

---

26. మేలు బంతి సమీక్షలో గలవు.

1929 లో అచ్చతెలుగు పలుకుబడి, వేల్పుమాట, మొక్కుబడి 1930 లో వేల్పువంద, గౌరమ్మ పెండ్లి, శ్రీ హరికథామృతము వ్రాసి జనస్తుతికి పాత్రులైరి.

1931 లో గుంటూరులో ఆంధ్రగాయక మహాసభకు అధ్యక్షులైరి. ఆనాడు (27_6_1931) వారు చేసిన పద్యప్రసంగము అనవద్యహృద్యము.

1932 లో కొత్తపేటలో హరికథా భవనమును నిర్మింపదలచి, ఆ యూరి పెద్దలు ఆ భవనశంకుస్థాపన హరికథాపితామహునిచే చేయించిన ఔచిత్యముగా నుండునని దాసుగారిచే చేయించిరి (11_2_32).

1932 లోనే దాసుగారు రుబాయతును ప్రచురించిరి. దాసుగారి బహుభాషా వేత్తృత్వమును డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు, మొదలగువారు బహుధా ప్రశంసించిరి.

1933 లో విశాఖపట్టణ ప్రముఖన్యాయవాది, సాహితీవేత్త యగు ప్రభల లక్ష్మీనరసింహము, దాసుగారిని సభాసమక్షమున సన్మానము చేసెను. జయపురాధీశుడైన విక్రమదేవవర్మ 'సంగీత సాహిత్య సార్వభౌమ' అను బిరుదము నిచ్చి సత్కరించెను.

విశాఖపట్టణమున మరియొకనాటి (8_2_1933) సభలో పెద్దలు 'శృంగార సర్వజ్ఞ' అను బిరుదము నిచ్చిరి. తునిలో ఉద్దండ పండితు లెందరెందరో కూడి 9_11_'33 నాడు బ్రహ్మరథ సన్మానము చేసి దాసుగారి సరస్వతిని పూజించిరి.

1935 లో విజయనగరమున గొప్ప కవి పండిత సదస్సు జరిగినది. 'భారతీతీర్థ' వార్షికోత్సవములు జరిగినవి. శ్రీ విక్రమదేవవర్మగారు ఈ సభకు అధ్యక్షులు. 'భారతీతీర్థ' సంస్థ దాసుగారికి 'ఆటపాటల మేటి' యను బిరుద మిచ్చినది.

1936 లో 'హైదరాబాద్ బుల్లెటిన్' సంపాదకీయములో దాసుగారి రుబాయతును గొప్పగా ప్రశంసించినది. హైదరాబాదులోని ఆంధ్ర మిత్ర మండలి దాసుగారిని ఆహ్వానించి సత్కరించినది. హైదరాబాదునుండి రాగానే గాన పాఠశాల ప్రిన్సిపాలు పదవినుండి విరమించిరి.

1937 లో ఇల్లెందులో గొప్ప సభ జరిపి పురప్రముఖులు దాసుగారిని సన్మానించిరి. దాసుగారు ఆ సభలో వాడు (19_5_1937) పాడగా, డెబ్బది

మూడవమేట గూడ వారి గాత్రము ఏమాత్రము తగ్గకుండుట జూచి ప్రజలు ఆశ్చర్యము చెందిరి.

1938 లో రామేశ్వరము పోవుచుండగా త్రోవలో పుదుక్కోట మహారాజు ఆహ్వానించి 'పాటకచ్చేరి' చేయించుకొని సత్కరించిరి. తిరువాన్కూరు మహారాజు ఆహ్వానించి హరికథను చెప్పించుకొని గౌరవించిరి. నాడు (23-7-1938) మహారాజు దాసుగారి కిచ్చిన కాలము గంటయునర మాత్రమే. కాని దాసుగారు పాడుచుండగా తమకు తెలియకుండగనే మూడుగంటల కాలము కూర్చుండిరి. దాసుగారి కథానంతరము మహారాజు బహువిధముల ప్రశంసించి సత్కరించిరి.

రామేశ్వరమునుండి తిరిగివచ్చునపుడు మద్రాసులో చెన్నపురి ఆంధ్రమహాసభవారు దాసుగారిచే సీతాకల్యాణకథ చెప్పించుకొని సత్కరించిరి. నాటి సభ (28-8-'38) లో ఆంగ్లభాషా ప్రవీణులైన అధికారులు ఎక్కువగా నుండుటచే దాసుగారు 'షేక్స్పియర్' గ్రంథములపై తమకు గల ప్రభుత్వమును ప్రదర్శించి ప్రశంస లందుకొనిరి. దాసుగారు సంగీతసరస్వతికి అపూర్వహారమైన 'దశవిధ రాగ నవతి కుసుమ మంజరి' కూర్చి సమర్పించిన దిప్పుడే.

1939 లో జార్జుపెలు దొర దాసుగారిని నోబెలు బహుమతికి ప్రయత్నింపుమని చెప్పిరి. కాని దాసుగారి కప్పటికే సన్మానములతో, బిరుదములతో విసుగు పుట్టి ప్రయత్నింపలేదు.

1939-43 మధ్యకాలమునందు అనేక సత్కారములను పొందుచు, హరికథలు చెప్పుచు 'సీమపల్కు వహి, మన్కి మిస్కు, జగజ్జ్యోతి' గ్రంథములను వ్రాసిరి.

1943 లో విజయనగరమునందు ఆంధ్రకళా పరిషత్తు ప్రారంభించిరి. ఆనాటి (7-5-1943) ప్రారంభోత్సవ సభకు అధ్యక్షులు దాసుగారే.

1943-45 మధ్యకాలములో లలితాసహస్రనామములను 'తల్లి విన్కి' అను పేరుతో అనువదించిరి.

నిర్యాణము

1945 లో దాసుగారి దౌహిత్రుడగు ఉపాధ్యాయుల సూర్యనారాయణకు మశూచికము వచ్చెను. దాసుగారు మనుమని వ్యాధిని జూచి 'తాతా! ఈ వ్యాధి నిన్ను విడచి నాకు వచ్చిన బాగుండును కదా' అని అనిరట. వారి వాక్శుద్ధిబలమో,

దైవనిర్ణయమో కాని ఆ బాలునకు వ్యాధి తగ్గినది. దాసుగారికి జ్వరము వచ్చినది. క్రమముగా జ్వరము తీవ్రరూపము దాల్చి దాసుగారి భౌతికకాయమును పుష్య బహుళ పంచమినాడు (2-1-1945) ఈ లోకమునకు దూరము చేసినది.[27] దాసుగారి ఆయువు మాత్రము వారి భౌతికకాయముతో సంతరించలేదు. వారి ఆయుః ప్రమాణము తెలుగు ప్రజలకు హరికథలపై ఆసక్తి యున్నంతకాలము. సరససారస్వతముపై అభిరుచి యున్నంతకాలము. అందులకే జాతిలో కళాప్రీతి యున్నంతకాలము చెరగని ఉత్తమ సందేశ లేఖలు దాసుగారి జీవిత రేఖలు.

'అతని కతండె సాటియగు నాంధ్రుల భాగ్యపుఁ బంటయై బృహ
స్పతి సమబుద్ధిశాలి యయి వాఙ్నిత సర్వకులాధినాథుఁడై
చతురత యక్షగాన కృతిసంచయమున్ రచియించి శిష్యసం
తతి కవి నేర్చి సర్వజనతా ఘనతోషణరీతిఁ దత్కృతి
ప్రతతిని బాడి యూడఁదగు పద్ధతిఁ దానొనరించి చూపి గ
ర్వితమతులైన పండిత కవీశ్వర గాయకరత్న గర్వ ప
ర్వత పవియై విదేశ కవి పండిత సన్నుతిఁగూడఁగాంచి సం
తత భగవత్పదాబ్జయుగదత్త మనస్కుఁడుగాఁ జెలంగి సం
స్కృత ముఖనైక భాషల విశేషముగాఁ గృషిఁ జేసి యన్నిటన్
గృతమతియై కృతార్థుఁడయి కీర్తిలతాంగి మనోహరుండునై
యతుల విరాగియై యతుల కందని బ్రహ్మపదార్థ శా
శ్వతముగ నుండు నాఘనుని చారుచరిత్రముఁ జెప్పశక్యమే'[28]

---

27. దాసుగారి నిర్యాణవార్త విని ఆంధ్ర దేశములో గల ప్రసిద్ధు లందరు పద్య శ్లోక రూపములలో అశ్రుతర్పణము లిచ్చిరి. ఆ వందల సందేశము లలో కొన్ని 'పూజా పుష్పములు' అను పేర 'నా యెఱుక' గ్రంథానుబంధముగా గలవు.

28. శ్రీ వాజపేయయాజుల వేంకటరమణయ్యగారు— 'నా యెఱుక'—'పూజా పుష్పములు' పు॥లు 55, 56

# ౨. హరికథ కథ

నాయని నాల్గు మోములవునా యెటు ముద్దిడె ? దంచు నల్వ యా
ప్యాయముగా హసింపఁగ, అనంతముఖన్ ననునెట్లు ముద్దిడం
బోయెనొ ? యంచు వాణి నగ, ముద్దిడెదన్ గను మంచు నల్వ నా
రాయణదాసుఁడై హరికథాకృతిగా నొనరించె భారతిన్.[1]

## హరికథ - పుట్టుపూర్వోత్తరములు

సామాన్యమానవుని సాహిత్యాభిరుచికి కథాశ్రవణప్రవణత్వము తొలిబీజము. సామాన్య సాహిత్యజీవులను ఆకట్టుకొనువానిలో కథాపటుత్వము కనిష్ఠికాధిష్ఠితవిషయము. ఈ కథాభిరుచితో కూర్చుండిన రసికులను కదలకుండగ మంత్రముగ్ధులను జేయు రెండవశక్తి ఆపాతమధురమైన గానము. సదస్యులను బొమ్మలవలె జేయు నైపుణ్యమునందు గానము కథకు సమప్రతిభ కలిగిన సహపాఠి. ఈ కథాగానములు రెండును ఆలాపన ప్రధానములే. మానవునకు ఆనందభిక్ష పెట్టిన మొదటి జంటకవులు ఈ కథాగానములు.

---

1. కచ్ఛపీశ్రుతులు - ఆచార్య యస్వీజోగారావుగారు

మానవుడు ఏక్షణమునందు ఆనందాన్వేషణాతత్పరుడైనాడో ఆ క్షణమే కళా దేవతకు పుట్టినరోజు. మానవునకు ఆనందాన్వేషణ పుట్టుకతో పుట్టిలో పుట్టిన బుద్ధి. అటువంటి ఆనందప్రియుడైన మానవునకు ఈ కథాగానములు మొదటి చుట్టములగుటలో ఆశ్చర్యమేమున్నది? కనుకనే ప్రతి జాతిలో ఈ గానరూపమైన కథాకథన విధానము పుట్టినది. వాని నామములు భేదింపవచ్చును. ఆఖ్యానవిధానములు భేదింపవచ్చును. పుట్టుటమాత్రము అధికారసూత్రము.

ఈ గానరూపమైన ఆఖ్యానపద్ధతి వేదకాలమునందే బీజప్రాయముగా నుండి, ఐతిహాసికయుగము నందు బాగుగా ప్రస్తరించినదని విమర్శకుల విశ్వాసము. ఆచార్య శ్రీ తూమాటి దొణప్పగారు వైదిక గ్రంథ ప్రపంచమును పరిశోధించి ఈ గానరూప ఆఖ్యానప్రసక్తి వచ్చిన కొన్ని సందర్భములను వివరించి, వారు సారాంశముగా చెప్పిన వాక్యమిది — 'పైది ఉద్ధరణలనూ, వివరణలనూబట్టి యోజించినట్లయితే వేదకాలంనాడు ఒక రకమయిన గాథలూ, గాన సంప్రదాయాలూ, ప్రవచనపద్ధతులూ ఉన్నట్లు స్పష్టమవుతున్నదేతప్ప ఆయారీతులు మన హరికథల వంటివే అని నిర్ధారించడం తొందరపాటే అనిపిస్తున్నది. హరికథకు బీజప్రాయాలైన ప్రవచనాదులు వేదకాలంనాటికి వెలసిఉన్నట్లు సరిపెట్టుకొనడం శ్రేయం'[2]

శ్రీ పాతూరి ప్రసన్నంగారు హరికథ ప్రాచీనతను గూర్చి చేసిన వివరణ మిది — 'హరికథల స్వరూపం వేదకాలము నాటిదనీ, సర్వజ్ఞులయిన అగ్నివేశాది మహర్షులు హరికథాశిల్పాన్ని తొలుదొల్త సృష్టించారనీ పండితులు నిర్ణయించారు. బ్రహ్మ మానసపుత్రుడయిన నారదుడు భక్తిసూత్రాలను ఉపదేశిస్తూ హరికథాగానం చేస్తూవుంటాడని ప్రతీతి. వేద విభజనచేసినా, అష్టాదశపురాణాలను లిఖించినా మనశ్శాంతి పొందనేరని శ్రీ వ్యాసునకు శ్రీమద్భాగవతమును విరచించి, హరికథామృతమును పంచిపెడుతూ మానవోద్ధరణ గావింపుమని నారదుడు ఆదేశించాడు. తర్వాత శుకదేవుడు, శౌనకాదిమహర్షులు, సూతుడు హరికథారూపకమైన భాగవతాన్ని భారతదేశం అంతటా ప్రచారం చేశారు'.[3]

---

2. తెలుగు హరికథా సర్వస్వం - పు - 94
3. 'కథాగానము - జాతీయ ప్రయోజనాలు' – నాట్యకళ, ఫిబ్రవరి, 1965, పు. 21

సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారి అభిప్రాయ మిది — 'నారద హనుమదాదులు హరికథకులుగా పురాణయుగమున ప్రసిద్ధికి వచ్చిరనిపించును. శ్రీమద్భాగవతమునందు హరికథల విషయమున కొంత చర్చ యున్నది. కనుక హరికథా ప్రసంగము నాటిది నేటిది కాదు; అది చాల ప్రాచీనమైనది'.[4]

కుశలవుల రామాయణగానము విమర్శకులు చూపించు మరియొక ప్రాచీన యుదాహరణము. ఇంతేకాక ప్రాచీనకాలమునందు సత్రయాగములలో హరికథా గానములు, సామూహిక భజనలు జరుగుచుండెడివని భాగవతాది గ్రంథముల వలన తెలియుచున్నది. పోతనగారి ఆంధ్రమహాభాగవతమునందు 'హరికథ' అను సమాసము అనేక పర్యాయములు దర్శన మిచ్చును.

'కలిదోషనివారకమై
యలఘుయశుల్ పొగడునట్టి హరికథనము ని
ర్మలగతిఁ గోరెడు పురుషుఁడు
వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు మహాత్మా!' 1-45

'హరివార్త లెఱుఁగువారికి
హరిపదములు దలఁచువారి కనవరతంబున్
హరికథలు వినెడివారికి
మరణాగత మోహసంభ్రమము లేదనఘా!' 1-436

'ఒప్పెడి హరికథ లెయ్యవి
చెప్పెడినో యనుచు మాకుఁ జిత్తోత్కంఠల్
గుప్పలుగొనుచున్నవి రుచు
లుప్పతిలన్ నీ మనోహరోక్తులు వినఁగన్. 2-43

'భూరి విజ్ఞానవిదులగు నారదాది
నిర్మలాత్ములకైన వర్ణింపరాని

4. 'భారతీయ సంస్కృతి-హరికథలు' అను వ్యాసము

హరికథామృతపానంబు నందు విసివి
యొల్లననువాఁడెపో వెఱ్ఱిగొల్లఁడనఘ!' 3-187

'కరములు విష్ణుమందిర మార్జనము లంద
శ్రవములు హరికథాశ్రవణ మంద' 9-82

'నీ ముఖాంబుజాత నిర్ముక్త హరికథా
మృతముఁద్రావఁద్రావ నేను వోదలె
వంతమానె నీవువట్టు నాఁకలియును
దూరమయ్యె మనము తోంగలించె' 10-11

'హరికథలు హరిచరిత్రము
హరి లీలావర్తనములు నుచితకేలిన్
బహువడి నెఱిఁగితినంతయు
సురనుత! యనుమానమొకటి చొప్పడెడి మదిన్' 12-40

పోతన మహాకవి 'హరికథ' యను పదసంపుటిని మాటిమాటికి ప్రయోగించె నని ఈ కొన్ని యుదాహరణముల వలననే స్పష్టము. ఆయన ఎన్నిమారులు ఈ 'హరికథ' ప్రసక్తి తెచ్చినను విష్ణుని చరిత్రమను అర్థమునందే కాని ఒక సాహితీప్రక్రియయొక్క సంజ్ఞగా మాత్రము కాదని ఈ ప్రయోగముల సందర్భార్థములను బట్టియే సద్యఃస్ఫురణ మగు విషయము. అంతే కాదు, పోతనయే భాగవతమునందు హరికథ అను అర్థమున : 'నరకేసరి కథనంబులు' (7-28), విష్ణుదేవ చారిత్రంబుల్' (7-6), 'విష్ణు కథనములు' (7-252); 'హరిచరితము' (10-487), 'మంగళ హరికీర్తి మహాగంగామృతము' (9-730) మొదలగు విధములుగా స్పష్టముగా వ్రాసినాడు. అంతేకాక—

'ఏ కథలయందుఁ బుణ్య
శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే

నా కథలు పుణ్యకథలని
యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్' 8-21

అను పద్యమువలన 'హరికథ' అను సమాసము నేయర్థములో ఆయన వాడు చున్నాడో భంగ్యంతరముగా తెలియజేసినాడు. కనుక విష్ణుని చారిత్రము అను అర్థము తప్ప, ఒక ప్రక్రియయొక్క సంజ్ఞగా పోతన ప్రయోగింపలేదని సారాంశము.

ఆచార్య శ్రీ తూమాటి దోణప్పగారు ఆ 'హరికథ' అను పదసంపుటికి కొన్ని ప్రయోగములు ప్రోగుచేసినారు. వానిలో ఇద్దరి ప్రయోగములు—

'చేపట్టి వేదపు (శ్రీ) హరికథలు
యేప్రొద్దు వినని హీనులము......'
'కొట్టగొనకు మతి గోరిపాడితే
జట్టిగ హరికథ చవి గలుగు......'

అనునవి తాళ్లపాక అన్నమాచార్యులుగారి ప్రయోగములు.[5]

'జిన్హ హరికథా సునీ న హింకానా
శ్రవనరంధ్ర అహి భవన సమానా'

అనునది తులసీదాసుగారి ప్రయోగము.

ఇట్లు హరికథా ప్రసక్తి అతి ప్రాచీనకాలమునుండి కలదని తెలియుచున్నది. కాని యింతవరకు గల హరికథానామ ప్రసంగము ఒక ప్రక్రియా భేదముగా మాత్రము కాదు. హరికథ యనగా కేవలము విష్ణు సంబంధమైన కథ యని మాత్రమే.

హరికథను ఒక ప్రక్రియగా తీర్చిదిద్దిన ఖ్యాతి మధ్యయుగము నందలి మహారాష్ట్రిలది. శివాజీ ప్రభువునకు గురుతుల్యుడు, సమకాలికుడు నయిన సమర్థ

5. 'తాళ్లపాక - ఆధ్యాత్మ సంకీర్తనలు' – సం. 5, కీర్తన 174, పు. 95
సం. 9, కీర్తన 21, పు. 15

రామస్వామి హరికథలను చెప్పెడివాడు. ఈ సమర్థ రామస్వామి హరికథకుడు. ధనమునకు గాక భక్తికి ప్రాధాన్య మీయవలెనని ప్రచారము చేసిన భగవద్భక్తుడు. 'దాసబోధ' యను గ్రంథమునందు హరికథకునకు సులభముగ మోక్షము కల్గునని ప్రకటించి ఉత్తమోత్తమమైన స్థానమిచ్చినవాడు. పురాణముకంటె హరికథ భిన్నమని నిర్ణయించి హరికథకు ఒక ప్రత్యేకమైన స్థానమును కల్పించిన హరికథాప్రియుడు. ఈ సమర్థ రామస్వామియే కాక, ఈ కాలమునందే మోరో పంతు వామన పండితుడు, తుకారాము (తుకోబా) మొదలైన ప్రసిద్ధ హరికథకులు మహారాష్ట్ర దేశమున యెందరో కలరు. తుకారాము శక్తిసామర్థ్యములను గూర్చి హరికథలను గూర్చి లోకమునం దెన్నియో కథలు ప్రచారమునందున్నవి కదా!

ఈ విధముగ నిప్పటికి తెలిసినంతవరకు హరికథాప్రక్రియకు ఆద్యులు మహారాష్ట్రులే. కాని నేడు ఆంధ్రదేశమునందు ప్రక్రియగా స్థిరపడిన హరికథలకు మహారాష్ట్రుల హరికథకు కొంత భేదమున్నది. మహారాష్ట్రులు ఈ ప్రక్రియకు పెట్టిన పేరు 'కీర్తన'. ఈ కీర్తనలందు 'అభంగము'ల 'వోలీ' వృత్తముల ప్రాధాన్య మెక్కువ. అభంగముల ఆకర్షణవలననే కీర్తనకు అభంగము అను పర్యాయపదము వచ్చినది. కథాప్రారంభమునకు ముందు పాండిత్యప్రకర్ష ప్రదర్శకములైన పెద్ద పెద్ద పీఠికలుండును. ప్రధాన కథకు ఈ పీఠికకు సంబంధము తక్కువ. భక్తి జ్ఞాన వైరాగ్య సంబంధములైన అనేక విషయములకు ఈ పీఠిక ఒక చర్చావేదిక. ఈ అభంగము లందు శాస్త్రీయ సంగీతమున కంత ప్రాధాన్యము లేదు. కనుక కథకుడు సర్వశాస్త్రనిష్ణాతుడు కానక్కరలేదు. గాత్ర మాధుర్య మున్న చాలును. ఇక నృత్యప్రసక్తియే దీనిలో నుండదు. ఉండునది సమయోచితమైన అభినయము మాత్రమే. ఇవి పదునేడవ శతాబ్దమునాటి మహారాష్ట్రుల అభంగముల లోని స్థూల లక్షణములు.

మహారాష్ట్ర దేశము నుండి పదునేడవ శతాబ్దమున ఈ ప్రక్రియ దక్షిణ దేశమునకు దిగుమతి యైనది. 'దక్షిణదేశమునకు హరికథా కాలక్షేపము దిగివచ్చుట 17 వ శతాబ్దిలో నటు కర్ణాటకము, నిటు తంజాపురాంధ్రనాయక రాజ్యమును మహారాష్ట్రుల కైవసమైన తరువాతనే యని తోచును'[6] అని ఆచార్య యస్వీ జోగారావు

6. 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర' – పు. 79

గారు పరిశోధించి వెలిబుచ్చిన అభిప్రాయము. కాని చిత్రమేమన, మహారాష్ట్ర ప్రభువులు ఆంధ్రదేశమునందు ఎక్కువగా ఆదరించిన ప్రక్రియ అభంగము కాదు, యక్షగానము. వారు అభంగములు తెనుగున వ్రాయించినట్లు సాక్ష్యములు లేవు. మహారాష్ట్రులు యక్షగాన ప్రక్రియను ఆదరించుటకు కొన్ని కారణము లున్నవి. ఈ యక్షగానము వారి అభంగము వలె గానరూపమైన అఖ్యానమై యుండుట, అభంగమునందు లేని వేషధారణము యక్షగానము నందుండి రూపకలక్షణము కూడ జతపడుట, అభంగమునందు అన్ని పాత్రలను ఒక్కడే అభినయించు కష్టముండ యక్షగానమునందు ఒక్కొక్క పాత్రను ఒక్కొక్కడు గ్రహించి అభినయించు సుకరమైన అవకాశముండుట మొదలగునవి ప్రధాన కారణములు.

మహారాష్ట్రుల అభంగముల ప్రభావముచే తమిళ కన్నడ దేశములందు కూడ ఈ ప్రక్రియ పేరు మార్చుకొని అవతరించినది. తమిళమున 'కాలక్షేపము', కన్నడమున 'హరికథా కాలక్షేపము' అను నామములతో వెలసినది. తమిళులకు మహారాష్ట్రులకన్న సంగీతముపై 'మోజు' ఎక్కువ. ఆకారణముచే తమిళుల కాలక్షేపములందు మహారాష్ట్రుల అభంగములకంటె సంగీతపుపాలు ఎక్కువైనది. తమిళుల కాలక్షేపము లందు కథచెప్పువానికి తోడుగా సహాయగాయకులు కూడ నుందురు. ఇది తమిళుల కాలక్షేపము నందలి క్రొత్త విశేషము. మహారాష్ట్రుల సంప్రదాయము నుపయోగించుకొని తన ప్రతిభతో కాలక్షేపప్రక్రియను తమిళులలో నెక్కువ ప్రచారము చేసినవాడు తంజావూరు కృష్ణభాగవతి. 'తంజావూరు కృష్ణ భాగవతిని (క్రీ॥ శ॥ 1841–1903) ఆధునిక కాలక్షేప సంప్రదాయమునకు పితామహునిగా పేర్కొనవచ్చును. అతడు తమిళ సంప్రదాయమునకు మహారాష్ట్ర సంప్రదాయములను సమ్మేళనము చేసి అపూర్వమైన నూతన సృష్టి కావించి కాలక్షేప బ్రహ్మగా ప్రఖ్యాతి కెక్కినాడు'.[7]

ఈ తమిళ కాలక్షేప లక్షణములే దాదాపు కన్నడ 'హరికథాకాలక్షేపము'నందు చేరినవి. అంతేకాక ఈ కర్ణాటక హరికథకులపై మహారాష్ట్రుల ప్రభావము కూడ

---

7. దాక్షిణాత్య సాహిత్య సమీక్ష 'యక్షగానములు-దృశ్యరీతులు'
—డా॥ జి. నాగయ్య, పు. 243

నున్నది. 'గోపాలభాగవత్, నంజుండభాగవత్ మున్నగువారు హరికథారచయితలే కాక హరికథాప్రయోక్తలు కూడ. వీరందరిమీద మరాఠీ కీర్తనకారుల ప్రభావము అధికముగా కన్పట్టుచుండును. వీరు గానము చేసిన కథలలో అనేకము మహారాష్ట్ర కీర్తన తరంగిణికి అనువాదప్రాయములుగా కన్పట్టుచున్నవి. పరశురామ చరిత్ర, ప్రహ్లాద చరిత్ర, సముద్రమంథన, గజేంద్రమోక్ష, యక్షప్రశ్నాఖ్య మున్నగు ప్రసిద్ధేతి వృత్తములే కాక గరుడగర్వధారణ, భద్రాయుచరిత్ర, సేవానాసి చరిత్ర, భీమమానసభక్తి, దత్తాత్రేయజన్మ మొదలగు మరాఠీకథలు నయితము కన్నడ హరికథా రంగములో చోటు చేసికొనినవి. గౌరీమహిమ, పాండురాజు, విరాటపర్వ మొదలగు కథలను చెప్పిన తుముకూరు వేణుగోపాలదాసును ఆధునిక కర్ణాటక హరికథా పితామహునిగా పేర్కొనవచ్చును'.[8] మహారాష్ట్రుల అభంగము నందు కాని, తమిళుల కాలక్షేపమునందుగాని, కర్ణాటకుల హరికథా కాలక్షేపమునందు గాని నృత్య ప్రాధాన్యము లేదు.

ఈ ప్రక్రియ 19 వ శతాబ్దపు ఉత్తరార్ధమున తెలుగు నేలపై కాలు మోపినది. మహారాష్ట్ర ప్రభువులు ఈ ప్రక్రియను అదరింపకపోయినను ఈ ప్రభువులతో ఎందరో మహారాష్ట్ర విద్వాంసులు తెలుగు దేశమునకు వచ్చి స్థిరపడిరి. వారు క్రమముగా తెలుగు నేర్చుకొని తెలుగు పండితులుకూడ నయిరి. ఇట్లు తెనుగు నందు పాండిత్యము గడించిన ఆంధ్రేతరులు అక్కడక్కడ చెదురుమదురుగా ఆంధ్ర దేశములో తెలుగులో హరికథలను చెప్పుట ప్రారంభించిరి. వీరి హరికథ లందు మహారాష్ట్రుల అభంగముల ప్రభావము, తమిళుల కాలక్షేప ప్రభావము కన్పడుచుండెడిది. అభంగములందు వలె 'వోలీ' వృత్తములు, సుదీర్ఘములైన పీఠికలు ఉండెడివి, కాలక్షేపములందు వలె సంగీత ప్రాధాన్య ముండెడిది. వీరిని జూచి తెలుగువారు కూడ మొదలు పెట్టిరి.

ఇట్టివారిలో సుదర్శనదాసుగా రొకరు.[9] వీరు 'కుచేలోపాఖ్యానము', 'కర్ణ చరిత్ర' లను హరికథలను చెప్పిరి. రాయలసీమ యందలి అనంతపుర మండలము

---

8. దాక్షిణాత్య సాహిత్య సమీక్ష - 'యక్షగానములు - దృశ్యరీతులు'
—డా॥ జి. నాగయ్య, పు. 244

9. మబుగాపు కృష్ణదాసుగారి 'మృదంగవాద్యబోధిని' – పు॥లు 25, 26

లోని హిందూపుర వాస్తవ్యులైన శ్రీ బాగేపల్లి అనంతరామాచార్యులుగారు మరియొకరు. వీరు చంద్రహాస చరిత్రము, కుచేలోపాఖ్యానము, అనసూయా చరిత్రము, సావిత్రీ చరిత్రము, సుభద్రా పరిణయము, శశిరేఖా పరిణయము, మూడు స్నూర వజ్రము మొదలగు హరికథలను జెప్పిరి. వీరి హరికథలను యక్షగానము లని పేర్కొనిరి. హరికథలను యక్షగానములని పేర్కొన్నవారిలో అనంతరామాచార్యులుగారు ఆద్యులు.

ఇట్లు తెలుగు దేశమున తెలుగువారు కూడ అక్కడక్కడ హరికథలు చెప్పుట ప్రారంభించినను, 19 వ శతాబ్దపు టుత్తరార్థము వరకు తమిళ, కన్నడ దేశములనుండి హరికథకులు తెనుగుదేశమునకు వచ్చి హరికథలు చెప్పి వెళ్లుచుండెడి వారని, 'క్రీ॥ శ॥ 1883 (స్వభాను)లో విజయనగరమున నే మెట్రిక్యులేషన్ క్లాస్‌లో మహారాజావారి కాలేజీలో చదువుచుండఁగా కుప్పుస్వామినాయుఁడను నొక హరిదాసు చెన్నపట్టణమునుండి వచ్చి విజయనగరములో నేనున్న వీథిలో కానుకుర్తివారి యింట ధ్రువచరిత్రమును బాడుచు విన్పించిన చిన్న పెద్ద లెంతయో సంతోషించిరి.'[10] అను శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారి వాక్యమువలన తెలియుచున్నది.

శ్రీ బాగేపల్లి అనంతరామాచార్యులుగారు, శ్రీ నారాయణదాసుగారు ఇంచుమించు సమకాలికులు. నారాయణదాసుగారు హరికథా రంగమున ప్రవేశించినది క్రీ.శ. 1883 లో. అప్పటినుండి హరికథాప్రక్రియ ఆంధ్రదేశమున బాగుగా ప్రచారమంది రాజసన్మానములను, గజారోహణ గౌరవములను, పండిత ప్రశంసలను అందుకొన్నది. ఒక సాహితీ ప్రక్రియగా స్థిరపడినది. సాటి సాహితీ ప్రక్రియలతో పోటీపడి ఆరు దశాబ్దములు ప్రభుత్వము చేసినది.

## హరికథ - ఒక సాహితీప్రక్రియ

'హరికథ' అను ఏకపదము ఆంధ్ర సాహిత్యమునందు ప్రబంధాదుల వలె నేడు ఒక సాహితీప్రక్రియకు సంజ్ఞ.

సాహిత్యమునందు ఏప్రక్రియయైనను సంపూర్ణ లక్షణములతో హఠాత్సంభవము కానేరదు. కొన్ని అంశములతో ప్రారంభమై క్రమముగా మరికొన్ని

10. 'నా యెఱుక' – పు. 1

అంశములను సంతరించుకొని వికాసము చెంది స్థిరపడును. అప్పుడు ఆ ప్రక్రియకు కొన్ని స్థిర లక్షణము లేర్పడును. అది ఒక ప్రక్రియగా స్థిరపడు స్థితి వచ్చునప్పటికే ఆ ప్రక్రియయొక్క ప్రధాన లక్షణములలో ఒకదానితో సంబంధమున్న నామము దానికి స్థిరపడును. అట్లు ప్రక్రియయొక్క జీవలక్షణముతో నామము స్థిరపడినను, కాలక్రమమున ఆ ప్రక్రియ ఆ జీవలక్షణ సంబంధ ప్రాముఖ్యమును కోలుపోవచ్చును. అనగా ఆ జీవలక్షణ ముఖ్యార్థమును కోలుపోవచ్చును. ఉదాహరణమునకు 'ప్రబంధము' ఆంధ్ర సాహిత్యము నందు స్థిరపడిన ఒక ప్రక్రియ. అది సంపూర్ణ లక్షణములతో స్థిరపడుటకు కొన్ని వందల సంవత్సరములకు పూర్వమే ప్రబంధము అను నామ మున్నది. అనేక విధములైన గ్రంథములను ప్రబంధము లని యనుట జరిగినది. కాలానుగుణముగా ఎన్నో మార్పులు చెంది ఒక ప్రక్రియగా స్థిరపడినది. మొదట ప్రబంధము అను నామ మేర్పడుటకు గల కారణము, ప్రక్రియగ స్థిరపడినపుడు గల ప్రబంధ లక్షణములకు సంబంధము లేదు. ఆదిలో గల కారణము ఏ గ్రంథమునకైనను లక్షణముగా సరిపోవును. అది అపుడు సర్వ గ్రంథవాచి. కాని నేడు కొన్ని లక్షణములున్న సాహిత్య గ్రంథమును మాత్రమే ప్రబంధమనుట జరుగుచున్నది. సర్వగ్రంథములను ప్రబంధము లనుట లేదు. అట్లే శతక ప్రక్రియకు 'శతకము' అను నామము సంఖ్యనాధారము చేసికొని ఏర్పడినది. ప్రారంభము నందలి సంఖ్యానియమము రాను రాను కొంత సడలినది. ప్రారంభమునం దంతగా పట్టించుకొనని మకుట నియమము కొంత గట్టిపడినది. ఏకచ్ఛందోభేదమును స్వీకరింపవలెను అను నియమము అటు ఇటు కాక ఊగులాడుచున్నది. ఏకచ్ఛందోభేదముకన్న మకుట నియమముపై కవులు ఎక్కువ శ్రద్ధ జూపుట కన్పడుచున్నది. ఉదాహరణమునకు 'శ్రీకాళహస్తీశ్వరా!' శతకములో మకుటము తప్పకుండగ పాటింపబడినది. మత్తేభశార్దూలములలో నేదో వృత్తభేదము వ్రాయుట జరిగినదికదా. అట్లే 'నాటకము' పూర్వము దశవిధ రూపకములలో ఒక భేదమునకు నామము కాగా, నేను దృశ్యకావ్య పర్యాయపదమైన రూపకమునకే మారుపేరుగా ప్రతి దిన వ్యవహారమునందు చెలామణి యగుచున్నది.

ఏ ప్రక్రియయైనను ప్రారంభము నందు ఆ ప్రక్రియయొక్క ఒక ప్రధాన లక్షణముతో సంబంధమున్న నామముతో బయలుదేరి కాలక్రమమున ఆ ప్రధానలక్షణ ప్రాముఖ్యమును పరిత్యజించినను ఆశ్చర్యము లేదు అని సారాంశము. ఈ లక్షణమే హరికథాప్రక్రియకు గూడ పట్టినది.

హరికథ అను సమాసమునకు హరియొక్క కథ అని గదా విగ్రహము. హరి యను శబ్దమునకు అర్థము లనేకమున్నను 'హరికథ' అను ఏకపదమునకు విష్ణువు యొక్క కథ యనియే రూఢ్యర్థము. ఏ కోతి కథనో, ఏ కప్ప కథనో 'హరికథ' అను సమాసముతో ప్రాచీనార్వాచీన గ్రంథము లందెక్కడను వ్యవహరించినట్లు ఒక్క సాక్ష్యముకూడ లేదు. ఈ 'హరికథ' అను నామము విష్ణు చరిత్ర అను అర్థమున ప్రారంభమైనను కాలక్రమమున సాహిత్య ప్రపంచమున మెల్లమెల్లగా ఏ దేవతామూర్తి చరిత్రయైనను 'హరికథ'గా చెలామణి కాజొచ్చినది. తరువాత దేవతామూర్తుల చరిత్రలకే కాక త్రివిక్రమావతారము ధరించి అనంత విశ్వమును ఈ హరికథానామము ఆక్రమించుకొని ఒక ప్రక్రియగా స్థిరపడినది. అది యెట్లు ఆక్రమించినదో ఆచార్య ద్రోణప్పగారు వివరించుచు, అన్నమాట లివి — 'ఆ తరువాత హరి లీలా లక్షణాలకే గాక ఆయన పరివారానికీ ఆయన భక్త పరంపరకు సంబంధించిన చరిత్రలకూ క్రమేణా విస్తరించింది. 'దేవానాంచ ఋషీణాంచ రాజ్ఞాంచోత్కృష్ణ మేధసాం పూర్వవృత్తాను చరితం ....' అన్న రీతిలో, ఆ వెనుక బ్రహ్మరుద్రులకూ, ఇంద్రాది దేవతలకూ, ఇతర దేవతాగణాలకూ అసంఖ్యాక స్థానిక దేవతాకోటికీ, విష్ణుస్వరూపులుగా పరికీర్తులయిన విశ్వంభరాధిపతులకూ, పురాణేతిహాస కావ్య రూపకాదులలో ఉపశ్లోకితులయిన మహాపురుషులకూ, దేశనాయకులకూ, జాతినేతలకూ, శాంతిదూతలకూ, ఇతర చారిత్రక వీరులకూ, సామాజికాది రంగాలలో సమధిక కృషిని సలిపిన కర్మ వీరులకూ, సతీమతల్లులకూ, రాజకీయ పక్షాలకూ, రాజకీయోద్యమాలకూ, మతప్రవక్తలకూ, మఠాధిపతులకూ, మఠాధిపతులకూ, స్వాములవార్లకూ, ఉత్తమ పదస్థులకూ, ఉదారగృహస్థులకూ, అమ్మలకూ, బాబాలకూ, బీబీలకూ, చిట్టచివరకు సాములకెల్ల బోనమిడు ఆసామియైన మామూలు రైతుకూ ఈ హరికథ వ్యాపించింది.[11]

ఆంధ్రసాహిత్యమున శతక ప్రబంధాదుల వలె హరికథకూడ ప్రారంభదశలో నామమేర్పరచ గల ప్రధానకారణమును ఉపసర్జనముచేసి మరికొన్ని ప్రత్యేక లక్షణములతో నొక సాహితీప్రక్రియగ స్థిరపడినదని సిద్ధాంతము.

### హరికథ - నిర్వచనము

ఆనందమును అనుభవించుటకు అర్హత కల్గినవారు అనేకు లుండవచ్చును కాని ఆ ఆనందానుభూతిని అవతలివారికి అందునట్లు అభివ్యక్తముచేసెడి అధికారము మాత్రము

---

11. తెలుగు హరికథా సర్వస్వం - పుటలు 82, 83.

అందరికి అందుబాటులో నుండని అసామాన్యమైన అంశము. అనుభూతిని అభివ్యక్తము చేయుటే అంత కష్టమైనపుడు, ఇక అనుభూతికి ఆధారమైనదానిని అభివర్ణించుట ఎంత కష్టమో చెప్ప పనిలేదు. చెప్ప ప్రయత్నించినను అది సంపూర్ణముగా వస్తునిష్ఠము కాలేదు. కొంత వస్తు నిష్ఠము కొంత వ్యక్తినిష్ఠమే అగును. ఎంత వస్తునిష్ఠతకు దగ్గరై ఎంత వ్యక్తినిష్ఠతకు దూరమైన అంత చక్కని అభివ్యక్తీకరణ మగును. అభివ్యక్తీకరణమే అంత కష్టసాధ్యమైన ఇక ఆ అనుభూతి సమస్తమును ఒక నిర్వచనముగా (సూత్రముగా) తెలుపుట ఎంత కష్టమో !

ప్రస్తుత విషయము హరికథ వలన కలిగెడి ఆనందమును నిర్వచించుట కాదు. ఆ ఆనందమునకు ఆకరమైన హరికథా ప్రక్రియయొక్క శరీరస్వరూప నిర్వచనము. కనుక అంత అసాధ్యమైన అంశము కాదు. కాని అంతమాత్రమున సులభసాధ్యమనుకొనరాదు. నిర్వచన మనగానే, అల్పాక్షరమై, అసందిగ్ధమై, సారవంతమై, విశ్వతోముఖమై, స్తోభరహితమై, అనవద్యమై యుండవలెనని గదా మహర్షి మాట.[12] అంతకష్టముకనుకనే వ్యాకర్తలు సూత్రరచనలో అర్ధమాత్ర తగ్గినను పుత్త్రుడు కలిగినంత సంతోషము పొందుదురట.

ఇక కొందరు పెద్దలు చేసిన హరికథా ప్రక్రియా నిర్వచనములు :-

'ఆస్తిక్యమును ధర్మాధర్మములును సర్వజనమనోరంజనముగ నృత్యగీతవాద్యములతో నుపన్యసించుట హరికథ యనబరగు. అట్టి యొపన్యాసకుడు కథకుడన బడును. దైవభక్తియు సత్యము భూతదయయు హరికథ యందలి ముఖ్యాంశములు' అని హరికథాపితామహులైన నారాయణదాసుగారు.[13]

'భక్తి రస ప్రధాన పురాణగాథలలో ఏదైన నొకటి యెత్తుకొని దానిని శ్రోతల మనస్సుల నాకర్షించునట్లు గద్యములు, పద్యములు, గానములతో సమ్మేళనము చేసి ప్రపంచించుట హరికథా కాలక్షేప మందురు' అని జయంతి రామయ్య పంతులుగారు[14]

---

12. అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతో ముఖమ్
అస్తోక మనవద్యంచ సూత్రం సూత్రకృతో విదుః

వాయుపురాణమ్-59-142

స్తోభ మనగా అర్థశూన్యమైన అక్షరము లేక అక్షర సముదాయము. హుం, ఫట్ మొదలగునవి.

అర్ధ మాత్రా లాఘవేన పుత్త్రోత్సవం మన్యంతే వైయాకరణాః.

13. ఆంధ్రపత్రిక - విరోధికృత్ సంవత్సరాది సంచిక, సం॥ 1911

14. ఆధునికాంధ్ర వాఙ్మయ వికాస వైఖరి - పు. 112

'హృద్య పద్య గేయాత్మకమై అనవద్య వచన రచనాభాసురమై సంగీత నృత్య కలా సమ్మిళితమై ఉపకథావ్యాఖ్యానాదిక బృంహితమై పండిత పామర జన రంజకమైన విశిష్ట కలారూపమే హరికథ' అని ఆచార్య శ్రీ దోణప్పగారు.[15]

'హరికథాగానం యుగయుగాల నుండి తరతరాలుగా ప్రజానీకానికి భక్తి భావ ప్రబోధకంగా ప్రచారితమగుచున్న ఒక ఆధ్యాత్మిక లలితకళా సందేశము. అది యొక సారస్వత విజ్ఞాన సర్వస్వము. హావభావ ప్రదర్శనానుగుణంగా పాడి యాడుటకు వీలాదలించు నాట్యధర్మ సునిష్ఠిత పండిత సాహిత్య సమ్మేళనా స్వరూపము' అని హరికథకాగ్రేసరులయిన శ్రీ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులు గారు.[16]

'ఆపాత మధురమైన సంగీతము, ఆలోచనామృతమైన సాహిత్యముల ద్వైరాజ్య భారమును అధ్యక్షించు ఒక అపూర్వమైన ప్రక్రియ హరికథ. ఏకకాల మున కర్ణ రసాయనము, హృదయరసానందము కలిగించు ప్రదర్శనవిశేషము' అని డా॥ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు.[17]

'గద్య పద్య గేయాత్మక సంగీత నృత్యకళావిశిష్టమగు నొక రూపకప్రక్రియ 'హరికథాకాలక్షేపము' అని నాట్యకళ సంపాదకులయిన శ్రీ పసల సూర్యచంద్ర రావుగారు.[18]

'సంగీతము, నాటకము, సందర్భోచిత హావభావ ప్రకటనాత్మకమైన యభి నయము, కవిత్వము, పెనవేసికొన్న కళాస్వరూపమే హరికథ. శ్రావ్యమైన సంగీ తము, లయానుగుణమైన నృత్యము, సందర్భోచితాభినయము, వాకోవాక్యవిన్యాస మున గోచరించు నాటకీయత, ప్రసక్తానుప్రసక్తముగా నొరలు చాటూక్తులు, హాస్య ప్రసంగములు, పిట్టకథలు, విమర్శలు, విసురులు, చెణుకులతో హరికథ శ్రోతల

---

15. తెలుగు హరికథా సర్వస్వం - పు॥ లు - 73, 74.
16. 'హరికథాపరిణామము' - రేడియో ప్రసంగము - జనవరి, 1958.
17. ఆదిభట్ల నారాయణదాస సారస్వత నీరాజనము, పు॥ 450
18. 'నాట్యకళ' - సంపాదకీయము, ఫిబ్రవరి, 1965

నానందపరవశుల గావించును' అని దాసుగారి భీష్మచరిత్ర సమీక్షకులయిన శ్రీ ఎ. ఎస్. ఆర్. ఆంజనేయులుగారు.[19]

'కథకుని కళాత్మకమయిన కథనము భారతదేశమున బహుకాలముగా భద్రా యితమైన నిధి. దేవకథా కథనము లోకమున 'హరికథ' నామమున ప్రసిద్ధముగా ఉన్నది' అని నాట్యవేదకారులైన శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు.[20]

'నృత్యగీతవాద్యాభినయములే చక్రములు. బోధనాభిరతి పెట్రోలు. మోబి లాయిలు వాఙ్మాధుర్యము. కథకుడు డ్రైవరు. గోవిందనామశ్రుతి హారను. లయ లైట్లు. ప్రేకులే పిట్టకథలు. గమ్యస్థానము మనశ్శాంతి నిలయము. సభ్యులే ప్రయాణీకులు. హరికథ మోటారు బండి' అని ఒకానొక హరికథకుని చమత్కార వ్యాఖ్యానము.[21]

ఈ నిర్వచనములు కొన్ని సూత్రాభాసములు. మరికొన్ని కాకతాళీయ ముగా చెప్పుటచే కాబోలు, సూత్రవృత్తిప్రాయములు. ఈ నిర్వచనములలో ఏ యొక్కటియు హరికథా స్వరూప స్వభావముల నన్నింటిని ఇముడ్చుకొనలేదు. సరిగా నిర్వచింపవలెనన్న ముందుగా హరికథయొక్క స్వరూపస్వభావములను కూడ కట్టుకొనుట అవసరము.

హరికథ దృశ్యకావ్యముల శాఖకు చెందిన అర్వాచీన ప్రక్రియ. అర్వాచీన ప్రక్రియ యనుటకు కల కారణము దశవిధ రూపకములలో చెప్పకపోవుటయే. అంతేకాదు 'హరికథా' ప్రక్రియ యక్షగాన ప్రక్రియకన్న కూడ అర్వాచీనము.

హరికథ దృశ్యశాఖకు చెందిన దగుటచే దీని రచనము ప్రదర్శనలక్ష్యముతో చేయబడును. దృశ్యగ్రంథ సమర్థతను ప్రమాణీకరించునది, సార్థకతను సమీ క్షించునది ప్రదర్శనము. సఫలమైన ప్రదర్శనమే దృశ్యగ్రంథమునకు సరియైన నిదర్శనము. కనుక హరికథాగ్రంథరచనము ప్రదర్శనానుకూలయోగ్యత దృష్టితో చేయవలెను.

---

19. 'ఆ॥ నా॥ దా॥ సారస్వత నీరాజనము' - పు॥ 343
20. 'నాట్యకళ' - కథాకథన కథ' అను వ్యాసము - ఫిబ్రవరి, 1965, పు॥ 25
21. 'భారతీయ సంస్కృతి - హరికథలు' అను వ్యాసము - పుట్టపర్తి

రూపకములందు ప్రతి పాత్రను ప్రత్యేకముగా ఒక్కొక్క నటుడు ధరించి పోషించును. హరికథలో ఆదినుండి అంతమువరకు ఉండునది ఒక్క కథకుడే. ఇతడే అన్ని పాత్రలను పోషించును. రూపకాదులలో ప్రతిభావంతులైన నటులు గొప్ప పాత్రలను ధరింతురు. సామాన్య నటులు సామాన్యపాత్రలు ధరింతురు. పైగా ఎవరి పాత్రను వారు పోషించుకొనుట మాత్రమే వారి బాధ్యత. హరి కథలో అట్లు కాదు. హరికథా కథకునకు అన్ని పాత్రల పోషణబాధ్యత యుండును కాన ఇతనికి తప్పకుండగ నటనశక్తి యుండవలెను. శారీరకమైన ఈ నటన శక్తితోపాటు ఇతనికి రసికజనవశీకరణదక్షమగు కథనశక్తి కూడ నుండవలెను. కనుక హరికథాకథకునకు సంగీత సాహిత్య నృత్యాభినయములందు మంచి నైపుణ్య ముండవలెను.

రూపకములలో అనేక పాత్రధారు లుండుటయే కాక, ఆ పాత్రధారులు ఆయా పాత్రలకు ఉచితమైన ఆహార్యములతో నటింతురు. హరికథలో ఆహార్య ప్రసక్తియే యుండదు. రూపకాదులలో గల ఆహార్యము రసస్ఫూర్తికి మిక్కిలి ప్రయోజనకారియైన అంశము. ఆ ఆహార్యము లేకుండగనే హరికథలో రసస్ఫూర్తి కల్గింపవలసిన శ్రమ హరికథా కథకునిపై నుండును.

రూపకములలో సకల కథాంశములు రంగస్థలముపై ప్రదర్శింపవలసినదే. అనగా దృశ్యకావ్యములలో శ్రవ్యకావ్యలక్షణము లుండరాదు. కథాగమనమునకు అవసరమై ప్రదర్శనయోగ్యములు కాని కథాంశములను అర్థోపక్షేపకముల వలన సాధింతురు. హరికథలో అట్లు కాదు. శ్రవ్యకావ్యమైన ప్రబంధములో వలె సుదీర్ఘములైన ఆలంకారిక శైలితో గూడిన వచనములు, అనేక విధములైన వర్ణనము లుండును. అనగా హరికథలో దృశ్యరీతిసంబంధములైన వర్ణనలు కలసి యుండును. హరికథను కొందరు యక్షగానప్రబంధమని యనుటకు దీనిలో దృశ్య శ్రవ్య గ్రంథముల లక్షణములు ఇట్లు చేరుటయే కారణము.

హరికథలలో సందర్భోచితముగ పిట్టకథలు, ప్రాస్తావిక శ్లోకములు, హాస్య ప్రసంగములు, 'శ్రీమద్రమారమణ గోవిందో హరి', మొదలగు హెచ్చరికలు ఉండును. ఈ అంశములేవియు గ్రంథములో నుండవు. రూపకములలో ఇట్లు గ్రంథము లందు లేనియంశము లేవియు రంగస్థలముపై జేరవు. అందువలననే హరికథ ప్రదర్శనవేళ సాంతముగా కథానిష్ఠము కాదు. కొంత కథకనిష్ఠముకూడ.

హరికథలలో రూపకములలో నుండు పద్య గద్య గేయము లుండుటయే కాక, రూపకములందుండని 'తౌహరా' లనబడు ఆఖ్యానగేయములుగూడ నుండును.[22]

రూపకములలో సన్నివేశమునకు తగిన దృశ్యములు రంగస్థలముపై ప్రదర్శింపబడును. సన్నివేశమునుబట్టి దృశ్యములు మారుచుండును. కథానుకూల వాతావరణ సృష్టికి ఈ దృశ్యములు చాల సహాయకారులు. హరికథలో ఈ దృశ్యములే యుండవు. కథాప్రారంభమునుండి కథాంతమువరకు నుండు దృశ్య మొకటియే. రసస్ఫూర్తికి దోహదము చేయు ఈ దృశ 'దృశ్యము'లు హరికథలో లేని లోపమును కథకుడు తన శక్తితో పూరింపవలెను.

దృశ్యరీతులలో హరికథ కేవలము కథక కథనైకమాత్రాశ్రిత ప్రక్రియ. అనగా హరికథలోని సర్వాంశములు కథాకథకుని కథనముపై నాధారపడియుండును. ఇతనికి తోడుగా ఫిడేలు, హార్మోనియము, మద్దెల వాద్యములను వాయించుచు ముగ్గురుందురు. కొందరు హార్మోనియమును గూడ తోడుచేసికొందురు. కథకుడు చేతిలో చిరుతలుంచుకొని తాళము వేయుచుండును.

ఇవి హరికథయందలి ప్రధానాంశములు. ఈ అంశముల నన్నింటిని కలిపి పెనవేసి అల్లిన హరికథాసూత్రమిది :-

---

22. 'తౌహరా' అను ఆఖ్యానగేయము ద్రుతకాలములో నడచు నొకవిధమైన ఛందస్సు. ఇది తెనుగు సంప్రదాయమునకు చెందినది కాదు. మరాఠీ భాషలో గల 'దోహరా' అను ఛందోవిశేషమునకు సంబంధించినది. ఇది 'ద్విధారా' శబ్దమునకు వికృతి. దీనికి 'డోరా' అనికూడ పర్యాయ వాచకమున్నది, దీనికి ప్రాసనియమము, అంత్యప్రాస నియమము, మొదట నిత్యముగా పాటించిరి, తరువాత అంత్యప్రాస నియమము కొంత సడలినది. 'లావణి' యని మరియొక మహారాష్ట్రీయ రచనకూడ కొంత కొంతగా తెలుగు హరికథలలో కలదు. లావణికూడ తౌహరా వంటిదే. దాసుగారు ఈ 'తౌహరా' లకు బదులుగా 'మంజరి' అను ఛందోవిశేషమును వాడుకొనిరి. ఇది తెలుగునందలి మంజరీద్విపద కాదు.

సంగీత సాహిత్య నృత్యాభినయవేత్త యగు కథకు డొకడె ఆహార్యశూన్యుడై బహుపాత్రాపరిపోషకుడై దృశ్యాంతరరహిత రంగ స్థలముపై నైకవిధ చమత్కారధోరణీయుత ఉపన్యాసైకమాత్ర సాధనముతో కల్గించు రసస్ఫూర్తికి ఆకరమగు ప్రబంధసదృశ ఆఖ్యాన గేయాత్మక దృశ్యరీతి హరికథ.

హరికథ.- యక్షగానము

హరికథ, యక్షగానము మొదటి నుండియు ఒకే శాఖకు చెందిన ప్రత్యేక ప్రక్రియలా? లేక ప్రారంభమునందు ఒకే ప్రక్రియయై కాలానుగుణముగా ప్రాంతీయాభిరుచులనుబట్టి రెండు ప్రత్యేక ప్రక్రియలుగా మారినవా? అను విషయమున సాహిత్య పరిశోధకులు కొంత చర్చ చేసిరి.

'ఆరంభంలో యక్షగానమూ, హరికథ ఒకటే అయినట్లు చెప్పడానికి గూడ దృష్టాంతము లున్నవి .... సిద్ధేంద్రయోగి భామాకలాపంలో హాస్యగాడైన మాధవీ, చివర ఎప్పుడో చేరుకొనే కృష్ణుడూ లేకపోతే యించుమించు అది కూడా ఏక వ్యక్తి ప్రదర్శనమే. దానికితోడు అందులో కవిప్రశంస గల పద్యంలో 'జనులార వినుడి హరికథ విన వేడుక గలిగె నేని' అని ప్రారంభిస్తూ ఆ కలాపం హరికథ అని పేర్కొనబడింది .... యక్షగాన ప్రదర్శనానికి వేర్వేరు పాత్రలు, సంధివచనాలు చెప్పే సూత్రధారుడూ అవసరము కదా. ఆ సంధివచనాలు చెప్పే సూత్రధారుడే వేర్వేరు పాత్రలు నటించడానికి వేర్వేరు నటీనటు లక్కరలేకుండా ఆ పాత్రలన్నింటినీ తానే కథాకథనంతో కలుపుకొని నటిస్తే యక్షగానం నేటి హరికథగా పరిణమించింది. అవే దరువులు, కందార్థాలు, సంవాదాలు, పద్యాలూ ఇందులోకి వచ్చాయి' అని శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు.[23]

'వానిలో నేదో సాదృశ్యము లేదనలేము. కాని రెండును పూర్తిగా వానియుత్పత్తి పరిణామములనుబట్టి యభిన్నములనలేము. జక్కుల కథలు, జంగం కథలు, హరికథలు, బుర్రకథలు—ఇవి యన్నియు గానరూపమునఁ గథాఖ్యానమే ప్రధానాశయముగాఁ బ్రారంభింపఁబడినవి. కావునఁ దత్ప్రవచనాప్రక్రియ

23, 'ఆంధ్ర వాగ్గేయకారచరిత్రము' - పు. 466

లలోఁ గొంత సాదృశ్యము గోచరించినను, వాని వాని ప్రయోగపక్కికలు వేఱు. ప్రయోజనములు వేఱు' అని ఆచార్య శ్రీ యస్వీజోగారావుగారు.[24]

'ఇప్పుడు హరికథాగానము చేయు కథకుడు కథాసందర్భమున వచ్చు పాత్రల మధ్య పరస్పర సంభాషణ స్థాయీభేదముతో సాగిస్తూ సంధివచనములతో కథను కలుపుకుంటూ కథలోని భూమికలనన్నింటిని తానొకడై నటించుచున్నాడు. కనుక యక్షగానమునకు హరికథాగానమునకు వ్యత్యాసము లేదని బుజువు చేయ వచ్చును.' అని 'కథకరత్న' శ్రీ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితులుగారు.[25]

'యక్షగాన హరికథలు రెండింటికిని సామ్యములు కంటె వైషమ్యము లెక్కువగా నున్నవి. యక్షగానములలో సూత్రధారుడు చివరవరకు నుండును. బహుపాత్రలు కూడ నుండును. హరికథలలో ఒకడే కథ నుపన్యసించును. రూప ప్రదర్శనావకాశము లేనియెడ ఏకపాత్రాభినయమునకు పనికివచ్చునని హరి కథలను రచించి యుందురు. యక్షగానములు ప్రదర్శనయోగ్యములు. కాని హరికథలు ఉపన్యసించవలసిన ప్రక్రియలు. హరికథలు ఆధునికములు. యక్ష గానములు ప్రాచీనములు. యక్షగాన రచనాకాలములో హరికథా రచన చేయబడి నట్లు తెలియరాదు. కేవలము ఆధునిక యుగములో తెలుగులో ఆరంభించిన హరి కథకులు మాత్రమే తమ హరికథలను యక్షగానములుగా పేర్కొనిరి' అని డా॥ జి. నాగయ్యగారు.[26]

'స్వాకృత మృదు యక్షగాన ప్రబంధసరణి
వివిధ దేశంబులం బిన్నపెద్దలు గల
పలు సభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభిమానమేల ?'

హరికథా పితామహులైన శ్రీ ఆదిభట్ల నారాయణదాసుగారు.[27]

---

24. 'ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర' - పు. 78
25. 'హరికథా పరిణామము' - రేడియో ప్రసంగము, జనవరి 1958
26. 'దాక్షిణాత్య సాహిత్య సమీక్ష' - పు॥లు 248-249
27. దాసుగారు వ్రాసిన "హరికథ" అనువ్యాసము. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (1911)

ఇంక ఎందరెందరో హరికథా గ్రంథరచయితలు తమ హరికథా గ్రంథము లను యక్షగాన ప్రబంధములనియు, యక్షగానములనియు పేర్కొనిరి. హరికథను యక్షగానమన్న హరికథకులలో శ్రీ జాగేపల్లి అనంతరామాచార్యులుగారు ఆద్యులు. హరికథను యక్షగానప్రబంధ మన్నవారిలో నారాయణదాసుగా రొకరు.

యక్షగాన ప్రక్రియకు, హరికథా ప్రక్రియకు కొంత సాదృశ్యమున్నదని పై అభిప్రాయములలో గల సమానాంశము. సాదృశ్యమున్నమాట సత్యమే. ఆ సాదృశ్యమే లేనిచో సంబంధచర్చకు అవకాశ మేమున్నది? కాని ఆ సంబంధ మెట్టిది; అను దానిదగ్గర మాత్రము పై అభిప్రాయములలో భేదము కనిపించు చున్నది. హరికథాప్రక్రియ పుట్టుపూర్వములను త్రవ్వినచో హరికథకు యక్షగానమునకు ఉన్న సంబంధ మేదో బయటపడును.

హరికథ ప్రక్రియ కీర్తన అను పేరుతో పుట్టినది మహారాష్ట్ర దేశమున అను అంశములో నెవనికి రెండవ అభిప్రాయము లేదు కదా, కనుక హరికథ పుట్టుకకు యక్షగానమునకు సంబంధము లేదనియే కదా అందరి భావము.

మహారాష్ట్ర ప్రభువులు ఎక్కువగా ఆదరించినది యక్షగానమునైనను, ఆ ప్రభువులతో తెలుగు దేశమునకు వచ్చిన మహారాష్ట్ర పండితులు తెనుగున పండితులై తెనుగున హరికథలు చెప్పిరనుట నిర్వివాదాంశముకదా. 19 వ శతాబ్దములో గూడ నిట్లు తెనుగున హరికథలు చెప్పిన మహారాష్ట్రీయులు కలరని సాక్ష్యము లున్నవి కదా. రసస్ఫూర్తి కల్గించుటకు యక్షగానమార్గముకన్న హరికథామార్గము చాల శ్రమ యని తెలిసియు ఆ పండితులు హరికథలు చెప్పుటకు కారణము మాతృదేశ ప్రక్రియపై గల అభిమానమే కదా. లేదా ఎన్నో తరాలనుండి వచ్చిన అనుబంధము. ఈ రెండును కాదన్నచో, సులభమార్గమున్నపుడు కష్టమైన విధానమును ఎంత తెలివితక్కువవాడు కూడ చేపట్టడు. జనుల నాకర్షింపదలచిన వాడెవడు అసలే చేపట్టడు. యక్షగానమునకు మహారాష్ట్ర ప్రభువుల కాలమున ఎంత రాజయోగము పట్టినను, హరికథకు రంగయోగము సాంతము లేకుండగ బోలేదు. కనుక హరికథగూడ యక్షగానముతోపాటు ఉన్నట్లే కదా.

19 వ శతాబ్ది మధ్యభాగమున చెప్పిన హరికథలలో గూడ మహారాష్ట్రీయము లయిన అభంగములు, వోలీ వృత్తములు, పాండిత్యప్రదర్శకములైన సుదీర్ఘోపోద్ఘాతములు కలవు కదా. నేటికిని 'తొహరా' లు కన్పడుచున్నవి కదా. ఇవి ఏ విధముగను యక్షగాన ప్రక్రియతో సంబంధములేని అంశములు కదా.

ఈ యంశము లన్నియు చూచినపుడు హరికథకు యక్షగానమునకు ఉన్నది జన్యజనక సంబంధము కాదనియే యనిపించును. కాని శ్రీ రజనీకాంతరావు గారన్నట్లు యక్షగానము లందలి దరువులు, కందార్థములు, సంవాదములు, పద్యములు హరికథలలో చేరినమాట యథార్థము. కాని యివి యిట్లు చేరుట హరికథలపై యక్షగానముల ప్రభావమును సూచించును—అని ఎందులకు అనుకొనరాదు? జన్యజనక సంబంధమని యేల యనుకొనవలెను?

ఆ మాటకు వచ్చిన కన్నడదేశమునందు యక్షగానమును కూడ హరికథగా చెప్పు పద్ధతి ఒకటి ఆధునిక కాలమున బయలుదేరినదని శ్రీ ముట్నూరి సంగమేశం గారి—'అసలు వేషరచన కూడా మానుకొని మద్దెల, జేగంట, హార్మోనియం, శ్రుతి అనేవి సహాయంగా తీసుకొని ఒకాయన యక్షగానరచన గానం చేస్తూవుంటే, మరో నలుగురు వేర్వేరు పాత్రలను పంచిపుచ్చుకొని, కులాసాగా నాటకీయపద్ధతిలో సంభాషణలు నెరపడం అనే మర్యాద కూడ దక్షిణ కన్నడ ప్రాంతంలో పాతిక ముప్ఫై యేళ్లనుండి బయల్దేరింది. దీనిని 'తాళమద్దెల' అని పిలుస్తారు. ఇందులో ఆటగాని, అభినయంగాని, వేషంగాని ఏమీ లేవు. ఒకరు చెప్పే హరికథ నలుగురు పంచుకొని చెపుతూన్నట్లుంటుంది'[28] అన్న వాక్యములవలన తెలియుచున్నది. ఇది యక్షగాన ప్రక్రియపై హరికథాప్రక్రియ ప్రభావమును సూచించును. అంతే కాని ఆధునిక కాలమున బయలుదేరిన సంప్రదాయమగుటచే జన్యజనక సంబంధమును నిర్ధారించుటకు ఉపయోగపడదు.

కనుక పై అంశములలో నెక్కడను హరికథా యక్షగానములకు జన్యజనక సంబంధమును ధ్రువపరచెడి అంశములు కన్పడవు. కన్పడునవి సదృశాంశములు.

---

28. 'బయలాట' అను వ్యాసము - ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక - 4-1-1956, పు. 64

సాదృశ్యము లెక్కువగానున్నను జన్యజనక సంబంధ మంటగట్టుట శాస్త్రీయము కాదు. కావ్యమునకు ప్రబంధమునకు ఎన్ని సాదృశ్యము లున్నవి ? దశవిధ రూపకములలో ఎన్ని సాదృశ్యము లున్నవి ? కావ్య ప్రబంధములకుగాని, దశవిధ రూపకములలో నొకదాని కొకటి గాని జన్యజనక సంబంధమును ఏ సాహితీవేత్తయైన తెలిపెనా ? ఇక యక్షగానములను గూర్చి పరిశోధన చేసిన ఆచార్య శ్రీ యస్వీజోగారావుగారు 'హరికథ నుండి యక్షగాన ముత్పత్తియైనదని యెవరైన నన్నచో నది ముధావాద మగును. అదియుఁగాక యీ వాదము యక్షగాన నామోత్పత్తిని సమర్థింపదు గదా. ఇఁక యక్షగానమే హరికథగాఁ బరిణమించినదను వారును గొందఱు గలరు. కాని యిదియు నవిచారమూలకమగు నభిప్రాయమే. రెండింటి యుత్పత్తి వేర్వేఱనియు, రెండును గొంత సదృశప్రక్రియ లగుటచే వానికిఁ జారిత్రక కారణముల వలన సాన్నిహిత్య మేర్పడఁగాఁ గొంతకుఁ గొంత సంబంధమును నేర్పెడెనని తలంపవలసి యున్నది'[29] అని నిగ్గు తేల్చిరి.

కనుక హరికథా యక్షగాన ప్రక్రియల కున్నది జన్యజనక సంబంధము కాదు, ఈ రెంటగల సాదృశ్య సాక్ష్యములచే అనిపించునది, వీనికున్నది సాహచర్య సంబంధము.

హరికథ - దాసుగారు

నారాయణదాసుగారికి రసికలోక మిచ్చిన బిరుదము హరికథాపితామహుడు పితామహ శబ్దమున కర్థము బ్రహ్మ యని కదా ! అనగా ఈ బిరుదము ప్రకారము నారాయణదాసుగారు హరికథా ప్రక్రియకు ఆద్యులు కావలెను. అంతే కాదు. ఈ బిరుదము ప్రకారము దాసుగారికి పూర్వము హరికథలు లేవా ? హరికథా కథకులు లేరా ? అను ప్రశ్నల కవకాశము కలుగును. కాని నారాయణదాసుగారు హరికథారంగమున ప్రవేశించునాటికే ఆంధ్రదేశమున హరికథా ప్రక్రియ కలదనియు, హరిదాసులు కలరనియు, హరికథాగ్రంథకర్తలు కలరనియు తెలియుచున్నది. ఇక మరి నారాయణదాసుగారు హరికథా ప్రక్రియకు ఎట్లు ఆద్యులు ? వీరిపట్ల హరికథాపితామహ బిరుద మెట్లు సార్థకము ?

దీని కొక్కటే సమాధానము — దాసుగారు హరికథా ప్రక్రియను అనేక విధముల అభివృద్ధిచేసి దాని బహుళ ప్రచారమునకు కారకులయిన మహాపురుషులు.

29. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - పు. 82

ఆంధ్రదేశ క్షోణి యంతట హరికథా బీజాలు చల్లిన పెద్ద రైతు. అస్థిపంజర ముగా నున్న హరికథాప్రక్రియను సమాంసలముగా తీర్చిదిద్ది ప్రాణప్రతిష్ఠ చేసి ఆంధ్రదేశ మంతటను ఉత్సవములు చేయించిన ఘనులు. కనుక ఈ ప్రక్రియకు ప్రధాన ప్రచారకుడుగా ఈ బిరుదు సార్థకము. పెద్దనకు పూర్వము తెలుగున కవిత పుష్కలముగ నున్నమ పెద్దనను కవితాపితామహు డనుటలేదా?

మరియొక విశేషము. దాసుగారు హరికథారంగమున ప్రవేశించువరకున్న హరికథాచరిత్ర దాసుగారికి పూర్వమునందున్న చారిత్రిక పూర్వరంగమే కాని, దాసు గారి హరికథాకథక జీవితమునకు మాత్రము పూర్వరంగము కాదు. దాసుగారిపై పూర్వ హరికథల ప్రభావము వీసమంతైనను లేదు. దాసుగారు హరికథా కథకు లగుటకు కారణములు మూడు. వారి స్వభావలక్షణమైన సంగీతప్రియత్వము మొదటి కారణము. ఇది అంతరంగికమైన అజన్మసిద్ధమైన కారణము. దాసుగారు విద్యార్థిగా నున్నప్పుడు విజయనగరము నందు యక్షగాన ప్రదర్శనము లెక్కువగా జరుగుచుండెడివి. ఇవి చూచినపుడు అభినయముపై ఆసక్తి హెచ్చినది. ఇది రెండవ కారణము. విజయనగరమందే కుప్పుస్వామినాయుడు అను దాక్షిణాత్యుడు ధ్రువచరిత్ర హరికథను ఆడుచు పాడుచు చెప్పుటను జూచి దాసుగారు, సంగీత సాహిత్య నృత్యములకు హరికథ సరియైన ప్రక్రియ యని నిర్ణయము చేసికొని హరిదాసుగా మారిరి. ఇది మూడవ కారణము, ముఖ్యకారణము.

ఒక్కొక్క మహావ్యక్తి కరస్పర్శచే ఒక్కొక్క ప్రక్రియ అమృతత్వము సాధించును. తిరుపతి వేంకట కవుల వలన ఆధునిక యుగమున అవధానప్రక్రియ అట్టి గౌరవమును గడించుకొన్నది. అట్లే నారాయణదాసుగారి వలన హరికథా ప్రక్రియ ప్రజలను ప్రతిదినము పలకరించు దగ్గరి చుట్టమైనది.[30] దాసుగారు హరి కథను చేపట్టినది 1883 లో. అప్పటిదాక హరికథాప్రక్రియ ఎక్కడనో మారు మూలలందు ఏదో కొంతమందిచేత చెదురుమదురుగా పలుకరింపబడుచు నామమాత్ర ముగ నున్నది. అట్లు ఎక్కడనో మారుమూలలందు అసూర్యంపశ్యగా, అనాథగా నక్కియున్న హరికథాప్రక్రియ కళాకళత్రులయిన దాసుగారి కరగ్రహణముచేత

30. చిత్రముగా చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి, ఆదిభట్ల నారాయణదాసుగారి సాహిత్య జీవితములలో సమానాంశము లనేక మున్నవి. ఈ పోలికలు "చెళ్లపిళ్ల–ఆదిభట్ల" అను వ్యాసరూపమున అనుబంధముగా కలవు.

సాటి ప్రక్రియలతో పోటీపడి ఆరు దశాబ్దములు ప్రభుత్వము చేసినది. అంతింతని యనలేని యెనలేని ప్రకాశముతో జగజ్జ్యోతియైనది. సూర్యచంద్రుల నెరుగని అందులు వందలకొలది యుందురుకాని, దాసుగారు గ్రహించిన హరికథాజ్యోతి నెరుగని అంధుడు ఒక్కడయినను ఆంధ్రదేశమున లేడు. దాసుగారు చేపట్టుటకు ముందు హరికథను ప్రత్యక్షముగా నెరిగినవారు అక్షరాస్యులలో కూడ తక్కువ. దాసుగారు చేపట్టిన తరువాత హరికథను ఎరుగని నిరక్షరాస్యుడు కూడ లేడు. దాసు గారి హరికథకు టిక్కట్టు పెట్టినను దూరప్రాంతముల నుండి బండ్లమీద వచ్చిన ప్రజలు, అందక వెనుతిరిగి నిస్పృహతో వెళ్లిన సందర్భము లనేకము. దాని కొకటే కారణము. వారు కేవలము పుస్తకమును పఠించెడి హరిదాసు కాదు. ఒకే హరికథ భిన్నభిన్న ప్రదేశములలో ప్రేక్షకుల అభిరుచినిబట్టి సంగీతసభగనో, సాహిత్యసభగనో, శాస్త్రసభగనో మారుచుండెడిది. సభాభిరుచినిబట్టి సంగీతవిద్వాంసు లకు మహాసంగీత విద్వాంసులుగ, నృత్యకళామర్మజ్ఞులకు మహానృత్యకళామర్మజ్ఞు లుగ, సాహితీవేత్తలకు మహాసాహితీవేత్తలుగ దర్శన మిచ్చిన సర్వకళాస్వారస్య స్వరూపులు, హరికథకు గజ్జెకట్టువరకు దాసుగారు కేవలము హరిదాసు. గజ్జె కట్టిన తరువాత కొంతసేపు మహానటుడు. కొంతసేపు మహాగాయకుడు. కొంత సేపు విద్యాస్నాతకులను గూడ తికమకలు పెట్టించు విద్వద్విద్వద్వరుడు. కొంత సేపు కడుపుబ్బ నవ్వించు విదూషకుడు. అది యిది యననేల సభాభిరుచినిబట్టి యే యవతారమైన నెత్తగల మూర్తీభూత సకలకళాస్ఫూర్తి.

దాసుగారి హరికథను విన్నవా డెవడయినను, హరికథా ప్రారంభమునకు ముందు 'శంభో' అని పెద్దగ పెట్టు వారి కేకను బ్రతికియున్నంతవరకు మరువ లేడు. ఆ ధ్వనిని విని రచనలలో ప్రతిధ్వనించిన కవు లనేకులు.

దాసుగారి హరికథ పామరులకే కాదు. పండితులకు గూడ ఆనందప్రదము, విజ్ఞానప్రదము. విద్యాశూన్యులనే కాదు విద్యామాన్యులను గూడ సద్యఃపరవశు లను జేయు పరుసవేది. దాసుగారి హరికథను సమకాలిక పత్రికలన్నియు పనికట్టు కొని ప్రశంసించినవి. ఇక సునిశిత పరిశీలకులయిన కవు లూరక యుందురా? పైగా సద్రసాకృతులకు తమ కృతులలో అక్షరాకారములు కల్పించి తృప్తి చెందుట కవులకు స్వభావలక్షణము కదా. చంద్రుని జూచి సంద్రము పొంగుట, అంద మును జూచి యానందము బిందులు త్రొక్కుట సార్వకాలిక సత్యములు కావు,

పాక్షిక సత్యములు. కాని జగదానందకరుడయిన కవికి జగదానందకరమైన వస్తువు లభించిన కలుగు ఆనందము మారుతప్రసరణము వలె సార్వకాలికము. మంచి ముడిపదార్థము లభించిన వారు చిత్రించు అక్షరాకారములు అక్షరాకారములై నిత్యనూతనములై దర్శనీయము లగునని కవుల ఆశ. ఇక ఇట్టి ఆనందప్రదమైన వస్తువు లభించిన మౌనము వహింతురా? వారి కలములు కిదను త్రొక్కిసవి. కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి లేఖిని నారాయణదాసుగారి మహాస్సు స్వర్గమం దెట్లు తిరుగుచున్నదో ఊహించి వివరించుచున్న విధానము—

'ఎవఁడురా! యచట తెండిం కొక్కగ్లాసంచు
అమృత రక్షకులకు నాజ్ఞ యొసఁగి
'సుధ కంటె మా హరికథ లెస్స' యని బృహ
స్పతితోడ నర్మభాషణము నెఱపి
'ఏమమ్మ వాణి! యేదీ వీణ! సరిక్రొత్త
తీవలా' యని గిరాందేవి నడిగి
'ఆగవే రంభ! ఆ హస్తముట్టులు గాదు
త్రిప్పిపట్టు' మటంచు తప్పు దిద్ది

'ఏమయా! క్రొత్త సంగతులే' మటంచు
బ్రహ్మ మానసపుత్త్రుని పలుకరించి
ఆదిభట్ల నారాయణాఖ్యము మహాస్సు
తిరుగు నిందందు స్వర్గమందిరము లందు'[31]

ఇన్ని మాటలతో పని యేల? హరికథాప్రక్రియను సకలేంద్రియ సంతర్పణముగా, సాంద్రకళాకేంద్రముగా తీర్చిదిద్దిన హరికథాశిల్పసమ్రాట్టు శ్రీ ఆదిభట్టు.

దాసుగారు హరికథాప్రక్రియకు ఒక ఉదాత్తస్థానము నిచ్చి ప్రచారము చేసిరి గాని దాని నొక కాలక్షేపప్రక్రియగా, ఒక వినోదక్రీడగా దేశమునందు త్రిప్పలేదు. తన జాతి యందు భగవద్భక్తి, నీతి నెలకొల్పు ఒక అమూల్యసాధనముగాభావించిరి.

31, 'ఉదయశ్రీ' - తృతీయభాగము – ఆదిభట్ల నారాయణదాసు.

ఈ ప్రక్రియ కల్గించు ఆనందమును ప్రధానమైన ఆ ఉపదేశౌషధమునకు ఒక అను పానముగా మాత్రమే ఉపయోగించుకొనిరి. అందులకే వారి హరికథ లన్నియును భగవత్సంబంధములు, నీతిబోధకములు. హరికథపై, హరికథకునిపై దాసుగారు వెలిబుచ్చిన అభిప్రాయములు వారెంత భక్తిశ్రద్ధలతో హరికథను ఆరాధించిరో తెలుపును.

'ఆస్తిక్యమును ధర్మాధర్మములను సర్వజనమనోరంజకముగ నృత్య గీత వాద్యములతో నుపన్యసించుట హరికథయనఁ బరఁగు. అట్టి యుపన్యాసకుఁడు కథకుఁడనఁబడును. దైవభక్తియు, సత్యము, భూతదయయు హరికథ యందలి ముఖ్యాంశములు.'

'హరికథాశ్రవణము వలన శ్రోతలకు నిఖిలశ్రేయోభివృద్ధి యగును. కథకులకుఁ గూడ ధర్మార్థ కామ మోక్షములు లభించును. శ్రుతి స్మృతి విజ్ఞానము, శబ్దానుశాసనజ్ఞత, అభిధాన ప్రవీణత, ఛన్దఃప్రభేదవేదిత్వము, అలంకార కౌశలము, రసభావ పరిజ్ఞానము, దేశస్థితి చాతురి, నానాభాషావైశద్యము, సర్వకాకు విశారదత్వము, కలాశాస్త్రనైపుణి, తూర్యత్రితయచాతుర్యము, హృద్యశారీరశాలిత, లయ కాల కలాజ్ఞానము, ప్రభూత, ప్రతిభోద్భూతభాక్త్వము, సుభగగీయత, దేశీయ రాగాభిజ్ఞత్వము, వాక్పటుత్వము, సభావిజయసామర్థ్యము, రాగద్వేష పరిత్యాగము, ఉచితజ్ఞత, సార్ద్రత్వము, అనుచ్ఛిష్టోక్తి నిర్బంధము, సూత్నధాతు వినిర్మాణదక్షత, పరచిత్తపరజ్ఞానము, ప్రబంధప్రగల్భత, ద్రుతగీతవిరచనానైపుణి, పద్యాంతరవిదగ్ధత, త్రిస్థానగమనప్రౌఢి, వివిధాలప్తి నిపుణత, విశేష వధానశక్తి, రమ్యరూపము, స్వేచ్ఛాసంచారము, స్వతంత్ర జీవనము వాగ్గేయకారుఁడగు నుత్తమ కథకునిలక్షణములు,

'ఘన శంఖమో యన గంఠంబు పూరించి
మేలుగ శ్రుతిలోన మేళవించి
నియమము తప్పక నయ ఘనంబులఁ బెక్కు-
రాగ భేదంబుల రక్తి గొల్పి
బంతు లెగిర్చిన పగిది కాలజ్ఞతన్
జాతి మూర్ఛనలొప్ప స్వరము పాడి

చక్కని నృత్యము సర్వరసాను కూ
లంబుగాఁగ నభినయంబు చేసి

స్వకృత మృదు యక్షగాన ప్రబంధసరణి
వివిధదేశంబులం బిన్న పెద్దలు గల
పలు సభల హరిభక్తి నుపన్యసింప
లేని సంగీత కవితాభి మాన మేల?'[32]

ఈ యభిప్రాయముల వలన దాసుగారు హరికథను ఎంత శ్రద్ధాభక్తులతో ఉపాసించిరో, ఉత్తమ కథాకథకునకు ఏ యే లక్షణము లుండవలెనని భావించిరో తెలియుచున్నది. ఇట్లే మరియొకచోట కావలెనని కల్పించుకొని చెప్పిన హరిదాస లక్షణము—

సాత్త్వికాహార నిరతః సర్వభూతదయాపరః
సంసార విముఖో యోగీ హరిదాస ఇతి స్మృతః॥[33]

దాసుగారు చెప్పిన ఈ లక్షణము లన్నియు హరిదాసులలో నుండుట సాధ్యమగునా? అని వెంటనే కలుగు సంశయము. ఉండవలెనని వారి ఆశయము.

సరియైన హరిదాసు చాల గొప్పవాడనియు, సామాన్యులు హరిదాసు గొప్పతనమును గ్రహింప లేరనియు దాసుగారు అన్న మాట లివి—

నాగస్వరము పాట నాగుపాము యెఱుఁగు
తుంగ దుబ్బునఁ దిగ్గు తుట్టేమి యెఱుఁగు?
జ్ఞాని యెఱుంగు సుజ్ఞానుల మఱుఁగు
నజ్ఞాని యేమెర్గు హరిదాసు తెఱఁగు?[34]

దాసుగారు హరిదాసులకు అంతకు మున్నెన్నడును లేని అత్యున్నత స్థానము కల్పించిరి. దాసుగారికి పూర్వము ఆంధ్ర దేశములో హరికథకులే తక్కువ.

32. దాసు గారు వ్రాసిన 'హరికథ' అను వ్యాసము —
ఆంధ్ర పత్రిక, సంవత్సరాది సంచిక, 1911
దాసుగారు చెప్పిన ఈ లక్షణములు సంగీత రత్నాకరము నందలివి.
33. శ్రీ హరికథామృతము - పు - 81
34. జగజ్జ్యోతి - ప్రథమ - పుట - 63

ఉన్నవారిలో కూడ హరికథను ఒక గొప్పకళగా ఆరాధించి, ఒక గొప్ప ప్రక్రియగా తీర్చిదిద్దగల ప్రతిభావంతు లంతకంటె తక్కువ. హరికథా ప్రక్రియను జీవనో పాధిగ నుపయోగించుకొనువారెక్కువ. హరిదాసుల శక్తి లోపము వలన గాని, దైన్యస్థితి కారణము వలన గాని ప్రజలకు హరికథలపై ఆసక్తి పెరుగలేదు. హరి దాసులు కూడ ఊరి పెద్దల చెంత 'చిత్తము చిత్తము' వల్లెవేయుచు వారి లౌకిక జీవితము గడపుచుండెడివారు. దానితో హరిదాసులన్న లౌకిక ప్రపంచము నందు గౌరవముండెడిది కాదు. ఇక గజారోహణములు కాని, రాజసత్కారములు కాని మానసిక దారిద్ర్యముతో నున్న ఈ హరిదాసుల ఊహాపథములలో కూడ మెద లెడివి కావు. ఇట్టి దీనస్థితిలో నున్న హరికథకునకు అత్యున్నతస్థితి కల్పించిన మహనీయులు దాసుగారు. దాసుగారు హరికథకులుగా గండపెండెరములు గడిం చిరి. గజారోహణ గౌరవములను పొందిరి. రాజాస్థానములందు సత్కరింప బడిరి. ప్రముఖ పట్టణము లన్నింటి యందు సన్మానింపబడిరి. సంగీత కళా శాలలో ప్రిన్సిపాలు పదవి నలంకరించిరి. లెక్కలేనన్ని బిరుదములు పక్కజేరి నవి. అవి యివి యన నేల? హరికథకులుగా దాసు గారు పొందని గౌర వమే లేదు.

హరికథాప్రక్రియకు పండితమండలి చేత కూడ ప్రణామములు చేయించిన ప్రజ్ఞాస్వరూపులు దాసుగారు. దాసుగారికి పూర్వము హరికథను పండితులు గౌరవ దృష్టితో చూచెడివారు కారు. హరికథను సాహిత్య గంధములేని సామాన్య జనుల యందు భక్తి జ్ఞానములను నెలకొల్పుట కుపయోగపడు ప్రక్రియగా మాత్రమే పట్టించుకొనెడివారు. హరికథయన్నను, హరిదాసు అన్నను శాస్త్రనిష్ణాతులయిన విద్వాం సులకు తేలికభావ ముండెడిది. దాసుగారు మహావిద్వాంసులై హరిదాసులపై గల ఆ చిన్నచూపును తొలగించిరి. దాసుగారు హరికథను విజ్ఞాన వేదికగా, సర్వకళా సంస్థగా చేసెడివారు. వారి హరికథలు శాస్త్రసభలయిన సందర్భము లనేకము. సభనుబట్టి వారి హరికథ అవతార మెత్తుట సాధారణ లక్షణము. దాసుగారు కథను వీడి యిట్లు సాముచేయుట హరిదాసు అసామాన్యుడు అని తెలుపుటకొరకే. తాము మహాపండితులమని తెలుపుటకొరకే, హరికథాప్రియులయిన దాసు గారు హరికథల కన్న ఇతర గ్రంథము లెక్కువగా వ్రాయుట ఇందులకే. దాసుగారి పాండిత్యము నకు పండిత ప్రపంచము ప్రణమిల్లినది. మచ్చునకు ఒక్క పండితుని ప్రశంస—

'ఆపాటి యీపాటి యవధాని యధికారి
యగునె? నీబుక్సంగ్రహమ్ము కొరుక
వట్టి 'ఎం. ఏ.' తలంబట్టునే నీ నవ
రసతరంగిణిలోని రసకణంబు
పాణినితో నెంతొ పాతటీకము లేక
తాఁకఁగలారె? నీ తారక కృతి
పారసితో నాల్గుబాసల మున్ని నీ
యుమ్మర్కయామ్ చేత నూనపలయు
బ్రహ్మవా? మగరూపునఁ బరగువాని
రాణివా? కానిచో నిట్టి ప్రతిభ కలుగు
నృహరికై నాల్గుమూలల నెమకుచుంటి
నేడనున్నాఁడొ? సత్కవీ? నీవె తెలుపు'[35]

ఇట్లు దాసు గారు కష్టపడి హరిదాసులకు పాండిత్యముండదు అను అపవాదును తొలగించిరి.

దాసు గారు శుద్ధ సంగీతవిద్వాంసుల 'పాటకచేరి'ల కంటె హరికథను మిన్నయైనదానిగా చిత్రించిరి. సంగీత విద్వాంసునికన్న హరికథకుడు గొప్ప యని చాటిరి. సంగీతవిద్వాంసుడు తన సంగీతవైదుష్యప్రదర్శనమునకు ప్రత్యేకముగా నొక సభ పెట్టుకొనవలెను. హరిదాసున కా బాధ లేదు. సంగీతము హరికథలోని ఒక అంగము. అంతే కాదు హరిదాసు సంగీతము భగవత్కథాసంబంధము. సంగీతజ్ఞుని 'పాటకచేరి' కథాసంబంధ ముండదు. హరికథాసంబంధము లేని సంగీతము వ్యర్థమని దాసు గారి స్థిరాభిప్రాయము.

ఉత్తముడయిన హరిదాసు వాగ్గేయకారుని కన్న మిన్న యని ప్రదర్శన రూపముగా ప్రచారము చేసిరి. వాగ్గేయకారుని యందు సంగీతజ్ఞాన ముండుట దృష్ట విషయము. గాత్రమాధుర్య ముండుట అదృష్టవిషయము. ఉత్తముడయిన హరి దాసు తాను చెప్పు కథలను, ఆ కథలలో గల కీర్తనలను తానే వ్రాసికొనును.

35. 'నా యెఱుక'—'పూజాపుష్పాలు' — శ్రీ ఈశ్వర సత్యనారాయణ, పు. 3

ఐతనికి గాత్రమాధుర్య ముండి తీరవలెను. కనుక హరిదాసు వాగ్గేయకారునికన్న గొప్పవాడని వీరి నిర్ణయము. దాసుగారు వాగ్గేయకారులయిన హరిదాసులు.

సరియైన హరిదాసు తాను వ్రాసిన కథలనే ఆడి పాడి చెప్పునని దాసుగారి అభిప్రాయము.[36] అప్పుడే తన ప్రత్యేకత వెల్లడి యగునని వీరి మతము. దాసుగారు వారు వ్రాసిన కథలనే చెప్పిరి.

దాసుగారు తెలుగు హరికథ అందు కొన్ని క్రొత్త లక్షణములను ప్రవేశ పెట్టిరి. వానిలో నృత్యము ముఖ్యము. మహారాష్ట్రుల ప్రక్రియయైన హరికథకు సంగీతమును అధికముగా జోడించి నేర్పినవారు తమిళులు. నృత్యము నేర్పినవారు నారాయణదాసుగారు. దాసుగారికి పూర్వము హరికథ అందు నృత్యము లేదు. ఉన్నది అభినయము మాత్రమే. సంగీత విషయమునందు కూడ దాసుగారు కొన్ని క్రొత్త సంగతులను చేర్చిరి. కనుక దాసుగారి హరికథలలో సాహిత్యము సొంతము వారి సొంతము. సంగీతము తమిళుల దౌడ పాట[37] కాక క్రొత్త సంగతులతో కూడినది. ఇక నృత్యము వీరు చేర్చినదే. సంగీతమునకు నాదము, సాహిత్యమునకు పదము, నృత్యమునకు పాదము ముఖ్యములు. అనగా దాసుగారి హరికథ నాదము. పదము, పాదముల త్రివేణీ సంగమము.

దాసుగారు వారి హరికథలలో 'మంజరి, నర్తకి' అనునవి క్రొత్తగా ప్రవేశ పెట్టిరి. మంజరులు యక్షగానము లందు కూడ కన్పడవు. 'మంజరి, నర్తకి' అను వానిని గూర్చి శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారిట్లు వివరించిరి.

'మంజరులలోనూ, ఈ నర్తకులలోనూ పల్లవీ, అనుపల్లవీ ఉండవు. అన్నీ చరణాలే ఉంటాయి. రెండేసి భాగాలు కల చరణాలు రెండుగాని, మూడు

---

36. 'స్వయముగా పూర్వరాజర్షి చరితమల్లి
పాడి యాడుచు వినిపించు భాగవతుఁడు
నిక్కమగు పండితుఁడు గాని తక్కువాఁడు
చదువరి వలె దంభముఁజూపు వదరుబోతు' — 'మేలుబంతి' - పు. 110

37. తమిళుల సంగీతమును 'దౌడ పాట' యని దాసుగారు నిరసించిన విధానము.
తెలుఁగు కిట్టని యఱవల వెలి యొనర్ప
వలయు నన్నిట న్సిగ్గున్న తెలుఁగువారు
అద్దె యిచ్చి యేడ్పించెడు నఱవకొయ్య
దిప్పు దౌడపాటకుఁ దేట తెనుఁగు పడదు
'దెబ్బకు దెబ్బ' - అడ్వర్టయిజర్, 1–4–1942

గాని, నాలుగుగాని, వీటిలో ఉంటాయి. రెండేసి భాగాలకు ప్రాస ఒకటే ఉంటుంది. ప్రతి భాగమునకు వేర్వేరుగా యతి ఉంటుంది'.[38]

దాసుగారు ప్రవేశపెట్టిన మరియొక విశిష్ట సంగీత రచన 'మట్టు' ఈ 'మట్టు' లో సంగీత సాహిత్యములు సమశక్తులతో నుండును. అంతే కాదు. ఈ 'మట్లు' నృత్యమునకు అనుగుణముగా రూపొందించబడినవి. దాసు గారి 'మట్ల'ను సాధనచేయు విద్వాంసులు సంగీత రహస్యములతోపాటు నృత్య రహస్యములను కూడ తప్పక తెలిసికొనవలెను. దాసు గారి సంగీత రచనలకు జన సామాన్యములో అధిక ప్రచార మిచ్చినవి ఈ 'మట్లే'.

దాసుగారి హరికథ లందు 'తెలుగుబాణి' ఎక్కువ. పాట లందే కాదు, ఆట లందు కూడ ఈ ధోరణి ఎక్కువగా కన్పడును. తెలుగునాట ప్రసిద్ధికెక్కిన ఆట పాట లెన్నియో వీరి హరికథా భూమికపై ఆడి పాడినవి. రుక్మిణీకల్యాణ హరికథలో రుక్మిణి బాల్యఘట్టమునందు వర్ణింపబడిన బొమ్మల పెండ్లిండ్లు, వెలదులతో వియ్యమందుట, గుజ్జనగూళ్లు మొదలైనవన్నియు తెలుగుదేశము నందలివియే కదా. రుక్మిణీ కల్యాణ మందలి రుక్మిణి మనకు వైదర్భిగా కన్పింపదు. తెలుగు నేలపై పుట్టి పెరిగిన బాలిక యనిపించును. ఇక రచనా విషయమున గూడ నంతే. వీరి హరికథ లందు తెనుగు నుడికారపు పెత్తన మెక్కువ. తెనుగు పలుకుబడిపై దాసుగారికి గల పలుకుబడి క్రొత్త తెలుగు హరికథలకు బడిపలుకులయినవి.

దాసుగారు హరికథా సరస్వతికి అరు దశాబ్దములు ఆడి పాడి ఆనందముతో ఒడలు మరచి, అనేక విధముల సేవ చేసిరి. హరికథతో దాసుగారెంత ఐక్యమైరనిన హరికథ అని అనగనే వెంటనే గుర్తు వచ్చునది దాసు గారే.

దాసుగారి శిష్య సంసారము

దాసు గారికి పూర్వము హరిదాసులు హరికథ నాశ్రయించుకొని బ్రతికిరి. దాసుగారు చేపట్టిన తరువాత హరికథయే దాసుగారిని ఆశ్రయించుకొని బ్రతికినది. అంతకుముందు హరిదాసుల జీవికకు కరదీపికగా నున్న హరికథ, సాహిత్యకళా

38. శ్రీ ఆదిభట్ల నారాయణదాస సారస్వత నీరాజనము, పు. 1085

ప్రపంచము నందొక మహాజ్యోతియైనది. భావి హరికథకులకు ఆదర్శజ్యోతి యైనది. హరికథా యుగమునకు మార్గదర్శకమైనది. దాసుగారి చేతిలో మహాజ్యోతిగా ప్రకాశించుచు రసికప్రవరుల ఆనంద చక్షువులను గూడ మిరుమిట్లు కొల్పుచున్న ఈ హరికథా ప్రక్రియను జూచి ఎందరో ఆకర్షితు లయిరి. ఎందరిలోనో హరికథ చెప్పవలె ననెడి తహతహ బయలుదేరినది. దాసుగారిని ఊపిరి సలుపుకోనీకుండ నిత్యము వరించుచున్న రాజసన్మానములు, పండిత ప్రశంసలు, జనసత్కారములు చూచి హరిదాసు అగుటకన్న ఈ లోకమున గొప్ప ఏమి యున్నది అను భావము సాహిత్యారాధకులలో బయలుదేరినది. అంతే. ఇక దాసుగారికి శిష్యసంపద ఎక్కువయినది. ఎందరో గజ్జె కట్టిరి. తెనుగు దేశము హరిదాసమయమయినది. దాసుగారు ఎక్కడ హరికథ చెప్పుచున్నను చూచి ఆనందించు ప్రేక్షకులతోపాటు, అనుకరించు శిష్యకోటి కూడ ఎక్కువయినది. తెలుగునాట గజ్జె కట్టినవాడెల్ల నారాయణదాసుగారి శిష్యుడే. వీరికి సాక్షాచ్ఛిష్యులో, పరంపరా శిష్యులో, ఏకలవ్య శిష్యులో కానివారు ఏ యిద్దరో, ముగ్గురో తప్ప గజ్జె కట్టిన వారిలో ఆంధ్రదేశము నందు లేరన్న వాక్యమునకు అసత్యదోషము పట్టదు. ఈ సరస్వతీ స్తనంధయునకు జన్మవంశమునకు సంబంధించిన జ్ఞాతుల కంటె విద్యా వంశమునకు సంబంధించిన జ్ఞాతు లెక్కువ. ఆ భారద్వాజున కొక్కడే ఏకలవ్య శిష్యుడు, ఈ భారద్వాజునకు అనేక ఏకలవ్య శిష్యులు. దేశవ్యాప్తమయిన దాసుగారి శిష్య సంసారము వారి హరికథక జీవితమునకు జీవనాడియగుట వారిని గూడ స్మరించుట సందర్భోచితము.

దాసుగారి శిష్యులలో వాజపేయయాజుల సుబ్బయ్యగా రొకరు. వీరి పప్పు అయ్యవారి కడ సంగీతము నేర్చుకొని, హరికథావిద్యకొరకు దాసుగారి యొద్దకు చేరిరి. వీరు దాసుగారి శుశ్రూషవలన హరికథావిద్యను బాగుగా జీర్ణము చేసికొని దాసుగారి కథా కథన విధాన నైపుణ్యమును ఒంటపట్టించుకొన్నవారు. 1921 లో నందిగామలో జరిగిన దాసుగారి హరికథలపోటీలలో వీరు చెప్పిన రుక్మిణీకల్యాణ హరికథకు ప్రథమ బహుమతి వచ్చినది. గుడిపాటి శ్రీరామమూర్తిగారు, పెంటపాడు వేంకటసుబ్బయ్యగారు, బవరదాసుగారు మొదలగు హరిదాసశేఖరు లందరు ఈ సుబ్బయ్యగారి శిష్యులే. బవరదాసు గారు దాసు గారి 'గౌరమ్మ పెండ్లి' హరికథను అచ్చొత్తించిన గురుభక్తులు.

మరియొక ముఖ్యశిష్యులు శ్రీ నేమాని వరహాలుగారు. దాసుగారి కీర్తి నిధిని బహుభద్రముగ కాపాడిన వారిలో వరహాలుదాసుగారొకరు. నారాయణదాసుగారి గాత్రము వీరిలో కొంత ప్రతిధ్వనించెడిదని జనవాక్యము. ఈ వరహాలు దాసుగారు విజయనగర మందలి సంగీతకళాశాలలోని గాత్రసంగీతశాఖకు ఆచార్యులుగా పని చేసిరి. దాసుగారికి వరహాలుగారి గాత్రముపై గల విశ్వాసమునకు ఇది మంచి నిదర్శనము. వరహాలుదాసుగారు చొప్పెల్ల సూర్యనారాయణగారి వంటి ప్రముఖ విద్వాంసులను తీర్చిదిద్దిన దేశికులు.

నేతి లక్ష్మీనారాయణగారు, వాజపేయయాజుల సుబ్బయ్యగారు ఒక విచిత్రమైన జంట. విజయనగరవీథులలో వీరు దాసుగారి వెంట నేర్చుకొనుచు నడచునపుడు ప్రజలకు దాసుగారు వాల్మీకి వలె, ఈ జంట కుశలవుల వలె గోచరించెడివట. వీరు దాసుగారి యథార్థరామాయణ హరికథ చెప్పుటలో ఆరితేరినవారు. వీరికి హరిదాస ప్రపంచమున 'రామాయణ సోదరులు' అని పేరు. దాసుగారిచెంత పండ్రెండు హరికథలను నేర్చుకొన్న అదృష్టవంతులు. దాసుగారి హరికథలలో జానకీశపథము చాల కష్టమయినది. ఆ హరికథను దాసుగారు కూడ నొక్కసారియే చెప్పిరి. అనేక మేళకర్తరాగములలో కూడిన ఆ హరికథను వీరుగూడ ఒకసారి చెప్పి వీరి ప్రజ్ఞను లోకమునకు ప్రకటించిరి. దాసుగారిపై వీరికి గల భక్తి అపారము. శ్రీ నేతి లక్ష్మీనారాయణగారు 'శ్రీ నారాయణదాస హరికథా గాన పరిషత్తు'ను విజయవాడలో స్థాపించిరి. శ్రీ నేతి వారి దృష్టిలో దాసుగారు దైవస్వరూపులు. విజయవాడ పట్టణమందలి సత్యనారాయణపుర శివాలయములో దాసు గారి శిలావిగ్రహమును మంత్రపూర్వకముగా ప్రతిష్ఠించి (25–2–1951). నిత్యారాధనము వేదమంత్రములతో నలుపుచున్న నారాయణదాస దాసులు. దాసుగారి పాదుకలు, చిటితాళములు, కాలి గజ్జెలు, చేతికఱ్ఱ వీరి పూజాపీఠములోని దేవతలు. దాసుగారి ప్రభావము ప్రియ శిష్యులపై ఎంత గలదో తెల్పుటకు ఈ పూజావిషయము చాలును. హరికథాభేరిని ప్రతి పట్టణ మందును ప్రయోగించుచున్న శ్రీ ములుకుట్ల సదాశివశాస్త్రి గారు, శ్రీ వెంపటి సుబ్బనారాయణగారు, శ్రీ కుప్పా వీరరాఘవయ్య గారు మొదలగు ప్రముఖ హరికథకు లందరు నేతి వారి శిష్యులే.

దాసుగారి శిష్యవర్గములో మరియొక అఖండులు శ్రీ వేదపట్ల వేంకట రమణయ్య గారు. దాసుగారి ప్రాణ శిష్యులలో వీరొకరు. భీష్మ చరిత్రము,

యథార్థ రామాయణము, రుక్మిణీ కల్యాణమును వీరు ప్రత్యేకముగా సాధనచేసి అనేక పర్యాయములు చెప్పి ప్రజల ప్రశంస లందుకొన్నవారు.

శ్రీ పేరి నరసింహముగారు దాసు గారి ఆప్తశిష్యులలో ఒకరు. దాసుగారి హరికథకు వజ్రోత్సవము చేయ సంకల్పించిన సచ్ఛాత్రులు.

శ్రీ కరూరు కృష్ణదాసుగారు దాసుగారి మరియొక కీర్తిధ్వజము. దాసుగారి నాట్యకళకు ఔరసులు. పదునాలుగేండ్లు గురువుగారి పోషణ భాగ్యము నోచుకొన్న వారని యెంతోవాసిగన్న ప్రియాంతేవాసులు. శ్రీ శనగల వేంకట సుబ్బయ్యగారు ఈ కృష్ణదాసుగారి శిష్యగణమునందు ప్రథమగణ్యులు.

శ్రీ పిల్లలమర్రి రామదాస భాగవతులుగారు మరియొక ముఖ్యశిష్యులు. వీరు హరికథ చెప్పుటయందేకాక కవిశేఖరులు కూడ. ఒక్క యథార్థ రామాయణమును దాదాపు రెండు వందల సారులు చెప్పిన హరిదాసులు.

దాసుగారి శిష్యప్రేమను ప్రతిభతో గుంజుకొన్న మరియొక మహనీయులు శ్రీ కొండపల్లి కల్యాణదాసుగారు. దాసుగారి చెంత గౌరమ్మ పెండ్లి నేర్చుకొన్న వారు. అంతే కాదు. దాసుగారిచెంత 'షణ్ముఖి, ద్విముఖి' తాళ ప్రదర్శనములు నేర్చుకొన్న ఏకైక అదృష్టవంతులు. కల్యాణదాసు గారి అసలు పేరు అసిరయ్య. 'కల్యాణదాసు' అని బిరుదప్రదానము చేసినది దాసుగారే.

దాసుగారి శిష్యకోటిలో మరియొక ఉద్దండ పిండము శ్రీ చిట్టిమళ్ల రంగయ్య దాసుగారు. దాసుగారిని అనుకరించుటలో వీరు అతిసమర్థులు. దాసుగారి హరికథలను నాలుగు దశాబ్దములపాటు ఆంధ్ర దేశ మంతటను ప్రచారము చేసిన ప్రసిద్ధ హరిదాసులు. నూజివీడులో జరిగిన హరికథల పోటీలలో స్వర్ణ పతకమును బహుమతిగా పొందిన ప్రతిభాశాలి.

మరియొక ముఖ్యశిష్యులు శ్రీ వడ్లమాని నరసింహదాసు గారు. వీరు బహుభాషాపండితులయిన హరిదాసులు. వీరు ఆంధ్రరాష్ట్రమునందే కాక, ఇతర రాష్ట్రములందుకూడ అనేక సన్మానము లందిన జనరంజక విద్వాంసులు.

ఇంకను శ్రీ పాద లింగమూర్తి గారు, శ్రీ చెరుకుపల్లి కనకదుర్గాదాసు గారు, శ్రీ మల్లికార్జునదాసు గారు, శ్రీ ఊటి రామమూర్తి గారు, శ్రీ పరిమి సుబ్రహ్మణ్య

దాసు గారు, శ్రీ అసుమిల్లి నారాయణదాసు గారు, శ్రీ జగన్నాథదాసు గారు, శ్రీ భంక బాలకృష్ణదాసు గారు .... ఇంకను ఎందరెందరో దాసుగారి శుశ్రూషవలన విద్య నేర్చుకొన్న ప్రత్యక్షశిష్యు లున్నారు.

ఇక దాసుగారి శుశ్రూష లేకయే దాసుగారిపై గురు భావ మేర్పరచుకొన్న పరోక్ష శిష్యుల సంఖ్య అసంఖ్యాకము. దానికి కారణము దాసుగారి శిష్యుల మని పించుకొనుటయే తెలుగునాట యొక గొప్ప. అదియొక యెదురులేని కతపత్రము.

అట్టి పరోక్ష శిష్యులలో శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిగారొకరు. వీరు బరం పురపు కళ్లికోట రాజావారి కళాశాలలో ప్రధానాంధ్రోపాధ్యాయులు. ఉత్తమశ్రేణికి చెందిన హరికథకులు. వాగ్గేయకారులు కూడ. శ్రీ కృష్ణమూర్తి గారు 'పార్వతీ కల్యాణము' అను యక్షగానమును రచించి దాసుగారికి అంకిత మిచ్చిరి.

పరోక్ష శిష్యులలో మరచిపోలేని మరియొకరు శ్రీ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసుగారు. వీరు బహుగ్రంథకర్తలు. అనేక బిరుదములు వీరిని ఆశ్రయించినవి. వీరు హరికథారాధకులే కాదు, హరిదాసపోషకులు గూడ. వీరికి నారాయణదాసు గారిపై భక్తి అపారము అని తెల్పుటకు వీరు వ్రాసిన 'శ్రీమదజ్జాడాదిభట్ల నారా యణదాస జీవిత చరిత్రము' అను యక్షగానము అక్షరసాక్ష్యము. నారాయణదాసు గారి విగ్రహ ప్రతిష్ఠకు వీరు శ్రీ వేతి లక్ష్మీనారాయణగారికి అండగా నుండుట శిలా సాక్ష్యము.

శ్రీ హరి సోమయాజుల సుబ్రహ్మణ్యము గారు, శ్రీ మల్లాది చంద్రశేఖర శాస్త్రి గారు, శ్రీ భమిడిపాటి అయ్యప్పశాస్త్రి గారు మొదలగు హరికథార్చకు లెంద రెందరో దాసు గారికి పద్యప్రసూనాంజలులు సమర్పించిన పరోక్ష శిష్యులే. శ్రీ అమ్ముల విశ్వనాథభాగవతార్ గారు, శ్రీ కంచిభట్ల కోటేశ్వరరావుగారు, శ్రీ మోళ్ల బండి తాతారావు గారు, శ్రీ దోర చినబాబు గారు, శ్రీ బుర్రా శివరామకృష్ణశర్మ గారు, శ్రీ అక్కిపెద్ది శ్రీరామశర్మగారు, మొదలగు హరిదాసు లందరు దాసు గారి పరోక్ష శిష్యులే. శ్రీ దాసుగారు ఇంతటి హరిదాస గురుకులమునకు కులపతులు, ఇంతటి హరిదాస వంశమునకు మూలపురుషులు.

తెలుగు దేశములో హరికథకులకు నారాయయణదాస నామము ఇష్టదేవతా మంత్రము.

---

# గ. హరికథా గ్రంథములు

సిగలోఁబూవులు పెట్టి, అత్తరుసువాసించుకొని, మైపూఁతగా
నాగ గంధమ్ము నలంది, మీసముల నోహో పుట్టఁగాఁ ద్రిప్పి, శ్రీ
విగఁదాశిమ్ములు చేతఁ బూనుచును, బూవిల్కాసిడా సోయగం
బగవించన్, కతసెప్పు నీ హాయలు నే మాసింతు మీనాఁటకేన్.

ఆదిభట్ల నారాయణదాసుగా రనగనే వారిని గూర్చి శ్రవణ పరిచయము మాత్రమే యున్నవారికి గూడ, వెంటనే అంటుకొను విషయము హరికథ. దానికి ప్రధానకారణము దాసుగారు అరువది సంవత్సరములు కొన్ని వేలసారులు హరికథలు చెప్పుటయే. అన్నిసారులు చెప్పిన హరికథలనే మరల మరల చెప్పుచుండ వినువారికి విసుగు పుట్టలేదా ? అను సందియము కలుగును. విసుగు పుట్టలేదు సరికదా, టిక్కెట్టు పెట్టినను, వచ్చుటకు ఇక్కట్టు లెన్ని ఎదురయినను వచ్చి, చూచుటకు చోటు వినుటకు వీలుదొరకక ప్రజలు తిరిగి వెళ్లిన సందర్భము లనేకము. అయస్కాంతప్రతిభులయిన దాసుగారి ఆకర్షణ మటువంటిది. కాని దాసు గారి ప్రతిభ ప్రధానముగ వ్యక్తినిష్ఠము. హరికథా గ్రంథనిష్ఠము కాదు. అనంతముఖప్రజ్ఞా ప్రభావితమైన దాసుగారి కథాకథనశక్తిని లిపిమాత్రాధారములయిన వారి హరి

1. శ్రీ సామవేదము జానకీరామ శర్మ - శతజయంత్యుత్సవ సంచిక - పు 134

కథా గ్రంథములతో ఊహించుట అనుభూతిని నిర్వచింపబోవుటవలె సులభ విషయము కాదు. అట్లని వ్యర్థప్రయత్నము కాదు. వారి శక్తి ఈ హరికథా గ్రంథ దర్పణములలో కనబడునది ఏకదేశలేశము మాత్రమనియే.

దాసుగారు వ్రాసిన నలువదియారు గ్రంథాలలో హరికథలు పదునాలుగు—

1. ధ్రువ చరిత్రము 2. అంబరీష చరిత్రము 3. గజేంద్ర మోక్షణము 4. రుక్మిణీ కల్యాణము 5. ప్రహ్లాద చరిత్రము 6, శ్రీ హరికథామృతము 7. గోవర్ధనోద్ధరణము 8. భీష్మ చరిత్రము 9. సావిత్రీ చరిత్రము 10. యథార్థ రామాయణము 11. జానకీశపథము 12. హరిశ్చంద్రోపాఖ్యానము 13. మార్కండేయ చరిత్రము 14. గౌరమ్మ పెండ్లి.

ఈ హరికథల నామములబట్టియే ఈ కథ లన్నియు భాగవత, భారత, రామాయణముల నుండియు, ఇతర పురాణముల నుండియు గ్రహించిన కథలు అని స్పష్టము.

## ధ్రు వ చ రి త్ర ము

ధ్రువ చరిత్రము హరికథలలోనే కాదు దాసు గారి సకల రచనములందే ప్రప్రథమ రచనము.

దాసుగారు విజయనగరములో మెట్రిక్యులేషను చదువుచున్న రోజులలో చెన్నపట్టణమునుండి కుప్పుస్వామి నాయుడు అను భాగవతార్ విజయనగరము వచ్చి శ్రీ కానుకుర్తి హనుమంతరావుగారి యింట ఆడుచు పాడుచు ధ్రువచరిత్ర హరికథ చెప్పెను. దానిని జూచి ఆకర్షితులై హరికథ చెప్పవలెనని నిర్ణయించుకొని దాసుగారు కూడ ధ్రువచరిత్ర హరికథ వ్రాసిరి. ఇది జరిగినది 1883 లో.

ఈ ధ్రువచరిత్ర గ్రంథమంతయు దాసుగారి సొంతరచనము కాదు. దీనిలో విశాఖపట్టణ నివాసియైన శ్రీ ధూళిపాళ కృష్ణయ్యగారి పద్యములు, పోతనగారి భాగవత పద్యములు కూడ నున్నవట. ఇట్లు దాసుగారు కూర్చిన హరికథను సోదరుడయిన పేరన్నతో కలసి రెండవ అన్నయైన సీతారామయ్య గారింట 'రిహార్సలు' వేసికొని మొదటిసారిగ వేణుగోపాలస్వామి మఠములో చెప్పిరి.

దాసుగారు అంబరీష చరిత్రము వ్రాయు వరకు చెప్పిన హరికథ లన్నియు ఈ ధ్రువచరిత్రమే.

ఈ ధ్రువచరిత్రను దాసు గారు అచ్చొత్తించ లేదు. వ్రాతప్రతిపై కూడ వారు శ్రద్ధ జూపినట్లు అనిపింపదు. బహుశః ప్రథమగ్రంథము అగుట కావచ్చును. అంతేకాదు వారి శిష్యులు కూడ దీనిని నేర్చుకొనలేదు. ఏమైన నేమి అది నేడు అలభ్యము.

దాసు గారు సామాన్య హరిదాసులవలె కొన్నినాళ్లు ఇతరులు వ్రాసినహరికథలు చెప్పి తరువాత హరికథలు వ్రాయలేదు. హరికథలు చెప్పవలెనని ఆయన మనస్సులో ఆలోచన మెఱసిన క్షణమునందే హరికథను వ్రాసిరి. వారి హరికథనే మొదటినుండియు ప్రవర్తించిరి. కనుక దాసుగారి హరికథక జీవితము ఈ ధ్రువ చరిత్ర హరికథా ప్రదర్శనముతో ప్రారంభమైనది. ఈ ధ్రువ చరిత్రము దాసు గారి హరికథక జీవితసౌధ నిర్మాణమునకు శంకుస్థాపు.

## అంబరీష చరిత్రము

అంబరీష చరిత్రము దాసుగారి హరికథాగ్రంథములలో రెండవది. లభించు హరికథలలో మొదటిది. ఈ హరికథా గ్రంథ రచనమునకు ఒక విచిత్ర సన్నివేశము కారణము. దాసు గారు ఛత్రపురములో ఒక ధనవంతుని యింటిముందు ధ్రువచరిత్రము చెప్పగా, విన్న ఒక అధికారి ఈ హరికథ మీరు వ్రాసినదే యగునా ?" అని సందేహము వెలిబుచ్చ, దాసుగారు 'నేను వ్రాసినదే' యని యనును. అంత ఆ అధికారి 'అట్లయిన అంబరీషోపాఖ్యానమును వ్రాసి చెప్పుము' అని యన, దాసు గారు పట్టుదలతో ఆ రాత్రికి రాత్రియే అంబరీష చరిత్రము వ్రాసి ధారణచేసి మరునాడు ఆ సభ్యు డాశ్చర్యము చెందునట్లు చెప్పిరి. ఇది జరిగినది 1884 లో.

ఈ అంబరీష చరిత్ర హరికథ శ్రీ విజయనగర వేణుగోపాలస్వామికి అంకితము. దాసు గారు ప్రప్రథమముగా హరికథ చెప్పినది ఈ వేణుగోపాలస్వామి మఠమునందే.

ఈ కృతి వేణుగోపాల స్తుతిలో ప్రారంభమగును. తరువాత గణపతి స్తుతి సర్వాణి ప్రార్థన వచ్చును. తరువాత సర్వమతములసారము, జీవహింసానిరసనము, ఐకమత్యమునుగూర్చి కొంత చర్చ యుండును. ఈ యంశములను వివరించుచు—

'ఒరుల గొప్పఁజూచి యోర్వలేకుండిన
వాఁడు తప్పకుండఁ గీడుబొందు
అంబరీషువ్రతము నారసి యుల్కి దు
ర్వాసుఁడెట్టి యిడుమఁబడెనో వినుఁడు'   (పు-4)

అని చమత్కారముగా ముడిపెట్టి కథాప్రారంభము చేసినారు.

కథా శరీరము : కృతయుగమున అంబరీషుడు సకల భూమండలము నేలు చక్రవర్తి. అతడు సర్వసుగుణములతో భాగవతాగ్రగణ్యుడయి, సత్యము, ధర్మము తప్పక రాజ్యపాలన చేయుచుండును. అతని రాజ్యమున ప్రజలు సకల విభవములతో నుండురు. సాదులౌనన రాజ్యము పాలించియు అంబరీషుడు విరక్తి చెంది తన కొడుకునకు పట్టము గట్టి అడవికేగ దలచినట్లు భార్యతో ననును. భార్య గూడ వత్తునని యన అంగీకరించి, అంబరీషుడు ద్వాదశీవ్రతము ఆచరించును. అంతలో క్రూరబుద్ధితో దుర్వాసుడు వచ్చి 'ఏకాదశి నుపవసించి యెంతయు నేనల్లాడల పడుచు వచ్చితిని, ఆకటిచే సొగులు చుంటిని. అన్నంబిడవే' అని కోరును. జనవల్లభుడగు అంబరీషుడు వల్లె యనును. దుర్వాసుడు యమునానదిలో స్నానము చేయుటకు వెళ్లును. అంబరీషునకు పారణచేయు సమయము సమీపించినను దుర్వాసుడు రాడు. అంబరీషున కేమియు తోచక బ్రాహ్మణశ్రేణికి కేల్మోడ్చి—

'కుడిచితినా కోపగించుఁ గుడువకున్న ఫలంబు నశించు
తడబడకుండ నాదరించుఁ దోడయుండనే మీ కార్యులార
పారణసేయువేళ మిగిలె బాపఁడెట్లు నీటఁదగిలె
ధీరవర్యులార మిగుల విచారించుఁడీ నాకే దారో'   (పు-8)

అని వారి కోరగా, వారు 'కుడువకుంట కాదు కుడుచుటయును గాదు. సలిల భక్షణంబు సమ్మతంబు' అని చెప్ప అంబరీషుడట్లే చేయును. అంత దుర్వాసుడు వచ్చి కోపముతో 'ఓరి ! దురాత్మ ! నన్ను అవమానించితివి. నాదు ఘన కోపమహాగ్నిని కాల్తును' అని జడను తెగదీసి అంబరీషుని సంహరింపుమని విసరును. అది ఘోర శక్తియై తన్ను మ్రింగుటకు విజృంభించి వచ్చుచుండ అంబరీషుడు భీతిల్లి శ్రీహరిని రక్షింపుమని వేడుకొనును. ఇట్లు భక్తుడు వేడ "శ్రీకృష్ణ చక్రము గదు వేగమై

కృత్తినిఁ బగులబెట్టి, దుర్వాసు వెన్నంటి మంట గొల్వ, మునియు నింద్రుపరిఁజేరి మొఱ్ఱ పెట్టె". దానికి ఇంద్రుడు—

'సకల శక్తియుతుఁడు సర్వేశ్వరుఁడు జగ
త్కారణంబు పరుఁడు గలఁడటంచుఁ
గానలేని వాని గర్వమణఁచెను హరి
దానికేను విను నిదర్శనంబు' (పు-12)

అని తన పూర్వపరాభవ చరిత్ర నిట్లు తెలుపును — మును నన్ను నందాది యాదవులు పూజ సేయుచుండ, కృష్ణుడు వారలను గని 'పాలిచ్చి పెంచు గోవులను, ఫలియించు వనాగములను అర్చింపక మూఢులయి యితర దైవమతములను పూజ సేయనేల? సర్వము కర్మాధీనము. కర్మవశమున స్వర్గాధికారియైన ఇంద్రుని పూజించుట వ్యర్థము. వాని కిట లంచ మిచ్చుట వట్టి వెఱ్ఱి. మనకు స్వాధీనమై మంచి చేయునట్టి వానిని గొల్చుట సార్థకము' అని బోధ చేసి, వారు నాకు చేయు యాగము మాన్పించి గోవనరాజి పూజ చేయించెను. అట్లు చేసిన ఆ గోపాలార్భకునిపై, ఆ యాదవులపై నాకు కోపము వచ్చి మేఘరాజములను బిల్చి—

భళిర యీ డింభనాస్తికు పలుకు నమ్మి
యాదవులు నన్ను మఱచిరి యవనిలోనఁ
గాన్పున నిమ్మ దబ్బునఁ గను ప్రళయముఁ
బెంచి వారల కొంపలు ముంచి రండు (పు-13)

అని యాజ్ఞాపింప, ఆ మేఘరాజములు ఆ యాదవు లుండిన ఘోషముపై పెను ప్రళయముగాగ కురిసెను. యాదవు లందరు భయముతో ప్రాణములపై నాస వదలుకొని కృష్ణుని చెంతకు రాగా, కృష్ణుడు వారిని కరుణించి నాదు గర్వ మణఁగింప దలచి గోవర్ధనగిరిని కేలనెత్తి దాని క్రింద వారిని ఏడు అహోరాత్రములు నిలిపి రక్షించెను. అట్లు కొండ గొడుగు పట్టిన బాలుడు పరమాత్ముడని భావించి నేను అహంకారమును ఉడిగి మేఘములను మరలించుకొంటిని. కనుక మునీంద్రా! నీవు ఆ నగధర భక్తుని బాధ పెట్టితివి. నేను నీ బాధ తొలగించుటకు శక్తుడను కాను, అని ఇంద్రుడు చెప్ప దుర్వాసుడు చేయునదిలేక బ్రహ్మను జేరి ప్రార్థింప, దానికి

బ్రహ్మ 'ఓయయ్య! శ్రీవల్లభుడు గర్వపడెడువాని దర్పమడంచును. దానికి నేనే నిదర్శనము' అని తన కథ నిట్లు చెప్పను—

శ్రీకృష్ణుడు బృందావనములో మహిమలు చూపుచున్న కాలమున, లోక స్రష్టను అను గర్వముచే హరిని వంచింపదలచి గోప బాలురను, పశువులను మాయతో దాచినాడను. అఖిలజ్ఞుడగు ఆ నారాయణుడు నా కొంటెతనమును గ్రహించి దానికి మారుగ 'నేను మాయ మొనరించిన గోవులు గోపబాలకుల్ సరిగ మురారి తానె యయి' సంజవేళ ఇండ్లకు మరలితెచ్చెను. తిరిగి వచ్చిన గోపబాలురు ఉపనిషదర్థ ములు పలుకుచు బాలకృష్ణుల వలె దివ్యవస్త్రాలతో నుండుట, పశువులు మూఢ భావములు లేకుండ నుండుట బలరామునకు ఆశ్చర్యము కలిగించెను. ఇట్లు ఒక సంవత్సర కాలము నేను అపహరించిన గోపశిశువుల, పశువుల రూపములను ధరించి శ్రీకృష్ణు డుండ నాకు అహంకారము తొలగి కృష్ణుని చెంత కేగి శరణము వేడితిని. కనుక 'నాయబ్బ శక్తి మాన్ప నా తరమా? మరియొక చోటునకు పొమ్మ' అని చెప్పను.

దుర్వాసుడు చేయునదిలేక కైలాస మరిగి ఈశ్వరుని ప్రార్థించి కాపాడుమన, ఈశ్వరుడు 'గర్వ మెంతవానికైన వలదు' అని చెప్పి తనకు గర్వభంగమయిన వృత్తాంతము నిట్లు చెప్పను. తొల్లి నాకడకు ఒకనాడు శ్రీవిభుడు రాగా, గర్వ ముతో నా స్థైర్యవిభవము ప్రకటించుచు—

'ఆడుదానవై యల్లనాడు నీవసురుల వలపించు గతి
నేడు నీప్రజ్ఞచూపి నన్ భ్రమన్ బెట్టగలవె శ్రీపతి' (పు-19)

అని నేను హాస్యముగా బల్క, వనజాక్షుడు చిరునవ్వొల్క 'నిర్జిత పంచబాణుడవు. నిన్ను ఒక ఆడుది భ్రమింపసేయు టెట్లు? నిన్ను భ్రమింపజేయ నేనెంతవాడను?' అని పలికి సెలవు గైకొని వెడలెను. అతనితో నేను పలికిన విషయము మరచి పరాకుగా నుండ, ఒకచోట ఒకనాడు 'అనుపమయిన వినూతన గానసుధామదు ధ్వనము వినబడ, ఆ స్వర మెవ్వరిదో యటంచు గనుగొన గోరి' వెడలి ఒక పువ్వు తోటలో మదనుని కటారి వంటి యొక కులుకు మిటారిని చూచి, ఆమె సౌందర్య విలాసములకు లోనయి మూఢుడనయి వెంబడిపడితిని. అది నన్ను అటు ఇటు తన విలాసములను జూపుచు పరువులెత్తించి యెత్తించి తుదకు 'పేల్పుసానుల్లు

కొల్వున్న పార్వతీ సమీపంబు డాసి, యోసోదరీ! పరికించు మెంతవా డెట్లు భ్రమ పడెనో యని నిలుచున్న తఱి, నేను కామాంధుడనయి యొరులుంట యెఱుంగక అప్పావోడిని కౌగిట నదిమితిని.' అప్పుడు జయవిజయాభవ యనుచు గోవిందుడు స్వస్వరూప మొందెను. నేను చేయునదిలేక సిగ్గుతో తలవంచుకొంటిని. కనుక 'మునినాయక! నీవు గర్వమును మానుము' అని తన అశక్తతను తెల్పెను.

దుర్వాసుడు అక్కడనుండి వైకుంఠమునకు వెళ్లి —

తుచ్ఛబుద్ధి నీ భక్తుని దూఱి వెంటఁ
దెచ్చుకొంటిని పెంజిచ్చు దేవ దేవ!
చచ్చిపోవుచునున్నాఁడ జక్రమునను
మచ్చికన్ బ్రోవ రావే రమాహృదీశ! (పు-26)

అని నేలను బొరలుచు విష్ణువును ప్రార్థించును. దానికి విష్ణుడు చిరునవ్వుతో 'దుర్వాసా! నీరు పల్లమందుండు తీరున నేను భక్తుల మనములందుండుదును. నేనె భక్తులు, భక్తులే నేను. విమలుడగు నంబరీషుని పదకమలములను బట్టుము. ఆతడు నిముసమున చక్రాగ్ని మాన్పుచు విమల బుద్ధితో నిను గాచును' అని బుద్ధి గరపును.

అంత దుర్వాసుడు ఘట్టకుట్టికాప్రభాతన్యాయమున మరల అంబరీషునిచెంతకు వచ్చి శరణు వేడ, అంబరీషుడు చక్రమును స్తుతింప, ఆ చక్రము ఉపశమించి అరుగును. సంతోషముతో దుర్వాసుడు ద్వాదశపారణము చేసి అంబరీషుని మహిమను మెచ్చుకొని చనును. 'అంబరీష భూపతి వనజాక్షుని గొలిచి మిగుల వన్నెయు వాసిని గొని తుదకు వైకుంఠమునకు జాయాయుతుడై చనును.'

ఈ హరికథ యందలి ప్రధాన కథ భాగవత నవమస్కంధాంతర్గతమే యైనను దాసు గారు కొన్ని మార్పులు చేర్పులు చేసిరి.

భాగవతకథలో అంబరీషుని భక్తికి సంతసించి విష్ణువు 'ప్రతిభటశిక్షణంబును, నిజజన రక్షణంబును, నిఖిల జగ దవక్రంబును నగు చక్రం బిచ్చె' (9–89) నని యుండగా, దాసు గారి కథలో చక్ర మిచ్చెడి ప్రసక్తియే యుండదు. దుర్వాసుని

కోపమువలన జనించిన కృత్తి తామిత్తి పగిది విజృంభించి తన్ను మ్రింగుటకు వచ్చు సందర్భమున అంబరీషుడు భీతిల్లి ప్రార్థన చేయగా 'శ్రీకృష్ణ చక్రము కను వేగమే వచ్చి కృత్తిని తగులబెట్టి దుర్వాసుని వెంబడించినట్లు మాత్రమే కలదు.

అంబరీషుడు రాజ్యభోగములపై విరక్తి చెంది, పుత్రునకు రాజ్యభార మొసగి తపము చేసికొనుటకై వెడలబోవుట, అతని సతీమణి కూడ వత్తు ననుట భాగవతాంశములు కావు. దాసుగారి హరికథాంశములు మాత్రమే. భాగవతము నందలి—

అతని కీహామూనె హారు లందుఁ గరులందు
ధనములందుఁ గేళివనము లందుఁ
బుత్రు లందు బంధుమిత్రుల యందును
బురము నందు నంతిపురము నందు (9—88)

అను పద్యభావమును అనుసరించిన పరిచారికలు.

దుర్వాసుడు చక్రానలజ్వాలలకు తట్టుకొనలేక శరణము వేడినపుడు తమ తమ అశక్తతలను తెలియజేయుచు ఇంద్రుడు చెప్పిన గోవర్ధనోద్ధారణ వృత్తాంతము, నలిన సంభవుడు చెప్పిన గోగోపాలహరణ వృత్తాంతము, శివుడు చెప్పిన మాయా మోహిని వృత్తాంతము భాగవతమున కలవుకాని, అంబరీషోపాఖ్యానముతో సంబంధ మున్న వృత్తాంతములు కావు. ఈ వృత్తాంత త్రయమును అంబరీషుని చరిత్ర ముతో ముడిపెట్టినది దాసు గారి లేఖినియే. భాగవతము నందలి 'సుదర్శన నివా రణంబునకు నోపను' ( 9—111 ) అను విరించి పలుకులకు, 'అట్టి నిఖిలనాథు నాయుధశ్రేష్ఠంబుఁ దొలఁగఁజేయ మాకు దుర్లభంబు' ( 9—112 ) అను నీశ్వరుని పలుకులకు పెరిగిన ఉపాఖ్యానములు.

అంబరీషుని ప్రార్థన వలన సుదర్శన చక్రము ఉపశమించినపుడు ఆనంద ముతో దుర్వాసుడు పలికిన—

'పోల్చుకొనుము నాకున్నె యహంకృతి పుట్టుసన్యాసినిగనుక
పెల్చున నీయశమును ముజ్జగముల వెల్లడింప నీలీలఁ బన్నితిని'
(పు - 29)

అను పలుకులు భాగవతానుసారులు కావు. దుర్వాసుని పాత్రపోషణకై దాసు గారు అనిపించినవి మాత్రమే. కాని పరీక్షలో పరీక్షితుడు బాధలకు లోనగును కాని

పరీక్షకు డెపుడును బాధలకు లోనుగాడు. ఈ కథలో బాధలకు గురియైనది పరీక్షకుడయిన దుర్వాసుడు కదా! కాన దాసు గారి ఈ కల్పితాంశము పాత్రపోషణకు అతుకని అంశము.

ఇక సందర్భోచిత రచనకు ఒకటి రెండు ఉదాహరణములు—

దుర్వాసుని కోపకారణమున జనించిన కృత్తియొక్క భయంకరాకారము—

అభ్రం లిహోదభ్ర విభ్రమాభ్రభ్రమ
కృష్ణనీల దీర్ఘశరీర మమరఁ
బ్రళయకాలానలప్రభను జక్రీకృతే
క్షణముల రౌద్రమక్షయము గాఁగఁ
త్రైలోక్య కబళనోత్సాహ సూచక ఘన
వక్త్రిత్రియోగ్రిత వాసికెక్క
బభ్రు బర్బర కేశపాశాపుణ ప్రిభ
కాల సంధ్యారాగకాంతిఁ దనరఁ

గ్రకచ కఠిన కరాళదంష్ట్రిలు వెలుంగఁ
బదయుగోద్ధూత పాంశువుల్ చదలుగప్ప
నేలఁబదముల నింగిని నిడ్డ తలల
నత్తి కొనివచ్చి కృత్తి తామిత్తి పగిది.

ఈ సీస పద్యము నందలి ప్రథమ పాదము పోతనగారిది ( భాగ. 4-108 ) ఆ పాదపీఠికపై నిలచిన భయంకర రూపము తక్కిన పద్యభాగము.

మదన విరోధిని వంచించుటకై వచ్చిన మాయాసుందరి ( విష్ణువు ) విహరించుచున్న ఉద్యాన వన శోభా చిత్రణము నందలి దొక పద్యము—

చెలుసగ మెలమావి చివురు నోళ్లంబట్టి
కొలుకుచుం గూసెడి కోయిలల జత

పగిలిన దానిమ్మ పండు గింజల ముచ్చ
టలు పల్కుచుండిను చిలుకల కవ
పూఁదేనె నొండొరు పుక్కిళ్లఁ ద్రాపుచు
జంటగా నెగిరెడు తేంట్లజోడు
తీఁగె యుయ్యాల మీఁద నూఁగుచు ముద్దులు
గునియుచుండెడు పాలగువ్వల దుగ
డెంద మలరింప నత్తోట యందుఁ జేరి
యచటి వింతల కెంతయు నబ్రమంది
చెన్ను మీరఁగఁ బాల రాతిన్నె మీఁద
బంతియాడెడు నొక్క జవ్వనినిఁగంటి (పు-20)

ఇక ఈ మాయాసుందరీ శృంగార కళా విలాసములు తన్నెట్లు పెట్టు లెత్తించినవో నిర్జిత పంచబాణుడయిన స్థాణుడు దుర్వాసునకు విన్నవించుకొన్న ఘట్టము కథన ప్రతిభ కత్తిసాము చేసిన ఒక మంచి ఘట్టము.

"నీ జడన్ జూచినన్ జెలువ తేఁడు స్ఫురించె
రంగ దుత్తుంగ సారంగ గమన!
నీ నెన్నుదురు గన్న నెలవంక తలఁపయ్యె
రాజిత భీత సారంగ నయన !
నీవళు లరయ గంగా వీచికలు దోఁచె
రమ్య విలోల సారంగ చికుర !
నీ కౌనుఁగాంచినన్ మిన్ను జ్ఞప్తికి వచ్చె
రమణీయ బాల సారంగ పాణి !

చెలువములఁ గొంత పోలిక గలదు మనకుఁ
గాని యిసుమంతయైన నా మానసంబు
మాడ్కి నీ మనసున్న మన్మథుని పీడ
నన్ను సోఁకుట లెట్టులో సన్నుతాంగి !

అనుచు నేఁ బల్కుచుండఁ గ్రొవ్వాడి వాల్చూపు గాలమునం దగులుకొన్న నా మనో మీనంబున్ జప్పునం బైకి లాగి తన మిటారపుం గబ్బిగుబ్బ జక్కవలకున్ విందొనర్చి, జారిపోనీయన ట్లోయారంబుగఁ బయ్యెద సర్ది, క్రీయాతూన్యుండ! చాలు చాలు నీ మాటల సరసమని యెగతాళిసేయు గమనికన్ కీల్జడ కుచ్చుదాఁగాడ, నీవా మన్మథుని జయించినావని యీసడించుగతిఁ జిఱునవ్వునన్ మూతి విరిచి, సరిసరి జగద్గురుండ విదియా నీ యాత్మజ్ఞానమని నిరసించు లాగునం జట్టలం జరిచి, బాగు బాగు నిక్కముగ నిండు మగవాఁడవైనం జిక్కించుకొమ్మనట్లు చెంగున కురంగము వలెఁ దాటి పర్విడుచు, నిగ్గూడక మానవుని బీరంపుఁ బల్కుల వెంటఁ దరము నన్మాటికి మాటికి బెదురు చూపుల వెన్దిరిగి చూచుచుఁ బంతంబున వేగంబు రెట్టించి, యిదె దొరికితివి దొంగ యని సమీపించు నా చేతి కందీ యందని లాగున నక్కచిక్కులం బర్విడుచు నాంటిదాని పాటి పర్వులేకుండెనే యను చిన్నతనంబును దొల్లింటి వగ రెట్టించి సమూలంబుగ మద్ధైర్యమున్ గబళించి మదించి మించి భూతపతినయ్యు నన్పీడించు మారగ్రహగ్రహోగ్రతం దలంచి మిక్కిలి భయంబును రాల్రప్పలు గట్టు పుట్టలు మిట్టపల్లంబులనక యిట్టి కుసుమకోమలి యెట్లు నన్నతిక్రమించి పరుగెత్తుచున్న దేమాయయో యని యాశ్చర్యంబును ముప్పిరిఁగొను డెందంబున నేతెంచు నన్గని, చెక్కుటద్దంబుల ముత్తెపుం జెమ్మటలు వార గాలి విసరునం బైయెద జార నోరోరి నెఱజాణ బావా యని ముద్దుగార నన్బిలుచుచుం బొదల చాటునం బలుమరు దోబూచు లిడుచు మేల్మి బంగరు నెమ్మేనం జీరె సవరించుకొను నెపంబున నవయువంబు లొక కొంత వెలిపుచ్చి నా మనసప్పుడప్పుడు బెల్లించుచు మిగుల డస్సి యలసియుం బరువునకై దేవులాడి వచ్చు నాకుం గొన్ని యడుంగు లెదుర్వచ్చి యౌర నేఁగోరిన వన్నెకాఁడ యింక నీ కోడితి యేదీ నీ ప్రేమ, యా యగపడు నేటి యావలి యొడ్డు వఱకు నన్నెత్తుకొనుము, పిదప నా యిసుక తిన్నెమీఁద నని యేమో చెప్పఁబోవుచున్నంతలో సిగ్గుపడి ముమ్మరంపు మోహంబునం గనులు తేలవైచి నా కౌఁగిటఁబడునంత దగ్గర యైనం దత్తరంబునం గ్రుచ్చి కౌఁగలింపఁజను నన్వంచించి చేతి కందక చప్పున దాటి పోపోర సామి నీ కంత యాసరా యని పక్కన నవ్వి సికతాతలంబుఁజేరి యిఁక దబ్బున రమ్మిది యెంత మెత్తని పాన్పో చూడు మనుచు నేఁదారసిల్లిన కొలఁదిఁదా దూర మగుచుఁ దుదకు వేల్పుసానులు కొల్వ నిండు కొల్వున్న పార్వతి పమీపంబుదాసి యో సోదరీ పరికించు మెంత వాఁడెట్లు భ్రమంబడెనో యని నిలుచున్న తఱి నేఁగామాంధుఁడనై యెరుగుంట యెఱుంగ కప్పుఁబోడిన్ గౌఁగిట నదిమినంత". (పు॥లు. 21 - 23)

పురుష వశీకరణ ధ్యానాసక్తలయిన వన్నెలాడు లాడు పంచాస్త్రి భాగవతము నకు ఇరువది యేండ్ల భాగవతుని పరమాద్భుత వ్యాఖ్యానము ఈ వచనము.

దుర్వాస మహర్షి అంబరీషుని భక్తి శక్తిచే చక్రానల బాధనుండి విముక్తుడయి సంతసించి పల్కిన—

ఎలమి భాగవత శేఖర నిన్నని తృప్తి చెందె నా మనసు
కలుగుఁగాత నీ కిష్టసంసిద్ధి కమలనాభు ముద్దుపట్టివై తివి
భళి భళి భళి భళిరా నీ మహిమము భళి భళి భళి భళిరా. (పు-29)

అన్న పల్కులు, ఒక్క రాత్రికి రాత్రియే ఈ అంబరీష చరిత్రమును ఇంత చిన్న వయసులో ఇంత చక్కగా వ్రాసి ధారణచేసి మరునాడు పరమాద్భుతముగా ప్రదర్శించిన దాసుగారిని చూచి మురిసిపోయి అన్న ఆనాటి ఛత్రపురపు అధికారి పల్కులగునేమో!

## గజేంద్ర మోక్షణము :

గజేంద్ర మోక్షణ హరికథ దాసుగారి భాగవత హరికథలలో మూడవది. ఈ గజేంద్ర మోక్షణము వ్రాసినది 1886 లో. అనగా దాసుగారికి అప్పటికి ఇరువది రెండేండ్లు. ఈ హరికథ వ్రాయునాటికి దాసుగా రెన్నియో ప్రశంస లందుకొనుచున్నను 'ఆపరితోషాద్విదుషాం నసాదుమన్యే ప్రయోగవిజ్ఞానమ్' [1] అను స్థితిలో నున్నట్లు—

ఓహో యెంతటి పుణ్యమబ్బెను సదుద్యోగస్థులై మీరలు
త్సాహంబొప్పఁగ నున్నవారు మిము శాస్త్రప్రౌఢి రంజింప నా
యూహల్ చాలునె కాని బాలకుని యర్ధోక్తిన్ ప్రపూర్ణంబుగా
నూహింపంగలవారు పెద్దలని నేనుత్సాహినై పల్కెదన్. (పు - 3)

అను పీఠికలోని ఈ పద్యము సూచించుచున్నది. ఈ హరికథ విజయనగర వేణుగోపాలస్వామికి అంకితము.

---

1. అభిజ్ఞాన శాకుంతలము. - (ప్రథమాంకము)

ఈ కృతి కృష్ణుని ప్రార్థనతో ప్రారంభమగును. తరువాత నిర్గుణ స్తుతి, గణపతి స్తుతి, సరస్వతీ స్తుతి, సభాస్తుతి వచ్చును. మరల 'జగచ్చక్రవర్తి' యౌ సర్వేశ్వరుని స్తుతి, అజ్ఞానమయమయిన సంసార వర్ణన, దశావతార వర్ణన, భక్తి ముఖ్యమను బోధన, విజయనగర వర్ణన, అనంచ గజపతి స్మరణ వచ్చును. ఇది యంతయు సుదీర్ఘమయిన భక్తిప్రేరకమగు ఉపోద్ఘాతము.

కథ పురాణధోరణిలో ప్రారంభమగును. పరీక్షన్మహారాజు శుకముని నాథునితో 'నీరాటమునకు వనాటమునకు పోరాటము ఘోరాటవిలో నెటుల కలిగె? పుణ్యమయిన ఈ గాథను చెప్పవే' యని యన శుకమహర్షి 'వినుమయ్య రాజేంద్ర, వేదండ రాజరక్షణమ్ము' అని ఈ కథను ప్రారంభించును.

ఒక గజరాజు త్రికూట పర్వత ప్రాంతారణ్యములో సంచరించుచు తన భార్యలతో దారితప్పుట—దాహముచేయ ఒక సరోవరము చెంతకు చేరి భార్యలతో జలక్రీడ సలుపుట—గజేంద్రుని ఒక మొసలి పట్టుకొనుట—వేయి సంవత్సరములు మొసలితో పోరాడి గజేంద్రుడు శక్తి నశింప దైవమును కాపాడుమని ప్రార్థించుట—వైకుంఠమునుండి విష్ణువు వచ్చి చక్రముతో నక్రమును ఛేదించి గజేంద్రుని రక్షించుట—గజేంద్రుడు విష్ణుని స్తుతించుట—విష్ణువు గజేంద్రునకు మోక్ష మొసగుట—అనునవి ఈ హరికథలోని కథాంశములు.

ఈ హరికథ యంతయు భాగవతాష్టమస్కంధము నందలిదే. దాసు గారు ఈ కథలో చెప్పుకొనదగిన మార్పులేమియు చేయలేదు. 'హూహూ' అను పేరు గల గంధర్వుడు శాపకారణమున మొసలిగా జన్మించినట్లు, ఇంద్రద్యుమ్నుడను రాజు కలశజుని శాపకారణమున గజరాజుగా జన్మించినట్లు భాగవతమున కలదు. ఈ కరిమకరముల పూర్వవృత్తాంతములను దాసు గారు కథాంతమున వివరింపలేదు, గజరాజు ప్రార్థనలో మాత్రము వచ్చును. కథాకథనవిధానమే కాక కథాశరీరము కూడ పోతన గారి గజేంద్ర మోక్షణ కథకు అనుకరణమే. మచ్చునకు కొన్ని ఉదాహరణములు—

'నీరాటమునకు వనాటమునకుం బోరాటమెటు కలిగె
ఘోరాటవిలో కుంజరోత్తమున కారాటం బెటు దోలగె' (పు-8)

అనునది పోతనగారి కథలోని—

'నీరాట వనాటములకుఁ
బోరాటం బెట్లుగలిగెఁ బురుషోత్తముచే
నారాట మెట్లు మానెను
ఘోరాటవిలోని భద్రకుంజరమునకున్' (8-19)

అను పద్యమునకు ప్రతిబింబమే కదా.

'కరి మకరి దిగుచు దరికి మకరియును గరిని దిగుచు లోపలికిన్
దిరదిర దిరుగుచు బిరబిర నెపయును నరిమురి గలయుచు నలుకన్'
(పు - 14)

అను చరణములు పోతన గారి—

కరిఁదిగుచు మకరి సరసికిఁ
గరి దరికిని మకరిఁ దిగుచుఁ గరికరి బెరయన్
కరిమకరి మకరికిఁ గరి
భరమన నిట్లతలకుతలభటు లదరిపడన్ (8 - 54)

అను చరణములకు అనుసరణములే కదా. ఇట్లే 'సత్తకుని భంగి బెక్కుమూర్తులఁ బరగు నెవ్వఁడు'; 'అతని వెన్క పితి యాయమ తోడుత నవరోధవ్రాతంబున్, జతురుఁడే పక్షీంద్రుడు'; 'విహ్వల నాగేంద్రము పాహి పాహి' మొదలగున వెన్నియో పోతనగారి పదసంపద యందలివే.

దాసుగారు ఈ హరికథలో వారి ఛందశ్శాస్త్ర వైదుష్యమును వృత్త వైవిధ్య రూపమున ప్రదర్శించినారు. సామాన్యముగ వ్రాయు ఆటవెలది, తేటగీతి, కంధము, సీసము, చంపకోత్పలమాలలు, మత్తేభశార్దూలములు గాక తోటకము, స్రగ్ధర, పాదపము, కందుకము, మదనము, తరువోజ, హయరగతి రగడ, కవి రాజ విరాజితము, పంచచామరము, మధ్యాక్కర, మత్తకోకిల, స్రగ్విణి, తరలము, ఉత్సాహ, మంగళమహశ్రీ, మానిని, ఉత్సాహ, లయగ్రాహి, ద్విపద, మంజరి మొదలగువానిని గ్రహించిరి. అంతేకాదు గద్యను, దండకముచు గూడ గ్రహించిరి.

గ్రంథాదిని వాణిని గీర్వాణభాషలో నుతించిన—

మాతః కృపాతరంగిణి వికసన్నయనామృతోర్మి శీకరిణి
సకలజనమోదకారిణి శ్రుతిసంచారిణి నమోஉస్తుతే వాణి (పు - 2)

అను శ్లోకము దాసుగారికి ఇరువది రెండవ యేటనే సంస్కృతశ్లోక రచనా సామర్థ్య మేర్పడినదనుట కొక సాక్ష్యము. అంతే కాదు, గ్రంథ ప్రారంభమందలి—

తొల్లి గజపతిఁబ్రోచుట తెల్లమనుచు
నెల్లజనములు నెఱుఁగంగ నిచట వెలసి
కరుణతోడుత నానంద గజపతీంద్రుఁ
బాలనము సేయు వేణుగోపాలమూర్తి

మొసలిచేఁ బట్టువడి నీటమునిగియున్న
గజమును సుదర్శనంబునఁ గాచు శౌరి
మోహమునఁ బట్టువడి భవమున మునుంగు
మనలఁగూడ సుదర్శనముననె కాచు (పు - 8)

అను పద్యము లందలి 'గజపతి, సుదర్శన' శబ్దముల చమత్కారము కథాసంబంధము కలిగి ఔచిత్యవంతములైనవి.[2] ఈ హరికథా పీఠికలో భగవచ్ఛక్తిని వివరించుచు చెప్పిన నొక చక్కని పద్యము—

ఒకటి సున్నతోడ నుండి యెంతయుఁ దన
విలువ దానియందు విస్తరించు
కరణి నెవ్వఁడీజగంబునఁ బెంపంది
దీని నడచి తుదకుఁదానె మిగులు (పు - 6)

పురాణప్రసిద్ధములయిన దశావతారములను సృష్టిక్రమపరిణామానుసారముగా ('ఇవల్యూషన్ థీరీ') అన్వయించి చెప్పుట ఈ పీఠికలో కన్పడు మరియొక విశేషము. (పు - 6)

2. దాసుగారు గజేంద్రమోక్షణ హరికథను వ్రాయునాటికి విజయనగర ప్రభువైన ఆనంద గజపతిని దర్శింపలేదు. కనుక రెండవ పద్యము సంగతి యెట్లున్నను 'గజపతి' శబ్దచమత్కారమున్న పద్యము అచ్చువేయించు కాలమున వ్రాసి గ్రంథమున చొప్పించి యుందురు.

ఈ హరికథ చిన్నవయసులో వ్రాసినదైనను చేయి తిరిగిన కవి గ్రంథములో వలె రచన సాగినది.

గజరాజును రక్షించుటకై బయలు దేరిన శ్రీహరిని అనుసరించిన లక్ష్మీదేవి విధము :—

అంసభాగంబున నాడెడు గొప్ప కొ
ప్పున సన్నజాజులు పుడమిరాలఁ
జిన్ని కెంజాయ వాల్గన్నులు కమ్మల
దివిటీల మును నటుల విధ మొప్ప
హరికరాకృష్ట చేలాంచలంబున నీవి
యందునఁబాణిద్వయంబు మెఱయ
మోము వేకువ చందమామ పోల్కిని వెల్ల
నధరంబు పైఁగెంపు లలరుచుండఁ
గాలి పావడ జీరాడ కాంచి పీడ
కౌను జవ్వాడ నారద మౌని పాడ
మేచకముతోడఁ దొల్కరి మెరుపుజాడ
నేఁగుదెంచెను లక్ష్మి సర్వేశునీడ (పు - 26)

కరిమకరముల పెనుగులాటకు ఆకరమైన సరోవరాకారము—

చటుల వాత ధూత శైవాల జలద భీత రాజ మరాళ క్షిప్త పక్షంబులు సిత పటచ్ఛాదితోరుతాళవృంతంబులై చెలంగ, సిత రక్త నీలోత్పలంబులు విచిత్ర దీప ముల భంగి వెలుంగ, పద్మాంకురంబులన్ జెంచువుల ద్రుంచి నమలు రాజ చక్రం బులు తాంబూల చర్వణానంద కందులైన రాజ చక్రంబులుగ విలసిల్ల, దలదరవింద మరంద బిందు సందోహాస్వాదన తుందిలేందిందిర నిస్వనంబు వీణాగానంబయి రాజిల హరి నీలమంటపంబుపై భాసిల్లెడు దివ్యగాన సభగా నద్దాని భ్రమసి దగ్గర విమానం బులు డిగ్గి నురికి వడివడి దడబడి యందు జొచ్చి యయారే మోసపోయితి మని తడి సిన పుట్టంబులు పిడచుకొనుచు మరల విమానంబుల కేగు కిన్నర కింపురుష వియ చ్చరుల కలకల ధ్వనులును, కలధ్వనుల మింటికెగసి యల్లాడుచు పాఠీనంబుల నొడిసి పట్టి తిను నీటి పిట్టలును, పిట్టలకై మట్టుమీరి నెట్టన జగడంబుల నెట్టుకొను పొట్టి

భాతుల మెత్తంబులును, మొత్తంబులయి పైకి దేలి మిట్టిపడు మిట్టలం బట్టి మ్రింగుచు దోబూచి చూపుచు మునింగి తేలు కారండవంబులును గలిగి, రామాయణ భారత భాగవతామ్నాయంబుల తెరంగున సుగ్రీవ పాండవ బృందావన మహిమాభిరామంబై, హరిభంగి హరిభంగి నింబారంభాయుతంబై, రాము గరిమ రాము గరిమ తాళ భూజాంకితంబై, సుకవి భాషణంబు తెరంగున శ్రోత్రోత్సవంబై, సుందరీ రత్నంబు భాతి నేత్రపర్వంబై, చిత్రిణీజాతి స్త్రీ విధంబున చంచల రసయుతంబై, యోగి హృదయంబు పోలిక గభీరమయ్యును ప్రసన్నంబై, రాజ ముఖంబు వలె రమణీయంబయ్యును భయంకరబై, నలుచదరంబై, అతుల విస్తీర్ణంబై వెలయు నప్పంకజాకరంబు....." (పు - 11, 12)

పోతన గారి గజేంద్రమోక్షణ కథలో శ్రీకృష్ణుని ప్రసక్తి యుండదు. దాసు గారి కథలో విజయనగర వేణుగోపాలుని ప్రసక్తి యెక్కువ. పోతన గారి గజేంద్రుని స్తుతి యంతయు పోతనగారిదే యైనట్లు, దాసు గారి గజేంద్రుని స్తుతి యంతయు దాసు గారిదే.

## రుక్మిణీ కల్యాణము:

దాసు గారు ఎక్కువగా చెప్పిన హరికథలలో ఈ రుక్మిణీ కల్యాణ మొకటి ఈ రుక్మిణీ కల్యాణ కథతో దాసు గారి కొక అనుబంధ మున్నది. బాల్యములో, తండ్రియైన వేంకట చయనులు గారి శిష్యులలో నొకరయిన తాతన్నగారి చెంత భాగవతము నందలి రుక్మిణీ కల్యాణ కథను చదువుకొనినారు. భాగవతములో దాసు గారి కంఠముతో చెలిమి చేసిన తొలి కథ రుక్మిణీ కల్యాణ కథ.

నీలోత్పలదళశ్యామం రామం రాజీవలోచనమ్
దుష్టరాక్షస దృక్క్షమం నౌమి పాపవిమోచనమ్ ( పు - 8 )

అను శ్లోక రూప శ్రీరామస్తుతితో ఈ హరికథ ప్రారంభ మగును. తరువాత తెలుగులో శ్రీరామ స్తుతి, జానకీ స్తుతి, సరస్వతీ స్తుతి, సభా సంబోధనము వచ్చును

తరువాత పరీక్షిద్భూవరుడు శుకమునినాథుని రుక్మిణీ పరిణయమును అనతిచ్చి దయ చిల్కుమన—

అప్పుడు శుకయోగి మోక్ష తత్త్వార్థభోగి
శిష్టవర్తనుఁడౌ పరీక్షిత్తుతోడ

శౌరి రుక్మిణిఁ బెండిలి సల్పికొనుట
వీనులకు విందు గాఁగ విన్పించె నిట్లు (పు - 5)

అనుచు కథా ప్రారంభము పురాణధోరణిలో చేయుదురు.

సామాన్యముగా దాసు గారు ప్రతి కథలో చేయు వినాయకస్తుతి దీనిలో లేక పోవుట, ఏ యితర కథాదిలో కన్పడని జానకీరాముల స్తుతి ఈ కథలో కన్పడుట ఒక విశేషము. కథా ప్రారంభమునకు ముందు దాసు గారు వ్రాయు సుదీర్ఘోపోద్ఘాతము కూడ దీనిలో కన్పడదు.

భీష్మకుడను రాజు విదర్భ నేలుచుండుట — అతనికి ఐదుగురు పుత్త్రులు, ఒక పుత్రిక యుండుట — వారిలో తొలిపట్టి రుక్మి, కడచూలు రుక్మిణి యగుట — తల్లి దండ్రులు రుక్మిణిని కృష్ణున కీదలచినను, రుక్మి రుక్మిణిని శిశుపాలున కీయదలచుట — కృష్ణుని వరించిన రుక్మిణి మంచి ముసలి బ్రాహ్మణుని ముఖమున కృష్ణునకు సందేశ మంపుట — ఉత్తరముతో గూడిన సందేశమును బ్రాహ్మణుడు శౌరికి విన్పించుట — రుక్మిణికి వివాహలగ్నము సమీపించుట - బ్రాహ్మణుడు శుభవార్త చెప్పుట - కృష్ణుడు వచ్చి రుక్మిణిని తీసికొనిపోవుచుండ సాళ్వజరాసంధచైద్యాది రథికులు యుద్ధము చేయుట - రుక్మికి మీసంబులు గొరుగుట - రుక్మిణిని ద్వారకలో శాస్త్ర పద్ధతిని వివాహము చేసికొనుట - గదిలో శ్రీహరి రుక్మిణికి విశ్వరూపముతో కనబడుట - రుక్మిణి స్తుతించుట - కృష్ణుడు విరసము లాడుట - రుక్మిణి తన్ను నిరసింపవలదని ప్రార్థింప, కృష్ణుడు రుక్మిణిని ఓదార్చుట అన్నవి ఈ కథలోని అంశములు.

ఈ కథ యంతయు భాగవత దశమ స్కంధ పూర్వభాగము నందలిదే. దాసు గారు దీనిలో చెప్పుకోదగిన మార్పులు ఏమియు చేయలేదు కాని ఒకటి రెండు చిన్న కల్పనలు చేసిరి.

రుక్మిణి కృష్ణుని చెంతకు పంపిన 'మంచి ముసలి బ్రాహ్మణునకు' సందేశమే కాక ఒక లేఖ కూడ వ్రాసి యిచ్చినట్లు దాసు గారి కథలో కలదు. ఆ వెళ్లిన ముసలి బ్రాహ్మణుడు కృష్ణునకు రుక్మిణీ సందేశమును తెలిపి 'ఆనవాలుగా నింతి యుత్తరము'ను జూపును. ఈ లేఖ దాసు గారి కల్పన. భాగవత కథలో రుక్మిణి 'కొన్ని రహస్య వచనములు' మాత్రమే చెప్పి పంపినట్లున్నది.

రుక్మిణిని కృష్ణుని గదిలోనికి పంపు సరసఘట్టమును దాసుగా రొకటి సొంతముగా వ్రాసిరి. అది సుగుణసముద్ర యగు సుభద్ర రుక్మిణిని 'కీలు పట్టెడు మాటలతో గేలి చేయుట' అను సరస సంభాషణ ఘట్టము. (పు - 40)

ఇట్లే గదిలోనికి వెళ్లిన తరువాత రుక్మిణికి—

'అప్పుడప్రబముగ రుక్మిణీకాంత యక్షులు మిర్మిట్లుద్రుదువన్
జప్పున మెరయగ కృష్ణునకున్ విశ్వరూప మెంతయు నొదువన్
వేలకొలది శిరస్సు లక్షులున్ వింతకరములున్ బదముల్' (పు-41)

కన్పడును. 'ఆశ్చర్య భీతి సమ్మదములు ముప్పిరి కొనగా మై పుల్కరింప' రుక్మిణి సాష్టాంగపడి నుతించును. హరి విశ్వరూపమును ఉపసంహరించి యథా రూపమును దాల్చును. ఆ తరువాత గోపాలుడు—

'న్యైలైన క్షత్రియోత్తము డాశిశుపాలుడు నీకు తగిన వరుడుండ
నీ లెఱుంగ కేల వెఱపడితివి పేద నల్ల గొల్లవాడ నాపై' (పు - 43)

అనుచు 'విరసము' లాడును. ఆ మాటలకు రుక్మిణి 'నన్ను నిరసింప దగవౌనా?' అని ప్రార్థింప, కృష్ణుడు 'నీ మనసెరుగంగ నంటి, నను మన్నన సేయు మటంచు కౌగిటంగొని రతి దేల్చె'ను.

ఈ ఘట్టమంతయు దాసు గారి కల్పనమే. ఇట్లు కృష్ణుడు విరసముగా మాటలాడుట భాగవతము నందలి రుక్మిణీ కల్యాణ ఘట్టమునందు లేదు. కాని ఇటువంటి విరస సంభాషణము భాగవత దశమస్కంధోత్తర భాగమునందు గలదు. ఆ భాగవత ఘట్టము నందలి మూడు పద్యములు—

సిరియును వంశము రూపును
సరియైన వివాహసఖ్య సంబంధంబుల్
జరుగును, సరిగాకున్నను
జరుగవు లోలాక్షి! యెట్టి సంసారులకున్

తగదని యెఱుఁగవు మమ్మున్
దగిలితివి మృగాక్షి! దీనఁదప్పదు నీకుం
దగిన మనుజేంద్రు నొక్కనిఁ
దగులుము గుణహీన జనులఁదగునే తగులన్

సాళ్వ జరాసంధ చైద్యాదిరాజులు
చెలఁగి నిన్ వీక్షింప మలయుచుండు
రదిగాక రుక్మి నీ యన్నయు గర్వించి
వీర్యమదాంధుఁడై వెలయుచున్న
వారి గర్వంబులు వారింపఁగా గోరి
చెలువ! నిన్నాడిసి తెచ్చితిని గాని
కాంతా తనూజార్థ కాముకులము గాము
కామమోహాదులఁ గ్రందుకొనము
విను ముదాసీనులము క్రియావిరహితులము
పూర్ణులము మేము నిత్యాత్మబుద్ధితోడ
వెలుగుచుండుము గృహదీప విధము మెఱసి
నవలతాతన్వి! మాతోడ నవయవలదు [3]

ఈ హరికథలో దాసు గారు వారి శ్రద్ధాశక్తు లన్నియు రుక్మిణీ పాత్రపోషణ మందు వినియోగించినారు. రుక్మిణీ బాల్యము దశ, లేజవ్వనంపు పసందు. ఔచిత్య వంతమయిన సందేశము, గుణ సౌందర్యము, సౌందర్యగుణము, మొగము మొత్తని విరహము, వధూవేషాలంకరణము, కృష్ణునిపై గల భయభక్తులతో గూడిన ప్రేమ.... అవి యివి యన నేల, రుక్మిణీ పాత్ర పోషణకు కథ యిచ్చిన సర్వావకాశములను వినియోగించుకొనిరి.

జగము ముద్దు కన్నె యగు రుక్మిణి జవ్వనపు వన్నెను దాసు గారు పన్నిన విధము—

లేజవ్వనంపు పసందు నాల్గాజాము క్రొంబొద్దు వేగిన సందు ।లే।
గాజుల నేర్పు జాజులకూర్పు
తొగరు వా తెరదొండ నగు నగు రేయెండ
ముగుద పల్చాలు ముత్యాలు నమ్మగువచూపు మగమీలు
పల్కఁగనె రాలు రవరాలు పసిముద్దరాలు ।లే।

3. శ్రీ మదాంధ్ర మహాభాగవతము - దశ., ఉత్తర., ప॥లు 233-35

నీలపుటుంగరాల్వ్రేలుగ ముంగురు ల్మే
ల్మేలుర చెక్కిళ్ల తళ్కు వేవేలుర యక్కలిక్కి బెళ్కు
పెక్కేలా నవరసము లొల్కు నడ కుల్కు ।లే।

కాయజు కటారి కలికి మిటారి హా
హాయిర నెమ్మోముతీరు నో ర్మాయుర చందురుసౌరు
నారాయణదాస నుతిమీరు వయసు ముద్దుగారు ।లే।

( పు - 7 )

మురహరుడు వచ్చి తన మెడలో పుస్తె కట్టునను సంతోషముతో నున్న రుక్మిణీ కన్య హొయలు—

దూర్వాంకురమ్ములతో సన్నజాజులు
మొగిలిరేకులు జారు సిగనుజుట్టి
తళ్కుచెక్కు గులాబి దంతపు నిగ నిగ
రవల కమ్మలజోడు చెవులబెట్టి
లేత్రపాయపు బిగి చేతి గాజులు రైక
యొడ్డాణమున్వ్రేలియుడుపుగట్టి
ముద్దు మొగంబున ముత్తైదు చిన్నెల
నంబపేరిట నోగిరంబు పట్టి
వెన్నెలలు చీకటులు బర్వు కన్నుదోయి
ముత్తెము ల్గెంపులొల్కెడు ముద్దువాయి
నందమగు రుక్మిణీకన్య కలరుహాయి
చాటి చెప్పగ వేయినోళ్ళు చాలవోయి (పు - 22)

వధూ వేషాలంకరణములతో దుర్గ గుడికి బయలుదేరి వెళ్లిన రుక్మిణి విధము -

అంబకై పేరోగిరంబు పళ్లెరములఁ
బట్టి చెలుల్ దన చుట్టు కొల్వఁ

బెండ్లికూతురయంచుఁ బ్రియమునఁ బలుమారు
తేలుగఁజుట్టపక్కాలు బిల్వ
వెన్నెలపోక మర్పించెను దనుకాంతి
యెన్ని యుగంబు లూహించె నల్వ
మందస్మితము తేట మౌక్తికముల పేట
తోటి చిత్తరుల కందోయి నిల్వ
దెసలు మెరయించి కోట యతిక్రమించి
ముత్తెపుం జెన్మ్రుటల దూర ముత్తరించి
దుర్గగుడిఁగాంచి రుక్మిణి స్తుతులమించి
యీశ్వరిని భక్తితోడఁ బ్రార్థించె నిట్లు (పు - 29)

వైదర్భిగా గాక తెలుగు బాలగా కనబడు రుక్మిణి బాల్య చేష్టలు -

శ్రీ రుక్మిణీ బాల్యముదశ చెప్పెద సాకల్యము వినుము ।శ్రీ రు।
మేరుధైర్య! సచ్చర్య నరవర్య!
పేరు పేర బొమ్మపెండ్లిండ్లు గావించి
వెలదులతో వియ్యమందు చిన్నారి తలపేమనందు
విను మారా గుజ్జనగూళ్ళు వండించి తోనాడు చెలులకుం బెట్టు
బెంపారు చెల్మి చేపట్టు ముద్దారబువుదీగమొట్టు మినుమిట్టు ।శ్రీ రు।
రతనపు మేడల రాగిలు బంగారతికిన తూగు
టుయ్యాలలో నూగు మైనతోడ మోగు
నెమలితో మురిపెముల రేగు నంచలకు
చతురత నడకలు జూపు సమరత ముచ్చట మదిజోపు
కోర్కొన్న తండె దేవుడగు కృష్ణుడని సమ్మంచి మది తెలుప కోపు
(పు - 6) ।శ్రీ రు।

రుక్మిణీ పంపిన ముసలి బ్రాహ్మణుడు ఒక గొప్ప అడవిని దాటి ద్వారకా నగరము చేరినట్లు దాసు గారు వ్రాసినారు. ఆ అడవి అచ్చ తెనుగు పదముల అడవి. (పు - 12)

రుక్మిణీ కల్యాణ హరికథను దాసు గారు 1923 లో కాకినాడలో చెప్పుచు చెప్పిన అంతరార్థ మిది [4] -

'రుక్మిణి యనెడు బుద్ధి బ్రాహ్మణుడను వేదశాస్త్ర సాహాయ్యమున శ్రీ కృష్ణుడను పరబ్రహ్మము నెఱింగి యందు లీనమగుటయే రుక్మిణీ కల్యాణాంతరార్థము.'

## ప్ర హ్లా ద చ రి త్ర ము :

విజయనగర నివాసులలోని దాసు గారి నేస్తులలో శ్రీ బొడ్డు వేంకటేశము ఒకడు. 'విదురుని బోలిన ఆ నేస్తు దొకనాడు' దాసు గారితో వినయముగా నిట్లు పలికినాడు—

'సంస్కృతంబున గృష్ణ జననము తెనుఁగున
నంబరీష చరిత్ర మల గజేంద్ర
మోక్షణమున్ ధ్రువ భూపతి చరితము
మార్కండు చరితము మనసుదీర
సత్యహరిశ్చంద్ర చారిత్రమున్ రుక్మి
ణీపరిణయముల నేర్పు మెరయ
గాన ప్రబంధముల్ గావించి హరికథా
రూపకోపన్యాస రూఢిమీరి

భళిర ! నీవలెఁ బండిత పామరులను
బెక్కు దేశంబులన్ రక్తిఁజొక్కఁజేసి
గానకవితా ప్రతిభఁజూపు ఘనుఁడు గలఁడె
తథ్య ధుర్య ! నారాయణదాస వర్య !'

4. శతజయంత్యుత్సవ సంచిక — సంస్కృతి సమితి, చీరాల, పు. 257

బెండ్లికూతురయంచుఁ బ్రియమునఁ బలుమారు
షేలుగఁజుట్టపక్కాలు బిల్వ
వెన్నెలపోక మర్పించెను దనుకాంతి
యెన్ని యుగంబు లూహించె నల్వ
మందస్మితము తేట మౌక్తికముల పేట
తోటి చిత్తరుల కందోయి నిల్వ

దెసలు మెరయించి కోట యతిక్రమించి
ముత్తైపుం జెన్మటల దూర ముత్తరించి
దుర్గగుడిఁగాంచి రుక్మిణి స్తుతులమించి
యీశ్వరిని భక్తితోడఁ బ్రార్థించె నిట్లు (పు - 29)

వైదర్భిగా గాక తెలుగు బాలగా కనబడు రుక్మిణి బాల్య చేష్టలు -

శ్రీ రుక్మిణీ బాల్యముదశ చెప్పెద సాకల్యము వినుము ।శ్రీ రు।
మేరుధైర్య! సచ్చర్య నరవర్య!
పేరు పేర బొమ్మపెండ్లిండ్లు గావించి
వెలదులతో వియ్యమందు చిన్నారి తలపేమనందు
విను మారా గుజ్జనగూళ్ళు వండించి తోనాడు చెలులకుం బెట్టు
బెంపారు చెల్మి చేపట్టు ముద్దారబువుదీగముట్టు మినుమిట్టు ।శ్రీ రు।
రతనపు మేడల రాగిలు బంగారతికిన తూగు
టుయ్యాలలో నూగు మైనతోడ మోగు
నెమలితో మురిపెముల రేగు నంచలకు
చతురత నడకలు జూపు సమరత ముచ్చట మదిజోపు
కోర్కొన్న తండె దేవుడగు కృష్ణుడని సమ్మంచి మది తెలుప కోపు
(పు - 6) ।శ్రీ రు।

పేరు పెట్టుట - ప్రహ్లాదుని గుణ గణ వర్ణనము - కనక కశిపుడు ప్రహ్లాదుని గురువులకు నప్పగించుట - ప్రహ్లాదుని చదువును హిరణ్యకశిపుడు పరీక్షింపదలచి రప్పించుట - ప్రహ్లాదుడు విష్ణువును ప్రశంసించుట - ఇతనిని సరియైన త్రోవలో నుంచెదమని గురువులు మరల తీసికొనివెళ్లి కొంతకాలమైన తరువాత మరల తండ్రియొద్దకు ప్రహ్లాదుని తీసికొని వచ్చుట - మరల తండ్రితో ప్రహ్లాదుడు హరిభక్తిని గూర్చి ఉపన్యసించుట - హిరణ్యకశిపుడు గురువులపై ఆగ్రహించి తరువాత వారి తప్పు లేదని తెలిసికొనుట - ప్రహ్లాదుని చంపుటకై హిరణ్యకశిపుడు అనేక ప్రయత్నములు చేసి విఫలుడగుట - ప్రహ్లాదుడు అసురార్భకులకు హరిభక్తి వివరించుచుండుట - హిరణ్యకశిపుడు ఆ చక్రిని స్తంభమునందు చూపగలవా? యని స్తంభమును విరుగగొట్టుట - స్తంభమునుండి నారాయణుడు నరకేసరి రూపముతో వచ్చి హిరణ్యకశిపుని సంహరించుట - మహారౌద్రముతో నున్న నృసింహుని శాంతింపజేయుటకు దేవతలు భయపడ ప్రహ్లాదుడు స్తుతించి శాంతింప జేయుట - నృసింహుడు ప్రహ్లాదునకు వరము లిచ్చి పోవ, బ్రహ్మ ప్రహ్లాదునకు పట్టాభిషేకము చేయుట అనునవి ఈ హరికథలోని కథాంశములు.

ఈ హరికథలోని కథ యంతయు పోతన గారి భాగవత సప్తమ స్కంధము నందలిదే. దాసు గారు అందలి కథాసారమునేకాక కథా శరీరమును గూడ బాగుగా గ్రహించినారు.

వైకుంఠచింతా వివర్జిత చేష్టుడై
యొక్కెడ నేడుచు నొక్కచోట (7-124)

అను పద్యమునకు అనుసరణ మిది—

హరికథాచింతాపరవశుడై యతడేడ్చు నొకచోట హరి భావనా
రూఢచిత్తుడై పాడునొకచోట హరికి దక్క వేరు లే
దని నగు నొకచోట హరి యను నిధానమును గంటి నని
యుబ్బు నొకచోట హరి హరి యను నొకచోట నానందాశ్రు
పులొల్క నురుపుల్కలు గన్నుమూసి యూరకుండు నొక్కచో
(పు - 13)

" అంధేందూదయముల్ మహాబధిర శంఖారవముల్ " (7 - 168) అను పద్యమునకు ప్రతిబింబము—

చెలగు వెన్నెల గ్రుడ్డివానికి చెవిటివానికి శంఖారావము
వెలయు చదువులు మూగివానికి వెలదులన్ రతి నపుంసకునకు
చెలిమి కృతఘ్నునియెడ హవ్యంబులు భస్మరాశి యందున
వలె వ్యర్థంబయ్యెడు శ్రీహరి భక్తిలేని వారల బ్రతుకులవి (పు - 18)

" సురలం దోలుటయో ! సురాధిపతులన్ స్రుక్కించుటో! " (7 - 146) అను పద్యమునకు ప్రతిరూపము—

సుర కిన్నర నాగ ఖేచరులను నిర్జించుటయో గరుడ యక్ష
విద్యాధర గంధర్వుల గూల్చుటయో మరి సిద్ధుల గెల్చుటయో
ఘనుల బాధించుటయో హరి గిరి యంచున్ గడు మో
హాంధుడవై చెడనేలర... (పు - 15)

ఇట్లు దాసుగారు ఈ హరికథలో పోతనగారి భావభాండాగారమును యథాశక్తి స్వాధీనము చేసికొన్నను, సందర్భానుసారముగా సొంత రచన కొంత చేర్చక పోలేదు. శాఖా చంద్ర న్యాయముగా ఉదాహరణములు ఒకటి రెండు....

తన భార్యను దేవేంద్రుడు చెరబట్ట దలచెనని నారదముని వలన తెలిసికొన్న సందర్భమునందు హిరణ్యకశిపుని ధోరణి—

తెలిసెలే యా మోసకారి దేవేంద్రుడు చేసినపని యిదా ।తె।
నెలతగను కొమరునిన్ జంపగ నెట్టుకొనియె నదెంత ద్రోహియో
పులిమీసములు పెరుకునట్లు శలభమగ్గిలో బడునట్టు బలుతాచు
నుద్రిడునట్లు సలిపెగదు నాకా యధముండు ।తె।
నేటితో స్వర్గము పని సరి, నిఖిల దేవతల పని సరి, మీాటి
దిక్కుల నేల గల్పెద, మేరువను తలక్రిందు సల్పెద
సాటి యెవరు నాకీ జగముల నేటి కిక జాలముసేసెద
చాటించుదు నా జయభేరి మేటి బ్రహ్మాండమెల్ల పగులగా ।తె।
(పు - 11)

తన భార్యను చెరబట్టి తీసికొనిపోవు ఇంద్రుని బారినుండి ఆమెను రక్షించి తన ఆశ్రమ మందుంచుకొని తనకు అప్పచెప్పినపుడు కృతజ్ఞతతో హిరణ్యకశిపుడు నారదునితో పలికిన విధము—

భళిరా! యెంతటి గుండెదీసినపనిన్ బాకారి పాపాత్ముఁడై
సలిపెన్ నారద! యాత్మబంధుఁడవు నాచర్మంబు నీ పాదర
క్షలు గావించినవైన నీ ఋణము నాశక్యంబె తీర్పంగ నం
చోలయన్ మ్రొక్కిన సంతసిల్లి చనియెన్ యుద్ధాశనుం డంతటన్.

(పు - 12)

ఈ హరికథలో మెఱపులవలె కొన్ని చక్కని భావములు కలవు.

విద్యను గూర్చి—

'గాజుపోలికి రెట్టి గావించెడిన్ నైజ
మగు తెల్వి దీపంబు నంటి విద్య' (పు-14)

భగవంతుని గూర్చి—

'ఆకాశమట్టుల నంతట నిండియుఁ
దానెద్దియుంగాక తనరు చుండు' (పు-23)

భగవద్భక్తిని గూర్చి—

'కల్లను నిక్కంబు గావించు నాతండు
సున్నకు విలువను బన్నునట్లు' (పు-23)

వేదాంతసారమును గూర్చి—

'ఎద్ది కలదో యదియె ఈశ్వరతత్త్వంబు
ఎద్ది లేదో యదియె యీ జగంబు' (పు-23)

దాసు గారి భాగవత హరికథలలో పోతన మహాకవి ప్రభావము అధికముగా గల హరికథ ప్రహ్లాద చరిత్ర.

## శ్రీ హ రి క థా మృ త ము :

శ్రీహరి కథామృతము సంస్కృత భాషలో వ్రాసిన ఏకైక హరికథ. ఈ గ్రంథ మెవరికి అంకితమో దాసు గారు స్పష్టముగా వాచ్యము చేయలేదు. కాని ప్రతి విభాగ ప్రారంభమునందు గల స్తుతుల వలనను, ప్రతి విభాగాంతము నందలి మంగళాచరణముల వలనను ఈ హరికథా సంపుటిని శ్రీహరికి అంకిత మిచ్చినట్లు భావింపవచ్చును.

ఇది మూడు విభాగముల గ్రంథము. విభాగమునకు వారు పెట్టిన పేరు బిందువు. అనగా శ్రీహరికథామృత హరికథ మూడు బిందువుల గ్రంథము. శ్రీహరి యొక్క కథ అమృతమనియు, అందులో గల ఒక్కొక్క భాగము ఒక్కొక్క అమృత బిందువు అనియు దాసు గారి అభిప్రాయము. ప్రథమ బిందువు శ్రీకృష్ణ జననము. ద్వితీయ బిందువు పితృబంధ విమోచనము. తృతీయ బిందువు ధర్మ సంస్థాపనము. ఈ మూడు కథలు భాగవత దశమ స్కంధము నందలివి. కథలే కాదు ఈ 'శ్రీహరికథామృతము' అను నామము గూడ భాగవత దశమ స్కంధము నందలిదే. (భాగ. - దశ. - పూర్వ. 11).

ఈ మూడు కథలను దాసు గారు ఒక్కసారిగ వ్రాయలేదు. మొదట 'శ్రీకృష్ణ జననము' అను నొక్క కథనే వ్రాసిరి. తరువాత పితృబంధ విమోచన కథ, ధర్మసంస్థాపనకథను వ్రాసి, ఈ మూడిటిని గుది గ్రుచ్చి 'శ్రీహరికథామృతము' అను గ్రంథముగా రూపొందించిరి. దీనికి ప్రహ్లాద చరిత్ర హరికథలో వారు వ్రాసిన గ్రంథములను వివరించుచు, 'సంస్కృతంబున గృష్ణజననము....' (ప్రహ్లాద-పు. 5) అని పలికిన పలుకులే ప్రమాణములు.

## శ్రీ కృ ష్ణ జ న న ము :

శ్రీ కృష్ణ జననము శ్రీ హరికథామృత గ్రంథము నందలి ప్రథమ బిందువు. ఇది—

వందే సంశ్రిత కల్పం
సుందర గోపాంగనా హృదయతల్పమ్
బృందావన సంచారం
నంద యశోదాత్మజం దయాపూరమ్ ( పు - 1 )

అను ప్రాస గల గీతితో ప్రారంభ మగును. శ్రీహరి స్తుతి పిదప విఘ్నేశ్వర స్తుతి, అంబా స్తుతి, విద్వత్ సంసది స్తుతి వచ్చును. తరువాత కొంత వేదాంత చర్చ, కొంత కలికాల లక్షణముల చర్చ వచ్చును. తరువాత ముహూరానంద భరిత మైన మురళీధరచరిత మాహాత్మ్యమును, శ్రీకృష్ణభక్తిని గూర్చి సుదీర్ఘ ప్రసంగము వచ్చును. తరువాత మోక్షతత్త్వామృత భోగియైన శుకయోగిని శుగ్రుజాలపూరిత నేత్రములతో పరీక్షిన్నరపతి సంసారసాగర తారణ కారణమైన సాగర శయను కథా సారమును వివరింపుమని అర్థించును. శుకయోగి మరల సుదీర్ఘముగా భగవన్నుతి, భాగవతస్తుతి చేసి కథలోనికి అడుగు పెట్టును.

కథాప్రారంభమునకు ముందుగా సుదీర్ఘములయిన ఉపోద్ఘాతములు వ్రాయుట దాసు గారి హరికథలలో కన్పడు సామాన్యాంశమే. కాని పదునెనిమిది పుటలు గల ఇంత పెద్ద ఉపోద్ఘాతము గల హరికథ మరియొకటి కన్పడదు.

మధురానగరమునకు ఉగ్రసేనుడు ప్రభువు. అతనికి కంసుడను పుత్రుడు, దేవకి యను పుత్రిక యుందురు. దేవకికి శూరసేనుని కుమారుడయిన వసుదేవు నితో వివాహము జరుగును. ఆ నూతన దంపతులను ప్రేమతో కంసుడు రథముపై మధురకు తీసికొనివచ్చుచు మార్గమధ్యమున ఒక వనమున విశ్రమించును. అపుడు అశరీరవాణి 'ఓరీ! కంసా! ఈమె కనిష్ఠ సుతుడు నిన్ను సంహరించును' అని యన, కంసుడు కోపముతో తన సోదరిని ఖడ్గముతో సంహరింపబోగా, వసుదేవుడు అడ్డు వచ్చి 'బావా! నీ సోదరికి పుట్టిన సంతానము నంతయు నీకు స్వాధీనము చేసెదను. ఈమెను చంపకుము' అని వేడుకొన కంసు డంగీకరించి యథాపూర్వప్రేమతో వారిని మధురకు తీసికొని వెళ్లును. కొంతకాలమునకు దేవకి గర్భవతి యగును. అది తెలిసికొని కంసుడు దేవకీవసుదేవులను కారాగారమున బంధించును. కొంత కాలమునకు దేవకి ఒక పుత్రుని ప్రసవించును. మాట ప్రకారము వసుదేవుడు ఆ బిడ్డను కంసున కొసగును. కంసుడు నిర్దాక్షిణ్యముగ ఆ పసిగ్రుడ్డును సంహ రించును. ఈ విధముగ దేవకికి పుట్టిన ఏడుగురు బిడ్డలను వసుదేవుడు కంసున కప్పగించగా కంసుడు సంహరించుట జరుగును. కొంతకాలమునకు దేవకీదేవి శ్రావణ బహుళాష్టమీ నిశీథసమయమున అష్టమపుత్రుని ప్రసవించును. ఈ అష్టమ గర్భమున ఉదయించిన పుత్రుడు సామాన్యబాలుని వలె నుండడు. శంఖ, చక్రాది వైష్ణవ లాంఛనములతో నుండును. ఆ బాలుని బ్రహ్మాది దివిజులు స్తుతింతురు.

దేవకీ వసుదేవులు గూడ ఆనందముతో భక్తితో స్తుతింతురు. తల్లిదండ్రుల స్తుతికి సంతసించి వారి బాధను గమనించి, ఆ భగవత్స్వరూపుడు 'తల్లిదండ్రులారా! నేను కంసుని సంహరించెదను. మిమ్ములను బంధ విముక్తులను చేసెదను. నందుని యింట నున్న అమ్మాయిని మీరు తీసికొనివచ్చి, ఆ బాలిక స్థానములో నన్ను నిల్పి రండు. మీకు అన్నియు సమకూడును' అని చెప్పి, సామాన్య అర్భకుని వలె మారిన తన పుత్రునకు తల్లి యగు దేవకి మంగళము పాడును. ఇది శ్రీకృష్ణ జనన బిందువు నందలి ప్రధాన కథ.

ఈ విభాగమునందు దాసు గారు ఈ శ్రీకృష్ణ జననముతో సంబంధములేని ఒక కథను అవాంతరకథగా చొప్పించినారు. ఆ అవాంతరకథ యిది — 'శతయోజన విస్తారమయిన ఒక అడవిలో ఒక వ్యాధుడు భయంకరమగు వర్షమునకు చిక్కి ఒక చెట్టుక్రింద కూర్చుండి వణకుచు ప్రాణముపై ఆశ వదలుకొని దారా పుత్ర బంధు మిత్రులను స్మరించుచు వీతచేష్టితుడయి యుండును. అప్పుడు ఆ వృక్షముపై గల ఒక మగ కపోతము తన భార్యకు అతని పరిస్థితిని జూపి—

నిరర్థకం తస్యజన్మ దీనానోపకరోతియః
తస్మాత్ సంజీవయిష్యామి గం దత్వాపి సుందరి (పు - 31)

అని చెప్పి సమీపగ్రామమునకు వెళ్లి నిప్పును తెచ్చి దాని గూడును ఆ నిప్పుతో రగిల్చి రెక్కతో చెట్టుపైనుండి ఆ బోయవాని చెంత పడవేసి అతని చలి బాధను పోగొట్టును. ఇది యంతయు చూచి వ్యాధుడు ఆశ్చర్యపడి తన హింసా మార్గమును వీడి సత్యమే పలుకుటకు నిర్ణయించుకొనును.

దాసు గారు 'అహింసా పరమోధర్మః' అనుదానికి వ్యాఖ్యానముగా వ్రాసిన ఈ లుబ్ధక కపోతోపాఖ్యానము భాగవతము నందలిది కాదు. భారతము నందలిది. [5] ఈ యుపాఖ్యానము తప్ప తక్కిన కథ యంతయు భాగవత దశమ స్కంధము నందలిదే. కథన విధానము మాత్రము దాసు గారిది. ఆ కథన విధానమునకు కొన్ని ఉదాహరణములు....

కథాప్రారంభము నందున్న ముక్తపదగ్రస్తాలంకార భూషితమైన మధురా నగరము—

'.... రథాంగ సారస హంస మధుపప్రలుబ్ధ పరిమళ మిలితోత్ఫుల్ల పద్మకైరవ ప్రసన్న మధుర జలాంచత్కాసార విరాజితా — జితాశేష నందన

5. శాంతి పర్వము, తృతీయాశ్వాసము – ప॥లు 306-341.

ప్రసూన ఫల సంభరిత వివిధ వృక్ష లతోద్యాన విభాసురా — సురేశ్వరానందకరై రావణోచ్చైశ్రవో దర్పాతిశయ మనోహర చరన్మదద్విపాశ్వపద సముద్ధూత ధూళీ ధూసరిత దశ దిశావకాశా — కాశాభాశ్మ వినిర్మిత ఘనాఘన మండలాభ్రంలిహ దభ్ర విభ్రమ కృతౌన్నధ గవాక్ష నిర్గత ధూమ పటలాంబుద విలోకన కుతూహల నృత్యన్మయూర సముదయా — దయా సత్య శౌచ శుభగుణాస్పద విహితాచారాను వర్తన పరబ్రహ్మ క్షత్రవైశ్యశూద్ర పంచజన విభాసితా — సితాచల ఇవ శంకరసతీ పదచిహ్న ప్రపూతా — పూతక్రతు ధనురివ వివిధ వర్ణ మధురా — మధురా పురారాజ తేస్మ సంశ్రిత కల్పవల్లీ నగరీమతల్లీ' (పు. - 19)

కంసుడు దేవకీ వసుదేవులను రథముపై నిడుకొని మధురా నగరమును సమీపించుసరికి సాయంకాల మగును. దాసు గారి లేఖిని ప్రసవించిన ఆ సాయంకాల రూపము—

జపాపుష్పచ్ఛాయామయ మఖిల వస్తుష్వకిరన్
ప్రతీచీ దిగ్భాగే విగళతి రవిర్మందకిరణః
అహోసంధ్యావాతః ప్రసవమధుగంధ ప్రసవితా
తనూతాపం హారితి ప్రకటిత భుజంగోత్సవకరః

భూగోళస్యైకార్ధే
వార్ధక్యమయం పరే స్వతారుణ్యమ్
దర్శయతి లోకబంధుః
వ్యసనోదయ యోస్సమానురాగేణ

ప్రవృద్ధార్కేందుకిరణైః పరిపూర్ణం దిగంతరమ్
శోకానందాశ్రుసంపాతైః ప్రసూతాక్షితలం యథా

చంచప్లుతైః భీతి వశాచ్చలంతం
పశ్చాన్మృగీశాబ కుటుంబమేషః
ధీర స్వనే నాభయ మాబ్రువన్నః
పశ్యత్యహో వల్గిత కృష్ణసారః

—పు. 24, 25

కారాగారమునందు వైష్ణవ లాంఛనములతో పుట్టిన బాలుని దేవకీ వసుదేవులు స్తుతింతురు. దాసు గారు ఆ స్తుతిని దండకముగా వ్రాసిరి. ఆ దండకమునందు మీన, కూర్మ, వరాహ, నృసింహ, కుబ్జ, పరశురామ, రామావతారము లెత్తిన 'ప్రభో కృష్ణ గోవింద మాంపాహి తుభ్యం న్నమః' అని కలదు. కృష్ణావతారము ఎనిమిదవ అవతారము గదా. తరువాత వచ్చిన బుద్ధ కల్క్యవతారముల ప్రసక్తి లేకపోవుట, కృష్ణావతారమునకు పూర్వములయిన అవతారములను చెప్పుట చాల ఔచిత్యముగా నున్నది. కృష్ణుడు అష్టమావతారమేకాక దేవకి అష్టమ గర్భ మగుట కూడ విశేషమే.[6]

ఇవి శ్రీహరికథామృత హరికథ యందలి ప్రథమ బిందువయిన శ్రీకృష్ణ జనన మందలి విశేషములు.

## పి తృ బ ం ధ వి మో చ న ము :

పితృబంధ విమోచనము శ్రీహరికథామృతము నందలి ద్వితీయ బిందువు. ప్రథమ బిందువయిన శ్రీకృష్ణజననములోని కథయే దీనిలో కొనసాగుచున్నను దాసు గారు దీనిని ప్రత్యేక హరికథగా వ్రాసినారు. ఇష్టదేవతా స్తుతితో ఈ బిందువు ప్రారంభమై అఖండ భవాబ్ధివహిత్రమయిన అండజవాహ చరిత్ర గానముతో కథా ప్రారంభ మగును.

పుట్టిన సుందర శ్యామల విగ్రహుండయిన బాలుని సౌందర్యమును చూచి, ఈ పసికందును గూడ దక్కించుకొనలేమో యని దేవకీ వసుదేవులు విలపించుట - విష్ణు మహిమవలన కారాగార బంధనములు తొలగుట - కావలివాండ్రు నిద్రావశు లగుట - రాజమార్గములు జనసంచారవిరహితములయి నిశ్శబ్దముగా నుండుట - యమునా కూలంకష అనుకూలయై త్రోవ నిచ్చుట - వసుదేవుడు ఆ బాలుని మధుర

---

6. పురాణ ప్రసిద్ధములైన దశావతారము లివి—

మత్స్యః కూర్మవరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బౌద్ధో కల్కి మేవచ.

ఈ దశావతారములలో కృష్ణావతారము లేదు. కాని భాగవతము నందు గల ఏకవింశత్యవతారములలో శ్రీకృష్ణుడు వింశత్యవతారము.

"ఏకోన వింశతి వింశతి తమంబులైన రామకృష్ణావతారంబులచే
యదు వంశంబున సంభవించి విశ్వంభరా భరంబునివారించె"
(ఆం. భాగ. 1 - 61)

నుండి నిమేష కాలములో షోడశయోజనదూరములో గల నందవ్రజమును అద్భుత శీఘ్రగమన శక్తియుక్తుడయి చేర్చుట - యశోద యింటిలో బాలుని ఉంచి, అక్కడ నున్న బాలికను తీసికొని మరల కారాగారమును చేరుట - శిశురోదనము కావలివాండ్ర వలన విని కంసుడు కారాగారమును చేరుట - స్త్రీ హత్య వలదని దేవకి ప్రార్థించు చున్నను కంసుడు ఆ బాలికను చంపుటకై పైకి నెగుర వేయుట - ఆ బాలిక దుర్గా రూపము ధరించి 'ఓరీ! కంసా! నిన్ను చంపువాడు ఒకచోట పెరుగు చున్నాడు' అని అంతర్హిత యగుట - కంసుడు కొంత పశ్చాత్తాపము చెంది దేవకీ వసుదేవులను బంధవిముక్తులను చేయుట - కంసుడు సకల మాయావిశారదులైన రాక్షసులను రప్పించి దేశములో పెరుగుచున్న బాలకు లందరను చంపుడని ఆజ్ఞాపించుట - వ్రజ ములో సర్వగోపగోపీప్రేమాస్పదుడయిన శ్రీకృష్ణుడు యశోద ప్రేమతో పెంచు చుండుట - పూతనా ప్రాణ హరణము - తృణావర్త సంహారము - బాలకృష్ణుని బాల్య చేష్టలకు తట్టుకొనలేక సకల గోపీ సంఘము యశోదతో మొరపెట్టుకొనుట - కృష్ణుని యశోద రోటికి కట్టుట, ఆ రోటితో తరుయుగ్మమును కృష్ణుడు కూల ద్రోయుట - కాళియమర్దనము, గోవర్ధనోద్ధరణాద్యనేక అమానుష చేష్టలను, గోపికా వస్త్రాపహరణాద్యనేక చమత్కార లీలలను కృష్ణుడు చేసినట్లు సూచించుట - అన్నార్తులై వచ్చిన బ్రాహ్మణ్యమును కృష్ణుడు సంతోషపెట్టుట - బలరామకృష్ణులను ధను ర్యాగవీక్షణ నిమిత్తమై తీసికొని రమ్మని కంసుడు అక్రూరుని పంపుట - అక్రూరుడు వ్రజమునకు వచ్చి వారిని ఆహ్వానించుట – గోపీ బృందపు కన్నీటి వీడ్కోలుతో బయలుదేరి, బలభద్ర గోపాల సహితుడై మాధవుడు మధురాపురము ప్రవేశించుట - పౌర సుందరీ బృందము రకరకములుగా భావించుకొనుచు ఆసక్తితో నందనందన సందర్శనము చేయుట - కృష్ణుడు సుదాముని ఇంటికేగుట - మధురలో విజృంభించి సంచరించుట - కువలయాపీడమను మద గజమును వశపరచుకొనుట - చాణూరుని ముష్టియుద్ధమున సంహరించుట - కంసుని నిర్జీవుని చేయుట - దేవకీ వసుదేవులను బంధవిముక్తులను చేయుట — అనునవి ఈ భాగమునందలి కథాంశములు.

ఈ కథాంశము లన్నియు భాగవతానుకరణములే. ఈ విభాగము నందు భాగవత కథానుకరణము మాత్రమేకాక పోతన గారి పద్యభావానుకరణము కూడ మాటిమాటికి కన్పడుచున్నది.

కాళియ సర్పదర్పమును బాలకృష్ణుడు మర్దనము చేయు సందర్భమున దాసు గారు వ్రాసిన—

కాలియ ఫణిఫణామంటపే పంకజలోచనో ననాట
కాలిందీ కల్లోలఘోషే ఘన మృదంగ నాదోపమేవ నాట
సలిలితాబ్జచర చంచరీక నిస్వన ఇవగాయక తానే
విలసతి మంజుల హంసకూజితే వితతకాంశ్యతాళరవ సమానే

—పు. - 56

అను చరణములు బమ్మెర పోతన గారి

"ఘన యమునానది కల్లోల ఘోషంబు
సరస మృదంగ ఘోషంబుగాఁగ"

(దశమ - పూర్వ - 662)

అను సీసపద్య భాగమునకు అనుకరణములు.

బలరామకృష్ణులు అక్రూరునితో మధురాపురమును ప్రవేశించునపుడు శ్రీకృష్ణుని జూచి పురకాంతలు భావించుకొను సందర్భమున దాసు గారు వ్రాసిన—

స్వైషకిం స్తన్యం నిపీయ పూతనాం జఘాన బాలః
స్వైషకిం జగదలూాలక న్మాత్రే శ్రితానుకూలః
స్వైషకిం నవనీతచోరః కూరదైత్య మదవిదారః
స్వైషకిం నందకుమారః కోటి మన్మథాకారః
ఆద్యజాతా సహస్రాభిః సంపూతా మధురాపురీ
సాక్షాదీక్షామహీ కృష్ణం లీలామానుష విగ్రహమ్. —పు. 70

అను చరణములు పోతనగారి భాగవతము నందలి—

వీఁడఁటే! రక్కసి విగతజీవఁగఁ జన్నుఁ
బాలుత్రావిన మేటి బాలకుండు

(దశమ - పూర్వ - 1248)

అను సీసమునకు అనుసరణములు.

శ్రీకృష్ణుడు మధురలో సుదాముని ఇంటికి వెళ్లిన సందర్భములో దాసుగారు వ్రాసిన—

త్వత్పాదకమలసేవాం
తవభక్తైః సహాసచాపి దృఢసఖ్యమ్
భూత దయా మత్యస్తం
తాపస మందార దేహిమే సతతమ్ —పు. 71

అను గీతి పోతన గారి భాగవతము నందలి—

నీ పాదకమలసేవయు
నీ పాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
దాపసమందార ! నాకు దయసేయఁగదే !
(దశమ - పూర్వ., ప. 1268)

అను కందమునకు సంస్కృతీకరణము.

ఇట్లు ఈ పితృబంధ విమోచనమునందు దాసు గారి పోతన గారిని అనుకరించిన సందర్భము లనేకము.

## ధర్మ సంస్థాపనము :

ధర్మసంస్థాపనము శ్రీహరికథామృతము నందలి మూడవ బిందువు. దీనిలోని కథ రెండవ బిందువులోని కథకు అనుసరణము కాదు. దీనిలో శ్రీకృష్ణుని చరిత్రతో సంబంధమున్న శమంతకమణి కథ, నరకాసురవధ, కుచేలోపాఖ్యానము సంగ్రహముగా చెప్పబడినవి. ఈ మూడు కథలలో మూడు విధములైన ధర్మములను శ్రీకృష్ణుడు స్థాపించినాడు. మొదటికథ యగు శమంతకోపాఖ్యానములో నిర్నిమిత్తముగ వచ్చిన అపవాదమును తొలగించుకొని లోకమునకు సత్యమును వెల్లడి

---

7, సంస్కృతమున గీతిభేదమైన (గీత్యార్య) ఆర్యాగీతియే తెనుగున కందమైనదనుమాట ప్రసిద్ధమే కదా, ఛందశ్శాస్త్రరహస్యవిదులైన దాసుగారు ఇది గమనించియే ఆర్యాగీతిని కందముగా మలచినారు, కందము అను పేరు కూడ ప్రాకృతము నందలి ' ఖందఅ ' శబ్ద భవ మని పింగళచ్ఛందము నందలి (పు - 67) లక్షణములనుబట్టి రూఢి యగుచున్నది.

చేయుట యన్నది ధర్మము. రెండవకథ యైన నరకాసురవధలో సజ్జనులను నైక విధ హింసలతో బాధించు దుర్జనుడగు నరకుని సంహరించి లోకమునకు క్షేమమును జేకూర్చుట యన్నది ధర్మము. మూడవకథ యైన కుచేలోపాఖ్యానములో భక్తుడు, బాల్యసఖుడు, పరమ దరిద్రుడు అయిన కుచేలుని లోకోత్తరముగా పూజించి, వానికి పారలౌకికానందముతోపాటు ఐహిక సౌఖ్యములనుగూడ నిచ్చుట యన్నది ధర్మము. ఈ మూడు కథలలో ఇట్లు ధర్మము శ్రీకృష్ణునిచే స్థాపనము చేయుట జరిగినది. అదియే దాసు గారు ఈ బిందువునకు ధర్మసంస్థాపనము అని నామకరణము చేయుటకు కారణము.

ఈ విభాగము సదానందుడయిన గోవిందుని, సంతోషితసాంబుడయిన హేరంబుని, మాణిక్యవీణాపాణియైన వాణిని ప్రార్థించుటతో ప్రారంభమగును. తరువాత సుదీర్ఘముగా తత్త్వబోధ వచ్చును. ఈ సుదీర్ఘ పీఠికలో హరికథామాహాత్మ్యము, నామ సంకీర్తనమాహాత్మ్యము, భక్తిజ్ఞాన సంబంధులయిన విశేషములు వచ్చును.

ఈ పీఠికానంతరము దాసు గారు రాజధానిని మధురాపురము నుండి ద్వారకకు మార్చిన అంశమును, బలరామకృష్ణుల వివాహములను సూచించి, తరువాత మొదటి కథను ప్రారంభించును.

మొదటికథ యైన శమంతకమణికథ సారాంశమిది—

ద్వారకకు సత్రాజిత్తు ఒకసారి వెళ్లును. అతని చెంతనున్న శమంతకమును కృష్ణు డడుగును. సత్రాజిత్తు ఇచ్చుట కంగీకరింపక వెడలును. శమంతకమును ధరించి అడవిలోనికి వెళ్లిన సత్రాజిత్తు సోదరుని ఒక సింహము చంపును. ఆ సింహమును చంపి జాంబవంతుడు ఆ మణిని తీసికొని వెళ్లును. సత్రాజిత్తు కృష్ణుడే తన తమ్ముని సంహరించి శమంతకమును హరించెనని అపవాదము వేయును. సర్వజ్ఞుడయిన కృష్ణుడు సర్వము తెలిసికొనియు, అపవాదమును తొలగించుకొనుటకై అడవి కేగి చచ్చిన ప్రసేనుని, అతని గుఱ్ఱమును, సింహమును చూచి అడుగుజాడలనుబట్టి జాంబవంతుని గుహను చేరును. జాంబవంతుని మణి నిమ్మనును. జాంబవంతు డంగీకరింపక శ్రీ కృష్ణుని తూలనాడును. వారిరువురకు యుద్ధము జరుగును. యుద్ధములో శ్రీ కృష్ణుని జయింపలేక అతనిని శ్రీరాముడని గ్రహించి స్తుతించి రత్నముతోపాటు తన కన్యకారత్న

మును గూడ జాంబవంతుడు సమర్పించుకొనును. సత్రాజిత్తు గూడ బాధపడి అతని నుండి మణిని గ్రహింపక తన కన్యకామణిని గూడ కృష్ణున కొసగును. శ్రీకృష్ణు నిపై వచ్చిన అపవాదము తొలగును.

రెండవకథ యైన నరకాసురవధ కథాసారాంశ మిది—

ఒకసారి మహేంద్రుడు ద్వారకలో నున్న కృష్ణుని చెంతకు చేరి దీనానన ముతో అంజలించుచు, తాను నరకుడను రాక్షసుని దుశ్చేష్టితములకు ఎట్లు బాధపడు చుండెనో వివరింపగా, శ్రీకృష్ణుడు నరకుని వధించుటకు సన్నద్ధమగును. సత్యభామ కూడ కృష్ణునితో యుద్ధమునకు వత్తునని ప్రార్థించును. కృష్ణు డంగీకరించి సత్యను గూడ గరుడవాహనముపై తీసికొని వెళ్లును. కృష్ణునకు నరకునకు భయంకర ముగా యుద్ధము జరుగును. కృష్ణుని ప్రార్థించి సత్యకూడ యుద్ధము చేయును. నరకుడు కృష్ణుని తూలనాడుచు యుద్ధము చేయుచుండ, శ్రీకృష్ణుడు నరకుని శిరమును చక్రముచే ఖండించును. గీర్వాణౌఘము పుష్పవృష్టి కురియుదురు. శ్రీకృష్ణుడు శరణార్థియైన నరకనందునునకు రాజ్యాభిషేకము చేసి, నరకుడు చెరపట్టిన షోడశ సహస్రకన్యలను కారాగార విముక్తలను చేసి, నరకుని కుండలద్వయమును గ్రహించి, సత్యభామతో గరుడవాహనముపై స్వకీయావాసమును జేరును.

మూడవకథ యైన కుచేలోపాఖ్యాన సారాంశ మిది—

కాశీనగరమున శ్రీకృష్ణునకు సతీర్థ్యుడయిన కుచేలుడను ఒక భాగవతోత్తము డుండును. ఆ వైష్ణవాగ్రణి నవభక్తి విధానముతో నిత్యము హరిని సేవించు చుండును. అతనికి అనుకూలవతియైన భార్య కలదు. ఆమె ఏకాదశ పుత్రవతి. ఒకనాడు ఆమె పుత్రపోషణభారముగా నున్నదని చెప్పి, ఈ దారిద్ర్యబాధ కృష్ణునితో చెప్పుమనును. యదృచ్ఛాలాభ సంతుష్టుడయిన కుచేలుడు—

వాసుదేవాదన్యవస్తు మిథ్యైవవ్యోమనైల్యవత్
మాశోచీస్త్వం వృథా ముగ్ధే కర్తా భోక్తా జనార్దనః
అహం మమేతి విభ్రాన్త్యా దేహీ సంక్షుభ్యతే భృశమ్
జీవన్ముక్తో భవత్యేవ విష్ణుభాగవతః ప్రియే
తృష్ణోపశమనార్థం త్వం కృష్ణనామామృతం పిబ

—పు. 98

అని సమాధాన మొసగి హరిభజనలో నిమగ్నుడగును. అంతలో కృష్ణుని రథ సారథి వచ్చి, 'వాసుదేవుడు మిమ్ము వెంటనే చూడదలచినాడు' అని చెప్పును. భార్య యిచ్చిన గుప్పెడు పాత అటుకులను మూటకట్టుకొని కుచేలుడు రథ మెక్కి ద్వారకకు వెళ్లును. శ్రీకృష్ణుడు కుచేలుని రత్నసింహాసనముపై కూర్చుండ చేసి, పాదప్రక్షాళనము చేసి, పూజించి, యోగక్షేమములు విచారించును. కుచేలుడు ఆనందాశ్రువులతో కృష్ణ కీర్తనము చేయును. శ్రీకృష్ణుడు కుచేలుని చెంత గల అటుకులను తిని కుచేలునకు సకల సంపద లనుగ్రహించును. కుచేలుడు ఇంటికి వచ్చి సుఖముగా నుండును.

దాసు గారు ఈ మూడు కథలను చెప్పిన తరువాత—

పత్రం పుష్పం ఫలం తోయమపి చేద్విష్ణవేఽర్పితమ్
భవత్యభీష్ట సంప్రాప్త్యై కుచేల పృథుకం యథా
పరమాత్మా వాసుదేవః సచ్చిదానంద విగ్రహః
జగన్మయ స్తస్యలీలాం శివోజానాతి వానవా

—పు. 101

అని రెండు సారాంశ శ్లోకములను వ్రాసి, తృప్తి చెందక మరియొక చిన్న ఉదంత మెత్తుకొనిరి. అది శ్రీకృష్ణ మహిమా జిజ్ఞాసువై నారదు డొకసారి ద్వారకకువెళ్లి కామరూపిణియైన ద్వారకా నగరమును చూచి సాక్షాద్వైకుంఠమని భావించి కృష్ణ మహిమను కీర్తనము చేయుట. ఇంతటితో తృప్తి చెంది మంగళము పాడిరి.

శ్రీహరికథామృతమును ఎంత గ్రోలినను తనివి చెందని దాసు గారి తాప త్రయమును పట్టించి చూపెడి గీర్వాణ హరికథ శ్రీహరికథామృత హరికథ.

## గోవర్ధనోద్ధరణము:

'నిందయం దాామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వ దీర్ఘములకు గిగీలగు' అని చిన్నయసూరి బాలవ్యాకరణ సూత్రము (బాల - ప్రకీర్ణ. 22) అనగా నిందించు నపుడు అామ్రేడితము యొక్క ఆద్యక్షరమైన హ్రస్వమునకు గి, ఆద్యక్షరమైన దీర్ఘమునకు గీ వచ్చును. కుంభకర్ణుడు - గింభకర్ణుడు; రావణుడు - గీవణుడు,

మొదలగునవి. 8 లోకవ్యవహారములో గల లక్ష్యములకు లక్షణ మేర్పరుచుటయే కదా వ్యాకరణ ప్రధాన లక్ష్యము. కాని రెండవ పదముగా పలుకు గింభకర్ణుడు, గీవణుడు అను మొదలగువానికి ప్రత్యేకార్థములు లేవు.

అట్లే హరికథలను గూర్చి నిర్లక్ష్యముగా నిందించునపుడు హరికథలు గిరి కథలు అని లోకములో అనుట కద్దు. కాని చిత్రమేమన నిర్లక్ష్యముగా నన్న 'గిరి కథలు' అన్న పదమునకు కూడ కాకతాళీయముగా అర్థమున్నది. ఈ కాకతాళీయ ముగా గల అర్థమును ఆధారము చేసికొని దాసు గారు, టిక్కెట్టు పెట్టినందులకు కొందరి ఆక్షేపణకు సమాధానముగా ఒకసారి హరికథ ప్రారంభములో 'హరికథ చెప్పుమందురా ? గిరికథ చెప్పుమందురా ? అని చమత్కారముగా ననిరట. ఆమాటకు సభలో నొకడు 'గిరికథయే చెప్పుడు' అనెనట. దాసు గారు అప్పుడు ఆశువుగా ఈ గోవర్ధనోద్ధరణ కథను (గిరికథను) చెప్పిరట. ఈ సంఘటనము దాసు గారి జీవితములో ఒక ఛలోక్తిగా నిలిచినది. ఈ సంఘటనము జరిగినది గుంటూరు జిల్లాలోని చేబ్రోలు గ్రామములో. 

ఈ గోవర్ధనోద్ధరణ కథ ఆశువుగా చెప్పినదగుటచే కాబోలు, దాసు గారు దీనిపై అంత శ్రద్ధజూపినట్లు కన్పడదు. ఆ కారణముచేతనే ఈ కథ ముద్రింప బడలేదు. ముద్రణ భాగ్యము నోచుకొనకపోయినను, దాసు గారి హరికథ జీవిత ములో చెరగని ముద్రణ భాగ్యము నోచుకొన్న కథ, ఈ గోవర్ధనోద్ధరణ హరికథ. 

**భీ ష్మ చ రి త్ర ము :**

ఈ భీష్మచరిత్ర హరికథ నీలశైలము నందు గల జగన్నాథస్వామికి అంకి తము — గ్రంథము కృతిపతి యగు జగన్నాథస్తుతితో ప్రారంభమగును. తరువాత గణపతి స్తుతి, సరస్వతీ స్తుతి, ఇష్టదేవతా స్తుతి. దీని తరువాత ప్రేక్షకుల నుద్దేశించి సుదీర్ఘమైన నీతిబోధ కన్పడును. ఇది యంతయు ఉపోద్ఘాతమే.

భీష్ముని జీవితములో గల మూడు ఘట్టములను తీసికొని వ్రాసిన హరికథ ఇది. మొదటి ఘట్టము భీష్ముడు తండ్రి వివాహముకొరకై ప్రతిజ్ఞ చేయుట ; రెండవ ఘట్టము అంబ వృత్తాంతము, భీష్మ పరశురాముల యుద్ధము ; మూడవ

8. లోకవ్యవహారములో గిన్నె-బొన్నె; పిల్ల-జల్ల అనికూడ కలదు. ఇవి వ్యాకరణ గ్రంథములకు ఎక్కలేదు.

ఘట్టము మహాభారతసంగ్రామము నందలి భీష్ముని యుద్ధము. ఈ మూడు ఘట్టములు ఒకదానితో నొకటి సంబంధములేని అంశములు. ఈ మూడు ఘట్టములకు భీష్ముని జీవితమునకు సంబంధించిన మాటయే ప్రధాన సంబంధ సూత్రము. ఆ కారణముచేతనే ఘట్టము మారునప్పుడు దాసుగారు కృతిపతి స్తుతి మిషతో విరామము సూచించినారు. అనగా భీష్మచరిత్రము మూడు ఘట్టముల కథ.

మొదటి ఘట్టము:

శంతనుడను భూపతి సామజపురము నేలుచుండెను. ఆ నృపతికి గంగ యనెడు దివ్యాంగనకు జగజ్జెట్టియైన గాంగేయుడు కలసట్టె. శంతనుడు తన కుమారుని యువరాజుగా జేసి తాను మోదమున దనరుచు నొకనాడు వేడ్కతో వేటకు వెడలి ఓడను కొయ్యకు గట్టి యొద్దన తీయని పాట పాడుచు 'ఏరు దాటింతు రమ్ము ప్రొద్దెగకుండ సుంకమేమియు నడుగనంచు జిరునవ్వు మొలకలెత్తగ దనుం బిల్చు' ముద్దుగుమ్మ నొకదానిని జూచెను. పంచబాణుని మేటియైన ఆ పల్లెబోటిని జూచి మన్మథపరవశుడయి, 'కొమ్మా! నీకెమ్మోవి రాచసుంకమ్ముగా నిమ్ము. నీ కటాక్షమ్మున మమ్మంపు మోహాంబుధి దాటంగోరెదను' అని యన, దానికా పల్లెకన్నియ 'సామీ! తల్లిదండ్రుల చాటుదాన. మనసిచ్చితి. నిదె రాచసుంకము. మా పెద్దల నొడబర్చుకొనుము' అని సమాధాన మొసగి యోడపై నెక్కి చనుచు - శంతనుడు తన పురమున కేగి ఆకలియు, నిదురయు నెరుగక చీకాకుగా నుండ, పుత్రుడయిన గాంగేయుడు ఏకతమున కారణ మడుగును. శంతనుడు తనయునితో 'అనపత్యు నేకపుత్రుని సమానం బండ్రు. కనుక నీకుం దోడుగా సుతులను బడయం గోరెదను. ఒక్క పల్లెకన్నియ మొన్నజమున చెంగట మానసంబుం గొనియెను' అని యన, అదెంత పని యని భీష్ముడు బయలుదేరును. ఇక్కడ పల్లెకన్నియ కూడ విరహముతో 'ఇంత తడవయ్యెను. ఆ దొర చెంతనుండి రాయబార మదేమొకో రాకయుండెను. ఏమి సేయుదును; ఈ వంత నిప్పుడెవరితోడం జెప్పుదును. ఇస్సిరో! ఆడబ్రతుకు' అని చింతించుచుండును. అంతలో గంగా తనయుడు పల్లెదేని కడకు వచ్చి తన తండ్రి కతని కూతు నిమ్మని యడుగును. అంత నోడదొర 'నా మనుమలకు రాజ్యమొసగిన నా పుత్రిక నిచ్చెదను, కాని నీవు యువరాజువైతివి గదా! నీ సుతులకు రాజ్యము రావలయును. కాన ఈ కార్యము జతపడదు' అని భీష్మునితో ననును. అంత శాంతనవుడు దాశవిభునితో—

నేనొల్లనిఁక రాజ్యభోగము నీ మనుమలే యేలనీ
భూనాథుండను నీకొమార్తెయు మోద వార్నిధిఁ దేలనీ
బ్రతుకు వరకున్ బ్రహ్మచర్యవ్రతము నేఁగావించెదన్
హితముగా నాకన్న తండ్రికి ఋణము తీర్చి తరించెదన్. —పు 9.

అని ప్రతిజ్ఞ చేయును. అతని ప్రతిజ్ఞకు జననివహము పొంగి దేవవ్రతుడనియు, భీష్ముడనియు నుపాఖ్యలతని కొసంగును. పల్లెతేడు తన కొమార్తెను పలుభంగుల శృంగారించి పల్లకి నెక్కించి భీష్ముని వెంట పంప, శంతనుడు కోరిక తీరగ సత్యవతిని పెండ్లాడి సుఖముగా నుండును. శంతనుడు పుత్రుని పితృభక్తికి మెచ్చి 'నీవు వలసిన యన్నాళ్లు బ్రతుకుము' అని వర మిచ్చును. "ధరణిలోపల సమస్త జనులకుం బితృభక్తి రసాయనంబు" అను సూక్తితో ఈ ఘట్టము సమాప్తమగును.

ఈ ఘట్టము నందలి కథ భారతకథయే యైనను దాసు గారు చేసిన కొన్ని మార్పులు కలవు.

భారతము నందు శంతనుడు యోజనగంధియొక్క 'అపూర్వ సురభిగంధం బాఘ్రాణించి దాని వచ్చిన వలను నారయుచు నరిగి' యమునాతీరము నందు సత్యవతిని జూచినట్లుండగా, దాసు గారి కథలో 'చప్పంగొని యమునా నది తియ్యని నీటింగ్రోలి యిసుకతిన్నెమీద నొక్క జవరాలిని' జూచినట్లున్నది. అనగా దాసు గారి కథలో పరాశరమహర్షి వర ప్రభావమున సత్యవతికి చేకూరిన యోజన గంధి లక్షణము లేదు.

సత్యవతిని జూచిన శంతనుడు దాశరాజు చెంతకేగి పుత్రిక నర్థించుట, దానికి దాశరాజు తన పుత్రికకు జనించెడి పుత్రునకే రాజ్యము కట్టబెట్టవలయునని కోరు కొనుట, దానికి శంతనుం డంగీకరింపక తిరిగి వచ్చుట భారత విషయము. దాసు గారి కథలో శంతనుడు దాశరాజు చెంతకు వెళ్లడు. పైగా దాసు గారి కథలో సత్యవతి కూడ 'మనసిచ్చితిని. మా పెద్దల నొడవర్చుకొనుము' అని స్పష్టముగా చెప్పును. అప్పటికిని శంతనుడు దాశరాజు నొద్దకు నేగక ఇంటికి వచ్చి విచార పడుటకు కారణము కన్పడదు. ఆటంకమున్నపుడు కదా ఆర్తికి అవకాశము.

ఈ చిన్న ఘట్టమునందు కూడ కొన్నిచోట్ల పాత్రస్వభావానుగుణముగ కథను నడిపించిరి. సత్యవతిని జూచినపుడు శంతనునకు సత్యవతిలో తన పూర్వ భార్య యైన గంగాదేవి లక్షణములు కన్పడుట సుందరమగు భావనము.

వఝులను దరంగముల్ నాభి వలన సుళ్ళు
పిఱుఁదులను సైకతంబులు తుసుముచేత
నాఁచు నవ్వాన నురగలున్ గనులు మీలు
వన్నె నీర్గంగ తన స్వభావ మిటు తెల్పు. —వృ. 5

ఈ పూర్వ భార్యాసౌందర్య స్మరణము వలన శంతనునకు గంగపై గల ప్రేమ సూచితమగుటయేకాక, సత్యవతిపై మనసు పడుటకు హేతువుగా గూడ నగుటవలన శంతనుని పాత్రకు మెరుగు పెరిగినది.

శంతనునిపై మరులుగొన్న సత్యవతి తనలో తాను తర్కించుకొనుచున్న విధానము—

ప॥ అందరాని మ్రానిపండు దాని నరసిన మాత్రానఁగడుపెట్లునిండు ?
అ॥ప॥ అందగాఁడు రాచగండు వాఁడగునే నోములపంట నాకు మగండు!

1. నమ్మబోను కన్నవారు రాజు నన్నుఁ గోరెనంచుఁ జెప్పిన తీరు
నెమ్మనమున కాసమీరు వాని నేస్తము తోడ నా పేరు పెంపారు
2. మరచెనేమొ నామాట వాని మరపించి నేనేల వడితి నట్టేట ?
మరలి వచ్చునె నాటిపూట కోటమాటున నున్నాడదినవ్వులాట!

ఆ సంజపూట యేకాంతము గానేల
నోడ యావల గట్టియున్నదాన ?
కానిమ్ము, రాజేల కనఁబడి నన్నట్లు
మరులు కొల్పెను ? పోని, మంచిమాట.
అనవాలైన నే నందుటకు నీలుఁ
జిక్కించుకొన్నవైతిఁ జెల్మిఁ జూపి
చెల్లెఁబో, పడవపైఁ జెలిమికానిని దెచ్చి
వేడుక దీర మాటాడనైతి

నింతతడవయ్యె, నా నోర చెంతనుండి
రాయబారి మదే మొక్కో రాక యుండె
నేమి సేయుదు ? నీ వంత నిప్పు డెవరి
తోడఁజెప్పుదు ? నిస్సిరో ! యాడబ్రతుకు !  —పు. 8

గాంగేయుఁడు పల్లెతేని చెంత తండ్రికొరకు చేసిన భీష్మ ప్రతిజ్ఞా పద్యమును స్థిరసంకల్పసూచకముగా, కథాకథనసమయమున సంగీతాత్మకముగా పాడుటకు వీలుగా, 'రాలనీ, కూలనీ, క్రుంకనీ,....' మొదలగు అభినయానుకూల దీర్ఘస్వరములతో కూర్చిరి. (పు-9) భీష్మునితోపాటు అతని తల్లి పావనత్వమునే కాక, అతని తండ్రియైన శంతనుఁడు కూడ ధర్మమార్గము తప్పలేదని వ్యంగ్యముగా ఈ పద్యమున సూచించినారు.

రెండవ ఘట్టము :

శంతనుడు అఖిలైహిక సుఖముల ననుభవించి సత్యవతి పొందిన ఇరువుర కొడుకులను గాంచి దివి కేగ, భీష్ముడు తండ్రికి అపరకర్మ మొనరించి పెద్ద తమ్మునకు సకల రాజ్య మర్పించును. రాజైన పెద్ద తమ్ముడు సంగరమున మృతి చెంద పినతమ్ముడు పట్టాభిషిక్తు డగును. పిన్న తమ్మునికి పెండ్లి చేయుటకు భీష్ముడు కాశీరాజపుత్రికలకు జరుగు స్వయంవరమున కేగి అక్కడ రాజుల నందర నోడించి, కాశీకాపురీశు కన్యకలను మువ్వురిని రథముపై నిడుకొని స్వకీయపురికి వచ్చును. ఆ మువ్వురు కన్యకలతో నొకతె యగు అంబ భీష్మునితో 'ఓ యయ్య ! సాళ్వునిఁ బతిగఁ గోరి యున్నదానను. నా తండ్రి యొప్పుకొనియె. తిరిగి నన్ను బంపుము' అని యన అపగానందనుడు అంగీకరించి ఆమెను తిరిగి పంపును. అంబ సాళ్వపతి యొద్దకేగ అతడు ఆమెను తిరస్కరించును. తన కాపురమును పాడుచేసినది గంగనందనుడని అంబ అతనిని సాధింపదలచి తపముచేయ వనమున కేగును. ఆమె చరితమును విని ఒక తపసి పరశురామునితో చెప్ప, పరశురాము డామెకు అభయమిచ్చి ఆమెతో కరినగరికి వచ్చును. గురుని రాకను భీష్ముడు తెలిసికొని వెళ్లి భక్తితో మ్రొక్కును. పరశురాముడు 'ఈ అంబను నీ పిన్నతమ్మునకు పెండ్లి సేయుము. నాకది ప్రియము' అని యన, దానికి భీష్మ డంగీకరింపక పోవుటచే వారిరువురకు యుద్ధము జరుగును. ఒకనాటి యుద్ధమున గంగాసుతుని దెబ్బకు పరశురాముడు మూర్ఛ కూడ పోవును. ఆ రాత్రి అంబకు పరశురాముని

శక్తిపై సందేహము కూడ వచ్చును. మరునాడు జామదగ్ని శక్తికి గాంగేయుడు సోలి రథముపై బడ తల్లియైన దివ్యగంగ వచ్చి రక్షించును. ఆ రాత్రి భీష్ముడు ఈ పరశురాముని గెల్చుట యెట్టులా ? యని ఆలోచించుచు నిద్రింపగా, కలలో నొక మహాత్ముడు కన్పించి, 'ఇదిగో సమ్మోహనాస్త్రము. దీని వేసి భార్గవు జయింపు' మని చెప్ప, ధైర్యమున మరునాడు యుద్ధమునకు వచ్చి గురునిపై సమ్మోహనాస్త్రము వేయబోవ నారదు డేతెంచి వారించి గురునకు నమస్కరింపు మనును. భీష్ముడు భార్గవునకు నమస్కరింప, భార్గవుడు సంతసించి తానోడితి నని యొప్పుకొని వరమును కోరుకొమ్మనును, దానికి భీష్ముడు 'బహ్మచారినయిన నాకు గోర్కు లేమియును లేవు. అయినను ధర్మాసక్తి, గురుభక్తిని ప్రసాదింపుము' అని యనును. అంబ ఈ విషయమంతయు జూచి 'అనఘుడయిన భార్గవరాముని తెగడి గంగాసుతుమీది పగ వేరు తనువెత్తియైన తీర్చుకొనకుందునే' యని పట్టుదలతో వెళ్ళుచు నేగును. శాంతనవుడు భార్గవుని పూజించి వాని యనుజ్ఞతో నింటి కేగి, ఈ వృత్తాంతమంతయు సత్యవతికి చెప్పి ఆమెచే దీవనలు గొని ధర్మమార్గమున జనులు నుతింపగ చరించుచుండును.

భారతకథలో గల రసత్తర ఘట్టములలో భీష్మపరశురామ యుద్ధఘట్ట మొకటి. ఒకడు తపసిరాజు మరియొకడు రాచతపసి. ఒకడు తండ్రికొరకు తల్లిని గూడ లేకుండగ జేయుటకు వెనుకాడని వాడు. మరియొకడు తండ్రికొరకై పత్ని లేకుండగ నుండుటకు వెనుకాడని వాడు. ఇరువురు మాట మరువని మహానుభావులే. పైగా వీరిరువురు మార్గదర్శకులయిన గురుశిష్యులు. ఇట్టి ఈ పుణ్యచరిత్రులకు ఒక అబల కారణముగా యుద్ధము వచ్చినది. యుద్ధము వచ్చినను మర్యాద లతిక్రమింపని ధర్మస్వరూపులు. అందులకే ఈ ఘట్టము ఎందరినో అకర్షించినది. దాసు గారిని ఆకర్షించుటలో ఆశ్చర్యమేమి యున్నది ?

ఈ ఘట్టము నందు దాసు గారు తమ కథాకథన విధానానుగుణముగా కథ చెప్పిరే కాని భారతకథను పెద్దగా మార్చినది లేదు. చిన్నమార్పు మాత్రము ఒకటి కన్పడుచున్నది. భారతమున అష్టవసువులు స్వప్నమున సాక్షాత్కరించినట్లుండగా దాసు గారు తమ కథలో 'ఒక మహాత్ముడు కాన్పించి'నట్లు చెప్పినారు.

కథనవిధానము సూచించుటకై దాసు గారు పరశురాముని యుద్ధమునకు సన్నద్ధము చేసిన విధము—

కెంజడల్ ముడివైచి మంజులముగ మాళి
పైని రుద్రాక్షల వరుసఁజుట్టి
వీరకాచనుగట్టి బెబ్బులి తోలు పై
దాల్చి మూఁపున జన్నిదంబులమర
మొలఁబెట్టి ఖట్వాంగమును విల్లు చేబట్టి
చండభాస్కరుని తేజమున మీఱి
సింహగర్జలు చెవుల్ చెవుడు పర్వఁగఁ బ్రళ
యాగ్ని కణంబుల నస్త్రులుమియ

భృగుకులాగ్రణి రాముండు వీరమూని
శాంతనవుఁ బిల్చి గద్దింప సంభ్రమించి
టంకృతులొనర్చి గిరులు వడంకునటులఁ
బల్కె నిటు మేఘ గంభీర భాషణముల.

పు॥లు 14 - 15

ఈ పద్యము అక్షర రూపముగా పరశురాముని రూపమును పాఠకులకు ప్రత్యక్షము చేయుచున్నది.

భీష్ముని శరపాతముచే మూర్ఛ చెంది తేరుకొని సూర్యాస్తమయ మగుటచే భార్గవుడు నాటికి యుద్ధము చాలించును. ఆ సమయమున అంబ భృగురాముని చెంతకేగి పలికిన ములుకులవంటి పలుకులలో, దాసు గారు ప్రదర్శించిన పలుకుల కులుకులు—

అంత నంబ భృగురాముని చెంగటికరిగి సేవలొనరించి
యెంతయు నడలుచు నిట్టుల వాకొనియెం గన్నీళుల నించి
నమ్మికొంటి నీపరాక్రమంబున నాపగ దీఱునటంచు
నమ్మయ్యో నీదుశౌర్య మాభీష్ముపట్ల నాపల్కలెంచు
మునుపటి బీరము వెన్కబెట్టితివో ముదుసలి తాపసి నీవు
దినము లిర్వదీ యుద్ధ్యోఁగాన నీక సాధీరుని జయింపలేవు

పాపము నాకొఱకై నీవీగతి బడ దెబ్బలు తిన్నావా ?
ఓపిక తప్పినవాఁడు మునివృత్తి నుండుటయె మంచి దేవా !

—పు. 17

సమయమా మానభంగమయిన పిదప — పలుకులకు గురియగుచున్నవాడా మహాకోపిష్ఠుడయిన జామదగ్ని — అనుచున్న పలుకులా పరమావమానకరములు — పలుకుల విధానమా హేళనాత్మకము — పలుకుచున్నదా ఒక అనాథయైన కలికి.

ఇటువంటి సమయములో ఈ విధముగ మాటలు బడిన సామాన్య మానవునకే ఆవేశము వచ్చును. ఇక పరశురాముని విషయములో నతడెంత యుగ్రుడగునో ఊహింపగలమా ? దాసుగా రిట్లు పరశురామునిచేత సమాధాన మిప్పించుచున్నారు—

అను నంబంగని పిన్న నవ్వొలయఁగా నాభార్గవుండిట్లు వా
కొనియెం గామిని ! రేపు చూడు మతనిం గూల్తున్నిజంబేనె య
ల్గినచో బాలుఁడు భీష్ముఁడెంత ? వినుమా ! లీలన్మదస్త్రాళి తా
కిన జీవించునె బ్రహ్మయైన ? నిఁక శంకింపంగ నీ కేటికిన్. —పు. 17

ఈ పద్యము నందలి ప్రతి పదము అర్థవంతమే. సాభిప్రాయమే.

అను అంబన్ కని - ఆ విధముగా పలుకుల ములుకులతో పొడుచుచున్న అంబను చూచినాడట. ఆ చూపులో అవమానము చేసిన భీష్మునిపై కోపము ; ఇట్లు ఒక అబలచే మాట పడవలసివచ్చెకదా అను బాధ ; తన శక్తి నెరుగలేని స్త్రీ యను లెక్కలేనితనము స్ఫురించును. పిన్ననవ్వొలయగా - పెక్కు దుఃఖము వచ్చిన పక్కన నవ్వు వచ్చును అన్నట్లు ఒక భావము, నాశక్తి నీ కేమి తెలియునులే అన్న భావము స్ఫురించును. ఆ భార్గవుండు - అంతటి పూర్వచరిత్ర గలవాడు అన్న సూచన, భార్గవుడు అని యపత్యార్థక ప్రత్యయముతో చేరిన నామము వాడుటవలన గూడ అతని శక్తి సూచన చేయబడినది. ఇట్లు వాకొనియె - ఇట్లు - అనగా ఈ విధముగా అనగా అంబకు విశ్వాసము కలుగునట్లుగా మాటాడినాడని అర్థము. కామిని- ఈ సంబోధనవలన నీవు కామముతో నుండుట వలన నన్ను సరిగా గుర్తింప

లేకున్నావను సూచన. రేపు చూతు - ఇది యెంతయో శక్తి గల మాట. నిత్య వ్యవహారములో గూడ 'రేపు చూతు నాసంగతి' అని యందురు గదా. అతనిన్ గూల్తున్ - ఈ మాట అంబకు కావలసిన మాట. అది అనినాడు. నిజంబేనె యల్గినచో - నా మాట సమ్మతము. నిజముగా నాకు కోపము వచ్చిన అనగా ఈ రోజు వరకు నాకు నిజముగా కోపము రాలేదు. నా శక్తి నంతయు చూపలేదని భావము. 'నిజముగా' అనునది వ్యవహారములో చాల బలమున్న మాట. బాలుడు భీష్ము డెంత - నావద్దర చదువుకొన్న పిల్లవాడు అతడు నాముందెంత అని భావము. వినుమా - నాశక్తిని గూర్చి చెప్పుచున్నాను, వినుము. నీకు తెలియదు అని అర్థము. లీలన్ మదస్త్రాళి తాకిన - లీలన్ అనుటవలన నేను పెద్దగా కష్టపడ నక్కరలేద నియు, మదస్త్రాళి అని సంయుక్తాక్షరముల వలన ఎదుటివానికి తాను బెట్ట గలక్లిష్టత సూచింపబడినది. తాకిన అనుటవలన స్పృశించిన కూడ చాలునని ఒక చమత్కారము. జీవించునె బ్రహ్మయైన - చావు లేని సృష్టికర్త కూడ బ్రతుకగలడా ఇక భీష్ముడన నెంత అను సూచన, ఇక శంకింపంగ నీకేటికిన్ - ఇంత నాగూర్చి తెలిసికొనియు నీకెంక శంకింపంగ పని యేల? అన్న సూచన. ఇట్లు ఈ పద్యము నందు ప్రతి పదము సార్థకము.

భీష్మపరశురాముల యుద్ధఘట్టము నందు దాసు గారు అస్త్రప్రత్యస్త్ర వర్ణనము కన్న మాటలపోటు లెక్కువ చేసిరి. ఈ సంభాషణములు ఈ ఘట్టమున తప్పని సరి. ప్రతి కవి ఇట్లే చేసినాడు. అట్లే దాసు గారు కూడ క్లుప్తముగా చక్కగా చేసినారు. క్లుప్తముగా చేయుటవలన కాబోలు భీష్ముని మాటలలో గురుభక్తి వెల్లడి యైనట్లు భార్గవుని మాటలలో శిష్య ప్రేమ వెల్లడి కాలేదు. భీష్ముడు కూడ—

'మున్ను రాజుల నీవు బొలియింప గాంగేయుఁ
డున్నచోఁ జెల్లునే యుల్లపుం బందువు' —పు. 14

అని గురువుతో అనుట అంత సమంజసముగా లేదు. పూజ్య పూజక భావమును పూజ్యము చేసినట్లే కదా.

మూడవ ఘట్టము :

ధృతరాష్ట్రతనూజులు నూర్వురు, పాండుతనయులు ఏవురు దాయముకై యుద్ధమునకు దిగుదురు. కౌరవులుం బాండవులు తన కొక్కగతియైన భీష్ముడును

'పోషింపబడిన' కారణమున ధార్తరాష్ట్రి పక్షమున పోరాడును. కౌరవసేనాపతియై గాంగేయుడు పాండవ భటవనములను పది దినములు కారుచిచ్చువలె దహింపజేయును. ఒకనాటి యుద్ధమున భీష్ముడు విలయకాలభైరవుని మాడ్కి నతి రుద్రుడయి సకలారి సైన్యమును నేలకు కీలకు తెచ్చును. భీష్ముని విక్రమము జూచి బీరమెడలియున్న అర్జునుని పరికించి వెన్నుడు 'దేవదానవులకైన అసాధ్యుడు ఈ దేవవ్రతుడు. ఈ వీరుని నేను ఈ చక్రమున తునుమాడెదను' అని భీష్ముని పైకి పోబోవును. అర్జునుడు అడ్డగించుచున్నను ఆగక ప్రళయాగ్నివలె తనమీదకు వచ్చు హరిని భీష్ముడు స్తుతించును. పార్థుడు వాసుదేవుని శాంతు జేసి మరలించును. నాటిరేయి కౌంతేయులు కృష్ణసహితులయి చాటుగ భీష్ముని కడ కేగి తమకు జయము కల్గునట్టి మార్గము చెప్పుమన, భీష్ముడు—

'ఇప్పుడు నన్ను జయించు నుపాయము
 నీర లెఱుంగుట కిట్లు వచ్చి
నారు గావునఁ బోలుపార మీ యిష్టము
 తప్పక సమకూర్తు నైన మాన
చేత విల్లున్నంతసేపు నన్నోర్చుట
 వశమానె యెటువంటివారికైన
శరణన్నవాని సమర పరాఙ్ముఖుని ని
 రాయుధు న్నేడి నేనేయ గాన

మీశిఖండిని రేపు నామీఁదఁ బంపుఁ
డంగనా పూర్వుఁడౌట నేనతని దిక్కు
శరము తొడుగను బార్థుడాచాటునుండి
నన్నుం గెలువఁగ వచ్చునో యన్నలార!' (పు-27)

అని తన వధోపాయము చెప్పును. మహాత్ముడు, పితామహుడు అయిన భీష్ముని అట్లు మోస పుచ్చి చంపుటకు అర్జునుడు బాధపడి వెనుకాడుచుండ, కృష్ణుడు 'గీతా సారము' జ్ఞాన బోధ చేయును. భీష్మోపదేశము ప్రకారమే శిఖండి నడ్డుపెట్టుకొని బాణములతో కొట్టగా 'శరము లూతగా తూర్పు మొగముతో శాంతనవుడు ధర నొర

గును'. అర్జునుడు తన తాతకు అలుగులు తలగడగా చేసి, పాతాళగంగతో దప్పి తీర్చి, శయ్యచుట్టు కోట కట్టును. భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలము వరకు ప్రాణములను చిక్కబట్టి మునులు చుట్టు చేరి వేదాంత చర్చలు సలుపుచుండ విష్ణు నుతితో కాలము పుచ్చుచుండును. వికల మనస్కుడయిన ధర్మజుని భీష్ముని చెంతకు కృష్ణుడు తీసికొనివెళ్లి పరధర్మసారము వివరింపుమన, భీష్మ డంగీకరించి ధర్మ జునకు ధర్మ సూక్ష్మముల నెరింగించును. పిదప భగవన్నుతి చేయుచు తనువు త్యజించును.

ఈ కథ యంతయు భారత మందలిదే. దాసు గారు ఈ ఘట్టము నందు సందర్భానుసారముగా భారత భాగవతము లందలి కొన్ని ప్రసిద్ధ పద్యములను అనుకరించినారు.

శ్రీకృష్ణుడు పార్థుని రథమునుండి దిగి భీష్ముని వధించుటకై సిద్ధముగునపుడు దాసు గారు వ్రాసిన పద్య మిది—

ఘన లీల దేహమందున మెఱుప్ప చెల్వొన
వలెవాటు పసిఁడి దుప్పటి చెలంగ
కుంభిని యదరఁగఁ గుప్పించి యురికినఁ
గుండలకాంతి దిక్కులకుఁబర్వ
కరశాఖనమరు చక్రప్రచండాయుక్తిని
కలరు కెందమ్ములై యక్షులొప్ప
కోపంబు వజ్రమై కొనసాగ నట్టహా
సమ్ము గంభీర గర్జనము గాఁగ
దేవదేవుఁడు కృష్ణుఁడు దీనబంధు
డర్జునుని గావజనులెల్ల నబ్రమంద
పోవుచున్ననుఁబట్టి యాపుటకు వెంటఁ
బడిన వాక్రుచ్చె నిట్టులఁ బార్థుఁగాంచి. —పు. 25

ఈ పద్యము పోతన గారి 'కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి గగన భాగంబెల్ల కప్పికొనగ' (భాగ. - ప్రథ. - 221) అను పద్యమున కనుకరణమే కదా.

భీష్ముడు ధర్మరాజునకు ధర్మసారము వివరించు ఘట్టములో గల—

'... ... ... సకల
ధర్మసారము వినుమ యితరులు దనకు
నెద్ది యొనరింప సుంతయు నిష్టపడఁడొ
యన్యులకు నట్టి కార్యము నాచరింపఁ
దగదు తాను నిజంబుగ ధర్మరాజ !' —పు. 34

అను పద్యము తిక్కనామాత్యుని—

ఒరులేయవి యొనరించిన
నరవర ! యప్రియంబు తన మనంబునకగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయము పరమధర్మపథముల కెల్లన్.

—శాంతి - పంచ - 220

అను భారత ప్రసిద్ధ పద్యమునకు రూపాంతరీకరణమే కదా. ఇట్లే భీష్ముని చంపుటకు వెనుకాడుచున్న అర్జునునకు శ్రీకృష్ణుడు చేసిన బోధ యంతయు గీతాసారమే.

ఈ భీష్మ చరిత్ర హరికథను నిర్వచనముగా వ్రాయుట దాసు గారి భీష్మ ప్రతిజ్ఞ.

## సావిత్రీ చరిత్రము :

దాసు గారి రామాయణ హరికథలలో యథార్థ రామాయణము, భాగవత హరికథలలో రుక్మిణీ కల్యాణము మంచి పేరు ప్రఖ్యాతులను నోచుకొనగా, భారత కథలలో అట్టి భాగ్యము నోచుకున్న హరికథ సావిత్రీ చరిత్రము. ఈ హరికథా రచనమునకు ఒక కారణము కలదట. దాసు గారి తల్లియైన సరసమ్మగారు దాసు గారికి ఎంతకాలమునకు సంతానము లేకపోవుటను జూచి ఒకనాడు 'నాయనా, సావిత్రీ చరిత్రము వ్రాయుము. నీకు సంతానము కలుగును' అని చెప్పెనట. తల్లిమాటపై గౌరవముచే దాసు గారు ఈ సావిత్రీ చరిత్రమును వ్రాసినారట. ఈ హరికథ వ్రాసిన సంవత్సరముననే దాసు గారికి ఒక ఆడపిల్ల కలిగినది. ఆ విశ్వాస కారణముచేతనే దాసు గారు ఆ పుట్టిన పిల్లకు సావిత్రి అని నామకరణము చేసిరి.

సావిత్రీ చరిత్రమునకు 'పన్నగేంద్రభూష పట్టంపురాణియైన శార్వాణి కృతి నాయిక'. ఈ కృతి ఆదిశక్తి స్తుతితో ప్రారంభ మగును. తరువాత కృతినాయిక స్తుతి, గణపతి నుతి, శారదాస్తుతి, సభాస్తుతి వరుసగా వచ్చును. తరువాత సత్యము భూతదయల ప్రాశస్త్యమును గూర్చి సుదీర్ఘమయిన చర్చ చేయుదురు. ఆ చర్చలో పశువిశసనమును అంగీకరించు సమకాలీన పండితమానులను దాసు గారు తీవ్రముగా విమర్శింతురు ఇది యంతయు ఉపోద్ఘాతము.

ఈ యుపోద్ఘాతమయిన తరువాత సావిత్రీచరిత్రి చెప్పుటకు చక్కని పూర్వ రంగమును సిద్ధము చేసినారు.

'ధాత్రిని భర్తకున్నరియు దక్కిన బంధులకున్మహా యశః
పాత్రత గల్గజేసి యిరువంకల వంశజనంబులం దిహా
ముత్రసుఖంబులన్నిటిని మోదము గాంచిన పుణ్యసాధ్వి సా
విత్రి తలంపు వచ్చె సరవిన్సుజనావళి నెన్న నామదిన్'

పున్నెపుం దంపతులలోన వన్నె కెక్కి
పుడమి సావిత్రి సత్యవంతుండును మిగుల
నిఖిల సాధుజన స్తవనీయు లగుట
వారి చరితంబు పల్కెద వాసి మీర. —పు. 9, 10

కథా శరీరము :

తొల్లి మద్రదేశమునకు అశ్వపతి యను దొడ్డ నృపతి విభుడు. ఆ మహా మహుని రాజ్య ప్రజలు సత్యప్రీతి, సకల భూతములందు సమత కలవారు. సదాచార సంపన్నులు. అశ్వపతికి ఎంత విభవము కల్గినను, కాంతామణితోడ చిరము కాపురమున సంతోషించినను, అతనికి సంతానము లేదు. దానికై యతడెంతయో చింతించి యనశనవ్రతుడయి తమ కులదేవత యగు సావిత్రిని గూర్చి తప మొనర్చును. అతని భక్తికి మెచ్చి పాలితాశ్రిత వర్గ యగు దుర్గ విశ్వరూపంబుతో ప్రత్యక్షమయి అతనిచే అనేక స్తుతులను బడసి, అతడు అడుగకుండగనే—

'... ... ... ... ఓయి వత్స! నీ
యనఘ తపంబు మెచ్చితి మదంశమువం జనియించు నీకుఁది

న్నని యొక కూతు రాపెవలనం దరియిం త్రిరువంక వారలెం
దున జయమబ్బు నీకు ... ... ...' పు. 14

అని తిరోహిత యగును. కొన్నాళ్ల కతని యిల్లాలు నెలతప్పి మంచి ముహూర్తమునందు ఒక పుత్రికను గాంచును. సావిత్రీదేవి వరమున పుట్టెను గాన ఆ పిల్ల సావిత్రి యను పేర పిల్వబడును. సావిత్రి యుక్తవయస్సు వచ్చునాటికే—

దానమున వేల్పుటావు, సత్యమ్ము పోవు
మెఱుఁగు మరుదంతి, కల్కుల మేలుబంతి
శీలపుం గొట్టు, ఖలులకు చెంప పెట్టు
ఎలమి సావిత్రి కెనగలదే ధరిత్రి —పు. 15

అని అందరిచేత ప్రశంస లందుకొనును. ఈ బాలతికి తగు వరునికై అశ్వపతి భూవిభుల నెందరినో పరీక్షించి, వచ్చిన చిత్రపటములను జూచి, కులరూపవయశ్శీలముల నాపెకు సరియైనవాడు లేడని ఆలోచించు చుండును. అంత తనకు అనుకూల పతి యెట్లు లబ్బునచు చింతించుచు నొక రాత్రి సావిత్రి యొక కల కనును. ఆ కలలో — మూపున గండ్రగొడ్డలి గల ఒక రాచకోడెగాడు — అతని నెత్తిపై నొక గంప — ఆ గంపలో ముసలి ముద్దలయిన తల్లిదండ్రులు — వారిని నేల దించి జలకమాడించి చలువనీడలో వారికి తీయని పండులను తినిపించుచు ఆ యువకుడు తన్ను (సావిత్రిని) జూచి—

'... ... ... ప్రాణనాయికా
మంచి మరందపానమిడి మామకు నత్తకుఁద్రుప్తి చేసి క
ల్పించుము పూలపాన్పు మఱి వీచుము చల్లనిగాలి నేను గా
వించెద పాదసేవ .... .... .... ....' —పు. 16

యని పలుకును. తానుగూడ నతని ప్రాణేశ్వరునిగా తలంచి భయభక్తులతో బూని తదాజ్ఞ సలిపినటుల కలలో కన్పడును. ఆ కల కాంచినప్పటినుండి 'ఔను, నీవె నా నాథుండవయితి వింతనుండి' అని నిర్ణయించుకొని, అతని రూప గుణ సంపదల కారణముగా సావిత్రి అనంగుని పువుకోలల వాడికి గురి యగును. సావిత్రి సకల కలాపేత్రి యౌట కలలో గాంచిన ఆ యందకాని చిత్రపటమును వ్రాసి చెలికత్తెకు చూపి, తన మనసులో గల అభిప్రాయమును తన చెలికత్తెతో తెలిపి, అంతతో ఆగక

ఈ పటము నా తండ్రికి కన్పర్చి నీవు వేగముగా నావిధము తెలుపుము' అని చెలి కత్తె ముఖమున తండ్రికి కబురు పెట్టును. అశ్వపతి అచ్చెరువునందు చుండును. 'అంతలో దైవవశమున నారదముని అటకు రాగా అశ్వపతి తన పుత్రిక విచిత్రవిధ మంతయు చెప్పును. దానికి నారదుడు 'ఇతడు కలడు. సాళ్వాధిపుని పుత్రుడు కాని అల్పజీవి. పేరు సత్యవంతుడు. ఇతనికి ఆయువు ఇర్వదేండ్లు. అందు పదెన్మిది చనెను. ఇంక నీ యిష్టము' అని చెప్పి వెడలును. ఆ యువకుడు లోకములో నిక్కముగా నుండుటకు అశ్వపతి అద్భుతపడి, అంతఃపురములో చెలులు నుతించు నట్లుగా గౌరీవివాహము చదువుచున్న పుత్రీరత్నముతో నారదుడు చెప్పినవిషయ మంతయు చెప్పి, 'తల్లీ! యితనిన్ భావింపక చిరము బ్రతుకు వరునింకొకనిన్ సేవించుము' అని కోరును. దానికి సావిత్రి, 'తండ్రీ! మన వంశమున మారు మనువు లేదు. అతనితో కాపురము ఒక క్షణమయిన చాలును.

కనకదుర్గయు మనపాల గల్గెనేని
యరయ సాధ్వికి మాహాత్మ్య మలరునేని
యితడు చిరజీవి యగుచు నన్నేలగలడు
వేనుడువులేల తండ్రి! నన్ పీనికిమ్ము"

—పు॥లు. 21, 22

అని పట్టు పట్ట, అశ్వపతి పేదమాతపై భరము పెట్టి, మంచి ముహూర్తము పెట్టించి అరణ్యములో గల సత్యవంతుని కడకు పుత్రికతో గూడి బయలుదేరును.

అరణ్యములో సత్యవంతుడు 'అనిమిషులు మెచ్చునటుల నెనుబదేడు లంత సామ్రాజ్య సంపద ననుభవించి తుద కిట్టి యిడుమలు' పడుచున్న తల్లిదండ్రులను గూర్చి చింతించుచు, చతురంగ బలముతో శంఖకాహళధ్వనులతో తన దెసకు వచ్చు చున్న అశ్వపతిని చూచి తమ రాజ్యము నాక్రమించుకొన్న వైరులని తలంచి యొంటిగా యుద్ధమునకు సిద్ధమగును. అతని ధైర్య గాంభీర్య శౌర్యాది వీర్యము లకు నశ్వపతి అద్భుతమంది చిరునవ్వుతో, 'తాను శత్రువును కాననియు, తన కన్య నొసంగుటకు వచ్చితిననియు' నని యన; వినయానంద త్రపాయుక్తుడయి సత్య వంతుడు అత్యుత్సాహముతో జననీజనకులకు అశ్వవిభుని రాకను గూర్చి చెప్పును. సాళ్వనృపతి అశ్వపతి కోరిక ప్రకారము ఆ యింతిని కొనుమని పుత్రునకు అనుజ్ఞ యిచ్చును. ఆ అడవిలో వారి కల్యాణము జరుగును. అశ్వపతి వివాహానంతరము

సత్యవంతునితో 'నాయనా! బలు తపంబున సావిత్రీదేవి వరప్రభావమున ఈ అమ్మా యిని కాంచినాము. ముద్దుగా బెంచినారము, జాగ్రత్తగా ఏలుకొనవలసినది. అంతే కాదు మరియొక మనవి యేమనగా మా రాజ్యమునకు వచ్చి ఏలుకొనుము. కారడవిలో ఈ ముదితల్లిదండ్రుల నెట్లు పెంచెదవు?' అని కోరగా, దానికి సత్యవంతుడు అర ణము నొల్లనని చెప్పి అంగీకరింపడు. తన్ను అడవిలో వదలి వెళ్లుటకు బాధపడు చున్న తండ్రిని జూచి సావిత్రి 'మగువ యెదిగినంత మగని సొమ్మే యగును. లోకమర్యాద యిది' అని ఓదార్చి పంపును. సావిత్రి వనములో నగల నవలబెట్టి, వల్కలములు పెనిమిటి వలె గట్టి, వరుని కసికందనీయక, అత్తమామలను వేల్పుల భంగి జూచుచు, పర్ణశాలలో ముదమున కాపురము చేయుచుండును.

నారదుడు తన విభునకుంచిన ఆయుః పరిమితి రేపు వచ్చుననగ, నేటి నుండి సావిత్రి యనశనవ్రత మాచరించి ఉదయము రేయి గూడ దేవిని సహస్రనామము లతో పూజించును. మరునాడు భర్త యెంత వలదనుచున్నను భర్తతో అడవికి బయలుదేరును. భర్తతో సాయంసమయము వరకు అరణ్యములో ప్రక్కనే యుండి 'ప్రొద్దు గ్రుంకబోవుచున్నది. ఇంటికి పోదము జాల మేల' అని చెప్ప, సత్య వంతుడు బయలుదేరబోవును. ఇంతలో విధివశమున సత్యవంతునకు తల నొప్పి ప్రారంభమై, అధికమై ప్రాణము విడుచును. సావిత్రి తన కాంతుని అటులౌటను గనుగొని బండలు కరుగగ నేడ్చుచుండును. అంతలో ఘన కాలపాశధరుడయి జముడు సత్యవంతుని సూక్ష్మదేహము నాకర్షించి కొనిపోవుచుండ సావిత్రి వెంబ డించును. తన్ను అప్రతిహత గమనమున వెంబడించు ఆ సాధ్వీమణి మాహాత్మ్యము నకు ప్రేతపతి అచ్చెరువంది 'వరుని దప్ప వరమేదయిన వేడుము' అనును. దానికి సావిత్రి 'కాంతునితో నుంటకన్న బతివ్రతకే కోర్కె యుండును? అది యటుండ నిమ్ము. ఏదయిన వరము కటాక్షింప నీకిష్టమయ్యెనేని—

> అకట! జాత్యంధులైన నా యత్తమామ
> లకు గనుంగవలిమ్ము నీదు కృపచేత
> కొడుకునుం గోడలిం జూచుకొందురి వారు
> తవిలి ముచ్చట దీరంగ ధర్మరాజ!' —పు. 48

అని చిత్రమయిన వరమడుగును. కొడుకును జూచుకొనుటకు కన్నులిమ్మనుట చిత్రము కదా! అనగా సత్యవంతుని బ్రతికించుమని కోరుటయే గదా! ఆ వర

మును జముడు ప్రసాదించి ఆమెను తిరిగి వెళ్లుమనును. ఇట్లు పలుకు జముని వీక్షించి 'ఇతని ప్రశ్నల పరంపరలతో ఆపవలయును' అని నిశ్చయించుకొని, 'పాప పుణ్య మన నెట్లుండును? వాని కేఫలము ప్రాప్తించునో వివరింపుము' అన, దండధరుడు ఆమెకు సవిస్తరముగా వివరించును. తరువాత ఆమె భక్తికి సంత సించి మరల యముడు 'ఓ మంచి చిన్నదాన! నీయందు ప్రీతి చెందితిని. పతిని దక్క ఏవరమయిన అడుగుము' అనును. దానికి చేతులు మొగిడ్చి సావిత్రి సావిత్రీయునితో—

'వేయేల క్షణంబయిన నా మగని విడిచి మరి యుండలేను
దీనికేమిగాని వరము మరియొక దాని గోరుమన్నావు
గాన నా తండ్రి యౌరస పుత్రుల గన గటాక్షింపు మిూవు' పు.47

అని మరల చిత్రమయిన వరమును గడుసుతనముతో నడుగును. ఔరసులు సత్య వంతుడు జీవించినపుడేకదా కలుగుట కవకాశము. అదే ఈ వరము నందలి గడుసు దనము. అంతతో యముని వదలక 'నాకు పతి భిక్ష పెట్టు'మని వేడుచుండ, ఈమె ప్రార్థనమునకు దేవతలు సదయహృదయులై సుమావళి కురియింతురు. అప్పుడు యముడు ఆమె శక్తి సామర్థ్యములకు సంతసించి—

'అమ్మా! నీతండ్రి కౌరసపుత్రులు హాయిగా నూర్వు రలరెదరు
సమ్మోదముతో నీ భర్త మరల సజీవుడై నిన్ను గూడు
నెమ్మి నీమగడు నీవు చిరకాలమ్ము సామ్రాజ్య మనుభవించి యా
పిమ్మట శివసాయుజ్య మందెదరు.... .... .... —పు. 48

అని వరములు ప్రసాదించి, తిరోహితు డగును. సావిత్రి అంత భూమిపైకి వచ్చి నాథుని తల తన యంకదేశమున బెట్టికొని నిద్ర లెమ్మని పిల్వగా నొడలు కదిల్చి నిద్రలేచినవానివలె సత్యవంతుడు జీవించును. తరువాత సత్యవంతుడు సావిత్రి వలన జరిగిన విషయమంతయు తెలిసికొనును. సత్యవంతుని తల్లిదండ్రులు శత్రు వుల నోడించి రాజ్యమును గైకొనివత్తురు. అందరు సావిత్రిని నుతింతురు. ఇట్లు సర్వసంపదల నొసగిన సర్వమంగళకు మంగళము పాడుటలో కృతి సమాప్తమగును

ఈ సావిత్రీ చరిత్ర హరికథ యందలి ప్రధాన కథ భారతము ననుసరించినదే కాని దాసు గారు చిన్నచిన్న మార్పులు చాల చేసినారు. భారతము నందు అశ్వపతి మద్రదేశాధిపతి యని సూచనమాత్రముగా నుండ, దాసు గారి కథలో వాని గుణ సంపద, వాని రాజ్య ప్రజల సదాచారములు కూడ వివరింపబడినవి. ఆ ప్రజల ఆచారము లన్నియు దాసు గారికి నచ్చిన ఆచారములు. ఇట్లే అశ్వపతికి సంతానము లేదని మాత్రమే భారత విషయము కాగా దాసుగారి కథలో సంతానములేని అశ్వపతి మానసికబాధ కూడ వర్ణింపబడినది. ఈ కథ వ్రాయునాటికి దాసు గారు కూడ సంతాన రహితు లగుటచే ఆ బాధావర్ణనము వారి అనుభవము తెల్పునదే. అశ్వపతి సంతానార్థియై పదియునెనిమిది వర్షములు సావిత్రిని కొలువ ఆ దేవి ప్రత్యక్షమైనట్లు భారత కథ. దాసు గారి కథలో తపసును చేసిన కాలప్రసక్తియే లేదు. ఆ దేవి ఏ రూపముతో ప్రత్యక్షమైనదో వివరణాత్మకముగా కలదు. 'మదంశమున' నీకు పుత్రిక జన్మించును అని సావిత్రీదేవి అశ్వపతితో ననుట భారత కథాంశము కాదు. దాసు గారు కల్పించినదే. ఈ మాటవలన సావిత్రి పాత్రకు ఒక ఉదాత్తత కూడ చేకూరినది. అట్లు జగన్మాత అంశమున పుట్టినట్లు కల్పించుటవలననే, దాసు గారు కథానాయికయైన సావిత్రిని ఒక సామాన్య ప్రబంధ నాయికవలె గాక దైవాంశ సంభూతగా తీర్చిదిద్దినారు. ఇరువంశములను పవిత్ర మొనరించు నీ పుత్రిక యను దేవి మాట రెండింటను గల అంశమే. సావిత్రి వినుకలి వలన సత్యవంతుని ప్రేమించినట్లు దాసు గారి కథాంశము. లోకోత్తరమయిన జన్మవృత్తాంతము కల సావిత్రికి లోకోత్తరమయిన ప్రణయ వృత్తాంతముండిన కాని సరిపోదని ఈ దాసు గారు ఈ స్వప్నప్రణయమును కల్పించిరి. నారదుని ఆదేశానుసారము అశ్వపతి సావిత్రిని సత్యవంతునకు ఈయదలచినట్లు భారతకథ. వేదమాతపై గల విశ్వాసముచే నొసగినట్లు దాసు గారి కథ. అత్తమామలకు నమస్కరించి సావిత్రి భర్తతో అడవి కేగినట్లు భారత మందుండ పరమేశ్వరిని కొలిచి వెళ్లినట్లు దాసుగారి కథలో నున్నది. భారతాంశములను మార్చి వీలయినంతవరకు జగన్మాతతో హరికథలో ముడిపెట్టినారు. దానికి కారణము 'మదంశమున' అని సావిత్రీదేవి చెప్పినదానికి కొంత సంబంధము కుదుర్చుటకొరకే. కట్టెను కొట్టుచున్నపుడు సత్యవంతునకు శిరోవేదన కలుగుట భారతకథ. సరసులో మృణాళములను ప్రోగుచేసి యొడ్డునకు వచ్చినపుడు శిరోవేదన కలుగుట దాసు గారి కథ. ఇక సావిత్రి వరముల నడుగుటలో గల గడుసుదనము భారతమునం దుండదు. సావిత్రి యముని ఆపి, పుణ్య

పాప విశేషములను వివరింపుమని కోరుట, యముడు విపులముగా వివరించుట దాసు గారి స్వీయసిద్ధాంత ప్రచారమునకు చేసిన కల్పనయే. భారతాంశము కాదు. ఈ ఘట్టము నందలి వివరించిన పాపము లన్నియు దాసు గారు నిత్యము చూచుచున్న సమాజము నందలివే. ఇవి ఈ హరికథలో గల మార్పులు.

ఇక కథన విధానమునకు ఒకటి రెండు ఉదాహరణములు :—

స్నిగ్ధగాత్రియైన సావిత్రికి ఒక రాత్రి కలలో కన్పించిన సత్యవంతుని స్వరూపము—

బిసరుసు నీలంపు టుంగరముల వలెను ముం
గురులు పెన్నొసటిపై గునిసియాడ
అలచిప్పలంబోలు వాలు కన్నుంగవ
కొనల వెంబడి మంచి నెనరు జింద
ముప్పిరిగొన్న మేల్పుత్తడి మగావున
బలితంపు గంధగర్ధిలి వెలుంగ
మోము చందురు నందు మొల్క మీసలు గప్పు
చిరునవ్వు వెన్నెల చెలగు చుండ

తల్లి దండ్రులు ముసలి ముద్దులు గలిగిన
నెత్తల నోమ్రయు గంపను నేలడించి
జలక మాడించి తీయ పండులను జలువ
నీడc దినిపించు నొక రాచ కోడెకాని. (పు-16)

కాంతారమున ఒక్క కమలాతీరము చెంత సత్యవంతుడు తన కాంత యైన సావిత్రితో నుల్లాసముతో సల్లాపము లాడుచున్న విధము—

ప॥ కాంతా కనుగొనవే యికాంతారము సొగసు
ఎంతో బలు సంతోసము నెనయించెనె మనసు ॥కా॥

అ॥ ఇంతీ హరాంతకారి నడచౌదంతీ మరుని చేమల్లెపూ
బంతీ యందములకు సాటి భవంతి సుగుణాల దొంతీ

మి॥ సంతతంబు జంబూ బదరిపనస ఖర్జూర నారికేళ రంభా
సంతాన స్వాదు ఫలభోగ్యమున్ ।
సకల తపోధన వాస యోగ్యమున్ ॥ శా ॥

1. ఆ చెర్వున నీర్ద్రాగిన నారోగ్యము హెచ్చున్
ఈచోట దపమొనరింప నభీష్టార్థము వచ్చున్
పీచున్న జల్లగాలి యెంప న్గాచున్ సూర్యుడు వెన్నెలవలె
వాచామగోచర మహిమాస్పదము
ప్రకట సత్వరాజిత శ్వాపదము
నీ చరిత్రబోలి విరహితాగము
నిరత నిశ్శ్రేయస శ్రీరాగము. (పు-38)

అశ్వపతి తన పుత్రిక యగు సావిత్రిని సత్యవంతున కిచ్చుటకు చతురంగ బలముతో నరణ్యమునకు వచ్చుచుండ, ఆ వచ్చువారు తమ రాజ్యము నాక్రమించిన శత్రువులని భావించి సత్యవంతుడు యుద్ధమునకు సిద్ధమగును. ఆ సందర్భమున యుద్ధరంగమును విజయలక్ష్మి వివాహముగా చిత్రించిన పద్యము అద్భుతము.
(పు – 25)

ఈ హరికథలో దాసు గారు సంగీత శాస్త్ర సంబంధమయిన చమత్కారమును జేసిరి. ప్రతి కృతియొక్క రాగమును అకృతిలో చివరి పదముగా నిరికించినారు.

ఈ కథ ఆదిశక్తి స్తుతితో ప్రారంభమై సర్వమంగళ మంగళముతో పరిసమాప్తమగును. కథలో గల ప్రతి ముఖ్యాంశము జగజ్జననితో ముడిపెట్టబడినది. అంతేకాక శ్యామలా యను మకుటముతో నెనిమిది పద్యములు ( శ్యామలాష్టకము ), వేదమాతపై దండకము కావనెనని వ్రాసిన అంశములు. ఆ దృష్టితోనే దాసు గారు అశ్వపతికి ప్రత్యక్షమయిన వేదమాతను విశ్వస్వరూపిణిగా శ్రద్ధతో వర్ణించినారు.
(పు – 12)

డాక్టరు కొర్లపాటి శ్రీరామమూర్తిగారన్నట్లు — 'స్వతంత్రమైన ప్రపంచీకరణము, సకృన్మాత్రమైన పరిష్కరణము, సముచితమయిన ఆత్మీయతా ప్రతిఫలనము రాశీభూతమయిన రచనము నారాయణదాసు గారి సావిత్రీ చరిత్రము'. [7]

9. 'సావిత్రీ చరిత్రము-సాహిత్యామృతము'-సారస్వత నీరాజనము - పు.455

## యథార్థ రామాయణము :

దాసు గారి హరికథ లన్నింటిలో యథార్థరామాయణము హరికథ పెద్దది. ఈ హరికథ దాసు గారి ధర్మపత్నియైన లక్ష్మీనరసమ్మగారికి అంకితము. లక్ష్మీనరసమ్మగారికి రామాయణమన్న మక్కువ యెక్కువ యని 'ప్రియంతే రామచరితం పిబ రామాయణామృతమ్' (పు. 136) అను శ్లోకమున దాసు గారే వెల్లడించినారు. ఆ కారణమువలననే లక్ష్మీనరసమ్మగారి మరణానంతరము దాసు గారు ఆమె ఆత్మ శాంతికై చేసిన రచన యిది. లక్ష్మీనరసమ్మ గారు మరణించినది, దాసు గారు ఈ హరికథను వ్రాసినది 1915 లో.

'యథార్థరామాయణము' అని దాసు గారు తమ రామాయణకథకు పేరు పెట్టుటలో వీరి యుద్దేశమేమయి యుండునని ప్రతి పాఠకునకు వెంటనే కొంత ఉత్సుకత కలుగును. ఈ ఉత్సుకతను గ్రహించియే ఆచార్య శ్రీ గంటిజోగి సోమయాజి గారు చేసిన వ్యాఖ్యాన మిది:-

'మొదటి రామాయణము వాల్మీకి కృతము గదా! ఆ తరువాత రాముని గూర్చిన అనేక కల్పనలు ఉపాదేయము లయినవి. మహాకవుల రచనల నుండి, పురాణముల నుండి బయలు వెడలినవి అవి యథార్థములు కావా? అను ప్రశ్న ఉదయింపక తప్పదు దాని నంతటిని మనసు నందుంచుకొని ఒక సమన్వయమును మనము చేసికొనవలయును. శ్రీరాముని స్వరూప స్వభావములను బయట పెట్టుటలో వాల్మీకి యుద్దేశము ప్రథమమైన అర్థము. తులసీదాసు, త్యాగరాజు మొదలయిన భక్తులు నిరూపించిన అర్థము రెండవ అర్థము. అష్టాదశ పురాణములలో నిరూపింపబడినది ఇంకొక అర్థము. ఆధ్యాత్మ రామాయణము, సీతారామాంజనేయము నిరూపించిన శ్రీరామ స్వరూపము ఆత్మారామస్వరూపము ఇంకొకటి. ఇతరులయిన కావ్యకర్తలు, ప్రబంధ నిర్మాతలు. రూపకరచయితలు, శతకకర్తలు నిరూపించినది జగదభిరాముడయిన పరంధాముని స్వరూపము ఇంకొకటి. వాని నన్నింటిని గ్రహించుటయు సమన్వయపరచుటయు నేటి యథార్థమని చెప్పక తప్పదు. ఈ యుద్దేశమే, ఇట్టి సమన్వయప్రయత్నమే, ఇటువంటి వర్ణనాదక్షతయే యథార్థరామాయణమున దాసు గారు నిరూపించినారని నా యుద్దేశము'[10]

ఇక దాసుగారు ఒక శిష్యునితో 'అనుకొనునట్లు అర్థ మిచ్చు (అర్థము = ధనము) రామాయణము కావున ఇది యథార్థరామాయణము' అని ఒకసారి యథార్థరామాయణమునకు చెప్పిన చమత్కారమైన అర్థము.

---

10. శ్రీ ఆదిభట్ల నారాయణదాస సారస్వతనీరాజనము. పు-377

సీతారాముల చరితమును ఆదిభిక్ష పెట్టిన మహర్షి వాల్మీకి. ఆ భిక్షను బాల వాల్మీకులు యథాశక్తి రకరకములుగా ఆరగించిరి. ఎవరెన్ని పంటలు పండించినను పొలము వాల్మీకిదే. ఆ వాల్మీకి పడధ్యాయికి వెనుకటి వారివలె దాసు గారు కూడ వీరి భాష్యము వీరు చెప్పిరి. కాని వీరి భాష్యము యథార్థమయిన వాల్మీకి హృదయమని వీరి విశ్వాసము. అనగా ఇప్పుడు మన యెదుటనున్న వాల్మీకి రామాయణము నందెన్నియో ప్రక్షిప్తము లున్నవనియు, వాల్మీకి మహర్షి యథార్థముగా నిట్లు వ్రాసియుండునని భావించి, దాసుగారు వ్రాసిన కథ ఈ యథార్థ రామాయణ హరికథ.

ప్రస్తుతము మనకు లభించుచున్న వాల్మీకి కథలో వారి కెన్ని సందేహములు వచ్చినవో ఈ యథార్థరామాయణ పీఠికలోని వారి మాటలనుబట్టి మన కర్థమగును.

'దైవము మనుష్యులచేత నతిక్రమింప శక్యము కాదు, మీచేతనయిన కొలదిన్నాకు మీరుపచరించినారు, కాని లక్ష్మణుడు గతజీవుడయినవాడు కనుక సీతతోగాని యుద్ధముతోగాని మరి నాకవసరము లేదు, మీరు మీ యిచ్ఛానుసారముగా బొండు. వానర పుంగవులారా! యిక్కడనే నేను దేహమున్విడిచెద నిక బ్రతుకు నొల్లను. దుష్కృతకర్ముడ ననార్యుడన్నే నిస్సీ విభీషణుని రాజు న్గావించెదనను నా మిథ్యా ప్రలాపనము నన్దహింపగలదని యమోఘ సంకల్పుడు దృఢవ్రతుడు ధైర్యసుందరుడు సర్వజ్ఞుడు నగు రాముడు దీనాలాపము లాడునా?

అయోనిజ తపస్విని యార్యయు నగు సీత ధర్మమూర్తియో రామునకు దక్క నితరున కెట్లయిన జిక్కునా?

పరమ భాగవతోత్తముడు, బ్రహ్మజ్ఞాన సంపన్నుడు, జీవన్ముక్తుడు నగు విభీషణుడు పామరుని వలె గూఢయుద్ధమున నింద్రజిత్తుచేత జీకటిచే నాదిత్యుల వలె రామలక్ష్మణులు నిహతులయిరి, మఱి నాకు రాజ్య మెట్లు దొరకునని వగచునా?

ఇంద్రజిత్తు సీతను వధించెనని సర్వజ్ఞుడగు హనుమ రామునితో చెప్పునా?

అయోనిజకు మృతి లేదని తెలిసియు సాక్షాన్నారాయణావతారమూర్తి యగు రాముడు దుఃఖించునా?

పరమ భాగవతోత్తముఁడు విభీషణుఁడు నవవిధ భక్తిమార్గములచే బరమపురుషు నారాధించుటతప్ప నింద్రజిత్తు రావణు న్గూడ నశింపజేయుటకై రణరంగమున గదతో వారి యిరువుర రథ్యముల నప్పడ గూల్చునా ?

ఇంద్రజిద్వధానంతరమున రావణుఁడు తన్జంప వచ్చుచున్నాడని తెలిసికొని హనుమని యుపదేశము విని యతని మూపెక్కి రామునియొద్ద కేల పోనయితి నని యయోనిజ యగు సీత నొచ్చుకొనునా ?

లక్ష్మణుఁడు పునర్జీవితుడయి యుద్ధవిముఖుడయి రాముడున్నట్లు తెలిసికొని రామునితో నీ ప్రతిజ్ఞ న్మానుకొనుట నీకు దగదని యీసడించి పల్కినాడనుట యుచితమా ?

అంతర్గత క్రోధాగ్ని పైకి ప్రజ్వలింపజేసి సర్వజ్ఞుడు న్ధర్మమూర్తియు నయిన రాము డయోనిజ యగు వైదేహి పాతివ్రత్యము న్శంకించి యున్మత్తుని వలె విభీషణునితో గాని సుగ్రీవునితో గాని భరతునితో గాని పొందు నల్పు మిక రావణునిచే జెఱుపబడిన నీవు నాకు బనికిరావని కారులాడునా ? యగ్ని సంపూత యగు సీతతో లోకప్రవాదము మాన్పుట కీయెత్తు పన్నినాడ నని సత్యసంధుడగు రాముడు కపట నాటకము ప్రదర్శించునా ?

రావణ వధానంతరమున సీతకు రామవిజయ మెఱిగింప నేగిన హనుమడు సీతన్గాచు రాక్షసస్త్రీల న్పాపికృతుని వలె జంప నుంకించునా ?

రాముడు సీత న్బెండ్లాడినపుడు ద్వాదశవర్ష వయస్కుడనియు నూన షోడశ వర్ష వయస్కుడనియు న్మని తబ్బిబ్బాడునా ?

సీత లక్ష్మణునితో రాముడు నశింపగా నన్గవయ గోరితివా యని నిష్ఠూరము లాడునా ?

లక్ష్మణుడు సాధ్వీమతల్లి యగు సీతను విముక్తధర్మ, చపల, తీక్ష్ణభేదకర యని సంబోధించునా ? నన్శంకించుచున్నావు కనుక దుష్టురాలవు నశించుమని శపించునా ? జటావల్కలధారినై పదునాలుగేండ్ల వనవాస మొనరించునపుడు మాంసము న్దిననని ప్రతినపూనిన రామునిచే మాంస భోజనము చేయించునా ? లక్ష్మణు న్గవ గూడ నని దుర్మార్గముగా సీత కడుపు బాదుకొను చేడ్చునా ?

రావణునిచేత సీత గుప్తావయవ వర్ణనము చేయించునా ?

లక్ష్మణుడు విభ్రాంతుడయి పామరుని వలె భరత శత్రుఘ్నుల గైకేయి నూడ సపరివారముగా వధించెదనని రామునితో పల్కునా ?

విరాధుడు సీత న్దొడపై గూర్చుండబెట్టుకొన్నాడని రాముడు వగచుచు లక్ష్మణునితో బల్కునా ?

రామలక్ష్మణులు విరాధునిచే గొంపోబడుట చూచి సీత యేడ్వదొడగునా ?

త్రిదశు లిరువదైదేండ్ల వయసు గలవారని నిర్దేశించునా ? శూర్పణఖతో రాముడు పరిహాసోక్తులు ఛలోక్తులుం బల్కునా ? విశాలాక్షీ మెఱపులాగున ప్రకాశించుచున్నావని యెకసక్కెమొనరించునా ? లక్ష్మణుడు శూర్పణఖ న్బరిహసించునా ? ముక్కు చెవులు తెగగొట్టిన చెప్పునాకను విరూప న్గావింపుమని రాముడు లక్ష్మణున కాజ్ఞ యిడునా ?

వరిష్ఠుడగు హనుమంతుడు రావణున్గౌగలించుకొని నిదురించుచున్న మందోదరిం జూచి సీత యని భ్రమించునా ?

హనుమంతుడు సీత న్జూడజాలనైతి నను దిగులున నాత్మ హత్య చేసికొన నెంచునా ? సర్వజ్ఞుడగు హనుమంతుడు తాగాల్చిన లంకలో సీత దహింపబడెనని యనుకొనునా ?

తన వలె భార్య నెడసి బ్రహ్మచర్య వ్రతనిష్ఠుడయిన లక్ష్మణునితో దృఢ వ్రతుడగు రాముడు సీత నిగూఢావయవ వర్ణనము సల్పుచు గామోద్దీపకముగా దన మన్మథోన్మాదమును వెల్లడించునా ?

వినాథను, వివశ, ననీశను గనుక బలాత్కారముగా రావణ గాత్ర స్పర్శము నాకు గలిగెనని రామునితో లోకమాత యగు సీత యనునా ?

రావణుడు రాముని శిరము నటికి తెచ్చితిన్నాడు మన నమ్మాయ శిరస్సున్గాంచి ప్రాకృతస్త్రీ వలె నయోనిజ యగు సీత విలపించునా ?

రాక్షసున్జంపుటకు సాహాయ్యమును లంకాప్రధర్షణము న్జేయుటకు ప్రాణమున్నవఱకు ప్రయత్నించెదనని రామునితో విష్ణుభాగవతుడగు విభీషణుడు పల్కి రావణ సైన్యము న్నుఱుమాడునా ?

మాఱుటి రుద్రుడగు హనుమంతుడు రాక్షసాధముడగు రావణ ప్రాభవమున కద్భుతపడునా ?

సత్యపరాక్రముడగు రాముడు నటుని వలె వేషము వేసి తా నపరాజితుడు పరాభవ మెఱుగనివాడయ్యు నింద్రజిత్తుని శరపాతమున క్షతగాత్రుడయి నేల కొరగి ప్రాణమాత్రావశిష్టుడైయుండునా ?

శరతల్పగతులయిన రామలక్ష్మణుల రావణుని మాట నమ్మికొని విమాన మెక్కి రణ రంగమునకు వచ్చి సరికించి వైదేహి 'యేడ్చి యేడ్చి తిరిగి లంకకు మళ్ళునా ?

మునికాంత యగు నహల్య యింద్రునితో వ్యభిచరించి యీ సంగతి వెల్లడింప కుమా యని యింద్రుని బతిమాలుకొనునా ?

సత్యపరాక్రము డగు రాముడు పొంచుండి వాలికి దొంగ దెబ్బ కొట్టునా ?

శివ భాగవతోత్తముడు బ్రహ్మణ్యు డగు రావణు డయోనిజ యగు వైదేహి స్త్రీత్వధర్మమున గవయ నెంచునా ?

ఇంతకును నీరు పల్లమెఱుగును, నిజము దేవు డెఱుగును. వేదము లందు మంత్రమేదో బ్రాహ్మణ మేదియో నిర్దేశింప వీలువడనట్లు శ్రుతి స్మృతి పురాణేతిహాస రామాయణాది శాస్త్రము లందు మునిప్రోక్తము లెవ్వియో ప్రక్షిప్తము లెవ్వియో మాదృశాల్పజ్ఞులు నిరూపింపదగునా ?'[11]

ఇవి యన్నియు ప్రక్షిప్తము లయినచో నిక మిగిలిన రామాయణ మేమి యున్నది ? దీనికి సమాధానము దాసుగా రన్న 'నీరు పల్లమెఱుగును, నిజము దేవు డెఱుగును' అన్నదే.

యథార్థ రామాయణమును ఏక దిన ప్రదర్శన యోగ్యముగా దాసు గారు వ్రాయలేదు. ఆరు విభాగములు చేసి ఆరు దినములు చెప్పునట్లుగా వ్రాసిరి. ఆ ఆరు విభాగములు ఆరు ప్రత్యేక హరికథలుగా గూడ చెప్పుకొనవచ్చును. సమర్థుడగు కథకునకు ఈ యథార్థరామాయణము మాసగ్రాసము. ఆ ఆరు విభాగములు — 1. శ్రీరామ జననము, 2. సీతాకల్యాణము, 3. శ్రీరామ పాదుకాపట్టాభిషేకము, 4. శ్రీరామ సుగ్రీవ మైత్రి, 5. హనుమత్సందేశము, 6. సామ్రాజ్యసిద్ధి.

---

11. యథార్థరామాయణ పీఠిక - శ్రీరామాయణము నందలి ప్రక్షిప్తములు. పు॥లు 29-32

శ్రీరామ జననము :

సామాన్యముగా దాసు గారి హరికథలలో కన్పట్టు ఇష్టదేవతా స్తుతి, సామాజికుల నుద్దేశించి చేయు చర్చలు ఈ యథార్థ రామాయణ హరికథా ప్రారంభములో కన్పడవు. అట్లే ఏ యితర హరికథా గ్రంథమునకు కూడ ఈ హరికథకు ముందున్నట్లుగా ముప్పది రెండు పుటల సుదీర్ఘ రచన 'పీఠిక' లేదు. ఏ యితర హరికథలో కన్పడని ఆశ్వాసాంత గద్య ఈ హరికథయొక్క ప్రతి విభాగాంతమున కన్పడుచున్నది. ఈ ఆశ్వాసాంతగద్యలో '....సహజ పాండిత్య విలాస బ్రహ్మశ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాస' అని యుండుట ఒక క్రొత్త అంశము.[12]

ఉన్నిద్రపత్కదళీపత్ర ధవళాంగా వ్యపేక్షణా
చాంపేయనాసికా సుభ్రూః ప్రియానే నాయికా. —పు. 1

అను కృత్యంకిత శ్లోకముతో గ్రంథమును సూటిగా ప్రారంభించి—

పావనము రామచరితము
కేవలమున్ బుణ్యకాంత కృతినాయికయున్
శ్రీవిష్ణు భాగవతులు స
భావస్తులు నా కవిత్వభాగ్యము పండెన్. పు-1

అని లాంఛనప్రాయముగా నొక కందము వ్రాసి నేరుగా కథలోనికి దూకిరి.

దశరథుడు అయోధ్యా నగరమునకు రాజుగా నుండుట — అతనికి ముగ్గురు భార్య లుండియు సంతానము లేకుండుట — దశరథుడు వేట కేగి శాపగ్రస్తుడగుట — వసిష్ఠుడు పుత్రకామేష్టి చేయు మనుట — దేవతలు రావణుని బాధలు విష్ణువుతో మొరపెట్టుకొనుట — దశరథుడు తనకు సంతానము కల్గునా యని సందేహించుట — వసిష్ఠుడు దేవరహస్యమును దెలుపుట—రావణజన్మవృత్తాంతము — సీతా సౌందర్య వర్ణనము — నారద గర్వభంగము — నారదుడు విష్ణుని శపిం

---

12. దాసుగారి ప్రతిభ లోకమునందెన్నెన్నో బిరుదములు సంపాదించుకున్నను, దాసుగారి కిష్టములై పెట్టుకొన్న బిరుదము లివి- సహజ పాండిత్య విలాసుడు. మహాకవి గాయక శిరోమణి, కవితాగానశాలి.

చుట—కరవు వర్ణన—ఋష్యశృంగుని యాగము చేయించుటకుతీసికొనివచ్చుట — శ్రీరామాదుల జననము — శ్రీరామ జనన భాగమునందలి కథాంశములు.

ఈ కథ యంతయు వాల్మీకి బాలకాండము నందలి శ్రీరామాదుల జననము వరకు గల కథననుసరణమే. కామవిజయు డనుకొనుచున్న నారదునకు విష్ణు మాయవలన గర్వభంగము అగుట, నారదుడు విష్ణుని శపించుట అనునవి వాల్మీకి రామాయణ కథాంశములు కావు. తులసీదాస రామాయణాంశములు. వసిష్ఠ మహర్షి ఋష్యశృంగుని మహిమను వివరించు సందర్భములో వర్ణించిన కరవు వర్ణన కూడ వాల్మీకీయము కాదు. మిగిలిన కథ యంతయు వాల్మీకిదే కాని కథన విధానము మాత్రము దాసు గారిదే.

కథాకథన కౌశలమునకు ఒకటి రెండు ఉదాహరణములు :—

దశరథుని బాణమువలన మరణించిన మునికుమారుని ముదుసలి తల్లిదండ్రుల శోకమును దాసు గారు తీర్చిన తీరు—

ఎట్లుంటి వమ్మ నీ కేమి కావలెనయ్య
యని యింక మమ్మెవ్వ రడుగువారు

ముసలి ముద్దలను మమ్ముం దానమాడించి
బువ్వ దినిపించు వా రెవ్వ రింక

వాన కెండకు గొడ్డు వలె మమ్ము లోబడ
నీక కాపాడు వా రెవ్వ రింక

వేదవేదాంగము ల్వినిచి మా వీనుల
కింపు గావించు వా రెవ్వరింక

పీడు రానేల నిట పీసి వేట గూల
నెఱుఁగ లేమైతి మింతలో నిటులగునని
యేమి సేయుదుమింక మా కేదిదారి
యకట విధి చేత నెవ్వరైన నడ్డఁ దరమె? (పు-౪౯)

పుత్ర సుఖ భాగ్యము నోచుకొనని వారి శోకము ప్రాగభావ బాధాజన్యము. ఆ సుఖ మనుభవించి పోగొట్టుకొన్న వారి శోకము ప్రధ్వంసాభావబాధాజన్యము.

లేని సుఖమునకై పొందు బాధకు పూరణావకాశ ముండును. ఉన్న సుఖము దూర మైనచో ఆ బాధ పూరణావకాశములేని ప్రతి క్షణ మరణ సదృశము, ప్రస్తుత పద్యము పుత్ర సుఖ భాగ్యమును కోలుపోయిన ముసలి తలిదండ్రుల బాధకు భాష్యము.

తన మువ్వురు పత్నులు అంతర్వత్నులయిన సందర్భమున దశరథుని ఆనందపు చిందులు—

చూలాండ్రఁ దన భార్యల స్మగుర నాక్రోశించు నెంతో దయన్
లాలించుం, బలుమాఱు ముద్దులిడెడున్, వాకొండు మీ కోర్కెలన్
వైళం బిచ్చెదనంచు బల్కు, భగవన్మాహాత్మ్యము న్మెచ్చు, మీ
సాలన్దువ్వుచు బొంగుచుండుఁ బడుఁబెల్చన్ ఋష్యశృంగాంఘ్రులన్.

పుట - 57

వసిష్ఠ డంతటి బ్రహ్మర్షి పుత్రకామేష్టి చేయుమన 'ముసలివారికిఁ బిల్లలు పుట్టు టెట్లు ? ఆఱు నూరైన సాజంబు మాఱు టెట్లు ?' అని సందేహించినవాడు దశరథుడు. అట్టివానికి తన మువ్వురు పత్నులు అంతర్వత్నులయినపుడు కలుగు ఆనందపు చిందులు ఇక మాటల కందునా ? చూలాండ్రగు భార్యలను లాలించుచున్నాడు: ముద్దాడు చున్నాడు. కోర్కెలను కోరుకొనుమనుచున్నాడు. తనకే ఆశ్చర్యమగుట వలన భగవన్మాహాత్మ్యమును మెచ్చుచున్నాడు. తాను కూడ తండ్రిని కాబోవు చున్నానని మీసాలను దువ్వుచున్నాడు. కృతజ్ఞతతో ఋష్యశృంగుని పాదాలపై బడు చున్నాడు. ఇట్లు అందదనుకొన్నది అందినపుడు డెందము పొందు ఆనందమును ఈ పద్యము అందముగా రూపొందించినది.

సీతా కల్యాణము :

దశరథుని కడకు విశ్వామిత్రుడు వచ్చి తాను జేయు యజ్ఞమునకు రక్షకుడుగా రాముని కోరుట — వసిష్ఠుని ఆదేశానుసారము రామలక్ష్మణులను బంపుట — తాటక వధ — సీతాస్వయంవరమునకు బయలుదేరుట — అహల్యాశాపవిమోచనము — విశ్వామిత్రునిచే అహల్యావృత్తాంతకథనము — మిథిలా నగర ప్రవేశము — సీత రాముని చిత్రపటమును జూచి ప్రేమించుట — ఉద్యానవనములో సీతారాములు చూచుకొనుట— ప్రకృతి వర్ణనము — శివధనుర్భంగము — వైవాహిక వర్ణనలు — పరశురామఘట్టము ఈ విభాగము నందలి ప్రధాన కథాంశములు.

ప్రధాన కథ వాల్మీకి రామాయణ బాలకాండము నందలిదే అయినను, ఈ విభాగము నందెన్నియో అవాల్మీకీయములయిన కథాంశము లున్నవి.

అహల్య పాషాణరూపమున నున్నట్లు దాసు గారు చెప్పిరి. ఇది అవాల్మీకీయమైన అంశము. పాషాణరూపమున నున్నట్లు వర్ణించిన గ్రంథములు అధ్యాత్మ రామాయణ పద్మపురాణములు. దాసు గారి గ్రంథమున అహల్య రాయిగా మారుట కూడ గౌతమ మహర్షి శాపము వలన గాదు. తన సతీత్వ మహిమచే ఆమెయే రాయి యగును. అంతేకాక శాపావధి కూడ తానే నిర్దేశించుకొనును.

సీతాస్వయంవరమునకు రాజులు చిత్రపటములు పంపుట, రాముని చిత్రపటమును జూచుచు సీత ప్రేమాలాపము లాడుట, సీతారాములు ఉద్యానవనమున బరస్పరము చూపుల తలబ్రాలు పోసికొనుట అనెడి అంశములు అవాల్మీకీయములయిన కల్పనలు. ఉద్యానవనమున సీతారాములు గలిసికొన్నట్లు కల్పించిన గ్రంథములు యజ్ఞఫల నాటకము, తులసీదాసు రామాయణము.

ఈ విభాగము నందలి కథన విధానమునకు కొన్ని ఉదాహరణములు....

ముత్యాల కంటెతో, బంగారు దుప్పటి వల్లెవాటుతో, ఎడమ కాలిని పెండెరముతో ఖండపరశుకోదండ ఖండనమునకు పూనుకొన్న శ్రీరాముని సాహసమును గూర్చి పలురకాలుగా పలుకుచున్న రాజమండలి—

ఏది యెల్లుండనీ యీ బాలకుని తెగు
వన్మెచ్చెదగు నంచుఁ బల్కువారు

పోల్చంగవసమె యేపుట్టలో నెట్టి పా
మున్నదో యని తలలూచువారు

నిజముగ విల్లెత్తనీ మాననీ కాని
తగు సీతఁ కితఁడంచుఁ దలఁచువారు

దేవుఁడు నేఁడు క్షత్రియగౌరవము నిల్ప
నితఁడయ్యెనో యంచు నెంచువారు

జనము లిట్టుల సంశయాశ్చర్యములను
బొందుచుండఁగ శ్రీరామచంద్రుఁడంత

భూమిసుత వైపు శృంగారమున్ మహేశు
విలుదెసన్ వీరరసము రాజిలఁగఁ జూచె. పు-90

బాల్యము నుండి పోటీలలో పాల్గొన్న దాసు గారికి ప్రేక్షకుల భావములు సుపరిచితములు. ఆ యనుభవము నేర్పిన పాఠము లివి.

శివధనుర్భంగ దినమునకు పూర్వపు రాత్రిని వర్ణించిన వచనము దాసు గారి లోకపరిశీలనమునకు చక్కని తార్కాణము. ఆ సుదీర్ఘ వచనము నుండి పండు ముసళ్లను గూర్చిన అంశము :-

'దూపిని విడచుటకుఁదప్ప మఱెందుకున్ బనికిరాక తమ వెనుకటి బీరంబులు చెప్పుకొనుచుఁ బూర్వులం గొనియాడుచు నవీనుల నిరసించుచుఁ బిచ్చియోడుచుం, జెప్పినమాటయే చెప్పుచుఁ, బెద్దతనము నెపంబునఁ దమ యభిప్రాయములే సరియైన వని నిశ్చయించుచుఁ బిలువని పేరంటముగ నుపదేశించుచుఁ జేతకాని పనులం బూను కొనుచుఁ దలంపులచేత మాత్రమే కొంత సంతుష్టిఁగొనుచుఁ దాము తిసలేకొరులఁ దిన నీక గదుముచు, మిక్కిలి పిసినారితనంబున యాచకులఁ దెగడుచుఁ దమ వ్యర్థ జీవ నముం బొడిగింపఁగోరి యెల్లపు డడ్డమైన మందులు తిని కఠిన పథ్యంబు సేయుచు, నందని పండ్లు పులుపు ననునట్లు తమకు లభించని భోగంబులు తుచ్ఛంబులని వద రుచుఁ దమ్ముఁ లక్ష్యమ్ము సేయనివారలకు మిట్టశాపంబులిడుచు, బిసఁగొని చాపల్యం బునఁ జేసిన పనినే చేయుచు, దేనియందయిన నిలకడ పొందలేక సంశయంబునం దగిలి, యెద్దియున్ విశ్వసింపనేర కెవ్వరి యెడనైన మైత్రిఁగొనఁజాల కాకాశ పంచాంగములు విప్పుచు నాసమాత్రమే మిగుల నందఱికంటె నెక్కువగ మిత్తికై వెఱచు జీవన్మృతులగు ముదుసళ్లు నవిసేకులని యీసడించుచుఁ గొందఱు ; వారి బోధలు వినీవిననట్లు కొందఱప్పటికి మాత్రము వారి యెడ భక్తివిశ్వాసము నోఁమోటము నగపర్చుచుఁ గొందఱు ; వారినోఁసపుచ్చుచుఁ గొందఱు ; ఇకనైన వైరాగ్య మంది యెచటనో ముక్కుమూసికొని ముందుసంగతి కనిపెట్టుకొన కెందుకట్లు పామ రత్వమునఁ బ్రాకులాడుచర్థచింత చేసెదరు ? చాలు నీపాటి తాళపుచెవులు మాపైఁ బాఱవేయుఁ దక్కఱమాలిన సంసార బాధ మీకెందుకని చీవాట్లిడుచుఁ గొందఱు ;

కనపడదు వినబడదు కాళ్లలేవు చేతులులేవు మతిలేదు సుతిలేదు కాని యన్ని వ్యవహారములున్ వీరికే కావలయు నాహా ! దేవుడా ! యెంత బుద్ధిమాలినవాఁడవు ? చెట్లను నఱికి మొదళ్ళనుమి గుల్చునట్లు పనికి వచ్చు పడుచువారిం దెగటార్చి యిమ్ము సలిముద్దలకెంత యాయువిచ్చుచున్నావురా ? యని విధిం దిట్టుచుఁ గొందఱు ;

ఓహో ! యా పండు తొండ రూపేమి, బోసినోటి తీరేమి, డెబ్బదవపడి యేమి, బారసాలపీటపై వడకుచుఁ గూర్చున్నసొంపేమి, ముసలికాలమునకు ముచ్చ ట్లని యెగతాళి చేయుచుఁ గొందఱు ;

కాలము గడపిన పెద్దలు మనలఁ గని పెంచి మనకొఱ కెన్నియో పాట్లు పడి నారు, గౌరవపాత్రులు, వారి తప్పుకాదు, బాల్యమునకు వలె వార్ధక్యమునకుఁ జాప ల్యమున్ మౌఢ్యమున్ స్వభావము. ముసలతికమునకుం బడుచుతనమున కెంత మాత్రమున్ గిట్టదు. వారఱచుచుంట మనము మన యిచ్చవచ్చినట్లు తిరుగుచుంట, రండంచుఁ గొందరు ;.... .... ....' (పు॥లు 85_87).

ఈ వచనము దాసు గారికి సమకాల సమాజములో సాక్షాత్కరించిన జన మనఃప్రవృత్తులు. మిథిలానగర ప్రజల మనఃప్రవృత్తులు కావు.

ఇట్లే శ్రీరామలక్ష్మణులు విశ్వామిత్ర మహర్షితో సరయూనది దాటి అరణ్య మున ప్రవేశించునపుడు చేసిన అటవీవర్ణనము (పు. 65_68), మిథిలానగర వర్ణనము (పు. 76_78) దాసు గారి నిశిత పరిశీలనమునకు నిదర్శనములు.

ఇక ఈ విభాగము నందలి సీతారామ కల్యాణ ఘట్టము ఒక శృంగారరసోప నిషత్తు. ఈ ఘట్టమున మైథిలీ దాశరథుల పెండ్లిని మిథిలానగర వైవాహిక సంప్ర దాయములతో జరుపక, తెలుగుగడ్డపై మొలిచి నిలిచిన ఆచారములతో జరిపినారు. ఈ ఘట్టమున ఎదురుబడిన ఈ ఆచారము లన్నియు ( పు. 93_94 ) తెలుగువారి పెండ్లిండ్లకు వందల యేండ్లనుండి వదలక వచ్చుచున్న పెండ్లి పెద్దలే.

శ్రీరామ పాదుకాపట్టాభిషేకము :

దశరథుడు శ్రీరామునకు పట్టాభిషేకము చేయ సంకల్పించుట - మంథర దుర్బోధ - కైక వరములు గోరుట - సీతారామలక్ష్మణులు అరణ్యమునకు బయలు దేరుట - గుహుడు భక్తితో సేవించుట - శ్రీరాముడు బ్రహ్మచర్య వ్రతమును బూనుటకు, లక్ష్మణుడు నిద్రను మానుటకు ప్రతిజ్ఞలు చేయుట - భరతుడు అర ణ్యమునకు బయలుదేరుట - భరతుడు రామునిపై యుద్ధము చేయ వచ్చుచున్నాడను కొని గుహుడు యుద్ధమునకు సన్నద్ధ మగుట - భరతశత్రుఘ్నులు కూడ శ్రీరామ పట్టాభిషేకము జరుగువరకు జటలు ధరించి బ్రహ్మచర్యమున నుండుటకు నిర్ణ

యించుకొనుట – కైక పశ్చాత్తాపము చెంది రాముని రాజ్యమేలుకొను మనుట – భరతుడు పాదుకలు గ్రహించి సింహాసనముపై తీసికొనివచ్చుట ఈ విభాగమునందలి అంశములు.

ఈ విభాగము నందలి కథ యంతయు వాల్మీకి అయోధ్యాకాండము నందలిదే. కైక పశ్చాత్తాపవర్ణనము వాల్మీకీయము కాదు. అధ్యాత్మరామాయణము నందలి అంశము. కథన విధానములో స్వప్రతిభ చొప్పించినను తక్కిన కథాంశములన్నియు వాల్మీకి రామాయణాంశములే.

కథన విధానమునకు రెండు ఉదాహరణములు :—

'ఒడ్డున వైచిన చేపవలె, జిగురుకండెన్దగిలిన పక్షి కరణి, బంగిడిం జిక్కిన యేనుంగు మాడ్కి దశరథుడు తల్లడిల్లుచుండ ; తన లేగన్గానని గోవు తెన్నున కౌసల్య వాపోవుచుండ ; ఇక నిష్కంటకముగ భరతుడు రాజ్యము సేయ వైభవంబున విర్రవీగుచు దన సతుల నుడికింపవచ్చునని కైక యుబ్బుచుండ ; శ్రీరామచంద్రుడు భూభార ముడుప సమయమబ్బెనని వసిష్ఠుం డుల్లసిలుచుండ' శ్రీరాముడు సీతాలక్ష్మణ సహితుడయి అయోధ్యా నగరమును వీడి అరణ్యమునకు బయలు దేరెనట. (పు. 113).

శ్రీరాముడు సీతాలక్ష్మణ సహితుడయి తన తల్లివలన అడవి కేగె నని అయోధ్యకు వచ్చినపుడు తెలిసికొని బాధపడుచున్న భరతుని మాటలు....

అడిగిన దిచ్చెద ననుమాట తప్పని
జనకుని పట్ల దోషంబు లేదు
తాఁ గన్న కొడుకుచే ధరణి నేలింప వాం
ఛించిన నా తల్లి సేగి లేదు
అనపాయ భక్తితో నన్న వెంబడి గొల్చు
లక్ష్మణు నెడలఁ గల్మషము లేదు
పితృ వచనము నిలపెట్టుటకై కాన
కేఁగిన రాముని కెగ్గులేదు

కాని, జగదేక వీరుఁ డగ్రగజుఁడు నాకు
రామచంద్రుఁడు సర్వ ధర్మ స్వరూపుఁ
డడవిఁ దపమొనరింపఁ దదంఘ్రిరజము
నైనఁ బోలని నేనె రాజౌట తప్పు, (పు - 122)

కల్పనానిధీశుడయిన భాసుడు కూడ తన ప్రతిమా నాటకమున భరతునిచే కైకను తిట్టించినాడు అట్లు తిట్టించుటకంటె కన్నతల్లి లోపమునకు కారణము కిట్టించిన దాసుగారి విధానము పైమెట్టు.

సీతారామలక్ష్మణులు అడవిలో నడచుచు పడిన బాధలను వర్ణించిన వచనము (పు. 119-121) దాసు గారి బహువిషయజ్ఞతకు ప్రమాణము.

శ్రీరామ సుగ్రీవ మైత్రి :

సీతారామలక్ష్మణులు అత్రిమున్యాశ్రమమున కరుగుట - అనసూయ సీతకు వస్త్రములు - కుంకుమ నొసగి పతివ్రతా ధర్మములు వివరించుట - విరాధ రాక్షసవధ - శరభంగముని దర్శించుట - అగస్త్యమున్యాశ్రమమున కేగుట - అగస్త్యుడు రామునకు అక్షయతూణీరము, అమోఘమైన విల్లు నిచ్చి గోదావరి యొడ్డున గల పంచవటి యందు వసింపుమని చెప్పుట - లక్ష్మణుడు నిర్మించిన పర్ణశాల వర్ణనము - శూర్పణఖ శ్రీరాముని మోహించుట - లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోయుట - ఖరదూషణాదుల వధ - శూర్పణఖ ప్రేరణమున రావణుడు మారీచునితో అరణ్యమునకు వచ్చుట - మాయలేడి వృత్తాంతము - రావణుడు అతిథిరూపమున వచ్చి సీతను మట్టిపెళ్లతో సహా అపహరించుట - జటాయు యుద్ధము - శ్రీరాముడు జటాయువు వలన రావణు డపహరించినట్లు తెలిసికొనుట - కబంధరాక్షసవధ - శబరికి మోక్షమునిచ్చుట - హనుమంతుడు రామలక్ష్మణులను సుగ్రీవుని యొద్దకు తీసికొనివెళ్లి మైత్రి చేయుట అన్నవి ఈ విభాగములోని కథాంశములు.

దాసుగారు వాల్మీకి రామాయణములోని అరణ్యకాండ చివరిభాగము, కిష్కింధా కాండలోని కొంతభాగము కలిపి ఈ భాగమును కూర్చినారు.

ఈ విభాగము నందు కూడ దాసు గారు అవాల్మీకీయములయిన అంశములను కొన్నింటిని చొప్పించినారు. విరాధ వధ ఘట్టము నందు చెప్పిన తుంబురు శాప

విమోచన విషయము, రావణుఁడు నేలను పెళ్లగించి పెల్లతోసహా సీతను రథముపై నిడుకొని తీసికొనిపోవుట వాల్మీకి కథాంశములు కావు. ఈ రెండంశములు అధ్యాత్మ రామాయణము నుండి గ్రహింపబడినవి. శూర్పణఖ రామలక్ష్మణులతో సంభాషించు ఘట్టమున వాల్మీకి చేసిన హాస్యప్రసంగములు దాసు గారు చేయక విడిచిరి. అట్లే మాయలేడి హా! లక్ష్మణా! అని అరచినపుడు సీత లక్ష్మణుని దూషించుట వాల్మీకి కథావిషయము. ఈ దూషించుటను గూడ దాసు గారు వదిలిరి. రాముడు ఖరునితో చేయు యుద్ధము సీతాలక్ష్మణులు చూచుచు నాటకీయముగా సంభాషించుకొనుట దాసు గారి కల్పనము. హనుమంతుడు రాముని చెంతకు వానర రూపముతో వచ్చి మాటాడుట దాసు గారు చేసిన మరియొక కల్పన. హనుమ వాల్మీకీయమున వానర రూపమున రాడు. భిక్షుకుడుగా వచ్చును.

ఈ విభాగము నందలి కథాకథనమునకు ఉదాహరణములు ఒకటి రెండు—

అగ్గికీలొంగని యట్లెండ గాలి వా
నలకు లోఁబడని చందమునఁ గాదు
మెకముల కలవిగాని కరణి బాములు
సుంతైనఁ జొరసందు చూపని యటు
పిడుగుపాట్లకు నేలవడఁకులకుం దొంగ
లకు బగతురకు సీల్కాఁని పగిది
వలసిన తెమ్మెర వెలుతురు మంచి నీ
రిచ్చు జంత్రమ్ము లింపెసగు నటుల

నెల్ల చదువుల కిటుకులు నెఱుఁగుజాణ
యాఱు పూఁటలలో వేల్పు లబ్బపడఁగ
హాయిగాఁ దన వదినియు నన్నయును మొ
లంగుటకుఁబన్నె నొకయిల్లు లచ్చునుండు (పు. 148)

కడువేగనే పూచి కాచు నట్లెల్ల చా
యల ఫలవృక్షము లంట్లు గట్టి

నడిమి కదుగ పిలుపడనటు గోరంట
వనుసంబద్ధవ్యూహము రచియించి
జోడుగఁ బెంచిగిన సోమిదపుం జెల్లు
యందు దట్టముగ నుయ్యాలవేసి
పిల్లనఁగ్రోవితో పిలిచి నానావిధ
ఖగమృగములు మచ్చిక వశఁజేసి

పంచవటమును భూతల స్వర్గమువలె
సలిపి యెంతయు నఖిలోపచారములను
క్ష్మాసుతారాముల నహర్నిశంబుఁగొలిచె
సూక్ష్మతమ బుద్ధిశేషుండు లక్ష్మణుండు. (పు. 149)

ఇది లక్ష్మణుడు నిర్మించిన పర్ణశాల విధానము. ఈ పర్ణశాలా నిర్మాణ మర్మము లన్నియు లక్ష్మణునకు నేర్పినది దాసు గారే. లక్ష్మణుని 'సూక్ష్మతమ బుద్ధిశేషుడు' అని అనుట చాల నౌచిత్యము. లక్ష్మణుడు ఆదిశేషుని అంశావతార మని కదా సంప్రదాయము.

జానకి కోర్కె తీర్చుటకై శ్రీరాముడు మాయలేడిని వెంబడింపగా, చేతికి అందియు నందనటులు ఆ లేడి చిక్కులు పెక్కు పెట్టుచున్నదను పట్టున దాసు గారి ముక్కలు—

బారెడెలన్నిల్వఁబడి చేతికిం జిక్కి
నట్టుల భ్రమపెట్టి యందకుండు
నెచ్చటనగ్గనరాక యెట్టులో మాయమై
పజ్జనే కొంతసేపటికి నిల్చుఁ
బొదలోపల న్దూటి పోలేనటుల దోఁచి
యేమఱుపాటున నెగురుచుండుఁ
జేరువ న్గాల్జాఱి బోరగిలంబడి
దొరికియు దొరకక త్రుళ్లిపాఱు

నట్లు గుడుగుడు గుంచములాడి దవ్వ్వ
నెఱుగ నీకేశుకుశో్రినుల వఱకుఁ దెచ్చి
తికమక న్డొల్పి యలయించి తిరుగులేడి
.... .... .... .... ——పు॥లు 165-66

రావణుఁగు సీత నపహరించి రథముపై తీసికొనిపోవునపుడు సీత రోదించిన విధానము (పు. 169) భాస్కర రామాయణము నందలి (యుద్ధ - ప - 41).

'ఏ జనకాత్మజన్ దశరథేశ్వరు కోడల రాము భార్యఁ జుం
డో జనులార ! యడ్డపడరో సురలార ... ...'

అను పద్యభావమునకు ప్రపంచీకరణము.

ఇక 'కబందుని వధియించి యా ప్రక్క శబరికి మోక్షము సమకూర్చి' అని కబంధరాక్షసవధ, శబరీమోక్ష ఘట్టములను ముగించినారు. కబంధవధాఘట్టము రసవత్తర ఘట్టము కాకపోయినను, శబరీమోక్షఘట్టము రసవత్తర ఘట్టమే కదా, ఎందుకు త్యజించినారో !

అట్లే ఈ విభాగమునకు 'శ్రీరామ సుగ్రీవమైత్రి' అను పేరు పెట్టినను, ఈ ఘట్టమును విశదీకరించలేదు. 'హనుమ సుగ్రీవుని యనుమతినొచ్చి' అని మాత్రమే చెప్పను. తరువాత కూడ 'నా యేలిక సుగ్రీవుడాదిగా నీ నాతి వార్త విన్పించు' అని అంజనేయునిచేత నన్పించి, 'అనలము సాక్షిగా హనుమంతు డప్పుడా యుభయు లకు మైత్రి గావించి' అని యీ మైత్రీ ఘట్టమును పూర్తిగా కుదించును.

అంజనేయుడు రాముని దర్శించినపుడు సంభాషణ ప్రారంభమును సంస్కృత భాషలో, సంగీతమయముగా వ్రాయుట చాల ఔచిత్యవంతమైన విషయము, అంజ నేయుడు నవవ్యాకరణవేత్త యని, సంగీతశాస్త్రపారంగతుడని కదా మాన్యుల మాట.

హనుమత్సందేశము :

వాలి భయము బాపుమని సుగ్రీవుడు రాముని అర్థించుట - రాముని చెంతకు కావుమనుచు పోయెడు సుగ్రీవుని వెంటతరుము వాలిని శరమేసి రాముడు కూల్చుట - వాలి శరీరము నుండి ఒక వెలుగు వచ్చి రామునిలో కలయుట - శరదృతువర్ణనము -

రాముని బాధ జూచి లక్ష్మణుడు హనుమతో అనుట - సీతను రామునకు గూర్చువరకు సుగ్రీవుడు బ్రహ్మచర్యవ్రతము పూనుట - శ్రీరాముడు హనుమకు అంగుళీయక మిచ్చుట - కపులు సీతను వెదకుట - స్వయంప్రభ కథ - సంపాతి దర్శనము - కపులు స్తుతింప హనుమ లంకకు బయలుదేరుట - లంకిణి శాపవిమోచనము - సీతా రావణుల సంభాషణము - సీత ఆత్మహత్య చేసికొనబోగా హనుమంతుడు వారించి అంగుళీయక మిచ్చుట - సీత చూడామణి యిచ్చుట - జంబుమాలి, అక్షయులను హనుమ చంపుట - బ్రహ్మాస్త్రమునకు లొంగినట్లు నటించి హనుమ రావణుని సభకు ఇంద్రజిత్తుతో వెళ్లుట - సభలో తోకపీటపై గూర్చుండి మాటాడుట - లంకా దహనము - రామునకు శుభసందేశ మందించుట అనునవి దీనిలోని అంశములు.

ఈ హనుమత్సందేశ విభాగము కిష్కింధాకాండలోని చివరి కథ, సుందర కాండ కథతో గూడియున్నది. ప్రధాన కథ వాల్మీకి కథానుసారమే యైనను, దాసు గారు కొన్ని మార్పులను చేసిరి. వాల్మీకి కథలో రాముడు వాలిని చెట్టుచాటు నుండి కొట్టగా దాసు గారి కథలో 'కావుమని వేడు సుగ్రీవుని వెంటబడి తరుముచున్న వాలిని' రాముడు కొట్టును. ఇది రామ పాత్ర పోషకాంశము. వాలి శరీరము నుండి వెలుగు వచ్చి రామునిలో ఐక్య మగుట దాసు గారి కల్పనమే. వాల్మీకి కథాంశము కాదు. సుగ్రీవుడు ప్రమత్తుడై యుండ లక్ష్మణునకు కోపము వచ్చుట వాల్మీకీయము. దానిలో సీతను రామునకు గూర్చువరకు సుగ్రీవుడు బ్రహ్మచర్య మును బూనినట్లు దాసు గారి కల్పనము. ఇది సుగ్రీవ పాత్ర పోషకాంశము. లంకిణి హనుమను జూడగనే ప్రసన్నురాలగుట దాసు గారి కల్పనమే. వాల్మీకి కథలో లంకిణి యుద్ధము చేయును. ఇది హనుమ శక్తికి నిదర్శనము. బ్రహ్మాస్త్రమునకు కూడ దాసుగారి గ్రంథమునందు హనుమ లొంగకపోవుట ఒక విశేషము. హనుమంతుని ఇంద్రజిత్తు రావణుని సింహాసనమునకు కట్టుట, అంజనేయుడు తోక పీటపై కూర్చుండుట అవాల్మీకీయాంశములే. సీత ఖడ్గముతో తల ఖండించుకొన బోవుట, హనుమ రక్షించుట కూడ దాసు గారి కల్పనలే. ఈ విభాగము నందు ఇట్లు రామ సుగ్రీవాంజనేయుల పాత్రలు చక్కగా పోషింప బడినవి. ఎక్కువగా మెఱుగులు దిద్దబడిన పాత్ర హనుమ.

ఈ విభాగము నందలి కథన సామర్థ్యమునకు ఒక్క ఉదాహరణము—

జాంబవంతుడు లంకకు వెళ్లి తిరిగి రాగల వీరు డొక్క— ఆంజనేయుడే యని గ్రహించి తన శక్తుల నెరుగని సామీరిని ప్రశంసించిన తెరగు—

ఉబికితివేని సప్తోర్ధ్వలోకంబులు
గిర గిర సుడివడి తిరుగకున్నె
తొ్రొక్కితివేని యధోభువనములెల్ల
దట్టముగా నట్ట గట్టకున్నె
యూదితివేని మహోదధులన్నియుం
జిఱుతుంపురై మింటఁజెదరకున్నె
గ్రుద్దితివేని మేరు ధరాధరంబైన
మఱి తుమురై మచ్చుమాయకున్నె

సత్యసంకల్పుఁడవు మనోజవుఁడ వీవు
కామరూపి వప్రతిహతగతిని నీవు
నీ మహత్త్వ మొకింతయు నీవెఱుఁగవు
గాని హనుమన్న! నీవు సాక్షాచ్ఛివుఁడవు. పు. 200

ఇవి యన్నియు సామాన్యునకు సాధ్యముకాని అద్భుత చర్యలు. అంబుధిని దాటుట కూడ అద్భుత చర్యయే కదా!

ఈ విభాగమున వాలి వధానంతరము చేసిన ఋతువర్ణనము ఆంధ్ర సాహితీ సరస్వతికే ఒక అమూల్యాభరణము. (పు. 182, 184). దాసు గారి భావుక శక్తికి ఒక బావుటా.

ఇట్లే సీతాన్వేషణముచేయు కపి వీరులను వర్ణించిన వచనము (పు, 192, 193) దాసు గారి బహువిషయజ్ఞతకు ఒక మంచి యుదాహరణము.

## సామ్రాజ్యసిద్ధి:

శ్రీరాముడు కపి సేనతో సముద్రతీరము చేరుట - రావణునకు విభీషణుడు హితము చెప్ప, విభీషణుని రావణుడు తన్ని తల నరక బోవుట - విభీషణుడు శ్రీరా

ముని శరణు వేడుట - శ్రీరాముడు రావణుని బలమును గూర్చి విభీషణుని ప్రశ్నించుట - అంగదుని రాయబారిగా పంపుట - రావణుడు కుంభకర్ణుని నిద్రనుండి లేపుట - కుంభకర్ణుని రాముడు చంపుట - రామలక్ష్మణుల మాయాశిరములను రావణుడు సీతకు చూపించి తనకు వశము కమ్మని బెదరించుట - రావణుని చింత - ఇంద్రజిత్తు రావణుని ఓదార్చుట - ఇంద్రజిత్తు మాయచే వానరసైన్య మంతయు నిశ్శబ్దముగ రూపుమాయుట - హనుమ తెచ్చిన సంజీవివలన వానరసైన్య మంతయు తేరుకొనుట - ఇంద్రజిత్తు మాయాసీతను వానరసేనామధ్యమున పరిమార్చుట - ఇంద్రజిత్తు వానరులచే విఘ్నితహోముడయి లక్ష్మణునిచే చచ్చుట - రావణుడు భీతిలి యుద్ధరంగమునుండి పారిపోవుట - పదునెన్మిది దినములు పోరాడి శ్రీరాముడు రావణుని సంహరించుట - ఇంద్రజిత్తుని పెద్దకొడుకును విభీషణుడు యువరాజుగా చేయుట - మండోదరి రావణునితో అనుగమించుట - పుష్పక విమానముపై శ్రీరామాదులు నందిగ్రామము చేరి భరతాదులను తీసికొని, భరద్వాజ మహర్షిని దర్శించి అయోధ్యకు చేరుట - శ్రీరామ పట్టాభిషేకము అనునవి ఈ విభాగము నందలి కథాంశములు,

ఈ సామ్రాజ్యసిద్ధి విభాగ మంతయు వాల్మీకి యుద్ధకాండ కథయే. ఈ విభాగము నందు కూడ కొన్ని మార్పులు చేర్పులు కలవు. వాల్మీకి కథలో సముద్రునిపై శ్రీరాముడు కోపించును. దాసు గారి గ్రంథ కథలో శ్రీరామునకు కోపము వచ్చుటకు అవకాశము లేకుండగ—

'రామచంద్రునిఁజూచి వారాశి పొంగి
నురుఁగు చిఱునవ్వునన్ లేచి కరడములను
బాహువులఁజాఁచి నులివు నైకె వారముల నొ
నరుచు నట్లుండె దండప్రణామములను' —పు. 225

అని సముద్రుడు తనంతట తానే స్వాధీనమైనట్లున్నది. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రముచే రామలక్ష్మణులు కూడ మూర్ఛ చెందినట్లు వాల్మీకీయము నందుండ, దాసు గారి కథలో కపి సేన మాత్రమే మూర్ఛ చెందినట్లున్నది. మండోదరి సహగమనము చేయుట, విభీషణుడు ఇంద్రజిత్తు పెద్దకొడుకును యువరాజుగా చేయుట, సీతారామలక్ష్మణులు యుద్ధానంతరము ముందు నందిగ్రామము వెళ్లుట అను అంశములు అవాల్మీకీయము లయినవి. సీతాదేవి రావణ వధానంతరము సలిపిన అగ్నిప్రవేశ ఘట్టము దాసు గారు గ్రహింపలేదు.

కథన విధానమునకు ఒకటి రెండు ఉదాహరణములు—

రాయబారిగా వచ్చిన అంగదుడు శ్రీరాముని ప్రశంసించి, ఆ శ్రీరాముని శరణు వేడుకొనుమని రావణునకు ఉపదేశము చేయగా, 'రాని నవ్వు తెచ్చుకొని' రావణు డన్న మాటలు—

ప॥ నామ రూపములు లేకుండిన యా నారాయణుడా మానిసి

అ॥ ఏమిర మూఢ! యెఱుగక ప్రేలెద వింత పితృద్రోహివాయినీ ॥ నా ॥

1. దొంగ దెబ్బ నీ తండ్రికి గొట్టిన తుచ్ఛునిఁ బొగడెద వేలరా
కంగారున నిను జంపనొల్ల నీ కన్నతల్లి యేమనుకొనునో యని ॥నా॥

2. శరణు జొచ్చునా రావణుఁడిఁక నిస్సారమర్త్యకీటకమునకహహా
కరుణించితినినుఁదిన్నఁగఁబోపో,కలఁడెనాకన్న దేవుఁడింకొకఁడు ॥నా॥

—పు. 235

శ్రీరాముడు వాలిని 'దొంగ దెబ్బ' కొట్టినట్లు దీనిలో దాసు గారు వ్రాసిరి. పూర్వకథలో దొంగదెబ్బ కొట్టనట్లుగా దాసు గారు వ్రాయలేదు కదా.

రావణ వధానంతరము ఆంజనేయాదులు సీతను రాముని చెంతకు చేర్చిన సందర్భమున, జానకీరాముల పరిస్థితిని దాసుగారు చెప్పిన విధానము—

మోద ఖేదము లొక్క— మొగి నెండయు న్వాన
కలసిన యట్టు త మ్మలము చుండ
ప్రాణవల్లభ యను పల్కు— మాత్రమె సిబ్బి
తి వగ సైపమి గద్గదిక నిలువఁగ
తమ తోడ నెల్ల భూతములు నివ్వెఱఁగునఁ
జిత్రింపఁ బడినట్లు చేష్టలుడుగ
వ్రత వత్సరంబులు పదునాల్గు గడవ సం
దడివడి కాముఁడు దుడుకు సేయఁ
జప్పునఁ దమంత నిలువాలు జెప్ప లెగయ
నింద్రియంబుల కెల్ల దానే ప్రతి నిధు
లగుచు నొండొంటఁదాని సహజపుఁ బ్రేమ
నదికె జానకీ రామ కటాక్ష రుచులు. —పు. 250

ఈ సందర్భమున శ్రీరాముడు తనకు సహాయము చేసిన హితులకు కృతజ్ఞత తెలిపి, హనుమన్నను గూర్చి మిన్నగా నన్న—

దారవియోగ సంతప్తుఁడౌ నాకు నె
చ్చెలిమి సుగ్రీవుతో సలిపినాఁడ
యంబుధిన్ లంఘించి యప్రతిహతగతిన్
సీతసేమము వడిం జెప్పినాఁడ
కఠినాహవములోనఁ గసుగందనీక మ
మ్మును దనపీపున మోసినాఁడ
పలములో సంజీవి పర్వతముం దెచ్చి
మనల నందఱ నిల్లు మన్చినాఁడ

తనదు సౌఖ్యమొకింతయుం దలఁపబోక
కష్టపడినాఁడ లోకోపకారముకయి
యన్నివిధముల నా హనుమన్నకన్న !
గలఁడె నిక్కపు వేల్పు జగమ్ము నందు. —పు. 251

అను ఈ పలుకులు 'రామాయణ మహామాలారత్నమ్' అన్న ఆంజనేయస్తుతి శ్లోక పాదమునకు శరీరనిర్మాణము.

నిద్రలేపబడిన కుంభకర్ణుడు యుద్ధరంగమునకు ప్రవేశించునపుడు చేసిన రచన (పు. 238) దాసుగారి కథన శక్తికి ఒక మంచి సూచన.

ఇక రావణ వధానంతరము శ్రీరాముడు సీతతో 'ప్రియురాల ! యింత పర్యంతము నిన్ను రక్కసి పరంబుగ నొంచిన శౌర్య హీను సైరింతువు గాక నన్ననుచుం బ్రేముడి నాపెఁగవుంగలించి యత్యంత కృతజ్ఞత వ్యపలికె' (పు. 250) అన్న రాముని పలుకులు వాల్మీకి రాముని పలుకులు కావు. దాసుగారి శ్రీరాముని పలుకులు.

ఇట్లు ఈ యథార్థరామాయణము అనేకములయిన అవాల్మీకీయాంశములతో బహువిధకవితాకల్పనలతో నైకవిధ కథాకథన ధోరణులతో, సమకాల సమాజ వాతావరణములతో దర్శన మిచ్చు గ్రంథము.

ఈ గ్రంథము నందు దాసు గారు 'భక్తమందారభవదూర పరమపురుష' అను మకుటముతో ఇరువది సీస పద్యములను అక్కడక్కడ సందర్భానుసారముగా చొప్పించినారు. అందులో కొన్ని సంపూర్ణముగ సంస్కృతభాషలోకూడ నున్నవి. (పు॥లు. 174, 220). ఇక సూక్తులకు, నుడికారములకు, ఉపమానములకు ఈ యథార్థరామాయణము ఒక గని.

యథార్థరామాయణ హరికథ దాసుగారి బహువిధప్రతిభారామాయణ మనుట యథార్థము.

## జానకీ శపథము :

జానకీ శపథము దాసుగారి రామాయణ హరికథలలో రెండవది. యథార్థ రామాయణము శ్రీరామ పట్టాభిషేకము వరకు కథ కాగా, జానకీ శపథము ఉత్తర కాండలోని కథ.

ఈ కృతి ఆంజనేయస్వామి కంకితము. సంగీత విద్వాంసుడయిన నారాయణదాసుని సంగీతమయమైన ఈ కృతి సంగీత విద్వాంసుడయిన నారాయణదాసున కంకిత మగుట సముచితమే.

ఈ కృతి కృతిపతియైన ఆంజనేయ స్తుతితో ప్రారంభమగును. తరువాత (గణనాథ స్తుతి, శారదా స్తుతి) ఇష్టదేవతా స్తుతి. తరువాత సభా సంబోధనము, ధర్మబోధ వచ్చును. ఈ ధర్మబోధలో సత్యప్రాశస్త్యమును ప్రశంసించును—

దుష్ట సంపర్కమున దురదృష్టముననుం
గల్ల నిందేను బొంది యిక్కట్లువడియు
సత్యవంతులు తుదకుఁ బ్రశస్తకీర్తి
జనుగుదురు గర్భవతియగు జానకివలె. —పు. 6

అని ప్రేక్షకుల మనస్సులను మెల్లగా కథవైపు లాగుదురు.

## కథాసారము :

సీతతో పట్టాభిషిక్తుడయిన శ్రీరాముడు చక్కగా రాజ్యపాలనము చేయుచు పూర్ణగర్భవతియైన సీతతో ఒకనాటి రేయి ఏకాంతముగా మంతనము లాడుచుండును. ఆ సమయమున శ్రీరాముడు సంతోషముతో 'ఇందు గర్భిణివి, నీ కోర్కె యేద్దియైన

దాచక చెప్పు మిచ్చెదను' అని సీతతో అనును. దానికి సీత 'కాననమున ముని భార్యల గాంచు వేడ్క చెల్లింపుము' అని కోరును. దానికి రాము డంగీకరించి కొంత వడి నిద్రించి తరువాత యథావిధి పురవీథులలో జనుల వార్తలను తెలిసికొనుటకు రహస్యవేషమున బోవును. అట్లు తిరుగుచు చాకలిపేటలో ఒక చాకివాడు తన భార్యను ఇంటినుండి వెడలగొట్టబోవుచుండ, శ్రీరాముడు ఊరికాపు వలె వద్దు పడి భార్యను వదలుట పాపమని యనును. దానికి చాకివాడు 'రావణుం డొద్దనుంచుకొన్న సీతను బిల్పించి నిందమోసి యేలు వెఱ్ఱిరాముని బంటువా?' అని యన, రాముడు సిగ్గుతో కోటకు వచ్చి 'భూమిజాత యగ్ని సంపూత యయ్యు మచ్చ పోదె' యని బాధపడి, సీతను బరిత్యజించుటకు నిశ్చయించుకొని, లక్ష్మణుని పిలిచి సీతను వనములో దిగవిడిచి రమ్మనును. లక్ష్మణుడు రామాజ్ఞ ప్రకారము సీతను తీసికొని వెళ్లి అక్కడ ఆమె నిద్రించుచుండగా రామాజ్ఞను పత్రముపై వ్రాసి ఆమెను ఒంటిగా విడిచి అయోధ్యకు వచ్చును. సీత నిద్ర లేచి లక్ష్మణుడు వ్రాసిన పత్రమును చదువుకొని విలపించుచుండగా వాల్మీకి మౌని వచ్చి ఆమెను ఓదార్చి వివరములు తెలిసికొని, ఆమె గోరినట్లు మారుపేరుతో ఆశ్రమమునకు తీసికొని వెళ్లి మౌని సతుల కప్పగించును. సీత ఆ యాశ్రమమునందు ప్రసవవేదన మనుభవించి శుభముహూర్తమున ఇరువురు మగశిశువులను ప్రసవించును. వాల్మీకి ఆ కుఱ్ఱలకు కుశలవులని పేరిడెను.

అయోధ్యలో ఒకనాడు శ్రీరాముడు సీతకొరకై విరహముతో విలపించుచు నిద్రవోయి స్వప్నములో సీతను గాంచును. ఆమె వెంటనే మాయమై మహిమతో గూడిన శివలింగము కన్పడి జ్ఞానోపదేశము చేయును. వనమున సీత రాముని వియోగమునకై బాధపడుచుండును. కుశలవులు తల్లి యేడ్చుటను జూచి 'మాతండ్రి ఎవరు?' అని ప్రశ్నింప, సీత వారిని వాల్మీకి కడకు తీసికొనివెళ్లి వీరిని నాపుట్టింటికి తీసికొనివెళ్లుమని ప్రార్థించును. దానికి వాల్మీకి 'సీతా! శోకింపవలదు. నీ ఆత్మజులతోడ నేను అయోధ్యకు వెళ్లెదను. స్థైరించి యుండుము' అని చెప్పి అయోధ్య కేగును. అయోధ్యలో వాల్మీకి కుశలవులం జూచి 'అన్నలారా! మీరు కిన్నరులు. సరిగ శ్రుతి చేసికొని నేజెప్పిన రామాయణంబు సార్థకంబుగ విస్ఫురంబున ప్రతి వీథియందు దాహశాంతికై యావుపాలు మాత్ర మడిగి గ్రోలుచుం బౌరుల వీనులకు విందొనర్చి సంజప్రొద్దున నిటకు మళ్లిరండు' అని ఆజ్ఞాపింప, కుశలవులట్లే చేయుచు కొంతతడవునకు కోటగుమ్మము చేరి గాన మోహితులయి మత్తు మందు జల్లినట్లు

మైమరచియున్న ద్వారపాలకులను గడచి రాజసభను సమీపింతురు. రాము డత్యద్భుతంబున నబ్బాలకుల కెదురేగి యుచితాసనంబులం గూర్చుండబెట్టి వారి వివరములను అడిగి తెలిసికొని, వారిని అంతఃపురములోనికి తీసికొని వెళ్లను. ఆ స్త్రీలు వీరిని గానము చేయుమనిన కుశలవులు సీతారావణ సంభాషణ ఘట్టమునం గానము సేయుదురు. శాంత ఈ బాలుర రూపురేఖలనుబట్టి వీరు రాముని కొడుకులని భావించి సీత బ్రతికి యున్నదని యెంచును. ఇంతలో పౌరులు రామునకు 'ఒడలెరుగని చాకి నుడి నమ్మి పరమసాధ్వియు పూర్ణగర్భవతి యైన జానకిని నీవు విడిచినది మొదలు సువృష్టి లేదు. కనుక నీవు ఆమెను ఏలుకొనవలసినది' అని పత్రము వ్రాసి విన్నవించుకొందురు. రాముఁడు సీతను తీసికొనిరమ్మని ఆజ్ఞాపింప, లక్ష్మణుడు వనమున కేగి 'స్నానసమయి నారచీరెను సగము కట్టి మిగిలిన సగంబు నొక పొదమీద నారవైచి నిలుచున్న' సీతను జూచి రామాజ్ఞను దెలుప, ఆమె సంతసముతో మునిపత్నులయొద్ద సెలవు తీసికొని అయోధ్యకు వచ్చును. లక్ష్మణునితో వచ్చిన సీతను జూచి 'ప్రాణేశ్వరీ! ఇన్నాళ్లకు దైవ మనుకూలించెను. కాని నిందె మును కల్గిన కతమున నేను నీసుగుణ మెరిగియు విడిచితిని. నాడు నీవు అనలము చొచ్చి నీ సతీత్వము కన్బర్చినట్లు, వానను కురియించి ఇప్పుడు కూడ ప్రజలకు నీ సతీత్వమును స్పష్టము చేయుము' అని అనును. అపుడు రామాజ్ఞచొప్పున అవనిజాత 'నేను సాధ్వినైనచో నిపుడొక్క గడియలోన పర్జన్యుడు వాన కరువు తీరగా కురియించు గాక' అని శపథము చేయును. జానకీ పాతివ్రత్యమహిమంబు ముల్లోకములకు తెలుపు శాసనపత్రిక విధమున వర్షము కురిసెను. సీతామహత్త్వమును ఎల్లజనులు పొగడిరి. అయోధ్యాపురమునకు వైదేహీ తనయులె పట్టభద్రులని జను లుల్లసిల్ల ప్రాచేతసుడు రామానుమతితో నను. బాంధవకోటి సంతసంబందగ జానకీరాముడు సౌఖ్యమును బొందిరి.

ఈ జానకీశపథము నందలి ప్రధానకథ రామాయణ ఉత్తరాకాండము నందలిదే. కాని ఈ గ్రంథము నందు అవాల్మీకీయములయిన అంశము లెన్నియో చోటు చేసికొన్నవి.

సీతపై వచ్చిన అపవాదు వాల్మీకమున భద్రుడను వాని వలన రాముడు తెలిసికొనును. దాసు గారి కథలో రహస్య వేషముతో రాత్రివేళ సంచరించు శ్రీరాముడే స్వయముగా తెలిసికొనును. అపవాదు విషయము రాముడు రామాయణమున సోదరు

లందరతో చర్చించినట్లుండగా, దాసు గారి కథలో శ్రీరాముడు ఒక లక్ష్మణునితో మాత్రమే చెప్పినట్లున్నది. రామాయణమున లక్ష్మణుడు సీతను గంగాతీరమున వదలినట్లుండ, దాసు గారి కథలో లక్ష్మణుడు సీతను ఏటి యవ్వలి యొడ్డున వదలి నట్లున్నది. రామాజ్ఞను లక్ష్మణుడు ఒక పత్రముపై వ్రాసి నిదురవోవు సీత చెంత పడవేసిపోవుట దాసు గారి కథ. శోకించుచున్న సీతను గూర్చి ఆశ్రమవాసులు వాల్మీకికి చెప్పగా వాల్మీకి వచ్చి సీతను తీసికొని వెళ్లుట రామాయణాంశము. వాల్మీకియే చూచి తీసికొని వెళ్లినట్లు దాసు గారి కథాంశము. వాల్మీకి సీతాదేవి కథ రహస్యము లేకుండగ మునిపత్నులకు చెప్పుట రామాయణ కథ. సీత మారుపేరు పెట్టుమని కోరుట హరికథలోని మార్పు. కుశలవులని నామకరణము చేయుట రెండింటిలో సమానాంశమే యైనను నామకరములు చేసిన విధానములో భేదమున్నది. దర్భకొనలతో మంత్రింపబడిన కుఱ్ఱవానికి కుశుడనియు, దర్భల మొదళ్ళతో మంత్రింపబడిన కుఱ్ఱనికి లవుడనియు రామాయణము నందు నామకరణము చేయబడగా 'బాల కుశలవాస్త్రరణ నుద్భవిల్లుకతన' కుశలవులని పేరులు దాసు గారి కథలో పెట్టబడినవి జానకీశపథ హరికథలో గల స్వప్నవృత్తాంతము రామాయణమున లేదు. రామాయణ మందున్న అశ్వమేధయాగ ప్రసక్తి హరికథలో లేదు. ఇక జానకి శపథము చేయుట దాసు గారి హరికథలో రామాయణములో గల సమానాంశమే. కాని వాల్మీకీయమున గల శపథమునకు హరికథలో గల శపథమునకు సంబంధ మేమియు లేదు. రామాయణమున 'నేను రామునిదక్క మరొక్కని దలంపని దాననేని నామాత యగు భూదేవి మార్గమొసగు గాక' యని జానకి చేసిన శపథము. హరికథలో 'నేను సాధ్వినైనచో నిపుడొక్క గడియలోన పర్జన్యుడు వాన కరవు తీరగా కురియించుగాక' అని జానకి చేసన శపథము. ఈ శపథ కల్పనము ఈ హరికథలో చాల ప్రధానమైన కల్పనము. వాల్మీకీయమున సీత భూదేవితో వెడలిపోవుటచే సీతారాముల పునస్సమాగమమునకు అవకాశములేదు. దాసుగారి కథలో సీత శపథము చేసి వర్షము కురియించునే కాని రసాతలమున కేగలేదు. కనుక సీతారాముల పునస్సమాగమావకాశ మేర్పడినది. కథ సుఖాంతము, శుభాంతమైనది.

జానకీశపథమందలి సర్వశాస్త్రవైవిధ్య ప్రదర్శనము వారి పాండిత్యమునకు నిదర్శనము కాగా, వారి ప్రతిభాచక్షువీక్షణమునకు సాక్ష్యమొసగు ఉదాహరణము లెన్నియో యున్నవి. వారికి దర్శన మిచ్చిన ప్రకృతియొక్క ప్రకృతికి ఒక్క యుదాహరణము—

సీత మున్యాశ్రమమున ప్రసవింపబోవుటకు ముందుగా నున్న ప్రకృతి—

ఎప్పటికిం దొల్కరించునో యని వాన
కోయిల తీయని కూతవేసె
చీకటివలె నింక సీతకు నపవాదు
వీడునంచున్ మలికోడి కూసె
వరుసగా జుక్కలు మరి చందురుండు ది
వ్వెలు గల్వలుం దమ వెలుగు బాసె
వైదేహి హాయిగ బ్రసవించు శకునమ్ము
కొమ్మ కెగిరి కాకి గుర్తుచేసె
విచ్చుతమ్ముల దుమ్మెదల్ వేడ్కమ్రోసె
త్రుళ్లి జక్కవ కవలు కౌగిళ్ళడాసె
తెమ్మెరల్ చల్లకపురింబు దెసలగాసె
ప్రొద్దు జేగురురంగు తూర్పునకు బూసె. — పు. 28

కథ త్రోవ కథదిగా వర్ణనల త్రోవ వర్ణనలదిగా గ్రంథము వ్రాయుట సామాన్య కవి లక్షణము. పనికట్టుకొని వర్ణనములు చేసి ఏదో విధముగ కథకు తగిలించుట సమర్థుడయిన కవి లక్షణము కాదు. ఆ రహస్యము తెలిసిన వారగుటచే దాసుగారు ఈ పద్యమునందు కథను వర్ణనములను ఓతప్రోతముగ కలిపియే ప్రయాణము చేయించినారు. కథాసంబంధమున్న ఈ వర్ణనము గూడ శాస్త్ర వాసనతో గుబాళించుట విశేషము.

ఇందు గర్భిణియైన జానకిని అడవులపాలు చేసి పూవుతోటలో నేకాంతముగ జానకీజాని పలవించుచున్న చిన్నఘట్టమునందలి రెండు అశ్రుకణములు—

హరు విల్లు విరచి నా యురమునం బూదండ
నెగ్గించు నపుడు నున్నిగ్గు గొల్పు
పితృతాజ్ఞ నడవికై వెడలెడు నావెంటం
దోతెంచునపుడు సంతుష్టి నిల్పు

బంగరు లేడికై భ్రమసి చనువున నన్
బుత్తెంచు తరి వింత ముద్దు వెల్గు
దశకంఠుఁడీల్గిన తరువాత నగ్నిసా
క్ష్యమ్ముగ వరసతీత్వమ్ము దెల్పు

నవరసమ్ముల కాపు మన్మథుని తూపు
మిట్టమిాలను రేపు క్రొమ్మించు డాపు
నిర్మల వినీతికిం బ్రాపు నెనరు చేపు
నట్టి నీచూపు గన కెద యెట్టు లోపు (పు-32)

చెలులకు ననుఁజూపి చిరునవ్వునం దల
యూచి గర్వించెద వొక్క మారు
నిరుపమ సుందర నిఖిల జగద్వీర
యోనాథ యని పిల్తు వొక్క మారు
ప్రాణ నాయక నిన్నుఁ బాసిన క్షణమైన
యుగమని చెప్పెద వొక్కమారు
ఎడద లొక్కటె గదా యొడళుల వేరేల
నో యంచుఁ గౌఁగలిం తొక్కమారు

సర్వ సద్గుణ పుంజమా-చక్కదనము
ప్రోవ-నా పూర్వపుణ్య స్వరూపమా-మ
దీయ హృద్దీపమా-యో విదేహ తనయ-
నాదు జీవంబ-సీత-నిన్బాసినాన. (పు-33)

దాసుగారికి సీతాదేవి శపథము చేసి కురియింపజేసిన వర్షము వ్యాకరణమయముగా గోచరించినది, (పల్లమువంక....పు - 59). ఈ పద్యమునందలి వ్యాకరణశాస్త్ర పారిభాషికపదముల కూర్పు దాసుగారి కథన చమత్కార ప్రతిభకు పద్యరూపమైన మార్పు.

దాసు గారు వారి ప్రతిహరికథా గ్రంథమునందు సమకాలీన వాతావరణ మును సందర్భము కుదిరినపుడెల్ల సామాన్యముగా చొప్పించు చుందురు. దీనికి కారణ మేమన హరికథా ప్రదర్శనవేళ ప్రేక్షకులుగా నున్న సమకాలికులకు కథను సమీపము చేయుటయే. ఈ లక్షణము తక్కిన కథలలో వలె ఈ జానకీశపథము నందు గూడ నున్నది.

ఒక భటుడు మాత్రము వెంబడింప సకల జనాభిరాముడయిన శ్రీరాముడు రాత్రి సమయములందు పురప్రజలు ఏమనుకొనుచున్నారో యని రహస్యముగా సంచ రించును. అట్లు సంచరించుచు నొకనాటి రాత్రి పురములో గౌరీశంకర విగ్రహం బుల దివ్యవివాహమహోత్సవములలో శ్రీరాముడు చూచిన విశేషములలో కొన్ని— '....వింత చార్జామాలతో రబ్బరు బంతులవలెం ద్రుళ్లుచు నబ్బురపు నడలను డాంబాజీలు సేయు తురుపు గుఱ్ఱంబు—లాపిమ్మట నొకచో మహతాబు లొక్కెడ జిచ్చుబుడ్లొకట దారాజువ్వా లొకప్రక్క యీతచెట్టొక్కతావున నెగురు కాగితపు బుట్ట లొక చెంత వెన్నముద్ద లొకవైపున నౌట్లొకమూల జక్రంబులు మొదలగు పలురకంబుల బాణా సంచా—లాతరువాత పటాచెడీదమ్ ఖసరత్తు దొట్టి గరిడీసాము—లాపయి రండోలు పీరణము, తాషా, టకోరా, సన్నాయి, తూతూ బాకా మొదలగు పెక్కురకంబుల బాజాబజంత్రీ వాద్యములు....' (పు. 10).

మహతాబులు, చిచ్చుబుడ్లు, తారాజువ్వాలు, కాగితపు బుట్టలు, వెన్నముద్దలు, ఔట్లు, చక్రములు మొదలయిన బాణాసంచాలు దాసుగారి కాలములోనివే కదా. అట్లే ఆ గరిడీసాములు, ఆ బాజాబజంత్రీవాద్యములుకూడ శ్రీరాముని కాలమునాటివి కావు గదా.

దాసు గారి హరికథా కృతు లన్నియు స్వరసరస్వతికి ప్రియాలంకృతులే అయినను, జానకీశపథము వారి హరికథ లన్నింటిలో సంపూర్ణముగ స్వరశాస్త్రమయ మయిన హరికథ. దాసుగారే వారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున విజయనగరమున అయ్యకోనేరు గట్టున ఒక్కసారి చెప్పి, ఇక చెప్పుటకు గ్రమింపలేదన్న, ఈ గ్రంథ వైదుష్య ప్రదర్శన కష్టమును గూర్చి మరేమి చెప్పవలెను? దాసు గారి శిష్యశ్రేణిలో 'రామాయణ సోదరులు' అని ప్రఖ్యాతి గాంచిన శ్రీ నేతి లక్ష్మీనారా యణగారు, సుబ్బయ్యగారు మాత్రమే అనేక మేళకర్తరాగములతో కూడిన ఈ హరి కథను ఒక్కసారి చెప్పి గురుప్రశంసల నందుకొనినారు.

గానకళావిశారద శ్రీ అరిపిరాల సత్యనారాయణమూర్తిగారు, జానకీ శపథములో దాసు గారు ప్రదర్శించిన స్వరపాండిత్యము నిట్లు వివరించినారు:—

'ఈ కవిగాయక శిరోమణి రచించిన వివిధ గ్రంథములలో, ముఖ్యంగా పేర్కొనదగినది 1929 వ సంవత్సరములో ప్రకటించిన 'జానకీశపథము' అను గ్రంథమగును. ఈ గ్రంథము శ్రీ దాసుగారికి కర్ణాటక సంగీతశాస్త్రములో గల కూలంకష విజ్ఞానాన్ని ఋజువు చేయుచున్నది. ఎటులనగా, కర్ణాటక సంగీత శాస్త్రములో అతిప్రధానమైన భాగాలుగా నెంచబడుచున్న 72 మేళకర్త ( జనక ) రాగములలో పూర్వ (శుద్ధ మధ్యమ) మేళకర్తలగు 36 రాగములలో 16 మేళకర్తలను, ఉత్తర (ప్రతిమధ్యమ) మేళకర్తలగు 36 రాగములలో 19 మేళకర్తలను, మొత్తం 16+19=35 మేళకర్త రాగములలో కీర్తనలు రచియించి ప్రకటించటం శ్రీవారి సంగీతవిజ్ఞానానికి చక్కని నిదర్శనం కాకమానదు. అంతేకాక యీ 35 మేళకర్తరాగములలో రచించిన కీర్తనలలో 1. హరిహరి (హరికాంభోజి 28 వ మేళకర్త), 2. ఎందుకీమాయ (రూలవరాళి—39 వ మేళకర్త) వంటి రెండు కీర్తనలకు తప్ప మిగత 33 కీర్తనలకు గల ముఖ్యాంగములగు పల్లవి, అనుపల్లవి, మిశ్రములను స్వరపరచి ప్రకటించడం శ్రీ దాసు గారికి ప్రసిద్ధమయిన 72 మేళకర్త రాగలక్షణ మందు గల విజ్ఞానానికి తార్కాణ మగును.'[13]

దాసు గారి హరికథ లన్నింటిలో యథార్థరామాయణము మహాగ్రంథము కాగా, జానకీ శపథము సంగీతశాస్త్ర వైదుష్యమున అగాధమయిన మహత్ గ్రంథము.

## హరిశ్చంద్రోపాఖ్యానము :

హరిశ్చంద్రోపాఖ్యాన హరికథ దాసు గారు పురాణ కథావస్తువుతో వ్రాసిన హరికథ. ఈ హరిశ్చంద్రుని కథ దేవీభాగవతమునందు, మార్కండేయపురాణమునందు, స్కాందపురాణము నందు వచ్చును. ఆంధ్రసాహిత్యమునకు మొదటగా ఈ కథను పరిచయము చేసినవాడు మారన. అయినను గౌరన కరస్పర్శచే హరిశ్చంద్రుడు తెలుగులకు సత్యపు వెలుగులు చూపింప గల ఆదర్శపురుషుడయినాడు, గౌరన కృతి తెలుగులో తరువాత వచ్చిన ఎన్నో రకముల కృతులకు మాతృకయైనది. అట్టి కథానుకరణ కృతులలో దాసు గారి హరిశ్చంద్రోపాఖ్యాన హరికథ యొకటి.

13. సారస్వత నీరాజనము — పు॥లు. 1111, 1112

ఈ హరికథా ప్రారంభము నందలి 'భూసురపుంగవున్' (పు - 1) పద్యము వలనను, కథావిరామము లందలి 'పౌరాణికావతంసా' (పు - 27) మొదలగు పద్యము లందలి సంబోధనముల వలనను ఈ హరికథను దాసు గారు వారి తండ్రికి మాత్రమే అంకిత మిచ్చినట్లు అనుమానము కలుగుచుండగా, గ్రంథప్రారంభము నందలి 'ఆయు రారోగ్య సంసిద్ధి నలదినారు' (పు - 1) అను పద్యము వలనను, గ్రంథాంతము నందలి — 'ఎన్నఁగఁ దల్లిదండ్రులకు నెక్కుడు వేల్పులు లేరు' (—పు. 55) అను పద్యము వలనను ఈ కృతిని దాసు గారు తనువు నొసంగినట్టి తలిదండ్రుల కిర్వుర కంకిత మిచ్చినట్లు నిశ్చితమగుచున్నది.

కథకు పూర్వరంగముగా గల పీఠికలో ఇష్టదేవతాస్తుతి, సభాస్తుతి, దాసు గారి వ్యక్తిత్వ ప్రదర్శకమైన రచన, భరత ఖండపు పూర్వవైభవ వర్ణన, కలికాలకలుష ముల చర్చ వచ్చును. తరువాత పరమార్థమును గూర్చి, దానధర్మములను గూర్చి కొంత ఉపన్యసించి—

బహుళ సామ్రాజ్య విభవముల్పాయుగాక
మిగులఁ బడరాని కష్టము ల్దగులుగాక
యేదియెట్లైన నగుఁగాక యించుకైన
సత్యముందప్పనే హరిశ్చంద్ర విభుఁడు. —పు. 7

అని సత్యపథానువర్తి యైన హరిశ్చంద్ర చక్రవర్తి చరిత్రమును ప్రారంభము చేయుదురు.

కథాశరీరము :

స్వర్గ సభలో ఒకనాడు ఇంద్రుడు 'బొంకనట్టి ఱేఁడు పుడమి గలఁడె?' అని బ్రహ్మఋషులతో పలుకును. వసిష్ఠుడు సూర్యప్రభతో వెలుగు త్రిశంకు పుత్రుడున్నాడు' అని యనును. ఆ మాటలకు సర్వసుపర్వులు, ఋషులు సంత సింప, విశ్వామిత్రుడు మాత్రము 'మహాప్రళయాంబుద నిస్వనంబుతో'—

'తెలిసెలే నీ యాత్మస్తుతి తేటతెల్లముగ వసిష్ఠ
తలుపు ద్వారబంధములేక తాడించెదవా నీనాల్క—

బలు సత్య మెంతమాట ప్రమదులా రాజు లెచ్చోట
చెలగి నీ శిష్యు డతడౌట చెప్పితివా యింత ఝూట
బూతుపిల్లికి సింగంబు పుట్టనన నట్టులు
నీతిదూరగు త్రిశంకునకు సూనృతుడు గలుగుట యట్టులు'

—ప్ర. - 9

అని యాసడించును. దానికి వసిష్ఠుడు 'ఎద్దు మంచమెక్కినట్లు బ్రహ్మ ఋషిత్వ మెనసి పండువంటి హరిశ్చంద్రుని పల్చన జేసెదవా? సూర్యుపై బుగ్గిజల్ల దన్నో కకునన్నె? చాలు నిందింపకుము హరిశ్చంద్ర విభుని' అని మందలించి హరిశ్చంద్ర చక్రవర్తిని ప్రశంసించును. అంత విశ్వామిత్రుడు కోపముతో 'మనకీ అజాయుద్ధమేల? అతనిచేత అసత్యము పలికింతును' అని శపథము చేయును. వసిష్ఠుడు కూడ 'నీవు అసత్య మతనిచేత పలికించిన శునకంబునై నిన్ను గొలిచెదను' అని ప్రతి శపథము చేయును.

తరువాత విశ్వామిత్రుడు అయోధ్యలో గల హరిశ్చంద్రుని కడ కేగగా, హరిశ్చంద్రుడు ఆ ఋషికి అర్ఘ్యపాద్యము లిచ్చి పూజించి వినయముతో 'మీ సేవకుడను. ఏవిధమైన సేవ మీకు చేయగలను?' అని యన, విశ్వామిత్రుడు 'యాగము తలపెట్టితిని. ముబ్బారముల సొమ్ము కావలెను' అని యనును. హరిశ్చంద్రుడంత సొమ్మీయ బోవును. విశ్వామిత్రుడు 'నేను కోరినపుడు పంపించుము. దాచుము' అని వెడలును. ఇంతలో చెంచువాండ్రు వనమృగములు బాగుగా చెల రేగినవనియు వచ్చి రక్షింపవలెననియు ప్రార్థింప, హరిశ్చంద్రుడు వచ్చి రక్షింతునని చెంచువాండ్రను పంపును. హరిశ్చంద్రునితో పుత్రసహితయై చంద్రమతి కూడ అడవికి బయలుదేరును. హరిశ్చంద్రుడు అడవిలో పలురకంబులగు క్రూర మృగంబుల వేటాడి ఆలుబిడ్డలతో ముచ్చటించుచు నింటికి మరలు సమయమున నొక పసిడి యిఱ్ఱి కన్పడును. ఆ అబ్బురంపు లేడికై హరిశ్చంద్రుడు వెనుదగిలి కుశికాత్మజుని తపోవనము చేరి, అది ఆశ్రమ మృగమని పట్టుట కిచ్చమాని పేట బడలికతో నట విశ్రమించి నిద్రించును. అప్పు డతనికి 'ఒక మౌని కోపముతో తన తలను తన్ని కిరీటమును నేలగూల్చినట్లు. తాను రాజ్యభ్రష్టుడయి వనమున పడినట్లు, దావానలమున గ్రాగినట్లు, పెనుకష్టమున కాశికిపోయి దారాపుత్రులతో తాను అమ్ముడు పోయినట్లు, చండాలదాసుడయి కాటికాపున్నట్లు, పుత్రుని కోల్పోయిన భార్యను గని

నట్లు, భార్యను చంపబోవునట్లు' ఒక కల వచ్చును: ఈ కల వివరములను భార్యతో హరిశ్చంద్రుడు చెప్పగా నామె యోదార్చును. అంతలో పదియారేండ్ల మాలెత లిరువురు హరిశ్చంద్రుని చెంతకు చేరి తన కూటమిని కోర, చంద్రమతి కూడ వారిపై జాలిపడి అనుగ్రహింపు మనును. హరిశ్చంద్రుడు చంద్రమతితో 'నన్ను ఏకపత్నీవ్రతుండని యెరుగవా?' అని సమాధాన పరిచి, మాలెతలను గని 'నను గలయుట కొప్పను. కావలసిన నా రాజ్యమయిన గొనుడి' యని యన, వారు మదనబాధతో హరిశ్చంద్రుని అంటుకొన ప్రయత్నింతురు. దానికి రాజు 'మించి రావద్దు. మిమ్ము శిక్షించవలయు' అని కోపింప, వారు ఏడ్చుచుందురు. అంతలో తటాలున విశ్వామిత్రుడు అక్కడ ప్రళయాగ్నివిధమున కనులెఱ్ఱచేసి రౌద్ర మూర్తియై రాగా భూవిభుడు తాను నిరపరాధినని జరిగిన విషయ మంతయు వినయ ముతో కడుభీదయై చెప్ప, విశ్వామిత్రుడు—

భళిరా! రాజవరేణ్య! సత్యమును గాపాడం దలంతేని యీ
యలసుంబోండ్ల గ్రహింపఁబోనియెడ నీ వన్నట్లె నీ వీయగా
వలె నీరాజ్యము వీరికిన్ మఱి యటుల్ బల్కంగ లేదంచు బొం
కులకుం జొచ్చెదవేని నీపయిని నేఁగోపింప నుమ్మెంతయున్.

—పు. 24

అని యన, రాజు ఆ రాజతపస్వి పెట్టిన విషమసంధికి వెల్లబోయి కల నిజమగుట మొదలయ్యెనని చింతించుచుండ, చంద్రమతి 'పుట్టించినవాడు పూరి మేపునా? మునికి రాజ్య మిచ్చి పోవుదము' అని ధైర్యము చెప్ప, హరిశ్చంద్రుడు తన అఖిల రాజ్యము విశ్వామిత్రున కప్పగించును. కౌశికుడు రాజ్యమును గైకొని—

'ముందియ్యఁ దలఁచిన ముబ్బావువ్రులును
జెందంగవలె మాకుఁ జెల్లింపవలయు
నెప్పుడిచ్చెదవో? నా కెఱిఁగించు వేగ
నిప్పారునకు నప్పగించుము సొమ్ము'

—పు. 25

అని యేమాత్రము అక్కటికములేక మాటాడ, మూన్నాళ్లలో చెల్లింతునని హరి శ్చంద్రుడు ఒప్పుకొని పోవును. విశ్వామిత్రుడు కూడ ఆ రాజచంద్రుని అదృ

తప్పు సత్యకాంక్షకు ఎదలోన మెచ్చి నిష్కారణముగ నిరపరాధికి నాపదల్నెరుప వలసె నని కుందుచు ఆశ్రమమునకు చనును.

తరువాత హరిశ్చంద్రుడు దుఃఖించుచున్న పరివారము నోదార్చి కౌశికుని ఆజ్ఞానువర్తులయి మెలగుడని చెప్పి పంపి, తన సతిని పుట్టింటికి పొమ్మన, చంద్రమతి 'పురుషు విడనాడి పుట్టింట నుండిన పొలతికె పరువుండునా ?' అని యన, ఆమె మాట కాదనలేక వారిని కూడ తీసికొని అడవికి బయలు దేరును. విశ్వామిత్రునిచే కల్పింపబడిన కార్చిచ్చు, మొదలగు పెక్కు మాయలను తప్పించుకొని కాశీకి చేరెదరు. కాశీలో విశ్వేశ్వర దేవాలయము చెంత విడిసి హరిశ్చంద్రుడు కౌశికు ఋణ మెట్లు దీర్తు నని చింతాక్రాంతుడు కాగా, చంద్రమతి 'తన్నమ్మి ఋణవిముక్తుండ వగుము' అని చెప్పును. రాజు బాధపడుచునే నక్షత్రకుని బాధకు తట్టుకొనలేక 'కపటవచోనిపుణుడు వృద్ధమర్కట వికారరూపుడు' అయిన ఒక విప్రునకు చంద్రమతిని అమ్మును. తరువాత హరిశ్చంద్రుడు కూడ నొక మాలవానికి అమ్ముడు పోయి ఋణవిముక్తు డగును. చంద్రమతిని కౌశికు డనేక విధముల బాధపెట్టుచు—

'తరిపి దూడవలె నీతనయుడు సుంతయైనం బనికిరాడా
సరి బాలురవలె దోటలకుంబోయి సమిధలైన దేలేడా' —పు. 37

అని యొకనాడు గద్దింప చంద్రమతి లోహితాశ్వుని గూడ అడవికి పంపును. అక్కడ వీరబాహుని సేవకుడుగా నుండి హరిశ్చంద్రుడు దారాపుత్రుల కష్టములను తలచుకొని మూర్ఛ చెందును. అపుడు విశ్వామిత్రుడు వీరబాహుని పోలికతో వచ్చి హరిశ్చంద్రుని పరిస్థితి జూచి లోలోన బాధ పడి, పైకి మాత్రము కోపము ప్రకటించుచు, అతనిచే నీతిని తప్పింపవలయునని—

'నీ దారిద్ర్యము నాకు గూడ నంటెంచబోకు మీాద
నే దయతో నీకు నేలు చెప్పెద నీవు వినుమోరి పేద
వస్తు పడెదేల నీజాతి పాడుగాను
కూడి మాతోడ హాయిగ గూడు దినుము
మల్లె మొగ్గల్లు నాయొద్ద బిల్ల గలదు
కొల్లలాడుచు నీవుండు మిల్లతికము' —పు. 42

అని కపట ప్రేమను ప్రదర్శింప, హరిశ్చంద్రుడు 'పండిన సంపదల నెడయు వానికి వేరె పెండ్లేల ?' యని యన ఇతని సత్యనిష్ఠ కాశ్చర్యము చెంది విశ్వామిత్రుడు వెడలును.

అక్కడ చంద్రమతి తన పుత్రుడు అడవిలో సర్పదష్టుడయి పడినాడని తెలిసికొని, పగలంతయు పని చేసి, రాత్రి యందు అడవి కేగి కుమారుని శరీరమును గాంచి రోదించి రోదించి, ఆ పుత్రగాత్రమును రుద్రభూమికి తీసికొని వెళ్లి పెను కాష్ఠముపై పరుండ బెట్టును. అట్లు కాటి సుంకము నొసగకుండ చితిపై శరీరమును బెట్టిన చంద్రమతిని కాటికాపైన హరిశ్చంద్రుడు అడ్డగించి, ఆమెను పరికించి భార్య యనియు, మరణించిన బాలుడు తన పుత్రుడనియు గ్రహించి యెంతయో బాధ పడును. అయినను హరిశ్చంద్రుడు కాటిసుంకము తప్పదనును. అంతలో వీర బాహుడు వచ్చి నగదు తెమ్మన చంద్రమతి యేగును. ఇంతలో రాజశాసనమువలన రాజార్భకుని భూషణముల నపహరించిన ఒక స్త్రీ వధకై హరిశ్చంద్రుడు భైరవా లయమునకు బయలుదేరును. ఆ వచ్చిన స్త్రీ తన కాంత యని గ్రహించి చేతు లాడక సదాశివుని ప్రార్థించుచుండ, వీరబాహుడు వచ్చి వేగముగా చంపుమని సంజ్ఞ చేయ, హరిశ్చంద్రుడు నరుకబోవును.

అతని సత్యదీక్షకు ఇంద్రుడు ప్రత్యక్షమై అడ్డుపడును. కౌశికుడు సహజ రూపముతో ప్రత్యక్షమగును. సుపర్వులు, వసిష్ఠాదులు ప్రత్యక్షమై హరిశ్చంద్రుని ప్రశంసింతురు. పునర్జీవితుడయిన పుత్రునితో సంతోషమతి యైన చంద్రమతితో హరిశ్చంద్రుడు దేవవిమాన మధిష్ఠించి యయోధ్యకు చేరును.

ఈ కథ యంతయు గౌరన ద్విపద కథకు రూపాంతరీకరణమే. కథన విధా నము మాత్రము దాసు గారిది. ఆ కథాకథన పద్ధతులు కొన్ని—

హరిశ్చంద్రుని చెంతకు చేరిన మాలెతల రూపము—

తెలుపు గేదంగి చెక్కుల పయి మకరికా
పత్రముల్ కృష్ణ సర్పముల బోల
పొలుపగు వంక కొప్పుల జుట్టు నడవి పూ
వుల తావులకుఁ దేంట్లు వలచి రాగ

గురివెంద పేరుల గోమగారి రైకక
　　　　ప్పులులేని చన్గట్టు పోటు జూప
తలిరుల వొడ్డాణముల సందునన్ దొడల్
　　　　బిరుదులు దోబూచి మెరుపు లీన

నందమౌ చూపులుం జెవులంటుకొనఁగ
కిన్నెరల మీటి పాడుచు వెన్నెలలకు
నవ్వుచుం బదియారేండ్ల పువ్వు బోండ్లు
మాలెత లిరువు రథిపుని బ్రోలఁ జేరి. (పు - 19)

మోహముతో ఈ మాలెతలు హరిశ్చంద్రుని మరుకేళికి ఉసిగొల్పుచున్న సంభాషణ విధానము—

మెలపున నిచటి వారలనెల్ల మరపించి
　　　　మా వెంట సన్నగ నీవు రమ్మ
చలువ పూ పొదరింట సందిట బిగియించి
　　　　చొక్కి నీకెమ్మోవి నొక్కనిమ్మ
మగసేదలం దమి మల్లి నీ రొమ్మున
　　　　వాలుగన్నుల దేల్చి సోలనిమ్మ
అంత గుట్టెరుగక యట్టిటు జూచు మా
　　　　సవతితో నెగతాళి సల్పనిమ్మ

కోరి వచ్చిన మావంటి వారి తోడ
మలయునప్పుడు గల్గు తమాష జూడ
కేల క్రొవ్వాడి వయసున నిట్టు లాడ?
కులము వలపునకుం దవ్వు చెలిమికాడ! (పు-21)

ప్రాబంధికశైలి ప్రతిబింబించుచున్న కాశికానగర చండాలవాటికా రూపము—
'.... .... .... .... .... ....యజ్ఞశాలంబోలి పశుహింస కాకరంబై, వంటపుట్టి భోజనంబుమాడ్కి సంతతా పవిత్రంబై, జారిణిపోల్కి బరమ నీచంబై, కృతఘ్నుకరణి హేయంబై, నాస్తికునిరీతి వేదబాహ్యంబై, నవనాగరిక మతంబు తీరునహాస్యాస్పదంబై, శత్రుని కైవడి మార్గదూరంబై, గర్వితదృష్టి తెన్నున నిమ్నోన్నతంబై, సేవకు తెఱంగున కష్టజీవనంబై, శుష్కవైయాకరణు పోలుపున యుక్తివిరహితంబై, శక్తిహీను సొబగున బరుషభాషణంబై, సత్యమట్లు బహుజనవిరుద్ధంబై, పతివ్రత చెన్నున బరాస్పృష్టంబై, దేవుని పైఖరి సర్వ సంకీర్ణంబై, పెద్దింటి గుట్టువలె బట్టబయలైన చండాలవాటిక.... .... .... ....'

(పు. 34).

వసిష్ఠుడు స్వర్గసభలో హరిశ్చంద్రుని సత్యనిష్ఠను స్తుతింప, కోపముతో విశ్వామిత్రుడు రాచపుట్టులందు సత్తెము పుట్టుట వట్టిదని గట్టిగా వాదించు సందర్భములో చెప్పిన రాజుల వ్యసనము లన్నియు ప్రతి అధికారిని పట్టి వదిలిపెట్టని దయ్యములే (పు. 9).

ఈ హరికథలో అడవిని దాసు గారు ముక్తపదగ్రస్తాలంకారముతో అలంకరించినారు. చంద్రమతిని కొన్నిచోట్ల 'తారామతి' అని గూడ పిలిచినారు. మార్కట్టు, బ్రాంది, బీపు, యేబీసీలు, ప్రొఫెసరు, ప్లీడరు మొదలగు అంగ్ల పదములను కూడ రచనలో చొప్పించుట ఈ హరికథలో కన్పడు ఒక విచిత్రాంశము. విశ్వామిత్రుని పాత్రలో క్రూరత్వముతోపాటు జాలిని గూడ రంగరించినారు. ఇక సందర్భోచితములైన సూక్తులు, ఉపమానములు తక్కిన హరికథలలో వలె దీనిలో గూడ మాటిమాటికి నెదురగు నంశములు.

'సప్తద్వీపము లేలునప్పుడు నమస్త్రప్రౌఢ సామంతరాట్
దృప్తవ్యూహము దోలునప్పుడు పురంధ్రీ రత్న మిల్లాలితో
గుప్తక్రీడలఁ దేలునప్పుడును... ... ...' (పు. 40)

భార్యాపుత్రులకు దూరమయి అనేక బాధలకు గురియగునప్పుడును సత్యనిష్ఠునకు సత్యవ్రతభంగము కల్గనిచో అతని తృప్తిలో గోరంత కూడ వాసి యుండదను సారాంశము నమ్మిన వేంకట చైనులుగారి సత్యప్రీతిపై గౌరవముతో వ్రాసి అంకిత మిచ్చిన హరికథ ఈ హరిశ్చంద్రోపాఖ్యాన హరికథ.

## మార్కండేయ చరిత్ర :

శంభో నినాదము కైలాసవిలాసమునకు చేరునట్లుగా హరికథాప్రారంభము నందు కేక పెట్టెడి నారాయణ దాసుగారి ప్రప్రథమ శైవ హరికథ మార్కండేయ చరిత్ర. దాసు గారి శతజయంత్యుత్సవ సందర్భమున ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారు దాసు గారి పదునాలుగు హరికథలలో ఈ కథ నెన్నుకొని నాట్యకళలో (1965 ఫిబ్రవరి) పునర్ముద్రించుట ఈ హరికథపై గల పండిత గౌరవ దృష్టికి పుష్టి గల దృష్టాంతము.

కథాంతము నందలి 'దీని రచియించి యీశాధీనంబుగఁ గృతి నొసంగితినో? క్షేమ్యన్' అను పద్యపాదముల వలన ఈ హరికథ 'సర్వేశు' నకు అంకితమని స్పష్ట మగుచున్నది.

ఎవ్వాఁడు జగముల నేలుచు వెలుఁగొందు
దేహంబు శాసించు తెలివి వోలె (పు. 1)

అను సీసముతో గ్రంథము ప్రారంభమగును. ఈ పద్య మొక్కటితక్క, దాసు గారు సామాన్యముగా వారి హరికథలలో కన్పడు సుదీర్ఘ మగు ఇష్టదేవతాస్తుతి దీనిలో కన్పడదు. ఈ ప్రార్థన పద్యము పిదప సభా సంబోధనము, ఆత్మవినయము, బాల్యచేష్టలు, కాలుని వింతల వలన కలుగు వంతలు, శుష్కశాస్త్రవాదుల దూషణ, సంఘవిమర్శ కథాపీఠికగా వచ్చును. పదిపుటల ఈ సుదీర్ఘ కథాపీఠిక తరువాత కథాపేటిక నిట్లు తెరచిరి—

వనితాధనముల నొల్లక
యనవరతం బీశ్వరార్చనాసక్తిఁ బూం
దిన మనుజుఁడు మార్కండే
యుని వలె మృత్యువు జయించునో జనులారా !

—పు. 10

### కథా సారము :

కృతయుగమున మృకండుడను ముని యొకండుండును. మృగములు అతని యొడలికి రాచుకొని కండూయమును దీర్చుకొనుటవలన అతనికి మృకండుడను పేరు

వచ్చినది. అతని సతి సుగుణవతి యైన మరుద్వతి. వారు పెక్కేండ్లు అన్యోన్యముగా కాపురము చేసినను సంతతి కలుగదు. ఆ బాధను ఒకనాడు మునిపతి సతితో వెలుబుచ్చ, ఆమె కూడ—

బుడుత లేకున్నచో నాడబుట్టువేల ?
వియ్యమందఁగ నోచని విభవమేల ?
బ్రతికి కొరగానిచో సతి బ్రతుకనేల ?
నా మనోనాథ ! యింక నేనేమి సేతు ? పు॥లు 12, 13

నని బాధపడును. అంత ముని, భార్య నోదార్చి యభీష్టసుఖదంబగు కాశికి పోయిన సంతతి కలుగునని పలికి, భార్యతో వారణాసికి వెళ్లెను. వారణాసిలో వారు 'ధుండి' వినాయకుని గాంచి దండములు వేవేలు పెట్టి, మణికర్ణికలో స్నానము చేసి, లింగ ప్రతిష్ఠ చేసి, విశ్వేశ్వరుని పూజించి, అక్కడ నుండి ప్రయాగ కేగి త్రివేణీ సంగమములో స్నానమాడి, పితృతర్పణము నిచ్చి, గోమతీతటము చెంత సంతతి కొరకై మహాభయంకర తపమారంభించును. అతని కఠిననిష్ఠాతపమునకు నల్దెసలు తపోగ్నితో క్రాగుచుండగా, సంతోషముతో ఘన వృషభతురంగుడయి గౌరీనాథుడు సాక్షాత్కరింప, మునినాథుడు స్తుతించి ఒక్క తనయుని ప్రసాదింపుమని అర్థించును. దానికి పురహరుడు—'గుణహీనుడయి చిరకాలము మనెడి కొడుకు కావలయునా ? మతిమంతుడయి పదారబ్దములు మను సుతుడు కావలయునా ?' అని యన, వెంటనే యెద్దియు తోచక యెంతయు చింతిల్లి యెట్టకేలకు—

'ఓ మహేశ్వర ! సందియ మొందె డెంద
మైన గానిందు గుణహీనుఁడై చిరాయు
వైన పుత్రునికన్నఁ బదారువత్స
రములు మను సద్గుణుండె నిక్కముగ వలయు'
—పు. 19

అని కోరుకొనును. జటాధారి ఘనవిజ్ఞానమునకు గంగాధరుడు అలరి 'అట్లేకావి మ్మిచ్చితి' నని అనును. అంత మరుద్వతి 'కనుల యందు కాన్పు తొలగుట కాంతకు మరణము కన్న బాధ. కొడుకులు కలుగని కొరత కన్న కడుపు శోకమే కడు నధికము' అని నీ నాథునిలో తెలుపుమని గౌరితో ననును. గౌరీదేవి 'నారు

పోయు నతండె తా నీరుపోయును. ఈశ్వరుడేమి తలచునో యెఱుగతరమె ?' అని ధైర్యము చెప్పి అంతర్ధాన మగును.

వారు సంతోషముతో స్వగృహమునకు వచ్చి సంతర్పణములు సలిపి, ఒక శుభ లగ్నమున పార్వతీశుల పదధ్యానము చేయుచు ఉత్పలాస్త్రుని కేళి యందోల లాడు దురు. భగవదనుగ్రహము వలన మరుద్వతి అంతర్వత్నియై నవమాసానంతరము ఒక శుభలగ్నమున ఒక పుత్రుని గనును. ఘనసిద్ధాంతులు ఆ బాలునకు జాతకము వ్రాసి చిరాయువని పలికి, మార్కండేయుడు అని నామకరణము చేసిరి. సర్వ సుగుణశోభితుడయి బాలుడు పెరుగుచుండ, ఒకనాడు మృకండుని ఇంటికి స్థిర హర్షు లయిన సప్తర్షులు వేంచేయ మృకండమహర్షి తన పుత్రునిచే వారికి మ్రొక్కించుచును. వారు ' చిరంజీవ ' యని దీవింతురు. అపారామోదముతో మృకండుడు ' ఓ రక్షామణులారా ! మీరాడిన యట్టి మాట మృషకాదుకదా ? ' యని యన, వారు 'భూసురుల దీవనలు బొల్లులు కావు. నీ సుతుని మాతో పంపుము. బ్రహ్మచే వీని కాయువు పరగసేతుము' అని ఆబాలుని తీసికొని సత్యనగర మేగుదురు. సత్య లోకమున నారదుడు త్రిపురసంహార కథను గానము చేయుచుండును. వాణీశుడు ఆ బాల మార్కండేయుని దగ్గరకు రమ్మని పిలువ, మార్కండేయుడు సమీపించి స్తుతింప, బ్రహ్మ 'చిరాయుర్భవ' అని దీవించును. బ్రహ్మ దీవనకు ఋషులు హాసము చేయుదురు. బ్రహ్మ 'నవ్వ కారణ మేమి ?' యని కోపముతో ప్రశ్నింప, వసిష్ఠుడు 'శంభు డితనికి పదారు వత్సరము లాయువీయగా, మీ దీవన విధమునకు నవ్వితిమి' అని చెప్పును. పితామహు డబ్బురపడి 'నే శివుని కడ కేగి యీ బాలుని కరుణింపు మని యనెదను. మీరు ఈ బాలుని గౌతమీతటమున తపమున నిలుపుడు' అని మహర్షులతో ననును. ఋషులు ఆ బాలుని మృకండుని నెలవునకు గొనిపోయి మృత్యుంజయ మహిమను వర్ణించి ఈశ్వర పూజావిధానమును తెలిపి ఏగుదురు.

మార్కండేయునకు పదారబ్దములు వచ్చును. తల్లిదండ్రులు మిక్కిలి బాధచెందుచుండ, బాలుడు—

అరవిందసూతి యానతిచ్చినట్లు సహాయుడనై చనెదన్
గిరిజేశుఁ బ్రసన్నుఁ జేసి జమునిం గెలిచి చిరాయువు గానెదన్

—పు. 32

అని పలికి జనని పాదములకు మ్రొక్కి, తల్లియైన మరుద్వతి—

అయ్య ! మీయయ్య వేల్పని యందునేని
యన్న ! నీయన్న నుడి కెదురాడనేని
తండ్రి ! నీ తండ్రిపాదముల్ తప్పనేని
గరళకంఠుఁడు నిన్ బ్రోచుగాత కుఱ్ఱ ! —పు. 32

అని దీవించును. తండ్రికి నమస్కరించి దీవనలు గొని, మార్కండేయుడు గౌతమీనదీతటమున లింగమును ప్రతిష్ఠించి తపము ప్రారంభించును.

బ్రహ్మ ప్రమథవిలాసమయిన కైలాసమున కేగి, జంభారి వినుత పదాంభోరుహుడయిన శంభుని భజింప, పురారి ధాతను 'అభీష్టము కోరుకొమ్మ'న విధాత 'అల్పజీవియైన మృకండు సూనుని కల్పజీవిగా మనునట్లు కరుణింపుము' అన, కింకర హృదయవశంకరుడయిన శంకరుడు 'అట్లే యౌను' అని యనును.

అది విని కలహకళావిశారదుడయిన నారదుడు జముని రాయగ సందు దొరికెనని జముని ఉసికొల్ప యమనగరము వెడలి 'అరవిందసూతి యల్పాయుష్కుడగు ధరణీసుర బాలునొకని దీర్ఘాయువుగ దీవించి తన మాట నిలుపుకొనుటకు ఆ బాలుని గౌతమీతటమున తపమున నిలిపినాడు. కనుక నీవు త్వరగ అక్కడకు పోయి నీ ఘనపాశముతో నీ శాసనమునకు లోబడజేయుము. బ్రహ్మ యెట్లు తప్పించునో' అని రెచ్చగొట్ట, దురితచయదముడయిన జముడు అహంకారముతో 'నా శాసనమున కడ్డాచరింప శక్తులు గలరే ? వనజభవుడే కాదు, ఆ నిటలనయనునకు గూడ దుస్తరము' అని పలుకును. నారదు డామాటలకు పైన నవ్వుచు, లోన వీనికి శీఘ్రముగా శాస్తి కావలెనని తలంచుచు మార్కండేయుని జూడ నేగును. అక్కడ మార్కండేయుని నిష్ఠ కబ్బురపడి నారదుడు 'గౌరీశుడు నిన్ను బ్రోచును. నడుమ శూరత్వమును జూపు కాలునికి జంకక బుద్ధి చెప్పుము. హరుడు వానిని శిక్షించును' అని యన, మార్కండేయుడు 'నారదా ! నా తల్లిదండ్రుల నోదార్చి పోరాదా' యని యనును. నారదుడు వల్లెయని మృకండుని కడ కేగి మార్కండేయుడు చిరంజీవియై వచ్చును అని చెప్పును. ముని దంపతులు అనుమానము విడచి ఆనందముగా నుందురు.

మార్కండేయుడు తన ఆయుఃపరిమితికి ఒక్క దినమే మిగిలియుండ ఇందుమౌళిని గూర్చి తపము అధికము చేయును. ఇంతలో భయపెట్టుచు దండధర కింకరులు వత్తురు. కాని పెనుదవానలమును జేర వెరచినట్లు అతనిని డాయుటకు భయపడుచుందురు. వారు సమీపింపలేకపోవుటకు కారణము గరళకంఠుని కరుణ యన్ని గమనించి వారలను జూచి 'మరలుడు. నా దరిజేర మీతరము గాదు' యని యన, వారు యముని చేరి వారి అశక్తతను విన్నవింతురు. వారి మాటలకు యముడు రౌద్రాకారుడయి గోదావరీతటము చేరి రుద్రభక్తుని నిందించును. బాలుని 'వేడి నీళ్ల కిండ్లు కాలునా? నీ వింక తిన్నగ పొమ్ము' అని మృత్యుంజయ ధ్యానములో నిమగ్నుడగును. శమనుడు పాశము వైచును. కాని అది కంఠమును పట్టదు. అంతలో సర్వభవాండంబంతయు బ్రద్దలగునట్లు, జముని యెద తల్లడిల్ల అతి భయదంబయిన వింత ధ్వని పుట్టి లింగము బీటలగును. అందుండి సపరివారుడయి చంద్రమౌళి సాక్షాత్కరించును. శూలమున దండధరుని ఇలపై గూలవైచి బాలకుని మస్తకముపై అభయహస్త ముంచును. సర్వసుపర్వాపూర్వదృక్పూర్వమయిన ఈ దృశ్యమును గని మరల మార్కండేయుడు పరమేశుని స్తుతించును. శంకరుడు బాలుని 'శాశ్వతాయువు పొందుము' అని దీవించును. తరువాత దేవతలు కాలుని బ్రతికింప మందురు. శివుడు బ్రతికించును. యముడు అహంకారము తొలగి పరమేశ్వరుని పాదములపై బడి తరువాత బాలుని చూచి సిగ్గొంది 'కొంటె నారదుడు నా కొంప తీసెను. ఇక నుండి నీ దాసుడను' అని యనును.' శివుడు కాలునకు బుద్ధి చెప్పును. మార్కండేయుడు తల్లిదండ్రుల కడ కేగి జరిగిన దంతయు చెప్ప, వారు అపరిమితానంద మందుదురు. వారందరు కలిసి అఖిలేశుని కీర్తించుటతో ఈ హరికథ ముగియును.

ఈ కథ మాఘపురాణము నందలి మార్కండేయుని కథకు అనుసరణము. కథాసారము మాఘపురాణము నందలిదైనను, కథా శరీర మంతయు దాసప్రతిభా ప్రసూతమే.

దాసు గారి తెలుగు హరికథలలో గీర్వాణవాణీ గీర్వాణము ఈ మార్కండేయ చరిత్ర హరికథలో కన్పడినంతగా మరియొక హరికథలో కన్పడదు. దీనికి కారణము గీర్వాణవాణీ ఏణాక్షి పై కన్న అచ్చతెలుగు పలుకుల వెలదిపై కన్ను దాసు గారికి బాగుగా పడకముందు వ్రాసిన హరికథ ఈ మార్కండేయ చరిత్రము.

దీనిలో సంస్కృత పదాడంబరమే కాదు, సంపూర్ణముగా సంస్కృత మయములయిన స్తోత్రములు కూడ కలవు. మచ్చున కొకటి___

నౌమి తే చరణసరసిజయుగళే తామరసోద్భవ పాతక నిగళే ॥నౌ॥
కామితజన చయకల్పక తుల్యే యామినీచర హృదయ కఠినశల్యే ॥నౌ॥
భూమిసురపాల వేదలోల సుగుణజాల
వాణీ మనోనుకూల సత్యశీల నిఖిలాశ్రిత జన దయాపాల ॥నౌ॥

—పు॥లు. 26, 27

సందర్భానుసారముగ 'మృత్యుంజయా' అను మకుటముతో విడివిడిగా నెనిమిది పద్యములను వ్రాసి చొప్పించినారు. మచ్చునకు కూడ ఒక్క అచ్చ తెనుగు తొన లేని ఆ మృత్యుంజయాష్టక ఫలము లివి....

గౌరీ చిత్తసరోజభృంగ! త్రిజగత్కళ్యాణదాపాంగ! సం
సారధ్వాంత పతంగ! మూర్ధవిచలత్ స్వర్గాపగా భంగ! కే
యూర ప్రాప్త భుజంగ! మర్దిత బలోన్మోద్దండ మాతంగ! తా
రారాట్ప్రజ్వలితోత్తమాంగ! లలితార్ధస్వాంగ! మృత్యుంజయా

—పు. 38

చటులాంభోధి గభీరభాష! విచలత్ స్వర్వాహినీ భూష! సం
కట సంసారవిశోష! దృష్టివిలసత్ కారుణ్యపీయూష! దు
ర్ఘట రక్షోజనభీష! భక్తజన హృద్రాజీవ సంతోష! సో
త్కట గౌరీ రమణీయ వేష! దురితాంధః పూష! మృత్యుంజయా

—పు. 40

రవిచంద్రానలనేత్ర! దుర్ఘట మహారక్షః పురీజైత్ర! సం
స్తవనీయోరుచరిత్ర! భక్తజన హృద్రాజీవ సన్మిత్ర! దు
ర్భవ షడ్వర్గలతాలవిత్ర! గిరిజారామావనీచైత్ర! భ
స్మ విలిప్తాంచితగాత్ర! భూరి వియదంభః పాత్ర! మృత్యుంజయా

—పు. 41

కరుణాలోకనజాల! రాత్రిచరమేఘస్తోమ వాతూల! సిం
ధుర చర్మాంచితచేల! మూర్ధవిలసత్ ద్యోవాహినీకూల! స
ద్గిరిజాచిత్తవిలోల! భక్తజనహృద్వీథీ నటచ్ఛీల! భా
స్వరదక్షిణ యశో విశాల! శశిరాజత్ఫాల! మృత్యుంజయా
—పు. 44

నిరతశ్వేతగిరీంద్రగేహ! ప్రముదోన్నిద్రాశ్రితవ్యూహ! బం
ధుర గోనాయక వాహ! దుష్టదనుసూనుస్ఫోటనోత్సాహ! దు
స్తరరక్షః పురదాహ! పర్వతతనూజాబద్ధ సమ్మోహ! సిం
ధుర చర్మాంచితదేహ! భక్త జన బంధు స్నేహ! మృత్యుంజయా
—పు. 44

అరుణాంభోరుహవీక్ష! దైత్యకులరాడ్ధ్వస్తీంద్రిహార్యక్ష! దు
ర్ధర హాలాహలభక్ష! సంచకిత భక్తప్రాణసంరక్ష! దు
ర్భర సంసారవిపక్ష! సర్వసుమనః ప్రస్థాపనాధ్యక్ష! సిం
ధుర దేహాంచితకక్ష! భూమిధరరాట్పుత్రీకృపేక్ష! మృత్యుంజయా
—పు. 45

నత బృందాభయదాన! ఫాలతల విన్యస్తోడురాట్సూన సం
తత సామాగమగాన! యోగిజన హృద్యన్మోక్షసంధాన! ప్రో
ద్ధత హాలాహలపాన! రక్షిత కనద్దాక్షాయణీమాన! సం
గతకారుణ్యానదీన! శశ్వదపరోక్షజ్ఞాన! మృత్యుంజయా —పు. 45

పరిపుష్టాబ్జభవాండ! శిక్షితసురప్రత్యర్థి వేదండ! సం
సరణచ్ఛేదనశౌండ! కల్మషతిమిస్రస్తోమ మార్తాండ! దు
ర్భరరక్షోజనదండ! దారిత మదోద్రేకక్రూర పాషండ! బం
ధురవేదాళికరండ! శూలవిలసద్దోర్దండ! మృత్యుంజయా —పు. 46

మృకండమహర్షి తన సతితో పరమశివుని వరమును పొంది తన యూరికి వచ్చునపుడు, దాసుగారు చేసిన —

చుట్టు తోటలుం బొలములు మఱియొక తట్టు సెలయేటితోడన్
చిట్టడివితోడ మఱియొకవైపున చెలువైన కొండతోడన్
పచ్చికబయలుతోడం గల్వలు బలిసిన చెఱ్వులతోడన్
ముచ్చటలూరెడు తన యూరింగని ... —పు. 21

అనెడు గ్రామ వర్ణనము—

కంటివే తొలి మన వారంపకంబుపెట్టిన కన్నెరావి
మింటినొరయుచు నిప్పుడెంతటి మేలిమానయ్యెనో చెలియ
అల్లదే మన మేగుడెంచిన పల్లెవారల యోడరేవు
నల్లదే వెన్దట్టు కొబ్బరులల్లుకొను మన మిద్దెటిల్లు —పు. 21

అనెడు గృహవర్ణనమును దాసు గారి స్వగ్రామ స్వగృహ వర్ణనములే.

మార్కండేయుడు మృత్యుంజయుని గూర్చి తపము చేయుచు—

ననుగని గర్వించు నాయమ్మ లాలింత
సంతుష్టిబొందిన జనకు ముద్దు
పెన్నిధివలె నన్నుఁ గన్నారఁజూచిన
యగ్రజన్ములు పొంగు నాడతోడు
జాలితోఁజూచిన జట్టుదారులు ముద
మందిన కోవిదు లలరు కులము
ముజ్జుపాల్సేపుచు మొదవునాకెడు లేగ
మేటి చదువు కొల్వు మిద్దెటిల్లు

పొలములుం దోటలుం జేతి పుస్తకమ్ము[14]
నిన్నుఁబాడెదు వీణియు నీలకంఠ!
యనవరతమును నాకుంచి కనికరించి
కాలపాశంబు విడిపించి కావుమయ్య! పు॥లు. 46, 47

అనెడి ప్రార్థనము మార్కండేయుని గొంతు నుండి వెలువడిన దాసు గారి ప్రార్థనమే. తన తన్మయత్వములో దాసు గారు మార్కండేయునకు లేని 'అగ్రజన్ములను, ఆడతోడులను, జట్టుదారులను' గూర్చి పొరపాటు చేసినారు.

దాసు గారి మనస్తత్త్వ ప్రతిబింబమునకు మార్కండేయుని ఆయువును ప్రసాదించిన హరికథ మార్కండేయచరిత్ర హరికథ.

## గౌరమ్మ పెండ్లి:

గౌరమ్మ పెండ్లి హరికథ దాసు గారు సీమ పల్కులలో వ్రాసిన ఏకైక హరికథ. దీనిని దాసు గారు తమ ఎనుబదవయేట వ్రాసి ఏకదంతున కంకిత మిచ్చి నట్లు కథాంతము నందలి 'ఎన్బదవపడి న్గాన్క మొదటిపేల్పున కిడినాఁడ' అను చరణముల వలన స్పష్టమగుచున్న విషయము.

దాసు గారు వారి హరికథల ప్రారంభము లందు చేయు ఇష్టదేవతా స్తుతులలో నలుగురైదుగురను స్తుతించుట సామాన్య సమాచారము. ఈ గౌరమ్మ పెండ్లి హరికథలో ఒక్క ముక్కంటి మొదటి పట్టినే పట్టుకొని జేగొట్టుట విశేష విషయము.

దాసు గారు ఈ కథను తేట సీమపల్కులలో వ్రాయుచుండుటచే కాబోలు, గ్రంథ ప్రారంభము నందు తొలినాటి మేటి చదువరులు చేసిన కొన్ని పొరపాట్లను

14. చేతి పుస్తక మన పోతనగారి భాగవతము. దాసుగారికి వీణ అన్నను, భాగవత మన్నను పరమ ప్రీతి. సారంగధర నాటకమున కూడ— (పు-95)

అడ్డు పల్కని వీణియ! యనుఁగు పారు
వంబ! నా మాట వినినంత వంగు విల్ల!
తత్త్వమెఱిఁగించు భాగవతంబ! మిమ్ముఁ
బట్ట నా కరముల కిఁకఁ బ్రాప్తి లేద?

అని వారి భావము దాచుకొనలేక చెప్పిరి.

సూచించుచు, అంతటితో నాగక, 'నేఁటి జొప్పంద్రకుఁ దమ సీమ పలుకురాదు' అని సమకాలికులను తీవ్రముగ విమర్శించినారు. సమకాలికులను ఇట్లు భాషా విషయము నందేకాక, వీరికి నచ్చని వారి ఆచార వ్యవహారములను గూడ ఖండించినారు. తరువాత—

కొలువుకూటములన్నది బళి బళి యన
బాడి యాడుచు నాసీమ పలుకు కూర్పు
ముచ్చటను గాన్కగా ముడుపిచ్చుకొందుఁ
బ్రోవుమా కనికరమున బొజ్జవేల్ప! —పు. 4

అనుచు కథాప్రారంభమును జేయుదురు.

క థా సా ర ము :

హిమవంతుడు అమరలోకప్రాప్తి యెట్లు కల్గునని కశ్యపుని ప్రశ్నించును. సంతానవంతుడవయిన తప్ప మోక్షము కలుగదని కశ్యపుడు సమాధానము చెప్పును. హిమవంతుడు సంతానార్థియై విష్ణువును గూర్చి తపము చేయును. విష్ణు ప్రసాదమున ఒక పుత్రిక కలుగును. ఆమెయే గౌరి. ఆ గౌరి ముక్కంటిని పెండ్లాడ గోరి 'నూత్వేల యేండ్లు బువ్వను, తడి నానుటకు మాని' శివుని గూర్చి భయంకర తపము చేయును. ఆ కాకకు చదువుల ముదుకడు (బ్రహ్మ) ప్రత్యక్షమై 'నీవు కోరుకొన్న మగండగు గుబ్బలి విలుకాడు నీయొద్దకు వచ్చి నిన్ను బతిమాలుకొని నిన్ను గలియును. కాన కాక మానుము' అని చెప్పి తపము మాన్పించును. తరువాత శివుడు అసహ్యమైన వృద్ధుని వేషముతో గౌరిని జేరి—

'వెంబర బోడి బొల్లి ముదివెక్కసి యెగ్గడి పాఱుఁడంచు నీ
కమ్మని మూతి త్రిప్పక యెగాదిగఁ గన్గొను నన్ను దిన్నఁగా
నెంబెతికంబు మానుకొనవే నిను నమ్మిక వచ్చినాఁడ నే
నిమ్ముగఁ గౌఁగిలించుకొని యేలుము దబ్బున వాలుఁగంటిరో.' —పు. 8

అని యన, గౌరి యాతడు ముక్కంటి యని గ్రహించి 'నా తండ్రిని ఒప్పించి నన్ను నీ కౌగిట జేర్చుకొనుము' అని యనును. అతడు అంగీకరింపక వాదించు

చుండ, మెట్టుతేడు ఇంటియాపెతో అటకు వచ్చి వివాహమునకు అంగీకరించును. శివుడు వెడలిపోవును. మరికొంతకాలమునకు శివుడు ' మునుపటి వాలకముతోడ ' వచ్చి 'నీవును, నీ తల్లిదండ్రులు నన్ను బెల్లింపు మాటలతో మోసము చేసిరి. ఇక నా త్రోవను నేనేగెదను' అని యన, దానికి గౌరి—

నీకన్న మగవాని నెందు నేనిఁగానను
నాకన్నులతోఁడు నిన్నె నమ్మ్రదానను
గొప్ప కాఁకలతో నిన్నేఁ గొన్నదానను
తప్పులెన్నకు జాబిల్లి తాల్పు! యెట్లైనను
నామగఁడా! నాయిలవేల్పా! నా నోముపంట!
నీమేనే నామేనయ్యె నింకేమి తంట. పు॥లు 18, 19

అని అనుచు క్రొవ్విరుల దండ వేసికంటి మెడలో వైచును. వృద్ధరూపములో నున్న శివుడు కొంత శాంతించి వెడలును.

తరువాత ఒకసారి మొసలి నోట బడి ఆక్రందించుచున్న ఒక విప్రబాలకుని తన తపము ధారవోసి గౌరి బ్రతికించును. తపశ్శక్తి క్షీణించుటచే గౌరి మరల తపముచేయ ప్రారంభించును. అప్పుడు శివుడు తన 'నిక్కపు చెలువముతో' ప్రత్యక్షమై తపము మాన్పించి తల్లిదండ్రుల కడకు పంపును. తరువాత హిమవంతుడు వైభవోపేతముగ పెండ్లి యేర్పాట్లు చేయించును. పెండ్లికి సర్వగీర్వాణులు వత్తురు. వివాహ సమయమున గౌరి యొడిలో ఒక కుఱ్ఱవాడు నిద్రించుచుండును. దేవతలు ఆ పిల్లవానిపై ఆయుధములు వేయబోవ వారి చేతులు కొయ్యబారును. వారు ఆ పిల్లవాడు పరమశివుడని గ్రహించి క్షమాభిక్ష వేడుదురు. తరువాత గౌరీ మహేశుల కల్యాణము వైభవముగా జరుగును.

ఈ కథ పురాణప్రసిద్ధమైన గౌరీకల్యాణ కథ కాదు. దాసు గారు వారి ఇచ్చ వచ్చినట్లు వ్రాయ ముచ్చటపడి కల్పించి వ్రాసిన కథ. ఈ సందర్భమున వారన్న మాట లివి—

'నిన్నటి యూపిరే నేఁడు నేపు తీపికొన తప్పనట్లు వ్రాసినదే పలు తెఱంగుల మార్చుచు వ్రాయక తీరని నానేరమి న్నాయిలవేల్పు మన్నించు గాక!' (కుదురు - 10).

ఈ గ్రంథము నందలి కథ, కథాశరీరము దాసు గారి విలక్షణవీక్షణమును వివరించునట్టివే. సీమ పలుకుల ముసుగుతో మిసమిస లాడుచున్న ఆ కథాశరీరము నందలి కొన్ని అంగములు—

గౌరి మహేశునికొరకై చెందిన విరహ ఘట్టము నందలి యొక పద్యము—

నిప్పుల కుప్పయ్యెనే యలరుల పాన్పు
మేనుడికించెఁ జెమ్మెర చెలంగి
పట్టదు కూరుకు కిట్టదు బువ్వ, యే
పని సల్పుటకునైనఁ బాలుపోవ
దుల్లము మఱపింప నుగ్మలుల్ కావించు
నిమ్ము కిడుముడి యిన్మడించె
నేవైపు గాంచిన నీవె కన్నులఁ గట్టె
నట్లుంటి విందొక నాఁగె నుసుఱు

మాటి కచ్చిక బుచ్చిక మాటలాడి
మరులు పుట్టించి తగులము మప్పి మఱలఁ
జెచ్చెరన్వచ్చెదనఁటంచు నచ్చఁజెప్పి
యేల రావైతి వింగ వీడ్కోలు గొంగ. పు. 16

దాసు గారు హిమవంతునిచే చేయించిన అచ్చ తెనుగు దండకము:-

'గెలువు గెలువాహో గట్టుపిల్కాడ - ముక్కంటి - యో బిత్తపేల్వా - యిరున్మూఁడు నోళ్లొప్పు విద్రిమ్మరీ - దెత్తులన్బ్రోచునేల్కా - తగుల్లేని యిట్టేఁడ - ఐదారకంటీ - కడున్వ్రేల్మి నుగ్గాడు మేల్వేఁటకాఁడా - లలిన్గొంతు కందున్నవాఁడా - బళాసావుగొంగా - నినున్మెచ్చఁదొల్పల్కులే చాల - నీ బండతాగుండె యేపటి - యే కోర్కులున్నీకు లేవైన నిన్గొల్చు నవ్వారికేలోటురానీవు - నీకన్న వేఱేదియు న్లేదు - నీలోన నీవిట్టు లీయెల్ల దిన్సుల్వెలంగించి యాటాడు కొందద్దిరా - మమ్ముఁ గాపాఁడఁగాఁగూర్మితో నిట్టు లేతెంచి నావౌర - మా పట్టి గౌరమ్మ నిన్గోరి పెండ్లాడ నే తిండియున్మాని యిన్నాళ్ల తాఁగాఁకలో నున్న దన్నన్న యా యన్నవన్గూడు నీ

యాలుగానేలు నీవంటి యల్లుండు మాకెట్టుల నిక్కుచ్చిన్నో - లేతజాబిల్లి తాల్పు - జొహర్నీకు జోహరు నీకు నొహర్ (పు. 14).

ఈ హరికథా రచనాకాలమునాటికి దాసు గారు సీమ పలుకుల చిలుకుల కాలికి కులుకులకు ఎంతగా లొంగిరన్న, ప్రసిద్ధములయిన సంగీత సాహిత్య సంజ్ఞ లకు గూడ సీమ తెలుగులో క్రొత్తగా నామకరణములు చేసినారు.

## హరికథలు - ఫలశ్రుతి:-

నారాయణదాసు గారు వ్రాసిన హరికథలు పదునాలుగు. ఆ పదునాలుగు హరికథలలో రెండు అలభ్యములు. లభించునవి పండ్రెండు. విహంగదృష్టితో వీక్షించినపుడు వీనిలో సాక్షాత్కరించు వేషవిశేషము లివి—

వస్తుగ్రహణము :

వీరి హరికథలలోని కథావస్తువంతయు రామాయణ భారత భాగవతముల నుండి, ప్రసిద్ధములయిన ఇతర గ్రంథముల నుండి గ్రహించినదే. యథార్థ రామాయణము, జానకీశపథము రామాయణ హరికథలు. యథార్థరామాయణము వాల్మీకి బాలకాండము నుండి యుద్ధకాండము వరకు గల ఆరు కాండముల కథ. అనగా వాల్మీకి షడధ్యాయికి దాసు గారి భాష్యము యథార్థరామాయణము. జానకీ శపథము రామాయణము నందలి ఉత్తరకాండ కథ. దీనివలన రామాయణము నంతటిని దాసు గారు హరికథలుగా వ్రాసినట్లైనది. ఇక భీష్మచరిత్రము, సావిత్రీచరిత్రము భారత హరికథలు. ధ్రువచరిత్రము, అంబరీషచరిత్రము, గజేంద్రమోక్షణము, ప్రహ్లాదచరిత్రము, రుక్మిణీకల్యాణము, గోవర్ధనోద్ధరణము, శ్రీహరి కథామృతము భాగవత కథలు. మార్కండేయచరిత్రము, హరిశ్చంద్రోపాఖ్యానము ప్రసిద్ధ గ్రంథముల నుండి గ్రహించిన కథలు. మార్కండేయచరిత్రము మాఘపురాణాను సరణమైన కథ. హరిశ్చంద్రోపాఖ్యానము గౌరన ద్విపదగ్రంథ కథకు రూపాంతరీ కరణము. ఇక ఏమాత్రము మూలములేని హరికథ గౌరమ్మ పెండ్లి. ఇది దాసు గారు తమ ఇచ్చవచ్చినట్లు కల్పించి వ్రాసిన కథ. తేలినదేమన రామాయణ కథలు రెండు. భారత కథలు రెండు. భాగవత కథలు ఏడు. ఇతర కథలు మూడు. కనుక కథావస్తువునుబట్టి దాసు గారి హరికథలలో భాగవత కథా వస్తు వెక్కువ.

## గ్రంథ నామములు :

దాసు గారు వారి హరికథలకు పెట్టిన నామము లన్నియు ప్రధాన కథా సూచకములై నట్టివే. కాని యథార్థరామాయణ నామము, జానకీశపథనామము కావలెనని కొంత చమత్కారముగా పెట్టిన నామములు. వీరు వీరి రామాయణ హరికథకు యథార్థరామాయణ మని నామకరణము చేయుట వలన, వాల్మీకి రామాయణము కాదు అని అనవలసి వచ్చును. కాని దాసు గారి దృష్టి అది కాదు. ప్రస్తుతము మనకు లభించు వాల్మీకి రామాయణములో అనేక ప్రక్షిప్తము లున్నవనియు వాల్మీకి యథార్థముగా నిట్లు వ్రాసి యుండుననియు భావించి, వ్రాసిన కథ యథార్థ రామాయణ హరికథ.

ఇక జానకీశపథనామ విషయము. ఈ హరికథలో జానకి చేసిన శపథము దాసు గారి కల్పనము. రామాయణములో జానకి చేసిన శపథము కాదు. అందు వలన వీరి కల్పన స్ఫురించుటకు భాసాదుల వలె ఈ నామము పెట్టిరి. అంతేకాక వాల్మీకి 'రామాయణము' అను నామము నాయికానాయకు లిరువురకు అన్వయించునట్లు పెట్టగా, దాసు గారు కూడ 'జానకీశపథము' అను నామము అట్లే నాయికానాయకు లిరువురకు అన్వయించునట్లు పెట్టిరి. రామాయణ నామమును రామ + అయనము రామా + అయనము అని విభజించుటకు అవకాశమున్నట్లే, జానకీశపథము అను నామమును జానకీ + శపథము ; జానకీశ + పథము అని విభజించుటకు అవకాశ మున్నది కదా.

## రచనా లక్ష్యము :

దాసు గారు ఈ హరికథలను పాండిత్య ప్రదర్శన దృష్టితో వ్రాయలేదు. వ్రాసినది ప్రజలకు ఆస్తికబుద్ధి కల్గించుటకు, ధర్మబోధ చేయుటకు. ఆటపాటలతో ఆనందము కల్గించుచు తన జాతికి ఉత్తమసందేశము నందించుట వీరి హరికథా రచన ప్రధానధ్యేయము. ఆ కారణముచేతనే వీరి హరికథలలో నీత్యుపదేశములతో గూడిన సుదీర్ఘోపాఖ్యానములు కన్పడును. కనుకనే దాసు గారి హరికథలు కళానురక్తులకు మనోహరములు. భక్తులకు ఏనోహరములు.

ప్రేరక రచనలు :

ప్రతి కవి చేయు ప్రతి రచనయు అంతరాత్మ ప్రేరణమువలన పుట్టునదే. కాని కొన్ని రచనలకు లౌకిక కారణములు కూడ ప్రేరకము లగుచుండును. అట్లు లౌకికకారణములు ప్రేరకములు కాగా చేసిన రచనలను ప్రేరకరచనలని అనుకొన్న పుడు, దాసుగారి హరికథలలో ప్రేరకరచనలు ఏడు. అవి—1. ధ్రువచరిత్రము, 2. అంబరీషచరిత్రము, 3. శ్రీకృష్ణజననము, 4. ప్రహ్లాదచరిత్రము, 5. సావిత్రి చరిత్రము, 6. యథార్థరామాయణము, 7. గోవర్ధనోద్ధరణము.

ధ్రువచరిత్ర హరికథ దాసు గారి లేఖినీ ప్రథమ ప్రసవము. దాసు గారు మెట్రిక్యులేషను చదువుచున్న రోజులలో చెన్నపట్టణవాసి యగు కుప్పుస్వామి నాయుడు అను నొక హరికథకుడు విజయనగరమున శ్రీ కానుకుర్తి హనుమంతరావు గారి యింటి ముందు ఆడుచు పాడుచు ధ్రువచరిత్ర హరికథను చెప్పుట జరిగినది. అది చూచిన క్షణమే సంగీత సాహిత్య నృత్యముల కైకమత్యము కల్గించు సకలేంద్రియ సంతర్పణ ప్రక్రియ హరికథయే యని భావించి, వారు కూడ ధ్రువచరిత్రమును వ్రాసిరి. ఈ అంశము దాసు గారి ధ్రువచరిత్ర రచనమునకే కాదు, దాసు గారి హరికథా జీవిత ప్రవేశమునకు కూడ ప్రేరణము.

అంబరీషచరిత్ర విషయము — దాసు గారు హరికథా జీవిత ప్రారంభ దినములలో ఛత్రపురములో ఒక ధనవంతుని యింట ధ్రువచరిత్రము చెప్పగా అది విన్న ఒక ప్రభుత్వోద్యోగి 'ఈ కథ మీరు వ్రాసినదగునా ? అని ప్రశ్నింప, దాసు గారు 'నేను వ్రాసినదే' యని యనిరి. వెంటనే ఆ ఉద్యోగి 'అట్లయిన అంబరీషోపాఖ్యానమును వ్రాసి చెప్పుడు' అని యన, దాసు గారు పట్టుదలతో ఆ రాత్రికి రాత్రి మరు నాడు చెప్పిన కథ అంబరీషచరిత్రము.

శ్రీకృష్ణ జననము విషయము — విజయనగర ప్రభులయిన ఆనంద గజపతి ఆస్థానపండితులలో ఒకపండితుడు 'యువకుడైన ఈ నారాయణదాసునకు సంస్కృత భాషాజ్ఞానము, శాస్త్రపాండిత్యము శూన్యము' అని దాసు గారిని గూర్చి చులకన చేసి పలికెనట. అది తెలిసి దాసు గారు వీరావేశముతో శ్రీకృష్ణజననము అను హరికథను సంస్కృత భాషలో చెప్పి మెప్పుల కుప్పలను పొందిరట.

ప్రహ్లాద చరిత్రము దాసు గారి ప్రియమిత్రులతో నొకడయిన బొడ్డు పేంకటేశము అను నేస్తము వ్రాయుమని ప్రేరేపించగా వ్రాసిన హరికథ.

సావిత్రీచరిత్రము వ్రాయువరకు దాసు గారికి సంతతి లేదు. దాసు గారి తల్లి ఒకనాడు 'నాయనా! సావిత్రి కథ వ్రాయుము. నీకు సంతానము కలుగును' అని ప్రేరేపించగా, దాసు గారు వ్రాసిన కథ సావిత్రీ చరిత్రము. ఇది వ్రాసిన సంవత్సరమునకు దాసు గారి కొక పుత్రిక జన్మించినది. దాసు గారు ఆ పిల్లకు పెట్టిన పేరు సావిత్రి.

దాసు గారి భార్య యగు లక్ష్మీనరసమ్మ గారికి రామాయణ మన్న మక్కువ యెక్కువ. ఆమె మరణానంతరము ఆమెపై గల ప్రేమతో ఆమె అభిరుచిని ఆదరించుటకై వ్రాసి ఆమెకే అంకితమిచ్చిన రచనము యథార్థరామాయణము.

గోవర్ధనోద్ధరణ హరికథా జనన విషయ మిక లోక ప్రసిద్ధ విషయము. ఒకనాడు దాసు గారు హరికథా ప్రారంభము నందు 'హరికథ చెప్పమందురా? గిరి కథ చెప్పమందురా?' అని చమత్కారముగా ననగా, ఒక సభ్యుడు 'గిరి కథను చెప్పుడు' అని యన ఆశువుగా చెప్పిన కథ గోవర్ధనోద్ధరణ హరికథ.

అంకితములు :

వీరి పదునాలుగు హరికథలలో ధ్రువచరిత్రము, గోవర్ధనోద్ధరణము అను రెండు హరికథలు అముద్రితములు, అలభ్యములు. మిగిలిన పదిరెండు కథలలో యథార్థ రామాయణము, హరిశ్చంద్రోపాఖ్యానము తప్ప తక్కినవన్నియు భగవదంకితములు. యథార్థ రామాయణము భార్యకు, హరిశ్చంద్రోపాఖ్యానము తల్లిదండ్రులకు అంకితములు. అనగా తన తనువును గన్న తల్లిదండ్రులకు, తన తనువును గన్న ధర్మపత్నికి తప్ప తక్కిన హరికథ లన్నియు భగవదంకితములే.

కథన ధోరణి :

వీరి హరికథల కథలలో గౌరమ్మ పెండ్లి కథ తప్ప తక్కిన కథ లన్నియు పూర్వగ్రంథ సంపదనుండి గ్రహించినవే. పురాణ పారాయణ పరాయణతా సంస్కార పరిణామములే. అందువలననే కథన విధానములో పురాణధోరణి

ప్రవేశించినది. సంస్కృత హరికథ యగు శ్రీహరి కథామృతము, తెనుగు హరి కథ యగు గజేంద్ర మోక్షణము శుకమహర్షి పరీక్షిత్తునకు చెప్పినట్లుగా ప్రారంభించుట ఈ పురాణధోరణియే.

వీరి హరికథలలో పూర్వకవుల ధోరణులు ఎక్కువ. ముఖ్యముగా భాగవత కథలలో 'పోతనత' యెక్కువ. వీరి హరికథలలో ముఖ్యముగా వచనములలో అధికాధికముగా అధికారము చెలాయించినది అర్థాలంకారమైన ఉపమ. ఇందలి ఉపమానము లన్నియు అస్పృష్ట పూర్వములు. ఇక పద్యరచనలో ఉపమాలంకారముతోపాటు బాగుగా ఆవరించుకొన్నది శబ్దాలంకారమైన అంత్యప్రాసము. ఇక పీఠికలలో, గ్రంథ వర్ణనలో సమకాలీన సమాజాంశములు పరిగెల గింజలు కావు, కుప్ప నూర్చిన ధాన్యరాశులే.

అంబరీషచరిత్రము నందు, గజేంద్రమోక్షణము నందు విజయనగర వేణుగోపాలస్వామి ప్రసక్తి వచ్చుట ఆసక్తిదాయకమైన అంశము.

ఒకే మకుటముతో నున్న పద్యములు సందర్భానుసారముగ వీరి కథలలో కన్పడు చుండును. గజేంద్ర మోక్షణమున 'కృష్ణా! వేగ వన్ బ్రోవరా!'; యథార్థరామాయణమున 'భక్తమందార! భవదూర! పరమపురుష!' సావిత్రీ చరిత్రమున 'శ్యామలా!; మార్కండేయ చరిత్రమున 'మృత్యుంజయా!' అను మకుటములతో పద్యరాజములు మాటిమాటికి ఎదురగుచుండును.

వీరి కథలలో ప్రహ్లాద చరిత్రము, భీష్మ చరిత్రము, సావిత్రీ చరిత్రము, మార్కండేయ చరిత్రము నిర్వచన హరికథలు.

అంతర్విభజనము :

సామాన్యముగ హరికథలను ఒక్క దినమున చెప్పుటకు వీలుగా వ్రాయు చుందురు. అందువలన హరికథలలో ఆశ్వాసము, అధ్యాయము మొదలగు అంతర్విభజనముల అవసరముండదు. దాసు గారు కూడ సావిత్రీ చరిత్రము, గజేంద్ర మోక్షణము, అంబరీష చరిత్రము, మార్కండేయ చరిత్రములను విభాగరహితములు గనే వ్రాసిరి. కాని కొన్ని కథలలో వీరు అంతర్విభజనము కూడ చేసిరి. వీరి అంతర్విభజన విధానము మరల రెండు రకములు. యథార్థరామాయణమును ఆరు ప్రత్యేక కథలుగ, శ్రీహరికథామృతమును మూడు ప్రత్యేక కథలుగ వారే నామకరణములు చేసి స్పష్టముగా విభజించిరి. ఇది యొక రకము. రుక్మిణీ కల్యాణము,

హరిశ్చంద్రోపాఖ్యానము, జానకీశపథము, ప్రహ్లాదచరిత్ర, భీష్మచరిత్రలలో సాగు నది ఒకే కథయైనను విరామములను సూచించిరి. ఇది ఇంకొక రకము. కథా మధ్యము నందు కృతిపతిని స్తుతించుట, ఆ స్తుత్యనంతరము 'అవధరింపుము' అని వ్రాయుట వీరి కథావిరామసూచన విధానము.

భాష :

వీరి హరికథలలో శ్రీహరికథామృతము సంస్కృత హరికథ. గౌరమ్మ పెండ్లి సీమ పలుకులలో వ్రాసిన హరికథ. సీమ పలుకులు అనగా తద్భవముల వాసన కూడ లేని అచ్చమైన పచ్చి దేశ్యభాష. మిగిలిన హరికథ లన్నియు మిశ్రి భాషలో వ్రాసినవి. మిశ్రభాష యన తత్సమ తద్భవములతో గూడిన భాష. దాసు గారు వ్రాసిన మొదటి హరికథ ధ్రువచరిత్రము లభింపలేదు. లభించు హరికథలలో మొదటి హరికథ అంబరీష చరిత్రము. ఎనుబదవయేట వ్రాసిన చివరి హరికథ గౌరమ్మ పెండ్లి. కాలానుగుణముగా వ్రాసిన హరికథలనుబట్టి దాసు గారికి మొదటి రోజులలో మిశ్రభాషపై, మధ్య వయసులో గీర్వాణభాషపై, చివరి రోజులలో నాటు తెలుగుపై వ్యామోహము కల్గినదని అనిపించును. మధ్యవయసులో వారు ఆంధ్రేతర భాషలపై బాగుగా శ్రద్ధ జూపినారు. అనేక హరికథేతర కృతులనుగూడ వ్రాసినది ఆ మధ్యవయసులోనే.

సంగీతము :

దాసు గారికి 'లయబ్రహ్మ, పంచముఖీ పరమేశ్వర', మొదలగు బిరుదముల నెన్నింటినో సంగీతసరస్వతి లోకముచే ఇప్పించినది. వీరి హరికథ లన్నియు స్వర సరస్వతీ స్వరూప సాక్షాత్కారములు. వారి స్వరశాస్త్ర సర్వజ్ఞత్వము తరువాతి వారు సరిగా గ్రహించుటకు వారే ప్రతి హరికథలో వారి కీర్తనలకు రాగతాళగతు లను తెలిపినారు. ఈ సూచనవలన క్రొత్తవారికి శ్రమ తప్పును. దాసు గారి పరిశ్రమ అర్థమగును. దాసు గారు సావిత్రీ చరిత్రములో ప్రతి కీర్తన రాగముమ ఆ కీర్తన చివరి పదముగా వచ్చునట్లు వ్రాసి చమత్కరించినారు. సంగీత శాస్త్ర దృష్టితో చూచినపుడు దాసు గారి హరికథ లన్నియు నొక యెత్తు. జానకీశపథ మొక యెత్తు. జానకీశపథము దాసు గారి స్వర సరస్వతి సంపూర్ణముగ సాక్షా త్కరించు కథ.

## అన్యథామూలకములు – అమూలకములు :

అన్యథామూలకములన ఇంకొకరి రచనమును గ్రహించి వ్రాసినవి. అమూలకములన ఏ మూలాధారమును లేనివి. ప్రథమ లక్షణము కవికి ప్రాథమిక లక్షణము. ద్వితీయ లక్షణము ప్రతిభ. ప్రాథమిక స్థితినుండి అద్వితీయస్థితికి నడిపించు లక్షణము. ప్రథమకథ యైన ధ్రువచరిత్రము నందు వీరి రచనతోపాటు విశాఖపట్టణ నివాసి యగు శ్రీ ధూళిపాళ కృష్ణయ్య గారి పద్యములు, పోతన భాగవత పద్యములు కలవు. తరువాత వారి హరికథలలో పోను పోను కల్పన లెక్కువైనవి. చివరగా వ్రాసిన గౌరమ్మ పెండ్లిలో కథ, కథన విధానము, కథాశరీరము అంతయు దాసు గారి సొంతమే.

విహంగవీక్షణమునకు దాసభారతీ జాతకచక్రములో కన్పడు ద్వాదశ హరి కథా భావముల ప్రధాన ఫలితాంశము లివి.



# మ. హరికథేతర గ్రంథములు

సాహస వాక్కుతో, భరత శాస్త్ర తరంగ మృదంగ వాహినీ
మోహినికుల్కుతో, భువనమోహనమూర్తి ఛలోక్తి గాన స
న్నాహముతో, ధనంధన ఘనంఘన నిస్వన కింకిణీ కళా
వ్యూహముతో సభా జగతి నూపిన ధట్టుడు ఆదిభట్టురా![1]

రమణీయమైన వాక్యమునకు ధ్వను లెన్ని యున్నను గ్రహణ సమయ సందర్భమునుబట్టి యేవిధముగా శ్రోత ఒక్క అర్థాంతరమును మాత్రమే గ్రహించునో, అదే విధముగ మహాపురుషులలో ఎన్ని ప్రతిభాస్ఫూర్తు లున్నను ఏకాంశమందే లోకము సామాన్యముగ స్థాన మిచ్చు చుండును. సర్వమంత్ర వ్యాపకుడైన పరమపురుషునకు ఒక్కొక్క మంత్రమునుబట్టి ఒక్కొక్క రూప కల్పన చేసినట్లు, నైకముఖ ప్రతిభావంతులగు పురుషులకు గూడ ప్రధాన కర్మక్షేత్రమును బట్టి ఏకాంశమునందే స్థాన కల్పన చేయుట లోక లక్షణము. ఇట్లే బహుముఖ ప్రతిభాసంభారభారులైనను, దాసు గారికి కూడ కేవల మొక హరిదాసపంక్తిలో మాత్రమే లోకము పీటవైచినది.

---

1. శతజయంత్యుత్సవ సంచిక.— పుట 275

దాసు గారు అసాధారణ ప్రజ్ఞాసమన్వితులైన హరికథకులని ప్రత్యక్ష దర్శన భాగ్యము నోచుకొన్న సమకాలిక మహాజనశ్రుతి. మహాకవులు, మహాపండితులు, మహావిమర్శకులు అని వారి ప్రతిభా సముద్రములో కొన్ని ఉదబిందువులైన లభ్య కృతుల ఫలశ్రుతి.

దాసు గారి లేఖిని ప్రసవించిన గ్రంథసంతానము నలువది యారు. అందు హరికథలు పదునాలుగు. హరికథేతర కృతులు ముప్పదిరెండు. అనగా హరికథల కన్న ఇతర కృతులు చాల ఎక్కువ. ఈ హరికథేతర కృతులు ఒకే ప్రక్రియకు సంబంధించినవి కావు. అనేక ప్రక్రియలకు ప్రతినిధులు. దాసు గారి అనంత ముఖ శక్తికి ప్రతీకలు.

ఈ హరికథేతర కృతులను వియద్విహరద్గండభేరుండ వీక్షణముతో వీక్షించిన కన్పడు విభాగములు మూడు — (1) స్వతంత్ర గ్రంథములు; (2) అస్వతంత్రములైన అనువాద గ్రంథములు; (3) స్వతంత్రాస్వతంత్రములైన శాస్త్ర గ్రంథములు. ఈ ముప్పదిరెండు హరికథేతర కృతులలో స్వతంత్ర గ్రంథములు పదునెనిమిది. అనువాద గ్రంథములు ఆరు. శాస్త్ర గ్రంథములు ఎనిమిది. గచ్ఛత్ పిపీలికాదృష్టితో జూచిన వీనిలో నింక అనేకాంతర్భేద ప్రక్రియలు ప్రత్యక్షము లగును.

## స్వతంత్ర గ్రంథములు :

పదునెనిమిది స్వతంత్ర గ్రంథములలో శతకములు ఏడు; ప్రబంధములు నాలుగు; రూపకములు రెండు; స్వీయచరిత్ర, మృత్యుంజయాష్టకము, బాలరామాయణకీర్తన, పేల్పుమాట, అచ్చతెనుగు పలుకుబడి అను గ్రంథములు అయిదు.

దాసు గారు వ్రాసిన ఏడు శతకములు—1. 'కాశీశతకము, 2. రామచంద్ర శతకము, 3. సూర్యనారాయణ శతకము, 4. మృత్యుంజయ శివ శతకము, 5. ముకుంద శతకము, 6. సత్యవ్రత శతకము, 7. వేల్పువంద. వీనిలో కాశీ శతకము, రామచంద్ర శతకము సంస్కృత భాషా శతకములు. వేల్పువంద అచ్చతెనుగు శతకము. మిగిలిన నాలుగు శతకములు మిశ్రభాషలో వ్రాసిన తెనుగు శతకములు.

కాశీ శతకమ్ :

దాసు గారు సతీసమేతముగా 1914 లో కాశి కేగిరి. ఆ ప్రత్యక్షానుభవముతో వ్రాసిన సంస్కృత శతకము ఈ 'కాశీశతకమ్'. ఇది కచ్చితముగా నూరు శ్లోక ముల శతకము. ఈ శ్లోకములు వ్రాసినది అనుష్టుప్ ఛందమున. స్ఫూర్తిశ్రీ భాస్కరరావుగారు ఈ శతక శ్లోక రచనలో దాసు గారు లక్షణకర్తలు చెప్పిన అనుష్టుప్ లక్షణముతోపాటు, భగవద్గీతలో గల 'అనుష్టుప్' లక్షణములను గూడ గ్రహించినారని కనుగొనినారు. అనుష్టుప్ లక్ష్షణము—

శ్లోకే షష్ఠం గురు జ్ఞేయం
సర్వత్ర లఘు పంచమం
ద్విచతుష్పాదయోర్హ్రస్వం
సప్తమం దీర్ఘ మన్యయోః [2]

అనగా ప్రతి పాదమున ఆరవ అక్షరము గురువు, ఐదవ అక్షరము లఘువు. రెండు నాలుగు పాదాలలో ఏడవ అక్షరము లఘువు. ఒకటి మూడు పాదాలలో ఏడవ అక్షరము గురువు అనుష్టుప్ప్ శ్లోకములో నుండవలెను.

శ్రీ భాస్కరరావుగారు ఈ లక్షణముతో భేదించుచున్నవని దాసుగారి శ్లోకము లలో మూడు పాదములను పట్టుకొనినారు.

నానాభాషా భాష మాణ (శ్లో. 7, పా. 1)

---

2. అనుష్టుప్‌యొక్క ఈ లక్ష్షణము కాళిదాసు వ్రాసిన 'సుబోధాభిదానము' అను గ్రంథము నందలి దనియు; అనుష్టుప్‌ను 'వృత్తశ్లోకము' అని యందు రనియు పొత్తపి వేంకటరమణకవి తన లక్ష్షణగ్రంథమైన 'లక్ష్మణ శిరోమణి'లో తెలిపినాడు. (3–177, 178)

ఛందశ్శాస్త్ర సర్వజ్ఞులైన శ్రీ రావూరి దొరసామిశర్మగారు, 'శ్రుతబోధము' అను గ్రంథమునందు కలదని చెప్పిన అనుష్టుప్ లక్ష్షణ మిది—

పంచమం లఘు సర్వత్ర, సప్తమం ద్వి చతుర్థయోః
షష్ఠం గురు విజానేయా. దేతచ్ఛ్లోకస్య లక్ష్షణమ్.

తెలుగు భాషలో ఛందోరీతులు – పు - 128

ఇక్కడ ఐదింట లఘువు ఉండవలసినది గురువున్నది. ఆరింట గురువు ఉండ లఘువు ఉన్నది. దీనికి వారు చూపిన భగవద్గీతా శ్లోక ప్రమాణము. ధృష్టకేతు శ్చేకితానః (ప్రథమ – శ్లో. ౫).

ఇతి సంతుష్టమనసా (శ్లో. 9, పా. 3)

ఇక్కడ ఆరవ, ఏడవ అక్షరములు రెండు లఘువులే. ఆరవ ఏడవ అక్షరములు గురువులు కావలెను. దీనికి వారు చూపిన ప్రమాణము 'నానాశాస్త్రప్రహరణాః' (ప్రథమ – శ్లో. 9).

ఆస్తిక్యం విస్తారయితుమ్ (శ్లో. 20, పా. 1)

ఇక్కడ ఐదవ అక్షరము లఘువు కావలసినది గురువైనది. ఆరవ ఏడవ అక్షర ములు గురువులు కావసినవి లఘువులైనవి. దీనికి వారు చెప్పిన ప్రమాణము 'అవాచ్య వాదాంశ్చ బహూన్' (ద్వితీయ – శ్లో. 36)

ఇట్లు శ్రీ భాస్కరరావుగారు దాసు గారి అనుష్టుప్పులలో కన్పడు మూడు వ్యత్యయములను కనుగొనుటయే కాక, వానికి భగవద్గీతలో ప్రమాణములను కూడ చూపించినారు. [3]

కాశీక్షేత్ర ప్రాశస్త్యము, గంగామహిమము, నానాశిల్పాకరసౌధశ్రేణి, పంచ క్రోశప్రమాణ వారణాసీ వర్ణనము, కాశీనగర ప్రజల వేషభాషలు, ఘంటా పథ ములు, చతుష్షష్టి ఘట్టముల ప్రసక్తి, విశాలారామములు, దీర్ఘికలు, దేవాలయ ములు, దేవతలు, పాఠశాలలు, షట్ఛాస్త్రపారగులైన పండితులు, శివరాత్రి హోలి కామదహనాద్యుత్సవములు, నానా నరేశ స్థాపిత సత్రములు, సాధువులు, తింత్రి ణ్యాది వృక్షములు, ఫలములు, కళాకౌశలము గల వేశ్యలు .... అవి యివి యన నేల? యాత్రికునకు కాశీ నగరము నందు దర్శన మిచ్చు సర్వాంశములు దాసు గారి శతకములో దర్శన మిచ్చును.

ఈ శతకములో అతిశయోక్త్యాత్మక స్తవము లుండవు. ఉన్నవన్నియు చర్మచక్షువునకు గోచరించు వాస్తవములే. అన్నియు భౌగోళిక భౌతిక సత్యములే. కాని దాసు గారి లేఖిని ఆ సత్యములను ఉక్తివైచిత్రితో చిత్రచిత్రములుగ అలంక రించినది—

3. ఆదిభట్ల నారాయణదాస సారస్వతీ నీరాజనము - పు॥లు. 601–2

స్నాన్ కైలాసం నయ స్త్రీవ యాతి జాహ్నవ్యుదఙ్ముఖమ్
అనుగంగం వారణాసీ సౌధ శ్రేణ్యర్థ చంద్రవత్ —శ్లో॥ 2

జాహ్నవి నరులను కైలాసమునకు చేర్చునట్లుగా ఉత్తరముఖమై ప్రవహించుచున్నదట. గంగ యొడ్డున గల వారణాసీ సౌధశ్రేణి అర్ధచంద్రుని వలె నున్నదట. గంగ ఉత్తర ముఖముగా ప్రవహించుట, గంగానదీతీరమున సౌధపంక్తి వంకరగా నుండుట భౌగోళిక సత్యములు. గంగ నరులను కైలాసమునకు చేర్చుటకు ఉత్తర ముఖముగా పారుచున్నదట, సౌధపంక్తి అర్ధచంద్రాకారముగా నున్నదనుట దాసు గారి ఉక్తివైచిత్రి. ఈ రెండు కల్పనలు శివపరము లగుట పరమౌచిత్యాంశములు.

విశ్వేశ్వరాభిషేకాయ సతిభాగీరథీ జలే
కాశ్యాం కో మాం వాంఛతీతి నారికేళో న జాయతే —శ్లో॥ 84

విశ్వేశ్వరాభిషేకమునకు భాగీరథీజల ముండగా, కాశిలో నన్నెవడు వాంఛించును అని నారికేళము కాశిలో పుట్టలేదట. వారణాసి సాగరతీరము కాదు. నారికేళము సాగరతీరమునందే పుట్టును. కనుక కాశిలో కొబ్బరిచెట్టు పుట్టదు. ఇది భౌగోళిక సత్యము. విశ్వేశ్వరాభిషేకమునకు పవిత్రమైన గంగాజల ముండగా నన్నెవడు కోరును? అను నిరాశతో కొబ్బరిచెట్టు కాశిలో పుట్టలేదని దాసు గారు, కాని కారణమును కారణముగా చెప్పుటకు కారణము వారి ఉక్తివైచిత్రియే. ఈ కల్పనము శివసంబంధ మగుటచే ఔచిత్యశోభితమైనది.

యమునా ప్రముఖానద్యో గంగయాం సంప్రవేశనాత్
తస్యా నామైవాప్నువన్తి పత్యుర్గోత్రం యథాస్త్రియః
—శ్లో॥ 92

యమున మొదలైన ప్రముఖ నదులు గంగానదిలో కలిసి గంగ యను నామమును పొందుట, వివాహానంతరము స్త్రీలు వారి గోత్రములను త్యజించి పతి గోత్రమును పొందినట్లున్నదట. యమున, మొదలగు నదులు గంగలో కలిసి గంగానదిగా వ్యవహరింపబడుట భౌగోళిక సత్యము. ఈ సత్యము మఱియొక సంప్రదాయ సత్యముచే ఉపమింపబడినది.

ఆరోగ్య ప్రతికూలాపి కాశీ సంసేవ్యతే సదా
ముముక్షుణా తిదుష్టాపి భర్తేవోత్తమ భార్యయా —శ్లో॥ 91

కాశి ఆరోగ్యమునకు ప్రతికూలమైనదైనను, దుష్టుడైనను భర్తను ఉత్తమ భార్య సేవించునట్లు, ముముక్షువు సేవించునట. కాశీ పట్టణము పరిశుభ్రముగా నుండక, ఆరోగ్యమునకు ప్రతికూలముగా నుండుట భౌతిక సత్యము. అయిన ముముక్షువు వదలక కాశిని సేవించుట అంతకంటె భౌతిక సత్యము. ఈ భౌతిక సత్యమును మరియొక లోక సత్యముతో ముడిపెట్టినది దాసు గారి ఉక్తివైచిత్రి.

త్రిగుణై రేవ సంసార చక్రం భ్రమతి తత్త్వతః
బ్రువన్నితీవానడుద్భిశ్శకటో గచ్ఛతి త్రిభిః —శ్లో॥ 83

'తత్త్వతః' సంసారచక్రము త్రిగుణములచే మాత్రమే భ్రమించుచుండును అని పలుకుచు మూడెద్దులు తన్ను లాగుచుండ శకటము నడచు చుండునట. కాశిలో బండిని మూడెద్దులతో నడపుట భౌతికసత్యము. ఈ భౌతికసత్యము మరియొక తత్త్వసత్యమును వివరించుచున్నదని యన్నది దాసు గారి ఉక్తివైచిత్రి.

యేనకేనా ప్యుపాయేన బహ్వాన్నం ప్రాప్నుయాదితి
పునస్సమ్ముషితం వస్త్రం దదాత్యన్నాయ వానరః —శ్లో॥ 86

ఏ ఉపాయముచేతనైనను అన్నమును బాగుగా పొందవలెనని ఒక వానరము తాను దొంగిలించిన వస్త్రమును మరల అన్నముకొరకు ఇచ్చునట. కాశిలో కోతులు యాత్రికుల అన్నపు మూటలను దొంగిలించి, అన్నమును తిని వస్త్రమును పార వేయుట కనపడు భౌతికసత్యము. ఈ భౌతికసత్యమును ప్రసిద్ధమయిన—

ఘటం భిద్యాత్ పటం ఛిన్ద్యాత్ కుర్యాద్వాగార్ధభస్వనమ్
యేనకేనా ప్యుపాయేన ప్రసిద్ధః పురుషోభవేత్

లోకోక్తితో గల సంబంధమును 'యేనకేనా ప్యుపాయేన' అను పాదస్పర్శ వలన స్ఫురింపజేసినది దాసు గారి ఉక్తివైచిత్రి.

మద్రూపేణైవ గంగాయాం త్వత్కృతం స్నానముద్భవేత్
తారయేత్త్వాం భవాబ్ధేర్నార్వదస్తీ వేతిరాజతే
—శ్లో॥ 13

నా రూపము వలననే గంగలో నీ స్నానము మహిమాన్విత మగును. అదియే భవాబ్ధిని తరింపజేయును అని యన్నట్లు నావ విరాజిల్లుచున్నదట. గంగాజలమును తాకుచు నదిలో నావ యుండును. కనుక నావ గంగా స్నానము చేసినట్లే. నావ గంగను దాటుచుండును. ఈ తరణశక్తి గంగా స్నాన ఫలము వలన తనకు వచ్చిన దనియు, నరులకు గూడ గంగా స్నాన ఫలము వలన సంసారసాగర తరణశక్తి కల్గునని అది చెప్పుచున్నట్లుండెనని చమత్కారము. గంగానదిలో నావ లుండుట, ఆ నావలు ప్రయాణీకులను నదిని దాటించుచుండుట అను భౌతిక సత్యములను ముముక్షువులను భవాబ్ధి తరింపజేయుటకు సామ్యములుగ చెప్పుట ఇట గల ఉక్తి వైచిత్రి.

దండపాణి భయం నాస్తి మదంతిక నివాసినామ్
ఇతి బ్రువన్నివాత్రాస్తే దండపాణి స్సదాశివః — శ్లో॥ 74

తన సన్నిధానములో నివసించు జనులకు దండపాణి యగు యముని భయము కలుగదు అని యనునట్లు కాశిలో సదాశివుడు దండపాణియై యుండునట. విశ్వేశ్వరుని ఆయుధములలో దండ మొకటి. అ వాస్తవమైన అంశమునకు ఉక్తివైచిత్రితో కారణమును కల్పించుట జరిగినది.

ఇట్లు దాసు గారు కాశీనగరములో కన్పడు అనేక భౌగోళిక, భౌతికసత్యములను ఉక్తివైచిత్రితో చమత్కారముగా ఈ శతకమున వర్ణించినారు.

సర్వ క్షేత్రోత్తమా కాశీ సర్వ సంపత్సమన్వితా
ప్రత్యక్షకైలాసపురీ ముముక్షూణాం నికేతనమ్ —శ్లో॥ 21

అని దాసు గారి సంపూర్ణవిశ్వాసము. ఈ కాశీ నగర వర్ణనము చేసిన కవియే కృతార్థుడు. దీని వర్ణన చేయనివాడు కృతార్థుడు కాడు అని 'తద్వర్ణనేనైవ కవిః కృతీభవతి నాన్యథా' అని నిర్ద్వంద్వముగ చెప్పినారు. ఆ విశ్వాసముతోడనే ఈ శతకమును వ్రాసినారు.

దాసు గారి ఈ కాశీశతకమును కేవల స్తుత్యాత్మక శతకము గాదు. కాశీ నగర యథార్థ దృశ్యములను కవితాకరదీపికతో చూపించిన శతకము.[4]

ఈ కాశీ శతకము మకుటములేని శతకరాజము.

రామచన్ద్ర శతకమ్ :

రామచంద్ర శతకము దాసు గారి సంస్కృత శతకములలో రెండవది. దీని లోని ' సమారబ్ధ వార్ధక .... .... .... .... .... ' అను మాటల వలన ఈ శతక రచన వార్ధక్యము నందు చేసినట్లు స్పష్టపడుచున్నది. దాసు గారు భక్తి జ్ఞాన వైరాగ్యములతో, తానొక అల్పుడనని తెల్పుకొనుచు, రామచంద్రుని రక్షింపు మనుచు, తన ఆవేదనను నివేదించుకొన్న తాత్పర్యము గల శతక మిది.

ఈ రామచంద్రశతకమునకు పీఠిక వ్రాయుచు బ్రహ్మశ్రీ అప్పల్ల సోమేశ్వర శర్మ గారు 'ఇందు రెండవ పద్యము నుండి పదమూడవ పద్యము వరకును భక్తుని అల్పత్వమును, శ్రీరామచంద్రుని మహిమయు, మనసుయొక్క చాంచల్యమును, మానవుని భ్రమ ప్రమాదాదులను, శ్రీరామచంద్రుని సర్వశరణ్యత్వమును ప్రస్తావనారూపమున విశదము లగును. పిదప అద్వైతతత్త్వమును, భక్తితత్త్వమును పడుగుపేకల వలె అల్లుకుపోయి చివరకు 'శ్రీరామాద్వైతము ' నవనీతసారముగ ప్రకాశించును.' అన్న వాక్యములు అష్టోత్తరశత భుజంగప్రయాత శ్లోక శోభిత మైన రామచంద్రశతక సారాంశములు.

సమస్తామర ప్రాంచిత స్తోత్ర పాత్ర
ప్రమత్తాసుర ప్రాణ వల్లీలవిత్ర
దయాసాంద్ర రాజేంద్ర సీతాకళత్ర
ప్రసీద ప్రసీద ప్రభో రామచన్ద్ర —శ్లో॥ 1

అను అంత్యప్రాస సూత్రముతో ' రామచంద్ర ' అను మకుటముతో ఈ శతక రూప స్తోత్ర మారంభమగును.

---

4. సంస్కృత కాశీశతక, రామచంద్రశతకములు బ్రాహ్మీభూషణ శ్రీ రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి గారిచే పద్యములుగా తెనుగు భాషలోనికి; డాక్టర్ పిశిపాటి సూర్యనారాయణ 'భాను' గారిచే హిందీభాషలోనికి అనువదింప బడినవి. ఈ రెండు అనువాదములు మూలము లందలి వాసిని వీస మంతైనను తొలగకుండ చేయుటచే బహుజన ప్రీతిపాత్రములైనవి.

బలం రోదనం బాలకానా మితి త్వం
విదన్మాం సమాశ్వాస యాతీవ మూఢమ్
విజానాసి నే త ప్త చేత స్త్వమేవ
ప్రసీద ప్రసీద ప్రభో రామచన్ద్ర —శ్లో॥ 4

ప్రమత్తారిషడ్వర్గ నిఘ్నం కృతఘ్నం
ప్రభూతావలేపం తతానేక పాపమ్
వృథా జీవితం యాపయ న్తం నితా న్తం
దయామ్భోనిధే పాహి మాం రామచన్ద్ర —శ్లో॥ 8

ప్రమ త్తములైన అరిషడ్వర్గములకు లొంగి, కృతఘ్నుడనై, గర్వమును పెంచు కొని, అనేక పాపములను చేసి, ఎల్లప్పుడు వృథాజీవితమున చరించుచున్న నన్ను దయాసాగరా! రామచంద్రా! కావుము.

అహం సర్వదా న్యాఙ్గ నాస క్తదృష్టి
ర్నమే విద్యతే ర్థార్జనే కాపి తుష్టిః
మమాతీవ సద్వఞ్చనాయాం ప్రహృష్టిః
ఖలో మత్సమః కః ప్రభో రామచన్ద్ర —శ్లో॥ 9

ప్రభూ! రామచంద్రా! చూపు లెపుడు అన్యాంగనాస క్తములు. అర్థ మెంత ఆర్జించి నను తుష్టి లేదు. మంచివారిని వంచించిన మనసునకు ఆనందము. మత్సము డయిన ఖలు దెవడున్నాడు?

మొదలగు విధములుగా తన అల్పత్వమును రామచంద్రునకు విన్నవించు కొనుచు రక్షింపుమని వేడుకొను రచన సాగును.

ఈ శతకమునందు దాసుగారు జ్ఞానమార్గముకన్న భ క్తిమార్గమునకే ప్రాధాన్య మిచ్చిరి.

భవద్భ క్తి సూత్రాణి శాణ్డిల్యమౌని
హితాయైవ సమ్ప్రోక్తవాన్ మానుషాణామ్
మతం తస్య లోకో త్తరం విశ్వసంస్త్వాం
భజే హం శరణ్యం ప్రభో రామచన్ద్ర —శ్లో॥ 102

రామచంద్రా! మానవ హితము గోరి శాండిల్యమౌని నిన్ను గూర్చి భక్తిసూత్ర ములు చెప్పినాడు. ఆ మతము లోకోత్తరమని విశ్వసింతును. నిన్నే నేను శర ణని భజింతును.

దాసు గారికి శాండిల్యముని వ్రాసిన భక్తి సూత్రములపై గల భక్తికి ఈ మాటలు నిదర్శనములు.

పుష్కలమగు భక్తి ముందు శుష్కతర్కము వ్యర్థమను భావమును 'అలం శుష్కవేదాంతశాస్త్ర ప్రలాపైః': 'అలం శుష్కతర్కేణ' అని మాటిమాటికి వెలి బుచ్చుచుందురు. ఈ శుష్కతర్కమును నిరసించుచు వ్రాసిన శ్లోక మొకటి—

నభః ఖండశో ముద్గరేణేవ భేత్తుం
పదార్థస్థితిం తర్కతో వేత్తు మీహే
అలం తత్త్వజిజ్ఞాసయా శూన్యదృష్ట్యా
భవద్భక్తిరేవాస్తు మే రామచన్ద్ర —శ్లో॥ 37

ముద్గరముతో నభమును ఖండించునట్లు, పదార్థ స్థితిని తర్కముతో వరయుట కష్టము. తత్త్వ మెరుగుటకు ఈ శూన్య తర్కదృష్టి అనవసరము. రామచంద్రా! నీ భక్తియే నాకు చాలును.

ఈ విధముగా దాసు గారు భక్తిమార్గమునకు ప్రాధాన్య మిచ్చి రామనామ స్మరణ చేయుచు ఈ క్రింది శ్లోకముతో ఈ శతకమును పూర్తి చేయుదురు.

ప్రభో రామచన్ద్ర ప్రభోరామచన్ద్ర
ప్రసీద ప్రసీద ప్రభోరామచన్ద్ర
ప్రభో రామచన్ద్ర ప్రభోరామచన్ద్ర
ప్రసీద ప్రసీద ప్రభోరామచన్ద్ర —శ్లో॥ 108

సూర్యనారాయణ శతకము:

'సూర్యనారాయణా' అను మకుటముతో నూటయొక్క మత్తేభ శార్దూలము లతో భక్తి ప్రధాన పరువలెత్తిన తెనుగు శతక మిది. సూర్యనారాయణ దేవునకు

దాసు గారికి ఒక విచిత్రమైన అనుబంధ మున్నది. దాసు గారికి తల్లిదండ్రులు పెట్టిన పేరు సూర్యనారాయణ. ఈ నామకరణమున కొక బలవత్తర కారణ మున్నది. దాసు గారి తండ్రి యగు వేంకట చయనులు గారు భాస్కరోపాసకులు. దాసు గారు పుట్టుటకు కించిత్పూర్వము వేంకటచయనులు గారు క్షయవ్యాధిగ్రస్తులై, సూర్యోపాసనచే ఆ వ్యాధిని పోగొట్టుకొనిరి. ఈ సంఘటన జరిగిన తరువాత పుట్టిన బిడ్డ దాసు గారు. అందువలన దాసు గారికి సూర్యనారాయణ యను పేరు వేంకటచయనులు గారు పెట్టుట జరిగినది. దాసు గారు కూడ వారి ప్రహ్లాదచరిత్ర హరికథను అరసవల్లి సూర్యనారాయణస్వామికి అంకిత మిచ్చినారు.

ఈ శతకము 1895—98 సంవత్సరముల మధ్యకాలము నందు చేసిన రచన. దాసు గారు ఈ శతక రచనాకాలమునాటికే మేటి హరికథకులుగా లోకప్రసిద్ధి వచ్చినట్లు—

నా నేరంబులునెంచి నీదు భజనానందంబజస్రంబునన్
బూనంజేసి సమస్తలోకులను సంతోషాంబుధిన్ ముంచు స
ద్గానోద్యత్కవితాప్రభావ మిడి నన్ గాపాడుచున్నావుగా
యే నీయప్పికనెట్లు తీర్చగల నో రీ ! సూర్యనారాయణా! —ప. 96

అను పద్యము వెల్లడించుచున్నది.

'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అను విశ్వాసము వలన సామాన్యముగా కవులు వ్యాధిగ్రస్తులైనపుడు రోగనివారణకై సూర్యస్తుతి చేయుచుండుట మయూ రాది కవుల వల్ల వెల్లడి యగు నంశము. దాసు గారు ఈ శతకము వ్రాయునాడు సంపూర్ణారోగ్య భాగ్యవంతులైనను దీనిని వ్రాసిరనిన, అది వారి భక్తికి నిదర్శనము.

ఈ శతకము నందు ప్రధానముగా కన్పడు నంశములు రెండు. స్వీయ లోపములను విన్నవించుకొని భగవంతుని శరణు వేడుకొనుట; 'మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అను పెద్దల సుద్దిని స్వీయ శాస్త్రావలోకనాను భవముచే సత్యమని నమ్మి చాటుట.

ఈ మాటలకు గీటురాళ్లుగా నున్న ఈ శతకము నందలి దాసు గారి ఛందపు మాటలు గొన్ని—

కట్టా మూర్ఖుఁడఁ దామసుండ దురహంకారుండ నజ్ఞుండ నే
నిట్టుల్చేనునఁబడ్డ గుడ్డి పశువ ట్లిద్దాని నాడెంబుఁగ
న్నెట్టంజాలక దేహయాత్ర గొనుచుంటిన్ మోహశోకంబులన్
బిట్టల్లాడుచు నెట్లు ప్రోచెదవా తండ్రీ! సూర్యనారాయణా!
—ప. 31

గ్రుడ్డి యెద్దు చేలో పడ్డట్లు యోగ్యమైన దేదో తెలిసికోలేక అజ్ఞానముతో దేహయాత్ర చేయుచు మోహశోకాలతో బిట్టల్లాడుట—

ఇమ్మాడ్కిన్ భవదీయ నామసుధఁ గ్రోలింపన్ సదాతుచ్ఛ భో
గమ్ముం జిత్తముగోరు, మోచకము వేడ్కన్ మేప శ్వానం బఖా
ద్యమ్ముం దబ్బున మెక్కనేఁగు నటు లిద్ధాత్రిం భళీ! నైజ ధ
ర్మమ్మున్ మానుపనేరిశక్యము మహాత్మా! సూర్యనారాయణా!
—ప. 54

కుక్కకు లడ్డు పెట్ట అది అశుద్ధము తినుటకు పోవునట్లు, భగవన్నామామృతమును గ్రోలక తుచ్ఛభోగమును చిత్తము కోరి సహజస్వభావము మార్చుకొనదనుట—

యుక్తాయుక్త మెఱింగియున్ విహితు లెన్నో మార్గ బోధించినన్
నక్తంబుం దినమున్ గృతాఘములకున్ సంతాపముంబొందియున్
భక్తిన్ నిన్భజించుచుండియును మానంజాల దుస్సంగ మా
సక్తిన్ నన్నిఁకనైనఁ బ్రోవు శ్రితరక్షా! సూర్యనారాయణా!
—ప. 41

మంచి చెడ్డ లేవియో తెలిసియు, హితులు బోధించుచున్నను రేయింబవళ్లు చేసిన పాపాలకు సంతాప మందుచు, పూజలు భక్తితో చేయుచు కూడ పాప విషయములపై ఆసక్తి వదలకుండుట—

నిష్కాపట్యము చెల్లబోదకట యీ నిర్భాగ్య చిత్తంబునన్
దుష్కార్యంబులలో నడంచి పయికెంతో నక్క నైచ్యంబులన్

శుష్కప్రేమయు శూన్యహస్తములు నెందున్ జూపకుండన్ మహా
నిష్కాధ్యక్షుతఁ బొందరాదు గద తండ్రీ! సూర్యనారాయణా!
—ప. 60

పాడు పనులు చేయుచు పైకి నక్కవినయాలు, శుష్కప్రియాలు శూన్య హస్తాలు చూపు చుండుట—

మొదలగు భావము లన్నియు దాసు గారి మనోజములైనను, సర్వమనుజ సహజ స్వభావ స్వరూపములే.

ఇక భగవంతుని గూర్చి, భక్తి మార్గ ప్రాధాన్యమును గూర్చి దాసు గారు వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయములు—

త్వద్దివ్యాంఘ్రి సరోజ భక్తియెడఁ దప్పన్ సర్వవేదంబులన్
ముద్దల్ నూఁత గ్రసించినన్ జనుఁడు తన్నుం దానెఱుంగఁ డహో
యద్దంబందునఁ దక్క గన్నుఁగవ స్వీయాకారముం జూచు నె
క్కెద్దేశంబుననైన నారయఁగఁదండ్రీ! సూర్యనారాయణా! —ప. 65

అద్దములో తప్ప తన ఆకారము ఇంకెక్కడను కనపడనట్లు, భగవత్పాద భక్తితో తప్ప వేదము లన్నింటిని నూరి మ్రింగినను జనుడు తన్ను తానెఱుగలేడట—

సరిగా వేదములెల్ల రువ్వియును శాస్త్రంబుల్ గడున్ గ్రోలియున్
గురుబోధల్ వినియున్ నిజానుభవమున్ శోధించియున్ మర్త్యుఁడె
ట్లెఱుఁగున్ నీదగు నిత్యతత్త్వమహహా యెండన్ గనంజాలునే
ధర నెందైనను గుడ్లగూబ పరమాత్మా! సూర్యనారాయణా!
—ప. 70

గుడ్లగూబ యెండను చూడలేనట్లు, వేదశాస్త్రాలు చదివినను, గురుబోధలు విన్నను, స్వీయానుభవమును శోధించినను పరమాత్ముని నిత్యతత్త్వము బోధపడదట—

స్థిరతన్ సాత్వికభక్తిమార్గమున నిన్ సేవింపఁగాలేని యా
నరుఁడెంతో జడుఁడైన శాస్త్రచణుఁడైనన్ లేదు కార్యం బహో
ధర నూహింపఁగ గ్రుడ్డికన్నెరచినన్ దా మూసికొన్నన్ సరే
చరితార్థం బిసుమంతయుం గలుగదీశా! సూర్యనారాయణా!

—ప. 77

గ్రుడ్డికన్ను తెరచినను మూసినను ఒకటేయైనట్లు, భక్తిలేనపుడు జడుడైనను, శాస్త్రచణుడైనను ఒకటే రీతిగ వ్యర్థులట —

ఇక దాసు గారి శైలి ఈ శతకము నందెట్లు తాండవించెనో అను నంశము పై దృష్టి మరలించినచో, ఈ శతకము నందలి ప్రతి పద్యము దాసు గారి శైలికి ఒక విదర్శన ప్రదర్శనమే. ఇప్పటివరకు ఉదాహృతములైన పద్యములు భావవ్యక్తీ కరణమునకు ఎంత ప్రాముఖ్యములో, శైలికి కూడ నంత ప్రాముఖ్యములే. ప్రతి పద్యము తెనుగు నుడికారము పొంగిపొరలుచున్న పాత్రయే, అయినను శైలి యను మిషతో రెండు మత్తేభవిక్రీడితములు—

వనజంబుల్కను విచ్చి చూడఁ గలువల్ వాఁడన్ దమంబూఁడ జె
ల్మిని జక్రంబులుగూడఁ దెమ్మెరకున్ లేదీ గెలల్లాడ వే
డ్కను నానావిధ పక్షి సంఘములు పాడ న్దాపసుల్ వేఁడ నీ
వనురాగంబునఁ దూర్పునం బొడమితయ్యా! సూర్యనారాయణా!

—ప. 4

ధనమా రాదు దురాశ పోదు పరతత్త్వజ్ఞానమా లేదు యౌ
వనమా నిత్యము కాదు వార్ధకమునన్ వామాక్షి యొఁజేదు జీ
వనమా యెన్నఁగఁబోదు దుఃఖములకున్ బల్మారటుల్ గావునన్
నిను నేఁగొల్తు నిఁకేల వాదు దయఁగన్మీ సూర్యనారాయణా!

—ప. 50

సూర్యభగవానుని దాసు గారు బాల్యము నుండి ఆరాధించుచున్నారని—

చిన్నప్డే నిను నమ్మికొంటి నిఁక నీచిత్తంబు నా భాగ్యమో
యన్నా! వేల్పులమిన్న! లోకములకన్నా! సూర్యనారాయణా!
—ప. 58

అను పద్యము వలన విద్యమాన మగుచున్న విషయము. దాసు గారికి సూర్యదేవుడు స్వప్నమున సాక్షాత్కరించినట్లు "కలలో నీదగు దర్శనంబిడి మహాకారుణ్యముం జూపి నా కలర న్నీదు ప్రసాద మిచ్చితివి.... .... .... .... ...." (ప – 39) అను పంక్తుల వలన తెలియుచున్న అంశము.

దాసు గారి శతక సప్తకములో రసిక జనుల రసనకు పరమాప్తమైన శతకము ఈ సూర్యనారాయణ శతకము.

మృత్యుంజయ శివశతకము :

దాసు గారితో హరికథలలో వంతపాట పాడి అందరిమన్ననలను అందుకొన్న అన్న పేరన్న. పేరన్న దాసు గారి నాలుగవ అన్న. పేరన్న దాసు గారి చెంత వంత పాట పాడినను సొంతగొంతుక లేనివాడు కాదు. పర్జన్యగర్జాగంభీరకంఠు లైన దాసు గారి గొంతుకతో వంత కలపకల్గుటయే పేరన్నగారి కంఠమాధుర్యము నకు కతపత్రము. దాసు గారు గజేంద్రమోక్షణ హరికథ బెంగుళూరులో రాజా వారి బంగళాలో చెప్పుచుండ తోడుపాట పాడిన ఈ పేరన్నగారి పాటను విని మైసూరు ప్రభువులు 'It lulls me to sleep' అని ప్రశంసించిరి. దాసు గారి సోదరులైన పేరన్నగారి గాత్ర సౌందర్యము కూడ దాసు గారి గాత్రసౌందర్యమునకు సౌదర్యమే.

ఈ పేరన్న అన్నగారికి 1908 లో ప్రాణసంకటమయిన జబ్బు చేయ, దాసు గారు కలవరము చెంది అన్నను బ్రతికింపుమని మృత్యుంజయుని ప్రార్థించుచు స్తుతించిన శతకము ఈ మృత్యుంజయ శివశతకము. ఇది 'శివా' అను మకుట లాంఛితము. దాసు గారి విశ్వాసబలమో లేక దైవసంకల్పబలమో కాని వైద్యులకు కూడ వశముకాక ఆశ వదలుకొన్న ఆ భయంకర రోగము తగ్గి పేరన్న గారికి ఆరోగ్యము చేకూరినది. ఇది శతక జనన కారణము.

ప్రాణ ప్రయాణ ప్రమాద పరిస్థితిలో నున్న సోదరుని బ్రతికింపుమని మృత్యుంజయుని ప్రార్థించు దాస ధోరణి యిది—

మృత్యుంజయుండవని నీక
నిత్యము శ్రుతి చాటుచుంట నిక్కంబేనిక
అత్యనుకూల చిరాయువు
సత్యంబుగ నీదు భక్తు జంట కిడు శివా! —ప. 18

శ్రుతిమతి గతి నేనెఱుఁగను
గతి నీవేయంచు నెటులొ కాన్పించెను నా
బ్రతుకున జంటం దోడు ని
రతముం గాపాడి మీఁది రక్తిఁగను శివా! —ప. 19

జోడుగఁ దోడుగ నీడగ
వేడుకతో శ్రుతుల నేళవించుచు నిన్నుం
బాడి కసిఁదీర్చుకొందుము
వేఁడెద మా జంటఁ బెంచు పెక్కేండ్లు శివా! —ప. 20

ఇట్లు ప్రార్థించుచు మధ్య పసిపిల్లవాని వలె 'మారాము' చేయుచు భగవంతు నిట్లు బెదిరించినారు—

నాకోర్కెఁదీర్చని యెడక
నాకుండిన వెఱ్ఱితెంపు నన్నున్ విను నే
వాకుం దెఱువను మూఁగటు
నీకీర్తనసొంపు లొరులు నేర్చుదురె? శివా! —ప. 25

మొదట సోదరునకు చిరాయువు నీయుమని కోరిన దాసు గారు, తరువాత 'రాజీపడి'—

నీ వెఱుఁగుదైన మాఘుఁడ
నే వెరవునఁ దెలుపుకొందు నీశుఁడవగుటన్
గావుము తోడలరన్ నే
జీవించిన వఱకుఁ జంటఁ జేపట్టు శివా! —పు. 28

అని వారు బ్రతికినంతకాలమైనను సోదరుని బ్రతికింపుమనిరి. తరువాత భగవంతుని నిర్బంధనము చేయుట తప్పదనుచున్నారు.

నీపాఱిపు చవి యెఱింగిన
నే పామరుఁడైనఁగాని యెట్టిల మఱచున్
గాపాడఁగ నిర్బంధనఁ
జేపట్టి నినుం జిరాకు సేయకయె శివా! — ప. 36

అన్నకు ఆయువు నొసగినచో నీచసుఖములను వీడి తన్నే పాడుచు జీవయాత్ర సాగింతుమని యనుచున్నారు.

ముజ్జగములఁ గల సంపద
గజ్జవలెం దలఁచి నీచ కామసుఖములన్
బొజ్జలదర నిన్ బాడెద
మజ్జరె మాయన్నఁ గావుమా యన్న శివా! — ప. 43

ఇట్లు ప్రార్థించుచు ఒక రాత్రిలో వ్రాసి ముగించిన శతకము యొక్క ముగింపు పద్య మిది—

శివ శివ శివ మృత్యుంజయ
భవ భవ భవ పాపదూర భక్తాధారా
కవగా మముఁ గాపాడుము
భువిలోఁ బెక్కేండ్లు మమ్ముఁ బోషించు శివా! — ప. 100

మానసిక శాంతి లేక ఒక్క రాత్రి వ్రాసిన శతక మగుటచేతనో యేమో కాని రెండు పద్యములలో (4, 81) 'వ, బ్ర' లకు ప్రాసపేయుట సంభవించినది.

మృత్యువును జయించిన మహత్తర శివశంకర శతకము ఈ మృత్యుంజయ శివ శతకము.

ముకుంద శతకము :

దాసు గారి తెనుగు శతకములలో ఈ ముకుంద శతకము ఒకటి. మృత్యుంజయ శివశతకము వలె ఈ శతకము కూడ కచ్చితముగా వంద కందముల శతకము. ఈ ముకుందశతకమున దాసుగా రుంచిన మకుటము 'నారాయణ ! కందళితానంద మూలకంద ముకుందా'. ఈ శతకమున గ్రహించిన పద్యము చిన్నదయిన కందము. ఇక మకుటమా 'ఒకటియునర' పాదము లాక్రమించుకొన్నటువంటిది. మిగిలిన రెండునర పాదాలలో చెప్పదలచుకొన్న భావము పట్టించవలెను. ఇంత శ్రమతో దాసు గారు వంద పద్యములను వ్రాసిరి.

ఇక ఈ శతకమునందున్న విషయము ప్రతి భగవత్సంబంధమైన శతకములో ప్రత్యక్షమగు భక్తుని శరణాగతియే.

రచనా విధాన సాక్షాత్కారమునకు కొన్ని ఉదాహరణములు—

కందము లర్పించెద మా
కంద రసానూన మధుర కవితాసుధ నీ
కందముగా నారాయణ!
కందళితానంద మూలకంద! ముకుందా! —ప. 1

అన్న పద్యము శతక ప్రారంభ పద్యము.

ముందెఱుఁగని మందుఁడ నా
చందముఁదలపోసి కష్టసమయములను నే
లందిమ్మా నారాయణ !
కందళితానంద మూలకంద ! ముకుందా ! —ప. 9

పందెము వేసెద భక్తుల
కుందప్పమ త్రొక్కి యొరలకున్ నిన్ దెలియం
గం దరమా నారాయణ
కందళితానంద మూలకంద ! ముకుందా ! —ప. 10

అనుచు రెండునరపాదాలలో భావమును బంధించి బాధింపక ఎంత చక్కగా వ్యక్తీకరించినారో:

ఔందముకు తర్కతత్త్వము
జెందింపక నిన్ను విశ్వసించు మతము నా
కందించుము... ... —ప. 53

అని తర్కతత్త్వమును నిరసించి విశ్వాసము కల్గు తత్త్వమును అనుగ్రహింపుమని అభ్యర్థించినారు.

అందియు నందని యటు న
న్నెందుకు మోసంబుజేసె దీశ్వర! సరిగా
ముందగపడు... ... —ప. 67

అని భగవంతుని నిలబెట్టి అడిగినారు.

ఎందుకు మముఁ గల్పించెద
వెందుకు మూఢత్వ మిచ్చి యేఁచెద పీపె
ట్రెందుకురా... ... ... —ప. 70

అని మొగమోటమిలేక ప్రశ్నించినారు.

నందెలియ కిట్లు నా మది
కందించెద వెద్దువుండు కాకికి నొగులా
యెందైనన్... ... —ప. 73

అని నీకేమియు పట్టదని భగవంతుని దెప్పినారు.

డెందమ్మున దుర్గర్వము
పొందించకు భూతదయను బొదలించుము నీ
ముందుంచుము... ... —ప. 93

పొందుగ నిన్నుం బాడుట
కుందప్ప మజెట్టె వృత్తిఁ గొల్పించకు న
నన్నుం దయతో... ... —ప. 94

అని వరములను కోరుకొనినారు. ఈ విధముగా వారు వారి భావములను ఈ చిన్న పద్యములందు కూడ చక్కగా వెలిబుచ్చి—

అందరు ధరియించుట కీ
కందము లాచంద్రతారకంబుగ మహిలో
నం దెలుపుము నారాయణ!
కందళితానంద మూలకంద! ముకుందా! —ప. 100

అను పద్యముతో శతకమును సమాప్తము చేసినారు.

ఈ శతక ప్రారంభము నందు—

శ్రీరామాంచిత పీనవక్ష సిత రాజీవాక్ష నిశ్శ్రేయసా
ధారా పాపవిదూర వేదమయ దైత్యధ్వాంత సూర్యోదయా
కారుణ్యామృత పూర చక్రధర భక్తప్రాణ సంరక్షణా!
పారావార గభీర భూతకర దేవా! సత్యనారాయణా!

అను నొక శార్దూల విక్రీడిత వృత్తముండుట, సత్యనారాయణస్వామి సంబోధక మగుట వింత విషయము.

దాసు గారి భావవ్యక్తీకరణాధికారమునకు ముందు ఛందము దాసీచందము అని తెలుపు శతకము ఈ ముకుంద శతకము.

సత్యవ్రత శతకము :

దాసు గారి తెనుగు శతకములలో ఈ సత్యవ్రత శతక మొకటి. మృత్యుంజయ శివశతకము, ముకుందశతకముల వలె నిది కూడ వందకందముల శతకము.

విజయనగర ప్రభువైన ఆనందగజపతి ఒకనాటి ఇష్టాగోష్ఠిలో దాసు గారికి 'సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్' అను సమస్య నిచ్చి పూరింపుమన, అసాధారణాశుధారతో దాసు గారు నూరువిధాల పూర్తిచేసిరట. ఆ నూరువిధాల పూరణములే యీ సత్యవ్రత శతకము.

ఆశువుగా నూరు పద్యములు చెప్పుటే చోద్యవిద్య. ఇక ఒక సమస్యను, పైగా పాదమాక్రమించుకొన్న సమస్యను, నూరువిధాల ఆశువుగా, భావావృత్తి లేకుండగ, పదావృత్తి లేకుండగ, పండితుని యెదుట రంజించునటుల చెప్పుట యెంతటి అసామాన్య మాన్యకార్యమో వేరుగా చెప్పబనిలేదు.

హితమిత వాక్సంతతికిన్
దతభూత దయానురతికి ధైర్యోన్నతికిన్
జతుర మనీషాగతికిన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ —ప. 1

అనునది దాసు గారి ప్రథమ పూరణము.

అతుల ధనాఢ్యునికన్నన్
శ్రుతిస్మృతి విచారచతుర సూరులకన్నన్
బ్రతుకు మజావ్వనికన్నన్
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ — ప. 9

బ్రతుకున సుంకం బెరుఁగక
స్వతంత్రరాజ్యంబుచేయు ప్రభువలెను బతి
వ్రతవలె సహజకవివలెన్
సతతము.... .... .... — ప. 15

బ్రతికిన వఱకున్ సర్వము
గతి విషమటు కల్ల వెడలఁగ్రక్కుచు నిజమున్
రతనముదాఁచు కుమతి చెడ
సతతము.... .... .... —ప. 19

అతికిన బూడిద పట్టెలు
నుతికిన మడిపొత్తు పంచె లురవడిమున్కల్
క్షితి సూనృతమున రావన
సతతము.... .... .... —ప. 79

మతదంభముతోఁ బ్రాకాం
కితముల కాల్పులను హోమకృత పశుకోటుల్
క్షితి సూనృతఫల మొసఁగవు
సతతము.... .... .... —ప. 97

క్షితిపతులయొద్దఁ గొండెము
లతకుచుఁ దన యోర్వలేమి సనృత మనెడు దు
ర్మతి నిందెంబడి చెడునన
సతతము.... .... .... —ప. 77

అను పూరణ పద్యములు దాసు గారి నూరు పూరణముల నుండి వెతుకకుండ తీసి వ్రాసినవి. వీనిలో నెక్కడను పదావృత్తి గాని, భావావృత్తి గాని మచ్చునకు కూడ కన్పడదు కదా. అంతేకాక ఈ పూరణములలో ఎన్ని రకముల విమర్శలు చోటు చేసికొన్నవో!

నూరవ పూరణ మందు, ఈ సమస్య నిచ్చిన ఆనందగజపతికి చమత్కారముగా అంకితము ముడిపేయబడినది. ఆ పద్య మిది—

చతురకళా విద్యా సం
గతికిన్ స్థిరధృతికిఁ బ్రకట కరుణామతికి

కృతి యానందగజపతికి
సతతము సంతసమెసంగు సత్యవ్రతికిన్ —ప. 100

ఏకసమస్యాపూరణములు శతవిధాలుగా నున్న ఏకైకాంధ్ర శతకము ఈ సత్యవ్రత శతకము.

వేల్పువంద :

వేల్పువంద దాసు గారు వ్రాసిన ఒకే ఒక నాటు తెనుగు శతకము. వేల్పువంద యన స్వామి శతకము. ఈ శతకము నందలి స్వామి సింహాచలముపై నున్న నృసింహస్వామి. ఈ సీసపద్యముల శతకమునకు మకుటము 'రెంట త్రాగుడు తిండి మెట్టంటు వేల్పు!'.

రెంటత్రాగుడు – ద్విపము (ఏనుగు) ; రెంటత్రాగుడు తిండి – ఏనుగును తిను సింహము ; మెట్ట – కొండ (అచలము) ; అంటువేల్పు – ఉన్నస్వామి. రెంట త్రాగుడు తిండి మెట్టంటువేల్పు – సింహాచలస్వామి.

ఈ వేల్పువంద యందు ప్రసరించున వన్నియు తెలుగు వెలుగులే. బాస – తెలుగుసీమపలుకులు ; వేల్పు – తెలుగునేలపై మొలిచి నిలిచిన అప్పాలసామి ; ఛందము – తెలుగు కలాలు మూస పోసిన సీసము ; కవి – తెలుగు పుడమి కడుపున పొడమిన కొడుకు.

'తొలి చదువులె నిన్నుఁ దెలియక మళ్లి న నాటుమాటల నిను న్నాటఁదరమ' (ప. 2) అని వినయముతో ఈ వేల్పును నుతించుట ప్రారంభించినారు.

ఎలనాఁగమీఁదనే యెప్పట్ల నాకన్న
పైవారి యిడుమ నాఁబ్రతుకు జున్న
కొంకక తిని త్రాగి కొవ్వుట నాపని
యేల్కలతోడ నా కెందున నని
నను నేఁబొగడుకొంట నాపుట్టువు తెగులు
లాఁతి గొప్పకు నాతలంపు రగులు

ఎల్లరికన్న నేనే యెక్కువనుకొందు
నే సిగ్గెడసి తెగ నీల్గుచుందు
ముదిసిన కొలంది గొడవలన్ మున్గుచుంటి
నెందుకున్నన్కిరాక యేనిట్టు లుంటి
తెమల నీ తగులమిఁక వలమురి తాల్ప!
రెంటఁ ద్రాగుడు తిండి మెట్టంటు వేల్ప! —ప. 8

పరకాంతలపై మనసుపడుట, పైవారి కష్టములకు సంబరపడుట, తిని త్రాగి మదించి తిరుగుట, లౌకిక ప్రభువులను వదలకుండుట, తన్ను తాను పొగడుకొనుట, ఇతరుల గొప్పలకు వెతచెందుట, అందరికన్న తానే గొప్పయనుకొనుట, సిగ్గులేక నీలుగుచుండుట—

మంగలిచీలితలంగొఱ్ఱు నక్కలు
నుబుసుపోవని పని కుబుకుచుంటేఁ

గొఱగానివాఁడ నం చెఱిఁగియు నెఱుఁగక
గొంతెమకోరికల్ గొనుచు నుంటి

నోరువలేక పైవారిగొప్పకుఁ బెద
వులు విర్చి పెంకెమాట లనుచుంటేఁ

గొలువులన్ దగవరి వలె వాలకము వేసి
వడిఁగాని కూళ్లఁ గుడుచుచుంటి

లాఁతి మెప్పులకిటు వ్రాఁతల దొరకొంటి
సెబ్బరన్ దాఁచి నామంచి చెప్పుకొంటి
నన్న యెటులేలెదో నన్నుఁ దిన్నఁబఱిచి
రెంటఁ ద్రాగుడు తిండి మెట్టంటు వేల్ప! —ప. 37

పనిలేని మంగలి పిల్లి తల గొరిగినట్లు పనికిమాలిన పనులు చేయుచుండుట, పనికిరాని వాడనని తెలిసికూడ గొంతెమ్మ కోరికలు కోరుచుండుట, ఇతరుల గొప్ప సహింపలేక పెంకెమాట లనుట, సభలలో పెద్ద న్యాయవేత్త వలె వాలకము వేసి

అడ్డమైన గడ్డిని తినుచుండుట, ఇతరుల మెప్పులకొరకు వ్రాయుచుండుట, చెడు చెప్పక, తన మంచినే చెప్పుకొనుచుండుట అను భావములను దాసు గారు మాట వరుసకు తమ కాపాదించుకొనిరి గాని అందు సర్వమానవ మానసిక దౌర్బల్యము లనే సూచించినారు.

ఎవరికిని లొంగక హాయిగా బ్రతుక గలిగిన, ఈ సృష్టిని తోచినట్లు వర్ణింప గలిగిన, కూడు కూటమి కూరుకుల విషయమున స్వేచ్ఛగా నడువగలిగిన, కష్ట సుఖములందు ధైర్యముగా నుండకలిగిన, అన్నిటను నిండి విహరింపకలిగిన తనకు భగవంతునకు భేదము లేదని చెప్పుచున్న పద్య మిది—

ఎరికిన్ లొంగక కోరినట్లెల్ల హా
యిగ నన్నయము నే మనఁగలనేని

యీ నింగి నేలల నీపగ లీమాపు
నా తోఁచినట్లు పన్నఁగలనేని

కూడు కూటమి కూరుకులపట్ల నాకుఁ గా
వలసినటుల నడువఁగలనేని

కలిమిలేముల వేడుకల నిడుములఁగూడ
నే పాలివోవక నిల్తునేని

ఎందునన్ నిండి నేనాడుకొందు నేనిఁ
గ్రిందుమీఁదులఁ గ్రిక్కిర్సియుందునేని
నీవె నేనయి యలరనా? నిక్కువముగ
రెంటఁ దాగుడు తిండి మెట్టంటు వేల్పు! —ప. 41

ఇన్ని కోరికలతో తానున్నను, భగవంతుడు తన కేమియు నీయలేదని పడుచున్న బాధను తెలుపు పద్యము—

ఏసుపుతప్ప నాకేదియు నోజగా
నానేనితోడుత నగ్గలేదు
నా యొడ లద్దిగా నాకద్దె కొంప యీ
యెఱుకువ గూడ నా కెరవు తోడువు
నా మొదలున్ దుద నాకూఱ్క ముచ్చట
నే నెఱ్ఱఁజెప్పలే రెవ్వరైనఁ
జిమ్మచీఁకటిలోనఁ జిందురాడుచు నుంటెఁ
దెలిసిన యటు తలన్ ద్రిప్పుచుంటి

అకట యీ తెల్వి తెలివికాదిఁక నికముగ
నమ్మికన్ నన్ను నిన్గొల్వనిమ్ము తండ్రి!
కలవరంబుల నిల్ప! చుట్టలుఁగుదాల్ప!
రెంట్రతాగుడు తిండి మెట్టంటువేల్ప! —ప. 44

ఏసుపుతప్ప యొడలితో నింకేమియు నీయలేదట, ఆ యొడలు కూడ అద్దె కొంప యట, జనన మరణాది విషయములను గూర్చి స్పష్టముగ నెవరును జెప్పలేదట, చీకటిలో చిందులు త్రొక్కుచు అన్నియు తెలిసినట్లు తల త్రిప్పుచుండెనట, కనుక ఈ తెల్వి తెల్వి కాదు. అని భగవంతునిపై విశ్వాసము నిమ్మని కోరుకొనినారు.

వండి యెదిరికి నన్వడ్డించు మన్నాఁడ
వంగదన్వోఁగు నా కుంగడీవు
జోలలన్ గంటులన్ జోగొట్టు మన్నాఁడ
వేయెడ నన్ గను మాయనీవు
లాఁతి డప్పిన్దీర్చ్చ మేతత్ నన్నాఁడ
వుడికెడు నా నోరు తడుపనీవు
దుస్తు సూడులకు నన్దోఁడిగించు మన్నాఁడ
వెప్పట్ల గుడ్డ నన్ గప్పనీవు

పులుసులోని గంటెవలెనన్ సలిపినావు
బ్రతుకు చవి తోలమైన నన్నడయనీవు
నన్ను నేడ్పింప నిటు పన్నినాఁడ వేల ?
రెంటఁ ద్రాగుడు తిండి మెట్టింటు వేల్పు ! —ప. 54

ఓ భగవంతుడా ! వండి యితరులకు వడ్డించుమన్నావు. ఆకలితో నున్న నాకు ఉంగడి కూడ నీయవు. జోలలతో పగలతో జోగొట్టుమన్నావు. నన్ను కన్ను మూయనీవు. ఇతరుల డప్పిని ఏ సమయములో నైనను దీర్చుమన్నావు. ఉడికెడు నీరు మాత్రము తడుపనీవు. శత్రువులకు దుస్తులు తొడిగించుమన్నావు. నాకు కప్పుకొనుటకు కూడ గుడ్డ నీయవు. పులుసులోని గంటెవలె బ్రతుకు రుచి కొంచెము కూడ నన్ను పొందనీయవు. నన్ను ఇట్లు ఏడ్పించుటకు పుట్టించినావా ! అను భావములు దాసు గారు వారేమాత్రము సుఖపడకుండ వారి జీవిత మంతయు లోకానందమున కెట్లు వినియోగించిరో వివరించుచున్నవి.

ఎది నాకు లెస్సయో యేనెఱుంగఁగ్గోనఁ
గోరని కోర్కెసంగుము నెనరున —ప. 100

అని అన్నది దాసు గారు శతకాంతమున అప్పాలసామిని కోరుకొన్న వరము.

ఈ ముది యీడున నీ నాటుమాటలఁ
బల్కించినాఁడవు బళిర ! —ప. 52

అను చరణము వలన దాసు గారు ఈ శతక రచన చేసినది పండిన వయస్సులో.

ఇది సింహాద్రి అప్పన్నకు నైవేద్యమైన ' పల్కు పానకపు శతకము '.

శతకములు కవుల ఆదర్శములను ప్రతిబింబించు ఆదర్శకములు, ఆత్మాశ్రయ కవిత్వమునకు ఆశ్రయములు. ఈ లక్షణము దాసు గారి శతక సప్తకమునకు కూడ శతశాతసమగ్రముగ సమన్వయమగు లక్షణము.

## ప్రబంధములు :

దాసు గారు వ్రాసిన ప్రబంధములు నాలుగు—1. బాటసారి 2. Traveller 3. మేలుబంతి, 4. తారకమ్. ఈ నాలుగు ప్రబంధములు నాలుగు విధముల ప్రబంధములు. బాటసారి పద్యప్రబంధము. Traveller బాటసారి ప్రబంధము నకు ఆంగ్లానువాదమైన ప్రబంధము. మేలుబంతి చాటుపద్య సంకలన ప్రబంధము. తారకమ్ సంస్కృత ప్రబంధము. మేలుబంతి సంకలనగ్రంథ మగుటచేత ఇతి వృత్త ప్రసక్తి యుండదు. బాటసారి ప్రబంధమునకు ఆంగ్లపరివర్తన మగుటచే, Traveller గ్రంథములో స్వతంత్రేతివృత్త ప్రసక్తి యుండదు. ఇక మిగిలిన ప్రబంధములు బాటసారి, తారకమ్. ఈ రెంటి యందలి ఇతివృత్తము దాసు గారి సొంతమే. అనగా దాసు గారు ప్రబంధ కథలను ఇతరులనుండి గ్రహింపలేదు. అందువలననే ఈ ప్రబంధములు స్వతంత్ర గ్రంథములైనవి.

### బాటసారి :

బాటసారి నూటతొంబదియైదు పద్యముల నిర్వచన ప్రబంధము. 'ఈ బాట సారిన్జేసి యాడుచుఁబాడుచు నైలుగువారలకు నే వినిపింప మొదలిడినపుడు నా యీ డిరువదినాలుగేండ్లు [5] అను వాక్యము వలన ఈ గ్రంథమును దాసు గారు తమ ఇరువదినాలుగవ యేట వ్రాసినట్లు స్పష్టము. అనగా దాసు గారు దీనిని రచించినది 1888 లో. ఈ పద్య ప్రబంధము మద్రాసు నగరమున ప్రముఖ న్యాయవాది అయిన శ్రీ పనప్పాకము ఆనందాచార్యులుగారికి అంకితము. ఈ ఆనందాచార్యులు గారు National Congress President, Fellow of the Madras University Member of the Legislative Council, మొదలగు గొప్ప గొప్ప పదవులను అలంకరించిన ప్రసిద్ధులు. ఆచార్యులుగారు అట్లు లౌకిక ప్రపంచవ్యవహారములలో మునిగి తేలుచు గూడ సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో మంచి వైదుష్యమును గడించినారు. లోకము వారి కిచ్చిన 'విద్యావినోది' అను బిరుదము వారి సాహిత్య ప్రీతికి నిదర్శనము. దాసు గారి హరికథను విని పరవశించి వీరు ఆంగ్లపత్రికలో ప్రశంసించుచు నొక మంచి వ్యాసమును వ్రాసిరి. [6] దాసు గారి ప్రతిభకు దాసోఽహ మని, దాసు గారి పాదములను బట్టుకొని 'మీ వంటి పండితుని నే జూడలేదు.

5. బాటసారికి గూఢార్థము — బాటసారి
6. జీవిత రేఖలు. పు. – 19

నాయొద్ద మీరున్నయెడ నెలకొక వంద చొప్పున నిచ్చెదను. ఒక సంవత్సరము జీతము ముందుగ మీకిచ్చెదను. నా కోర్కె తీర్చి నా చెంగట మీరుండునట్లుగ ఖరారు చేసిన దప్ప మీపాదములు విడువను '[7] అని పట్టుపట్టిన ప్రతిభా పక్ష పాతులు.

కథాసారము :

ఒక బాటసారి భార్యాపుత్రులతో ఓడమీద ప్రయాణము చేయుచుండగా, ఓడ కొండకు తగిలి భిన్నమగును. వారు ఛిన్నాభిన్నమై ఎవరికి వారు ఎటో సముద్ర ములో కొట్టుకు పోవుదురు. బాటసారి యెట్లో యొక యొడ్డును పట్టి యొంటరియై, భార్యాపుత్రులను గూర్చి కొంతతడవు శోకించి, ఒక కొండప్రక్క గల సెలయేటి యొడ్డున రేయి వడుదాక నిద్రించును. చంద్రోదయముకాగానే లేచి భార్యాపుత్రుల కొరకు యేటియొడ్డున పులుగు మూల్గులు, బెబ్బులి బొబ్బరింతలు వినుచు అడవిలో నడిరేయిదాక నడిచి ఒక సూదికొండను చేరుకొనును. అక్కడ ప్రొద్దుపొడుచు వరకు సొమ్మసిలి లేచి, కొండకవతలికి చేరు ఒక లోయ వెంట పోయి ఒక చెరు వును చేరి, ఆ తటాకమున స్నానము చేసి, సూర్యున కర్ఘ్య మిచ్చి, అక్కడ దొరకిన దుంపలను నమలి, తీయని నీరు త్రాగి ఒక గన్నుచెట్టు నీడను కూర్చుం డును. అంతలో అక్కడకు నీరు త్రాగుటకు వచ్చిన ఏనుగుల గుంపును జూచి ఒక మఱ్ఱిచెట్టు కొన నెక్కును. ఆ చెట్టుపైనుండి ఒక ఉన్నతాలయము జూచి సంతోషముతో క్రిందికి దిగి ఒక మేటి పూదోటను జూచి ఆనందించి రేయివడిన వేళకు ఏడంతరవుల ఇరువది యెనిమిది గదులు గల ఆ దివ్యభవన సమీపమునకు చేరి లోనికి ప్రవేశించి అచటి వింతలకు అచ్చెరువందు చుండును. ఇంతలో ఒక గంట కంగుమని మ్రోగును. మేడలో వింత వెలుగులు తోచును. అంతలో నొక పాదుసాహి చెలువలు కొలువగ స్నానమాడి, దైవప్రార్థన చేసి, ఉన్నట్లుండి—

పలుకులెవ్వియు లేక ప్రమాన్పడినవాని
నార్తి మూర్తీభవించిన యట్లున్న
దిన్నమొలవాని మిక్కిలి డస్సియున్న —ప. 48

ఈ బాటసారిని చూచి ఆశ్చర్యము చెంది ' ఓరీ ! నీ వెవ్వడవు ? ఏ తీరున ఈ మిద్దెను చొర గల్గినాడవు ? కంట తడి పెట్టెదవేల ? నీ యూరు పేరు విన వేడుకగు

7. నాయకుడు, పు. 181

చున్నది. తెల్పుము ' అని దువ్వలువ నొసగగ, బాటసారి తన విషాదగాథను వివరించును. ఇతని గాథకు ప్రభువు జాలిపడి 'నీవలె నీ వారు కూడ బ్రతికిరేమొ. ముందు మేలు జరుగవచ్చును' అని యోదార్చి బాటసారికి వసతుల నేర్పాటు చేసి వెడలును. బాటసారి వెన్నెలలో వేడ్క నోలలాడు స్త్రీలను జూచి ఆనందించియు భార్యాపుత్రులు గుర్తుకురాగా బాధ పడును. మరునాడు పాదుసాహి గుఱ్ఱముపై వేటకు బయలుదేరి, బాటసారికి గూడ నొక గుఱ్ఱము చూపించి వేటకు రమ్మని తీసికొని వెళ్లను. వారు ఈటె, బల్లెము, తుపాకి, బాకులతో, జాగిలము సహాయముతో కొమ్ము పందిని, పులిని వేటాడుదురు. బాటసారి వేట నైపుణ్యమునకు ప్రభువు పరవశమై అతనిని తనయొద్దనే యుండుమని యనును. తరువాత ప్రభువు బాటసారికి తన పట్టణమును పరికింపుమని యనును. బాటసారి ఆ నగరవైభవమును చూచియు భార్యాపుత్రులపై దిగులు వలన సంతసింపలేక, ఒకనాడు రాజు చెంతకేగి

అకటా! రోగికి విందొనర్చునటులే వందించు భాగ్యంబు రి
త్తకదా చెల్వను బాసి నేటి వలవంతన్గుందు నీ సంగడీ
నికి రాజోత్తమ! యార్త బాంధవుఁడవౌ నీ ప్రాపు పోనాడి నే
నిక నెందేఁగుదు? నాలుబిడ్డల మఱేనే తీరునన్ జూచెదన్?

—ప. 87

అని తన బాధను చెప్పుకొనును. అంత ప్రభువు 'నీవింక బాధపడ పనిలేదు. నీ కొక మేలుమాట చెప్పెదను. నీవారిని వెదకుటకు నేను పంపిన బంట్లు ఇప్పుడే తిరిగి వచ్చి, నీ పడతియు నీ పిల్లవాడు బ్రతికియున్నారని చెప్పినారు.' అని యన, బాటసారి వ్యాఖ్య కసాధ్యమైన మహానంద మొందును. అంతలో నాగక రాజు 'నీ మగువ గంటకంబముపై యెద్దియో వ్రాసినట్లు కూడ తెలిసినది.' అని చెప్పి బాటసారిని ఆ ప్రదేశమునకు తీసికొని వెళ్లను. ఆ వ్రాతలను చదివి, అక్కడి వారు చెప్పిన గుర్తులనుబట్టి, వ్రాసిన స్త్రీ తన భార్యయే యని నిర్ణయించుకొని కొండతెరగున పొంగియు, తన క్షేమవార్త తన భార్యకు తెలియదు గదా అని మరల దుఃఖించును.

ప్రభువు అతనిని బుజ్జగించి కొంతతడవు వేడుకలతో గడిపి యొంటిగా నొక పూవుతోటలోనికి తీసికొని వెళ్లి ఇట్లు అనును.

'కనదగిన వింతశాస్త్రము జతపడినపుడు తత్త్వజ్ఞుడు పొంగునట్లు నిన్ను గన్నది మొదలు నేను గూడ నట్లు పొంగుచున్నాను. మా వంగడపు విషయములు నీకు కొన్ని చెప్పెదను. ఆ యెదురుగా వచ్చెడువాడు నా అన్నకొడుకు. నన్ను తండ్రికన్న ఎక్కువగా జూచును. మా అన్న రాజ్యమును కొంతకాల మేలి నాకిచ్చెను. నేను ఈ అన్న కొడుకున కిచ్చెదను. ఇతడు నా కొడుకున కిచ్చును. ఇది మా వంగడపు పాడి. మఱియొక విషయమేమన, నీ భార్య యున్న నగరము నకు రాజు ఈ కుఱ్ఱవాని మేనమామ. కాని మా పద్ధతులు అతనికి నచ్చక మాతో జగడము పెట్టుకొనినాడు. అతనికి ఒక పుత్రిక యున్నది. ఈ కుఱ్ఱవానికి ఆ అమ్మా యికి జత గూర్చుటకు మా మనస్పర్థలె అడ్డుగోడలైనవి. వీరిరువురు ఒకరినొకరు గాఢముగా ప్రేమించుచున్నారు. ఈ కుఱ్ఱవాడు నిద్రాహారములు మాని తన మర దలను గూర్చి ఆలోచించుచున్నాడు. ఆ మరదలు కూడ బావను తప్ప మరెవ్వరిని కట్టుకొనననని పట్టుపట్టినది. మా అన్న కొడుకు ఆ నగరమునకు ఒంటిగా నరుగ దలచుచున్నాడు. మా అన్న వీనిని నాకప్పగించినాడు. నేను నీ కప్పగించుచున్నాను. మీ రిరువురు ఆ నగరమును చేరి మీ స్త్రీలను గూడి సుఖముగా రండు. మీరు వచ్చినవెంటనే నారాజ్యము నా అన్నకొడుకున కిచ్చెదను. మనము ఆత్మారాము లమై వనమున కేగుదము.'

అని బాటసారిని, రాకుమారుని రాజు ఓడ రేవు వరకు వచ్చి సాగనంపును. రాకుమారి వ్రాసిన వలపుజాబును రాకుమారుడు బాటసారికి చదివి వినిపించి చింతించు చుండును. బాటసారి రాకుమారుని ఓదార్చి గడియారము పన్నెండు పేసెనని ఆతనిని నిద్రపుచ్చి, తాను భార్యాపుత్రులను గూర్చి ఆలోచించుచుండును. తెల్లవారుసరికి ఓడ నగరము చేరును. వారు ఒడ్డునకు రాగానే, మరదలైన రాకుమారి చెలికత్తెలచే ఉంగరమును గుర్తుగా పంపి తన బావను పూదోట మేడలో దిగుమని కబురు పెట్టును. చెలికత్తెలు రాకుమారికి ఇతనిపై గల ప్రేమను వివరించి, రాకుమారునకు వేడ్క లన్నియు జరుపుచుందురు. రాకుమారునకు వసతు లన్నియు చక్కగా జరుగు చున్నందులకు బాటసారి సంతసించుచునే భార్యాపుత్రులు గుర్తుకు వచ్చి బాధపడు చుండ రాకుమారు డోదార్చును. ఇంతలో ఆకసమున మబ్బులు క్రమ్మి వాన కురి యును. ఇంతలో వారున్న మేడదరికి ఒక్క బాలుని రొమ్మున గదించి యొకతె వచ్చును. ఆ స్త్రీని తన దాదిగా, ఆ బాలుని కొడుకుగా బాటసారి గుర్తుపట్టి ఆమె చెంత కేగును. ఆ స్త్రీ గూడ బాటసారిని గుర్తుపట్టి 'అయ్యా! ఇచటి రాచ

కూతురు మా మొఱ విని మమ్ము పెంచుచున్నది. నీ పడతి నిన్ను వెదకి వెదకి విసిగి చితిలో పడి చత్తునని నేడు గట్టిపట్టు పట్టినది. నీ యింతి వంత యెంతని చెప్పగలను? నేను ఈ పిల్లవానికి చల్ది యిడుచు ఇచట తిరుగుచుండగా నింతలో వాన రాగా బిరబిర ఈ మేడ చెంతకు వచ్చినాను. మా నోము పంటవలె నీవు కనపడినావు' అని చెప్పును. బాటసారి ఆశ్చర్యానందములతో తన మేలును తన భార్యకు తెలుపుమని కుఱ్ఱవాని నెత్తుకుని ముద్దాడి తన బాలుని రాచకుమారుని కిచ్చి—

మునుపు నీటిలోన మున్గి యూపిరి యాడ
కున్న మాడ్కి నిడుమ లొందుచుంటి
ఇపుడు పైకిఁ దేలిన పగిది మీ ప్రాపు
వలన మించి మంచి బ్రతుకు గంటి — ప. 176

అని సంతసించుచుండగా, బాటసారి భార్య వచ్చుచుండుట గమనించి రాకుమారుడు ప్రక్కకు వెళ్లను. వెల్గును వెన్కాను చందమామ చందమున తన యిల్లాలు దానిని ముందిడుకొని రాగా బాటసారికి కనుల పండువయ్యెను. ఆనందముతో ఆ యాలుమగలు కౌగలించుకొని ముచ్చటించుకొని, వెనుకటి వంతల గోల యేల? మనకు హాయి నందించిన రాకొడుకిడుగో అని చూపించి వానిని చేరుదురు. రాకుమారుడు కూడ పరమానందముతో 'మామను చూచితిని. తన కూతును నా కిచ్చుటకు నొడబడినాడు. అంతేకాక పెండ్లి మన నగరములో చేసికొనుటకు కూడ నంగీకరించినాడు' అని శుభవార్త చెప్పును. ఇంతలో రాకుమారి 'దివ్వెల యందునఁ దనరు మేటి తెలి మతాబు వలె' పెండ్లికూతురు హొయలతో వచ్చును. ఇట్లు బాటసారి భార్యాపుత్రులతో, రాకుమారుడు ప్రేయసితో సంతోషసాగరములో నోలలాడుచు సాగరమును తరించి స్వనగరము చేరుదురు. ప్రభువు నవదంపతులను, పునర్నవ దంపతులను జూచి సంతసించును. ఇది కథాసారము.

దాసు గారే ఈ గ్రంథ రచనా లక్ష్యమును పీఠికలో ఆంగ్లము నందు వివరించినారు—

'The story embodied in this book is an allegory of human life which begins in sheer ignorance and ends in perfect knowledge. In writing this small poetical work my main object had been to present to the Telugu reading public an attempt at some

thing original as to plot, coupled with vividness of natural descriptions told in easy Telugu devoid of all the artificialities of the usual ornate style. This system, I venture to hope, would be acceptable to cultured readers whose tastes have been mellowed by the ever-advancing modern literature of the West.' [8]

ఈ వాక్యములు తెలుపు బాటసారి గ్రంథ రచనలో గల దాసు గారి ప్రధానాశయము లివి—

1. ఇది పాశ్చాత్య ప్రపంచములో ప్రసిద్ధి చెందిన Allegory అను ప్రక్రియకు చెందిన రచన.

2. దీనిలో నున్నది మూలచ్ఛాయలేని క్రొత్త ఇతివృత్తము.

3. కృత్రిమత్వములేని సరళ సుందరమైన తెనుగు భాషలో ప్రకృతిదృశ్యముల వర్ణనము.

పైకి కన్పడు సామాన్యార్థముతోపాటు మఱియొక గూఢార్థమును గూడ అందించకల రచన Allegory. ఇది ద్వ్యర్థికావ్య జాతికి చెందదు. ద్వ్యర్థి కావ్యములో ప్రతి పదము రెండవ అర్థమును బోధించి తీరవలెను. Allegory లో ప్రతి పదము బోధింప నవసరము లేదు. కాని ప్రతి సన్నివేశము, ప్రతి ప్రధాన కథాంశము, ప్రతి పాత్ర, ప్రతి దృశ్యము సామాన్యార్థముతోపాటు గూఢార్థ బోధక సమర్థకము కావలెను. ఈ గూఢార్థము ద్వ్యర్థి కావ్యములో ద్వితీయార్థమైన వాచ్యార్థము వంటిది కాదు. రసవత్కావ్యాలలో దర్శనమిచ్చు అర్థాంతరము వంటిది అంతకంటె కాదు. రసవత్కావ్యాలలో అర్థాంతరము గ్రంథాదినుండి గ్రంథాతము వరకు వ్యాపింపదు. Allegory లో కథాది నుండి కథాంతము దాక అర్థాంతరము వ్యాపించి తీరవలెను. ప్రతిపదార్థములతో బోధించు సామాన్యకథతోపాటు మఱియొక పరమార్థమును గూడ సాధించు రచన Allegory అని తాత్పర్యము.

గూఢార్థము ప్రతి పాఠకునకు నందుబాటులో నుండు నంశము కాదు. కవి శక్తిసామర్థ్యములను కొలవగల పాఠకునకు మాత్రమే కొఱుకుడుపడు నంశము. ఈ కష్టము పడలేక పాఠకులు తమ శక్తిని గ్రహింపలేరేమో యను భయముచేత

8. Author's Preface – బాటసారి

దాసు గారే ఈ బాటసారి గ్రంథములో వారు నిక్షిప్తము చేసిన గూఢార్థమును ఇట్లు బహిరంగ పఱిచిరి.

'బాటసారి మాయాగర్భనరక విముక్తుఁ డగుచుఁ బూర్వజన్మవాసనన్జింతింపఁ దొడగిన యాత్ముఁడు. దారసుతులు విద్యావివేకములు. మహోదధి సంసారము. ఓడన్బగిల్చిన కొండ పాపము. సూది కొండ ప్రకృతి. సరోనదీ పక్కణసీమలు జాగ్రత స్వప్న సుషుప్తులు, ఏడంతరవు లేడురంగు లిరువదెనుమిది గదులు గల యొంటికంబము మేడ సప్తధాతువులును సప్తోపాయములు, అరిషడ్వర్గములు, పంచ కోశములు, నాలుగు పురుషార్థములు, త్రిగుణ వికారములు, ప్రవృత్తి నివృత్తులు, బ్రహ్మపదవి. కంబ ముపాధి. రాజదంపతులు జ్ఞానవైరాగ్యములు. చెలికత్తె లష్టాంగములు. తొలి రాజధాని యైహికము. రెండవ రాజధాని యాముష్మికము. గంటకంబము కర్మము. వ్రాత శాస్త్రము. నూత్న వధూవరులు భక్తిశ్రద్ధలు. వలపుజాబుపనిషత్తు. బాటసారికి స్వదార సుత పునస్సమావేశము కైవల్యప్రాప్తి. గుఱ్ఱము బుద్ధి. బాకుఁ దుపాకి బల్లెమీఁటెలు సాధన చతుష్టయ సంపత్తులు. పులి పందులు రాగద్వేషములు. జాగిలములు వ్రతములు. ఆసవము దీక్ష. దాది సంప్రదాయము. గడియార మాయువు. ఉంగరము ప్రత్యభిజ్ఞానము. వాన దేవతా ప్రసాదము. మామ గురుఁడు. బావ సఖుఁడు. విభ్రాంతుఁడై బద్ధుఁడగుచుఁ బ్రబుద్ధుఁడై ముక్తుఁడగుచుంట యాత్మని సహజక్రీడలని బాటసారి కథ కంతకును వేదాంతపర ముగా నర్థమిట్లూహ్యము.'

దాసుగా రిట్లు ఈ బాటసారి గ్రంథము నందు వారు నిక్షిప్తము చేసిన గూఢార్థములను వారై బహిరంగము చేయకున్నచో, ఆ గూఢార్థములు గూఢార్థములుగనే యుండెడివేమో. వారు వివరించుటవలన రూఢార్థములైనవి.

ఈ గ్రంథ రచనలో దాసు గారి గూఢార్థము పైనున్నదే కాని పైకి కన్పడు కథార్థముపై లేదనియు, ఆ కథాసారము నంతయు నొక్క పద్యములో నైనను జెప్ప వచ్చునని వారు భావించి రనుటకు—

ఒక్క మహానుభావుఁడు మహోదధి యానము చేసి ముప్పునన్
దక్కి తొలంగిపోవు నిజ దారసుతార్థమునై సరోనదీ
పక్కణసీమలన్ వెదకి వారలు సుస్థితి నుంట గాంచి పెం
పెక్కెను బాటసారి యయి యక్కథపేర యశో విహారియై

—ప. 1

అను గ్రంథ ప్రథమ పద్యమే ప్రత్యక్షర సాక్ష్యము. ఇక ద్వితీయ పద్యము నందలి—

ఎచ్చటి నుండి నేనిచటి కెట్టుల వచ్చితి ? గన్ను లెంతయున్
విచ్చినఁ గానరాదిదియు నిక్కము ? యేమిటి పెద్దమోఁత నా
కచ్చెరువై వినంబడుఁగటా ?' —ప. 2

అను శంకలు బాటసారి గ్రంథ కథానాయకుడైన బాటసారివి మాత్రమే కావు. ధరణిపై పుట్టి జీవితయాత్ర సాగించెడు బాటసారు లందరకు తరాలనుండి తీరని శంకలు.

ఈ బాటసారి కృతి నిర్వచన మగుట మానవుడు తరతరాలనుండి కలుగు శంకలకు తాను నిర్వచను డగుటయే. ఈ కృతి నిర్విరామముగా సాగుట మానవుడు సాగించు నిర్విరామ జీవితయాత్రకు సూచనమే. ఈ గ్రంథములో వచ్చు బాటసారి, అతని దారాపుత్రులు, పాదుసాహి, అతని అన్న కుమారుడు, అన్నకుమారుని మామ, మఱదలు, దాది మొదలగు పాత్ర లన్నియు నామరహితములే. ఇట్లు ఒక్క పాత్రకు కూడ నామము పెట్టకపోవుట సర్వము బ్రహ్మము అను అద్వైత తత్త్వదృష్టికి సూచనము.

ఇక రెండవ అంశము. ఈ గ్రంథము నందలి కథ యంతయు కల్పితము. దాసు గారే పీఠికలో 'ఈ బాటసారి కథ స్వకల్పితము గాని యింకొక భాషా కావ్యమున కనువాద మెంతమాత్రమున్గాదు.' [9] అని వ్రాసినారు. కథాసారమునుబట్టి ఈ బాటసారి పద్యప్రబంధము ఏ భాషాగ్రంథమునకు అనువాదము కాని స్వతంత్ర కథా గ్రంథమని నిస్సంశయాంశము, ఆంగ్లభాషలో గోల్డుస్మిత్ వ్రాసిన 'ట్రావెలరు' అనుదానికి దీనికి నామసాదృశ్యసంబంధముతప్ప మఱేవిధమైన సంబంధములేదు.

ఆంధ్రాంగ్ల వంగభాషా విశేషవిదులైన శ్రీ అమరేంద్ర గారు, ఈ బాటసారి గ్రంథ మందున్న—

'ఔర గారడి సూర్యుండ ! యబ్బురంబు
గద బ్రతుకువలె నీ కర కౌశలంబు

9. బాటసారికి గూఢార్థము – బాటసారి

అల్పభోగంబులఁజూపి యధిక దివ్య
ములను గన్పట్టనీయక మోసపుచ్చు' —ప. 21

అని తన కక్షల నిచ్చిన లోకబాంధవుడని గూడ గమనింపక బాటసారి పలికిన నిష్ఠురపు పలుకులు, ఆంగ్లభాషలో Rev. బ్లాంకోవైట్ ( 1775–1841 ) వ్రాసిన Death and Night అను సానెట్‌లోని—

Who could have thought such darkness lay concealed
Within thy beams, O Sun! or who could find
While fly, and leaf, and insect stood revealed
That to such countless orbs thou madst us blind?
If light can thus deceive, wherefore not life?

అను చరణముల పారణము వలన చేసిన పరవశానుకరణ మని పరిశోధించి పట్టు కొనినారు. [10]

ఇది అనుకరణ మన్న, దాసు గారి మాటలను శంకించిన పాపము తగులు నని యనుకొన్న, ఇక ఈ సంవాదమునకు ఆనందవర్ధనుని 'సంవాదిన్య ఏవ మేధా వినాం బుద్ధయః'[11] అను వాక్యమే శరణ్యము.

ఇక మూడవ అంశమైన క్రృత్రిమత్వములేని సరళసుందరమగు తేట తెనుగు భాషలో ప్రకృతిదృశ్యముల వర్ణనము.

గ్రంథాది నుండి గ్రంథాంతము దాక తేట తెనుగు బాస మూసలో ప్రకృతి దృశ్యములు మాటి మాటికి దర్శన మిచ్చును. వేసవి యెండ (ప - 12), సూర్య కిరణ చిత్రములు (ప - 21), వెన్నెల (ప - 14), వెన్నెలలో ఆటలు ( ప - 56 ), ప్రభాతకాలము (ప - 61), నడికిరేయి (ప - 135), తొలకరి (ప - 163) మొదలగు ప్రకృతి బయటపెట్టు వన్నె చిన్నె లెన్నియో ఈ చిన్న గ్రంథములో మిన్నగా నున్నవి.[12]

ఒకటి రెండు ఉదాహరణములు—

పించియంబుల విప్పి పెండ్లియాటల రొప్పి
యాడు నట్టువపిట్ట జోడుఁజూచి

---

10. సారస్వత నీరాజనము – పు - 715
11. ధ్వన్యాలోకః — చతుర్థ ఉద్యోతః — 10 - 11 కారికలనడుమ
12. ఈ పద్యములు వర్ణనావైభవము అను అంశము చెంత చేరినవి

తన మీటారికి పంబు తలిరుబాకు విడెంబు
వాడుకోయినమిన్న దాడిఁజూచి
పడఁతి తోడుత నచ్చి పండుగుజురు ముచ్చ
టోడుచుఁ దిను చిల్కఁ బ్రోడఁజూచి
కమ్మతేనెల మెక్కి కొమ్మకౌఁగిటఁజొక్కి
పాడు తేఁదుమ్మెద కోడెఁజూచి
అంత గంటుల హెచ్చి రవంత నొచ్చి
నేర్పరి యనుచు మెచ్చి నిట్టూర్పువుచ్చి
బయలు కౌఁగిళులకుఁజొచ్చి హాయులు విచ్చి
నచ్చి పొగలుచునుంటెఁజాన యిటువచ్చి —ప. 35

దాసు గారి శైలీశైలాష్టిహానమైన ఈ పీసము నందలి అంశములు, ప్రకృతి రూపాల శోభకు అక్షరరూపాంతరీకరణాలేకాక, భార్యావియోగముతో బాధపడుచున్న బాటసారికి ఆనందముతోపాటు విరహోద్దీపకములైన ఉపకరణములు కూడ.

చిలుకబూఁచులకుల్కి జిలిబిలిగా బల్కి
సాబాలుగాఁ దిన్న చల్దిబువ్వ
చిలుజగడములోని బిలబిలఁ బొత్తాని
తనివితీరక యాడు దాగురింత
పట్టు పంతములాడి బాగుగాఁ గవఁగూడి
మెలపునఁబాడిన మేలుకొల్పు
అంటు జంటగఁగట్టి దంటగా నీర్వెట్టి
నిలుపు సంపఁగిగున్న తొలిసమర్త
అనవాళ్లవి నన్నుఁ గన్నారఁ జూప
నేఁగుదెంచిన యీ గాలి ప్రోగు బొమ్మ
మనసు వచ్చిన యట్లు నిన్మరులుకొల్ప
బాగలుచున్నది నిక్కంపు బొంది యిచట —ప. 113

నిను జెప్పపాటైనఁ గనకున్న నోర్వని
కన్నులు కాయలు కాయ వలసె

నీ మాటలన్ గసింతే విన నేరని
ములుచ చెవులు చెట్లు మొలువ వలసె

నీదు పేర్చవి గొంట నిముస మేనియు మాన
నట్టి నాలుక గడ్డి కట్ట వలసె

గడియ సేపయిన నిన్నెడసి నీరగుచుండు
గుండె బల్బండమై యుండ వలసె

కటకటా నాదు మేల్మి బంగారు బొమ్మ,
నా బ్రతుకు పట్టు, యెచట నున్నావొ, వాలు
కన్నుఁగవ నీరు వరదలు కాల్చ చెట్టు
కుందుచున్నావొ, యిపుడు నన్నుందలంచి —ప. 160

ఈ పద్యాలలోని ప్రతిపదమే కాదు, ప్రతి పాద భావము కూడ అచ్చమైన తెనుగు దేశీయమే. తెనుగుదనమే కాదు, పాతపాత్రాలలో అరుదైన ఔచిత్య శృంగారము, పైయక్తికానుబంధస్మరణము ఈ రెండు పద్యాలలో కన్పడు క్రొత్తదనము.

ఇట్లు కృత్రిమ వాతావరణములేని వర్ణనములతో ఆదినుండి అంతముదాక దాసు గారి లేఖిని దాసు గారి మాటకు కట్టుబడి దాస్యము చేసినది. వారి అనుమతితో లాస్యము చేసినది.

దాసు గారు ఈ బాటసారి గ్రంథ రచనకు పెట్టుకొన్న నియమములు మూడు కదా. గూఢార్థకావ్యముగా చెప్పవలెననుకొన్న మొదటి నియమము గ్రంథ ప్రక్రియకు, స్వతంత్రేతివృత్తముతో నడిపింపవలెననుకొన్న రెండవ నియమము గ్రంథకథకు, కృత్రిమత్వరహితమైన సులభసుందరముగ వ్రాయవలెననుకొన్న

మూడవ నియమము గ్రంథభాషకు సంబంధించిన అంశములు. మొదటి లక్షణము వారి పాశ్చాత్యప్రపంచ సాహిత్య పరిచయమునకు, రెండవ లక్షణము వారి స్వతంత్ర ప్రవృత్తికి, మూడవ లక్షణము వారి అభిరుచికి నిదర్శనములు.

స్వభావోక్తులు ఎంత సహజసుందరములైనను, ప్రతిభాసుందరీదరహాసముల యెదుట పరిహాసపాత్రము లగును కదా. అందులకే దాసుగారెంత నిసర్గమనోజ్ఞతా ప్రియులైనను, వారి భావపేటిక నుండి కొన్నింటిని తీసి, అక్కడక్కడ ఈ గ్రంథము నలంకరించిరి. ( పద్యములు - 56, 135, 169 )

ప్రక్రియయందు, కథయందు, భాషయందు స్వతంత్రప్రవృత్తిని ప్రదర్శించిన దాసు గారు, ఈ గ్రంథములో 'చక్కెర, నట్టువు' అను రెండు క్రొత్త వృత్తములను సృష్టిచేసి ఛందోవిషయమున గూడ వారి స్వతంత్రతను ప్రదర్శించినారు. వీరు సృష్టించిన 'చక్కెర'కు (95) గుణములు — సజతరసగల. అట్లే వీరి 'నట్టువు' నకు (191) గణములు — నాలుగు భగణములు, నాలుగు నగణములు తరువాత ఒక గురువు.

మహామహోపాధ్యాయ శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులు గారిచే 'క్షీరాన్నము వలె నున్నది' అని ప్రశంస లందుకొనిన ఈ బాటసారి గ్రంథము దాసు గారి నైక విధ స్వతంత్ర ధోరణీ ఘంటాపథమున పయనించు బాటసారి.

ట్రావెలరు :

ఇది బాటసారి నిర్వచన పద్యగ్రంథమునకు దాసు గారు చేసిన వచనారూపమయిన ఆంగ్లానువాదము. ఇది కేవలము బాటసారి గ్రంథమునకు భాషాంతరీకరణమగుటచే బాటసారికి వర్తించు సర్వలక్షణములు ఈ ట్రావెలరు గ్రంథమునకు కూడ వర్తించును. కనుక ఈ గ్రంథమును దాసుగారెట్లు ఆంగ్లానువాదము చేసిరో అను దృష్టితో తప్ప మరియొక దృష్టితో చూడనవసరము లేదు.

వారి ఆంగ్లానువాద సామర్థ్య పరిశీలనమునకు కొన్ని ఉదాహరణములు—

వెల్లబాఱిన జాబిల్లి వేగుచుక్క-
యును దివంబున వెలయుచునున్న యట్లు
చిన్ని కొమరునితో ముద్దుచెలియ తేలు
చుండెఁగాబోలు మున్నీట నిండు దొఱఁగి —ప. 18

Just like the fadding moon and the morning star on the firmament my lady with the child might be perchance tossed over the sea surface devoid of their beauty.

తమ్ము మాలిన ధర్మంబు తగదటంచుఁ
దలల నలరించు తమ మొదళ్లను గావఁ
బూని చాఁచిన నీడల ముడుఁచుకొనియెఁ
బాదపంబులు నడిమింట భానుఁడొప్పె —ప. 29

The trees retracted their stretched shadows as if saying that one's own property should not be used in charity elsewhere at the cost of self; and the sun shone in the middle of heavens.

నీకౌఁగిటఁబడు నాదట
చేకూరు ననుకొనలేదు చీఁకటిగా నిం
దాక నగపట్టె నంతయు
నాఁకలి నిద్దురలు దవ్వులయ్యెన్జుమీ —ప. 181

I deemed not myself the good fortune would happen that I could enjoy in your embrace. Everything appears as dark hither. Look at, hunger and sleep became afar.

నింగికెఁజెలంగి తుదలం గలిపి పందిరి వ
లెం గడంగి నీడల నొసంగు బలు పోఁకల్
సంగడి నెసంగి నల వంగముల కొమ్మలఁ బె
నంగి కొనసాగు విడెముంగాలు పట్రాకుల్
రంగు మెయి పండు గెలలం గలిగి నిచ్చెనలఁ
వంగిన యనంటుల బెడంగయిన మోకల్
ముంగలఁబొసంగఁజలువం గొనుచు నంటు లెన
యంగఁ బరవాపలు తెఱంగులగు మ్రాకుల్ —ప. 77

A large area palm groves reaching the sky with their joined heads for using a frame and giving shadows, accompanied the

betel leaf creepers increasing coupled with the boughs of the elobe plants impriving tops, the grovers of the plantains bowing down with ripened bunches beautifully leaning over the ladders, and shining in front the various huge trees enhancing with their grafts grown by the assistance of cool associations.

కడలి నవ్వేయుఁ బొంగి సందడులోనర్చెఁ
గప్పురపు దివ్వెవలెఁ జంద్రుఁ డొప్పమీఱెఁ
గొండ యంతయు మెంగుగ వెండి వాఱెఁ
బండువెన్నెల కన్నుల పండువయ్యె —ప. 14

The sea roared with jolly laughter, the moon shone like camphor fagot the mountain became silverised, and the full moon light was an eye feast.

ఇట్లు ఆంగ్లానువాదము సాగినది. ఈ ఆంగ్లానువాదము దాసు గారి ఆంగ్ల భాషాపైదుష్యమునకు, అనువాద సామర్థ్యమునకు పరిశీలన పరికరము.

మేలుబంతి :

ఇది దాసు గారు అప్పుడప్పుడు చెప్పిన చాటుపద్యముల సంకలన గ్రంథము. ఈ సంకలన గ్రంథమును దాసు గారి జీవితకాలములో అచ్చొంతిపకయున్నను, దాసు గారే దీనికి మేలుబంతి యని నామకరణము చేయుట వలన ఒక గ్రంథముగా కూర్చి ముద్రింపవలయు ననెటి ఉద్దేశ్యమున్నట్లు వెల్లడియగుచున్నది.

మేలుబంతి యను పేరునకు అర్థములు 'ఒజ్జబంతి, ఒరవడి, మేలైన పంక్తి, ఈ చాటు గ్రంథము మొన్నమొన్నటిదాక (13-1-1974) ముద్రింపబడక చాటుగా నుండుట మహత్గ్రంథములపై కూడ ఆంధ్రమహాజనులకు గల అలక్ష్యదృష్టికి దృష్టాంతము.

ఈ సంకలన గ్రంథమునకు సంపాదకులైన ఆచార్య యస్వీ జోగారావుగారు సంపాదకీయములో :-

'హరికథాపితామహులైన శ్రీ దాసు గారు హరికథలనే కాక నైక కృతులను సంస్కృతాంధ్రము లందు గద్యపద్య గేయాత్మకములుగా రచించిరి. అందీ 'మేలు బంతి' యొకటి. ఇది యొక చాటు ప్రబంధము వంటిది. ఇదమిత్థముగా ఒక విష యముపై ఒకనాడు సావధానముగా రచింపబడినది కాదు. ఇందలి పద్యము లనేకము అప్పుడప్పు డనేక జీవిత సన్నివేశములలో సందర్భములలో అలవోకగా చెప్పినవే. అందాశువుపాలే అధికము. అందు కొన్నిమాత్రమే పత్రికలలో ప్రకటితములైనవి. అసలు కొద్దిమాత్రమే యుపలబ్ధములు. అంటి పెట్టుకొనియుండు అల్లుడు కీ. శే. ఉపాధ్యాయుల అప్పలనరసయ్య గారు, హరికథలకై వెంచేయునప్పుడు హంగుదార్లుగా వెంట నుండిన శిష్యులు గణపతులును గురునాథులునైరి గనుక ఈ చాటు భారతము మన కీపాటి యైన దక్కినది.

అసలిది యీనాటి కిట్లచ్చుమొగము చూచుటకు మరియొక మహత్తర నిమి త్తము గలదు. అసూర్యంపశ్యలయ్యు బహుధా కీటక విటాధముల నితాంత దంత క్షతములకు గురియై ఎక్కడెక్కడో విడివిడిగా పడియున్న పత్రసుందరులను హరి నరకాసుర కారం నుండి నానారాజ సరోజాక్షులను విడిపించినట్లు పట్టుకొని వచ్చి నాచేత పాణిగ్రహణము చేయించినవారు శ్రీ కర్రా ఈశ్వరరావుగారు.'[13]

అను చమత్కార గర్భితములైన ఈవాక్యపదీయ భావముల వలన ఈ గ్రంథ చరిత్ర విదితమగుచున్నది.

ఈ గ్రంథమునకు 'మేలుబంతి' యను నామకరణము చేసినది దాసు గారే. కాని గజిబిజిగా నున్న ఆ చాటు పద్యములను విషయముల జిగిబిగులను బట్టి పం డ్రెండు విభాగములుగ విభజించి, ఆ విభాగములకు 'స్తబకము'లను నామకరణము చేసినది సంపాదకులైన ఆచార్య యస్వీ జోగారావు గారు.

దీనిలో నున్న స్తబకము లివి - 1. దైవస్తుతి స్తబకము, 2. ప్రభుప్రశంసా స్తబకము, 3. మహావ్యక్తి ప్రశంసా స్తబకము, 4. విద్వత్ప్రశంసా స్తబకము, 5. దేశప్రశంసా స్తబకము, 6. సంగీత సాహిత్య స్తబకము, 7. వర్ణన స్తబకము, 8. హితోపదేశ స్తబకము, 9. అనువాద స్తబకము, 12. మణిప్రవాళ స్తబకము.

---

13. మేలుబంతి - సంపాదకీయము - పు. 1, 2.

దైవస్తుతి స్తబకము నందు గజముఖ, సూర్య, బాలాత్రిపురసుందరి, పెనుగొండ కన్యకాపరమేశ్వరి మొదలగు దైవతములను గూర్చి చెప్పిన పద్యము లున్నవి.

ప్రభుప్రశంసా స్తబకము నందు దాసు గారి ప్రతిభకు ప్రణమిల్లిన విజయనగర, మైసూరు, సేతూరు పుదుక్కోట, జయపురము, పిఠాపురము, సంగమవలస, చల్లపల్లి, ఉర్లాం, బొబ్బిలి, తుని, మొదలగు నానాప్రభువుల ప్రశంసలున్నవి. శ్రీ అలక నారాయణ గజపతి మహారాజులపై చెప్పిన పద్యములలో నొకటి —

సకల కలా పాఠశాలా దివానిశం
శ్రావకీన రసికతాం స్తువన్తి
నియతవేళాదత్త నిత్యసత్రాన్న స
న్తర్పితా స్తే భవంతం నువన్తి
జాగరూకా స్త్వదుద్యోగినో భక్తి వి
శ్వాస విభాసురాస్త్వాం భజన్తి
పరమ సుహృత్ప్రాణ బాంధవాః కింకరాః
సర్వేపి యుష్మద్వశాశ్చరన్తి

దాతృ వర్య! ప్రవిమల స్వతంత్రచర్య!
రసిక శేఖర! దివ్య సూర్యకుల నృవర!
త్వం చిరంజీవ సజ్జనతాం సదావ
అలక నారాయణాఖ్య! విద్యాత్మసఖ్య! పు. 24

మైసూరు మహరాజా శ్రీశ్రీశ్రీ చామరాజ ఒడయర్ వారి దర్బారులో 1894వ సంవత్సరము డిసెంబరు నెలలో ఫోనోగ్రాఫుమీద రికార్డు చేసిన పద్యములలో రెండు-

విద్వజ్జనే సవినయం
స్వజనే దాక్షిణ్యమార్ద్రి మూర్ఖజనే
శత్రుజనే చాత్యుగ్రం
ప్రసరతి భో చామభూప! తే దృష్టిః. పు 33

వాణీవిలాసాక్షి చకోర చంద్రం
సౌజన్య సంతాన విభూతి సాంద్రం
స్వచ్ఛంద కార్యేషు సదాప్యతంద్రం
పాయాచ్ఛివశ్చామథరాధిపేంద్రం. పు. 323

మహావ్యక్తి ప్రశంసా స్తబకములో అంబరీషుడు, ఏసు, జేకబు, మహమ్మదు మొదలగు పూర్వ మహావ్యక్తుల ప్రశంసలతోపాటు, సమకాలీనులైన విక్టోరియా మహారాణి, సోమంచి భీమశంకరము, జయంతి కామేశముపంతులు, రాజగోపాలా చారి, టంగుటూరి ప్రకాశము పంతులు, కాశీనాథుని నాగేశ్వరరావు, న్యాపతి సుబ్బా రావు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నము మొదలగు నలువదిమంది మహావ్యక్తుల స్వభావచిత్రీకరణములైన ప్రశంస లున్నవి.

ఏసు ప్రభువును ప్రశంసించుచు, బుద్ధుడు మొదలైన మహావ్యక్తుల లోపము లను వెలిబుచ్చిన ఒక పద్యము—

బుద్ధుఁడాల్బిడ్డల నోర్మిస పుచ్చినాఁడు
కృష్ణుఁడు న్యవనునకు వెన్నిచ్చినాఁడు
ఇద్దరాండ్రను మహమ్మదుఁ డేలుకొనినాఁడు
శంకరుఁడు పశుహింస కాజ్ఞ యిడినాఁడు. పు. 40

ఆంధ్ర భీష్ములని ప్రసిద్ధి గాంచిన శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారి జీవిత సారాంశమునకు దర్పణముగా నున్న ఒక పద్యము —

ఏలోపములు గానకెన్నబడె దేండ్లును
హాయిగా బ్రతికిన న్యాయవాది

ఇహపరంబులు రెండు నెంతయు న్నుళువుగాఁ
చరియింపగల్గిన ధర్మమూర్తి

మేని చమ్మట నూడ్చి వేలవేలు గడించి
సద్వినియోగము సల్పు ఘనుఁడు

తెనుఁగు దేశంబున నెనలేని పేరు ప్ర
తిష్ఠలు గొన్న యదృష్టశాలి

భవ్యవర్తనమున్గన్న బహుకుటుంబి
యఖిల జన సమ్మతుండు విద్యారసికుఁడు
రాజమాహేంద్రవర నరగము ననలరు
సుగుణముల ప్రోవు న్యాపతి సుబ్బరావు. పు. 54, 55

విద్వత్ప్రశంసా స్తబకము నందు సమకాలములో వివిధ విద్యారంగములలో ప్రసిద్ధులైన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, అకొండి వ్యాసమూర్తి. బుట్టా శేషగిరిరావు. వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి, ముడుంబ నరసింహాచార్యులు, పరవస్తు రంగాచార్యులు, తిరుపతి వేంకటకవులు, తాతా సుబ్బరాయశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నము మొద లగువారిని గూర్చి చెప్పి పద్యములున్నవి.

తిరువళ్లూరు రాజాయి పాటను కట్టి అందించు మాటల మూట ఒకటి -

జిలుగు రతనాల పేట పూచెండులాట
క్రొంజవులయూట అమృతంబు కొలనుమోట
వలపు ముద్దులమూట పువ్విల్తు వేట
హాయి నొడపోయు తేట రాజాయి పాట. పు. 74

ఇక వ్యాకరణధీరులైన మహామహోపధ్యాయ శ్రీతాతా సుబ్బరాయశాస్త్రి గారి షష్టిపూర్తి సమ్మానసభలో ప్రశంసాత్మకమైన ఆశీర్వచనములతో అల్లి అందించిన మంజరి-

తెలుగంట్ల నుడితీరు తెలిసి తెల్పుటకుఁ
దగువాఁడవీవె తాతా సుబ్బరాయ !
హాయిగా నిఁక నెన్మిదైదేండ్లు మనుము
పేరూరి యరవల పెంపు నిలుపుము
నీవంటి చదువరి నేల యందరుదు
పాలుల కన్నాక ! వహింతొడునీడ !

వారల మెప్పించు పంతుల మేటి వీవు
వేలుపు నుడి బడి వెన్నెలగాయ
నెలసన్న్యాస జ్ఞప్తిదే చదువైన
కన్నెల్లెదన్ను పైకిఁ గలుకుగాఁగాని
జాలిగుండెన్ను నీకు సాటి యెవండు ?
చిన్నలనున్మించి స్వైబలెటింగి
వెరపు మప్పుటకు నీవే యూటపట్టు
నాకన్న చిన్నవన్నా! నిన్నుఁబొగడి
నాఁటుమాటలు మఱి నానోట నూర
నాటపాటలమేటి నగుచు దీవింతు పు॥ లు 78, 79

ఐదవదియైన దేశప్రశంసా స్తబకము నందు తెలుగుసీమపై, తెలుగుభాషపై తెలుగుదేశములో గల వివిధ నగరములపై దాసుగారు చెప్పిన పద్యములు చేరినవి. సికిందరాబాదు, విజయనగరము, కాకినాడ, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము, బందరు, నందిగామ, విశాఖపట్టణము, గుంటూరు, పిఠాపురము, సింహాచలము, తుని, పార్వతీపురము, పాలకొండ, ఏలూరు, సింగరేణి, పెద్దాపురము, పాలకొల్లు, మూలపేట, గొల్లలమామిడాడ, ఎలమంచిలి, నెల్లూరు, బొబ్బిలి, ఉప్పాడ, క్రొత్త పేట, అకివీడు, మొదలగు ఆంధ్రదేశస్థ పట్టణములేకాక, చెన్నపట్టణము, నీలగిరి, బెంగుళూరు, మైసూరు, పుదుక్కోట, లవణసముద్రము, బళ్లారి, మొదలగు ఆంధ్ర దేశేతరములైన పట్టణములపై చెప్పిన పద్యములు గూడ కలవు. ఈ పట్టణముల వర్ణనములు అతిశయోక్తులుగాక, ఆయా పట్టణముల భౌగోళికచిత్రములై సత్యసమీప వర్ణనములగుట విశేషము.

కాకినాడపై చెప్పిన ఒక పద్యము :-

ఒక్కవైపు తన సంపదున్నతిఁ దెల్పుచు
రత్నాకరంబు పరగుచు నుండ
తక్కిన దెసల గోదావరి కాల్వలు
సర్వ సస్య సమృద్ధి సలుపుచుండ

వేసవియెండైనఁ బ్రియమగుచుండు ని
ల్లాలి చూపుల పొలయల్కమాడ్కి
హితమయ్యెడు నకాల హిమపాతమయ్యు ని
వాహమందలి యుపవాసమట్లు
పరమ ప్రకృతియయ్యు బహుఫలదంబగు
ననవరతంబు పితాజ్ఞ కరణి
అభ్యస్తంబయ్యు నతి సులభంబగు
సాధులన్ భగవత్ప్రసాదము వలె

చెమట పట్టనితావు సౌఖ్యముల ప్రోవు
అలసటలగొట్టు దొరలకు నాటపట్టు
క్రూరజంతుల వేర్పాటు శోణినత్తు
కనుక నీ నీలగిరియె స్వర్గంబు తునుక

మూఁడువంతులు మిన్నుముట్టెతి మంచు మ
బ్బుల నెగదన్ను కప్పూరపుచెట్లు
మా యన్నిరకములు మఱి యెట్లనేవని
వేడ్కఁబూచిన వింత వింతపూలు
శ్రమకరంబయ్యు నూర్ధ్వగతియె స్వర్గము
గొను నను నెక్కుడు నునుపు త్రోవ
పున్నమి వెన్నెల కన్న నింపయి తుద
మొదలు జూపని నడుప్రొద్దు టెండ

మలయుచుం బొగ వెల్వు కంబములగములు
తెలుపి మఱపించి రేబవల్ గురియువాన
పంక మెఱుఁగని పంటలం బండు నేల
వేసవిన్ నీలగిరివాసమే సుఖంబు - పు॥ లు 105, 106

అరవదియైన సంగీతసాహిత్య స్తబకమునందు సంగీత సాహిత్య నృత్యము లను గూర్చి దాసుగారికి ఉన్న అభిప్రాయములు ఛందోరూపము ధరించి చేరినవి.

ఆటపాటలను గూర్చి వారు వ్రాసిన పద్యములలో నొకటి -

తేట తీయని మంచి తెలుఁగల్లఁజెల్లని
కట్టడి కలగూరగంప పన్ను
గొంతెత్తి యండముల్ గురియింపఁజాలని
మోట యరవ దొంతపాటపాడు
మువ్వడి నొయ్యారముగఁ గుల్కనేరని
దేబ కకూర్తి గైతెక్కలాడు
తనపుట్టు తెల్వి చందము చూపలేని తా
టొకెుచ్చు తెక్కల గోటుచూపు
మీాట పాటాట మాటల మెలపుతోడఁ
గలుగవలయు నొరులు నేర్పవలనుగాదు
అసుదు లయకాండ్రు నాడెకాండ్రంతకన్న
మిగుల నబ్రము వేలుపెఱుఁగు నిజంబు - పు॥ 112

ఈ స్తబకము నందు వచ్చెడి 'కావ్యనక్షత్రమాల, చదువులు - కవితలు, కవిత్వము - కవులు' అను శీర్షికలతో వారు వ్రాసిన పద్యములనుబట్టి దాసుగారు కవి యగుటయే కాక, కవిత్వ పరమార్థమును గూడ సూత్రీకరింపగల ఆలంకారికు లనిపించును.

కావ్య నక్షత్రమాల నుండి పంచరత్నములు -

కవిస్సృష్టాత్రియామూర్తిః కావ్యమేతచ్చరాచరమ్
న కశ్చిత్ వస్తుతో భేదః కార్యకారణయోస్తయోః
దివ్యమర్త్యవిభేదేన ద్విధా కావ్యం నిగద్యతే
దివ్యం ప్రకృతి సంసిద్ధం మర్త్యం భవతి కృత్రిమమ్

సంగీతహీనస్సాహిత్యం యః ప్రయోక్తుం యతేతచేత్
హాస్యాస్పదో భవేదన్యవన్నేత్రాభినయోత్సుకః
సమస్త విద్యానిపుణః కులీన స్సుందరశ్శుచిః
ఘన గంభీర మధుర స్నిగ్ధకంఠ కవిర్భవేత్
ధర్మార్థకామమోక్షాణాం కావ్యమేకైకసాధనమ్
ప్రత్యక్షదేవతామూర్తిః కవిరేవ న సంశయః - పు॥ లు 137-38

కవిత్వమెట్లు ఆవిర్భవించవలెనో వారు 'కవిత్వము-కవులు' అను శీర్షికలో కవిత్వ మయముచేసి లక్ష్యలక్షణ నిర్దేశకముగా చెప్పిన పద్యములనేకము.

ఏడవదియైన వర్ణన స్తబకము నందు శృంగార చాటువులు, ఖర సంవత్సరపు కఱవు, నందన వత్సరపు సువృష్టి, కృష్ణాగోదావరీనదులు, కాల్వలు, నూతులు, మైదానములు, మొదలగు అనేకాంశములపై దాసుగారు అప్పుడప్పుడు చెప్పిన పద్యములు చేరినవి.

దాసుగారి ప్రియమిత్రులైన శ్రీ సోమంచి భీమశంకరముగారు నారాయణదాసు గారికి శృంగారరస సమస్యల నిచ్చి పూరించుమనుట ప్రతిదినచర్య. శ్రీ భీమశంక రముగారి, శ్రీ నారాయణదాసుగారి శృంగారరస సంబంధము ఆచార్య యస్వీ జోగా రావుగారన్నట్లు 'అదంతయు నొక శంకరనారాయణ డిక్షనరీ.'[14] ఆ భీమశంకరము గారొకసారి 'అమిత విజృంభణమ్ము లబలా! తగునా? సుజనాళి కెప్పుడున్' అను శృంగారసమస్య నీయగా దానికి దాసుగారు చేసిన పూరణ మిది -

క్రమమెఱుఁగంగలేని విధిరాత బలంబునఁదమ్ము మోయు మ
ధ్యముపయి నీదు చన్ను లిసుమంతయు నక్కటికంబుమాని యు
బ్బి మదకఠోరభావమున విస్తరమంది చలింపఁజేసి జృం
భము నటుజూపకున్న క్షతమర్దన బాధలపాలుగావు గా
అమిత విజృంభణమ్ము లబలా! తగునా? సుజనాళి కెప్పుడున్-పు॥ 157

---

14. మేలుబంతి - పు. 157

ఎనిమిదవదియైన హితోపదేశ స్తబకమున విజ్ఞాపనమ్, దుఃస్వభావః, దేశారిష్టమ్, వేదపాఠకః, మొదలగు నంశములపై సంస్కృతమున కొన్ని శ్లోకములు, విద్య, భాగవతుడు, పెండ్లిగోడు, శిశుసంరక్షణము, చదువరి బాపడు, కోమటి గొప్ప, కాపుగొప్ప, మొదలగు నంశములపై తెలుగు పద్యములు గలవు. ఈ స్తబకమున శిశుసంరక్షణము నుండి వేదపాఠకుని వఱకు గలవి విధాంశములపై వారు వ్రాయుట వారి లోకపరిజ్ఞానమునకు నిదర్శనము.

తొమ్మిదవదియైన అనువాద స్తబకమున మిస్ రాబిన్సన్ వ్రాసిన 'ఇండియాస్ గ్లోరి' అనుదానికి సంస్కృతమున, అచ్చతెనుగున అనువాదము, భర్తృహరి శృంగార శతకశ్లోకమైన 'ఉరసి నిపతితానాం స్రస్త ధమ్మిల్లకానాం' అనుదానికి అనువాదములును, కాళిదాస శ్లోకానువాదములును గలవు.[15]

పదియవది యైన ఆశాసన స్తబకమున ఆనందగజపతి, పప్పు సోమసుందరము, కోట సన్యాసయ్య, మొదలగు వారిని ఆశీర్వదించుచు చెప్పిన పద్యములు గలవు.

పదునొకండవదియైన స్వవిషయ స్తబకమున 'చెండు' అను ఛందమున (మంజరీ ద్విపద) వారి పుట్టుక నుండి స్వవిషయము వ్రాయబడినది. దానితోపాటు నందిగామ సభాప్రసంగము, భంగుపాట, ముకుందవందనము, వింతకల, మొదలగు నంశములపై చెప్పిన పద్యములు కూడ కలవు.

పన్నెండవదియైన మణిప్రవాళ స్తబకము రాధాకృష్ణసంవాదము, బాలరామాయణ కీర్తన, పసిపాప, వేసవి, పప్పు వెంకన్నగారి పాట, లోకము పోకడ, కాళింగాంగన, మొదలగు నంశములపైనే కాక మహావ్యక్తి ప్రశంసా స్తబకములో వచ్చిన కొందరిపై గూడ వ్రాసిన పద్యములు చేరినవి. ఇది యొక ప్రకీర్ణ స్తబకము. దాసుగారు తొలుత చాటువులుగా చెప్పి ఈ గ్రంథములో చేర్చిన పద్యము

15. కాళిదాసుని, షేక్స్పియరును దాసుగారు ఇట్లు అప్పుడప్పుడు కొంచెము కొంచెముగా అనువదించుచు చివరకు 'నవరస తరంగిణి' అను నొక పెద్ద గ్రంథముగా నిర్మించిరి, కాళిదాసుని, షేక్స్పియరుని దాసుగారెట్లు అనువదించిరో ఉదాహరణములు 'నవరస తరంగిణి' గ్రంథసమీక్షలో గలవు.

లలో వారికి నచ్చిన వానిని సందర్భానుసారముగా తరువాత వారి గ్రంథములలో చాలి చొప్పించినారు. [16].

మేలుబంతి గ్రంథము దాసుగారి సమకాలీన సమాజాంశములకు సందర్శన సూచి. దాసుగారి జీవిత సర్వస్వమునకు సంగ్రహమైన పద్యసూచి. మేలుబంతి చాటుగ్రంథమేకాదు, చాటుగ్రంథములకు మేలుబంతి.

తారకమ్ :[17].

'తారకమ్' దాసుగారు వ్రాసిన ఏకైక సంస్కృత ప్రబంధము. ఇది ఐదుసర్గల నిర్వచన గ్రంథము. మొదటిసర్గలో 59, రెండవ సర్గలో 59, మూడవసర్గలో 58, నాల్గవ సర్గలో 63, ఐదవ సర్గలో 59 శ్లోకములున్నవి. ఐదు సర్గలలో నున్న శ్లోకములు మొత్తము 298. ఈ తారకము దాసుగారు ప్రౌఢ నిర్భరవయః పరిపాకమున వ్రాసి ప్రచురించిన ప్రౌఢప్రబంధము. (క్రీ. శ. 1910. వయస్సు 46 సం॥).

'ప్రసాధయామ్యద్యతయా మదూహమ్' అను ఈ గ్రంథ ప్రారంభ ప్రథమ శ్లోకమునందేచెప్పిన నారాయణదాసుగారి మాటల వలన, ఈ తారక ప్రబంధము ఏ గ్రంథమునకు అనువాదము కాని స్వతంత్రగ్రంథమని తెలియుచున్నది. స్వతంత్ర గ్రంథ మగుటచే దీనిలోని ఇతివృత్తము ప్రఖ్యాతమైనది కాదు. కల్పితము. కనుక ముందు కథాపరిచయము అవసరము.

కథాసంగ్రహము :

వింధ్యపర్వతప్రాంతమున చంచన్నదీతటమున సంశ్రిత కల్పము అను గ్రామ మున్నది. ఆ గ్రామమున మహేశ్వరుడను నొక బ్రాహ్మణుడున్నాడు. అతడు

---

16. మొదట చాటువులుగా చెప్పి తరువాత గ్రంథములలో చొప్పించిన పద్య ముల వివరములు 'పద్యావృత్తులు' అను అనుబంధమున నున్నవి.
17. వ్యాకరణ పాండిత్య వీరముతో విఱ్ఱవీగుచున్న ఈ 'తారకము' నకు అనేక విధాల సహాయముచేసి నన్ను తట్టుకొనునట్లుగా తారక మంత్రోపదేశము చేసిన వైయాకరణ వీరహంవీరులు బ్రహ్మశ్రీ అప్పల సోమేశ్వరశర్మ గారు. బాలునిచేత సోమేశ్వరుడు తారకశక్తిని ఎదిరింపజేయుట విదిత విషయమేకదా.

తపోధనుడు, యథార్థవచనుడు, పౌరాణికుడు, పూతయశుడు, దేవభాషా నిపుణుడు, కవీంద్రుడు, అతని భార్య 'సుదతి'. ఆమె మహాకులీన, కమనీయనేత్ర, భర్త చెప్పిన పురాణమును విని యథాతథముగా మరల వెంటనే చెప్పగల్గిన ప్రతిభావంతురాలు. ఆ ఆదర్శదంపతుల సంతాన మందు కడగొట్టుకొడుకుగా పరమేశ్వరుడు పుట్టినాడు. దేవతలు ఆ బాలుడు శివాంశసంజాతుడని తెలిసికొని, స్తుతించి 'ఈ యవతార కారణ మేమిటికి?' అని ప్రశ్నింతురు. వారి ప్రశ్నకు దేవదేవుడు -

"ఈ కలియుగమున మనుజులందరు సత్యదయాదూరులై, శ్రద్ధావిహీనులై, నిద్రాభోజనరతులై, నారీలంపటులై, రేయింబవళ్లను క్షణిక విభవ మదాంధులై ఉన్నారు. అటువంటి మూఢచిత్తులను అద్భుత చర్యలతో ఆశ్చర్యపరచి సంసార ఘోరార్ణవము నుండి ఉద్ధరించెదను." అని సమాధాన మీయగా విని దేవతలు వారి లోకమున కేగుదురు. పరమేశ్వరాంశతో పుట్టిన ఈ బాలుడు బాల్యచేష్టలతో భగవ ల్లీలలు ప్రదర్శించుచుండును. తల్లిదండ్రులీ బాలునకు తారకుడు అని నామ కరణము చేయుదురు. ఉచిత వయస్సులో తండ్రి ఉపనయనము చేయించును. బాలుడు క్రమముగా గురువుల వలన సకలశాస్త్ర రహస్యములను అవలీలగా గ్రహిం చును. తరువాత కొంతకాలమునకు విద్వాంసుడైన ఈ తారకుడు పరదేశములను చూడవలెనని బయలుదేరి తిరుగుచు 'విబుధనగరము' వెళ్లును. తారకుడు ఆ నగరప్రజల దురాచారములను గూర్చి ఆలోచించుచు 'ప్రమదవనము' చెంత చేరి, అక్కడ చల్లని గాలిని పీల్చుచు ఇట్లు కవితాగానము చేయును -

"తల్లీ! కర్మభూమీ! నీ జనులు వేదోపదేశమును పాటింపక స్వచ్ఛంద చారులు లగుట చూచి హతాశవగుటచే కాబోలు, నీవు ప్రతిదినము ప్రాతస్సాయం సంధ్య లందు పక్షికలకలమను మిషతో విలపించుచున్నావు.

పూర్వము క్షత్రియుడు నా యోగక్షేమముల భారమును వహించెడివాడు. ఇప్పుడు ఏకులజుడైనను ఆ పనికి సిద్ధమగుచున్నాడని, నీవు కన్నీరు విడుచుచున్నావా యన్నట్లు ఈ కొండ నుండి ప్రవహించు సెలయేరు అనిపించుచున్నది".

'గంభీరార్థవంత'మైన ఈ గేయమును, ఉద్యానవన విహారార్థమై వచ్చిన రాజకుమారుడు విని, దూతను బంపి తారకుని తన భవనమునకు ఆహ్వానించి, గౌర వించి, సభలో తన తండ్రికి పరిచయము చేయును. దేదీప్యమానుడైన తారకుని

జూచి మహారాజు స్వసుతునివలె ప్రేమించుచు తనచెంతనే యుంచుకొనును. ఆ ద్విజకుమారు లిరువురు మంచిస్నేహితులగుదురు. అనేకభాషలను, అనేక దేశాచారములను తెలిసికొందురు. తమ దేశక్షేమమునకై ఏదో కొంతచేయవలెనని ఆ మిత్రు లిద్దరు చక్రవర్తి దేశమునకు నౌకలో బయలుదేరుదురు. నౌకాయానములో చిత్రవిచిత్రములను చూచుకొనుచు ఒకనాటి యుదయవేళ వారు తమపాలకుని ప్రాంతము అయిన 'చంద్రద్వీపము' ను చేరి, రాజధానియైన 'చంద్రమతి' అను నగరమును ప్రవేశించి, అక్కడి పరిస్థితులను గ్రహించుచుందురు. ఆ నగర ప్రజలను వశపరచుకొనుటకై ఈ మిత్రద్వయము ఆ దేశభాషలో గానము చేయుచు వీథులలో విహరింతురు. ఆ దేశములోని అన్నిరకాల పండితులను జయింతురు. వీరి శక్తి సామర్థ్యములను విని చక్రవర్తి వీరిని చూడగోరగా సముచితాలంకారులై సాయుధులై గుఱ్ఱములపై రాజప్రాసాదమున కేగి రాజును దర్శింతురు. చక్రవర్తి వీరికి ప్రత్యుత్థానము కావించి, వారు భక్తితో నొసగిన బహుమానములను గ్రహించి, ఆసనములపై కూర్చుండజేసి, వారి చరిత్రను అడుగును. అంత వారు 'మాది కర్మభూమి'. ప్రస్తుతము మీ పాలనలో నున్నది. మేము బ్రహ్మక్షత్రియులము. మీ పాలన చాల చక్కగా నున్నది. రవి అస్తమించని సామ్రాజ్యము మీది. మే మిరువురము మిత్రులము. మిమ్ములను చూడగల్గితిమి. మీ దయయున్న ప్రఖ్యాతులము కాగలము'. అని సమాధానము చెప్పగా చక్రవర్తి సంతోషించి వారిని ఆప్తమిత్రులుగా స్వీకరించి సేనాధ్యక్షులుగా నియమించినాడు. కొన్నిరోజుల తరువాత శత్రువులు చక్రవర్తి సోదరుని బంధింపగా, ఈ మిత్రు లిద్దరు సేనాధిపతులై ఓడలనెక్కి సముద్రముదాటి, శత్రువును ముట్టడించి, ఓడించి, చక్రవర్తి సోదరుని బంధవిముక్తుని చేసి, ప్రాణాపాయస్థితిలోనున్న అతనికి శస్త్రచికిత్సచేసి రక్షించి విజయోత్సాహముతో చక్రవర్తిని చేరుదురు. చక్రవర్తికి ప్రజలకు కల్గిన ఆనందమునకు అవధి లేకుండెను. చక్రవర్తి తారకుని ధర్మాధికారిగా, రాజకుమారుని ఆత్మబంధువుగా ప్రకటించి, తనపుత్రికను రాజకుమారునకిచ్చి వివాహము చేయును. ఈ మిత్రుల దేశమునకు స్వాతంత్ర్య మిచ్చును. ఈ మిత్ర ద్వయము చక్రవర్తి సోదరునితోగూడి యంత్రపక్షిపై (తారకుడు నిర్మించిన విమానముపై) విబుధనగరము చేరుదురు. వీరికి విబుధనగరములో ఘన స్వాగతము లభించును. చక్రవర్తి సోదరుడు రాజకుమారుని సింహాసనముపై కూర్చుండబెట్టి 'భారతవర్షపాలకుడు' గా చేయును. చక్రవర్తి సోదరుడు తన దేశము వెళ్లును. తారకుడు తన యింటికి వెళ్లి ఒక కన్యను పెండ్లాడి సర్వసౌఖ్యములు అనుభవించును.

ఈ గ్రంథము నందలి ఇతివృత్తము, పాత్రలు, పాత్రల భావములు.... అవి యివి యననేల? ఈ గ్రంథము నందలి ప్రత్యంశము నారాయణదాసుగారి ఊహాజన్యమే. ఈ తారక గ్రంథమునుచదివి మార్బర్గు విశ్వవిద్యాలయ సంస్కృత శాఖాధ్యక్షుడైన గెల్డనరు పండితుడు ప్రశంసించుచు వ్రాసిన శ్లోకము లివి -

జానాతే యన్న చంద్రార్కౌ జానతే యన్న యోగినః
జానీతే యన్న భర్గోపి తజ్జానాతి కవిః స్వయమ్
వచస్సుధామయం కావ్యం పీత్వాహం తృప్తమానసః
కృతజ్ఞోభిప్రశంసామి భవంతం కవిశేఖరమ్[18]

జర్మను పండితుడిట్లు ఈ కావ్యమును వచస్సుధామయమని యనుటకు, దాసు గారిని కవిశేఖరుడుగా భావించుటకు ఆధారములైన ఈ గ్రంథ కవితా విశేషములను పరిశీలింతము.

ఈ గ్రంథములో చక్కని ఊహాలు మాటిమాటికి కన్పడుచున్నను తారకుని బాల్యచేష్టల వర్ణనము నందు, నౌకాయాన వర్ణన మందు గుంపులు గుంపులుగా ముసురుకొన్నవి.

బాల్యచేష్టలు :

ముదన్వితః స న్తతసాక్షి తత్త్వ
మద్వైతమాత్మీయ మథాతినిష
స్తనన్ధయో మంజుల నిర్వికార
దృష్ట్యాస ఆన్దోలన రమ్యమంచే - 1-34

ఆ బాలుడు (తారకుడు) ఊయేలలో నూగుచు సంతత నిర్వికార దృష్టితో తన సాక్షిత్వమును, అద్వైతతత్త్వమును లోకమునకు బోధించినాడు.

---

18. సూర్యచంద్రులు దేని నెరుగరో, యోగులు దేని నెరుగరో, శివుడు కూడ దేని నెరుగడో దానిని కవి స్వయముగా నెరుగును. వచస్సుధామయ మైన కావ్యమును నేను ఆస్వాదించి, తృప్తమానసుడనై, కృతజ్ఞత కల వాడనై కవిశేఖరుడవగు నిన్ను ప్రశంసించు చున్నాను.

వ్యోమైకలక్ష్యాం స్వదృశం నివర్త్య
భూమీంసకృత్త్యైర్బహుదుర్జనానామ్
ఖిన్నామలోకిష్ట దయార్ద్రచిత్తో
మా దేవిభైషీరితి దీనబన్ధుః - 1-36

క్రూరకర్మల వలన బాధపడుచున్న భూదేవిని 'తల్లీ! భయపడవలదు. నేను రక్షించెదను' అని బోధించుచు, అతడు (బాలుడైన తారకుడు) తన ఊర్ధ్వదృష్టిని దిగువకు (భూమిపైకి) ప్రసరింపజేసినాడు.

త్రాతారమేవా ర్దయతి ప్రకృత్యా
కృతోపకారం నవిచార్యమూఢః
సందష్టమాత్రాంచితచూచుకేవా
బుబోధ్యభీక్ష్ణం శిశునేతి లోకః - 1-46

పాలుత్రాగుచు తల్లి స్తనచూచుకములను కొరుకుచు ఆ బాలుడు 'ఉపకారము చేసినవానికే లోకము అపకారము చేయును' అన్న భావమును సూచించినాడు.

స్యాత్ స్వాపనిఘ్నః సకలశ్చరాణాం
ప్రాయోబుభుక్షా పరతన్త్రజీవః
అశోషుపిష్టేత్యురపి స్వమాతు
రసావతన్ద్రోఽపి పయాంసిపీత్వా - 1-51

'ఆకలిదప్పికలు గల ప్రాణి నిద్రకు అధీనుడగును' అని సూచించుచు ఆ బాలుడు పాలుత్రాగి తల్లిగుండెలపై నిద్రించుచు నుండెడివాడు.

చక్కని ఊహలు కల మరియొక ఘట్టము నౌకాయానఘట్టము. అందులోని కొన్ని ఊహలు.

వాతప్రకోపం శమయందీపయఞ్జఠరానలమ్
నౌ తనోరూర్జయన్ధాతూన్వైద్యామాస స నావికైః- 3-3

వాయుప్రకోపమును తగ్గించుచు, జఠరాగ్నిని (ఇంజను నిప్పును) రగుల్చుచు, ధాతువులను సమపరచుచు నావికులు ఓడను వైద్యునివలె చేసిరి.

దిక్సూచియా త్రిమనసా కర్ణధారాత్మనాన్వితా
సర్వభూతమయీ నౌకేవాబభౌ జలదేవతా - 3-7

దిక్సూచి మనస్సుగా, కర్ణధారుడు ఆత్మగా సర్వభూతమయమైన ఓడ జలదేవతవలె నున్నది.

అంతస్సముద్రే భూమీంధ్రాస్తస్థుర్నౌకాపకారిణః
సజ్జనోపద్రవకరారాడ్వ్యాస ఇవ సూచకాః - 3-12

రాజభవనములలో సూచకులవలె (చెవి కొరుకుడుగాళ్లు) సముద్రాంతర్భాగమున అక్కడక్కడ ఓడకు అపాయము కలిగించెడు కొండలున్నవి.

చకాసామాసనీత్యేవ తోయరేఖాతరీకృతా
పోతాధానోద్భవామో బీజవాపేన సదృశో బభౌ - 3-15

ఓడ వలన నేర్పడిన నీటిరేఖ నాగేటిచాలువలెను, చేపపిల్లలు విత్తనాలవలెను శోభించినవి.

ఇట్లు తారకుని బాల్యచేష్టల వర్ణనమున, నౌకాయానవర్ణనమున దాసుగారు చక్కని ఊహల నెన్నింటినో చొప్పించినారు.

ఇంక, ఈ గ్రంథము నందలి విబుధనగర వర్ణనమున, చంద్రద్వీపమునకు ముఖ్యపట్టణమైన చంద్రమతీనగర ప్రజల వర్ణనమున, యుద్ధవర్ణనమున, దాసుగారి నిశితపరిశీలనము బాగుగా కన్పడును. చంద్రమతీనగర ప్రజల వర్ణనము దాసుగారికిష్టమైన ఆదర్శరాజ్యమే. విబుధనగర వర్ణనము నందు దాసుగారి కాలపునాటి సమాజ పరిస్థితులెన్నియో చోటుచేసికొన్నవి. మచ్చునకు ఒకటి రెండు -

బహుధనపరధూర్తైః పూరితే ధర్మగేహే
ముహురిహ విరచయ్యానర్థకం కూటసాక్ష్యమ్
అవిదితనిగమార్థో జన్రిమేషోగ్రజాతిః
సమచరదుదుమూల్య క్రీతవాదాధికారః - 2-28

కూటసాక్ష్యములు చెప్పుట, 'లావాదేవీ' లు నడపుట, డబ్బుకు అమ్ముడు పోవుట మొదలైనవి అగ్రజాతి లక్షణాలు.

ఉదవహాదిహావృద్ధో నిర్ఘృణః క్షీరకంఠా
మవృణతకులబాహ్యాః సమ్ప్రదద్భిః కులీనామ్
హాతమతిరభిశ స్తః ప్రావ్రజద్గూఢభోగో
బహులధనతిర్ధిగ్ బ్రాహ్మణం నామశిష్టమ్- 2-30

ముసలివాడు ముక్కుపచ్చలారని ఆడపిల్లను పెండ్లాడుటకు సిద్ధము. డబ్బున్నవాడు గుణహీనుడైనను గుణవతిని చేపట్టుటకు సిద్ధము. పైకి విరాగి, లోపల బహురాగి. అన్నిభోగములను అనుభవించును. ఛీ! శిష్టుడైన బ్రాహ్మణు డన్నచో అసహ్యము.

ఈ కూటసాక్ష్యమును, వృద్ధుల వివాహమును దాసుగారు సందర్భము వచ్చి నపుడెల్ల వారి గ్రంథములందు విమర్శించినారు. అట్లు మాటిమాటికి వానిని విమ ర్శించుటకు కారణమేమన, ఈ అంశములు నాడు దాసుగారికి ప్రతిదినము కనుల ఎదుట జరుగుటయే.

ఇటువంటి కావ్యవిశేషములేవో కొన్ని కలము పట్టుకొనగలిగిన ప్రతి కవి కావ్యములో కన్పడునవే. ఇక దాసుగారి కావ్యములో నుండవా?

దాసుగారి ఈ తారకగ్రంథమును జూచి ఏకవ్యాకరణధీరులు, మహామహో పాధ్యాయులు అయిన బ్రహ్మశ్రీ తాతా సుబ్బారాయశాస్త్రిగారి వంటి మహాభాష్య పరి పాలకులు గూడ ఆశ్చర్యపడి ముక్కుమీద వ్రేలు వేసికొన్నది, ఇటువంటి చిన్న చిన్న కావ్యవిశేషములను గూర్చి కాదు. ఈ గ్రంథము నందలి దాసుగారి పాణి నీయ ప్రభుత్వమును పరికించి.

దాసుగారు కూడ ఈ తారకమును వ్రాసినది వారి పాండిత్య పీరమును ప్రద ర్శించుటకే. ఈ గ్రంథరచనను గూర్చి గ్రంథారంభమున వారు కఠిన నియమము లతో చేసిన ప్రతిజ్ఞ -

'అస్మిన్గ్రంథే శ్లోకేషు పాదపూరణమాత్ర ఫలక పద ముపసర్గస్య వోపసర్గ సమానాకారస్య పునరుక్తి రప్రసిద్ధోపసర్గ ఉతాప్రసిద్ధోపసర్గ సమానాకారో భిన్న

లింగవచన సాదృశ్యం లోకాతీత పదార్థ వాచకశబ్దోపినా దివ్ ధాతుఘటితం నాస్తి. లుఙ్ లఙ్ లిటో ద్విక్రియన్తే క్రమశః ప్రథమద్వితీయ తృతీయ సర్గేషు ద్వితీయ తృతీయ సర్గయోర్భూతేతర క్రియావాచకతిఙన్తరూపం న విద్యతే. పాణినీయ సూత్రాణామవైదికానా ముదాహరణమేతత్కావ్యమ్'.

(ఈ గ్రంథశ్లోకములలో పాదపూరణమాత్రఫలకపదము కాని, ఉపసర్గకాని, ఉపసర్గ సమానాకారముకాని, పునరుక్తి కాని, అప్రసిద్ధోపసర్గ కాని, అప్రసిద్ధోప సర్గ సమానాకారము కాని, భిన్నలింగవచన సాదృశ్యము కాని, లోకాతీత పదార్థ వాచక శబ్దము లేకుండగ దివ్‌ధాతు ఘటితము కాని లేదు. లుఙ్, లఙ్, లిట్లు క్రమముగా ప్రథమ ద్వితీయ తృతీయ సర్గలలో వాడబడినవి. ద్వితీయ తృతీయ సర్గలలో భూతేతరక్రియావాచక తిఙంతరూపము లేదు. అవైదికములైన పాణినీయ సూత్రములకు ఉదాహరణము ఈ కావ్యము)

ఈ గ్రంథము నందలి వ్యాకరణ విశేషములను బ్రహ్మశ్రీ అప్పల సోమే శ్వరశర్మగారి వివరణము-

"మొదటి మూడు సర్గలలోను వరుసగా లుఙ్, లఙ్. లిట్ అను లకారాలు మాత్రము వాడబడ్డాయి. ఇవి మూడున్ను భూతకాలాన్నే సూచిస్తాయి. అయితే కాంచెం తేడామాత్రం శాస్త్రీయంగా ఉంది. లుఙ్ అన్నది భూతసామాన్యాన్ని చెపుతుంది. అనద్యతనభూతాన్ని లఙ్ అనే లకారం సూచిస్తుంది. లిట్టు అనద్యతన పరోక్షభూతకాలాన్ని బోధిస్తుంది. ఏతదంతరూపాలు క్రియాపదాలన్నది విజ్ఞులకు విదితమే. వీనిలోని వింత ప్రయోగాలు మూడు సర్గల్లోను కనిపిస్తాయి. అభాక్షీత్ = సేవించెను. అవవర్ణత్ = గట్టిగా వర్ణించెను, ఉపాకర్మింస్త = ప్రారంభించెను, అబూబుధతామ్ = బాగుగా తెలిసికొన్నవి, అలులోకత్ = చూచెను, న్యభాస్త్సిత్ = కట్టెను, అశిశత్ = తినిపించెను, అవీవిదత్ = తెలియగోరెను, అపూర్ణచంద్రిత్ = నిండుచంద్రునివలె భాసించెను, అనులోభూయాంబభూవే = అనుభవించబడెను, మొదలయినవి. కర్త్రర్థంలో, కర్మార్థంలోను. ధాతువులకు వికరణ ప్రత్యయాలనే కాకుండా అనేక విశేషార్థాలను తెలిపే ణిచ్చు, సన్ను, యఙ్, యఙ్లుక్కు, క్యఙ, క్విప్పు, మొదలయిన ప్రత్యయాలు చేర్చిన రూపాలు కొల్లలుగా ఉన్నాయి.

నాలుగయిదు సర్గల్లో లకారాల నియమం లేదు. వింత వింత ప్రయోగాలు మాత్రం చాలాచోట్ల కనిపిస్తాయి. మౌక్తికంతి = ముత్యాలవలె ఉన్నాయి, తుహి

నంతి = మంచులాగ ఉన్నాయి, పిపురతి = పాలిస్తున్నారు, వ్యచ్ఛైత్సీత్ = ఛేదించెను, అభాషిషి = మాటాడితిని, దిధక్షతి = కాల్చగోరుచున్నది, మొదలగునవి. ఇటువంటి క్రియాపదాలను కవులు సామాన్యంగా ఒకటి రెండు స్థలాల్లోనే వాడుతూ ఉంటారు. తత్రాపి యఙ్లుగంత రూపాలను వాడడం కనబడనే కనబడదు. వానిని లౌకికభాషలో వాడకూడదని కొందరు వ్యాఖ్యానించారు కూడ. అటువంటి సమయ నియమాలను తారక కవి లక్ష్యపెట్టలేదు. ఆయన నిజంగా నిరంకుశుడు.

సొగసయిన సమాసాలు, భాషీయపదాలు గ్రంథం అంతటా అక్కడక్కడ చోటుచేసుకున్నాయి -

విశ్వవారః = ప్రపంచసముదాయం, దేవసభమ్ = దేవతలసమూహం, జానుచరః = ప్రాకేవాడు, తీర్థధ్వాంక్షః = చదువులేకుండా పది పాఠశాలలకు తిరిగేవాడు, కింపచానః = లోభి, ఖట్వారూఢః = మూర్ఖుడు, కద్వదః = చెడు మాటాడువాడు, అశ్నీతపిబతా = తినడం, త్రాగడం, కేశాకేశి, ముష్టీముష్టి, బాహాబాహి, మొదలయినవి.

కలాచణ, జాంఘిక, అప్రపదీన, అనుపదిన, సాప్తపదీన, కౌంతిక, కావచి, శాక్తీక, మహాకులీన, మొదలైన రమ్యమైన తద్ధితాంతశబ్దాలు పదింబదిగా అంతటా కనిపిస్తాయి.

ఇలాగే - భేదం భేదం, దారం దారమ్ = బాగా చీల్చి, లవణంకారమ్ = బాగులేనిదానిని బాగుందనుకుంటూ తినడం, సర్పిర్నిదాయమ్ = నేతివలె ఉంచుకొని, ప్రియాకృత్య = మంచిచేసుకొని, దుఃఖాకృత్య = ఏడిపించి, సమూలఘాతం = అందరను చంపి, మొదలయిన చిత్రమైన కృదంతాలు, భాషీయ సమాసాలున్నూ చాల ఉన్నాయి.

అప్రయుక్తాలు, అప్రసిద్ధాలున్నూ అయిన పదాలు కూడా క్వాచిత్కంగా కనబడతాయి. మంక్షు = శీఘ్రంగా, పంచజనః = మనుష్యుడు, పృథుకః = బాలుడు, అహంయుః = అహంకారం గలవాడు, యాయజూకః = యాగాలను చేయువాడు, వక్తిః = చెపుతున్నాడు, మహాబ్రహ్మః = గొప్ప బ్రాహ్మణుడు, మొదలయినవి.

ఈ విధంగా సుబంత, తిజంత, తద్ధితాంత, కృదంతావ్యయాదులన్నీ పాణి నీయానుసారం ఉదాహరించ బడ్డాయి[19].

ఈ గ్రంథము క్రీ. శ. ఏడవశతాబ్దపువాడైన భట్టికవి వ్రాసిన 'రావణవధమ్' (భట్టికావ్యము) వంటిది.

అన్యాపదేశధోరణి :

ఈ గ్రంథనాయకుడైన తారకుడు నారాయణదాసుగారే. ఈ మాట అనుటకు ఎన్నో సూచనలు కలవు.

తారకుని తండ్రి సత్యవచనుడు, శివభక్తుడు, దాత, పౌరాణికుడు, సంస్కృత పండితుడు, శిష్యులకు స్వధర్మోపదేశముచేసెడి గురువు. ఈ లక్షణములన్నియు దాసుగారి తండ్రియైన వేంకటచయనులు గారివే.

తారకుని తల్లి, భర్త చెప్పెడు పురాణమును విని వెంటనే యథాతథముగా తానుగూడ నితరులకు చెప్పకలిగెడిది. గొప్పయింటి బిడ్డ. ప్రియంవద. సజ్జన కీర్తనీయ. ఇవి యన్నియు దాసుగారి తల్లియైన నరసమ్మగారివే. ఆమెకు పురాణాల నరసమ్మగా రనియు, చదువులవ్వ యనియు ప్రసిద్ధ వ్యవహారము గలదు.

తారకుని తల్లిదండ్రులకు తారకుడు కడగొట్టు కొడుకు. దాసుగారుకూడ వారి తల్లిదండ్రులకు కడగొట్టు కొడుకేగదా.

తారకుడు దైవాంశసంభూతుడు. దాసుగారు కూడ దైవాంశసంభూతులని సమకాలీన జనశ్రుతి యున్నది. వారు ప్రదర్శించిన అనేకములైన అతిమానుష చర్యలే ఆ జనశ్రుతికి కారణము. విజయనగరప్రజలు వర్షములేక బాధపడుచుండ ప్రతిజ్ఞచేసి హరికథచెప్పి వర్షములో తడిసి యింటికి వచ్చుట, వైద్యులు ఆశవదులు కొన్నప్పుడు మృత్యుంజయశతకము చెప్పి ఒక్కరాత్రిలో సోదరుడైన పేరన్న జబ్బును వైద్యులు కూడ ఆశ్చర్యము చెందునట్లు పోగొట్టుట, మనుమనికి వచ్చిన మశూచికవ్యాధిని పోగొట్టి వారిపై ఆవాహన చేసికొనుట, ఏ గురుబోధలేకయే సంగీతము, నాట్యము, బహుభాషలు కూలంకషముగా స్వాధీనము చేసికొనుట,

---

19. శ్రీ ఆదిభట్ల నారాయణదాస సారస్వత నీరాజనము, పు॥ లు 570–72

ఆశీర్వాదమాత్రమున సంతతి లేనివారికి సంతానమును కల్గించుట, అవసానసమయమున విష్ణుదూతలతో మాటాడుట, మొదలగు అతిమానుషచర్యల నెన్నింటినో దాసుగారు చేసినట్లుగా విజయనగరమున జనశ్రుతులు కలవు.

తారకుడు నవరసరుచివేది, లలితచరణచారి, సాధ్వలంకారధారి, పరవశసుఖయోగి, చిత్రసంకల్పభోగి, కవిరాజు, వాగ్గేయకారుడు - ఈ లక్షణములన్నియు దాసుగారివే.

తారకుడు దేశసంచారప్రియుడు. దాసుగారు దేశసంచారప్రియులే కదా! ఇక తారకుని అభిప్రాయములన్నియు దాసుగారివే.

ఇక చంద్రద్వీపము బ్రిటిషుదీవులు. ముఖ్యపట్టణమైన చంద్రమతీనగరము లండను. చంద్రమతీనగరము ప్రక్కన ప్రవహించు 'చంద్రికాంత' అనునది లండను ప్రక్కనగల థేమ్సు నది. చంద్రమతీనగర ప్రజల వర్ణన మంతయు లండనునగర ప్రజల వర్ణనము. 'చంద్ర' అనునది 'శ్వేత' అనుదానికి సాంకేతికము విబుధనగర మనగా దాసుగారి విజయనగరమే.

ఇక ఈ తారక సందేశమును గూర్చి బ్రహ్మశ్రీ అప్పల సోమేశ్వరశర్మగారు చెప్పినమాట లివి -

'ప్రబంధరచనాకాలం క్రీస్తుశకం 1908-1910 ప్రాంతం. బ్రిటిషువారు భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రసాదించాలన్న విషయంలో నెమ్మది నెమ్మదిగా ఉద్యమాలు సాగుతున్న రోజులవి. మితవాదం, అమితవాదమున్ను ప్రక్క-ప్రక్కన వినిపిస్తూ ఉండేవి. అందులో మితవాదమే మంచిదని ఈ గ్రంథం సూచిస్తుంది.' [20]

దాసుగారి స్వీయాభిప్రాయములకు ఒక సంకలన గ్రంథము తారకము. దాసుగారికి పాణినీయముపై గల ప్రభుత్వము తారస్థాయియని తెలుపుగ్రంథము తారకము.

రూపకములు :

దాసుగారు వ్రాసిన రూపకములు రెండు. 1. దంభపుర ప్రహసనము, 2. సారంగధర నాటకము.

20. ఆదిభట్ట నారాయణదాస సారస్వత నీరాజనము, పు॥లు 574-75

దంభపుర ప్రహసనమను నామమునుబట్టి, గ్రంథకథను గూర్చి గల జ
బట్టి స్వతంత్ర గ్రంథమని నిస్సంశయాంశము. ఇక సారంగధరనాటకము
మందుగల సారంగధరకథకు ప్రతిబింబము కాదని 'An original drama
acts' అను దాసుగారి సారంగధర నాటక ముఖపత్రముపై నున్న అంశము
వచ్చినట్లు కన్పడుచున్న అంశము. అందువలన ఈ రెండు రూపకములు స్వ
గ్రంథములు.

దంభపుర ప్రహసనము :

దాసుగారు వ్రాసిన ఏకైక ప్రహసనమిది. ఇది అనుపలబ్ధకృతి.
గూర్చి వినుకలియే కాని కనుకలి భాగ్యము కలుగలేదు. ఆశతో చేసిన ఈ గ్ర
ప్రతిగవేషణము ఒక ప్రహసనమయ్యేనేకాని ప్రతిమాత్రము లభింపలేదు.[21]

దాసుగారు ఈ ప్రహసనమును వ్రాసినది 1890 లో. అప్పటికే వీరేశ
గారి బ్రాహ్మవివాహము అను మొదటి ప్రహసనము వచ్చినది.

సాహిత్యము నందలి ప్రతి ప్రక్రియకు విశ్వశ్రేయమే ప్రధానలక్ష్య
ప్రహసన ప్రక్రియలో సాగినట్లుగా సూటిగా, స్పష్టముగా, ఈ లక్ష్యము
ప్రక్రియలలో సాగదు. అంతేకాక ఈ ప్రహసనప్రక్రియ పరిమాణములో
ఆకర్షణశక్తిలో మిన్నది. అందువలననే ప్రజలను బాగుగా ఆకర్షం
వీరేశలింగముగారి ప్రహసనములను జూచి చిలకమర్తి, పానుగంటి, మొద
కూడ ప్రహసనములను వ్రాసిరి. దాసుగారుకూడ ఈ ప్రక్రియను స్వీకరిం
కారణము. హాస్యరసముతో రంగరించి సమాజవ్యాధులను నిర్మూలించు
పథము ప్రహసనము.

ఇక దాసుగారు వ్రాసిన ప్రహసనమును గూర్చి :-

'అకాలమునందే (1890) రచింపబడిన దంభపురప్రహసనము
(జులై, 1959) అచ్చుపడలేదు. శిలమయ్యేనో లేక మిగిలియున్నదో తె

21. దాసుగారి సమకాలికులు, విజయనగరనివాసులు అయిన
సూర్యనారాయణగారు (వకీలు), శ్రీ పేరి నరసింహశాస్త్రిగారు
పకులు, సంగీతవిద్వాంసులు) వ్రాతప్రతిని చూచితిమనుచునా
ప్రతిని గూర్చి సరియైన సమాచార మీయలేకపోయినారు.

ఇందలి పాత్ర లానాడు విజయనగరమున పురజనులలో గు ర్తింపబడెనట. పాత్ర సంభాషణలతో గూడ ప్రహసన మంతయు పద్యములలోనే విరచించబడెను' అను దాసుగారికి దగ్గరబంధువులైన శ్రీ మరువాడ వేంకటచయనులుగారి మాటలవలనను [22]

'Later on he produced a satire called Dambhapura Prahasanam. It contained caricatures of several of his contemporaries. Unfortunately the book was not printed and the original itself is missing' అను ఆదిభట్ల నారాయణదాస అముద్రితగ్రంథ ప్రచురణసంఘ కార్యదర్శియైన శ్రీ వసంతరావు బ్రహ్మాజీరావుగారి (1956) మాటల వలనను [23]

ఈ దంభపురప్రహసనము నిర్వచన పద్యప్రహసన మనియు, అందలి పాత్రలు దాసుగారి కాలమునాటి విజయనగర పురవాసులలో కొందరికి ప్రతీకలనియు, 1959 నాటికి ముద్రితము కాలేదనియు, అముద్రితప్రతికూడ చేతికి దక్కలేదనియు తెలియుచున్నది [24].

శ్రీ మరువాడ వేంకటచయనులుగారు, వారికి జ్ఞాపకమున్నవనుచు, ఆ ప్రహసనము నందలి వేసవి వర్ణనములోని ఒక ఉత్పలమాల వృత్తమును, ఒక సీసపద్యపాదమును వారి గ్రంథమున వ్రాసిరి.

'కాలువకంపు లన్బరగు గాడుపు లెల్లెడఁ దేళ్లు కుట్టగ
గ్గోలుగ నేడ్చు నేడుపులు - కుక్కలవేటలు దోమకాటులున్
బ్రేలెడి సోదె బూచులును - శేగు విశూచులు పొక్కుపుండ్లునున్
గాలెడి నిండ్లుకల్గి నరకంబయి వేసవివచ్చె నిచ్చటన్'

వేడినెత్తురు గ్రాగి వింత మత్తునజోగి
పసుగు పర్గున పాటఁబాడె దోమ' [25]

---

22. శ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాస జీవితచరిత్రము, పు. 262
23. 'Adibhatla Narayana Das', P. 35
24. కాని విజయవాడ యందలి సరస్వతీ బుక్ డిపో యజమాని దంభపుర ప్రహసనము ముద్రితమైనదనియు, తాను కొన్ని కాపీలను అమ్మితిననియు నాతో గట్టిగా చెప్పినాడు. ఒకసారి శ్రీ కర్రా ఈశ్వరరావుగారు, ఆచార్య యస్వీజోగారావుగారు వెళ్లగా వారితోకూడ నిట్లే యన్నాడట.
25. శ్రీ మదజ్జాడదిభట నారాయణదాస జీవిత చరిత్రము, పు. 262

శ్రీ వేంకటచయనులుగారికి గుర్తున్న ఈ సపాదపద్యమే దాసుగారి దంభపుర ప్రహసనమును గూర్చి ఆంధ్రప్రజల కిప్పటికి మిగిలిన గుర్తు.

సారంగధర :

'సారంగధర' దాసు గారు వ్రాసిన ఏకైక నాటకము. ఇది యైదంకముల గద్యపద్యాత్మక నాటకము. అంకములు మరల రంగములుగా విభక్తములు. ఈ నాటకముఖపత్రముపై నున్న 'An original drama in 5 acts' అనుదాని వలన, దాసుగారు ఈ నాటకమును స్వతంత్రనాటకముగా భావించి నట్లు స్పష్టము. కాని కథానాయకుడైన సారంగధరుని కాని, చిత్రాంగి, రత్నాంగి, సుబుద్ధి, మొదలగు ప్రధానపాత్రలను గాని ఆంధ్రసాహిత్య రంగస్థలమునకు మొదటగా పరిచయము చేసినది దాసుగారు కాదుకదా! కనుక ఈ నాటక మెట్లు స్వతంత్రనాటక మగును? అన్నది వెంటనే కలుగుశంక. ఈ శంకాశల్యమును పీకివైచుటకు దాసుగారి నాటకాంశముల వంక తీరికగా చూడకతప్పదు.

ఈ నాటకమునకు కథాస్థలము రాజమహేంద్రవరము. దీనికి రాజు రాజరాజ నరేంద్రుడు. ఇతని కిరువురు భార్యలు. 'శారదాపరావతారను, పతిప్రతాశిరోమణి, కనికరముకన్నకడుపు' అగు రత్నాంగి పెద్దభార్య. పాపాత్మురాలు, దుర్మార్గురాలు అయిన చిత్రాంగి చిన్నభార్య. సారంగధరుడు రత్నాంగీ రాజరాజనరేంద్రులకు 'పరమేశ్వరు కరుణచే' కలిగిన పుత్రుడు. 'సంగీతసాహిత్య సంపద' కలవాడు. పదునెనిమిదేండ్ల వయస్సుగల అవివాహితుడు, సొగసరి. చిత్రాంగిసారంగధరులకు 'పెండ్లికై మొదట నేర్పాటు జరుగుసు. తరువాత ముసలిరాజు ఆమెను వలచి కట్టుకొనును'. 'మనసున్నవాడు కట్టుకొనకపోయె - కట్టుకొన్నవానిపై మనసు కుదర దాయె, అను స్థితిలో నుండి, సారంగధరునిపై 'ప్రాణము' పెట్టుకొన్న చిన్నది చిత్రాంగి. ఇది నాటకప్రారంభమునకు ముందున్న పూర్వరంగము.

చెంచునాయకుని ప్రార్థనచే రాజరాజనరేంద్రుడు పంటలను పాడుచేయుచున్న మృగములను వేటాడుటకు అడవికి వెళ్లును. సారంగధరుడు సుబుద్ధితో (మంత్రి పుత్రుడు, ప్రియమిత్రుడు), గిలిగింతతో (విదూషకుడు) ఉద్యానవనాంతర్గత సౌధ' ప్రాంతమున పావురములు ఎగురవేయుచుండ, సారంగధరుని పావురము చిత్రాంగి మేడపై వ్రాలును. పావురము కొరకు సారంగధరుడు గిలిగింతను పంప, చిత్రాంగి మనస్సు తెలిసిన అంటింత (చిత్రాంగి దాసి) 'దేవిగా రిదివరకే యా పావురమునుబట్టి తమయొద్ద నుంచుకొన్నారు. చిన్నప్రభువుగారితో తల్లి యొద్దకు

కొడుకు వచ్చుటకేమి యభ్యంతరము అని సెలవిచ్చినారుగనుక నీవేగి చిన్నప్రభువు వారిం దోడ్కొనిరా' అని గిలిగింతను వెనుకకు పంపును. గిలిగింత తెచ్చిన వర్తమానము విని సారంగధరుడు బయలుదేర, 'పూర్వము సారథి యడ్డపడినపుడు మీ ముత్తాత యభిమన్యుడు సాహసించినట్లు మీరును జనుచున్నారు' అని సుబుద్ధి అడ్డగించినను వినిపించుకొనక సారంగధరుడు చిత్రాంగి సౌధమును జేరును. చిత్రాంగి యిదే సమయమని చిత్రచిత్ర సంభాషణములతో రాజపుత్రుని వశపరచుకొన ప్రయత్నించి విఫలయై, చివరకు సిగ్గును బుగ్గిజేసి –

రక్తికన్వర్చఁ బిగిలిన రయికఁ జూడు
కోరి మొలపయిజాఱిన కోఁకఁజూడు
గడగడవడంకు మైమూరు కాఁకఁజూడు
మాఱుపల్కక నన్నొక్కమాఱు కూడు – పు. 45

అని పోకు పోకుమని అడ్డుపడ, సారంగధరుడు –

నిను ననుంగూర్చి విభుని కన్నీరు చూడు
మీఱె చాలెడు నపకీర్తి నోరు చూడు
సైపఁజాలని నాదు కైజాఱు చూడు
బుద్ధిగాని తుచ్ఛపుటా మోహము విడనాడు – పు. 45

అని అడ్డకు తొలగు తొలగుమని తిరస్కరింప, 'రేపు నీరక్తము బొట్టుపెట్టుకొనక నాపగదీరునా?' అని బెదరించును. 'సత్యహృదయముతో హాయిగా చచ్చెదను' అని సారంగధరుడు ఆమె సౌధమును వీడి వచ్చును. అక్కడనుండి సారంగధరుడు, వలవంతతో (రత్నాంగి దాసి) మాటాడుచున్న తన తల్లియైన రత్నాంగి దగ్గరకువచ్చి జరిగిన ఘోరమంతయు చెప్ప, నీవు సత్యమును గాపాడినావు సత్యము నిన్ను గాపాడదా?' అని సారంగధరుని యోదార్చి తాను బాధపడును.

ఆరాత్రి అంటింత ఈ ఘోరమును మనసులో దాచుకొనలేక తన భర్తయైన గిజిగన్నతో చెప్పను. గిజిగన్న నేస్తుడు, హంతకనాయకుడు అయిన జబ్బన్న వీథి యరుగుమీద నుండి ఈ వృత్తాంత మంతయు వినును. అతడు అంత 'చిన్న ప్రభువు వారిపై నేరము మోపబడినయెడల వారు నాచేతికి కదా యొప్పగించ బడు

దురు. దేవుడు నాకీ నిజమును ముందుగా తెలియనిచ్చుట మేలే: 'ఓహో, చిన్న ప్రభువువారెంత మంచివారు' అని యనుకొనుచు వెడలును.

రాజు వేటాడి యడవి నుండి వచ్చును- 'దుస్స్వప్నహేతువు'న వెడవెడ నిద్రతో రాత్రి గడిపి, బడలికతో కోట చేరి, విదూషకుని చమత్కారగర్భిత సత్య వాక్యముల సారమును తెలిసికొనలేక, కోపగృహములోనున్న తన 'ప్రాణధనమైన' చిత్రాంగిని చేరి సరసము లాడును. చిత్రాంగి లేనిదుఃఖమును నటించుచు మెల్ల మెల్లగా అసత్యము లాడుచు, చివరకు - 'అంటింతా, నాకు నోరాడదు. నీవు దెలుపుము. పోనీ నేనే చెప్పెదను. ఆ పాపాత్ముడు (సారంగధరుడు) పావురము మిషతో నిక్కడకు వచ్చి నన్ను బలిమి చెరపట్టినాఁడు. నేనెంత మ్రొక్కినను విన్నాఁడుకాఁ డాఁడుదానిని నేనేమి చేయఁగలను? తమతోఁ జెప్పుటకు బ్రతికియున్నా నిఁక నేదో తెఱవు చూచుకొని యీ ప్రాణముం బోఁగొట్టుకొనెద నపకీర్తి బ్రతుకు నాకెందుకు?' అని తన పగ ఫలించునట్లు నాటకమాడును. రాజు కామోన్మత్తుడై సారంగధరుని బ్రతుకనీయరాదు అని నిశ్చయించుకొనును.

కలత చెందిన సారంగధరుడు సుబుద్ధి 'తత్త్వవాక్యముల' వలన 'మరణ చింతలేక' వైరాగ్యమనస్కు డగును. ఇంతలో గిలిగింత వచ్చి చిత్రాంగి రాజుతో ఆడిన కపటనాటకము చెప్పును. దానికి సారంగధరుడు 'దీనికేమి, చావున కిన్ని చావులు లేవుగదా! ఈ పాపిష్ఠలోకమున్విడచుటయే మేలు' అని వైరాగ్యముతో పలికి, సుబుద్ధితో గూడి సర్వేశ్వరుని కీర్తనలో నిమగ్న మగును.

రాజు 'ధర్మస్థానమున' విచారణ పెట్టును. అంటింత, అంటింతచే ఆస పెట్టబడిన పురోహితుడు చిత్రాంగి పక్షమున అసత్యసాక్ష్యము చెప్పుదురు. విచారణ పూర్తియైన పిదప మంత్రి, మహాకవి గాయకశిరోమణి సారంగధరుడు నిర్దోషి యని యన్నను, రాజు కోపముతో 'ఆలస్యముసేయక యీ పితృద్రోహికిఁ గాలుసేతులు నఱికి వేగ మిటురండు' అని యాజ్ఞాపించును.

ఇంతలో చిత్రాంగి సారంగధరునకు వ్రాసిన ప్రేమలేఖను అంటింత మ్రింగ బోవుచుండ, గిలిగింత చూచి అరచును. మంత్రి అంటింత చెంతనుండి ఆ పత్రమును లాగికొని వచ్చి చదివి విన్పింప రాజు ఆశ్చర్యపడి, అంటింతను నిలదీసి, నిజము చెప్పుమన అది వాస్తవకథ యంతయు చెప్పును. జరిగిన మోసమును

తెలిసికొని, రాజు భటునితో 'ఎవడురా! రాణివాసము లేదు, గిణివాసము లేదు. చిత్రాంగిని గొప్పపట్టి నలుగురీడ్చుకొని రండు' అని యరచును. భటులు తిరిగి వచ్చి 'ఆమె విషముత్రాగి మృతి నొందినది' అని చెప్పుదురు.

రాజు దుఃఖముతో రత్నాంగి యంతఃపురమున కేగి, రోదించి, రోదించి, మూర్ఛచెందిన రత్నాంగిని చూచును మూర్ఛదేరి తాను బాధపడుచునే, ఎదుట దుఃఖించుచున్న భర్తనుచూచి రత్నాంగి 'అయ్యో! నా ప్రాణనాథ! డెంత దుఃఖించుచున్నాడు. నేనింక సీతని నోదార్చనియెడల( గిడుమూడును. నా కొడుకుకన్నను మఱియు నీ మూ(డులోకములకన్నను నా భర్తయే కదా నా కెక్కు(డు' అని తలంచి భర్తనోదార్చును. ఆత్మహత్య చేసికొనదలచిన భర్తను వారించును. ఇంతలో హంతకులు వచ్చి 'సజీవులై చిన్నప్రభువువారున్నారతనికే యపాయమును లేదు' అని చెప్ప, సారంగధరుడు సజీవుడన్న వార్తకు రత్నాంగీ రాజరాజనరేంద్రులు సారంగధరుని గన్న రత్నాకరేంద్రుని వలె నుప్పొంగి, పుత్రుని చెంతకు వెళ్లుదురు వీరు వెళ్ల లోపలే సారంగధరుడు సిద్ధుడై వనముల చరించుటకు ప్రతిజ్ఞ పూనును. అతనిని సుబుద్ధిగూడ అనుసరింపదలచెను. తల్లి రాగా సారంగధరుడు తన నిర్ణయమును చెప్పును. తరువాత తండ్రి వచ్చి తన తప్పు మన్నింపుమని, రాజ్యము స్వీకరింపుమన, సారంగధరుడు తల్లికి చెప్పినట్లే తండ్రికి కూడ తన నిర్ణయమును చెప్పును. అంత రాజు, సారంగధరుడు పుట్టకమున్ను దత్తత తీసికొన్న చంద్రచూడునకు రాజ్యము నొసగును. రాజు కూడ వానప్రస్థుడగును. వైరాగ్యసంపద నందర కిచ్చిన ఆ పరమేశ్వరుని అందరు ప్రార్థింతురు.

సారంగధరుని తన నవనాథచరిత్రలో వ్రాసి ప్రప్రథమముగా ఆంధ్ర సాహిత్యమునకు పరిచయము చేసినవాడు గౌరన. గౌరన 'హస్తవాసి' యెటువంటిదో కాని, అతని హరిశ్చంద్రునికథ వలెనే, ఈ సారంగధరుని కథ కూడ నెందరినో ఆకర్షించినది. గౌరనకథను ఎవరిచిత్తము వచ్చినట్లు వారు మార్చి వ్రాసినారు.

గౌరన కథలోని సారంగధరుడు మాళవదేశములోని మాంధాత పురాధిపతియైన రాజమహేంద్రుని కొడుకు. ఆంధ్రుడుకాడు. సారంగధరుని వేంగిదేశ ప్రభువైన రాజరాజనరేంద్రుని కొడుకుగా మార్చి ఆంధ్రుడుగా చేసినది బాలభాగవత ద్విపద గ్రంథకర్తయైన దోనేరు కోనేరునాథుడు. చేమకూర వెంకన్న తన సారంగధర చరిత్ర ప్రబంధములో, కథ మాళవదేశములో జరిగినట్లు చెప్పుచు, ఆ రాజ

నరేంద్రునకు రాజమహేంద్రపుర మను ఒక క్రొత్త పట్టణమును నిర్మించినాడు. అప్పకవి తన అప్పకవీయములో సారంగధరుని నన్నయభట్టునకు శిష్యుని చేసినాడు. నన్నయభట్టు భారతావతారికలో రాజరాజనరేంద్రుని పాండవవంశజు డన్నాడు. బాణాల శంభుదాసుడు తన ద్విపద సారంగధర చరిత్రలో ఆ పట్టణమును రాజ మహేంద్రవరముగా చేసినాడు. ఇక కూచిమంచి తిమ్మకవి తన ద్విపదకృతియైన సారంగధరచరిత్రలో చిత్రాంగిని రాజపుత్రికను చేసి, సారంగధరుడు చూచిన వధువులలో నొకతెగా మార్చినాడు.

నారాయణదాసు గారి నాటకకథలో – కథాస్థలము, మాళవదేశముకాక ఆంధ్ర దేశ మగుట బాణాల శంభుదాసుని కథాంశము. సారంగధరుని తండ్రి పాండవ వంశజుడైన రాజరాజనరేంద్రు డనుట నన్నయ ఆంధ్రమహాభారతావతారికాంశము. గౌరన కథలోవలె వేశ్య కాక చిత్రాంగిని రాజపుత్రికగా, రాజరాజ నరేంద్రుని చిన్నభార్యగా చిత్రించుట కూచిమంచి తిమ్మకవి గ్రంథాంశము. సారంగధరుడు రత్నాంగీరాజరాజనరేంద్రులకు పరమేశ్వరుని కరుణ వలన పుట్టిన వాడనుట గౌరన కథాంశము. చిత్రాంగి సారంగధరులకు మొదట వివాహప్రయత్నము జరిగిన దనియు, పిదప రాజరాజనరేంద్రుడు చిత్రాంగిని వివాహమాడె ననియు చెప్పుట కూచిమంచి తిమ్మకవి కథాంశము. గౌరన కథలో వలె సారంగధరునకు కరచరణ ముల ఖండనము జరుగక, సత్య మెరిగిన జబ్బన్న యను హంతక నాయకునిచే కాపాడబడి రహస్యముగా నుంచబడుట దాసుగారి క్రొత్తకల్పనము. దీనివలన దాసుగారి కథలో గౌరనకథలో వలె సిద్ధుడు వచ్చి కరచరణ రహితుడై పడియున్న సారంగధరుని రక్షింపవలసిన అతిమానుషచర్యకు అవసరము లేకపోయినది. ఇట్లే దాసుగారి కథలో చిత్రాంగి నిజస్వరూపము అంటింతయొద్దగల 'చిత్రాంగి సారంగ ధరునకు వ్రాసిన ప్రేమలేఖ' వలన రాజరాజ నరేంద్రునకు తెలియును. గౌరన కథలో వలె ఆకాశవాణి వలన కాదు. రాజరాజ నరేంద్రుడు తన రాజ్యమును దత్తపుత్రుడైన చంద్రచూడున కిచ్చుట గౌరనకథ కాదు. ఇదికూడ దాసుగారి కల్పనమే.

ఇట్లు దాసుగారి నాటకములోని ప్రధాన కథాంశము లన్నియు పూర్వకవుల గ్రంథములలో నున్నవే. ఆ కథలలో దాసుగారు తమకు నచ్చిన అంశములను ఏరుకొని కూర్చిన కథ, దాసుగారి ఈ సారంగధర నాటక కథ. కనుక దాసుగారి

సారంగధర నటకకథ ఏయొక్క పూర్వసారంగధర కథకు యథాతథానుకరణము కాదు. ఇట్లు ఏ యొక్క పూర్వగ్రంథకథకు యథాతథానుకరణము కాకపోవుటయే. దాసుగారు వారిసారంగధరనాటకమును స్వతంత్రనాటకముగా భావించుటకు కారణము.

ఈ నాటకకథలోని రత్నాంగి, చిత్రాంగి, రాజు, సారంగధరుడు, సుబుద్ధి మొదలైన ప్రధానపాత్ర లన్నియు గౌరన గ్రంథము నందలివే. అంటింత (చిత్రాంగి దాసి), వలవంత (రత్నాంగిదాసి), గిలిగింత (విదూషకుడు), గజిగన్న (రంగులువేయు చాకలి), జబ్బన్న (హంతక నాయకుడు), మహాకవి గాయకశిరోమణి (సారంగధరుని గురువు), పురోహితుడు (లంచము తీసికొని చిత్రాంగివైపు వాదించినవాడు) అను పాత్రలు దాసుగారు కల్పించిన పాత్రలు. ఆ పాత్రల వృత్తులనుబట్టి, మనఃప్రవృత్తులనుబట్టి, దాసుగారు అర్థవంతములుగా నామకరణములు చేసిరి. దాసుగారు ఇట్లు పాత్రలకు సార్థక నామములను పెట్టుటకు, గౌరన మంత్రికుమారునకు పెట్టిన 'సుబుద్ధి' యను నామము మార్గదర్శకము.

ఈ నాటకము నందలి 'సారంగధరుడు, సుబుద్ధి, మహాకవి గాయకశిరోమణి, గిలిగింత' అను పాత్రలు తలకొక చరణముగా ఆశుకవిత్వము చెప్పుట ఒక విశేషము. సారంగధరుడు, సుబుద్ధి ఈ నాటకమున సంగీతకవిత్వము లందు మంచి ప్రజ్ఞ కలవారు.

సారంగధరకథ అనగనే, సహృదయ పాఠకుని కన్ను వెదకు అంశములు కథన చమత్కారములు. ప్రతి హరికథలో ప్రేక్షకుల నాడిని ప్రత్యక్షముగా పసికట్టి, వారి యభిరుచులకనురూపములైన కథనముతో మెప్పించు సమయోచితసామర్థ్య ప్రదర్శన ప్రజ్ఞ గల దాసుగారు, అవకాశమున్న ఈ సారంగధర కథలో వారి కథన చమత్కారశక్తిని ప్రదర్శింపకుందురా? అనేకవిధాల ప్రదర్శించిరి.[26]

ఇక సందర్భోచిత రచనకు మచ్చుతునకలు ఒకటి రెండు -

చిత్రాంగి మేడచిత్రములు :

ఇదుదట్ల కీల్బొమ్మ లింపుఁగఁ బాడఁగ
స్వర్గంబు నెక్కింపఁ జాలు మెట్లు

26. ఈ నాటకమందలి చమత్కారములు 'చమత్కార చారుత్వము' అను విభాగమున చేరినవి.

అద్దంబువలె మేని నంతయుఁ గన్పర్చఁ
జాలిన మన్నని పాలగచ్చు.
జీవకళల తోడఁ జెలఁగి నవరసముల్
చెలువారఁ జూపెడి చిత్తరవులు
మాటి మాటికి వింత మాటలాడుచుఁ బంజ
రము లలరించు గోరలు చిలుకలు

కలుగు నీ మేడపై నుండి కాంచునపుడు
క్రింది జనములు చీమల చందముగను
తోఁటలుం బూరి బయళులు వాటముగను
గానఁ బడుచుండెఁ దిరిగెడి కన్నుఁగవకు - పు- 38

ఈ హర్మ్య వర్ణనము అతిశయోక్తులతో ఆకాశహర్మ్యములు గట్టక స్వభా వోక్తులకు సమీపబంధువుగా మన్నది.

గిలిగింత తెల్లవారుజామున పాడిన మేలుకొలుపు పాట :

ప॥ మేలుకో యినుఁడ - మేలుకో ఘనుఁడ

అ॥ మేలుకో యినుఁడ - మేలుకో ఘనుఁడ
మేలుకో చీకటి జాలు ముసుఁగు దీసి ।మే।
జారులు చోరులు సల్పిన ఘోరము
జనుల కెఱుకపర్చ మేలుకో
... ... ... ... పు. 56

ఈ పాటను వేటనుండి వచ్చుచున్న పెద్ధరాజు వినును. ఇనుడు అను శబ్ధ మునకు సూర్యుడు, ప్రభువు అని రెండర్థము లున్నవిగదా. ఒక అర్థము అంధ కారమును తొలగించి కన్నులు తెరపించు జగచ్చక్షువునకు మేలుకొలుపుకాగా, మరి యొక అర్థము కామాంధకారముతో కన్నులు కానని చారచక్షువునకు మేలుకొలుపు.

చంద్రవర్ణనము :

ప్రొద్దుజాడలఁ గసిగంది హొద్దుమించి
జాఱిఁగిపోయిరి నాదగు చుక్కబంట్లు
ఇడుమపాటున బలగము లెడసియుంట
తెల్లమని రిక్కరాయఁడు వెల్లబొాఱె    పు. 57

తానొనర్చిన చీఁకటితప్పెఱిఁగియు
మగని విధిలేక కనిపెట్టు మగువఁబోలె
వెలితివడి ప్రొద్దుముంగల నిలిచె చంద్రుఁ
డాకసపు పెనమందు మాడట్టు వలెను    పు. 58

ఈ రెండు పద్యములలో చంద్రవర్ణనముతోపాటు కథాపరములైన అర్ధములు కూడ సూచితము లగుచున్నవి. మొదటి పద్యమున 'సారంగధరుని సోయగము చూచి విరహాముతో హద్దుమించి చక్కని చుక్కయైన చిత్రాంగి లొంగిపోయినది. తన ముద్దులభార్యయే యిట్లు చేసినదని తెలిసికొని రాజు తెల్లబోయెను! అనియు, రెండవ పద్యములో 'తాను చేసిన తప్పు తెలిసియుండియు, గతిలేక చిత్రాంగి మగని మాడినముఖముతో కనిపెట్టుకొని యున్నది' అనియు కథాపరములైన అర్థాంతరములు.

చిత్రాంగి సారంగధరుల సంభాషణ ఘట్టములో. చిత్రాంగికి కొంతసేపు సమాధానము చెప్పి, ఇక లాభములేదని గ్రహించి 'ఈ ఘోరపాపమునకు నే నంగీకరింపకున్న నన్నిమె బ్రతుకనీ దెట్లైన సరియె' అని నిశ్చయించుకొని, 'అమ్మా! నీకిట్టి పాపపుబుద్ధి తగదు. మనసు మళ్లించుకొనుము' అని పలికి సారంగధరుడు-

జగదేక వీరమూర్తి కి
నుఁగురాణివి మేటి చదువునుం జదివిన నీ
వనుచిత భాషణముల నీ
తనయునితో నిట్లు లాఁడదగునే తల్లీ!    పు. 44

అను పద్యము నను. ఈ పద్యమున మొదటి రెండుపాదాలలో నున్న ప్రాస, తుది రెండుపాదాలలో చెడినది. చెడినది ప్రాసకాదు. చిత్రాంగీసారంగధరుల 'ధ్యాస'. వారి మనస్సులు మారుట ఈ ప్రాస మారుటలో దాసుగారు సూచించినారు.

ఈ నాటకము నందు దాసుగారు ఇతఃపూర్వమే వ్రాసిన పద్యములను కొన్నిం టిని చేర్చినారు. ఇది భవభూతి, తిక్కనాద్యనేక పూర్వకవుల పరిపాటియే.

ఈ నాటకము నందు దాసుగారు కల్పించిన మరువలేని పాత్ర మహాకవి గాయకశిరోమణి. ఈ పాత్ర లేకపోయినను కథ కుంటుపడదు. కథకు అనవసరము లైన పట్టులందు కవి కల్పించు పాత్రలు కవి వ్యక్తిత్వమునకు ఆయువుపట్టులు. ఈ నాటకము నందలి మహాకవి గాయకశిరోమణి భావము లన్నియు దాసుగారివే. ఈ నాటకము నందలి మహాకవి గాయకశిరోమణి. ఎవరోకాదు, మహాకవిగాయక శిరోమణి యైన నారాయణదాసుగారే!

నాయెఱుక :

'నా యెఱుక' నారాయణదాసు గారి స్వీయచరిత్ర [27] ఇది న్యాయవాదియైన శ్రీ జయంతి కామేశముపంతులుగారి కంకితము. ఈ వచన గ్రంథమునకు నామ మైన 'నాయెఱుక' కొంత ఆసక్తి కలిగించు నామము. దాసుగారుఉద్దేశ పూర్వకము గనే ఈ నామకరణము చేసిరి. వారి ఉద్దేశ మిది యని జనశ్రుతి.

నాయెఱుక అన నేనెరిగినది. అనగా నన్ను గూర్చి లోకమెఱుగనిది, నేను మాత్రమే యెఱుగునది. నేనెంత ప్రసిద్ధుడనైనను నా బాల్యాదులను, నేను ఈ స్థితికి వచ్చుటకు కారణములు ఉద్బోధకములునైన అంశములను లోక మెఱుగలేదు. కాని తెలిసికొనవలెనను ఆసక్తి చూపును. అందులకే లోకమెఱుగలేనిది, నేను మాత్రమే యెఱిగినది అయిన నా యీ లోకప్రసిద్ధికి గల పూర్వరంగ మంతయు వివరించినాను. ఈ గ్రంథమునకు 'నా యెఱుక' అని పేరు పెట్టుటకిదే కారణము.

27. Auto biography అను దానికి సమానార్థకముగా వీరేశలింగముగారు వాడిన 'స్వీయచరిత్రము' అపప్రయోగమని బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు అధిక్షేపించినారు. స్వకీయ చరిత్ర అనికాని, సౌవ చరిత్ర అనికాని, స్వచరిత్ర అనికాని అనవలెనని శాస్త్రిగారి వాదము. (సరస్వతి-1911 మార్చి).

దాసుగారు ఈ స్వీయచరిత్రను వారిముప్పదియేండ్ల వయసువరకు మాత్రమే వ్రాయగా, దానికి శిష్యుడొక డొకసారి 'మీరు ముప్పదియేండ్లవరకు మాత్రమే వ్రాసి ఆపితిరేమి?' అని అడిగెనట. దానికి దాసుగారు – 'స్వీయచరిత్ర ప్రతివ్యక్తి వ్రాయునది కాదు. లోకప్రసిద్ధి పొందినవాడు మాత్రమే వ్రాయవలసినది. అట్టివాని చరిత్ర కొఱకే లోక మెదురుచూచుచుండును. కాని ఎంత ప్రసిద్ధుడైనను తన చరిత్ర తానే సంపూర్ణముగా వ్రాయుట సరికాదు. లోకప్రసిద్ధి పొందిన తరువాత వాని జీవితమునకు ప్రమాణము లోకము. కనుక ప్రసిద్ధి వచ్చిన తరువాతి జీవితమును వ్రాయుట స్వీయచరిత్రకారుని పని కాదు. అది జీవితచరిత్రకారుని పని– నేను ముప్పదియేండ్లకు లోకప్రసిద్ధుడనైనాను. నేను ముప్పదియేండ్లవరకు వ్రాయిట కిదే హేతువు' అని సమాధాన మిచ్చిరని పరంపరాగత సమాచారము.

శిష్యుడడిగిన ఈ ప్రశ్నకు దాసుగారు చెప్పిన సమాధాన మని మఱియొక హాస్య సమాధానమును శ్రీ మరువాడ వేంకటచయనులు గారిట్లు గ్రంథస్థము చేసినారు.

'ఎవ్వని చరిత్రయైనను ముప్పదియేండ్లు వఱకే లోకమెఱుగవలయును. ఆ పైని అనవసరము. ముప్పదియేండ్లవరకే సుగుణముండును. ఆపైన పేరాసయు, అసంతుష్టియు పెచ్చురేగిపోవును. దైవత్వము నశించును. దేవతల నందుకే త్రిదశు లనినారు. ముప్పదియేండ్లుదాటిన నందరు రాక్షసులే.'[28]

దాసుగారు చెప్పిన ఈ సమాధానము నందలి సత్యాసత్యములజోలికి పోక 'నాయెఱుక'కు అమూల్యమైన పీఠిక వ్రాయుచు కుమార ధూర్జటి శ్రీ వావిలాల సోమయాజులుగారు దాసుగారు ముప్పదియేండ్లవరకు వ్రాసిన దానికి చక్కగా సమన్వయము చేసిరి. వారు చేసిన సమన్వయమిది –

'సర్వత్ర పూజ్యత, స్వస్థలవిజయపరితృప్తి లభించినదశ శ్రీ దాసుగారి ముప్పదియేండ్ల వయసుతో ముగిసినది. శిష్యశిక్షార్థము ప్రదర్శింపవలసిన సమస్త ముఖ్యలక్షణములను గల వారి ప్రౌఢవ్యక్తిత్వము ఈ వయసునకు పూర్ణముగ రూపొందినది. లోకమునకు మార్గదర్శకములుగ వెల్లడింపదగిన జీవితానుభవము లన్నియు వారికీకాలముననే చేకూరినవి. ఈ సమస్త విశేషమును 'నాయెరుక'

28. నారాయణదాస జీవితచరిత్రము, పు॥ లు 237–38

రచనకు పూనుకొనుటకుముందే సింహావలోకన మొనర్చి యుండుటవలననే శ్రీ దాసు గారు తమ స్వీయచరిత్రకు ముప్పది సంవత్సరముల జీవితకథనే వస్తువుగా పరిమిత మొనర్చి స్వీకరించియుందురు'[29].

ఇకనారాయణదాసుగారి ఈ 'నాయెఱుక' తెలుగుభాషలో వెలసిన స్వీయ చరిత్రలలో కాలానుగుణముగా ఏస్థానము నాక్రమించును? అని అవలోడనము చేసి నచో-

'తెలుగులో స్వీయచరిత్రలు లేవనియు అట్టిదానిని తాను వ్రాయవలయు ననియు దాసుగారికి తోచెను. అంతట తన చరిత్ర వచనమున ముప్పదియేండ్ల వరకు దాసుగారు వ్రాసెను. ఇంతలో శ్రీ వీరేశలింగంపంతులుగారి స్వీయచరిత్ర ప్రథమ భాగము బయల్వడెను. దాసుగారు తాము వ్రాయుచుండిన స్వీయచరిత్రము నాపివేసిరి' [30] అను వేంకటచయనులుగారి వాక్యముల వలన దాసుగారి 'నాయె ఱుక' ప్రథమాంధ్ర స్వీయచరిత్ర మని యనుకొనవలయును.

కాని శ్రీ వీరేశలింగంపంతులుగారు 'తెలుగుభాషలో స్వీయచరిత్రమును వ్రాయఁబూనుట కిదియే ప్రథమ ప్రయత్నము'[31] అని వ్రాసికొనిరి. ఈ వాక్యము వలన శ్రీ వీరేశలింగం గారి స్వీయచరిత్రము ప్రథమాంధ్ర స్వీయచరిత్రమని యనుకొనవలయును.

ఇది ఇట్లుండగా శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు 'తెలుగులో ఆత్మ చరిత్రమును రచించుటకు శ్రీ వేంకటశాస్త్రిల వారే ప్రథములని చెప్పవలయును. ఇప్పటికి 35 సంవత్సరముల క్రితము అనగా శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారి స్వీయచరిత్ర రచనమున కించుక పూర్వమే యీ గ్రంథ రచన యారంభింప బడినను ఉత్తరార్ధ రచనము మాత్రము మొన్న మొన్ననే జరిగినది' [32]

అని 20-9-1934 వ తేదీనాడు వ్రాసిరి. ఇట్లే ఆచార్య దివాకర్ల వేంకటావ ధానిగారు పల్కిరి.

---

29. నా యెఱుక, పీఠిక, పు. 3
30. శ్రీ మదజ్ఝాడాదిభట్ట నారాయణదాస జీజితచరిత్రము – పు. 537
31. స్వీయచరిత్రము – అవతారిక, పు. 12
32. జాతకచర్య – ఉపోద్ఘాతము

'తెలుగున వేంకటశాస్త్రిగారు కందుకూరివారి స్వీయచరిత్ర రచించుట కించుక పూర్వమే పద్యరూపమున జాతకచర్య యను స్వీయ చరిత్రను రచించుట కారంభించిరి'[33]

వీరిరువురి వాక్యములవలన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి 'జాతకచర్య' ప్రథమాంధ్ర స్వీయ చరిత్రమని యనుకొనవలయును.

పై అభిప్రాయములను ఒకచోట గుది గ్రుచ్చినచో తేలు సారాంశమిది-

దాసుగారి 'నాయెఱుక', పంతులుగారి 'స్వీయచరిత్రము', శాస్త్రిగారి జాతకచర్య, ప్రథమాంధ్ర ఆత్మచరిత్రములను వాదములున్నవి. కనుక వీనిని బట్టి ఈ మూటిలో ఏది ప్రథమాంధ్ర స్వీయచరిత్రయో తేల్చుట కష్టము.

ముద్రణ దృష్టితో చూచిన, పంతులుగారి స్వీయ చరిత్రములో కొంత భాగము చింతామణి ముద్రాక్షరశాలలో తొలిసారిగా ముద్రితమైనది 1903లో. శాస్త్రిగారి జాతకచర్య మొదటగా ముద్రితమైనది 1934లో. దాసుగారి నాయెఱుక ముద్రితమైనది 1976లో. కనుక ప్రకటన క్రమప్రకారము మొదటగా ముద్రితమైనది పంతులుగారి స్వీయ చరిత్రము, తరువాత శాస్త్రిగారి జాతకచర్య, తరువాత దాసుగారి నా యెఱుక.

ఇక ఈ గ్రంథములు వ్రాసిన కాలములను పరిశీలించినచో, కాటూరివారి వాక్యములవలన జాతక చర్య వ్రాసినది ప్రకటనకు 35 సంవత్సరముల పూర్వము అనగా (1934-35) 1899లో.

ఇక్కడ మరియొక విషయము. శాస్త్రిగారి జాతకచర్య పద్యాత్మక మగుటచే స్వీయచరిత్రము కావచ్చునుగాని, సీయచరిత్ర ప్రక్రియకు చెందదు. పద్యాత్మకములైన స్వీయ చరిత్రములను స్వీయచరిత్రల ప్రక్రియల కోవలోనికి తీసికొనినచో, వీరందరికంటె ముందుగా పద్యములలో వ్రాసిన శ్రీ కొక్కొండ వేంకటరత్నముగారి, శ్రీ మండపాక పార్వతీశ్వరకవిగారి ఆత్మచరిత్రములను ముందుగా లెక్క-

---

33. తిరుపతి వేంకట కవులు – అం॥ ప్ర॥ సంగీత నాటక అకాడమీ ప్రచురణ పు॥ 42

లోనికి తీసికొనవలెను. ఏ భాషయైనను ఇబ్బంది లేదనుకొన్నచో శ్రీ వెన్నెలకంటి సుబ్బారావుగారు ఆంగ్లవచనములో వ్రాసిన స్వీయ చరితము వీనన్నిటికంటె ముందే ముద్రితము (1873).

కనుక శాస్త్రిగారి పద్యాత్మకమైన జాతకచర్య స్వీయచరిత్ర ప్రక్రియకు చెందదనుకొన్న ఇక మిగిలిన పంతులుగారి, దాసుగారి గ్రంథములలో ఏది తొలి రచనయో నిగ్గు తేల్చవలెను.

పంతులుగారి రచనాకాలమునకు ప్రకటనకాలమునకు పెద్ద వ్యవధిలేదు. కనుక వారి రచనకూడ 1903లోనే, ఇక దాసుగారి నా యెఱుక ఎప్పుడు వ్రాసినదో సరిగా తెలియదు. కాని వేంకట చైనులుగారి మాటలవలన, పంతులుగారి స్వీయ చరితముకన్న ముందుగా ప్రారంభింపబడినదని తెలియుచున్నది. చైనులుగారు దాసుగారికి దగ్గరబంధువు. పైగా దాసుగారి సాహిత్య కన్యకల జాతక సమాచార ములను బాగుగా నెరిగినవారు. కావున వీరి మాట కొట్టివేయుటకు వీలు లేదు. కనుక దాసుగారు నాయెఱుక ప్రారంభించినది 1903నకు పూర్వము.

ఇది యిట్లుండగా దాసుగారు 'నాయెఱుక' ఎప్పుడు వ్రాసినదో తెలిసికొను టకు 'నాయెఱుక' యందే ఒక ఆధారమున్నది.

'అవ్విచిత్ర వివాహకర్త కాలేజీలో తెనుగు పండితుడును సంఘసంస్కరణ కర్తయు నగుటచే గ్రమముగ యూనివర్సిటీ ఫెలో యై తన పుస్తకములు ఇంగ్లీషు పాఠశాలలో పాఠ్యగ్రంథములుగ బెట్టించుకొని యా మూలమున ధన మార్జించు కొనుచుండును.'[34]

అని పంతులుగారిని తమ గ్రంథములో దాసుగారు విమర్శించినారు. పంతులు గారు Fellow of Madres University అయినది 1898 లో. ఈ అంశము నా యెఱుకలో నున్నది కనుక, నా యెఱుక పుట్టినది 1898 కి తరువాత. కనుక దాసుగారి నా యెఱుక పుట్టినది 1898-1903 కి మధ్యకాలమున.

కనుక ఫలితాంశమేమనగా, రచనా ప్రారంభ దృష్టితో చూచిన నారాయణ దాసుగారి 'నాయెఱుక', ప్రకటన దృష్టితో చూచిన వీరేశలింగము పంతులు గారి 'స్వీయ చరిత్రము' ప్రథమాంధ్రస్వీయ చరిత్రలు.

---

34. నా యెఱుక – పుట – 154

ఇక ఈ గ్రంథ విషయముపై దృష్టి మరల్చినచో -

'లోకులచే నేనెఱింగినదియు నాస్వయముగా తెలిసినదియు మదీయానుభూతి దెలుపగోరి యిద్దాని వివరించెద. బాల్యయౌవన దశలను గల యనుభవము నన్ను గూర్చియు లోకము గూర్చియు నే దెలిసినమట్టుకు వ్రాసెద' అని గ్రంథప్రారంభ వాక్యమే నాటకము నందలి నాందివలె కావ్యార్థ సూచకమై వారి గ్రంథవిషయమును) సూచించుచున్నది.

ఈ స్వీయచరిత్ర యందలి వస్తువు - జననవిషయము నుండి (1864 విజయనగరప్రభువైన ఆనందగజపతిచే టౌనుహాలులో ప్రశంస లందుకొన్నవరకు (1897) గల ముఖ్యములైన ఘట్టములతో గూడిన నారాయణదాసుగారి జీవితము.

ఈ విషయమును చక్కని సన్నివేశముల సమావేశములతో, జీవకళలతో నుట్టిపడు పాత్రలతో, ప్రబంధసంబంధులైన వర్ణనములతో, స్వీయములైన గుణ లోపముల నిర్భీక నివేదనములతో, సమకాలీన సాంఘికవాతావరణ వివరణములతో, ఉపమానములతో, సూక్తులతో, అన్యదేశ్యములైన పదములతో, వ్యవహారబలముతో సాదుసమాసములను ప్రక్కకు నెట్టిన వైరిసమాసములతో, సందర్భోచితములైన పద్యములతో, చమత్కారములతో శుష్కమైన స్వీయచరిత్రము కానీయక పుష్కల మైన కావ్యత్వములో ముంచి దీనినొక మంచి గద్యకావ్యముగా నావిష్కరించినారు.

జయంతి కామేశము గారితో, భీముడి గారితో గల సంబంధము, మాటతప్పిన వేశ్య, వెలయాలిపరీక్ష, బందరులో గానమున పోటీలు, నరసన్నపేట వేశ్య, మైసూరులో 'బందే బందే' మొదలగునవి రసవత్తర సన్నివేశములు.

దాసుగారు, వేంకటచైనులు, జగ్గావధాని, పేరన్న, జయంతి కామేశముగారు భీముడుగారు, మాటతప్పినవేశ్య, నరసన్నపేటవేశ్య, విచిత్రవివాహకర్త, మదరాసు కాలేజీ ఆంధ్రోపాధ్యాయుడు, డిప్యూటీ కలెక్టరు, తప్పుపట్టిన వైణికుడు, మైసూరు మహారాజు, ఆనందగజపతి, మొదలగునవి చక్కగా పోషింపబడిన పాత్రలు.

బరంపురవర్ణనము, సింహాద్రిఅప్పన్న దర్శనము, పడవప్రయాణము, బాల్యదశావర్ణనము, బెంగుళూరు ప్రయాణము, రాజమండ్రి టౌనుహాలు వర్ణనము మొదలగునవి ప్రబంధవాసనలు గుబాళించు వర్ణనలు.

'నేను మర్త్యులను గొల్వను' అని తన్నాదరింపదలచిన మైసూరు ప్రభువుతో ననుట, 'మీకేమి కావలెను?' అని అడిగిన రేవారాణితో 'పరమేశ్వర కటాక్షము కంటె కోరదగినది యేమియును లేదు' అని యనుట, తనకున్న పెద్దగురుని, చిన్న గురుని సేవలను, వేశ్యాసంపర్కములను దాచకుండ చెప్పుట, మొదలగునవి స్వీయ లోపముల నిర్భీకనివేదనములు.

నీటికొరకై గంగాస్తుతి చేసి బావి త్రవ్వించుట, పండుగలు, ఆచారములు, ఆటపాటలు, వేశ్యల వ్యవహారములు, మద్యములు, ఉద్యోగభేదమునుబట్టి సంఘ గౌరవభేదము, పండితులకుట్రలు. ప్రభువుల కొలువుకూటములు, రాజమంత్రి టౌనుహాలు, మొదలగునవి సమకాలీన సాంఘిక వాతావరణములు.

'నడుమంత్రపుబ్బర సిరిద్దిని క్రొవ్వుజనులవలె నుబ్బుజలగలను, గాల్కొను చున్న ధవళమేఘంబులవలె త్రేలెడు ప్రత్తిచేలను .... నిరతాన్నదాతల వలె పేరు వన్నులభజీవనము చేతికందెడు జలాశయంబులను, లేజవ్వనముమాడ్కి జిగురు బలసిన యుద్యానవనంబులను, వేదవిహితధర్మములమాడ్కి నొప్పుచేర్చు నోడలను, నునుసిగ్గు వలపుక్రీగంటిచూపుమాడ్కి ప్రతిక్షణాహ్లాదకరములగు తీగ మెఱపుగము లను, మంటల్రమోగు ఫిరంగులవలె మెఱపులన్ గర్జిలు కారుమబ్బులను, రేబవళ్లం చెరిపిలేక జీవనసంతుష్టిసలుపు సప్తాహంబులవలె విలసిల్లు మునిళ్లను, విధివిహితం బుగ సకల జనాహ్లాదకరంబుగ జరుగు గణపతి నవరాత్రంబులను, లుబ్ధగేహంబు మాడ్కి పథిక సంచారవిరహితంబులగు మార్గంబులను, పరువుమాలిన పామరులవలె జెలరేగితిరుగు కుక్కురమిదునంబులను, బయల్పడని మునులవలె దలచూపవి కోయిలలను .... .... (పు. 62)

శివాచారి వలె గోలబట్టి దిరుగు దాసుని కీతి పోతుపేరంటాలపోల్కి సాని పాపకై వడి శృంగారరసమును, శక్తిహీనునిభంగి మెట్టవేదాంతమును, అపన్నునిగతి భక్తియుం దెలుపుచు హరికథల జెప్పుచు .... (పు. 93)

కడుపున జఠరాగ్నివలె స్టీమరు నడుమ నగ్నికుండమున్నది (121)
ఏనుగుతల యూడునట్లు గాలికి స్టీమరు రెండుప్రక్కలం దూగుచుండెను (121)

అనుకూలశత్రువుమాడ్కి బైకినల్లగ నుండినను సముద్రపు గాలి లోపల కాకచేయుచుండును (117)

ఎవరికిం దెలియనటు ధనమార్జించుకొను దొంగవలె జప్పు డొకింతయులేక పసవ పోవుచున్నది (128)

హరిదాసులవలె నాశ్రయించినవారలను మాత్ర మొడ్డున జేర్చుచు దాము దరి జేరలేని కట్టమ్రాకులును (128)

కాల్వ కిరుతట్ల నిండు జవ్వనమున గుబ్బచన్నవన్ గ్రిక్కిరిసిన మాడ్కి గెలలగుపచ్చ కొబ్బరులును (128)

తాము సుఖముండినకొలది పలువురదోడ్కొని రక్షించు యజమానులవలె, దమ కడుపు నిండినకొలది పసవలం దత్తరగ నీడ్చి కొనిపోవు తెరచాపలును, పరపతిం బోగొట్టు దబ్బరపల్కు రీతి గాలింగూడనీని తెరచాప ఛిద్రంబులును ... (129)

మొదలగునవి అడుగడుగున దాసుగారి లోకపరిశీలనమును నుడివెడి యుపమానములు.

రూపాజీవలు శ్మశానకుసుమముల వలె వర్జనీయులు (134)

గుద్దులాడినగాని కులము బయలుపడదుగదా! (136)

పిల్లిచాంద్రాయణమువలె గలికాలపు వైరాగ్యము నమ్మ పాటముకాదు గదా! (156)

వెలబోటుల విశ్వాసము గగనారవిందము, శశవిషాణము, వంధ్యాపుత్రులవంటిది (133)

వ్యసనరహితు లెక్కుడనో తప్ప గొడ్డువారివలె గార్హస్థ్య దూరులవలె కఠినాత్ము లయ్యెదరు (149)

సర్వలోక రంజకమగు విద్యావైభవము కలవాడొకచో తల నమ్ముకొనబోడు (164)

పెద్దగురుడు నరికి చిన్నగురుడు పిరికి [34] (181)

మొదలగునవి సందర్భసుందరములైన సూక్తులు.

పిఠాపురం మహారాజు పళ్లెముతో రూపాయలనిచ్చుచు సంతృప్తిపొందడు అవి యనుచు 'అసంతుష్టో ద్విజోనష్టః' అని చమత్కరింపగా వెంటనే దాసుగారు 'సంతుష్టఇవపార్థివః' అని తిరిగి చమత్కరించుట - (112)

కొందరు బ్రాహ్మణులు 'సాహెబూ! సాహెబూ! ఎక్కువ జాతిపిల్లను పెదవిమాత్ర మెంగిలిసేయకు' మనునట్లు తమజాతిం కాపాడుకొనుచుండిరనుట (121)

ఒకవేశ్య దాసుగారితో 'మీవంటి శృంగారశేఖరులు, పరమపవిత్రులు నిషాకములు చేయదగు వృత్తికి జొరగొనుట తగదు' అనియన, 'కొలనునుండి కొండ కేగిన కలహంసది తప్పుగాని కాకిది తప్పా?' అని యనుట - మొదలగునవి చమత్కారములు. (150)

శివకోవెల, సర్పజెముడు, యుద్ధపుంజు, భరద్వాజవిందు, మొదలగునవి వైరిసమాసములు.

తుంబ, తరవాణి, వంతర, పెయ్యమ్మ (పెద్దతల్లి), తోచ్చి (పినతల్లి), అచ (అన్న), చిట్టి (పినతండ్రి), మొదలగునవి మాండలిక పదములు. పెద్దగురుడు, చిన్నగురుడు, గోవిందుడు (మద్యములు) మొదలగునవి సాంకేతిక పదములు.

---

34. 'నల్లమందు నరికి, గంజాయి పిరికి' అని శ్రీకాకుళ మాండలిక లోకోక్తి 'పెద్దగురుడు' అన నల్లమందు, బ్రాందీ, మొ॥ మద్యములు. 'చిన్న గురుడు' అన భంగులేక గంజాయి.

ఈ స్వీయచరిత్ర వలన కొన్ని వింతలు విశేషములు వెలుగు చూచినవి. మచ్చునకు కొన్ని -

జగ్గావధాని బలము, తిండి :

జగ్గావధాని దాసుగారి పెద్దన్న. ఆజానుబాహుడు. దొంగలు ఒకసారి ఇతనిని చూచి 'యిదెక్కడి మనిషిరా! కొండలాగున్నాడు' అని పారిపోయిరి. మరి యొకసారి విజయనగరప్రభువు ఇతని విగ్రహమును చూచి 'ఏపాటి భోజనము చేసెదవయ్యా?' అని అడుగగా 'మహాప్రభో! నాతో దండెపట్లిన వారుగూడ బట్టలేరని నాయభిప్రాయము. క్రమాంతస్వాధ్యాయపేత్తను. ఏలినవారు చిత్తగించినచో నా భోజనవైభవము దెలియును' అని సమాధానమీయగా ప్రభువు సంతోషించి కోటకు రప్పించి, కాగినపాలను లడ్డువులను ముందువెట్ట, జగ్గావధాని పన్నెండుసేర్ల పాలను, తొంబది లడ్డువులను దిని 'యిది రాత్రిపూట. మధ్యాహ్నము నందైన నింతకు రెట్టింపు పుచ్చుకొందును' అన ప్రభువు నిర్ఘాంతపోయెను (పు.83)

ఈ జగ్గావధాని అమానుషబలమును గూర్చి 'నాయెఱుక' లో విపులముగా గలదు. ఒకటి రెండు మాటలు -

'అతడు (జగ్గావధాని) క్రమాంతస్వాధ్యాయపేత్త. ఉర్లాము పరీక్షలో నుత్తీర్ణుడు. భోజనమునకు తగిన విగ్రహపుష్టి, విగ్రహమునకు తగిన యమానుష బలము, బలమునకు తగిన ధైర్యసాహసములు, బలపరాక్రమములకు తగిన వైదికాచార సంపదయు నోర్పును గల సత్పురుషుడు. నవ్వులకైన నబద్ధమాడని సజ్జనుడు' (62,63)

'మా పెద్దక్క యత్తవారి యూరగు పిడిసీలకు వచ్చుచున్నప్పుడు మొలబంటి యేటి దొంగయిసుకలో కూరుకొని కదలక యెడ్లతోటి బండిని మాపెద్దన్న బండినొగలకును దన మొలకును పెద్ద మోకు చుట్టబెట్టుకొని యొడ్డున నిలబడి సుళువుగ నొడ్డెంక్కించుట నిజముగ నమానుషచేష్ట'. (పు. 63)

'మాపెద్దన్న యొక పెద్దకమ్మిబండియుండపై కోడెవయసువాండ్రను పదుగురను కూర్చుండబెట్టి పైకి తోడుట నేనెరుగుదును. ఆ బలమునకై యచటి చూపరులందరు మిక్కిలి యాశ్చర్యము నందిరి. మరొకపుడు రెండు గజముల రేవటియూబిలో గూరొక్కని యుడుపుటాకు కట్టలతో నిండుకొన్న కమ్మిబండి కొక

వైపు పెద్దఎనుపోతును బూన్చి, యద్దాసిగ్గోవుల నదల్చమని, తానొకవైపున గుండె నాని, మా పెద్దన్న యొక్కఁడును నూరుగజములమేర నా బండిని మడిగట్టునకు లాగుకొని వచ్చినపుడిది యమానుషబలమని మా యూరువారందరును గొనియాడిరి' (23.)

'మా పెద్దన్న యీత చోద్యమైనది. యోడవలె కదలక మెదలకనీటిలో వెలికిల బడుకొంటయు నతనిపై పదిమంది కూర్చుండుటయు, ఇందరిని భరించుచు నెంతమాత్రము చలించక కాలిపట్టి యెటులాగిన నటు వచ్చుటయును మిక్కిలి యద్భుతము' (88).

శ్రీ జయంతి కామేశము పంతులుగారి కవితాప్రీతి :

శ్రీ జయంతి కామేశము పంతులుగారు 'చేయెత్తు పొడవగు రూపసి. లోకోత్తరుడు, భాగవతోత్తముడు, గొప్ప పండితుడు, కవి, హైకోర్టు వకీలు, పదిలక్షల రూపాయలకు పైగా నార్జించిన త్యాగభోగరాయడు' (4).

కామేశము పంతులు సంస్కృతాంధ్రములలో ప్రశస్తముగ కవితచెప్పగల డతడొనర్చిన జానకీవర శతకము రామశతకమును ముద్రింపబడినవి. ఇంగ్లీషున ఓఢ్రమున మేటి పాండిత్యము గలదు. లా యందు మిక్కిలి నిపుణుడు' (95).

'కోటిపిల్లి యను గ్రామమున పంతులు (జయంతి కామేశముపంతులు) నేను [దాసుగారు] కలసి యేబదిగంటములకు చెరియొక పాదము చొప్పున నేబది పద్యములు కవిత్వము చెప్పితి మందులో నొక పద్యముదాహరించెద-

నాళీకంబులఁ గేరుకన్నుఁగవ సన్నల్చేల్వు ఘాటింపఁగా
శ్రీలింతేసి వసంతుడెచ్చూతమనుచున్ జెన్నారు చందోయిపై
గాలింబయ్యెద దూలఁగా జనులు దన్గాంక్షించి వీక్షించఁగాఁ
గాళింగాంగన చెర్వుఁజేరు హొయలుంకంటెన్మనోజ్ఞంబుగా.

ఇందులో విషమచరణంబులు నేను, సమచరణంబులు పంతులును జెప్పినాము' [99]

దాసుగారిని నాలుగునెలలకుపైగా తనతో నుంచుకొని. 'సింహాలలాటపు బంగరుమురుగులు, ఒక పట్టుపంచలచాపు, ఒక బనారస్సుఖండువా, ఒక జల్తారు తాజు, నాలుగువందల రూప్యముల నగదు' ఇచ్చి సాగనంపుచు, 'చంద్రునకు ఒక నూలుపోగన్నట్లు నీకిచ్చినాడ. ఋణస్థుడనైయున్నదశలో వచ్చినా వింకొక మాటు నేబ్రతికియున్నచో నీకధికముగా నిచ్చెదను' అని బండివెనుక ఫర్లాంగు కంటతడితో వెంటవచ్చి వీడ్కోలు చెప్పుచు 'సూరన్నా! లోకము నిన్నెరుగజాలక నీకవజ్ఞత సేయుదురేమో' అని వగచిన కవితాప్రియులు కామేశము పంతులుగారు-[102]. ఈ అనుబంధము వలననే దాసుగారు ఈ స్వీయచరిత్రను వీరికి అంకిత మిచ్చిరి.

భీముడిగారి రసికత :

భీముడుగారు రాజమండ్రి యందొక పేరుపడిన న్యాయవాది. దాసుగారికి ప్రాణస్నేహితుడు. 'మిక్కిలి రసజ్ఞుడు, మాటలపోగు'. భార్యమరణించిన తరువాత ఏలూరులో నొకవేశ్యతో కాలక్షేపము చేయుచున్నవాడు. భీముడిగారి తల్లికోర్కె ప్రకారము దాసుగారు, వివాహము చేసికొనుమని కోరగా, భీముడుగారు 'రాత్రి పడ్డ గోత పగలు పడునట్లు, డబ్బిచ్చి తద్దినము కొనునట్లు, వదిలిన పీడద్దిరిగి తెచ్చుకొనునట్లు నడికాలమున దిరిగి నాకు వివాహ మెందుకు? దేవుని కృపచే నొక పుత్రిక కలెగెను గదా! చాలును. నేనానందరాయుడను గనుక మరి సంసారపు చిక్కు నాకక్కరలేదు' [131] అని చెప్పినాడు. మరియొకనాడు 'ఓయీ! ఇక నాకు పెండ్లెందుకు? నీవు చూచితివిగదా యాపె [ఆ వేశ్య] నన్విడిచి యితరుల కూటమి చేసినట్లు నీవు రుజువు చేసినయెడల తప్పక తక్షణమే పెండ్లి చేసికొనెదను. విశ్వాసము కలది కులాంగనయైన నేమి? వేశ్యాంగన యైననేమి? హాయిగ కాలక్షేపం సేయవచ్చునుగదా' [133] అని చెప్పిన భోగప్రియుడు. 'రూపజీవలు శ్మశాన కుసుమముల వలె వర్జనీయలు' అని దాసుగారనగా, దానికి 'వినుమోయీ! వేయేల? అపె నన్ను విడిచి యితరులతో సంభోగించినట్లు దృష్టాంత మగుపర్చెదవేని పెండ్లాడెదను. నీ వాపెను శోధించు, నీకు సందిచ్చెద. నేడే రాజమండ్రికిపోయి నెలరోజులలో తిరిగి వచ్చెద. పిదప నీవెట్లు చెప్పిన నట్లు నమ్మెద' [134] అని చెప్పిన స్నేహశీలి.

విచిత్రవివాహకర్తతో విరసము :

శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులు గారికి దాసుగారు పెట్టినపేరు విచిత్ర వివాహకర్త. దాసు గారికి వీరేశలింగముగారు చేయుంచు పునర్వివాహములన్న గిట్టవు. పంతులుగారికి దాసుగారుచెప్పు హరికథలన్న పట్టవు. ఈ మహామహు లిరువురకు ఒకరిపై నొకరికి సదభిప్రాయము ఇట్లు లేకపోవుట ఈ స్వీయచరిత్ర వెల్లడిచేయుచున్నది. హానరబుల్ ఆపేట్రన్ పంతులుగారికి, వీరేశలింగముగారికి, దాసుగారికి మధ్య జరిగిన ఒక సంభాషణము.

ఆపేట్రన్ : [దాసు గారిని గూర్చి] నిన్నటిరాత్రి యిత దత్యద్భుతముగ హరికథ చెప్పి సభికుల రంజింప జేసెనట.

వీరేశ : [మొగము ముడుచుకొని] ఛీ! యేమి హరికథలు, వెధవ హరికథలు బండబూతు హరికథ.

దాసుగారు : [నవ్వుచు] పంతులు గారికి సహవాసబలము కాబోలు నెల్లప్పుడు విధవాస్మరణము చేయుచుందురు.

ఆపేట్రన్ : నిన్నరాత్రి దాసుగారి పాట దేవదుందుభులు మ్రోసెనట.

దాసుగారు : పాటసంగతి వారెరిగినచో వెధవ కథలని తిట్టెదరా?

వీరేశ : [పండ్లు కొరుకుచు] నీపాట పిచ్చాయికి [ఒక వేశ్య] తెలియును.

మరియొకరు : నారాయణదాసుగారి కవిత్వము వంటి ఒరిజనల్‌ఫ్లో సాధారణముగా మరెవరికిని లేదు.

వీరేశ : పోనిండు, ఆ మాటన్న నాకసహ్యాము, పోకిరీగుంటకారు.

ఈ సంభాషణము [176] వలన వారిరువురి మధ్య అభిప్రాయభేదము లెట్లున్నవో స్పష్టము. ఇట్లు భిన్నాభిప్రాయులై యుండుట ప్రారంభము నందు మాత్రమే. తరువాత దాసు గారిని వీరేశలింగముగారు సన్మానించినట్లు సాక్ష్యము లున్నవి.

రాజమండ్రి టౌనుహాలు :

పనికిరాని కబుర్లతో కాలమును వ్యర్థముచేయువారందరు క్లబ్బులలో చేరెదరని దాసుగారి భావము. ఈ భావమునకు స్వభావోక్తులతో చేసిన వర్ణనము టౌనుహాలు వర్ణనము. అ పెద్ద ఘట్టము ప్రారంభము నందలి పంక్తులు కొన్ని-

'ఉదయము నుండి సాయంకాల మైదుగంటల వర కుద్యోగముల నలసి డస్సి యచట కాలయాపనము చేసికొనుటకై కొందరు, ఇంటిబాధ పడజాలక కొంతసే పైన నొంటిగ సుఖముండుటకై కొందరు, గుఱ్ఱపుబండ్లపై బైసికిళ్లపై నుండియు వచ్చి తమ డాబు చెలాయించుటకై కొందరు, తగిన యధికార్ల సహవాసము దొరు కును గదా యని యిచ్చకములు బల్కుచు నాత్మలాభముకై కొందరు, ఇంటిలో కూరనార చూచుకొనక న్యూస్‌పేపర్ల టప్పాలు రుచిమరగి మరింత మనఃక్షోభ నొందుటకై కొందరు, ప్లీడర్లుద్యోగులు, కలిసి టప్పాలు కొట్టువారు, పనికి మాలిన వృద్ధ ఘటములు, పెన్షనుదార్లు మొదలగు పలురకములు క్లబ్బుపురువులు, ........[174]

నాడేకాదు, నేడుకూడ 'క్లబ్బు' లలో కన్పించువారలలో వీరలే ఎక్కువగదా!

ఉద్యోగుల ఎక్కువ తక్కువలు :

'గవర్నమెంటు నౌకరు మొదట గౌరవనీయుడందు క్రిమినలధికారి శ్రేష్ఠుడు. సివిలు రెండవరకము. మావైపు భోజనము చేయువేళ ఫస్టుక్లాసు పంక్తిలో మొదటి విస్తరి డిప్యూటీ కలెక్టరుగారు. తరువాత శిరస్తాదారు గారు, తరువాత సబ్‌మేజి స్ట్రేటుగారు, తరువాత మునుసబుగారు, తరువాత, ఇనస్పెక్టరుగారు, తరువాత హెడ్‌గుమాస్తాగారు, తరువాత నాజరుగారు, తరువాత ప్లీడరు, తరువాత చిల్లర గుమాస్తాలు. రెండవక్లాసు పంక్తిలో జీతమునుబట్టి తరగతిగా జమీందారీ యుద్యోగులు. మూడవక్లాసు పంక్తిలో స్కూలు మాష్టర్లు, పిదప దిక్కుమాలిన పంక్తిలో పండితులు, వైదికులు, కొట్టకొనకు గాయకులును భిక్షుకులును' [పు. 165]

ఇంకను ఈ స్వీయచరిత్రలో టిక్కెట్టుపెట్టి చేసిన అష్టావధాన విశేషములు, దాసుగారి 'క్లాసుమేట్సు' వివరములు, రాజోద్యోగుల కుట్రలు, రకరకములైన దాసుగారి ఊహలు, మొదలగు విషయము లెన్నియో చోటుచేసికొన్నవి.

'స్వయముగ చెప్పవలసిన ఆగత్యమున్నంతటి తన జీవితకథను మాత్రమే స్వీయచరిత్రకారుడు వస్తువుగా స్వీకరింపవలెను. అన్యమైన జీవితకథను ప్రదర్శించు పని జీవితచరిత్రకారునిది'[35] అన్న సందేశ మందించు స్వీయచరిత్ర 'నాయెఱుక'.

35. శ్రీ వావిలాల సోమయాజులుగారు – నాయెఱుక, పీఠిక　　పు. 5,

మృత్యుంజయాష్టకము :

ఇది మృత్యుంజయుని భక్తితో స్తుతించిన అష్టకము కావలెను.

'అతడు (విజయనగర న్యాయవాది శ్రీ జల్లేపల్లి హనుమంతరావుపంతులు) చనిపోవుముందు దాసుగారిని పిలిపించి మృత్యుంజయాష్టకము చదువుడని కోరి విని, శ్రీ శంకరస్వాములవారి కవిత్వమువలె నున్నదని శ్రీ దాసుగారి కాళ్లు దన కన్నీట కడిగి యభయము నొంది స్వర్గస్థుడాయెను'[36] అను మాటలవలన దాసుగారు మృత్యుంజయునిపై ఒక అష్టకము వ్రాసినట్లు స్పష్టపడుచున్నది. కాని ఈ అష్టకము లభింపలేదు.

ఇది సంస్కృతభాషలో వ్రాసిన అష్టకమని జనశ్రుతి. కాని మార్కండేయ చరిత్ర హరికథలో సంస్కృత సమాసరచనాభూయిష్ఠమైన 'మృత్యుంజయా' అను మకుటముతో నున్న ఎనిమిది పద్యములే'[37] దాసుగారి మృత్యుంజయాష్టకము అని అనిపించును.

ఇట్లు అనిపించుటకు వ్యస్తముగానున్న మంచి పద్యములను సందర్భాను సారముగా గ్రంథస్థములు చేయుదాసుగారి అలవాటు ఒకకారణము. సహజముగా తేటతెనుగులో వ్రాయు దాసుగారిట్లు సంస్కృత సమాసములతో కుప్పించుట వలన దీనిని సంస్కృతాష్టకమని విన్న జనులు భావించియుండవచ్చు నను అవకాశము ఇంకొక కారణము.

ఈ అష్టకము విడిగా దొరక కుండుటచే దీనినిగూర్చి ఇంతకన్న సమాచారములేదు.

బాలరామాయణకీర్తన :

ఇది బాలబాలికల కొరకు రామాయణకథను పదునొకండు చరణములుగా వ్రాసిన కీర్తన. ఈ కీర్తన ఇప్పటివరకు అముద్రితము. శ్రీ మరువాడ వేంకట చయనులుగారు వారు వ్రాసిన నారాయణదాస జీవితచరిత్రము నందు (పు. 169) మొదటి రెండు చరణములను ఉటంకించిరి.

---

36. నారాయణదాస జీవితచరిత్రము - శ్రీ. మరువాడ వేంకటచయనులు, పు. 192

37. 'మృత్యుంజయా' అను మకుటముతో నున్న ఎనిమిది పద్యములు మార్కండేయ చరిత్ర హరికథ యొద వచ్చినవి.

ఏ వృద్ధరసనయోవచ్చి రక్షించువరకు దాసుగారి ఈ కీర్తనకు ఆంధ్ర సాహిత్యలోకమున ఇట్లు చరణద్వయ సంచరణమేకదా అని బాధపడుచు-దాసుగారి బంధువులను కనబడిన ఏ ఒక్కరిని కూడ వదలక అడుగగా, అడుగగా శ్రీ మరువాడ నారాయణరావుగారు (వకీలు, రాజమండ్రి) వారి వదినె గారికి నోటికి వచ్చునని తెలిపి, వారే కష్టపడి సేకరించి పంపిరి. ఇట్లు ఈ కీర్తన నేటికి పూర్తిగా బైటపడి దాసుగారి రక్త బంధువులతో పాటు సాహిత్యానురక్త బంధువులకు కూడ పరిచయమైనది.

కీర్తన:

1. ఆడుదమా గుమ్మి ఆడుదమా - మంచి
కోడెకత్తియలెల్ల గూడుదమా
పాడి మీరగ పాట పాడుదమా - భక్తి
తోడుత రాముని వేడుదమా ॥ఆడు

2. దశరథ నృపతికి బుట్టినాడే - అల్ల
కుశిక సుతుని వెంట బెట్టినాడే
నిశిచారుల నెల్ల గొట్టినాడే - తపసి
నెలత శాపమును బోగొట్టినాడే ॥ఆడు

3. మిథిలానగరు ప్రవేశించినాడే - నృపులు
మెచ్చ శివుని విల్లు త్రుంచినాడే
పృథివిసుతను వరియించినాడే - చాల
పృథుతరకీర్తిని గాంచినాడే ॥ఆడు

4. పరశురాముని భంగపరచినాడే - తన
పడతిగూడి సిరుల మించినాడే
గురువాక్యములు పాలించినాడే - (అంత)
గురుతరాటవుల కేతెంచినాడే ॥ఆడు

5. (నారీమణి ననసూయయను) పొడగాంచినాడే - అచట
నారచీరెలు ధరియించినాడే
పొంగువిరాధుని ద్రుంచినాడే - శర
భంగుని చాల దర్శించినాడే ||ఆడు

6. పంచవటిని ప్రవేశించినాడే - శూ
ర్పణఖ ముక్కు సెవులు ద్రుంచినాడే
కంచుతీరులవారి ద్రుంచినాడే - మాయ
కాంచనమృగము నడంచినాడే ||ఆడు

7. సతి కోలుపోయి పలవించినాడే - తన
సహజన్ముతోడ దుఃఖించినాడే
కతము తెల్పెడు పక్షి కాంచినాడే - దాని
కరుణతోడుత నగ్గి నుంచినాడే ||ఆడు

8. హనుమంతు జూచి భాషించినాడే - వాలి
నని గూల్చి యినజు బోషించినాడే
వనచరుల దెసల బంచినాడే - తనదు
వనిత సేమము నాలించినాడే ||ఆడు

9. జలనిధివేగ గమియించినాడే - వన
చరులతో లంక నాక్రమించినాడే
దనుజులపై విక్రమించినాడే - అల్ల
దశకంఠుని విదళించినాడే ||ఆడు

10. సతి పుష్పకముపై నుంచినాడే - సహ
చరులతో రథ మారోహించినాడే
అతివేగాన పురికి నేతెంచినాడే - వసి
ష్ఠాదుల సమ్మతి గాంచినాడే ||ఆడు

11. పట్టాభిషిక్తుడై మీరినాడే - భక్తి
పాలన కలన పెంపారినాడే
దుష్టజనులనెల్ల కేరినాడే - రాజ
(దృష్టి) తప్పక కడతేరినాడే ॥ఆడు

వేల్పుమాట :

'వేల్పుమాట' అను గ్రంథనామము 'భగవద్గీత' అను నామమునకు అనువాదము. కాని గ్రంథవిషయము ప్రసిద్ధ 'భగవద్గీత' కు అనువాదముకాదు. శ్రీకృష్ణుడు అర్జునునకు జ్ఞానబోధచేయుట అన్నది యొక్కటే ప్రసిద్ధ భగవద్గీతలో, దాసుగారి 'వేల్పుమాట' లో కన్పడు సమానాంశము. ఇంతకన్న 'వేల్పుమాట' కు 'భగవద్గీత' తో మరేవిధమైన సంబంధములేదు. భగవద్గీతా శ్లోకానువాదములు కాని, వ్యాఖ్యానముల అనువాదములుకాని 'వేల్పుమాట' లో నుండవు. అక్కడక్కడ భగవద్గీతాశ్లోకతాత్పర్యములకు నీడలు కన్పడును. అవికూడ చాలతక్కువ ఇందులో శ్రీకృష్ణుడు చేయు ఉపదేశమంతయు దాసుగారి సొంతమే. 'భగవద్గీత' లో గల కృష్ణునిదికాదు. దాసుగారి 'వేల్పుమాట' లో శ్రీకృష్ణుడే నిమిత్తమాత్రుడు.

'వేల్పుమాట' లో 'భగవద్గీత' లో వలె పదునెనిమిది అధ్యాయములులేవు. అందిక, పొందిక, అచ్చిక, మచ్చిక, ఎమ్మిక, నమ్మిక, కోరిక, చేరిక - అని ఎనిమిది విభాగములున్నవి. ఈ గ్రంథమున దాసుగారు వాడిన ఛందము 'బడి' (మంజరీద్విపద).

దారి తోఁచకున్న తనబత్తునకు మంచి
వెరవు దెల్పు నల్ల వేల్పుమాట
వినుము వెల్లడింతు వివరించి తగులము
తెగులు మాన్పు వెజ్జ! జగము నొజ్జ! - పు. 1

అను 'గెల్పు' తో (ఆటవెలఁదితో) జగద్గురుని స్తుతించి. గ్రంథవిషయములోనికి దిగుదురు.

తనహాయినిగోరి తనతోటివారలను చంపదలకొనలేక వాసికెక్కిన మగవాడు (అర్జునుడు) నల్లపేల్పుతో (శ్రీకృష్ణునితో) విన్నవించుకొనుమాటలతో గ్రంథమారంభ మగును. ఇదేకదా అర్జునవిషాదయోగము. నల్లపేల్పుబత్తుడు (అర్జునుడు) విన్న వించుకొన్న విధానమును దాసుగారు వ్రాసినతీరు -

బ్రతుకనెంచెదరు నావలె నెల్లవారు
తమకోరినట్లది తప్పగు టెట్లు?
నన్నెదిరించు నందరిని జక్కాడి
ములుచనై మూనాళ్ల ముచ్చట బ్రతుకు
పొడిగించుకొన లేనిపోని తంటాలు
గొనఁజాల నెత్తురుకూడు నాకేల?
మగవారల నడంచి మగువల యుసురు
పోసికొనుటయొక పోటరితనమ?
ఏది యెట్లైనఁగానీ తాల్మి విడిచి
తగువాఁడు జగడము తలపెట్టలేఁడు
ఇర్గుపొర్గులకన్న నెక్కువకుడిచి
మత్తిల్లి తిరుగుట మరియాదకాదు
నన్నుండి యొరులు వంతంబడనేల?
కూళనై నాపయి న్గూరిమికలుగు
పేర్గర పిన్నలం బెద్దలఁజెలుల
చుట్టాల నొజ్జల సూరుమానులను
సుళువుగాఁ ద్రుంచవచ్చున్గాని, యుసురు
వాసినవారల బ్రతికింపఁదరమ?
కావున నాకేల కట్టడిపట్టు?
నేనేమిజుట్టుకొనెదఁ బోరుగెల్చి?
బంటులనందఱం బరిమార్చినపుడు
నామంచిచెడ్డలఁ బరికింతు రెవరు?

మానిసిమరియాద మంటిపాల్చేసి
యొరులఁదున్నటకన్న నొరులచేఁదెగుట
నయము నాకున్నవంతలు తుదముట్టు
బ్రతుకుసతంబ యెవ్వారలకైన
మీసాల పై తేనె మేనిసుగంబు
కనుక నోయబ్బ జగడమాడనొల్ల
నిన్గొనియాడుచు నేనూరకుందు
అని చతికిలఁబడును' - పు॥ లు 1, 2

ఇట్లు చతికిలబడిన తన బత్తుని [అర్జునుని] చూచి నల్లవేల్పు [కృష్ణుడు] -

ఓ నిండుమగవాఁడ యో పోటుబంట!
ఆడంగితనమెట్టులబ్బె నీకిపుడు
పెద్దలపరువెల్లఁ బెంటలోఁగల్పి
పేరెల్లఁ జెడఁగొట్టి పిఱికివైనావ? - పు. 3

అని ప్రారంభించి బోధచేయును. ఈ బోధ బత్తుని ప్రశ్నములతో నల్లవేల్పు సమాధానములతో ఎనిమిదివిభాగము లైనది. ఆ ఎనిమిది విభాగములే - అందిక, పొందిక, అచ్చిక, మచ్చిక, ఎమ్మిక, నమ్మిక, కోరిక, చేరిక.

'అందిక' నుండి కొన్ని పంక్తులు-

'పనికిమాలిన పిచ్చివలవంతమాని
గుండెదిట్టముచేసికొని నిలఁబడుము
అంతయున్దెలిసిన యట్లుపల్కెదవు
కటకటపడెదేల కల్లయిబ్బంది
ఎఱుకువగలవార లేది యొల్లైనఁ
దల్లడిల్లరు బిగిదప్పరుల్లముల - పు. 3

అని అజ్ఞానముతో మాటలాడుటవలదు, అనవసరమైన బాధపడకుమని యనును.

వచ్చినపనిచూడ పగఱజకాఁడు
కొట్టఁగల్గితి ననుకొని నట్టివాఁడు
దెబ్బ తింటిననుచు దిగులందువాడు
తెల్విమాలిన యుత్తదేబె లిర్వురును - పు. 5

అని కొట్టితి ననుకొనువాడు దెబ్బతింటి ననుకొనువాడు ఇరువురు అజ్ఞానులే. వీరిరువురు నిమిత్తమాత్రులు. నిజముగా నున్నదానికి మార్పులేదు అని అనును.

ఎఱుకువకలవాని కిజ్జగమెల్ల
నింగినలుపువలె నిక్కముకాదు - పు. 6

... ... ... ...

నీనీడ నీమేను నిక్కముకాదు
నిజముగ నీవేపనిఁజేయ లేదు
నీకున్న రూపొక్క నిక్కపుటెఱుక
పుట్టువు గిట్టువు పోదలవోయప్ప
నీవీజగంబు నంటీ యంటకుండు
నిజము తామరమీఁది నీటిచందమున - పు॥ 6 7

అని బోధచేసి-

నీ కగపడఁబోదు నిజమైనదారి
తప్పు త్రోవంబడి తల్లడిల్లకుము
నామాట చొప్పున నడువు మెల్లపుడు
కోరినమేలు చేకూరునోయబ్బ - పు. 10

అని ధైర్యము చెప్పును.

పౌండిక' లో అద్వైతసిద్ధాంతముపై అర్జునుడు వేసిన ప్రశ్నముల పంక్తులు -

నీకంటె వేఱుగా నేను లేననుచుఁ
దెలిసియు నాకేల తెలిపెదవిట్లు?
నిండుతనివితప్ప నీకొడ్లేక
యెట్లు నన్బురికొల్పె దిక్కల్లయనికి?
వీనులు లేక సన్వినజాలదెట్లు?
నాతోఁ బలికెదెట్లు నాలుక లేక?
ఎట్లు నాకగపడె దీరూపు లేక?
కల్ల యెట్లు నిజంబు కనిపెట్టఁగల్గుఁ?
దొలికబ్రద్దలుచేయ దొరకొనునట్లు
నీడతోడనొర్బర నెగడుదు నెట్లు?
ఊరకే కాల్సేతు లూపుటకన్న
మిన్నకయుండుటే మిక్కిలినయము
కల్లకల్ల నిఁక నిక్కంబు నిక్కమును
రేయిని రేయి మఱియుఁ బ్రొద్దుఁ బ్రొద్దు
తనకుఁ దానెడయుచున్నాఁకుట యెట్లు?
కోరికన్గోర్కతోఁ గొట్టఁదరంబ?
చిచ్చుచేతన్మఱి చిచ్చార్పవీల?
ఏతలంపున్లేక యేపనిచేయఁ
దొడరుటకున్దారి తోఁచదెద్దియును
నీ పలుకొక్కటేని మెఱుంగలేక
పొగలెడు నన్నెటు ప్రోచెదో వేల్ప! - పు. 11

ఈ ప్రశ్న పరంపర చమత్కారముగా నున్నది. 'అద్వైతులు వచ్చుచున్నారు చెంబు, చేట జాగ్రత్త' యన్న లోకములోని హాస్యపు మాటకు దగ్గరగా నున్నది.

'అచ్చిక' యందలి కొన్ని పంక్తులు -

చూడఁగలను నేను చూపులులేక
వినఁజాలుదును నేను వీనులులేక
చేయనేర్తును నేను చేతులులేక
మాటలాడెదనేను మరినాల్కలేక
కనఁజాలవీవు నిక్కముగ నారూపు
గట్టినమ్మిక చేతఁగాని సుంతయును
నీవు కర్జము మఱినేను కతంబు
నీవు చెట్టువు మరి నేను విత్తనము
నాకు నీకు న్రవంతయు లేదు వాసి
ఈవు నేనొక్కటియే యెప్పటికిని
ననునమ్మి మరియాద నడిపెదనేను - పు. 21

అని తన సర్వేశత్వమును, తనకు జీవులకు గల సంబంధమును 'నల్లపేల్పు' వివరించినాఁడు.

నడిపింతు నిన్ను నే నాయిచ్చకొలది
ఆడుదువీవు నేనాడించువాఁడ
ఏడ్చెదవేల? నీకేజోలిలేదు
ముద్దుకొఱకుఁ దల్లి బుడుతనివలెను
వేడ్కకై నిన్నేడిపించెదన్నేను
ఏడ్చినఁగాని పాలీఁబోదు తల్లి
ననువేడకున్న నిన్గాపాడనేను
నడుపుట మరియాద ననువేడుకొంట
పొగలక పగనోర్చ్చ ప్రోచెదన్నిన్న
నేనిన్ను బ్రోచుట నీవు నేనగుట
ఏమగునోయని యాడ్గిలఁబడకు
ననునమ్మి మరియాద నడుపుము నీవు-పు. 28,29

అని తనకు జీవులకు మాతాశిశు సంబంధమనియు, జీవులకు ఏమగునోయను చింత అనవసరమనియు తెల్పినాడు.

'మచ్చిక' లో బత్తుడు-

మునుపటికంటె నిప్పుడు కొంతదారి
యగుపడుచుండె నీ యాసరాచేత
తెల్లముగా నచ్చ తెలుఁగుతోఁజెప్పు - పు. 30

అన, నల్ల వేల్పు చెప్పిన పంక్తులలో కొన్ని -

కడముట్టె వెట్టి అోఁకలి తలచుట్టు
మనునట్టు లడిగెదో యబ్బాయినీకు
చెవిపట్టలేదు నాచెప్పినమాట - పు. 31

... ... ...

అద్దముకను పిచ్చుకటు తమకమున
నీనీడతోడని నీవు పోరెదవు
నను నమ్మలేదు తిన్నఁగనీవుగనుక
మదిలోన నీకరమర తీరకుండె -పు. 31

... ... ...

కోరిక చేతనే కోరికన్గొట్టు
వెరవున విసముచే విసమూడ్చవలయు - పు. 31

... ... ...

తలఁపు తనంతఁగదలుచు నిల్చుండు
కదలికనీవు నిల్కడనేను మఱియు
నీరూపు కల మఱి నిదుర నారూపు
పాటుపడుము నన్నుఁ బాపింతువీవు - పు. 32

అని బోధచేయును. ఇట్లే గ్రంథమంతయు బత్తుని సందేహములు తీర్చుచు నల్లవేల్పు బోధచేయును. బత్తునకు జ్ఞానోదయ మగుటకు నల్లవేల్పు తన విశ్వరూపము చూపును. బత్తుడా విశ్వరూపమును జూచి, నల్లవేల్పు మాటలపై నమ్మకము కుదిరి-

నీ యడ్గుదమ్ములన్నేఁ గొల్చుకొందుఁ
దొంటి చందమున నాతోనుండు మబ్బ
ఏచవియున్లేని యెఱుక నాకేల?
నీవు చేయఁగలవు నీయిచ్చకోలఁది
నాకోరినట్లు నన్ర్బతికించుమప్ప
ఆడించు పాడించు హాయికావించు
జగమెల్లననుఁజూచి సంతోసమంద
నన్ను నీలోఁజేర్చు నాయిలవేల్ప! - పు. 79

అని 'కోరిక' కోరుకొనును. ఈ 'కోరిక' అను విభాగముతో నల్లవేల్పు, బత్తుల సంభాషణము సమాప్తమగును. అనగా గ్రంథవిషయము పూర్తియగును. చివరి విభాగమైన 'చేరిక' దాసుగారి మాటలు.

అని తనబత్తిరూపందినట్లున్న
మచ్చర మెఱుఁగని మంచిమానిసిని
తనతోటివారి సంతసమెంచువాని
ఒరుల నొప్పించుట కొల్లనివాని
ఇర్గుపొర్గులకు మేలేకోరువాని - పు. 79

.... .... ....

తనకూర్మిబత్తునిఁ దనలోనఁజేర్చి
యేలుచునుండె హాయిగ నల్లవేలుపు
విన్నవించితి నల్లవేలుపుమాట
తనర నారాయణదాసుడఁ నిట్లు - పు. 80

అని దాసుగారు ఈ 'వేల్పుమాట' గ్రంథమును పూర్తిచేయుదురు.

ఈ గ్రంథమున 'బత్తుడు' అని అనుటతప్ప అర్జునుని నామస్పర్శయే లేదు. బహుశః నిమిత్తమాత్రుడని కాబోలు నామము చెప్పలేదు.

దాసుగారు ఈ గ్రంథరచనమున ఒక చమత్కారము చేసినారు. అదియేమన దాదాపు ఈ గ్రంథములోగల ప్రతిపంక్తి ఒక సంపూర్ణవాక్యమే. ఒక సూక్తియే.

ఇట్లు దాదాపు ప్రతిపంక్తి ఒక వాక్యముగా వ్రాయుట కాకతాళీయముగా జరిగినదికారు. దాసుగారు కావలెననియే చేసినారు. అట్లుచేయుటకు ఒక పవిత్ర లక్ష్యమున్నది. ఆ పవిత్రలక్ష్యమిది-

'ఇరువదేడంకెలలో నెద్దియైన నొకయంకెను దలచుకొని యీ వేల్పుమాట పొత్తములో నెద్దియైన నొక పెడ తెఱచి మీఁదినుండి క్రిందివరకు లెక్కింపఁబడిన యిరువదేడు బంతులలోఁ దాఁదలంచిన యంకెగల బంతి చదువుకొన్నపుడు తానను కొన్న పనియేమగునో తప్పక తెలియఁగలదు.'[38]

'వేల్పుమాట' తేటతెనుగులోగల దాసుగారి వేదాంతసారపుబాట.

అచ్చ తెలుఁగు పల్కుబడి:

అచ్చతెలుఁగు పల్కుబడి' నూటపదునాలుగు 'అడుగు' ల (మంజరీద్విపదల) 'పద్దెము' గల పదునొకండు పుటల చిన్నపుస్తకము 'అచ్చ తెలుగుపల్కుబడి' అను గ్రంథనామమునకు 'అచ్చతెలుగుభాషను గూర్చి వివరించు మంజరీద్విపద' అని దాసుగారి అర్థము. ఈ యర్థమునకు దాసుగారు గ్రంథాంతములో-

అగుబడి తరువోజ యడ్గుసంగోరు
పోలుదీనికిఁ దొల్లి పూగుత్తిపేరు - 110

అని వ్రాసిన 'అడుగు' ప్రమాణము. తరువోజపాదములో సగమైనది, పూగుత్తి (మంజరి) అను ప్రాతపేరు కలది, ఈ 'బడి' అగును అని కదా భావము.

38. వేల్పుమాట వివరము, పు. 6

ఈ అర్థమును దృష్టిలోసెట్టుకొని దాసుగారు గ్రంథమునకు నామకరణము చేసినను, ఈ గ్రంథనామమునకు 'అచ్చతెలుగును పలుకు బడి' (పాఠశాల), 'అచ్చతెలుగుయొక్క పలుకుబడి' (మాటచెల్లుట) అని గ్రంథప్రధానవిషయ సూచకములైన మరి రెండర్థములు కూడ స్ఫురించుచున్నవి.

అట్లే గ్రంథప్రారంభమునందున్న 'బడిపద్దెము' అనుదానికి 'మంజరీద్విపద పద్యము' అనునది దాసుగారి అర్థమైనను, 'చిన్నపిల్లలు బడిలో వల్లింపదగిన పద్యము' అను రెండవ అర్థము కూడ స్ఫురించుచున్నది. ఈ రెండవ అర్థమునకు-

వల్లించుకొనసుళ్వు పద్దెముకూర్పు
మాటలన్ గురుతిడ మదిగొనదోర్పు - 113

అను 'అడుగు' కూడ కొంత అడుగుజాడ.

ఇక ఈపుస్తకము నందలి ప్రధానవిషయము నాటుతెనుగుబాస మిసమిసలు.

తీయన మెత్తన తేట తెల్లంబు
నుడులలో నచ్చతెనుంగు నయంబు - 1

అని అంత్యప్రాసముతో మూసపోసిన 'బడిపద్దెము' ను ప్రారంభించిరి.

తేటతీయమైన తెనుగురాకున్న తెపుగువానికి మరియొకభాష యేదైనను వచ్చుట సున్న - అను భావమును బలపరచుచు చేయుచున్న తర్కము-

తేటతీయని యచ్చతెలుఁగురాకున్న
తెలుగువారికిఁ కెద్ది తెలియుట సున్న
ఉట్టికెగురలేక యురుకునా మింట?
తెన్నెరుంగక యెుఱున్నా గనునంట!
తాఁబొత్తిటన్నన్న తన తల్లిపాట
తెలియఁజాలకిఁకెటు తెల్పుఁబైమాట?

తిన్నఁగాఁదనయిల్లు తెలియనిజోసి
చుక్కల నెఱుఁగడించు న్గనుమూసి ? 4-7

సంస్కృతభాషలో మాటాడుట గొప్పయని భావించువారలకు ఎరవుసొమ్ము బరువుచేటు అని చెప్పుచున్న విధము -

వేల్పుబాసాడిన వెలయునామెప్పు?
సిరితోడఁబోవునా చీఁకటితప్పు?
బరువగుటేగాక పరువూడ్చునెర్వు
నగుబాటగున్బాడిన న్బెడదర్వు
కొట్టు పల్కెంతయున్మ్రుద్దులమూఁట
కొనితెచ్చుకొన్న తెగుల్పెఱమాట - 15-17

సంస్కృతభాషరాకున్న లోటురాదనియు, తానెరిగి యితరులకు ఎరిగింపదగినది తెనుగేయనియు, జీవనయాత్రకు తెలుగుచాలనియు చెప్పుచున్న దాసుగారి భావముల మూలములివి-

లోటురాఁబోదు వేల్పునుడిరాకున్న
దరుగదు పెరుగ దద్దములోని జొన్న - 25

.... .... .... ....

తానెర్గి యెర్గింపఁదగు నాటుమాట
బ్రతుకుహోయిగ బయల్పడు నెల్లచోట - 28

.... .... .... ....

మనుగడకున్నాటు మాటలేచాలు
పడనేల దయ్యపుపల్కు తంటాలు ?- 35

దాసుగారికి తెలుగుభాషపై నెంత మమకారము ముదిరినదనిన అది వేల్పు భాషపై ద్వేషముగా కూడ కుదిరినది. మానవుడు వేల్పుభాషను మాటాడరాదని

శాసించుచున్నారు. పేల్పుబాసను తెనుగుతో కలుపుటకు కూడ నంగీకరింపకున్నారు. ఈ భావచ్ఛాయల నిజరూపములు-

మంచిసలుపు నాటుమాటలకన్న
జగమున వేల్పుబాస మరిసున్న - 47

.... .... .... ....

మానిసి వేలుపు మాటాడరాదు
నంటెజన్నముచేయ నాయముకాదు - 49

.... .... .... ....

వేల్పుబాసకుఁ దలవిఱిచిన తెనుఁగు
నీరుల్లి పాయకంటించిన పునుఁగు - 50

.... .... .... ....

తరలిపోయిన యువ్వ దయ్యపుగోస
బ్రతికున్నతల్లి యిప్పటి నాటుబాస
దండుగే నోటికి దయ్యపుగోస
పండుగే చెవుల కిప్పటి నాటుబాస - 55, 56

వీరి అభిప్రాయముప్రకారము తెనుగునకు వర్ణములు ముప్పదిమూడు. పేల్పులు ముప్పదిముగ్గురుకాన తెనుగున ముప్పదిమూడు అక్షరములున్నవట! ఇదియేమి సంబంధమో! ఒక్కటే సంబంధము. దాసుగారికి ఈ నాటుతెనుగుపై నున్న అభిమానసంబంధము.

దాసుగారు వెలిబుచ్చిన 'మాటాడుట వచ్చిన చాలును. వ్రాత మంచిదికూడ కాదు. కృత్రిమమైనది' అను విచిత్రభావమునకు మూలములైన వ్రాలు.

వ్రాఁత యెరవుసొమ్ము పలుకుసొజమ్ము
వ్రాత కొంటెతనమ్ము పలుకునిజమ్ము - 80

.... .... .... ....

మోసకాం(డకుఁ బొ_త్తములు పనిముట్లు
(వాఁత తెచ్చు‌న్నంచి వారి కిక్క_ట్లు - 82

సంస్కృతభాష లోకమునకు యేలుసలువని భాషయట - అటువంటి భాషలలో కబ్బములుండరాదట, నోటబట్టని మాటలతో వెజ్జులు కూర్చినభాష యట సంస్కృతము. ఈ తీ(వభావాలు చూచుచున్న అక్షరాల గవాక్షాలు-

జగమునకున్నేలు సల్పని(వాత
తగదెంతయు న్గూళ దయ్యముకూఁత - 101

... ... ...

అచ్చపు నాటుమాటాడు టేనీటు
కలగల్పు బాసలు కబ్బము చేటు - 103

... ... ...

నోటబట్టనిచిక్కు నుడి వెజ్జులల్లి
వేల్పుబాసయని పేర్పెట్టిరి తొల్లి - 105

ఇది 'అచ్చతెలుగు పల్కుబడి' లో కన్పడు దాసుగారి భావముల స్వరూపము.

ఎల్లబొసలకుఁ దెల్గే కడుమేలు
పాటబొడుచు మచ్చపడనియిల్లాలు - 72

అన్నది వారి (గంథసారాంశము.

ఈ 'అచ్చతెలుఁగు పల్కుబడి' (గంథము దాసుగారిపై అచ్చతెలుగునకు గల పల్కుబడిని తెలియజేయు (గంథము.

## అస్వతంత్ర గ్రంథములు :-

అస్వతంత్ర గ్రంథములన స్వీయభావ సంపద నిక్షిప్తముకాని గ్రంథములు- అనగా ఇతరులు వ్రాసిన గ్రంథములకు ఆంధ్రీకరణములు.

ఈ అనువాద గ్రంథములు ఆరు : 1. నవరసతరంగిణి 2. ఉమరుకయాము రుబాయెతు 3. నూఱుగంటి 4. వెన్నుని వెయిపేర్ల వినకరి 5. మొక్కుబడి (ఋక్సంగ్రహము) 6 తల్లివిన్కి.

### నవరస తరంగిణి

నవరసతరంగిణి దాసుగారి గ్రంథములందేకాదు, ఆంధ్రసాహిత్యగ్రంథము లందే అమూల్యమైన గ్రంథము, అనిదంపూర్వమైన గ్రంథము. ప్రపంచ ప్రసిద్ధ కవులైన షేక్స్పియరు, కాళిదాసుల కవిత్వముల సొగసులను నవరసములుగ విభజించి, తెనుగులో అనువదించిన గ్రంథము. ఈ ఆంధ్రీకరణము మరల ద్వివిధము. ఆంగ్లము ననువదించునపుడు మిశ్రాంధ్రము, సంస్కృతము నను వదించునపుడు అచ్చాంధ్రము. ఎడమవైపు షేక్స్పియరు, కాళిదాసుల గ్రంథము లందలి మూలములు, కుడివైపు దాసుగారి అనువాదములు ఉండుటచేత భిన్నరుచులు గల పాఠకులకు సౌకర్యముగా నున్నది. కేవలము షేక్స్పియరు, కాళిదాసుల కవిత్వముల సొగసులను మాత్రమే తెలిసికొనదలచిన ఆంగ్లగీర్వాణభాషల పరి చయముగల పాఠకులకు మూలములు ఉన్నవి. ఆంగ్లగీర్వాణభాషల వాసనలేని పాఠకులకు మూలముల అవసరములేక తెనుగులో అనువాదము లున్నవి. ఆ తెనుగు అనువాదము లందలి పద్యములలోగల తెనుగుపదములకు అర్థములు తెలియనివారలకు అనుబంధముగా అర్థములనుగూడ నిచ్చిరి. షేక్స్పియరు గ్రంథములకథలు కూడ పరిచయములేనివారలకు ఉపయోగముగా కథలనుగూడ అనుబంధముగా వ్రాసినారు. అనువాద సామర్థ్యమును తెలిసికొనదలచిన ఆంగ్ల గీర్వాణాంధ్రభాషలపై అధికారము గల పాఠకులకు మూలములు, అనువాదములు పరిశీలించుటకు వీలుగా ఎదురెదురుగా నున్నవి. సాహిత్యరసాస్వాదన తృష్ణాళువులకు షేక్స్పియరు, కాళిదాసుల గ్రంథములన్నియు చదువుశ్రమ అవసరములేకయే, ఆ మహాకవుల కవిత్వముల సొగసులు ఒక్కచోట రాశిపోసి యుంచబడినవి.

గ్రంథప్రారంభము నందలి -

కాళిదాసషేక్స్పియరుల కవితల పయిఁ
బ్రేమ పడెదవుగాన నర్పించినాఁడ
ఈ కృతిన్దయతోడ నంగీకరించు
మలక నారాయణగజేంద్ర! యధిపచంద్ర!

అనుపద్యము వలన ఈకృతి అలకనారాయణ గజపతి కంకిత మని వెల్లడియగు చున్నది.

ఈ గ్రంథమునకు దాసుగారు నలువది యెనిమిది పుటల పీఠికను వ్రాసిరి. ఈ విపులపీఠిక పాఠకుల మనస్సులను ఎన్నోవైపులకు పరువులెత్తించును. దాసుగారి నిశితపరిశీలనశక్తిని అనేక కోణములలో ప్రదర్శించును. ఆపీఠిక యందలి కొన్ని భావములు-

భాషలకెల్ల సంస్కృతము తల్లియు రాజువంటిది .... స్వతస్సిద్ధమగు దేవ భాషన్ జదువునపుడు రసోదయమగునట్లు దేశభాషన్ జదువుగానేరదు (పు. 1).

నిజమగు కవులొకరికొకరీడు తీయ కుంద్రు. వారిలో నొండొరులఁ బోల్చ వీలుకాదెవనిమట్టుకు వాఁడేఘనుఁడు (పు. 3).

రసము చెడనీక యమకపుష్టిగఁజెప్పుట, సంధత్వశుద్ధిగల పదప్రయోగము, స్వతంత్రముగఁ కథను గల్పించి యపూర్వమగు నూహలం దెల్పుట, యతుకుంచక పద్యములల్లుట, పండితపామరరంజకముగ మృదుమధురోచిత శబ్దంబులం బొందు పర్చుటయుం గవిత్వమున ముఖ్యాంశములు (పు. 3).

సంస్కృతమునందు హివైచాదులుం దెనుఁగున నాగిమొగ్యాదులుం బాద పూరణమాత్రఫలకములయ్యుఁ జీట్ల పేకలోని జోకరు బొమ్మవలె నభీష్టార్థసిద్ధి దాయకము లయి పద్యమును మేకుబిగింపువలె దృఢపర్చును (పు. 5).

బాల్యయౌవన వార్ధకదశ లందు నరుఁ డవస్థాభేదమున నెల్లగతుల మారు చుండియుఁ దా మారనట్లాచారములు న్భాషలు కాలానుసారముగాఁ బ్రవాహోదకముల రీతి మారుచుండియు మాఱకుంట చిత్రము (పు. 5).

జాతి సాంకర్యము, నాస్తికత, గ్రామ్యభాష మొదలగు పెడత్రోవలు స్వభావసిద్ధముగా లోకముతోనేయున్నవి యొకరు క్రొత్తగా నేర్పర్చనక్కఱలేదు (పు. 6).

తన కావ్యదర్పణంబున జగములనెల్లఁ జూపిన మహానుభావుఁడు భారతీయులలో వ్యాసుఁడు నాంగ్లేయులలో షేక్సుపియరని నా యభిప్రాయము (పు. 8).

శాస్త్రము చదివి సుశిక్షితుఁడై సొగసుగ నిల్లుకట్టిన మానుషశిల్పి చాతుర్యముకన్న సహజపాండిత్యంబున రమ్యముగఁ దన గూడల్లుకొనిన బంగరుపిచ్చుక నేర్పు శ్లాఘ్యము (పు. 9).

రఘువంశమున నవసానసర్గములు, కుమారసంభవములోని పదవసర్గ మొదలు కడమసర్గలును, మాళవికాగ్నిమిత్రము, నలోదయము, ఋతుసంహారము, శృంగారతిలకము, పుష్పబాణవిలాసము, రాక్షసకావ్యము, ప్రహసనము కాళిదాసకృతులగునా? యేమో దేవున కెఱుక (పు 11).

కాళిదాసుఁడు షేక్సుపియరునివలె స్వతంత్రుఁడు కాడతని కవిత్వము వాల్మీకివ్యాసకవిత్వముల ననుసరించినది. భారతీయగ్రంథములలోని యూహలన్నియుఁ గలిపినచో షేక్సుపియరుని యూహలగునేమో .... పూర్వులలో వాల్మీకి వ్యాసులు, నవీనులలో జయదేవ మాఘ భవభూత్యాదులు గ్గాళిదాసునకు సమానులో లేక యధికులోగాని లోకమునందలి కవులలో షేక్సుపియరునకు సమానుడుగాని అధికుడుగాని లేడనవచ్చును. నామట్టుకునాకుఁ గాళిదాసుం జదువునపుడు షేక్సుపియరు, నగరున నున్నపుడు పట్టణమువలె స్ఫురించెను. షేక్సుపియరునిం జదువునపుడు కాళిదాసుఁడు మహారణ్యము న్బరిశీలించునెడ నుద్యానమువలెఁదోచెను (పు. 11).

కావ్యంబులం గీతగోవిందము వంటి గీతప్రబంధముత్తమము. మాఘము వంటి కేవల పద్యకావ్యము మధ్యమము. శాకుంతలము వంటి గద్యపద్య మిశ్ర రూపక మధమము. మొదటిది సంగీతసాహిత్య విద్యావేత్తల కానందదాయకము. రెండవది కేవల భాషాపండితైకవేద్యము. మూడవది పండితపామరోభయ నేత్ర శ్రోత్రమాత్ర రంజకము. మొదటిదాని రచించుటకు వాగ్గేయకారుఁడే తగును. రెండవదానికిఁ గేవల భాషాపండితుఁడు చాలును. మూఁడవది పలువుర వాలకములతోఁగాని యక్కఱకురాదు (పు. 12,13).

ఆంగ్లేయభాషకాంధ్ర మొనర్చునెడ నాంగ్లేయభాషాపదముల వాడుకెట్లు తగదో దేవభాష నెలిగించునపుడు తత్సమ మట్లుపయోగింపరాదు (పు. 12).

నాటకాంతం కవిత్వ మనుదానికి నాటకరచనమే యుత్తమకవిత్వమని యభిప్రాయమా? లేక కవికిఁగావ్యరచనాశక్తి తగ్గినపుడు నాటకరచన మొనర్చుననియా? నాటకవిరచనములు చెట్టు చచ్చెడుకాలమునకుఁ గుక్కమూఁతిపిందెలనఁ దగునేమో. ప్రసూతాంతం యౌవనమన వయసు చెడుటకు గుర్తు కాన్పుకాదా? (పు. 13).

భారతీయనాటకములలో దక్షిణనాయకత్వము దుర్నీతిబోధకము. విక్రమోర్వశీయశాకుంతల మాళవికాగ్ని మిత్రములలో నాయకులు వేశ్యనొకఁడు వేశ్యకూఁతు నొకఁడు వేశ్యవేషమున నున్నదాని నొకఁడు క్రమముగా వలచి యగ్నిహోత్ర సాక్షిగాఁ బరిణయమాడుకొన్న భార్యలన్వంచించిరి (పు. 18, 19).

దేవుఁడంతట వ్యాపించినట్లు షేక్సుపియరుని జ్ఞానమఖిలమానుషానుభవముం బొదవెను - షేక్సుపియరు కనిపెట్టని మనుష్యానుభవము లేదు. సకల మానుష సంఘము న్శోధించి శోధించి తచ్ఛేష్టితముల న్లోకులకుఁ దేటతెల్లముగ వెల్లడించెను. కాళిదాసుని కవిత్వమందుఁ బూర్వులు త్రొక్కని క్రొత్తమార్గ మెద్దియులేదు కొంతవరకు జయదేవ భవభూత్యాదులు నవీనభారతీయ కవులలో స్వతంత్రులుగాఁ గాన్పించిరి (పు. 23).

భారతీయ నాటకములలో మృచ్ఛకటికా వేణీసంహారములు మిక్కిలి రమ్యములు (పు. 23).

షేక్సుపియరువలె హాస్యరస మంత మృదువుగా భారతీయకవు లెవ్వరైనం జెప్పఁజాలకుండిరి (పు. 26).

షేక్సుపియరుని కృతులందు నీయిష్టానుసారమను (As you like it) నాటకముమఁ గొరియలేనస్సను (Coriolanous) నాటకమును సత్కావ్యములు. కాళిదాసు కృతులందు రఘువంశకుమారసంభవమేఘసందేశములు సత్కావ్యములు (పు. 47)

రఘువంశమున శ్రీరామచరిత్రాంతము వరకునుం గుమారసంభవమున మొదటి యెనిమిది సర్గలునుఁ బూర్వమేఘము నుత్తరమేఘమునఁ గొంతయు న్మొదటి కాళిదాసకవిత్వము. తక్కినభాగము లల్పకవి విరచితములు. (పు. 47,48).

ఇట్లు ఈ పీఠిక యందు దాసుగారు వెలిబుచ్చిన అభిప్రాయములుకోకొల్లలు. ఈ అభిప్రాయములలో కొన్ని పరమసత్యములు, మరికొన్ని ఆశ్చర్యజనకములు, మరికొన్ని తీవ్రభాష్యములు. ఏమైనను ఈ అభిప్రాయములు దాసుగారి సర్వతంత్ర స్వతంత్ర దృగ్వ్యాపారములకు నిదర్శనములు. వీనిలోని ఎన్ని అభిప్రాయములను లోకము అంగీకరించుననునది వేరేవిషయము.

'కేవల మాంగ్లభాషా పాండిత్యము మాత్రమే కలిగి సంస్కృతమెరుంగని వారు షేక్సుపియరు కాళిదాసునికంటె నెక్కువ కవియనియు, సంస్కృతజ్ఞానముండి యాంగ్లభాషాపరిచయములేనివారు కాళిదాసు న్మించినకవి లోకమున లేదని వాదించుచుందురు. గీర్వాణాంగ్లేయభాషలు రెండుఁగూడఁ దెలిసిన వారికా సందియ ముండనేరదు (పు. 1).' అను దాసుగారి మాటల వలన ఏకభాషాధికార పండితుల భ్రాంతులను తొలగించుటకు ఈ గ్రంథరచన చేసినట్లు అనిపించును.

ఇక ఆంధ్రీకరణమును గూర్చి అన్నమాటలు-

'ఒకభాష యింకొకభాషకు సరిగా మారదు - చాల మట్టూహఁ దెల్పునట్లు మాత్రమే మార్చవచ్చుఁగాని యథాస్థితిగ భాషాంతరీకరణ మసాధ్యము. పుట్టుభాష తల్లిపాలవంటిది. పట్టుభాష యెంతచదివి యంటించుకొన్నను బోతపాలవలె నంతగా నొడలుపట్టదు. లాఁతిభాష పొంకము కూలంకషముగఁ దెలియఁబడదు .... మేనమామపోల్కిగాఁ గొంతవరకు భాషాంతరీకరణమున నూహదెల్పఁ బీఁకులాడవచ్చును. విధిప్రేరితుఁడనై షేక్సుపియర్కాళిదాసుల కవిత్వమందు నా యెన్నిన కొన్ని పొగసులు సాహసంబునఁ దెలుఁగునం దెలిపినాఁడ నీయాంధ్రంబున నొక పేళ నంతగా రుచిపొడమనిచో నాంధ్రీకరణమున నా శక్తిలేమిగాని యక్కవీశ్వరుల కొఱంత యేమాత్రము గ్గాదని నేఁదెల్ప నవసరములేదు. షేక్సుపియర్కాళిదాసుల తారతమ్యము కొంతవరకీ పుస్తకంబున నాంధ్రులకుఁ దెలియఁగలదనినానమ్మకము. (పు. 4).

ఈ పలుకులు కావ్యశాస్త్రసత్యమునకు, అనువాదనిర్వహణదక్షులైన దాసుగారి వినయమునకు నిలయములు.

ఈ గ్రంథమున దాసుగారు నవరసములను గ్రహించిన క్రమమిది. వీరము, శాంతము, కరుణము, శృంగారము, హాస్యము, అద్భుతము, రౌద్రము, బీభత్సము భయానకము.

వీరు ఈ క్రమముగ రసములను గ్రహించుటకు ఒక కారణము కలదు. 'భరతముని చెప్పిన విభావానుభావ వ్యభిచారిసంయోగమునఁ గల్గు తొమ్మిది రసములలో నుత్తమ జనులన్గాన్పించు వీర, శాంత, కరుణలు సత్వగుణ ప్రధానములు. మధ్యమ జనులగపర్చు శృంగార, హాస్య, అద్భుతములు రజోగుణ ప్రధానములు. అధమజనులలో నుండు రౌద్ర, బీభత్స, భయానకములు తమోగుణ ప్రధానములు (పు. 45)., ఈ గుణత్రయము ననుసరించి దాసుగారు ఈ క్రమమును గ్రహించిరి.

ఈ రసముల సంజ్ఞానామములను గూడ దాసుగారు అంగ్లములోనికి, అచ్చ తెనుగులోనికి అనువదించిరి. ఆ నామము లివి –

| | | | | |
|---|---|---|---|---|
| వీరము | – | Honour | – | బీరము |
| శాంతము | – | Gentleness | – | ఓర్పు |
| కరుణము | – | Mercy | – | వంత |
| శృంగారము | – | Love | – | సింగారము |
| హాస్యము | – | Merriment | – | నవ్వులాట |
| అద్భుతము | – | Marvel | – | అబ్బురము |
| రౌద్రము | – | Wrath | – | కినుక |
| బీభత్సము | – | Austerity | – | ఏవ |
| భయానకము | – | Timidity | – | వెఱపు |

షేక్స్పియర్కాళిదాసుల గ్రంథములనుండి దాసుగారు గ్రహించిన నవరసముల మూలముల సంఖ్యావివరము లివి –

| రసము | షేక్స్పియరు | కాళిదాసు |
|---|---|---|
| వీరము | 69 | 22 |
| శాంతము | 59 | 15 |
| కరుణము | 56 | 35 |
| శృంగారము | 36 | 43 |
| హాస్యము | 56 | 7 |
| అద్భుతము | 297 | 129 |
| రౌద్రము | 16 | 3 |
| బీభత్సము | 7 | 4 |
| భయానకము | 5 | 3 |

అనగా దాసుగారు షేక్స్పియరు గ్రంథములనుండి గ్రహించి అనువదించిన భాగములు 601. కాళిదాసుని గ్రంథముల నుండి గ్రహించి అనువదించిన భాగములు 261. మొత్తము అనువదించిన భాగములు 862. ఈ నవరసముల అనువాదములలో అద్భుతరసము అర్ధభాగము (426). తక్కిన ఎనిమిది రసములు కలిసి అర్ధ భాగము.

ఇక వారి అనువాదశక్తి పరిశీలనమునకు రసానుగుణముగా కొన్ని ఉదాహరణములు -

వీరరసము :

Cowards die many times before their deaths;
The Valiant never tastes of death but once [1]

ఎన్నఁ బిఱికివార లెన్నియో మాఱులు
చచ్చుచుంద్రు తాము చావకమును
పెన్నడైన ధైర్యమున్న జనులు చావు
చని యెఱుంగరొక్కసారి తప్ప

Friendship is constant in all other things
Save in the office and affairs of love;
Therefore, all hearts in love use their own tongues;
Let every eye negotiate for itself,
And trust no agent; for itself,
Against whose charms faith melteth into blood [2]

వలపునఁ దప్పమైత్రి పెర వస్తువులన్నిట నుండు నిల్కడన్
వలచిన యెల్లడెందములు వాడుట మేల్దమనోళ్లఁ గావునన్
దెలుపుతఁదన్నుఁగూర్చి ప్రతిదృష్టితనంతట నమ్మకన్యునిన్
బొలపొకమంత్రకాఁడతని బూమెల నెమ్మికరంగు మర్దగాన్

1. Julius Caesar – Act. 2, Se.2
2. Much Ado Adout Nothing – Act. 2, Se.1

ఇక కాళిదాసుని శ్లోకానువాద మొకటి

అసంశయం క్షత్ర పరిగ్రహక్షమా
యదార్యమస్యా మభిలాషి మేమనః
సతాంహి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః [3]

అరమరికలేదు రాచయాలగుటకుఁదగు
నీపెయెడ నాదుమది తగులెనయుఁ గాన
సందియంబున్న తావుల సాదుఁల కెద
పోకడలు దినుసులఁగూర్చి సాకిరికద

శాంతరసము :

But thoughts, the slaves of life, time's fool,
And time, that takes survey of all the world,
Must have a stop.[4]

బ్రతుకుదాసులు తలఁపులు బ్రదుకుకాల
మున కగు విదూషకుఁడు మఱియును సమస్త
జగముఁ బరిశీలనముచేసి సరిగఁ గొల్చు
నట్టి సమయంబుకూడ నిల్పందవలయు

We profess
Ourselves to be the slaves of chance and flies
Of every wind that glows[5]

మనము విధికి బంట్లమని మన యంతట
నొప్పుకొనుచునుందు మెప్పుడైనఁ

3. అభిజ్ఞానశాకుంతలము – 1–20
4. Henry IV - Part 1 - Act. 5, Se. 5
5. The Winter's tale - Act. 4, Se. 4

బదపడియు విసరెడు ప్రతిమారుతమునకు
నెగిరిపోవుచుండు నీఁగలమని

కాళిదాస శ్లోకానువాదమొకటి -

మరణం ప్రకృతిశ్శరీరిణాం వికృతిర్జీవితముచ్యతే బుధైః
క్షణమప్యవతిష్ఠతే శ్వసన్యదిజంతుర్ననులాభవానసౌ[6]

చావు మైతాలుపులకు సాజంబు దాని
మారుపనెద రెఱుకగలవారు బ్రతుకు
ఒక నిముసమైన నూర్పుచు నుండెనేని
పొందినయది మేలే బూతము నిజముగను

కరుణరసము :

Thou seest, we are not all alone unhappy;
This wide and universal theatre
Presents more woeful pageants than the scene
Wherein we play in [7]

కనుచునుంటివొక్క మనము మాత్రమె దుఃఖి
తులముకాము చూపు వెడఁద భువన
రంగమిద్ది మనము రాజిలు తెరకన్నఁ
బెక్కు శోకపూర్ణ వేషములను

What's here? A cup, clos'd in my true love's hand?
Poison, I see, hath been his timeless end
O Churl! drunk all, and left no friendly drop.
To help me after? I will kiss thy lips;
Haply, some poison yet doth hang on them,
To make me die with a restorative[8]

---

6. రఘువంశము - సర్గ. 8, శ్లో. 87
7. As you like it – Act. 2, Se. vii
8. Romeo & Juliet - Aet. V, Se. iii

ఏమిదిచోటు నొకగిన్ని నా మనోహ
ర కర సంలగ్నమైన దౌరా విషంబు
వాని కపమృత్యుకరమయ్యెఁ బరమలుబ్ధ!
క్రోలితవ యంతయు మఱి మిగుల్చలేద
ప్రణయబిందువు నాకుఁ దోడ్పడుట కింక
ముద్దుఁబెట్టెదనేను నీమోవి నిప్పు
డంటుకొని యుండవచ్చు నేమైనఁగొంత
విసము - నన్నది చంపు నిర్వృతిచెలంగ

కాళి దాసుని శ్లోకానువాద మొకటి-

నఖలు నఖలు బాణః సంనిపాత్యోయమస్మిన్
మృదుని మృగశరీరే పుష్పరాశా వివాగ్నిః
క్వబతహరిణకానాం జీవితం చాతిలోలం
క్వచ నిశిత నిపాతా వజ్రసారాశ్శరా స్తే[9]

వలదు వలదయ్య యీ యిట్టి తలిరుసోనఁ
బూవు ప్రోవునఁ చిచ్చట్లు ములికి వడుట
లేడిపిల్లల నిలుకడలేని బ్రతుకు
లకట యెచ్చటనీవాఁడి యలుగు లెచట

శృంగారరసము :

Love is a smoke rais'd with the fume of sighs;
Being purg'd, a fire sparkling in lovers, eyes;
Being vex'd, a sea nourish'd with loving tears;
What is it else ? a madness most discreet,
A chocking gall, and a preserving sweet [10]

9. అభిజ్ఞానశాకుంతలము - 1-10
10. Romeo and Juliet - Act. 1, se. i

తలపనగ వెచ్చనూర్పులఁ గలిగినపొగ
కాముకులకన్నులందునఁ గ్రాలు నగ్గి
నాయికానాయకాశ్రులన్ బ్రబలుకడలి
వెర్రియున్, జంపఁ బెంపఁగ విషమమృతము

That man that hath a tongue, I say, is no man.
If with his tongue he can not win a woman[11]

మాటాడు వాఁడెల్ల మగవాఁడు కాఁడు
మాటలచేతఁ భామలఁ గెల్వకున్న

ఇక కాళిదాస శ్లోకానువాద మొకటి –

అనధిగత మనోరథస్య పూర్వం
శతగుణితేవ గతా మమ త్రియామా
యదితు తవ సమాగమే తథైవ
ప్రసరతి సుభ్రుతతః కృతీ భవేయమ్[12]

నాదు కోరిక తీరకున్న తఱి మును
రేయి నాకబ్బెడు నూరు రెట్లులగుచు
నీదు కూటమి యందట్లు నెగడు నేని
పునెమునాదె చక్కని కనుబొమలదాన!

హాస్యరసము :

There was never yet philosopher
That could eudure the toothache patiently[13]

పలునొప్పికిన్బాధఁ బడఁబోక సైపఁ
గలిగిన వేదాంతి కలుగఁ డిప్పటికి

11. Two gentlemen of Verona – Act. III, Se, i
12. విక్రమోర్వశీయము – 3–22
13. Much Ado About Nothing . Act. V, Sc. i

Men are April when they woo, December when the wed; maids are May when they are maids, but the sky change, when they are wives.[14]

మగవాండ్రు తముఁబెండ్లాడని కన్నియల బతిమాలుకొనునప్పుడు చైత్ర మాసము వంటివారు. కాని పెండ్లియైనపిదప శూన్యమాసమువలె నుందురు. కన్నియలు తమ కన్యాత్వమందు వైశాఖముం బోలెదరు. వారిల్లాండ్రైన పిమ్మట నాకాలము మాఱును.

కాళిదాసుని శ్లోకానువాద మొకటి -

ఏనం వయోధరయుగం పతితం నిరీక్ష్య
ఖేదం వృథావహసి కిం హరిణాయతాక్షి
స్తబ్ధో వివేకరహితో జనతాపకారీ
యో త్యున్నతః ప్రపతతీతి కిమత్రచిత్రమ్[15]

పడినగుబ్బదోయిఁ బరికించి యిద్దాని
వాలుఁగంటి! యూరకేల పొగల?
తెలివిలేని మొద్దు బలుదుంపఁగేడయి
యెదుగువాఁడు కూలుటేమి వింత?

అద్భుతరసము :

Make the doors upon a woman's wit, and it will out at the casement; shut that, and 't will out at the key hole; stop that, and 't will fly with the smoke out of the chmney[16]

ఆడుదాని చమత్కారము న్దలుపులు మూయుఁ, దది కిటికీ దూరిపోవు, నా కిటికీ మూసినచో, నది తాళముకన్నము నుండి బైలువెడలు, నా కన్నమున్గప్పిన యెడ - నద్ది పొగతోఁ గలిసి, పొగవెలుపు సందునుండి పైకివచ్చును.

14. As you like it - Act. IV, Sc. i
15. శృంగార తిలకము
16. As you like it - Act. IV, Se. i

Where love is great, the littlest doubts are fear;
Where little fears grow, great, great love grows there [17]

అక్కజంపు ప్రేమ యెక్కడనుండునో
యచటఁ గొద్దిశంకలగు భయంబు
ఎచటఁ జిన్న వెఱపు లెదుగుచు నుండునో
పెరుఁగుచుండు గొప్పప్రేమ యచట

When beggers die there are no comets seen;
The hevens themselves blaze forth the death of Princes[18]

కనపడవు తోఁకచుక్కలు
మినుచక్కి న్బిచ్చగాండ్రు మృతులైనయెడన్
పనివడి రాజుల చావున్
జనములకుఁ దనంతబయలుదాటుచు నుండున్

Virtue itself turns vice, being misasplied
And vice some time's by action dignified [19]

గుణమె దోషంబుగా మాఱుఁ గొన్నిచోట్ల
కరమ ప్రయుక్తంబగు కారణమున
విరచనాకౌశలంబున మఱియు నొక్క
కాలమందున దోషమే గణుతికెక్కు

ఇక కాళిదాస శ్లోకానువాదములు రెండు —

గచ్ఛతి పురశ్శరీరంధావతి పశ్చాదసంస్తుతం చేతః
చీనాంశుకమివ కేతోః ప్రతివాతంనీయమానస్య[20]

---

17. Hamlet - Act. III, Se. ii
18. Julius Caesar – Act. 2, Se.2
19. Romeo and Julies - Act. 2, Se. 3
20. అభిజ్ఞాన శాకుంతము 2–31

బొంది మును నడుచుచున్నది
డెందమొఱుకలేక పారెడిన్వెనువెన్కన్
దొందరగ నెదురుగాలిన్
జెంది పడగనున్న పట్టుచీర వితమునన్

రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకోభవతి యత్సుఖితోఽ పి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని[21]

అందములజూచి తీయ సద్దాలకించి
వనరు సుకమున్న పజదేని వలన నాక
తంబుచేఁ దొలిపుట్టులందలి యితములఁ
దెలియకెద నాటినవి మదిందలచుచుండు

రౌద్రరసము :

It it will feed nothing else, it will feed my revenge. He hath disgrac'd me and hind'red me half a million; laugh'd at my losses mock'd at my gains, scorned my nation thwarted my bargains, cooled my friends, heated mine enemies. and what's his reason? I am a jew. Hath not a Jew eyes? Hath not a Jew hands; organs, dimensions, senses, affections, passions, fed with the same food; hurt with the same weapens, subject to the same diseases, healed by the same means, warmed and cooled by the same winter and summer, as a Christian is? If you prick us, do we not bleed? If you tickle us, do we not laugh? If you poison us, do we not die? And if youwr ang us, shall we not revenge? If we are like you in the rest, we will resemble you in that, If a Jew wrong a Christian, what is his humility? Revenge. If a Christian wrong a Jew, what shoud his sufferance be by Christian

21. అభిజ్ఞాన శాకుంతలము 5–2
22. The Merchant of Venice – Act.3, Sc..1

example? Why, revenge. The villainy you teach me, I will execute; and it shall go hard but I will better the instruction. [22]

అది మఱిదేనిన్నేర్పకున్న నాపగన్నేర్పును. వాఁడు నన్నవమానపర్చెను. నాకైదులక్షలడ్డెను. నా నష్టములయెడ నవ్వెను. నా లాభముల నెక్కిరించెను. నా జాతిన్దిరస్కరించెను. నా బేరములు చెడగొట్టెను. నా మిత్రుల నడఁచెను. నా శత్రుల రేఁపెను. వాని ప్రయోజనమేమి? నేను యూదియా దేశస్థుఁడను. యూహూదీయునకు నేత్రములుండవా? యూహూదీయునకు హస్తము లవయవములు కొలత లింద్రియముల కోర్కులు కామక్రోధాదులుండవా? క్రీస్తుమతస్థుని వలె నా యన్నమున మేపఁబడియె - నాయాయుధములచేతనే హింసింపఁబడియె - నా రోగములకే లోఁబడియె - నా మందులచేతనే కుదుర్పబడియె - సీతాపేసఁగి చేతనే చల్వెక్కింపఁబడి తపించబడియె. నీవు మము రక్కినచో మాకు నెత్తురు కాఱదా? నీవు మాకు జక్కిలిగింత లిడిన మేము నవ్వమా? నీవు మాకు విసమిడిన మేము చావమా? మఱియు నీవు మా కన్యాయము చేసిన మేము పగదీర్చుకొనమా? నీవలె మిగిలిన దానిలో మేమున్నయెడల నందులో నిన్నుఁ బోలుదుము. యుహూదీయుఁడు క్రీస్తుమతస్థునకు హానిచేసెనేని వాఁడగపర్చవలసిన దయయేమి క్రీస్తుమతస్థుతుడు జహూదీయున కపకార మొనర్చినయెడ క్రీస్తు మతస్థుని నిదర్శనమున వానికెట్టి యోర్పుండవలయును? నేమి? పగ. నీవు నాకు నేర్పు దుర్మార్గము నెఱవేర్చెదను. మరి యది కఠినముగా నుండుగాని నేనా మప్పుబడి న్మఱింత చేసెదను.

ఇక కాళిదాసుని శ్లోకానువాద మొకటి —

సరోషదష్టాధిక లోహితోష్ఠై
ర్వ్యక్తోర్ధ్వరేఖా భ్రుకుటీర్వహద్భిః
తస్తార గాంభల్ల నికృత్తకంఠై
ర్హూంకారగర్భై ర్ద్విషతాం శిరోభిః [23]

కినుకమై గర్వపడి కడుఁగెంపు మిగులు
పలుదెఱలు - మీఁది రేకలఁ దెలుపు బొమ మ

23. రఘువంశము – సర్గ 7, శ్లో. 58.

డులు - ములుకులఁదెగిన కుత్తుకలును బొబ్బ
లొప్ప పగఱ తలల నేలఁగప్పె నతఁడు

బీభత్సరసము :

As the poor frighted deer, that stands at gaze,
wildly determining which way to fly
or one encompass'd with a winding maze,
That cannot tread the way out readily,
So with herself is she in mutiny
To live or die which of the twain were better,
when life is sham'd and death reproach's debter [24]

తా వేటకానికిఁ దారసమై యెటు
పారిపోవుదునంచు వలనుమిగుల
జంకునఁ జూచెడు జింకకైవడి లేక
కడుఁ జిక్కు-తావునఁబడి బిఱానఁ
త్రోవ యెయ్యదియైనఁ ద్రొక్క-లేకుండిన
దానిపోలికఁ దనలోనఁ దానె
గుంజులాడుచుఁ దన్ను గొనుచుండె నచ్చెలి
బ్రతుకు సిగ్గునకు లోఁబడిన యప్డు
మఱియు నెంతయు నప్పునంబడినవానిఁ
దెల్లముగఁ జావు వేలుపు తెగడునపుడు
బ్రతికియుంటయొ-యటుకాని పట్లఁజావఁ
దివురటయొ-లెస్స-యీ రెండు తెఱఁగులనని

24. Rape of Lucrece (Poem)

కాళిదాసుని శ్లోకానువాద మొకటి -

సఫేన త్రోలావృత వక్త్ర సంపుటం
వినిస్సృతాలోహిత జిహ్వామున్ముఖమ్
తృషాకులం నిఃసృత మద్రి గహ్వరా
దవేక్ష్యమాణం మహిషీకులం జలమ్ [25]

నురుఁగుసఁగదుల పొడవగు నోటిదొప్ప
లెంతయుం బైకిఁజాపిన యెఱ్ఱనాల్క-
లెనసి కడుదప్పిఁగుంది నీటిని వెదకుచుఁ
గొండపల్లముఁ గార్దున్నపిండు వెడలె

భయానక రసము -

Ay, but to die, and go we know not where;
To lie in cold obstruction and to rot;
This sensible warm motion to become
A kneaded clod; and the delighted spirit
To bathe in fiery floods, or to reside
In thrilling region of thick ribbed ice;
To be imprison'd in the viewless winds,
And blown with restless violence round about
Of those that lawless and incertain thought
Imagine howting 'tis too horrible
The weariest and most loathed worldly life,
That age, ache penury, and imprisonment,
Can lay on nature is a paradise
To what we fear of death [26]

సరికాని చచ్చుట - మరియుఁ బోవుట యెట
కో తెలియఁగ నేర ముంట - పేరు

25. ఋతుసంహారము - సర్గ. 1, శ్లో. 21
26. Measure for Measure - Act, III, Sc. i

కొనిన చలువనెత్తుటను మరి మురుగుట
    మెలఁకువఁగల వెచ్చ మెయి విడిచిన
ముద్ద యగుట మోదముంబొంది యెంతయు
    ననవరతమునున్న యట్టి జీవుఁ
డగ్గి యేళ్లందానమాడుట కొరడు పా
    తించెడు దళసరి మంచుదిబ్బ
పై నెలకొనుటయున్ గానిపించనిగాడ్పు
    లం జెఱవోయి నిల్కడఁగలుగక
వడితోట నూఁగులాడెడు జగమునకుఁ జు
    ట్టునెగురఁ గొట్టఁబడుటయు - లేక
హద్దుమీరుచు మఱి యఱమర తీఱని
    తలఁపులను కొనెడు దానికన్న
నెక్కువ యిడుమలఁబొక్కుట - యిదికడు
    గోరము ముదిమి నొగులును లేమి

బంది మఱియు మనల నందించి బడలిక
చీఁదఱలను మిగులఁ జేయునట్టి
యీఁ బ్రతుకె యరయఁగ నెంతయు మేలగుఁ
జచ్చి పొందెడు నగచాట్లకన్న

ఇక కాళిదాసుని శ్లోకానువాద మొకటి -

గ్రీవాభంగాభిరామం మహురనుపతతి స్యందనే బద్ధదృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టశ్శరపతనభయాద్భూయసా పూర్వకాయమ్
దర్భైరర్ధావలీఢైః శ్రమ వివృతముఖభ్రంశిభిః కీర్ణవర్త్మా
పశ్యోదగ్రప్లుతత్వాద్వియతిబహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి [27]

27. అభిజ్ఞానశాకుంతలము - 1-7

పెంబడు తేరువంక మెడవెట్టి పారింబొరిఁజూచు నమ్మృపై
నిం బడునంచు వెన్దలకు నివ్వెరముందటి మేనుకుంచుఁబూం
తం బఱుపున్నగంబు తినుదబ్బనుడయ్యుఁచు నోరువిప్పి యే
గుం బరికించు మా దిగునఁగొద్దిగ మెండుగ మింటదాఁటులన్

ఈ ఉదాహరణములవలన ఈ నవరసతరంగిణిలో కన్పడుచున్న అనువాద ప్రణాళిక -

షేక్సుపియరు గ్రంథములున్నభాష ఆంగ్లము. కాళిదాసు గ్రంథములున్న భాష సంస్కృతము. ఆంగ్ల గీర్వాణభాషలను ఆంధ్రీకరించునపుడు 'ఆంగ్లేయభాష కాంధ్రమొనర్చునెడ నాంగ్లేయభాషా పదముల వాడుటెట్లు తగదో, దేవభాష నాంధ్రీకరించునపుడు తత్సమ మట్లుపయోగింపరాదు' (పీఠిక - పు - 12) అనునది దాసుగారి ఈ గ్రంథపీఠికలో చెప్పిన నియమము.

దేవభాషయైన సంస్కృతమును తెనుగుచేయునపుడు తత్సమముల స్పర్శయే యుండదు. ఆంగ్లమునుండి తెనుగునకు అనువదించునపుడు తత్సమపదములు దొరలినను అభ్యంతరములేదు. ఆంగ్లమును అనువదించునపుడు తత్సమములు దొరలుచున్నను, ఆంగ్లానువాదమున కూడ నాటుతెనుగు పెత్తనమే ఎక్కువ. అనువాదము సంస్కృతపదాలకు 'డుమువులు' చేర్చిన తెనిగింపుకాక, మూలరూపము మాయము కాని, కృత్రిమముకాని చక్కని నాటుతెనుగులోసాగును. మూలమును నాటుతెనుగు భాషలో అనువదించుటకు అవకాశమున్నను, మూల పదానువాదముకాక, నాటు తెనుగుసీమ వాతావరణమును సృష్టించును.

కుమారసంభవము నందలి -

'విషవృక్షోఽపి సంవర్ధ్య
స్వయం ఛేత్తు మసాంప్రతమ్'

అనుదానిలోని 'విషవృక్షమ్' అనుదానికి 'విసపుచేట్టు' అని అనువదించుటకు అవకాశముండగా -

మును దాను బెంచిన ముసిఁడి చెట్టయినఁ
దనచేత నఱకుట దమ్మము కాదు'

అని 'ముసిఁడిచెట్టు' అని వ్రాసిరి. 'ముసిఁడిచెట్టు' తెలుగుగడ్డపైగల ఒక విషవృక్ష విశేషము.

ఇట్లే షేక్సుపియరు వ్రాసిన 'The earth hath roots' అనుదాని యందలి 'roots' అనుదానికి 'దుంపల్' అని వ్రాసిరి.

మూలభావములకు సందర్భోచితములైన క్రొత్తక్రొత్త పదబంధములను నిర్మింతురు. పదబంధనిర్మాణదక్షత కవి ప్రతిభకు ప్రమాణము కదా.

కుసుమ ప్రసూతి – పువ్వుసమర్త; వేదాంతేషు – ప్రాఁజదువులకొనల; రాగబంధ ప్రవాళమ్ – తగులు తలిరు; పరాఙ్ముఖ – పెడమొగము; లక్ష్మీంతనోతి_ మెఱుఁగునిడు; అర్కః – జగముకన్ను; పరితాపం – వలవంత; ప్రతిబోధపత్యః_ నెఱజాణ, మొదలగునవి.

మూలభావముల సారాంశమును మాత్రమే ఒక్కొక్కప్పుడు అనువాదమున తెత్తురు.

Even so she kiss'd his brow, his brow, his chin,
And where she ends she doth a new begin

అనుదానికి – 'అఁటది యతిముఖిన్ ముద్దిడియె వాని యవయవములు' అని వ్రాసిరి.

ఒక్కొక్కసారి మూలమునకు మెరుగులు దిద్దుటకై క్రమముమార్చుదురు, అభిజ్ఞానశాకుంతలమందలి 'అనాఘ్రాతం పుష్పం....' (2-10) అను శ్లోకమునకు వీరి అనువాద మిది-

క్రోలని క్రొత్తతేనె - మొనఁగ్రుచ్చని మానికె - గోరునాటులన్
దాలచనట్టి లేఁజిపురు - తావి గొనంబడనట్టి పూవునుం-
బోలిన దానిసోయగము ముందిట నోముల నేటిపంట గా
బోలును దాని నేలుటకుఁ బుట్టిన యాతని దెంత పున్నెమో

'ఆ మూలశ్లోకమున నొక ధ్వని విశేషమును కనిపెట్టి దానికి సహజమగు నట్లు అనువాదమున క్రమము మార్చిరి. అనువాదమునగల క్రమమునుబట్టి ఆ నాల్గు మాటలకు అర్థాంతరముల నేనిట్లూహించితిని. 1. చుంబనము (అధరామృతపానము), 2. దంతక్షతము, 3. నఖక్షతము, 4. అసలనుభవము (సంభోగము). పరిణామ క్రమ రమణీయమైన పద్ధతి యిదే మరి. ఆ దాసును మించిపోయినా డీదాసు' అని అనువాదమున దాసుగారు క్రమము మార్చినదానికి ఆచార్య యస్వీజోగారావు గారు చేసిన వ్యాఖ్యానము. [28]

ఇక పాదపూరణ ప్రయోజనదృష్టితో వ్యర్థములైన పదాలతో సాగదీయక, తెనిగింపు సొంపయిన కుదింపుతో నింపుట. అన్నది దాసుగారి లేఖినికి జన్మ లక్షణము.

ఇది దాసుగారి నవంసతరంగిణి గ్రంథానువాదమున కన్పడు ప్రధాన ప్రణాళిక.

ప్రాచీనాంధ్రకవులకు షేక్సుపియరు నెరుగుటకు అవకాశము తక్కువ. అందువలన షేక్సుపియరు గ్రంథములను చదివి మురిసిపోయి తెలుగుచేయు అదృష్టము వారికి లేదు. ఎరిగినచో షేక్సుపియరు భావరత్నములను బండ్ల కెత్తెడివారు. ఆధునికులకు ఆ అవకాశము ఆకాశమంత యున్నను, పరవశించినవారు బహుళముగా నున్నారు గాని తెలుగున ప్రతిధ్వనించిన ప్రసిద్ధులు మృగ్యము. ఈ ఖ్యాతి దాసుగారికే దక్కినది. ఇక కాళిదాసు భావసంపదను పంచుకొన్న భారతీయు లసంఖ్యాకులు. తక్కినవారిమాట యెటులున్నను కాళిదాసుని ప్రతిభామూర్తిని స్వభాషాదర్శములో దర్శించిన ఆంధ్రులనేకులు. ఎందరోయున్నను శాకుంతలాంధ్రీకరణమున రావుబహదూర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు, విక్రమోర్వశీయాంధ్రీకరణమున వేదము వేంకటరాయశాస్త్రిగారు లబ్ధప్రతిష్ఠులు. వసురాయలు ఈ రెండు గ్రంథములను ఆంధ్రీకరించిన వారిలో ప్రసిద్ధులు.

---

28. కచ్ఛపీశ్రుతులు–సంపాదకీయము. పు–38

తారతమ్య పరిశీలముకై వీరేశలింగముగారి శాకుంతలానువాదము నుండి, వేంకటరాయశాస్త్రిగారి విక్రమోర్వశీయానువాదము నుండి ఒక్కొక్క ఉదాహరణముతో దాసుగారి అనువాదములు -

యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం
యదర్థే విచ్ఛిన్నం భవతి కృత సంధానమివ తత్
ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయోః
ననేదూరే కించిత్ క్షణమపి న పార్శ్వే రథజవాత్.

అను కాళిదాస శాకుంతల శ్లోకమునకు (1-9) -

ఏది కడుచిన్నదై యుండు నిప్పుడదియ
క్షణములోపల గొప్పదై కానిపించు
నేది నిడుమను నెడముండి యెసగుచుండు
నదియు నొకటిగా కలిసియున్నట్లు తోచు

ప్రకృతిచేతను నెయ్యది వక్రమగునా
పరగనయ్యది సమరేఖవలెనె యుండు
దూరమిది చేరువిది యని తేరువడిసి
నిర్ణయింపగ రాదేక నిముషమునని

అని రెండుపద్యములలో వీరేశలింగముగారు అనుందించినారు. ఈ శ్లోకమునే-

చిన్నది పెద్దదిగా విడి
యున్నది కలిసినటు వంక నుకునది సరిగాఁ
జెన్నారు దవులఁ జెంగటఁ
గన్నులబడదెద్ది తేరు కడువడిఁబోవన్

అని ఒక్కపద్యములో నారాయణదాసుగారు అనువదించినారు.

ఉష్ణాలుశ్శిశిరే నిషీదతి తరోర్మూలాలవాలే శిఖీ
నిర్భిద్యోపరికర్ణికారముకులాన్యాలీయతే షట్పదః
తప్తం వారి విహాయతీరనలినీం కారండవః సేవతే
క్రీడావేశ్మని చైషపంజరశుకః క్లాంతో జలంయాచతే

అను విక్రమోర్వశీయశ్లోకమునకు - (2-22)

ఉలికి వేడికి నెమలి గూర్చుండు సరిగ
వలిదోలకు తరుమూలాల పాలమందు
కొండగోగున ముకుళింపు కొనను దెఱచి
లోన నిందిందిరమ్ము దాలీనమగుచు

క్రాగినజలంబు విడిదన్ని కన్నెలేడి
గట్టునగు మెట్టదామర చెట్టు చేరె
కేళిగృహమున పంజరకీర మిదిగో
వినుము క్లాంతమై సారెకు వేడు జలము

అని రెండు పద్యములలో వేదము వేంకటరాయశాస్త్రిగారు అనువదించినారు. ఈ శ్లోకమునకే దాసుగారు ఒక్క పద్యములో చేసిన అనువాదమిది.

ఉడుకున కోడిజుట్టు పులుఁగుండెడుఁ జల్లనిచెట్టు పాదునం
దెడఁ జేసి గోఁగు మొగలెంతయు లోననణంగుఁ దేఁటి బి
ట్టుడికిన నీటఁబాసి చనునొడ్డునఁగల్గిన దమ్మికంచ నీ
రడిగెడు గూటిచిల్క దగనల్లలనాడుచు నాటపట్టునన్.

ఈ తారతమ్యపరిశీలనము వలన తక్కిన గుణములమాట యటులుండ, దాసుగారి అనువాదమున సంక్షిప్తత, తత్సమపదవాసన కూడలేని నాటుతెలుగు కన్పడుచున్నది.

గ్రంథరచనాప్రణాళిక దృష్టిలో, నవరసతరంగిణి ఆంధ్రసాహిత్యమున అనిదంపూర్వ గ్రంథము. ద్వితీయములేని గ్రంథము.

రుబాయెతు ఉమర్ ఖయాము[29] :

ఉమర్ఖయాము వ్రాసిన రుబాయీలు (రుబాఇయాన్) ప్రపంచప్రసిద్ధము లైనవి. రసికుల రసనలతో కొన్ని వందలయేండ్ల బాంధవ్యమున్న ప్రాతచుట్టములు. ఉమర్ఖయాము వ్యవహారనామము ఉమర్. ఇతని పూర్తిపేరు ఘియాత్ ఉద్దీన్ అబుల్ఫతహ్ ఉమర్బిన్ ఇబ్రహీమ్. ఇతనికాలము క్రీ. శ 1048–1122. పరిషియాదేశము నందలి నైషపూరు పట్టణమితని నివాసస్థలము.

చిత్రముగా నారాయణదాసు గారికిని, ఉమరునకు కొన్ని సామ్యములున్నవి. వీరిరువురు సూర్యభక్తులు, ప్రకృతి సౌందర్యోపాసకులు, యథేచ్ఛా విహారులు, మదవతిని మద్యమును బాగుగా అనుభవించినవారు, సంగీతవిద్వాంసులు, గురువుల చేత చిత్రికపట్టబడని కవులు, ఉమర్కవి ప్రాధాన్యమిచ్చిన 'మదువు, మదుపాత్ర. లను 'దైవభక్తి, శ్రద్ధలు'గా, అతని మితాహార పాన ప్రస్థములను వానప్రస్థాశ్రమ ధర్మములుగా సమన్వయించి దాసుగారు ఉమర్కవిని బ్రహ్మవేత్తగా భావించినారు.[30]

విజయనగరమహారాజ్ఞి లలితాకుమారీదేవి ప్రోత్సాహమున దాసుగారు తమ అరువదితొమ్మిదవయేట, ఈ గ్రంథమును వ్రాసి, అప్పటికే కీర్తిశేషులైన మహారాజు శ్రీ విజయరామరాజునకు అంకిత మిచ్చిరి.

దాసుగారి గ్రంథములలో దేనికికూడ ఇతరుల పీఠికలుగాని, అభిప్రాయములు గాని యుండవు. వారికట్లు యితరులచేత వ్రాయించుకొనుట యిష్టములేదని – It is not my habit, like many authors; to get my works corrected and recast by others - అను వారి మాటలే సాక్ష్యములు[31] కాని ఈ రుబాయెతు గ్రంథమునకు సర్వేపల్లి రాధాకృష్ణపండితుని 'ముందుమాట' యున్నది'

---

29. ఉమరుఖయాము అనుపేరును దాసుగారు 'అమరకాయము' అని ఈ గ్రంథముయొక్క అంగ్లపీఠికలో వ్రాసిరి.

30. దైవభక్తి రేవోమరు కవినోద్దిష్ట సురేతి,
శ్రద్ధైవ తస్య పాన పాత్రీతి నిశ్చినుమః అర్థగ్రాసోఽ
రణ్య నివాసః సంతత శివశక్తి నామాభ్యాస ఏవోమరు
కవి నాకాంక్షి – ఉమరకవిప్రశంసా – పుట – 5

31. ఉమరుఖయాము – అంగ్లపీఠిక, పు. 1

దీనిలో నుండుటకు కారణమేమన, ఈ రుబాయెతును అచ్చువేయించిన లలితాకుమారి దేవిగారు ఒకప్రతిని అప్పుడు విశాఖపట్టణమున ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు 'వైస్‌ఛాన్సలరు' గా నున్న రాధాకృష్ణన్ గారికి పంపి అభిప్రాయము సేకరించి ముద్రించుట జరిగినది.

ఈ గ్రంథమునకు దాసుగారు మూడుభాషలలో (ఆంగ్లము, సంస్కృతము, అచ్చతెనుగు) మూడుపీఠికలు వ్రాసిరి. ఈ మూడు పీఠికలందున్న ప్రధాన విషయము ఉమర్‌కవి యొక్క ప్రశంస. అంతేకాక 'ఉమర్ఖైయాము - పద్దెముల నుడుల వివరము' : 'ఉమర్ఖైయామునకు నాచేసిన పద్దెములందలి మాఱుమూల మాటలకు వరుసగా వివరము' అని రెండు పెద్ద అనుబంధములను గ్రంథాంతమున దాసుగారు చేర్చిరి. మొదటి అనుబంధము వలన పారశీకపదములకు, రెండవ అనుబంధము వలన అచ్చతెనుగుపదములకు అర్థములను తెలిసికొనవచ్చును.

తెలుగుదేశములో వేమనపద్యముల వలె ఉమర్ వ్రాసిన రుబాయీల సంఖ్యా విషయములో గూడ విమర్శకులకు ఏకాభిప్రాయములేదు. రుబాయీల సంఖ్య ఐదువందలకు పదమూడువందలకు మధ్య ఊయెల లూగుచున్నది. దాసుగారు గ్రహించిన రుబాయీలసంఖ్య నూటపది. ఈ నూటపది రుబాయీలకు ఎడ్వర్డు ఫిట్స్‌జెరల్డు చేసిన ఆంగ్లానువాదమును గూడ గ్రహించి అనువదించిరి.

దాసుగారు ఈ గ్రంథమున చేసిన అనువాదము నాలుగువిధములు. మూలమైన రుబాయీకి ఒక సంస్కృతీకరణము, ఒక అచ్చతెనుగు అనువాదము. అట్లే ఫిట్స్‌జెరల్డు ఆంగ్లానువాదమునకు ఒక సంస్కృతీకరణము, ఒక అచ్చతెనుగు అనువాదము. పారశీకాంగ్ల గీర్వాణదేశ్యాంధ్ర భాషలలో ఏ యొక్క భాషతో పరిచయమున్నవారైనను ఉమర్ఖయాము భావసంపదను గ్రహింపవచ్చును.

ఉదాహరణమునకు గ్రంథప్రారంభము నందలి మొదటిరుబాయికి, ఆంగ్లానువాదమునకు దాసుగారు చేసిన సంస్కృతదేశ్యాంధ్రానువాదములు -
ఉమరు రుబాయి :

ఖుర్షీద్ కమంది సుబ్హ్ బర్‌బామ్ అఫ్‌గన్ద్
కైఖుస్రవి రోజ్ ముహ్రా దర్‌జామ్ అఫ్‌గన్ద్

మయ్ ఖోర్ కి మనాది యీ సహర్ గ ఖై జాన్
ఆవాజయి ఇష్ రబ్ వా దర్ అయ్యామ్ అఫ్ గన్ద్

దీనికి దాసుగారి సంస్కృతీకరణము -

సూర్యః ప్రభాతజాలంగృహే పరితలే సమస్తతో క్షైణ్యాసీత్
దినపతిరపాస్థ త్స్వస్థానమణిం భాజనే ప్రయాణాయ
ప్రాతః సజాగరుకః ప్రతిహార్యవ్యాహారహః సఉత్తిష్ఠన్
పిబహాలామిత్యుచ్చైర్వ్యాజిజ్ఞపత్సంభ్రమేణ కర్తవ్యమ్

అచ్చతెనుగు అనువాదము -

కావిరా పొద్దువలపై చేఁ గప్పుమీఁద
వెలుఁగు తేఁడడిగాఁ దన యిల్వెడలుచుండెఁ
ద్రాగుడన వేగరియుఁజాలె - వేగుఁబోక
హాయిగా మీరు నీవిరి నానుకొనుఁడు

పారశీకమూలమునకు ఫిట్స్‌జెరల్డ్ ఆంగ్లానువాదము-

Awake! for morning in the bowl of night
has flung the stone that puts the stars to flight;
and lo! the hunter of the East has caught
the Sultan's Turret in a noose of light.

ఈ ఆంగ్లానువాదమునకు దాసుగారి సంస్కృతీకరణము -

ప్రబోధయ ప్రభాతో నక్షత్రాణ్యాస్త్ర దీధపత్
ఇనో క్షైప్సీన్నవీనాంశుజాలం రాజగృహోపరి

ఆంగ్లానువాదమునకు అచ్చతెనుగు అనువాటము -

మేలుఁకువగను మీాయదె తూ
ర్పులరారె మినుమినుకు లడుగంటదొడంగెన్

జెలఁగి పగటివేలుపు నే
డల యూదలకెంపవిడి యెడవల దవిలిచెన్

ఇట్లే నూటపది రుబాయీలకు అనువాదములు సాగును.

బుఱ్ఱా శేషగిరిరావుగారు బందరులో జరిగిన నవ్యసాహిత్య పరిషత్తు ఆరవ వార్షికోత్సవసభలో (12-2-1938) అధ్యక్షోపన్యాసము చేయుచు ఈ గ్రంథమును గూర్చి అన్న కొన్ని వాక్యములు- 'తత్సమములు వదిలి కేవల తద్భవము దేశ్యములతోనే శుద్ధాంధ్రగ్రంథములు చేసిన పాండితీధనులు కలరు. ఇంతకుమించిన కుస్తీ పని, తద్భవములు కూడ తీసివేసి కేవలము దేశ్యముతోనే కావ్యకల్పనచేయుట. ఈ అతిమానుషమైన పనిచేసిన జెట్టి శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు. సంగీత సాహిత్యములలో పండిపోయిన ఆటపాటలమేటి. ఈయన ఉమరఖయ్యాము తెలుగు సేతలోనిది ప్రఖ్యాతమైన కేవల దేశితెలుగుభాష స్వతంత్రముగా కావ్యకల్పనకు చాలినదని రుజువిచేసి తెలుగుదనము స్వాతంత్ర్యమును బస్తీమీద సవాలుచేసి సలిపినది. ఇందుకు మనమంతా ఆ మహాపండితునికి కృతజ్ఞులముగా నుండవలసి వచ్చే' 32

'ఈ గ్రంథము నందలి అచ్చతెనుగుభాష అందరికిని బోధపడదు' అను ఆక్షేపమునకు దాసుగారు చెప్పిన సమాధానము-

'మొట్టమొదట వెగటుగాఁ దోఁచిన దినుసైనం జవిచూచిన కొలది నల వాటుపై నింపుగాకమానదు కనుక నోర్మిగల మంచి చదువరులకీ నా పన్నిక కొన సుట్ట సారసిన కొలదిఁ జవిగొల్పక తీరదను నిండు నమ్మిక నింతతో నీవ్రాఁత ముగించినాఁడను'. 33

ఈ 'రుబాయోతు - ఉమర్ ఖయాము' పారశీకాంగ్ల సంస్కృత దేశ్యాంధ్ర భాషలపై దాసుగారి ప్రభుత్వమును ప్రకటించు గ్రంథము.

---

32. నారాయణదాస జీవిత చరిత్రము - శ్రీ మరువాడ వేంకటచయనులుగారు, పు. 234

33. ఉమరుఖయాము ముచ్చట - పు 13

నూఱుగంటి :

'నూరుగంటి' నూరుపిట్టలకథల చిన్నపుస్తకము. 'నూరుగంటి' అన నూరు కన్నులు కలవాడు అని అర్థము.

'నూఱు కనులవాని తీరునఁ దెల్వితో
దీనిఁ జదువువారు తిరుగుచుండ్రు
నూఱుగంటి యనెడి పేరు దీనికిఁ దగి
యుండ నిదియుఁబెంపునొందుచుండు.[34]

అని దాసుగారు, ఈ నూరుకథలను చదువువారు నూరుకనులు కలవానివలె తెలివితో తిరుగుచుందురు, అందులకే ఈ గ్రంథమునకు 'నూరుగంటి' అను పేరు తగియున్నదనియు వివరించినారు.

'జగమంతట స్మిగులఁదెలివిగల వారిచేత నెన్నికకెక్కి యడుగడునకు మంచి తెలిపెడి యీ ముచ్చటలు వందలకొలఁది మూఁడు నాల్గువేలయేండ్ల క్రిందట నొక పడమటి నాటు చదువరి మిన్న పన్నెను - మేల్మివలె మెత్తనైన తెలుఁగునందీ సామెత లున్నయెడల మరింత వన్నెకెక్కునని యెంచి నూరేర్చి కూర్చినాఁడను' [35] అను దాసుగారి మాటలవలన ఈ 'నూరుగంటి' మూఁడు నాలుగువేల సంవత్సరములకు పూర్వమందున్న ఒక పాశ్చాత్యపండితుని కథలలో నూటికి అనువాదము అని తెలియుచున్నది.

దాసుగారు చెప్పిన 'పడమటి నాటు చదువరి మిన్న' యెవరో కాదు- క్రీ. పూ. 620-560 ప్రాంతమున సామోస్ అను గ్రీకు రాజు చెంత కథలు చెప్పిన ఈసప్ అను ఒక పండితుడు. ఈసపు తన కథలన్నియు పశుపక్ష్యాదులతో నల్లినాడు. ప్రపంచప్రసిద్ధభాష లన్నిటిలోనికి ఈ నీతికథలు అనువదింపబడినవి. తక్కిన భాషల సంగతి యెట్లున్నను, ఈ కథలను తెనుగునకు అనువదించినవారు ముగ్గురు. 158 కథలతో 'నీతికథామంజరి' అను పేర శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులు

34, నూఱుగంటి – వివరము, పు. 2
35. పైది పు. 1

గారు, నూరుకథలతో 'నూరుగంటి' అనుపేర శ్రీ నారాయణదాసుగారు, 316 కథ లతో 'ఈసప్ కథలు' అనుపేర శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు.

ఈ ఈసపుకథల పుట్టుపూర్వములను గూర్చి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు అన్నమాటలివి [35]

'ఈసప్ నీతికథలను బౌద్ధజాతక కథలను ఒండొంటితోఁ బోల్చి పరిశీలించి నచో ననేక కథ లించుగా నొకటిగానే కనఁబడును. యూరోపు హిందూదేశముల లోని నీతికథలను బరస్పరము పోల్చి పరిశోధించిన పరిశోధనపండితులు ఈసప్ నీతికథలలో ననేకములు హిందూదేశము నుండి యూరోపునకు వెళ్లినవే యని నిర్ధారించియున్నారు.'

దాసుగారు అనువదించిన నూరుకథలివి -

1. కోడిపుంజు - అవ, 2. తోఁడేలు - గొఱ్ఱెపిల్ల, 3. దొరనుగోరిన కప్పలు, 4. మాలకాకి, 5 కుక్క - దానినీడ, 6. సింగము - కొంగ నక్కలు, 7. వఱకు - కొంగ, 8. దుప్పిపోతు - నీడ, 9. కాకి - నక్క, 10. రెండాఁడు కుక్కలు, 11. పొగరుబోతు కప్ప, 12. నక్క - కొంగ, 13. డేగ - గుంటనక్క, 14. గాడిదె - ఎలుఁగుబంటి, 15. తంపరకప్పలు-డీకొన్న యాఁబోతులు, 16. గ్రద్ద - గువ్వలు, 17. ఇద్దరాంధ్రవాఁడ్రు, 18. పెంపుడుకుక్క - చిఱుతపులి, 19. నక్క - అందని పండ్లగుత్తి, 20. ఆకురాయి -కట్లపాము, 21. నక్క - మేఁకపోతు, 22. చూలుకొండ, 23. ముసలి - వేఁటకుక్క, 24. సింగము - చిట్టెలుక, 25. గుఱ్ఱము-దుప్పి పోతు, 26. పల్లెటూరియెలుక - పట్నపుటెలుక, 27. కడుపునకుఁ గాళ్చేయి నోళ్ళకును జగడము, 28. వానకోయల - దానిపిల్లలు, 29. దాదినక్క, 30. డేగ - తాఁబేలు, 31. గాలి - ప్రొద్దు, 32. సింగపుఁదోలును గప్పు కొనిన కుంటిగాడిదె, 33. పెంకెకుక్క, 34. ఇద్దరు బాటసార్లు - ఎలుగు బంటు, 35. బిందె - కడవ, 36. నెమలి - పెద్దేటికొంగ, 37. చింతచెట్టు తెల్లుదుబ్బు, 38. పులి - వఱడు, 39. సింగము - నాలుగాఁబోతులు, 40. కాకి - చెంబు, 41. బండివాఁడు - వేల్పు, 42. బంగారుగ్రుడ్లుపెట్టు

36. నీతికథామంజరి పీఠిక

బాతు, 43. నక్క - పిల్లి, 44. ముసలివాఁడు - చావు, 45. వలపుగల సింగము, 46. ఆఁడుపంది - ఆఁడుసింగము, 47. రెండు కప్పలు, 48. పిసినిగొట్టు, 49. పేఁకుచెట్టు - చిట్టివాఁకతుప్ప, 50. ఎద్దు - మేక, 51. పిల్లి - ఎలుకలు, 52. గ్రుడ్డి గంటిదుప్పి, 53. కుందేలు - పిచ్చుక, 54. ఎంగ్రదకాయలు, 55. దొంగ - పిల్లవాఁడు, 56. వేలుపు - కట్టెలుకొట్టు, వాఁడు, 57. కొయ్యదేవర, 58. గాడిదెముద్దు, 59. మేఁకపిల్ల - తోడేలు, 60. మిడుత - చీమ, 61. నక్క - కోడి, 62. గద్దిమేటిపైనున్న కుక్క, 63. గువ్వ - డేగ - బోయ, 64. చీమ - గువ్వ, 65. డేగ - కాకి, 66. పెంపుడుచిల్క, 67. కాపువాఁడు - వానికొడుకులు, 68. ముసలివాఁడు- కొడుకులు, 69. ఏదుపంది - పాములు, 70. అలకాఁపరి - పులి, 71. చెవులపిల్లి - తాఁబేలు, 72. అంగూరుతోఁట - లేడి, 73. త్రాగుఁబోతు, 74. గొడ్డలివంతు, 75. బెస్తవాఁడు, 76. కోడిపెట్ట - పాముగ్రుడ్లు, 77. ఒట్టు, 78. దారికడ్డరాయి, 79. మున్నీరుత్రాగుట, 80. రొట్టె గంప, 81. పొడుముడబ్బీ - ముక్కర్ద్దము, 82. మేఁక పెంచిన గొఱ్ఱెపిల్ల, 83. జబ్బుపడిన గద్ద, 84. చెట్లు - చెట్లునరకువాడు, 85. వేలుపు - ఒంటె, 86. ఎద్దు - దూడ, 87. గాడిదె - కాఁపు, 88. గాడిదె - సింగము, 89. మేఁకపోతు - సింగము, 90. కోఁతి - దొర, 91. దొంగ - కుక్క, 92. బయకాఁడు, 93. కోడి - సింగము - గాడిదె, 94. గూడకొంగ, 95. నక్క - తోఁడేలు, 96. కోఁతిప్రాపు, 97. ఉప్పుమోయుగాడిదె, 98. బంగారు పిచ్చుక - కోఁతి, 99. కోఁతి - పిల్లలు, 100. తోఁడేళ్ల- జబ్బుతోనున్న గాడిదె.

దాసుగారు గ్రహించిన ఈ నూరుకథలు వీరేశలింగముగారి 158 కథలలో నున్నవి. కాని కథానామములు మాత్రము భేదించినవి. వీరిరువురు కథలను వ్రాసి కథాంతము లందు ఆ కథానీతులను పద్యములుగా వ్రాసిరి.

రచనా సాక్షాత్కారమునకు కొన్ని ఉదాహరణములు -

నక్క - కొంగ (పన్నెండవకథ)

ఒకప్పుడొక నక్క కొంగతో నేస్తము గట్టుకొని దానిని దనయింటికి విందు నకై పిలిచెను. ఆ నక్క సిబ్బిలోఁ దిమ్మనముపోసి కొంగను ద్రాగుమని తానుం

గూడ దెబ్బున నాకజొచ్చెను. కొంగముక్కునకుఁ గొంచెమైనను దిమ్మనము రాకుండెను గాని చిటికలోనే నక్క తన నాలుకతోఁ దిమ్మనము కసింతయున్నిగుల నీక జుర్రిపేసెను. మఱి కొన్నాళ్ళకా కొంగ నక్కను విందునకుఁ బిలిచి యొక సన్నపు మూతి బుడ్డిలోఁ దేనెనుబోసి ముందుపెట్టి పీల్చుమని తన ముక్కు దాని లోదూర్చి తేనెను వల్లనైనంత తొందరలోఁ బీల్చుచుండెను. నక్కకు మూతి బుడ్డిలో దూరకుండుటచేఁ గొంగముక్కు నుండి రాలిన బొట్లు నాకుటతప్ప మఱే మియు దొరకలేదు. అది చూచి నక్క 'ఒకనికి మించిన టక్కరి యొకడుండును గదా! నాకుఁ దగినట్లు చేసినావు' అని చెప్పి పారిపోయెను.

తానె టక్కరి యనుచుఁ బైవాని మోస
పుచ్చెడు నతండు బదులుగ మోసపోవు
కొంగ మెడఁ డక్కరితనంబుఁ గొనిన నక్క
బదులుగా దానిచే మోసపడఁగ లేదె

## కాకి చెంబు (నలువదియువ కథ)

ఒక కాకి మిగుల దప్పితో నీటికై నలువైపులు కనిపెట్టుచు నొక చోటఁ జెంబులో నీరుండఁజూచి త్రాగుటకు తొందఱతోఁ జెంబు యొద్దకు వచ్చి దానియంచు పై నిలఁబడెను. అది మెడ యెంత వంచినను దానిముక్కునకు నీరందీ యందనట్లుండెను గాని పీల్చుటకు వీలుకాలేదు. పిమ్మటఁ గాకి చెంబు నొత్తిగిలఁ జేయఁబోయి యట్లు చేయఁజాలక. యాదగ్గరనేయున్న కొన్ని చిరురాళ్ళ నొక్కొక్కటిఁగా దెచ్చి యా చెంబులోఁ బడవేయఁజొచ్చెను. అంతటఁ గొంతసేపటికి చెంబులోని నీరంచుల యొద్దకు వచ్చెను. అప్పుడు దప్పితీర్చుకొని యా కాకి యెగిరిపోయెను.

నేర్పుగలుగువాఁడు నెరవేరు నందాకఁ
బనికిఁ జొచ్చికోర్కెఁ బడయుచుండు
మూతి కందనట్టి ముంతనీటనురాలు
గూర్చి కాకిదప్పి తీర్చుకొనదె

ఉప్పుమోయు గాడిదె (తొంబదియేడవ కథ)

ఒకఁడు సంతలో నుప్పుఁగొని గంతలోఁబోసి గాడిదెపై నెత్తి తోలుకొని యింటికి బోవుచుండెను. అదారిలో నొక కాలువ పారుచుండెను. అ గాడిదె కాలుజారి యా కాలువలోఁ బడెను. అప్పుడుప్పుకరఁగి పోయెను. పిమ్మట గాడిదె బరువు చులకవడి చెలరేఁగి పరుగిడి యిల్లుచేరెను. మరి యొకనాఁడు మునుపటి వలె గాడిదె యుప్పుగంత మోయుచుఁ గాలువలో నడుచునపుడు కాలుజారి పడినట్లు లుప్పుగంత కోరి నీటిలో ద్రోసివైచెను. అ యుప్పెల్ల గరఁగి బరువు చులకపడెను ఇట్లు తన యుప్పు చెడుటఁజూచి వాఁడది తన గాడిదె చేసిన పనియని తెలిసికొని మరియొకనాఁడా గాడిదెపై దూదినిండిన గంతను వేసి యా కాలువ నుండి తోలు చుండెను. అప్పుడుగాడిదె తన బరువును మునుపటివలె మరింత చులకపరచదలఁచి నీటిలోఁబడి దొర్లెను. పిమ్మట దూదియంతయు నీటిలోఁదడిసి నూరురెట్లు బరువాయెను. అది మోయఁజాలక గాడిదె పడదెబ్బలు తిని 'చేసికొన్నది కుడువక తీరునా' అని వగచెను.

చేయవలయు దానిఁ జేయకమానఁ
బూను నట్టివాఁడు మోసపోవు
ఉప్పుగంత బరువుఁ దప్పించి గాడిదె
దూదిగోనె తడిపి త్రొట్రుపడదె

మహాపండితులయిన నారాయణదాసుగారు బాలురకు నీతులు గరపుట కొరకు అనువదించిన గ్రంథము ఈ 'నూరుగంటి'.

వెన్నుని వెయిపేర్ల వినకరి :

వెన్నుని వెయిపేర్ల వినకరి అనునది విష్ణుసహస్రనామ కీర్తనము అనుదానికి అచ్చతెనుఁగు అనువాదము. విష్ణుసహస్రనామస్తోత్రము వ్యాస భారతము నందలి అనుశాసనిక పర్వమున గల భీష్మయుధిష్ఠిర సంవాదమను అధ్యాయమున వచ్చును. ఆదిశంకరులు దీనికి వ్యాఖ్య వ్రాయుట వలన ఈ స్తోత్రము విలువను వేరుగా వెల కట్టపనిలేదు.

పార్లమెంటు సభ్యులను కలిసి మాట్లాడాడు. ఆంగ్లేయ ప్రజకు ఈస్టిండియా కంపెనీ యొక్క సత్య స్వరూపాన్ని తెలియబరచి మేల్కొలిపాడు. ఎంత ప్రచండమైన తీవ్ర ప్రయత్నము! పార్లమెంటు సమక్షంలో ఆయన ఈస్టిండియా కంపెనీ చేసే అత్యాచారాల వేదనామయ గాథను తెలియబరచి న్యాయాన్ని గూర్చి బడాయిలు చెప్పే అంగ్లేయ ప్రభుత్వాన్ని "ఇదేనా మీ న్యాయము? ఇదేనా న్యాయంగా నడిచే మీ శాసనం?" అని సవాల్ చేసి అడిగాడు. అరవైవేల సంతకాలతో వందకు మించి వినతి పత్రాలను రంగోబాపుజీ పార్లమెంటుకు సమర్పించాడు. దీనికి ఋజువులు ఈనాడు కూడ మనకు దొరుకుతాయి.

రంగోబాపుజీ చేసిననిర్విరామ కృషి ఫలితంగా 1848 ఫిబ్రవరిలో ఈస్టిండియా కంపెనీ రంగోబాపుజీ నాహ్వానించి ఆయన చెప్పదలచుకొన్న విషయాన్ని సంచాలకుల ముందుంచడానికి అవకాశమిచ్చింది. రంగోబాపుజీ ఆంగ్లంలో విద్వాంసుడే. అయినా కంపెనీ సంచాలకుల ముందు ఆయన ఆంగ్లంలో మాట్లాడలేదు. స్వాభిమానము, రాష్ట్రభక్తి ప్రకటిస్తూ ఆయన మాతృభాషలో ఉపన్యసించాడు. ఆయన స్నేహితుడైన మేజర్ గ్రహం ఆ ఉపన్యాసాన్ని అనువదించాడు. ఆ ఉపన్యాసము ఎంతో ఉత్సాహ పూరితంగాను, ఉత్కటతోను స్వదేశ ప్రేమ భరితంగాను ఉండినది.

కాని. అదృష్టం కలిసిరాలేదు. ఈ ప్రయత్నాల తరువాత స్వరాజ్య ప్రాప్తికి ఇది మార్గం కాదని రంగోబాపుజీ తెలుసుకున్నాడు. "దొంగల గుంపుకు న్యాయం-అన్యాయం, ప్రతిష్ట-అ ప్రతిష్ట- ఈ ఆలోచనల ఆవశ్యకత లేదు" అని తనకు తాను నచ్చచెప్పుకున్నాడు. హిందూ స్వరాజ్యాన్ని నశింపజేయడం ఆంగ్లేయుల ఏకైక వాంఛ. ఇది ఆయన చక్కగా గ్రహించాడు. అటు పిమ్మట ఆయన క్రొత్త ప్రయత్నాలలో నిమగ్నుడైనాడు.

యేతలంపు లేకుండుట యోర్మిరూపని వెన్నుని గూర్చి వెల్లడించు తొలుఁబల్కు-చెట్టు తన పేయి కొమ్మలంబండిన పండ్లే యా వెన్నుని వేయిపేర్లయి యొప్పారు చున్నవి'.[38]

దాసుగారు సంస్కృత నామములను తత్సమములుగా చేసి, ఆ తత్సమములను అచ్చతెనుగు పద్యములలో వివరించినారు. అనువాద ప్రణాళిక అర్థమగుటకు కొన్ని ఉదాహరణములు -

1. కృతాన్తకృత్, కృతిః, కృశః, కృష్ణః, క్షేత్రజ్ఞః, క్షేమకృత్, కేశవః, కేశిహా - అను నామముల అనువాదము.

వడిగఁ గృతాంత కృత్తిడుమ లెడపురాజు
　　కృతి పనిపాటులన్ ద్రిప్పు మేటి
కృశుఁడగపడఁ డెవ్వరికినైనఁ గృష్ణుండు
　　మంచికిదారి చూపించు వేల్పు,
కృష్ణుండు తప్పుల నెల్ల యొప్పులు చేయు
　　క్షేత్రజ్ఞుఁ డిచ్చవచ్చినటు లుండఁ
దగు, క్షేమ కృత్తన్న సొగసును గాపాడు
　　ఱేఁడు కేశవుఁ డందకాఁడు కేశ
వుండెల్లెడ న్వెల్గు పుట్టించు వేలుపు
　　కేశిహుండు స్గిడు గెంటుబంటు (పు. 34,35)

కృతాంతకృత్తు, కృతి, కృశుడు, కృష్ణుడు, క్షేత్రజ్ఞుడు, క్షేమకృత్తు, కేశవుడు, కేశిహుడు - అనునవి క్రమముగా కృతాన్తకృత్, కృతిః, కృశః, క్షేత్రజ్ఞః, క్షేమకృత్, కేశవః, కేశిహా అను నామముల తత్సమ రూపములు. కృతాంతకృత్తు అన బాధలను పోగొట్టు ప్రభువు, కృతి అన పనులు చేయించు ఘనుడు, కృశుడు అన కనవడనంతటి సూక్ష్మమైనవాడు, కృష్ణుడు అన సన్మార్గ మును చూపించువాడు, తప్పులను ఒప్పులుగా చేయగలవాడు, క్షేత్రజ్ఞుడు అన కోరి

38. వెన్నుని వెయిపేర్ల వినకరి - వివరము, పు. 22

నట్లు ఉంచువాడు, క్షేమకృత్తు అన క్షేమమును ఇచ్చువాడు, కేశవుడు అన అంద గాడు, అన్నిపైపుల ప్రకాశించువాడు, కేశిహుడు అన కీడును తొలగించువాడు.

2. 'జీవః, జీవనః, జ్యేష్ఠః' అను నాల్గు నామముల వివరణాత్మకాను వాదము -

జీవుఁడు బొందియందు సురు చెల్వుగ నిల్పెడు వేల్పు - జీవనుం
డే వలనైన నఁ జూపి తగ నెల్లర హాయిగఁ బెంచు మంచి రా
జౌ - వడితోడ జేతకలియంబడి చెడ్డలఁ జిక్కఁడంచు బం-
టేవలనేని జ్యేష్ఠుఁడు మఱెంతయు నందఱికంటెఁ బెద్దయా

జీవుడు, జీవనుడు, జేత, జ్యేష్ఠుడు - అనునవి క్రమముగా జీవః, జీవనః, జేతా, జ్యేష్ఠః అనువానికి తత్సమ రూపములు.

జీవుడు అన బొందిలో ప్రాణము నిల్పువాడు, జీవనుడు అన హాయిగా పెంచువాడు, జేత అన చెడ్డను పోగొట్టువాడు, జ్యేష్ఠుడుఅన అందరికంటె పెద్దవాడు.

దాసుగారు ఈ గ్రంథము నందు ప్రసిద్ధములైన ఛందోభేదముల సంజ్ఞలకు కూడ తెనుగుపేరులు పెట్టినారు ఈ విధమైన అనువాదము దాసుగారి నాటుతెనుగు చాదస్తమునకు గీటురాయి రసాస్వాదన తత్పరునకు పంటిరాయి అని అనకతప్పదు. దాసుగారి ఈ విధమైన అనువాదమును చూచియే పాఠకుల నాడిని సరికట్టుటలో ప్రవీణులైన శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు 'తొండ ముదిరితే వూసరవిల్లి అవు తుందన్నట్లు యిటీవల యీయన కవిత్వం పేర్ల దగ్గరనుంచిన్ని (వెన్నున్ని వెయి పేళ్ళ వినికిడి అని కాబోలును వాకపుస్తకం పేరు) అచ్చతెలుగులోకి మారి కొంత రసాన్ని కోలుపోతూ వుంది. కాని హరికథారచనాకాలంనాటికి యీచేదస్తం యీ యనకు పుట్టలేదు. అది అదృష్ట మనుకోవాలి. లేకపోతే యీయన రచనలు యీయనతోటే అంతరించిపోయేవి. సంశయం లేదు [39] అని అన్నది.

దాసుగారు ఈ యనువాదమునుగూర్చి చేయు వాదమిది -

ప్రాఁజదువుల నారితేరిన జగము నొజ్జ (వేదపండితుడైన శంకరాచార్యులు) వెన్నుని వెయిపేర్లను బ్రాఁజదువుల నేర్చుకొనఁదగిన తెలివిగల వారికొరకే పేల్పు

39. కథలు-గాథలు - ద్వితీయభాగము - అనునయం అను వ్యాసము, పు. 665

బాస యందు (సంస్కృతభాష యందు) వివరించెను. జగమునొజ్జ వంటి తెలివి తేటలు గలవారికేకాని తొలుఁబల్కును (వేదమును) వేల్పుబాసయును సరిగాఁ దెలియఁబడనేరవు. కాఁబట్టి పిన్ననాటనుండియు నలవాటుపడిన తెలుఁగు మొదలగు నాటుమాటలతోఁ దెల్పినంగాని సగటునఁ గొంతవరకైన వెన్నుని వెయిపేర్లు తెలిసికొననలవికాదనియును, వేల్పుబాసను వేల్పుబాసచేతనే వేల్పుబాసరానివారి కెరింగించుట కొరగాని పని యనియును నా నేర్చిన కొలంది నచ్చతేఁట తెనుఁగున నిట్లు వెన్నుని వెయిపేర్ల వినకరి చేసినాఁడను'. [40]

మొక్కుబడి :

మొక్కుబడి అను ఈ అనువాదగ్రంథమునకు 'ఋక్సంగ్రహః' అను సంస్కృతనామము కూడ నున్నది. 'పెద్ద లేర్చికూర్చిన మూఁడువందలనాల్గు ప్రాఁబల్కు పద్దెములను దర్వులుగా మార్చి యచ్చతెలుఁగు పద్దెములచేత వివరించినాఁడను' [41] అని దాసుగారు పీఠికలో ఈ గ్రంథానువాద ప్రణాళికను గూర్చి చెప్పిన మాట. అనగా ఈ గ్రంథరచనలో నున్నవి రెండు ప్రణాళికలు. పెద్దలు కూర్చిన ఋక్కులలో మూడువందల నాలుగు గ్రహించి, ఆ ఋక్కులను స్వర పరచి దర్వులుగా మార్చుట అన్నది ఒకటి. ఆ సంస్కృతఋక్కులను అచ్చతెనుగు పద్యములలో అనువదించి వివరించుట అన్నది మరియొకటి.

దర్వు అనగా దాసుగారి మాటలలోని నిది -

'దరువు కొలతవడి యనఁబడును. 1-2-4-8-16 రూపులుగ నైదుతీరుల రెట్టింపఁబడిన యొక కుఱుచయక్కరము పల్కునంతసేపు వడియనఁబడును. ఈ యైదురూపుల వడులలో నే వడితోనైన మూఁడువంతులకుఁ దగ్గ కిరువదితొమ్మిది వంతులకు హెచ్చుకొకసారిగాని రెండుసార్లుగాని, మూఁడుసార్లుగాని, నాల్గుసార్లుగాని చప్పుడుచేయు వంతులన్వినపడని తక్కిన వంతులతో నాటపాటలు నడుపవని దరువనంబడును.' [42]

---

40. వెన్నుని వెయిపేర్ల వినకరి - వివరణము, పు. 23
41. మొక్కుబడి టూకీ వివరము, పు. 1
42. పైది పు. 3

'వేరు వేరురూపులు గల దర్వులన్నియుం బదికిమించి లేవు. ఈ మొక్కబడి ప్రాఁబల్కు పద్దెములు 1-2-3-4-5 వడులలో నెద్దానితోనైన నీ పది దర్వులలో నేదోదర్వుతో నేర్పర్చఁబడి యాయా పద్దెముల కాయా వసుల యంకెలతో నాయావంతుల మొత్తము నైలుపు నంకెలతో నాయాదర్వులు పేర్కొనంబడెను'[43] అను మాటలవలన దర్వులన్నియు పదిరకములనియు, ఈ అనువాదములో గూడ ఈ పదిదర్వులలోనే చేయబడెనని తెలియుచున్నది.

దాసుగారు ఈ గ్రంథమున పదునొకండ్రు వేల్పులను మూడువందల నాలుగు దర్వులలో స్తుతించిరి.

| | |
|---|---|
| చల్వవేల్పు (వరుణః) | - 41 |
| వేల్పుతేఁడు (ఇంద్రః) | - 66 |
| వేకువ (ఉషః) | - 32 |
| కవలు (అశ్వినౌ) | - 48 |
| వేల్పుటొజ్జ (బృహస్పతిః) | - 21 |
| ప్రొద్దువేల్పు (సవితా) | - 19 |
| వేఁడివేల్పు (అగ్నిః) | - 23 |
| ఏటివేల్పు (నదీ) | - 19 |
| కవవేల్పులు (మిత్రావరుణౌ) | - 15 |
| ఎరుకువ (అదితి) | - 9 |
| రాయబారము (సరమా) | - 11 |

ఇట్లు పదునొకండ్రు దేవతలకు సంబంధించిన ఋక్కులను మాత్రమే గ్రహించుటకు దాసుగారు చేసిన వ్యాఖ్యానమిది -

'ఒడలంటులు - చూపురూపులు - చెవివిన్కులు - నాల్కచవులు - ముక్కగబ్బులు - ఉల్లము లనెడు పదకొండుదినుసులతోఁ గదలాడు మైతాల్పులను వరుణః (చల్వవేల్పు) - ఉషః (వేకువ) - ఇంద్రః (వేల్పుతేఁడు - అశ్వినౌ (కవలు) - బృహస్పతిః (వేల్పుటొజ్జ) - సవితా (ప్రొద్దువేల్పు) - అదితిః (ఎరుకువ) - సరమా (రాయబారము) ననెడు పదునొకండ్రు వేల్పు లేలుచున్నారీ

43 మొక్కుబడి టూకీ వివరము, పు. 4

వేల్పుల నందరిఁగొనియాడి లోఁబఱ్చుకొనువారికెల్ల దమ కోరికల చొప్పున బ్రతుకు హాయి సమకూరును.'[44]

వేదము ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము అను మూడు స్వరములతో ప్రసిద్ధము. ప్రచయము అను నాల్గవస్వరము కలదు కాని అది ప్రసిద్ధము కాలేదు. దాసుగారు ఈ గ్రంథమున వేదబుక్కలను స్వరపరిచిన విధానమిది 'బ్రాఁబల్లులం దలి 'ని' మెల్లగా, 'రి' బిగ్గరగా, 'స' ను 'నిరి' లకు నడుమగా రవలిన్పల్క వలెను. అనగా 'ని' అను స్వరమును అనుదాత్తమునకు, 'రి' అను స్వరమును ఉదాత్తమునకు, 'స' అను స్వరమును స్వరితమునకు సంజ్ఞలుగా నేర్పరచి స్వరపరిచినారు. అనగా ఈ గ్రంథమున 'స, సి, రి' అను మూడుగుర్తులే వచ్చును.'[45]

అనువాద పరిశీలనమునకు ఒకటిరెండు ఉదాహరణములు -

సా నీ స నీ స రీ స నీ స దీ ససససానిసా
యచ్చిద్ధితే విశోయథాప్రదేవవరుణవ్రతం
నినీస నీస రీస సా
మినీమసిద్య విద్య వి

ఇట్లు వేదబుక్కను స్వరపరచి, దీని వెంటనే అనువదించి వ్రాసిరి. ఆ అనువాద మిది -

నిన్నుఁ దిన్నఁగగొల్వ నేరని మమ్ము
మన్నించుమారేపు మాపునోవేల్ప! పు. 1

ఇట్లే మరియొక ఉదాహరణము -

సి స నీ సా రీ స ని సా రి ని సా సా రి నీ సరీ
ఉదతా సంకాలితరం బృహతః పర్వతాదధి
సరీ సా సా ని సా రిసా
అహాహన్నింద్ర శంబరం

44. మొక్కబడి - టూకీవివరము, పు. 4
45. మొక్కబడి టూకీ వివరము

అనువాద పద్యము -

మొట్టపైఁ దెగనీల్గు నేటెరకక్కసుని
మట్టిమల్లాడిన మగవేల్పుతోడ  పు॥లు 33, 34

ఇట్లు మూడువందల నాలుగు బుక్కలకు స్వరము కలదు. అనువాదములు కలవు.

దాసుగారు ఈ గ్రంథమున మంజరి, కందము, ద్విపదలను పేర్లుమార్చి వాడిరి. మంజరికి బడి అనియు, కందమునకు తంద్రియనియు, ద్విపదకు సైదోడు అనియు వీరి క్రొత్తపేరులు. ఈ క్రొత్తపేరులు ఈ గ్రంథమునకు ముందు వ్రాసిన 'వెన్నుని వెయిపేర్ల వినకరి' గ్రంథములోనే ప్రారంభించినారు.

దాసుగారు ఈ గ్రంథ రచనను గూర్చి చెప్పిన అభిప్రాయమిది -

'ప్రాఁబల్కులను వాని పల్కుబడి వివరించు పడికట్లన్నియు నటుండఁగా నా యీ యచ్చతెలుఁగు మొక్కుబడిమొక్క యల్లిక నా తలంపుల చవి మరిగిన చదువరుల నదనియింపఁగలదని నానమ్మకము.' 46

ఈ గ్రంథము దాసుగారి వేద వైదుష్యమునకు, శారీర శాస్త్రశక్తికి అక్షర రూపము.

తల్లి విన్కి :

తల్లివిన్కి అన తల్లిని గూర్చి వినుట. ఇది లలితాసహస్రనామములకు అనువాదము.

ఉపాసన విద్యలలో ఉత్తమోత్తమమైన విద్య లలితావిద్య. ఈ లలితాపరదేవతో పాసనమును (శ్రీవిద్య యనియు) అందలి ప్రధానప్రతీకమునకు 'శ్రీచక్రము' అనియు అనుట సంప్రదాయము. ఈ శ్రీవిద్యోపాసనమునకు ప్రధానప్రమాణ

---

46 మొక్కుబడి టూకీవివరము, పు. 6

గ్రంథము 'గుణనికా' రూపమునగాల లలితాసహస్రనామ గ్రంథము. ఈ లలితా సహస్రనామములు నూటఎనుబదిరెండు శ్లోకములుగా బ్రహ్మాండపురాణాంతర్గతములు.

ఈ సహస్రనామ ప్రాశస్త్యమును బ్రహ్మశ్రీ ఓరుగంటి నీలకంఠశాస్త్రిగారు వివరించిన విధానము-

'శివ-విష్ణు (రామ-కృష్ణ-హయగ్రీవ) - గణపతి-అంబికా (లక్ష్మి, సరస్వతీ) సూర్యదేవతాసహస్రనామ రూపములతోఁ బెక్కులు గలవు. వీని యన్నింటిలోను ప్రకృతమగు 'లలితారహస్యనామ స్తోత్రము' ఉత్తమోత్తమమైన దని చెప్పవలయును. ఈ ప్రశస్తి 'వ్రతానా ముత్తమం వ్రతం' అను స్తుతి వంటిది మాత్రము గాదు. ఏల యనఁగా మిగిలిన సహస్రనామములలోని పదములన్నియు తత్తద్దేవతా నామ పర్యాయములు, దేవతాసామాన్యరూపబోధకములు, దేవతావిజయసూచకములు, భక్తానుగ్రహ ప్రతిపాదకములే యగుచున్నవి, కాని యీ లలితారహస్యనామము లట్లుగాక 'శ్రీమాతా' యను తొలినామము మొదలు 'శ్రీశివా శివశక్త్యైక్యరూపిణీ లలితాంబికా' యను తుదినామము వఱకును గంభీర బహుగహనార్థభావములతో వెలయుచు వ్యర్థమగు పదముగాని వర్ణముగాని యెందును గానఁబడక సూత్రశైలితోఁ బ్రకాశించుచున్నవి. ఒక్కొక్కనామము ఒక్కొక్క మహాభాష్యమున కర్హమై యొప్పును. ఈ నామగాంభీర్యమును బరిశీలించినచో వాస్తవముగా వాగ్దేవతలు జగదధిష్ఠాత్రి యగు పరదేవతనెట్లు స్తుతింపవలయునో యట్లే స్తుతించినవని విద్వాంసులకుఁ దోఁచును. ప్రతిపదము గూడ సామాన్య జనావబోధ్యమగు వాచ్యార్థమునేగాక, లక్ష్య వ్యంగ్యార్థములను బహుభంగుల బోధించుచుండును. యథార్థమును దెలియఁ జెప్పవలయునన్నచో వేదిచతుష్టయము నందును దెలియఁజెప్పఁబడిన విషయజాతము నంతను సంగ్రహరూపమున సార్థమగు నూటయెనుబదిరెండు శ్లోకములతో వాగ్దేవతలు గానము చేసినవి. అట్టి యద్భుతమగు దర్శనము వాగ్దేవతలకే చెల్లినది. అది సామాన్యులకు ఎంతమాత్రము అలవికాదు. కావుననే ఈ నామసాహస్రపాఠమును గావించినవాఁడు అజన్మమునే తన తుదిజన్మముగాఁ జేసికొనఁజాలునని' అని పూర్వము చెప్పఁబడినది.'[47]

దాసుగారు ఈ నామములను కూర్చినవాడు సామాన్యుడుకాడని, మహావిజ్ఞాని యని చెప్పినారు.

47. తల్లివిన్కి - తొలిపలుకు, పు-6

'ఈతల్లి వెయిపేర్లలోఁ దక్కిన పేల్పు పలురకముల వెయిపేర్ల యందు వచ్చిన పేరు తిరిగిరాకుంటయు, నడుకు పొల్లుమాటలు లేకుంట వలన, పేల్పు నుడుల నీతల్లి వెయిపేర్ల కూర్చిన మాటలల్లువాఁ డెంతయు న్పొగడఁదగు బీద (విజ్ఞాని).'[48]

దాసుగారు వారి అనువాదమున మొదట సంస్కృతనామము లిచ్చి, తరువాత నామార్థమును, నామవివరణమును వ్రాసిరి. ఈ వివరణము ఒక భాష్యమువంటిది.

మచ్చునకు కొన్ని ఉదాహరణములు -

శివా : ముక్కంటి తానెయా ముద్దులగుమ్మ
పెంద్రోవ నిలువగు వెలిదొరరాణి
ఎల్లపుడున్మంచియే సల్పు వేల్పు
వంచపాల్మగవాఁడు పగడవంతు చెవి
వగడమేనెల తాల్పు వలిగట్టు పట్టి - నామము, 53

భవానీ : ముక్కంటి కంతు బాములఁగాచు పడచు
పునుక తాలుపునంటు ముద్దులగుమ్మ
లావున నింగినేలల నేలుతల్లి
ఎల్లెడలన్మంచియేసల్పువేల్పు
వరపుల వందేండ్లు బ్రతికించు జేజె - 112

శర్వాణీ : మొగిలు విజేయయి యుమ్మ సల్పువేల్పు
నేలనిల్వగు వేత నెలతాల్పురాణి - 124

సర్వమంగళా : ఎల్లమేలుల నిలువే గట్టుపట్టి
అడియనికెపుడు లగ్గరించు వేల్పు - 201

48. తల్లివిన్కి - మట్టు అను దాసుగారి వచనపీఠిక, పు. 5

పార్వతీ : చలిమలి తొలుచూలు సామికీదల్లి
ఎల్లిడింగరులగట్టెక్కించు వేల్పు 247

పరా : అన్నిదిన్నుల వెలుపల నలరు తెలివి
బొడ్డులోన నాపయి డెందము, మెడయెడఁ
బలు తెఱంగుల వెల్వడుపల్కు నిల్వ
వరపులన్నాయిగాఁ బలికించు వేల్పు - 367

బాలా : తొమ్మిదేడుల యీడు తులకించు పడుచు
ఎల్లపన్నికకుఁ దానే తొలినిలుపు
డింగరు నాటలాడించెడు వేల్పు - 965

లలితాంబికా : అన్నిదిన్నులమించి యాటాడుపడుచు
లాలించి యడియరు లగ్గిడుతల్లి
కోర్కు లన్నిటికెల్ల గుబ్బలిపిల్ల
నింగినేల లివి తానే యగువేల్పు 1000

ఇటువంటి ఉత్తమగ్రంథమును ప్రతిసామాన్యుడు వివరించుటకు యోగ్యుడు కాడని, ఉండవలసిన యోగ్యతలను వివరించినాడు. ఆ మాటలివి -

'సిండారు నోరిమి నిబ్బరికంబు
మాటనిల్కడతన్వి మంచినడువడి
గుండెబిగువు కల్పుగోలుతనమ్ము
తాల్మి దొఱఁగబోని దక్కులు బ్రతుకు
అవిటులఁబిల్లల నరగడంబులను
నొప్పించకెప్పుడు న్రొబ్బచెడినేర్పు
జంజాటు మెడలి పీచమెడసి మిగుల
నడఁకువతోడుత నందరిపట్ల
నడుచుచుఁద్రాగక నంజుడు తినక

చదువుగోటునఁ దెగసాఁగక పనికి
మాలిన కోర్కులంబడయక లేని
పోని తలంపులఁ బొరయక తనకుఁ
గలదాని తోడుతన్గడుఁదన్విఁబొంది
పాటించి మైవంచి పాటున కోర్చి
కూడుగుడ్డలు కూర్చుకొని తోటిపాటి
వారలతోఁగూడి వంతు పంచుకొని
క్రుంగుపొంగులు మానుకొని రేపుమాపు
లిమ్ముల గుడుచువాఁడే తల్లివిన్కి
గిడియతోఁ జాటఁదగిన మొనకాడు[49]

దాసుగారు అనువాదమున ఎక్కువగా చెండును (మంజరీద్విపదను) గ్రహించి నను, అక్కడక్కడ పీసము, కందము, గీతమును గూడ గ్రహించినారు.

అనువాదమును ఇట్లు నాటుతెనుగులో చేయుటకు వారు చెప్పిన కారణమిది–

ఎల్లనుడులకుఁ దెల్గే మేటిమాట
యని చాటిచెప్పెద నందతే కిటుల[50]

ఈ నాటుతెనుగు అనువాదము ఎవరికి అర్థమగును? అని ప్రశ్నించువారలకు దాసుగారి సమాధాన మిది–

'చదువు వ్రాయఁగల్గినమేటిచదువరి కొరకేగాని, సంతకము చేయఁజాలని ములచలకుఁ గాదుగా. నాటుతెలుగు పలుకు చవి తెలిసినవారికే యీ నా తల్లివిన్కి చవి గొల్పుగాక. నా యిలువేల్పు తెలుఁగు చదువర్లహాయిగాఁ బెక్కేండ్లెల్ల వసతు లొసగి కాపాడుగాక.'[51]

---

49. తల్లివిన్కి – కుదురు. పు. 5
50. పైది పు. 1
51. తల్లివిన్కి మట్టు పు. 5

పార్వతీ : చలిమలి తొలుచూలు సామికిఁదల్లి
ఎల్లిడింగరులగట్టెక్కించు వేల్పు 247

పరా : అన్నిదిన్నుల వెలుపల నలరు తెలివి
బొడ్డులోన నాపయి డెందము, మెడయెడఁ
బలు తెఱంగుల వెల్వడుపల్కు నిల్వ
వరపులన్నాయిగాఁ బలికించు వేల్పు - 367

బాలా : తొమ్మిదేడుల యీడు తులకించు పడుచు
ఎల్లపన్నికకుఁ దానే తొలినిలువు
డింగరు నాటలాడించెడు వేల్పు - 965

లలితాంబికా : అన్నిదిన్నులమించి యాటాడుపడుచు
లాలించి యడియకు లగ్గిడుతల్లి
కోర్కు లన్నిటికెల్ల గుబ్బలిపిల్ల
నింగినేల లివి తానే యగువేల్పు 1000

ఇటువంటి ఉత్తమగ్రంథమును ప్రతిసామాన్యుడు వివరించుటకు యోగ్యుడు కాడని, ఉండవలసిన యోగ్యతలను వివరించినారు. ఆ మాటలివి -

'సిండారు నోరిమి నిబ్బరికంబు
మాటనిల్కడతన్వి మంచినడువడి
గుండెబిగువు కల్పుగోలుతనమ్ము
తాల్మి దొఱఁగబోసి దక్కులు బ్రతుకు
అపిటులఁబిల్లల నరగడంబులను
నొప్పించకెప్పుడు న్రొచ్చెడినేర్పు
జంజాట మెడలి పీచమెడసి మిగుల
నడఁకువతోడుత నందరిపట్ల
నడుచుచుఁద్రాగక నంజుడు తినక

ఇక ఈ శాస్త్రగ్రంథములలో ఇపుడు లభించుచున్నవి ఇవి - మన్కి మిన్కి, సీమపల్కి వహి, జగజ్జ్యోతి, పురుషార్థసాధనమ్, దశవిధరాగనవతి కుసుమమంజరి. వీనిలో ఒక్క పురుషార్థసాధనముతప్ప తక్కిన నాలుగు ముద్రితములు.

మన్కి మిన్కి :

'మన్కి-మిన్కి' అచ్చతెనుగుభాషలో వ్రాసిన శాస్త్రగ్రంథము. మన్కి అన అయువు. మిన్కి అన వేదము. మన్కి-మిన్కి అనగా ఆయుర్వేదము.

విజయనగరము నందలి ఆదిభట్ట నారాయణదాస అముద్రితగ్రంథప్రచురణ సంఘ కార్యదర్శియైన శ్రీ వసంతరావు బ్రహ్మాజీరావుగారు ఈ 'మన్కి-మిన్కి' గ్రంథమును 1961 లో ప్రచురించుచు 'తొలిపలుకు' లో వ్రాసిన - 'శ్రీమదజ్జాడాదిభట్ట నారాయణదాసుగారు వేదములు, స్మృతులు, అష్టాదశపురాణములు పరిశీలించి, ఆయుర్వేదము గురించి వ్రాయబడిన విషయములు సేకరించి, అచ్చతెనుగులో 'మన్కి-మిన్కి' యనుపేరుతో రోగలక్షణముల గురించి, మందులు తయారుచేయుటకు నుపయోగించు ఓషదులు గురించి యొక పెద్దగ్రంథము రచించినారు. అందులో నొకభాగమైన 'కుదురు' ప్రచురించగలిగితిమి. 'కుదురు' అను ఈ గ్రంథములో అధర్వసంహిత, తైత్తరీయారణ్యకము, ఋగ్వేదము, ఐతరేయబ్రాహ్మణము, ఛాందోగ్యోపనిషత్తు, మొదలగు వానిలో నాయుర్వేదము గురించి చెప్పబడిన విషయములన్నియు వివరించబడినవి.' అను వాక్యములవలన దాసుగారు ఆయుర్వేద విషయములను ఒక పెద్దగ్రంథముగా వ్రాసిరనియు, ప్రస్తుతము ముద్రితమైన 'మన్కి-మిన్కి' ఆ పెద్దగ్రంథము నందలి యొకభాగముము మాత్రమే యనియు తెలియుచున్నది.

ముద్రితమై ప్రస్తుతము లభించుచున్న తొంబదినాలుగు పుటల ఈ గ్రంథమున తొమ్మిది విభాగము లున్నవి - 1. కుదురు, 2. సర్వవిద్యా సారేదశము: సంపుటః, 3. అధర్వసంహితనుండి, 4. తైత్తరీయారణ్యకము, 5. ఋగ్వేదీయ తైత్తరీయారణ్యకము, 6. ఐతరేయబ్రాహ్మణము, 7. ఛాందోగ్యోపనిషత్తు, 8. అధర్వసంహిత - మందులు, 9. యజుర్వేదము - మందులు.

మొదటివిభాగమైన 'కుదురు' పదమూడు పుటల విషయము. 'కుదురు' అనగా పీఠిక.

'తొల్బలుక్కులు (వేదములు), తలఁపులు (స్మృతులు), ప్రాఁత ముచ్చటలు (పురాణములు) మొదలగు పదునెనిమిది చదువుల (అష్టాదశ విద్యల) నెల్ల బాగుగా నరసి యందీ మన్కిమిన్కుగ్గురించి చెప్పఁబడిని పేల్వు నుడువులనే నాతెలిసిన క్రొలంది నేనీ నాటు తెలుఁగుమాటల న్వెల్లడించినాడను.' [1]

అను 'కుదురు' ప్రారంభవాక్యమువలన దాసుగారు వేదములలో, స్మృతులలో, అష్టాదశపురాణములలో సంస్కృతభాషలోనున్న ఆయుర్వేద విషయములను బాగుగా పరిశోధించి నాటుతెలుగులో వ్రాసినట్లు స్పష్టము.

ఈ పీఠికలోగల అనేకాయుర్వేదాంశములు గరుడపురాణములోనివి. తల్లి గర్భములో ప్రవేశించినది మొదలు పుడమి తల్లి గర్భములో కలయువరకు గల జీవుని జీవితమును చెప్పిన విధానము.

'తాఁజేసికొన్న పనియంటు [కర్మానుబంధము] చొప్పున మేనితాల్పు [శరీరధారి] పుట్టువు నొందును .... విత్తనము [శుక్లము] ఎక్కువైనచో మగవాఁడు, నెత్తురు [శోణితము] మిక్కిలి యయిన నాఁడుది, నెత్తురు విత్తనములు రెంటు సాఁబాళ్ళగునెడల అన్నగళ [షండుడు] పుట్టను. బిక్కనాటికా నెత్తురు విత్తనములు చూలాలికడుపులో ముద్దకట్టును. అయిదునాళ్ళకు బుడగ అగును. పదునాల్గవనాటికి గాలి, కిత్తి, తెమడలు [వాత పిత్త శ్లేష్మములు] కలిసి చియ్య [క్రొవ్వు] అగును. ఇరువదినాళ్ళకు గట్టినంజుడు [ఘనమగు మాంసము] అయి తల్లికడుపులోని మైతాలుపు వరుసగా ముదురుచుండును. ఇరువదైదునాళ్ళ కలవు [బలము], లావు [పుష్టి] తో నుండును. ఒక్కనెలకాఁగానే నింగి, గాలి, డిగ్గి, తడి, నేలల యోజను [పంచభూతత్వము] దాల్చును .... రెండునెలలకు అంట [త్వక్కు], నెత్తిక్రొవ్వు [మెదడు] పొడమును. ఎముకల యందలి నేయి [మజ్జ], ఎముకలు మూఁడునెలలకుఁ గలుగును. తలవెంట్రుకలు, వ్రేళ్లు నాల్గవనెలకుఁ బుట్టును. అయిదవనెలకు వీనులు, ముక్కు, బోర [గుండె] తొచును. గొంతు కన్నము, కడుపు ఆరవనెల కేర్పడును. ముడ్డి మొదలు ఏడవనెల కొదవును. మేను, మేని వంతులు [అవయవములు] ఎన్మిదినెలలకు

---

1. మన్కుమిన్కు – కుదురు, పు. 1

జూలు నిండారును. ఎన్మిదినెలల పిమ్మటఁ దల్లికడుపులో నుసురు [జీవుడు] మాటిమాటికిన్గదలాడు చుండును. తొమ్మిదవనెలకుఁ గందు [శిశువు] ముదిరి గట్టిపడును .... తలక్రిందుగా మొదట మూతి పిదప కాళ్లు వచ్చునట్లు కడుపునుండి గాలి కందున్లాగుచుండును. మోఁకాళ్ళవైపుల న్గేలవ నుంచుకొని కడుపులోఁ బాప పెరుఁగుచుండును. రెండు బొటమనవ్రేళ్ల రెండు ముడుకులమీఁద న్ముడుముల క్రిందన్దక్కిన కైగవ్రేళ్ళనడుమ న్గన్గవన్మక్కు నుంచుకొని యీ తీరుగా నాడు దాని కడుపులో నిరవుకొని మైతాల్పు వరుసగా నెదుగుచుండును. ఎముకలవలన గట్టిపడును. తిండి తాగుడులచేత బ్రతుకుచుండును. తల్లిబొడ్డు చేరిక మాఱాకు నరము [అప్యాయిని] చేతన్జుట్టఁబడియుండు తల్లిప్రేగు కన్నమందిరికికొని మెల్లమెల్లఁగాఁ గ్రిందికి జాఱిపడును. తల్లి తిని త్రాగిన కూడు నీళ్ళన్బట్టి యాపె కడుపులో మేను పెంచుకొనుచు అన్నివైపులన్నలఁగుడు పడుచుఁ బెరుగుచుండును. తానిదివరకుఁ గొన్న పెక్కు పుట్టువలన్గన్న మేల్కస్తుల [మంచిచెడ్డలు] న్గూర్చి తలపోసికొనుచు బ్రతుకుపై రోఁతపడుచుండును. కడుపునుండి వెలువడినతోడనే నా మునుపటి పుట్టువులందువలె తప్పుపనులఁజేయక తిరిగి పుట్టిచావని తెన్నున నడిపించి మంచిపనులే కావింపఁదలకొనెదను. ఈ తీరునఁ దల్లికడుపులోనున్న మైతాల్పు తొల్లింటిలెక్కకు మిక్కిలియైన పుట్టువులందెల్ల తెరఁగులఁ దాఁటబడిన పాట్లు తలంచుకొనుచుఁ దరి [కాలము] గడచుచున్న కొలఁది న్మూతి క్రిందుగాఁ దిరుగఁబడి తొమ్మిదిగాని పదిగాని నెలలు నిండినపిమ్మట న్పురిటిగాలిచేఁ బిసుకఁబడుచుఁ పైకి ద్రోయబడుచు నొగులుచే వనరుచు, పుట్టినతోడనే సైపరాని సొమ్మగాని నేలన్బడిన వెంటనే పైగాలితాకు నూపిరాడ దెలివిగాని హాయిగా నుండును. అంతట నా యుసురు తాల్పు న్వెరుమాళ్ళ గారడము [దైవమాయ] తను గ్రమ్మఁగా నద్దానికి లోనై తన తెలివిన్గోలుపోవును. ఎరుకఁదొరగి మూఁడేండ్ల లోపున జంటపాపయై యెన్మిదేండ్ల యీడువరకుఁ జిరుతయై, కోడెయై, ముసలియై, చచ్చుచు న్దిరిగి పుట్టుచుండును. [2]

ఇంకను ఈ 'కుదురు' అను విభాగమునందు మగవాని నుదుటిపై నుండు గీతలనుబట్టి ఆయుఃపరిమితి స్త్రీపురుషుల అంగములనుబట్టి లక్షణములు, వివిధ రత్నములను ధరించుట వలన కలుగు ఫలితములు, ఆరోగ్యసూత్రములు మొదలగు అనేకాయుర్వేదాంశము లున్నవి.

2. మన్ని మిన్ను కుదురు, పు॥ 2, 3, 5, 6.

'తన యొడలే యన్నిటికాసరా (భాజనము). మేనిఙ్గాపాడఁకొనుటకై మిక్కిలి తలకొనవలయును' – అని యొడలు నిలుపుకొనుట చాలముఖ్యమని చెప్పఁచునే ఒడలినుండి ప్రాణము వెడలులోపల మేలుచేయుట కలవాటుపడవలె నని వారు చేసిన హితోపదేశ మిది –

'గాలిఙ్గుట్టచుట్టవీలగును, మింటిన్మొక్కలచేయ వలనుపడును, అలలన్మడి పేయ వచ్చును, ఉసురును (ప్రాణమును) నిల్పుకొని పూనిక హోదా పనికిరాదు. తరిచేత నేలకాల్చఁబడుచున్నది. పేల్పులయిల్లు (మేరువు) కూల్చఁబడుచున్నది. కడలినీళ్లింకింపఁబడుచున్నవి, యొడలిమాట చెప్పనేలా? [4]

కుదురు (పీఠిక) తరువాత, దాసుగారు ప్రాచీనములైన వేదముల నుండి, స్మృతులనుండి, అష్టాదశపురాణములనుండి అనేకాయుర్వేదాంశములను సేకరించి వివరించినారు. మచ్చునకు కొన్ని –

"ఓ తెగులుగొట్టా! (ఓ రోగీ!) నీ గుండెజబ్బు, నీ పచ్చతెగులు (కామిలాది రోగకనిత శారీరహరిద్వర్ణము), ఈ రెండు తెవుళ్ళన్పగటిరేఁడు (సూర్యుఁడు) చురుకుటెండపోఁగొట్టున్గాక. ఆవు నెత్తురిని దీసి నీ యొడలి కెక్కించి నీమేని మంచి యెరుపు తళుక్కున్పుట్టించెదను. 'అను సూర్యముదయతాం .... పరిత్వా రోహితైః' (పు. 32)

'తెల్లపొడల యులుపున్బోగొట్టుటకై మాపులనుబట్టి పెరుగు గుంటగలిజేరు (భృంగరాజము), పసపు (హరిద్ర), పెద్దపాఁపర (ఇంద్రవారుణి), నల్లవావిలి చెట్టు, నల్లగోరంట, నీలిచెట్టు ఈ దినుసుల పసరావుపేడ పిడకలోఁ గలిపి నెత్తురుచిమ్మువరకా బొల్లిపొడలకుఁ బూసి ప్రామచున్న నెరిసిపోయిన తలవెంట్రుడు లకుఁ గూడఁబట్టించిన యెడల న తెవుళ్లు రెండున్మాసిపోవును (నక్తం జాతస్యోషధే) (పు. 32, 33).

ఈ గ్రంథము నందు రకరకములైన మంత్రములు కూడ కలవు. మచ్చునకు కొన్ని –

---

4. మన్కిమిన్కు – కుదురు, పు. 12

స్త్రీవశీకరణమంత్రము -

వస్యే మిత్రావరుణౌ హృదశ్చిత్తా న్యస్యతమ్
అథై నామక్రతుం కృత్వా మమైవ కృణుతంవశే పు. 43

ఓ మిత్రావరుణులారా! ఈ చెల్వయుల్లము నుండి తెలివినొ్వంగొట్టుడు. పిమ్మట మంచి చెడ్డల గ్గుర్తింపంజాలక నాకే లోకువ కానిండు.

పాముమంత్రము :

దిదర్హి మహ్యాం వరుణోదివః కవిర్వచోభిరుగ్రై ర్నిరిణామి తేవిషమ్
ఖాతమఖాత ముతస క్తమగ్ర భమి రేవధన్వన్ని జజానతే విషమ్
అలిగీచ విలిగీచ పితాచ మాతాచ
విద్మవః సర్వతో బంధ్వరసాః కింకరిష్యథ
ఉరుగూలాయదుహితా జాతాదాస్యసిక్న్యా
ప్రతం కం దద్రుషీణాం సర్వాసామర సంవిషమ్

ఈ మూండు మిడియలఁ (మంత్రముల) జెప్పుచుఁ బాము కరచినవాని జుట్టు ముడిపేసిన యెడల నెక్కడనున్న చిలుము (విషము) అక్కడనే నిలిచిపోవును. తేనెటీంగల నిప్పచెట్టు మొదటనున్న పాఠి (మన్ను) కలిపి నూరి నీళ్ళలోంగలిపి త్రాగింపవలయు నన్నిరకముల చిలుములు (విషములు) పోవును (పు. 48).

అసాధ్యవ్యాధులకు మంత్రము -

ఏయమగనో్నషధీనాం వీరుధాం వీర్యావతీ
అజశృంగ్యరాటకీ తీక్ష్ణశృంగీ వ్యృషతు
యోగిరిష్వజాయథా వీరుధాం బలవ త్తమః
కుష్ఠే హితక్మనాశన తక్మానం నాశయన్నితః

అను మంతరము (మంత్రము) చేత మంచి చెంగలికోష్ఠు (కుష్ఠము) దంచి పొడిచేసి యావెన్నలోఁ గలిపిన ముద్దనాళ్ల మొదలుకొని నెత్తివరకు గ్గ్రిందినుండి

మీఁదికిఁ దెగులుగొంటు (రోగి) మేనిపై రాసినయెడల నఱుఁదెవులు (రాజయక్ష్మము), పులుపు (పెద్దరోగము), మొదలయిన గడ్డుతెవుళ్లు (అసాధ్యవ్యాధులు) చప్పున స్గదిరిపోవును (పు. 47).'

కత్తివలన కలిగిన గాయములు త్వరగామాను మంత్రము -

రాత్రీమాతా నభః పితార్యమాతేపితామహః
సిలాచీనామవా అసిసాదేవానామసి స్వసా

అను మిడియ (సూక్తము) చేత మంతరించి (మంత్రించి) లత్తుక (లక్క) కలిపి మరిగించిన యావుపాలు త్రాగించినయెడల కైదువ వలనఁ బడిన కాయములు దబ్బున మాసిపోవును' [పు. 47].

ఈ గ్రంథము నందు రకరకములైన తాయెతులు వివరింపబడినవి. మచ్చున కొకటి -

భూతభవిష్యద్వర్తమానములను తెలిసికొను తాయెతు -

అపశ్యతి ప్రతిపశ్యతి పరాపశ్యతి పశ్యతి
దివమన్తరి క్షమాద్ భూమిం సర్వం తద్ దేవిపశ్యతి

ఓ యేలికా! తెల్లజిల్లేడు పేరు గల తాయెతా! నిన్దాల్చినవాఁడు నింగినేల లందు జరిగినవి, జరుగుచున్నవి, జరఁగఁబోవున వెవ్వియైన వనులెల్లఁ దెలిసికొని యన్నియు నెరుఁగఁజాలినవాడై యే వెరపున్బొందఁబోవడు. (పు. 46)

వాజీకరణ ప్రక్రియకు సంబంధించిన యొక చిట్కా -

యాంత్వాం గన్ధర్వో అఖసదేవరుణాయమృతభ్రజే
తాం త్వావయం ఖనామస్యోషధిం శేఫహర్షణీమ్

వెలఁగచెట్టు పేరు త్రవ్వితీసి నూరి పాలలోఁ గలిపి మరిగించి, యా చిక్కని పాలు త్రాగిన ప్రేలఁబడిపోయిన మగగురి [శిశ్నము] బిగిసిగిలి మిక్కిలి పైకి నిక్కును. [పు. 43]

ఇట్లు ఈ గ్రంథము నందు మానవునకు మిక్కిలి యుపయోగకరమునైన అనేకాయుర్వేదరహస్యములు గలవు.

ఇది చాల విలువైన పుస్తకము. ఈ గ్రంథము అస్తవ్యస్తముగా ముద్రింపబడినది. ఈ గ్రంథముద్రణమును గూర్చి శ్రీ మిన్నకంటి గురునాథశర్మగారు అన్న పల్కులివి -

'ఇది నాటుతెలుగు. పైగా మంత్రములు. ఇవి యెవరికి నర్థముకావు. కాన నచ్చువేయించుటలో నెంతయో జాగ్రత్తపడవలసి యున్నది. ఇందొక మంత్రమున కింకొకదాని తాత్పర్యము పడినది. పేరాల విభజనలో అ తార్మారు జరిగినది. అందువలన పుస్తకమంతయు తప్పుగా పడినది. దాసుగారు ముందు తాత్పర్యము వ్రాసినదానికి ప్రమాణముగా నామంత్రము నిచ్చిరి. అచ్చులో మంత్రము ముందుండి తాత్పర్యము దాని ననుకొనియున్నది. ఇది పెద్దతప్పు. మంత్రము లందును అచ్చుతప్పులు గలవు. పునర్ముద్రణమందు తప్పక వీనిని సవరించుకోవలె మరియు కొన్నితావుల మంత్రము వ్రాసి దాని తాత్పర్యమును వ్రాసిరి. అట్టివియు గలవు. కుదురు అనునది పీఠిక. ఇది ప్రధానగ్రంథముగా నచ్చుపడినది. అదియు సవరించుకోవలె. [5]

ఈ గ్రంథము దాసుగారి వైదికపాండిత్యమునకు, అయుర్వేద విజ్ఞానమునకు ఉదాహరణము.

సీమపలుకువహి :

సీమపలుకువహి యను గ్రంథము నాటుతెలుగు పలుకుల నిఘంటువు. సీమ పలుకు అన నాటుతెనుగు. వహి యన గ్రంథము. ఇది శబ్దశాస్త్రగ్రంథము.

ప్రస్తుతము ముద్రింపబడిన నూటముప్పదిరెండు పుటల గ్రంథము నందు 'అ' నుండి 'కందు' వరకు మాత్రమే కలదు. నారాయణదాస అముద్రితగ్రంథ ప్రచురణసంఘ కార్యదర్శి అయిన శ్రీ వసంతరావు బ్రహ్మజీరావు గారి పీఠికలోని 'ప్రభుత్వమువారు చేసిన ధనసహాయముతో సీమపల్కువహి మొదటిభాగము ప్రచురించగల్గితిమి. ప్రభుత్వమువారి సహాయముతోను, ప్రజల అదరాభిమానముల తోను అచిరకాలములో పూర్తిచేయగలమని విశ్వసించుచున్నాము.'

---

5. శ్రీ ఆదిభట్ట నారాయణదాస సారస్వతనీరాజనము, పు. 516

అనుమాటలవలన దాసుగారు ఈ నిఘంటువును పూర్తిగా వ్రాసినట్లు అర్థమగుచున్నది. మిగిలినభాగము విజయనగరవాస్తవ్యులైన శ్రీ పేరి నరసింహశాస్త్రి గారియొద్ద కలదని తెలిసినది. ఈ నరసింహశాస్త్రిగారు ముద్రితమైన మొదటి భాగపు అచ్చుప్రతిని సిద్ధముచేయుటలో సహకరించినవారు.

ఈ గ్రంథమునకు దాసుగారు 'కుదురు' అనుపేరుతో గొప్ప పీఠికను వ్రాసిరి. ఈ పదునైదుపుటల పీఠిక దాసుగారి భాషా పరిశ్రమను భద్రపరచిన పేటిక.

ఈ పీఠిక యందు సంస్కృతపదములవలె నుండు నాటుతెనుగు పదములను, సంస్కృతమునందు నాటుతెనుగునందు ఏమాత్రము భేదములేక కన్పడు పదములను, పారసీమలక నుడులని భ్రమపడిన నాటుతెనుగు పదములను, తద్భవములని పొరపాటుపడిన నాటుతెనుగుపదములను, నాటుతెనుగని కాదని చెప్పిన పదములను పట్టికలుగా కొన్నివందల యుదాహరణములను అకారాదిక్రమమున వ్రాసిరి. ఈ పట్టికలను చదివి జీర్ణముచేసికొన్నచో నెవడైనను పండితుడు కాగలడు.

పేల్పునుడి [సంస్కృతము] వలె కన్పడు నాటుపదములు కొన్ని-

అంకము - అంగము - అరి - కంకణము - కంటకము - కలాపము - కాయము - కుసుమము - కోదండము - గగనము - గాత్రము - గురువు- చంచు తన్వి - తరుణము - తోయము - నామము - నికటము - వసతి - వారము - సంప్రతించు - సీమ, మొ॥

ఇవి దాసుగారు ఇచ్చిన మూడువందలతొంబదియైదు పదములపట్టికలో కొన్ని మాత్రమే. ఈ పదములకు నాటుతెనుగుభాషలో కూడ అర్థములున్నవా? అని పించును. వీనన్నింటికి దాసుగారు వారి నిఘంటువులో అర్థముల నిచ్చిరి.

'పారసీమలకనుడులు [పారసీకము, ఉరుదూపదములు] తెలియక గుద్దెద్దు చేనునఁబడినట్లుల దాముకూడ నుడువుల యానెరింగినవారివలె తాము పన్నిన తెలుగుపలుకుల పట్టీలో గొన్ని నాటునుడులని పేల్పు నుడిమార్పులని వ్రాసినవి అని చెప్పుచు వారిచ్చిన పెద్ద పట్టికలోని పదములు కొన్ని -

అంగి - అంగూరు - అంబారి - అత్తరు - అసలు - కయిజారు - కవులు కిటికీ - కురిచీ - జముకాణము - జరీ - జలతారు - జీరాయితి - దస్త్రము - తరాజు తరాసు - దీనారము - నమాజు - పంచాయతి - పాదుసా - మతాబు - మసీదు - సస్తరు - మస్తు - మొలాము - రుమాలు - రూపాయ - సెబాసు - స్వారి - హజారము, మొ॥

ఈ పదములన్నియు అన్యదేశ్యము లనిపించును. వీనన్నింటికి నాటుతెనుగులో అర్థములు చెప్పిరి.

'పేల్వునుడుల నుండి పుట్టినవవి తబ్బిబ్బుగా మార్చఁబడిన యాదిఁసవ వెల్లడించిన నొడువులన్నియు నోజగా నాటుతెలుగులే' అని చెప్పుచు వారిచ్చిన వందల పదముల పట్టికలోనివి కొన్ని -

అంకె - అందియ - కంబము - కత్తెర - కబ్బము - చాగము - పగ్గియ మండపము - మందసము - రాకాసి - రాణి - రాతిరి - విద్దియ - విద్దె - వీజె - వేసవి - సిరి - హత్తి - హితవు, మొ॥

ఇట్లే 'నాటుతెలుగని' కొందరు కాదని కొంతమంది పేరుపేరుగా బేర్కొన్న తెలుగుపల్కులు, పేల్వునుడి జోలి యిసుమంతయు న్లేకున్నప్పటి కెద్దియో పగడ వ్రాయివోల్కి యున్నన్జాలు నాటుతెలుగు మొదలగు లాఁతిపల్కులెల్ల పేల్వునుడి నుండి పుట్టినవనియే తాముగూడ జదువరులనిపించుకొనుటకై గ్రుడ్డిగా నొండొరుల న్వెంబడించు బొప్పండ్ర దుడ్డు లాగుకొను వెరవునఁ దమ పన్నిన వహులన్జేర బడిన నుడులు' అని రెండు పెద్దపట్టికల నిచ్చిరి.

దాసుగారు ఈ సీమపలుకువహి గ్రంథపీఠికలో [కుదురులో] ఇట్లు ఐదు పెద్దపట్టికల నిచ్చిరి. ఈ పట్టికలలోని ఒక్కొక్కపదము దాసుగారి భాషాపరిశ్రమకు, పరిశోధనకు ఒక్కొక్క మచ్చుముక్క. ఈ గ్రంథపీఠికలో కన్పడుచున్న దాసుగారి పరిశ్రమను గూర్చి -

'ఈవిధముగా తెలుగుపలుకులను గాలించి గాలించి చూచిన పూర్వపండితులెవరున్నారు? దీని కెన్నిగ్రంథములు కావలయు? ఎంతసమయము కావలయు? ఎంత శ్రద్ధకావలయు? ఎంతపరిజ్ఞానము కావలయు?' అని ఉభయభాషాకోవిదులైన

శ్రీ మిన్నికంటి గురునాథశర్మ గారు పొందిన ఆశ్చర్యము - ఆ గ్రంథపీఠికను చూచిన ప్రతిపాఠకుడు పొందెడి ఆశ్చర్యమే. [6]

జగజ్జ్యోతి :

జగజ్జ్యోతి అను గ్రంథము దాసుగారి విజ్ఞానభాండాగారము. ఇది శతాధికాంశములపై దాసుగారు వ్రాసిన ఎనిమిది ప్రకాశముల వచనగ్రంథము. విజయనగరమందలి ఆదిభట్ల నారాయణదాస అముద్రిత గ్రంథప్రచురణసంఘము ఈ గ్రంథమును ప్రచురించుచు—

'వారికి (దాసుగారికి) వేదాంతములోఁగల అసమాన ప్రజ్ఞను వ్యక్తమొనర్చుటకు జగజ్జ్యోతి అనుపేరుతో నొక ప్రకరణగ్రంథము వ్రాయుటకు 1922 సంవత్సరమున ప్రారంభించిరి. అప్పటప్పట, ఒక్కొక్క ప్రకరణము వ్రాయుచు, ఎనిమిది ప్రకరణములు పూర్తిచేసిరి. మరియు నెన్నిప్రకరణములు వ్రాయదలచిరో యూహింపఁజాలము'[7]

అని అన్న కార్యదర్శి 'విజ్ఞాపన' లోని పలుకుల వలన ఈ బృహద్గ్రంథమును (879 పుటలు) దాసుగారు 1922లో ప్రారంభించి, అప్పుడప్పుడుగ వ్రాసిరనియు, గ్రంథమింకను వ్రాయదలచిరనియు తెలియుచున్నది.

అముద్రితగ్రంథసంఘము వారు ఈ గ్రంథమును రెండుసంపుటములుగా ప్రచురించిరి. 'ప్రథమసంపుటము' ను ఫిబ్రవరి 1959 లో, 'ద్వితీయసంపుటము'ను మే 1960 లో ప్రచురించిరి. ప్రథమసంపుటములో మొదటి నాలుగు ప్రకాశములు ద్వితీయ సంపుటములో మిగిలిన నాలుగు ప్రకాశము లున్నవి.

ఈ గ్రంథప్రారంభమున దాసుగారు వారి వంశచరిత్రను 'వంశావళి' యను శీర్షికలో నిరువది యెనిమిది పద్యములలో వివరించిరి.

---

6. ఆదిభట్ల నారాయణదాస సారస్వత నీరాజనము, పు. 505
7. జగజ్జ్యోతి – విజ్ఞాపన, పు॥ లు 2, 3.

మునులందెల్ల విధంబుల
మొనగాఁడు గడింపరాని మూఁకలతో వ
చ్చిన శ్రీరాము న్వెందున
దనుపు భరద్వాజఋషికి దండంబిడెదన్ - పు. 1

అని దాసుగారు వారి వంశ ర్షి యైన భరద్వాజమహర్షి స్తుతితో ఈ వంశావళిని ప్రారంభించినారు. ఈ వంశావళిలో వారి వంశమును గూర్చి వ్రాసిన యొక పద్యము -

అన్నదాతలని దిగంతవిఖ్యాతులై
  పరఁగి రజ్జాడాదిభట్లవారు
బ్రాహ్మణప్రభువులై బహుయజ్ఞశాలలం
  బన్ని రజ్జాడాదిభట్లవారు
కలవు వచ్చిన ఘన కుటుంబములఁ గా
  పాడి రజ్జాడాదిభట్లవారు
విజయరామగజేంద్రు విందారగింపిరి తమ
  పట్టు నజ్జాడాదిభట్లవారు
శ్రీగలిపి యింటిపేర్ ఖరారించి చేతి
వ్రాలు పచరించి లక్ష్మీసరస్వతులకుఁ
బొందుగావించి యేలిన ప్రోడ లెదిరి
పల్కనోపరజ్జాడాదిభట్లవారు - ప. 18

కావ్యము వ్రాయవలెనన్న వాల్మీకి కావలెను. శాస్త్రవిషయములు తెలుపవలె నన్న వ్యాసుడొక్కడే తగినవాడు - అని తెలిసికూడ విధివశమున సిగ్గువీడి తెలిసిన వానివలె నటించుచున్నానని వినయముతో నని, ఈ గ్రంథరచనకు కారణము నిట్లు చెప్పినారు-

తెలుఁగువారలకు న్దేటతెల్లముగను
దెనుఁగుతో నెల్లవిద్దెలఁ దెలుపనెంతు
అన్నివిధముల ననుగాచు నాంధ్రదేశ
మునకు నా యచ్చియున్న యప్పనముదీర్త - ప. 27

గీర్వాణభాషలో నున్న సకల విద్యలసారము తేటతెనుగుభాషలో తేటతెల్లముగ తెలిపి నన్ను కాచుచున్న నా తెలుగుసీమ ఋణమును తేర్చుకొందును - అన్నది దాసుగారి జగజ్జ్యోతిగ్రంథ రచనాసముద్దేశము.

ఈ 'వంశావళి' తరువాత ఇష్టదేవతా ప్రార్థనము వచనమున చేయుదురు. ఇట్టి వచనరూప ప్రార్థనము ఈ జగజ్జ్యోతిగ్రంథాదిని తప్ప మరియొకగ్రంథము మొదట కన్పడదు.

'భరద్వాజ! తపస్విరాజ! రవినిభతేజా! అవధరింపుము' అని గ్రంథమును ప్రారంభించుటనుబట్టి ఈ గ్రంథమును దాసుగారు భరద్వాజమహర్షికి అంకిత మిచ్చినట్లు అనిపించును. భరద్వాజునకు భారద్వాజుడు చేసినవిందు ఈ గ్రంథము.

ప్రథమసంపుటము మొదటి నాలుగుప్రకాశములతోనున్న నాలుగువందల యెనుబదియేడు పుటల గ్రంథము.

పౌరుషదైవవిచారము, కృతాది యుగలక్షణ నిరూపణము, కాలకర్మములు, జాగ్రాద్యవస్థల నిరూపణము, సృష్టిక్రమము, చార్వాకమతము, బృహస్పతి మతమునకు తప్పు వ్యాఖ్యానములు మొదలైన పన్నెండు అంశములతో గూడినది మొదటి ప్రకాశము.

దైవపౌరుషనిర్ణయము, వర్ణాశ్రమవ్యవస్థ - గోత్రావళి, తత్త్వనిర్ణయము, వేదార్థము, స్మృత్యర్థము, దర్శనపరామర్శ, జగన్నిర్ణయము, వైద్యజ్యోతిషావశ్యకత, మొదలైన పదియారు అంశములతో గూడినది రెండవ ప్రకాశము.

నికృష్టప్రత్యభిజ్ఞానము, సంస్కారసంగ్రహదశ, యజ్ఞకర్మము, మిశ్రవాద నిరాదరణ, శాబ్దికక్రియాతత్త్వము, విశ్వమాంగళ్యబోధ, మొదలైన పది యంశములతో గూడినది మూడవ ప్రకాశము.

కాలగతి, ఉపనిషద్గాథ, ఆరణ్యకములు, యుగస్వరూపము, యజ్ఞపశు విచారణ, వేదవిజ్ఞానము, వర్ణవ్యవస్థ, శిక్ష, లోకవ్యవహారము, నాదబ్రహ్మము, ఆప్తవాక్యప్రమాణస్థితి, వ్యక్తావ్యక్తజగత్సృష్టి, స్వరవల్లరి, రసపిపాస, నాద బిందుకళ, అక్షరమహత్త్వము, ధ్వనివిశేషము, భాషోత్పత్తి రహస్యము, వాగర్థ వైఖరి, గీర్వాణవాగ్గీల, ధ్వనివర్ణవిభేదము, నాదబ్రహ్మోపాసనము, జగద్ధితము మొదలైన నలువది రెండు అంశములతో గూడినది నాలుగవ ప్రకాశము.

ద్వితీయసంపుటము చివరి నాలుగు ప్రకాశములు గల మూడువందల తొంబది రెండు పుటల గ్రంథము.

శబ్దసిద్ధి, నక్షత్రశాస్త్ర పక్షఖండనము, నిరుక్తవాద నిరాదరణము, నైఘం టిక శ్రౌతవిదుల భ్రాంతివాదము, శ్రుత్యర్థవివరణ. మొదలైన పదిరెండు అంశము లతో గూడినది యైదవ ప్రకాశము.

పంచమశబ్దమర్యాద, నాట్యవేదవైఖరి, మార్గదేశిప్రళయము, వేదశాస్త్రాద్వైత ప్రసంగము, మొదలైన తొమ్మిది అంశములతో గూడినది ఆరవ ప్రకాశము.

శబ్దప్రపంచనిత్యోత్పత్తి, మిథ్యాప్రకృతిస్వరూపము, కర్మము - బ్రహ్మము వేదవైదికవిజ్ఞానము, పరాపశ్యన్తీ మధ్యమావైఖరులు, నాదబ్రహ్మము, మానవ ప్రవర్తన, మొదలైన పదియారు అంశములతో గూడినది ఏడవ ప్రకాశము.

నిత్యశుద్ధ బుద్ధముక్త బ్రహ్మస్వరూపము, సంగీత సాహిత్య సంబంధ గంధము, విద్యాప్రకాశిక, బుద్ధిస్వరూపము, వేదపౌరుషేయ ప్రమాణత్వము, మొదలైన ఏడు అంశములతో గూడినది ఎనిమిదవ ప్రకాశము.

ఇట్లు ఈ జగజ్జ్యోతి గ్రంథమున గల ఎనిమిది ప్రకాశములలో నూట యిరువదినాలుగు అంశములున్నవి.

ఈ గ్రంథమున గల అంశములా శతాధికము. నిర్వహించినతీరా పరమ ప్రామాణికము. పరిమితమైన ఆయువుగల ఒక మానవుడు తానెంత విద్యాతృష్ణ కలవాడైనను, ఇన్ని విషయములను సాధికారికముగా బోధింపకలుగుట సాధ్యమగు షరుహ. అని ఆశ్చర్యము కలిగించు గ్రంథము ఈ జగజ్జ్యోతి. ఈ జగజ్జ్యోతి

గ్రంథమునకు 'అష్టాదశవిద్యాప్రకాశిక' అను నామాంతరమున్నదట. ఇది నిజముగా అష్టాదశవిద్యాప్రకాశికయే, జగజ్జ్యోతియే.

పురుషార్థసాధనమ్ :

ఇది సంస్కృతభాషలో వచనమున వ్రాసిన చిన్నగ్రంథము[8] ఈ గ్రంథము లభించువరకు, ఈ పురుషార్థసాధనము చాతుర్వర్గ్య సాధనము ఒకే గ్రంథము కావచ్చునని అనుకొనుట జరిగినది. కాని పురుషార్థ సాధనము వేరు, చాతుర్వర్గ్య సాధనము వేరు. ఈ మాట అనుటకు చాల ముఖ్యమైన అధారమిది -

శ్రీ నారాయణదాసుగారు 1930 లో (శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, విజయ నగరము) ముద్రింపించి ప్రచురించిన శ్రీహరికథామృతమను సంస్కృత హరి కథ వెనుకతట్టు అట్టపై -

మయా విరచితాని కావ్యాని సంస్కృతభాషయా

| | |
|---|---|
| తారకమ్ | 0-5-0 |
| రామచంద్రశతకమ్ | 0-2-0 |
| కాశీశతకమ్ | 0-2-0 |
| చాతుర్వర్గ్యసాధనమ్ | 0-6-0 |
| శ్రీహరికథామృతమ్-హరికథా | 1-4-0 |

అని యున్నది. తారకము వెలకన్న చాతుర్వర్గ్యసాధనము వెల అణా ఎక్కువ. తారకము 298 శ్లోకముల గ్రంథము. చాతుర్వర్గ్యసాధనము తారక గ్రంథముకన్న పెద్దది కావలెను. లభించిన పురుషార్థసాధనము రామచంద్ర శతకము, కాశీశతకములకన్న కూడ చిన్నది. కనుక దీనివెల రెండు అణాలు

8. ఈ గ్రంథము ఇప్పటిదాక అలభ్యకృతి. దాసుగారి మునిమనుమడు శ్రీ ఉపాధ్యాయుల రామదాసు సంపాదించి యిచ్చుట వలన ఇప్పుడు లభ్య కృతి యైనది.

కూడ నుండుటకు వీలులేదు. కనుక పురుషార్థసాధనము వేరు. చాతుర్వర్గ్య సాధనము వేరు.

లభ్యమైన 'పురుషార్థసాధనమ్' ఎనిమిది అరటావుల ముప్పది యెనిమిది వచనముల వ్రాతప్రతి. మొదటి అరటావు భ్రష్టమగుటచే గ్రంథప్రారంభము నందలి మొదటి పన్రెండు వచనములు లభింపలేదు. పదుమూడవ వచనమునందలి 'భైషజ్యం కృషి వాణిజ్య వివిధశిల్ప కర్మాణ్యేవ జనసామాన్యేన వేదితవ్యాని' అను వాక్యము నుండి గ్రంథము లభించినది.

ఈ గ్రంథము పేరే పురుషార్థసాధనముకదా. ధర్మార్థకామమోక్షములు చతుర్విధ పురుషార్థములు. భారతీయుడైనవాడు మోక్షమును పొందుటకు ఏయే విధములైన కర్మలను ఆచరింపవలెనో తెలుపు గ్రంథ మిది. ఇది వేదాంత గ్రంథము కాదు. మనుస్మృతివంటి గ్రంథము. దీనిలో దాసుగారు చెప్పిన 'భారతీయుడు ఆచరింపవలసిన మార్గము' లన్నియు దాసుగారి సొంత అభిప్రాయములు.

అష్టాదశవర్ష వయస ఊర్ధ్వం పుమాన్వా స్త్రీవా స్వదేశరక్షణార్థం సంగ్రామ సంనద్ధాభవేయుః - స్త్రీసేనా సంగ్రామసీమ నాతిక్రమేత్ సర్వేషా మార్యాణామ నార్యాణాంచ సమానమేతద్విధీయతే [14]

(పదునెనిమిది వత్సరముల వయసుదాటిన పురుషుడు కాని, స్త్రీకాని స్వదేశ రక్షణమునకై యుద్ధమునకు సంసిద్ధులు కావలెను. స్త్రీసేన యుద్ధపు పొలిమేరను దాటగూడదు. ఆర్యులకు అనార్యులకు గూడ ఇది సమానముగా విధింపబడుచున్నది.)

భిక్షావృత్తి స్సుతరాం నిషేధ్యత - అలసా నపుంసకాః విద్యావిహీనశ్చ పండితబాహ్యాభవేయుః [17]

(భిక్షావృత్తిని పూర్తిగా నిషేధింపవలయును. బద్ధకస్థులు, నపుంసకులు, చదువులేనివారు పండితులుగా గణింపబడరాదు)

పండితబాహ్యాః సర్వసభ్యసేవయైవ జీవేయుః. రణరంగం గచ్ఛేయుర్నచ సభ్యా భవేయుః [18]

[పండితులుకానివారు సభ్యులను సేవించి జీవింపవలయును. యుద్ధ రంగమునకు వెళ్ళవలయును. ఎన్నడును సభ్యులు కాగూడదు]

భారతీయా నానామతావలంబిన ఆర్యా మ్లేచ్ఛాశ్చానోన్యన్య సారస్యే నస్వదేశం పరేభ్యో రక్షేయుః [19]

[భారతదేశము నందున్న నానామతస్థులగు అర్యులు, మ్లేచ్ఛులు [ఆర్యేతరులు] గూడ పరస్పర సుహృద్భావములతో తమ దేశమును ఇతరులనుండి కాపాడుకొనవలయును].

సర్వదాపి సకల విదేశవస్తూని బహిష్కర్తవ్యాని వినాఽహారపదార్థాన్ [23]

[ఆహారపదార్థములను తప్ప మిగిలిన విదేశవస్తువుల నన్నింటిని ఎల్లప్పుడు బహిష్కరింపవలయును]

భారతవర్ష నివాసినామేవ భారతవర్ష భూస్వామ్యం స్యాత్, విదేశజనాభారతవర్ష ఏకమాసాదధికకాలం ననివసేయుః [24]

[భరతవర్షమున నివసించువారలకు మాత్రమే భారతవర్ష భూస్వామ్య ముండవలెను. విదేశీయులు భరతవర్షము నందు ఒక నెలకంటె హెచ్చుకాలము నివసింపగూడదు]

ఆబాలగోపాల మఖిల మఖిల భారతీయా యథా సుఖం శీతలోదకేన వోష్ణ జలేన వా ప్రాతఃస్నానం కుర్యుః - వనమూలికావైద్యమేవ సర్వరోగనివారణార్థం ప్రశస్యేత - కోమలనింబ విటపేనైవ దంతధావనం కుర్యుః - ప్రత్యహ మార్ద్రికం భక్షయేయుః - శిరాంసి సుతరాం నముండయేయుః - నాపి దీర్ఘశ్మశ్రు నఖ కేశన్ ధారయేయుః - జఘనం కచ్ఛయావక్షః కంచుకేన శిర ఉష్ణీషేణ అచ్ఛాదయేయుః - సర్వేపి పుమాంసః విధవాం వినా నకా పి స్త్రీ గ్రామే ముఖావకుంఠనం ధారయేత్ - గోమయభస్మనా వాకేసర కర్పూరాగరు మిశ్రితమలయజేన వా శరీరం విలిప్తవ్యమ్ - కషాయ తిక్త రసా వితర రసేభ్యః అధికం సేవితవ్యా - గోపయోఘృతాద్యేవ సర్వ విషహారాణ్యాయుర్వృద్ధి కరాణి సేవితవ్యాని సర్వదా - మృణ్మయ భాండాశన మేవ ప్రశస్యతే - తులసీ మాలికాం వాక్షమాలికాం వా పద్మబీజమాలికాం వా రస గోలిక మాలం వా స్వర్ణమాలాం వా ధారయేయుః - తామ్రభాజనస్థ జలమేవ పిబేయుః - వివిధ మాదకద్రవ్యాణి వర్జనీయాని - ప్రతివర్ష మేకవారం సముద్రస్నానం తామ్రపర్ణీనదీ స్నానపానం చావశ్య కర్తవ్యం - నివృత్తరజస్కానార్యః పంచా

శద్వృష్షవయస్కాః పుమాంసఏవ తీర్థాటనం కుర్యుః - వివిధవీరాణాం వీరమాతౄణాం పుణ్యకథా ఏవ విరచయితవ్యాః శ్రోతవ్యాశ్చ - శ్రీరామచంద్రాది ధర్మావతార సంకీర్తనం తౌర్యత్రిక సహితం ముహుర్ముః కుర్యాత్ - న కామపిదేవతా ముద్దిశ్యజన్తూన్ హన్యాత్యథాపూర్వం వివిధమతవిహితోత్సవా సహింసావ్రత మనుల్లంఘ్యైవకుర్యుః - సర్వకావ్యేషు సంభోగశృంగార హాస్యభయానక బీభత్స రౌద్ర రస వర్ణనం విసర్జనీయమేవ [28]

(భారతీయు లందరు హాయిగా చల్లనినీటితోగాని వేడినీళ్ళతోగాని ప్రాతః స్నానము చేయవలయును. సర్వరోగ నివృత్తికొరకు మూలికావైద్యమునే కావించుట మంచిది. లేతవేపకొమ్మతోనే దంతధావనము చేయవలయును. ప్రతిదినము అల్లమును తినవలయును. శిరసులను పూర్తిగా గొరిగింపకూడదు. పొడుగైన గడ్డములను, మీసమును, గోళ్ళను ధరింపగూడదు. పిరుదులను వస్త్రముకొంగుతోను, రొమ్మును చొక్కాతోను, తలను తలపాగతోను కప్పుకొనవలయును. పురుషు లందరును, విధవకాని స్త్రీయు ఊరియందు ముసుగు ధరింపగూడదు. ఆవుపేడ బూడితోగాని, కేసరము అగరు, కర్పూరము మేళవించిన మంచిగంధముతోగాని శరీరమును అలదుకోవలయును. ఇతర రుచులకంటె చేదు ఒగరులనే హెచ్చు సేవింప వలయును. ఆవుపాలు నేయి మాత్రము సర్వవిషహరములు, ఆయుర్వృద్ధిదము లగుటచే ఎల్లప్పుడు సేవింపవలయును. మట్టికుండతో వండిన అన్నము మాత్రమే ప్రశస్తము. పాదరసగోళకమాలను గాని, బంగారుపూసల మాలను గాని ధరింపవలయును. రాగిచెంబులోని నీటినే త్రాగవలయును. నానావిధ మాదక ద్రవ్యములను విడువవలయును. ప్రతిసంవత్సర మొకపర్యాయము సముద్ర స్నానమును, తామ్రపర్ణీ జలస్నానములను తప్పక కావింపవలయును. ముట్టులుడిగిన స్త్రీలు, ఏబది వత్సరములు గల పురుషులు మాత్రము తీర్థాటనము చేయవలయును. బహువిధ వీరులయొక్కయు, బహువిధ వీరమాతల యొక్కయు పుణ్యకథలనే కవులు రచింప వలయును, జనులు వినవలయును. నృత్తగీతవాద్యములతో గూడిన శ్రీరామ చంద్రాది ధర్మావతారుల సంకీర్తనమును మాటిమాటికి కావించుచుంతవలయును. ఏదేవతకైన జంతుబలి కూడదు. అహింసావ్రతము నతిక్రమింపకుండగనే ఆయా మతములకు సంబంధించిన ఉత్సవముల నొనరింపవలయును అన్ని కావ్యములలోను సంభోగశృంగార, హాస్య భయానక బీభత్స రౌద్రరస వర్ణనమును [అతిగా] విడువ వలయును)

సూనృతా హింసావ్రత, యథాలాభసంతుష్టి, స్వదేశధర్మరక్షణాన్యేవ స్వర్గ సోపానాని - ఆధివ్యాధి విరహితం దేశసంరక్షణైకతత్పరం, సంగీత సాహిత్య రసావిష్టం సభ్యమాన్యం సహస్రమానపరిమితం నరాయుపమేవ స్వర్గః ప్రాప్నోతి (37)

(సత్యవచనము, అహింసావ్రతము, యథాలాభసంతోషము, స్వదేశ స్వధర్మ రక్షణములే స్వర్గసోపానములు. మానసికబాధ గాని, శారీరకబాధ గాని లేనట్టియు, దేశసంరక్షణమునందే తత్పరుడగునట్టియు, సంగీత సాహిత్య రసానుభూతి నంది నట్టియు సహస్రమాసపరిమిత పురుషాయుషము గల మాన్యుడగు సభ్యుని స్వర్గము పొందును. అట్టి పురుషుని స్థితియే స్వర్గమనుట)

పండితులుకానివారికి భూమికాని గృహముకాని యుండకూడదు(20), నానా విధములగు యంత్రముల ధాన్యముల మార్పిడితో వ్యాపారమును చేయుచుండ వల యును. నాణెముల అచ్చులను ఉపయోగింపకూడదు (22), స్త్రీపురుషాత్మకమగు భారతవర్ష వాస్తవ్యులందరిలోను పదికోటుల మిదునములు మాత్రము సభ్యపదవి నందదగినవారు (25), ముప్పదిమూడుకోటుల జనులు పంద్రెండు వత్సరముల వరకు ప్రతిదినము తిండిపెట్టదగిన సకలధాన్యములను సంపాదించి సభ్యులచే ఆధాన్యమును పర్వతగుహలయందు జాగ్రత్త చేయబడవలయును, కరవుకాలమున సముద్ర జలమును పానయోగ్యమగునట్లు ప్రయత్నింపవలయును (29), యావజ్జీవ కారాగారశిక్ష తప్ప మరణశిక్షను అతతాయిలకు గూడ విధింపగూడదు (30), నలువది వత్సరముల వయసు మొదలు అరువదినాలుగు వత్సరముల వయసు వరకు సేనాధి పతిత్వము, న్యాయాధికారిత్వము, వైద్యము చేయవలయును (31), విదేశీయు లను భరతవర్షమున నివసింపనీయగూడదు (33), స్త్రీపురుష లెవ్వరును చతుష్పా జ్జంతువులను ఎక్కగూడదు (36), స్త్రీసంఘము పురుషసంఘముకంటె వేరుగా నుండవలయును (35) - మొదలగునవి ఈ పురుషార్థసాధన గ్రంథములో కనపడు దాసుగారి భావములు.

ప్లేటో వ్రాసిన 'రిపబ్లికు' వలె నదికూడ నొక 'యుటోపియా'. ఇది యీ నవయుగ దృక్పథమునకు ఈనాటి పాశ్చాత్యదేశానుసృతసాంఘిక వ్యవస్థకును అత్యంత సన్నిహితముగ నుండుటయు, పైగా నిది దాసుగారి స్వతంత్ర భావనా ఫలితమగుటయు ఆశ్చర్యకర విశేషము. మాతృదేశక్షేమముకొరకు ఆయన చేసిన

ఆ భావనయంతయు తర్కసహముగను, యుక్తిసహముగను, ఉపరి ఆచరణ యోగ్యముగను సంక్షేమోదర్కముగను నున్నది. తారకమునందు కూడ దాసుగారు సంభావించినది ఏతాదృగాదర్శవ్యవస్థనే 'పురుషార్థసాధనమ్' దాసుగారి మనస్సులో గల ఆదర్శభారత వర్షము.

దశవిధరాగ నవతికుసుమమంజరి :

ఇది సంగీతశాస్త్రగ్రంథము. దశవిధ జాతులలో తొంబదిరాగములతో కూర్చిన మాలిక.

'ఇది సంగీతప్రపంచమున హనుమంతుని సముద్రలంఘమున వంటిది. ఒక అపూర్వకౌశల ప్రదర్శనము. 1938లో దాసుగారు కన్యాకుమారి యందు అమ్మ వారిని దర్శించుకొని ఆ పరమానుభూతితో పది వివిధజాతులలో తొమ్మిదేసి పంక్తు లకు తొమ్మిదేసి రాగముల చొప్పున అనగా మొత్తము 90 రాగములలో అమ్మవారి పరముగ అన్వర్థమగునట్లు రాగనామనిర్దేశము చేయుచు సర్వతాళాత్మక పంచజాత్యేక తాళముతో సస్వరముగ వివరించిన దేవీ స్తవము. ఆరోహణక్రమమున సాగిన ఆ తొంబదిపంక్తులు చక్కని సంస్కృత రచన. అనంతరము అవరోహణక్రమమున సస్వరముగ సాగిన తొంబది పంక్తులు మిశ్రభాషాత్మకములు[9] అనునది దశవిధ రాగనవతి కుసుమమంజరి యందలి సూత్రము, సర్వలక్షణసారసంగ్రహము.

ఈ సంగ్రహస్వరూపమునకు విగ్రహస్వరూపమిది -

ఈ సంగీతప్రబంధములో దశవిధజాతు లున్నవి. 1. సర్వసంపూర్ణ రాగ ములు, 2. సంపూర్ణషాడవరాగములు, 3. షాడవసంపూర్ణరాగములు, 4. సం పూర్ణఔడవరాగాములు, 5. ఔడవసంపూర్ణరాగములు, 6. శుద్ధషాడవరాగములు, 7. షాడవఔడవరాగములు, 8. ఔడవ-షాడవరాగములు, 9. శుద్ధఔడవరాగ ములు, 10. వక్రరాగములు. ఈ పదిజాతులలో మరల ఒక్కొక్కదానిలో తొమ్మిది స్వరసాహిత్య అవర్తము లున్నవి. అనగా ఈ పదిజాతులలో గల రాగ ముల మొత్తము ($10 \times 9 = 90$) తొంబది. ఇదియే దశవిధరాగనవతికుసుమ మంజరి అను నామము పెట్టుటకు గల కారణము.

---

9. యస్వీజోగారావుగారు – కచ్ఛపీశ్రుతులు – అనుబంధము, పు. 28

ఈ సంగీతకృతి యందలి ప్రతిపంక్తిలో, ఆ పంక్తిని పాడవలసిన రాగము పేరు వచ్చునట్లు సాహిత్యమును దాసుగారు కూర్చినారు. ఈ కృతిలో నున్నవి తొంబది పంక్తులు. తొంబదిపంక్తులు తొంబదిరాగములలో పాడవలెను. ఆ తొంబది పంక్తులలో పాడవలసిన ఆ తొంబదిరాగముల నామములను చమత్కారముగా చొప్పించి ముద్రాలంకారపద్ధతిలో రాగనామ నిర్దేశము చేసినారు.

ఉదాహరణమునకు మొదటిజాతిలోని తొమ్మిది రాగములు -

1. శ్రీధరశంకరాభరణే
2. పాహిమాంమ్మనోనటభైరవి
3. త్వమేవశరణం శ్యామలాంగి
4. సదామాం పాలయ సరసాంగి
5. సేవేఽంబ త్వాం కీరవాణి
6. సంరక్షమాం పతితపావని
7. భువనైకమోహన రూపవతి
8. సేవేత్వాం గాయకప్రియే
9. త్రిభువనజ్యోతి స్వరూపిణి

ఈ తొమ్మిదిపంక్తులలో వచ్చిన 'శంకరాభరణ, భైరవి, శ్యామలాంగి, సరసాంగి, కీరవాణి, పతితపావని, రూపవతి, గాయకప్రియ, జ్యోతిస్వరూపిణి' అను పదములు దేవీసంబధార్థములేకాక రాగనామములు కూడ కదా.

మరియొకవిశేష మేమనగా ఈ రాగమాలిక సర్వతాళాత్మక పంచజాత్యేక తాళమున రచింపబడినది. సర్వతాళత్మక పంచజాత్యేక తాళ మనగా సర్వతాళము లలో పాడుటకు వీలుగా రచించిన పంచజాతుల ఏకతాళము. దీని వివరణ మిది.

పంచజాతులు అనగా ఐదుజాతులు. పంచజాత్యేకతాళము అనగా ఐదు జాతుల ఏకతాళములు. త్రిస్రజాతి, చతురస్రజాతి, ఖండజాతి, మిశ్రజాతి, సంకీర్ణజాతి అనునవి పంచజాతులు. వీని ఏకతాళములు పంచజాత్యేకతాళములు.

ఈ పంచజాతుల ఏకతాళములలో నున్న అక్షరముల మొత్తము సంఖ్య 28.

| | | |
|---|---|---|
| త్రిస్రజాతి ఏకతాళము | - 3 | అక్షరములు |
| చతురస్రజాతి ఏకతాళము | - 4 | ,, |
| ఖండజాతి ఏకతాళము | - 5 | ,, |
| మిశ్రజాతి ఏకతాళము | - 7 | ,, |
| సంకీర్ణజాతి ఏకతాళము | - 9 | ,, |

ఈ 28 అక్షరములతో 1260 స్వరసాహిత్యాక్షరము లేర్పడును. అదియెట్లన- అయిదుజాతులలో ఒక్కొక్క-జాతి లఘువులలో 9 రాగముల చొప్పున ఏర్పరిచిన (9 $\times$ 5) 45 రాగములగును. ఈ 45 రాగములందలి స్వరసాహిత్యములను ఐదు జాతుల అక్షరముల మొత్తమైన 28చే గుణించిన (45 $\times$ 28) 1260 స్వరసాహిత్యాక్షరములగును.

ఈ 1260 అక్షరములు త్రిస్రఏక, చతురస్రఏక, ఖండఏక, మిశ్రఏక, సంకీర్ణఏక తాళమునకైనను, లేక అన్ని తాళములకును సరిపోవును. ఎట్లు సరిపోవుననగా -

| | |
|---|---|
| త్రిస్రఏక | 1260/3 - 420 |
| చతురస్రఏక | 1260/4 - 315 |
| ఖండఏక | 1260/5 - 252 |
| మిశ్రఏక | 1260/7 - 180 |

సంకీర్ణ ఏక 1260/9 - 140

ఇట్లు సర్వతాళములతో సరిపోవుటయే సర్వతాళాత్మకత. సర్వతాళములతో సరిపోవు పంచజాతుల ఏకతాళముల రచన యగుటయే సర్వతాళాత్మక పంచజాత్యేక తాళము.

ఈ రాగమాలిక స్వరసహిత మగుటకూడ ఒక విశేషము. మచ్చునకు మొదటి రెండు పంక్తులు -

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | కా | చ | చ | శు | అ |
| | సని | సారి | నిధప | మగమ | పధని |
| | శ్రీ | ధీర | శంక | రా | భరణే |

| | | | | |
|---|---|---|---|---|
| 2. | సాచ | | కైశు | శు |
| | గారి | సారి | నిధప | మాపద |
| | పాహి | మామ్మ | హంసనట | భైరవి |

ఈ సర్వతాళాత్మక పంచజాత్యేక తాళప్రబంధమునకు పంచముఖి యను పేరు కూడ కలదు. ఈ అంశమును సంగీతశేఖర శ్రీ నూకల చినసత్యనారాయణ గారిట్లు వివరించిరి-

"ఇంకొక విశిష్టమైనది విచిత్రమైనది అగు విశేషమేమన, ఈ రాగమాలికను ఒకరు పాడుచుండగా అయిదుగురు విద్వాంసులు ఒక్కొక్క ఏకతాళమున వేయుచుండిన రాగమాలిక మొదలుపెట్టి ముగించుసరికి అయిదు ఏకతాళములు ముగియును. మధ్యలోమాత్రము ముగియదు. కాగా ఈ అయిదు తాళములు ఒకరే వేయుచు పాడుటకు అపూర్వసాధనచేసినచో ఇదియొక అద్భుతమైన క్రియ యగును. అయిదు తాళములు ఒకరే వేయుట అసాధ్యము. శ్రీదాసుగారు వారి శిష్యులలో ధారణ

సాధనచేయగల ఓర్పు ఓపిక గల ఒకరిద్దరకు శిక్షణ గరిపిరి. అయిదు తాళములు ఒకేసారి అయిదు శరీరాంగములతో వేయవలెను.

1 త్రిస్రగతి - కుడిచేయి, 2. చతురస్ర - ఎడమచేయి, 3. ఖండ- కుడిభుజము, 4. మిశ్ర - ఎడమభుజము, 5. సంకీర్ణ - శిరస్సు.

ఈ పద్ధతికి 'పంచముఖి' అని శ్రీ దాసుగారు పేరు పెట్టిరి. పరమశివునికి అయిదుముఖములు. సద్యోజాత, వామదేవ, ఈశాన, తత్పురుష, అఘోర. ఈ అయిదుముఖముల నుండి అయిదుజాతులు, తాళములు, సప్తస్వరములు ఉద్భవించినవి. అను నార్యోక్తి ననుసరించి శ్రీ దాసుగారు ఈ సప్తతాళాత్మక పంచ జాత్యేక తాళమునకు పంచముఖి అని నామ మొసంగుట ముదావహము".[10]

మరియొక విశేష మేమన ఈ దశవిధరాగనవతి కుసుమమంజరి రాగమాలికలో మొదటి తొంబదిపంక్తులు సంస్కృతము. ఆరోహణక్రమమున శంకరాభరణ రాగముతో ప్రారంభమై కుసుమమంజరి రాగముతో ముగియును. తరువాత మరల తొంబదిపంక్తులు వచ్చును. ఆ రచన సాగినది మిశ్రభాషలో. ఈ రచనలో అవరోహణక్రమమున కుసుమమంజరి రాగముతో ప్రారంభమై శంకరాభరణ రాగముతో ముగియును.

ఉదాహరణమునకు మొదటి తొంబది పంక్తులలో (రాగములలో) చివరి పంక్తి (రాగము) -

సగరిగ మప నిధ నిసని దపమగరి

దశవిధ రా గ కుసుమ మంజరి

ఈ చివరి రాగమైన కుసుమమంజరితో ప్రారంభమైన మిశ్రభాషాత్మకమైన తరువాతి తొంబది పంక్తులలోని మొదటి పంక్తి -

సనిధప నిదనిరి నిసరిస నిదపమ గామగ రిసగా రిగామ

అనినిను వినయముగ వినుతి సలిపెద నంబిక దయజూడు మమ్మ

10. దశవిధరాగనవతి కుసుమ మంజరి - పీఠిక - పు. 4

ఇట్లు ఈ రాగమాలిక శంకరాభరణ రాగముతో ప్రారంభమై మరల శంకరాభరణ రాగముతో ముగియుచున్నది.

మరియొక విశేషమేమన, పంచముఖి యనుపేరు గడించిన ఈ రాగమాలికను ఆరవ తాళమునందు కూడ ప్రయోగించుటకు వీలుగా దాసుగారు ఈ రచన చేసిరి.

ఇట్లు ఆరవతాళము నందు అనుష్ఠించుటను 'షణ్ముఖి' యనియు, శాస్త్ర పరిభాషలో 'లఘుశేఖరము' అనియు నందురు. ఈ లఘుశేఖరము నందు పాడినచో కృతి పూర్తియగుసరికి (1260/6 _ 210) రెండువందలపదిసారులు అవృత్తియయి సరిపోవును. ఇదియొక విశేషము.

ఈ పంచముఖి తాళద్వయప్రదర్శన ప్రజ్ఞాప్రవీణుడైన సుబ్రహ్మణ్య అయ్యరునకు గర్వభంగము చేయించి, అతనిచేత వీరఘంటా కంకణము విప్పించినది. దాసుగారికి 'పంచముఖీ పరమేశ్వరులు' అను గొప్ప బిరుదమును ఇప్పించినది. ఈ అంశమును బరంపురము కళ్లికోట కళాశాలాంధ్ర పండితులైన శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిగారు వారి యక్షగాన ప్రబంధమైన పార్వతీ పరిణయమును దాసుగారికి 1922లో అంకిత మిచ్చుచు – ఇట్లు గ్రంథస్థము చేసిరి.

పంచముఖీ పరమేశ్వర
అంచిత త్రిపురారి సమమహానట విలయా
కుంచిత సుబ్రహ్మణ్య సు
కాంచన మణి ఘటిత వీరఘంటావలయా

దాసుగారు వారు ప్రిన్సిపాలుగా పనిచేయుచున్న విజయనగరము నందలి 'విజయరామగానపాఠశాల' వార్షికోత్సవ సందర్భమున (1_2_1933) సమగ్రముగా

రెండవసారి ఈ పంచముఖీ ప్రదర్శనము చేసిరి. ఈ సందర్భములో వారు నెత్తిపై నిమ్మపండు నిడుకొని క్రిందపడకుండ 'షణ్ముఖి' తాళమును లోకోత్తర ప్రజ్ఞా పాటవముతో ప్రదర్శించినారట.

ఈ దశవిధరాగనవతికుసుమమంజరి సంగీత ప్రపంచమున ఉదయించిన ఏకైక భాను బింబము.



# ౫. సాహితీ కోణములు

హా యనిపించు నాట - యహాహా యనిపించును పాట- తేనెసో
నా యనిపించు మాట-వహావా యనిపించును తేట- కైత వ
హ్వా యనిపించునో హరికథామృతసాగర! ఆదిభట్ట నా
- రాయణదాస! నీకడ సమస్తము నన్వయమయ్యె నద్దిరా[1]

## వస్తు స్వీకరణము :

వస్తువు అనగా కథాంశము లేక ఇతివృత్తము. వస్తుస్వీకరణమనగా ఆదిభట్ల నారాయణదాసుగారు వారి సర్వ గ్రంథములందు స్వీకరించిన కథాంశముల ఆకరముల వివరణము.

దాసుగారు వ్రాసిన గ్రంథములు నలువదియారు. హరికథలు పదునాలుగు. హరికథేతరకృతులు ముప్పదిరెండు. హరికథేతరకృతులలో స్వతంత్రగ్రంథములు పదునెనిమిది. అనువాదగ్రంథములు ఆరు. శాస్త్రసంబంధ గ్రంథములు ఎనిమిది.

---

1. కళాప్రపూర్ణ మధ్వ శ్రీ కాశీ కృష్ణాచార్యులు-నాయెఱుక-పూజాపుష్పములు, పు. 23

పదునాలుగు హరికథలలో ధ్రువచరిత్రము, అంబరీషచరిత్రము, గజేంద్ర మోక్షణము, ప్రహ్లాదచరిత్రము, రుక్మిణీకల్యాణము, గోవర్ధనోద్ధరణము, శ్రీహరి కథామృతము అను ఏడుకథలకు బమ్మెరపోతనామాత్యుని శ్రీమదాంధ్ర మహాభాగవతమునందలి కథలు మూలాధారములు. భీష్మచరిత్రము, సావిత్రీచరిత్రము అను రెండు కథలకు కవిత్రయమువారి శ్రీమదాంధ్ర మహాభారతము నందలి కథలు ప్రధానాధారములు. యథార్థరామాయణము, జానకీశపథము అను రెండు కథలకు వాల్మీకిమహర్షి వ్రాసిన శ్రీమద్రామాయణ కథాసారము అస్థిపంజరము వంటి ఆధారము. సందర్భోచితముగా అనేకములైన ఆ వాల్మీకీయఘట్టములను, ఇతర రామాయణముల నుండి గ్రహించి చేర్చిరి. మార్కండేయచరిత్రము మాఘపురాణము ననుసరించి, హరిశ్చంద్రోపాఖ్యానము గౌరన ద్విపదకథ ననుసరించి వ్రాసిన పురాణహరికథలు. గౌరమ్మపెండ్లి మూలవాసన కూడ లేని స్వతంత్ర హరికథ.

కథావస్తువు దాసుగారి సొంతము కాకపోయినను, కథనవిధానము దాసుగారి సొంతమే. ప్రతికథలో మూలకథనేపథ్యము నెరపుచుండ, దాసుగారి కథనవిధానముగజ్జెకట్టి రంగస్థలముపై ప్రతిభాజన్య నైకవిధ విలాసములను ప్రదర్శించుచుండును. ప్రతికథ -

సరస్వతీస్వాదు తదర్థవస్తు
నిఃష్యందమానా మహతాం కవీనామ్
అలోకసామాన్య మభివ్యనక్తి
పరిస్ఫురంతం ప్రతిభావిశేషమ్ [2]

అన్న లక్షణమునకు ఒక లక్ష్యమే.

ఇక హరికథేతరకృతులలో ఏడుశతకములు (వేల్పువంద, కాశీ, రామచంద్ర, ముకుంద, శివ, సూర్యనారాయణ, సత్యవ్రత శతకములు); నాలుగు

---

2. ధ్వన్యాలోకః - ప్రథమోద్యోతః, శ్లో. 6
మహాకవివాణి వస్తుతత్త్వమును నిష్యందింపజేయునదియై, మహాకవులకు అలోకసామాన్యమైన ప్రతిభావిశేషమును పరిస్ఫురించుదానిగా అభివ్యక్తీకరించును - పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి అనువాదము.

ప్రబంధములు (బాటసారి, ట్రావెలరు, మేలుబంతి, తారకము): రెండురూపకములు (దంభపురప్రహసనము, సారంగధరనాటకము): నాయెఱుక, మృత్యుంజయాష్టకము, బాలరామాయణకీర్తన, పేల్పుమాట, అచ్చతెలుగుపలుకుబడి అను పదునెనిమిది గ్రంథములు స్వతంత్రగ్రంథములు. స్వతంత్రగ్రంథము లనగ మూలములు లేనివేకదా. వీనిలోని వస్తువంతయు దాసుగారి సొంతమే.

అనువాదగ్రంథములు ఆరు. వీనిలోని వస్తువంతయు మూలగ్రంథకర్తలదే. దాసుగారి సొంతము సుంతైనను లేదు. రుబాయతు గ్రంథము ఉమరుకయ్యాము, ఫిట్స్‌జెరల్డు గ్రంథములకు, నవరసతరంగిణి గ్రంథము షేక్స్పియరు కాళిదాసుల కవిత్వములకు, నూరుగంటి గ్రంథము ఈసపు వ్రాసిన కొన్ని కథలకు, మొక్కుబడి గ్రంథము ఋక్కులకు, తల్లివిన్కి గ్రంథము లలితాసహస్రనామములకు, వెన్నుని వెయిపేర్ల వినకరి గ్రంథము విష్ణుసహస్రనామములకు యథామూలకములైన అనువాదములు.

శాస్త్రసంబధులైన గ్రంథములు ఎనిమిది. ఇవి అనువాదములు కావు. స్వతంత్రములు కావు. స్వతంత్రాస్వతంత్రములైన శాస్త్రగ్రంథములు. వీనిలోని వస్తువు సొంతము కాదు. అట్లని ఏకగ్రంథానువాదముకాదు. మన్కిమిన్కు అను గ్రంథము వేదములు, స్మృతులు, అష్టాదశపురాణములు పరిశీలించి వానిలో గల ఆయుర్వేదాంశములను ఒకచోట క్రోడీకరించి వ్రాసిన గ్రంథము. సీమపల్కువహి గ్రంథము అచ్చతెనుగుపదముల నిఘంటువు. తర్కసంగ్రహము, వ్యాకరణ సంగ్రహము అను గ్రంథములు లభింపకపోయినప్పటికి నామములనుబట్టి తర్కవ్యాకరణాంశములపై సంగ్రహముగా వ్రాసిన గ్రంథములని స్పష్టము. జగజ్జ్యోతి అను గ్రంథము దాసుగారి బహుళవిషయపరిజ్ఞానము నూటయిరువది శీర్షికలలో వచనమున వ్యాపించిన గ్రంథము. పురుషార్థసాధనము అను గ్రంథము లౌకిక వ్యవహారములపై సంస్కృతవచనమున వ్రాసిన గ్రంథము. దశవిధరాగనవతి కుసుమమంజరి యను కృతి తొంబదిరాగముల అపూర్వశాస్త్రగ్రంథము. చాతుర్వర్గ్య సాధనము లభింపలేదు. నామమునుబట్టి చతుర్వర్గములను గూర్చి వ్రాసిన గ్రంథమని యూహింపవచ్చును. ఈ శాస్త్రగ్రంథములు దాసుగారి విజ్ఞానపీఠము గడించిన నిధులు.

హరికథలలో ఒక్క గౌరమ్మ పెండ్లిలో తప్ప, తక్కిన హరికథలలోని వస్తువంతయు భారత భాగవత రామాయణగ్రంథములలో, పురాణములలో ప్రఖ్యాతమైనదే. అనువాదగ్రంథములలోని వస్తువంతయు ప్రసిద్ధములైన మూలగ్రంథములందలిదే. శాస్త్రగ్రంథము లందలి వస్తువంతయు విప్రకీర్ణముగా శాస్త్రములందున్నట్టిదే. స్వతంత్రగ్రంథములలోని వస్తువంతయు దాసుగారి సొంతము. కనుక దాసుగారి గ్రంథములలో ప్రఖ్యాతమైన వస్తువు ఎక్కువ.

వస్తువులో ప్రఖ్యాతమైనది యెక్కువ యున్నంతమాత్రమున దాసుగారి కీర్తికి తక్కువైనదిలేదు. దోషమంతకంటె కాదు.

యదపి తదపిరమ్యం యత్రలోకస్య కించిత్
స్ఫురితమిద మితీయం బుద్ధిరభ్యుజ్జిహీతే
అనుగతమపి పూర్వచ్ఛాయయా వస్తుతాదృక్
సుకవి రుపనిబధ్నన్నిందృతాం నోపయాతి[3]

అను ఆలంకారికప్రమాణమే యున్నదికదా.

ప్రఖ్యాతమైన వస్తువును గ్రహించి కావ్యమును వ్రాయు కవికి ఆలంకారికులు పెట్టిన నియమములు కొన్ని యున్నవి.

సంతి సిద్ధరసప్రఖ్యాయేచ రామాయణాదయః
కథాశ్రయా న తైర్యోజ్యా స్వేచ్ఛారస విరోధినీ

తేషుహి కథాశ్రయేషు తావత్స్వేచ్ఛైవ నయోజ్యా......... స్వేచ్ఛాపి యది యోజ్యా తద్రసవిరోధినీ నయోజ్యా .... ఇతివృత్తవశాయాతాం కథాంవిద్రసా

---

3. ధ్వన్యాలోకః - చతుర్థోద్యోతః, 16
నవమిది విలక్షణస్ఫురణం బటంచు
నెచట సహృదయబుద్ధుల కించు దాని
పూర్వసుకవుల వ్రాయలఁ బొందియున్న
వస్తువును గూర్చి సుకవికి వాదురాదు
- వేదాల తిరువేంగళాచార్యులు గారి అనువాదము, పు. 725

ననుగుణాం స్థితింత్యక్త్వా పునరుత్ప్రేక్ష్యాప్యన్తరాభీష్టరసోచితకథోన్నయో విధేయః కవినా కావ్యముపనిబధ్నతా సర్వాత్మనా రసతంత్రేణ భవితవ్యమ్. తత్రేతివృత్తే యది రసాననుగుణం స్థితిం పశ్యేత్తదేమాం భంక్త్వాపి స్వతంత్రతయా రసానుగుణం కథాంతరముత్పాదయేత్ నహికవేరితివృత్తమాత్రనిర్వహణేన కించిత్ప్రయోజనమ్, ఇతిహాసాదేవ తత్సిద్ధేః[4]

అందువలననే దాసుగారి కథలలో అనౌచిత్యస్పర్శ కల్గినచో మూలములు కూడ తొలగినవి. సందర్భోచితముగా అమూలకములు, అన్యథామూలకములు కూడి మెలగినవి. ఇక రసోద్దీపకములైన, పాత్రపోషణపరమార్థకములైన వర్ణనలు, కల్పనలు కోకొల్లలుగ కలిగినవి.

## రసనిర్వహణము :

కావ్యమునకు రసము జీవకళ. ప్రతిభాసామగ్రితో అలంకారముల తాలింపుతో, ఔచిత్యపు పాళ్లతో సలక్షణరుచితో నున్న రసపదార్థమునకై సహృదయుని హృదయము ఉవ్విళులూరుచుండును. ఎన్ని అలంకారములున్నను, ఎన్ని వాక్చమత్కారములున్నను, కావ్యమునందు రసదేవత సాక్షాత్కరింపనిచో, ఆ కావ్యము సహృదయ హృదయంగమము కాలేదు. రసజనకసామగ్రీసజ్జీకరణము అధికార సూత్రము.

---

4. ధ్వన్యాలోకః - తృతీయఉద్యోతః - 14, 15 కారికల మధ్య
(సిద్ధరసములుగా ప్రఖ్యాతములైన రామాయణాదుల నుండి కథను గ్రహించినపుడు, రసమునకు విరోధమును కలిగించు కథాశ్రయమగు స్వేచ్ఛను యోజింపరాదు. కథాశ్రయములైనవాని విషయమున స్వేచ్ఛ కొంచెమైనను యోజ్యముకాదు .... స్వేచ్ఛను కొంత యోజించినను రసవిరోధిని యైన స్వేచ్ఛను యోజింపరాదు .... ఇతివృత్తవశమున రసాననుగుణమైన స్థితికలిగినచో దానిని పరిత్యజించి మరల అభీష్ట రసోచితమైన కథను అచట కల్పించియైన మధ్యలో కూర్పవచ్చును. ప్రబంధము నిర్మించు కవి సర్వవిధముల రసపరతంత్రుడగుట ఆవశ్యకము. ఇతివృత్తమునందు రసాననుగుణమైన స్థితిని చూచినచో దానిని భంజించియైనను స్వతంత్రముగా రసానుగుణమైన కథాంతరము కల్పింపవలయును ఇతివృత్తమును మాత్రమే నిర్వహించిన కవికి కొంచమైన ప్రయోజనము లేదు. ఇతిహాసాదుల వలననే కథ తెలియునుగదా!)

యథాబీజాద్భవేద్వృక్షో వృక్షాత్పుష్పం ఫలంయథా
తథామూలం రసాః సర్వే తేభ్యో భావావ్యవస్థితాః[5]

వాగ్వైదగ్ధ్యప్రధానేఽపి రస ఏవాత్ర జీవితమ్[6]

ఈ రసరాజ్ఞి ప్రభుత్వము దాసుగారి గ్రంథములందు సంపూర్ణముగా సాగినది. కాని హరికథల విషయమున ఒక చిన్న ప్రతిబంధకమున్నది. హరికథలు శ్రవ్య గ్రంథములుకావు, దృశ్యగ్రంథములు. దృశ్యగ్రంథముల రచన ప్రదర్శన దృష్టితో జరుగును కావున దృశ్యగ్రంథములలో గల రసదేవత శ్రవ్యస్థితిలో సంపూర్ణముగా సాక్షాత్కరింపదు. కనుక దృశ్యప్రబంధములైన దాసుగారి హరికథలలో ఆ రసదేవత ప్రదర్శనవేళ సంగీతహాసవిలాస లాస్యములతో అనంతముఖియై పఠనవేళ స్పష్టాస్పష్టముగ గోచరించును. అయినను సహజసౌందర్యస్ఫూర్తిస్ఫురింపకపోదు.

శృంగారరసము :

శృంగారరసము కవితకు మొదటి చుట్టము. శృంగారములేనిదే కవిత, కవితకాదను స్థితిని సాహిత్యలోకమున ఈ శృంగారరసము సంపాదించుకొన్నది. రసరాజమనిపించుకొన్నది. వ్యాస వాల్మీకులచే అంగిరసగౌరవము నందకపోయినను, తరువాత రాజయోగముచే ఈ రసరాజమునకు రాజయోగము పట్టినది. కవులు శృంగారరసముచే గ్రంథనాయికలకు ఆపాదమస్తకము అభ్యంగములు బహిరంగముగా చేయుంచుటకు కూడ వెనుకాడలేదు.

దాసుగారి గ్రంథములలో శృంగారరసము బాగుగా సింగారించుకొన్నది, కాని పచ్చిపచ్చిగా పిచ్చిపిచ్చి పోకడలుపోక అదుపు ఆజ్ఞలతో ఉచితరీతిగా మెలగినది.

---

5. నాట్యశాస్త్రమ్ – అధ్యా. 6, శ్లో. 36
ఎట్లు బీజమునుండి వృక్షము, వృక్షమునుండి ఫలపుష్పములు కలుగుచున్నవో, అట్లే సర్వరసములు మూలములు. వానినుండియే భావములు 'వ్యవస్థితము' లగుచున్నవి)

6. అగ్నిపురాణమ్ - అధ్యా. 337, శ్లో. 33
వాక్చమత్కారము ప్రధానమైనను కావ్యమునకు రసమే జీవితము.

సారంగధరనాటకములో చిత్రాంగి వరుసలు తిరగవేయుచున్న సారంగధరునితో వలపునకు వావికి చాలదూరమని అడ్డముగా వాదించుచు అన్నమాటలు -

పుక్కిటి పచ్చికప్పురపుతమ్మం బువ్వు
పుం బంతియాటలం బోదలకున్న
మంచిగంధపుతావి మించు నెమ్మేను మూ
ర్కొనుచుఁ బల్లమిముద్దు గొనకయున్న
మనసుదీఱని పంతమునకు రెట్టింపుచుఁ
జొక్కి తీయనిమోవి నొక్కకున్న
మరుని గద్దియఁబోలు నురముపై నొల్లన
వాలుగన్నులుదేల్చి సోలకున్న
వన్నెలాడులు నీబోటి వన్నెకాని
డాఁసి యూఁగుట లెట్లు? నిన్నాసి తాళు
టెట్లు? చులకనచేయక యేలుకొమ్ము
వాఁడి వయసున ముదుసలి పల్కులేల?[7]

బ్రహ్మచారియైన సారంగధరుడు ఎరుగని ప్రణయోపనిషత్సారములను బోధించి వశపరచుకొనుటకై ప్రయత్నించుచున్న చిత్రాంగీ కామోన్మత్తశృంగార వాంఛలను చక్కగా చెక్కి చూపుచున్న పద్యమిది.

బాటసారి గ్రంథమున విధివశమున భార్యాపుత్రులకు దూరమైన బాటసారి తన భార్యను స్మరించినవిధము -

తాను ముందుగ లేచి తానము గావించి
పొందమ్మివలె నాకు మోము చూపు
నిల్లు నీటుగఁ జేసి యెంతయున్ గ్రొంజవు
లూరు వంటలు కడుపార మేపు

7. సారంగధర - తృతీయాంకము, పు. 42, 43

నేఁ బైకిఁ జని మళ్ళియే తేర నా యడు
గులఁ బట్టి నిమిరి బడలికఁ బాపు

నా మాట కెన్నఁడైనన్ జవదాటక
నా నేర మెట్టిదియైన నోపు

కలిమి లేముల నిల్లొక్క కరణి జరపు
నన్నిటికి నెక్కుడంచు మర్యాద నెరపు
కరము బీదలపైఁ గనికరము పరపు
నట్టి యిల్లాలిఁ బాసి నే నెట్టులుందు?[8]

అడుగులు గంద నెన్నఁడును వడఁక నీవు
తిరిగిచూడక నీళ్ళు తెచ్చు హొయలు

చెక్కిళ్ళ కిరుగడ లిప్పురు చేతులఁ జేర్చి
యొప్పుగా నీవు పొయ్యూదుతీరు

డాకెలు వెన్నమీఁదనోమ్రి నెమ్మేను
వంచుచు నీవు వడ్డించు చెల్వు

కొనగోళ్ళ నీనియల్లనుముచు మడుపుల
మచ్చికతోడ నీవిచ్చు సొగసు

నన్నుఁ గనినప్పుడెల్ల నీకున్న జోక
నేను జబ్బుగనున్నప్డు నీ యలజడి
నాదుచుట్టములందు నీ నమ్మకంబు
నెందనుకఁ దలపోయుదు నెట్టులోర్తు?[9]

8. బాటసారి - ప - 88

9. బాటసారి - ప. 139

తుచ్ఛమైన కామస్పర్శలేక స్వచ్ఛమైన దాంపత్యజీవితములో ప్రతిదినము ప్రత్యక్షమగు అనుబంధములతో నున్న ఉదాత్త శృంగారరసపద్యములివి.

యథార్థరామాయణ హరికథలో శ్రీరాముడు ఉద్యానవనమున జానకిని చూచి ఆనందించుచుండ, జానకి అనురాగముతో చూచుచు వెడలును. ఆసందర్భమున ప్రేమతో శ్రీరాముడనుచున్న మాటలు -

కలసి నాచూడ్కులఁ జెలిమిదోడ్కొని యేఁగు
చేటవాలగుచూపు లిరులనీన
రవలకమ్మలు నిగారపుచెక్కు లొండొంట
మెఱుఁగులు రెట్టించి మేళగింపఁ
బల్కరించినపోల్కిఁ బయ్యెద సరదెడు
కై పైడిగాజులు ఘల్లనంగ
జిక్కితివని యెగసక్కెమాడుచుఁ బిఱుం
దుల జడకుచ్చులు ద్రుళ్ళియాడఁ
జిఱునగవు నోరమోము నున్నిగ్గు వెనుకఁ
దిరిగి యడుగులు తడఁబడ నరుగ నెంత
పోడి, మా చేడెపోడవు నాబుజముబంటి
యే మిరుపుర మాలుమగల మింతనిజము[10]

సీతాదేవి చూపులు శ్రీరాముని చూపులతో చెలిమిచేసి శ్రీరాముని చూపులను తీసుకొని వెళ్లుచున్నవట. రవ్వలకమ్మలు, నింగారపుచెక్కిళ్ల కలిసి కాంతిని రెట్టింపు చేసెనట. పయ్యెద సర్దుకొనునపుడు ఘల్లుమనుచున్న సీతాదేవి చేతిగాజులు పల్కరించుచున్నట్లున్నవట. పిరుదులపై ఎగురుచున్న జడకుచ్చులు చిక్కితివి అని పిరుదులను ఎకసక్కెమాడుచున్నట్లున్నదట.

గౌరవ్మ పెండ్లికతలో గౌరమ్మ విరహముతో అంగమొలపేల్పును (పరమేశ్వరుని) సాధించుచున్న విధము-

10. యథార్థ రామాయణము – సీతాకళ్యాణము, పు. 84

అలరువిల్తుని తిమురడంచిన నీ కాండు
దానిపైఁ గోరిక తగులదేమొ!

గడుచు బిత్తరి బూటకపుమాట నమ్మిటు
తగవుకాదని పాటి తప్పదేమొ!

చదలేరు నాయెర ఎదురయి నిద్దన
బిగికౌఁగిటన్ గ్రుచ్చి విడువదేమొ!

నా మంచి తలిదండ్రు లేమరి నీ వెడ
వాలకమున గొప్పఁ జాలరేమొ!

నిన్నుఁగానక నులిసైన నిల్వనోప-
మించిపోనీకు - నన్ను బ్రతికించు వడిగ-
నేలజాలము? నన్నిఁక నేలుకొనుము
కడలి మినిమితాల్ప? కనుమంగ మొలవేల్ప![11]

తనచెంతకు తనప్రియుడైన గంగాధరుడు ఎంతకు రాకపోవుటచే గారమ్మకు వచ్చిన అనుమానముల పరంపర ఈ పద్యము. ఈ అనుమానపరంపరలు స్త్రీ సహజ స్వభావ ప్రదర్శకములుగా నున్నవి.

దాసుగారు రాజాస్థానములలో అనేక శృంగార చాటువులను చెప్పినారు. మచ్చునకు ఆ రసికోపనిషన్మంత్రములుకొన్ని-

ధనమూ రాదు, దురాశపోదు, పరతత్త్వజ్ఞానమూలేదు, కృ
ష్ణునియందా మదినిల్వఁబోదు, సుమబాణునోర్వఁగారాదు, ని
న్నెనయన్‌లోకములోన వాదు, విరహం బిట్లుండగా నీదు, పా
వన వంశంబు స్వతంత్రమిాదు, చెలియా! వాంఛల్తుదల్మెట్టునే?

కోరిక తీరదాయె - నిను గొబ్బునఁ జూడఁగ దూరమాయె-నీ
వారికి భారమాయె - సుమబాణునివైరము ఘోరమాయె-నీ

11 గారమ్మ పెండ్లి, పు. 17

నేఱుపు నేరమాయె - మఱి నిందలునారులు నూఱులాయె-నా
పేరున లోపమాయెగద భీతమృగాక్షి! యిఁకేమి వ్రాయుదున్

నీదయఁబొంది మారుని తృణీకృతుఁజేసిననాఁడు మెచ్చిరో
హో ధృతివంచు నిప్పుడొహోహోయని నవ్వెదరెంత వెఱ్ఱులో!
యోదుర మందనంగుని జయించుట లెట్టులు? నిన్నుఁబాయఁగాఁ
గాదె క్షణంబు వత్సరముగాఁ బ్రకృతిన్వికృతు ల్సెలంగెడిన్[12]

దాసుగారు తుచ్ఛమైన సంభోగశృంగారమును గ్రంథములలో వర్ణింపలేదు. కాని మార్కండేయచరిత్ర హరికథలో తప్పనిసరియైనది. మార్కండేయుని తలిదండ్రుల సంభోగశృంగారము -

కేళిసల్పిరి మఱుకేళి సల్పిరి వారు ॥కే
పూలపాన్పుమీద సోలి మోదసాగరమునదేలి ॥కే
మేలు పందెములగట్టి మేనుల జిఱుచెమటబుట్టి ॥కే
బిగియు కౌగలించుకొనుచు బెదవినితేనె నంచుకొనుచు
మొగమోటము్ద్రెంచుకొనుచు ముద్దుగొనుచు
నగుమాటల జెప్పుకొనుచు నొగినేర్పుల మప్పుకొనుచు
జిగిచెక్కులు నొక్కుకొనుచు దగ శివునకు మ్రొక్కుకొనుచు
[13] ॥కే

ఈ సంభోగశృంగారవర్ణనము కూడ అనౌచిత్యదోషభూయిష్ఠముకాక పరమేశ్వర పవిత్రధ్యానమ్యముతో సల్లక్ష్యముతో సాగినది.

శృంగారౌచిత్యములు చేతిలో చేయివైచికొని జంటగా దాసుగారి ప్రతిభాపథములో ఇట్లు ప్రయాణించినవి.

---

12. మేలుబంతి – వర్ణన స్తబకము, పు॥ 158–59
13. మార్కండేయచరిత్ర, పు॥ లు 22, 23

కరుణారసము :

'ఏకోరసః కరుణఏవ' [14] అని భవభూతిచే ప్రశంసలందుకొన్న దీ కరుణ రసము. భారతీయనాయికలలో జానకి కరుణరసముకన్న మొదటియాడుబిడ్డ. ఈ రామ భామను రావణుడు అపహరించి లంకలో నుంచును. సీతాన్వేషణమునకై రామదూతగా ఆంజనేయుడు సాగరము లంఘించి లంకకు వెళ్లి, అక్కడ అశోక వనములో శోకసాగరములో మునిగియున్న సీతను జూచును. దాసుగారి యథార్థ రామాయణములో అంజనేయుడు దీనావస్థలో నున్న ఆ సీతను చూచి బాధపడుచున్న కరుణరసదృశ్యము -

అమ్మా యిట్లుంటివ! సీత! యా-హా-విధిచేత ॥య
ఎమ్మెయి వ్రాసె నీకీవ్రాత జగదేకమాత! ॥య
ముద్దుగ జనకుడు గనుబాలా! సంపూతశీలా!
ప్రొద్దిటు గడుపవలసె నేలా-రాము నిల్లాలా! ॥య

చెక్కిటం జేయిచేర్చి వెక్కి వెక్కేడ్చుచుఁ
గన్నీరు వేఁడి నీర్గార్చె దేల,
ముక్కర నల్లాడు ముత్తెము విరియఁగ
నుస్సురంచున్ వెచ్చనూర్చె దేల?
పలవించి వడి సొమ్మసిలి వడంకుచుఁ జల్వ
చప్పరంబున నొడ ల్జార్చె దేల?
యట్టగట్టిన కొప్పు నట్టిటు పీఁకి కొం
చొర సామీ యని యూర్చె దేల?

అవనిలో ధర్మమున్ నిల్ప నవతరించు
నాదిదంపతులార! యన్యోన్యవిరహ

14. ఉత్తరరామచరితమ్ - అం. 3, శ్లో. 41

తాపమునఁ గ్రాఁగుచుంటిరా - తల్లి దండ్రు
లార! యో జానకీరాములార! మీరు[15]

అంజనేయుడు విరహముతోఁ గ్రుంగుచున్న రాముని చూచినాడు. ఇప్పుడు మూర్తీభవించిన కరుణరసమువలె నున్న సీతను జూచి, గుండె బండలయి రాముని గూడ గుర్తుతెచ్చుకొని బాధపడినాడు. ఈ పద్యమున గన్పడు సీత చూచువారి గుండె బండలగునట్లున్నదికదా.

రామాజ్ఞచే సౌమిత్రి అరణ్యములో నొంటిగా విడిచివెళ్ళినపుడు, జానకి విలపించిన విధము జానకీశపథ హరికథలో ఒక కరుణరసఘట్టము —

ప। ఎంతపని చేసితివి రామా నీ వింత కఠినుడవని యెరుగ ॥నెం

అ। సంతతంబు నిన్నె నమ్మిన సాధ్వి నడవి కప్పగించి ॥యెం
నీచులాడుకొన్న నేమి నిజము నీవెరుగవా
నా చరిత పవిత్రమని యనలుడు సాక్ష్యమీయలేదా ॥యెం

అపవాదమూడ్చి రాజ్యంబున నీతి ని
ల్పుటకు నన్ విడనాడె భూమిభర్త,
కాన ప్రాణేశుపై నే నేరమును లేదు,
కలవార్తఁ దెల్పక కన్నొరంగి
యడవిలో ననుడించి యరిగిన సౌమిత్రి
తప్పిది, రామాజ్ఞ చెప్పినంత
నిండుగర్భిణినగు నేఁబడు దూరవస్థఁ
బరికింపలేకిట్లు పత్రమందు
వ్రాసిపోయిన లక్ష్మణు వలనఁగీడు
నాకుఁదోఁచదుగాని, యెన్నంగ దుష్ట

15. యథార్థరామాయణము – హనుమత్సందేశము, పు. 206

రావణాసురుచేతఁ గొంపోవఁబడిన
నాఁడె చావక బ్రతుకుట నాదె తప్పు

ప॥ రమ్మా మృత్యువ వేనం జేకొమ్మా చచ్చి సుఖంతు నిపుడు ॥ర
నమ్మికొన్న రాముడు నన్విడచెను నాకు నీకన్న మిత్రులెవ్వరిక ॥ర
తినుడో పులులార దీనులార మీ యాకలిదీరగ
ఇనకులదీపమైన రఘురాముని కిల్లాలనయ్యు నిందంబడి యీ
వనమున నొంటి విడువబడితి నింక బ్రతుకనొల్ల మీకు
పుణ్యమగునన్నిన [16] ॥ర

ఇట్లు సీత మృత్యువును కోరుకొనుటకు కారణము వైరాగ్యముకాక, భర్త లోకులమాటలచే వెడలగొట్టెనను బాధయే. కనుక నిదియొక కరుణరసఘట్టము.

హరిశ్చంద్రుడు సత్యమునకు దొరికిన శోకసార్వభౌముడు. దాసిగానున్న చంద్రమతి సర్పదష్టుడై మరణించిన పుత్రుని శవమును తీసికొని కాటికి వచ్చి, కాటి కాపరిగా నున్నవాడు తన భర్తయగు హరిశ్చంద్రుడని గ్రహించినపుడు చంద్రమతికి శోకము కట్టలు తెంచుకొన్న ఘట్టము –

అయ్యవచ్చి పల్కరించు కొడుక! ముద్దియ్యవేల? నేల నేలపడక! ॥అ
నీతండ్రి కన్నీళుల జూడు కొడుకా! యీ
రాతిరినుండి మరి యగుపడవా కొడుకా! ॥అ

ఎంత వచ్చెఁ బ్రాణేశ్వర నేఁడు మన
చెంతఁ గొడుకిటు పడినాఁడు ॥అ

నీ కాకలిదప్పిక లిక లేవా? కొడుకా! యీ
లోకనింద లిక నిన్నంటవురా ॥అ

పుట్టెడాస నీపై బెట్టుకొంటినని కొడుకా! న ॥అ

16. జానకీశపథము - పు.లు 23, 24

న్నట్టేటం బడఁద్రోసితివా? కొడుకా?
ఎంత సుందరుండ వెంత సుగుణివి కొడుకా, నే
నెంత తలఁచుకొందురా? కొడుకా। ।అ

కొనసాగు వంశమందున నాకొము త్తైము
బుట్టితీవని నిన్ను ముద్దుబెట్టి
వీర ప్రసూతివై తే రమణీ యని
రెట్టిగాఁ బ్రేమ నా తట్టుజూపు
సకల సామంతరాట్చ్రకంబునకు నిన్ను
భావి ప్రభునిగఁ గన్పర్చుచుండు
నీదు సౌజన్యము మోదంబుగాఁ జూచి
నావంక గర్వించి నవ్వుచుండు
నట్టి నీతండ్రి సర్వం సహాధినాథు
డిట్టు నిం గూర్చి బిట్టు శోకించుచుండెఁ
జూడవేమి? మఱియును మాటాడవేమి?
యెంటెగా నేలపడక? నా చంటికొడుక![17]

ఈ కడుపు తరుగుకొనిపోవు కరుణరస ఘట్టమును దాసుగారు కావలెనని 'శోకవరాళి' రాగముతో అక్షరబద్ధము చేయుటవలననే, దాసుగారు రసపోషణ విషయమున ఎంత శ్రద్ధ తీసికొనినారో వేరుగా చెప్పనక్కరలేదు. ఇక చంద్ర మతి నోట పల్కించిన మాటలు కత్తిపీటలు.

గజేంద్ర మోక్షణ హరికథలో మకరిబాధకు తట్టుకొనలేక పట్టు సడలిన కరిరాజు చేసిన దీన ప్రార్థన యొక కరుణరస ఘట్టము (పు. 25). భాగవతమున బమ్మెర పోతరాజు గజరాజులో పరకాయ ప్రవేశము చేసి ప్రార్థింపగా, దాసుగారు పోతనగారికన్న ఇంకొక మెట్టెక్కి –

17. హరిశ్చంద్రోపాఖ్యానము, పు. 49

వరనారాయణదాసావనుడౌనని - నినునే
కరము స్మరియించితిని గదరా
నిరంతరము విజయనగర వరంబునను వెలసిన సామి
రార గోపబాల యిది త
గురా సరిసరిరా మనుపవ్వురాత్వరగ.[18]

అని గజేంద్రుడుగా నవతారమేదాల్చి అభేదాధ్యవసాయముతో ప్రార్థించినారు. ఇక విజయనగర గోపబాలుని సంబోధించుట దాసుగారి గడుసుతనము. ఇది ప్రతి భాగవత పఠన ప్రాణికి పరిచయమైన ప్రసిద్ధ కరుణ రస ఘట్టము.

అల్లునకు ఆత్మజను అప్పగించుఘట్టము కన్నతండ్రులకు ఆడుపిల్ల పుట్టగనే నిర్ణయింపబడిన తప్పించుకొనలేని కరుణరసఘట్టము. అశ్వపతిమహారాజు తన పుత్రికయైన సావిత్రిని సత్యవంతుని చేతిలో పెట్టుచు వగచుచున్న ఘట్టమును దాసు గారు సావిత్రీ చరిత్రములో పోషించిన విధము-

ప। అప్పగించినాము నీ కన్నా మాయొక్క పిల్ల ।న
అ। ఎవ్వడడిగ్గైన నడిచి యెరుగదయ్యాయో సుకుమారి ।న
మి। అప్పా - యిచ్చకముల గొప్ప - దాడినమాట
తప్ప - దాజ్ఞకు మారుచెప్పదు -
మదిగప్పదు-వంత విప్పదు-చెరుపుమప్పదు-సుగుణాలకుప్ప ।న

నిన్ను కలంగన్న మొదలెంత నిన్వలచెన్
అన్నము పానమన దొక్కింతైన నిద్రపోదు
ఎన్నోనోములు నోచి కన్నా మెంతయు బెంచు
కొన్నా మిప్పు డెడయుచున్నాము నీ సుగుణము
విన్నాము గతియన్నాము నీవె మన్నాము దుఃఖమాచి ।య

18. గజేంద్రమోక్షణము - పు. 25

కాత్యాయనీపూజకై సన్నజాజులు
గోయ మాయమ్మకుఁ జేయికందు

నొకసారి సాష్టాంగ మొనగూర్ప మాపిల్ల
చెక్కిళ్ళు ముత్తెంపుఁ జెమటగాఱుఁ

గూతమేరను దుర్గగుడికి నడువగ మా
బొట్టె యడుంగులు పొక్కులెక్కు

హంసతూలికతల్పమైన మా కూఁతున
కొత్తిగిల్లిన పక్కలొత్తుకొనును

బలుతపంబునఁ సావిత్రివరమువడసి
కాంచి యెంతయుముద్దుతో బెంచినార
మకట యిమ్మందయూన నీ యలకుఁబోడి
నెట్టులేలెదో? తండ్రి! నీ కిచ్చినాము[19]

ఈ పంక్తులు సావిత్రీ పవిత్రజననకారణము, సావిత్రీ సౌకుమార్యము, సావిత్రిని తల్లిదండ్రులు పెంచిన గారాబము, సావిత్రికి సత్యవంతునిపై గల ప్రేమను వెల్లడించుచు, అశ్వపతియొక్క పుత్రికావియోగశోకమును హృదయ విదారకముగా శ్రోతల కందించుచున్నవి.

సారంగధరనాటకమున రాజాజ్ఞచే హంతకులు సారంగధరుని కాలుచేతులు ఖండించుటకు తీసికొనివెళ్ళిన ఘట్టము ఒక కరుణరస ఘట్టము. ఆ ఘట్టము నందలి సారంగధరుని మాటలు -

శుభపంథవరాళి - రూపకతాళము

ప। నీవే నాయాత్మకు శరణ - నిఖిలాదికారణ ।నీ

అ। స్థావరముగఁబుట్టింపక - కేవల తిర్యక్కుఁజేయ
కీ వసుమతి నను నరునిగ - నేల పుట్టించితివి తండ్రి ।నీ

---

19. సావిత్రీ చరిత్రము, పు. 29

సువివేకమే తప్పయ్యెను - సూనృతంబె ముప్పయ్యెను
భువిఁబాతకి రక్షఁబొందె - పుణ్యజనుఁడె శిక్షఁబొందె ॥సీ

హరహరా! సర్వేశ్వరా! నాకెంత దుర్గతి పెట్టితివి. నిర్దోషినగు నాకుఁ బితృవిరోధము, మృషాపవాదము, ఘోరమరణము వ్రాసితివా? కానీ, మించినది తలపోసి కుందనేల? అక్కటా! ప్రాణస్నేహితుఁడా!

క్షణమెడఁబాసినప్పు నినుఁగన్నులఁ జూచినదాకఁ దోఁచకుం
డునుగద - రాత్రి నాదుకలనున్? నినుఁదప్ప మఱెవ్వనిం గనుం
గొనఁగద - ప్రాణమిత్రుఁడవు - కోవిదుఁడో నినుఁద్రోయు చేతులి
ప్డనఘుఁడ! శాస్త్రిఁబొందెడు సుమయ్యసుబుద్ధి! ననున్ క్షమించుమా

అడ్డుపల్కని వీణియ! యనుఁగు పారు
వంబ! నామాట వినినంత వంగు విల్ల!
తత్త్వమెఱింగించు భాగవతంబ! మిమ్ము
బట్ట నా కరములకిఁకఁ బ్రాప్తిలేద?

నాబిడ్డకన్న సుందరుఁడు లేఁడని పారిం
బూరి మోవినొక్కి నన్ ముద్దుపెట్టు

నాయన్న జగదేకనాయకుఁ డగునని
మఱిమఱీ నన్ దన యురముఁజేర్చు

నాయయ్య చదువులోనం బ్రోడయని పలు
మఱు చెంతఁజేర్చి నాకురులు దువ్వు

నాతండ్రి శాశ్వతఖ్యాతి నొందు నటంచు
నన్నుఁ గన్నపుడెల్ల మిన్నుముట్టు

అట్టి ననుఁగన్నతల్లి నాయాపద విని
యెట్లు భరియింపగల్గు? నింకెట్లు బ్రతుకు?

హరహరా! సర్వలోకేశ! పరమసాధ్వి
నిట్లు కుందింప నను సృజియించినావ?[20]

ఆర్తిలో నున్న సారంగధరుని మాటలలో ఒక క్రమమున్నది. మొదట తాను నిర్దోషియైనను తనకు ఈ దుర్గతి పట్టెననియు, తరువాత తన ప్రాణసఖుడైన సుబుద్ధి చెప్పు మంచిమాటలను వినక అతనిని త్రోసిపోయిన దోషమునకు తన చేతులకు ఈ శాస్తి జరుగుచున్నదనియు, తరువాత వీణెను, పారువమును, ధనుస్సును, భాగవత గ్రంథమును తన చేతులలో పట్టుకొను ప్రాప్తమిక లేదనియు, తరువాత తన కన్నతల్లి ప్రేమ గుర్తుకు వచ్చి, ఆ పరమసాధ్విని బాధపెట్టుటకు తన్ను సర్వలోకేశుడు సృష్టించెననియు బాధపడినాడు.

దాసుగారు స్వభావసిద్ధముగా కరుణాహృదయులు.[21] కరుణరస పోషణావకాశము వచ్చినచో పోషించుటలో అశ్రద్ధ చేయుదురా?

హాస్యరసము :

నాట్యశాస్త్రమునుండి రసముల పట్టికలో హాస్యము వల్లింపబడుచున్నను, పూర్వగ్రంథములందు హాస్యము హాస్యముపాలే యైనదనియనక తప్పదు. లక్షణ రక్షణమున్నంత హాస్యమునకు లక్ష్యశిక్షణము లేదు. శ్రవ్యకావ్యము లందు సరిగా వినబడదు. దృశ్యకావ్యములందు మాత్రము నామమాత్రముగా విదూషక పాత్ర యందు భయభోజనములతో బ్రతికినది.

ఈ సందర్భములో హాస్యరసమును గూర్చి శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి వాక్యములు జోక్యము చేసికొనదగినవి -

'మన సారస్వతంలో మొన్నమొన్నటి వరకు హాస్యమనేది ఆనుషంగికంగా సాగుతూవచ్చిందేకాని, ఆధికారిక రసం కాలేక పోయింది. శృంగార రసానికి

20. సారంగధర – పు॥లు 94, 95–
దాసుగారి వ్యక్తిత్వమే యిట తొంగిచూచినది.
21. దయ అను అర్థమున నున్న 'కరుణ' అను శబ్దము ఆకారాంతము, స్త్రీలింగము (కరుణా), రసపరమైన 'కరుణ' అను శబ్దము అకారాంతము పుంలింగము (కరుణః)

వెనుక ఉండి చెంగు పట్టుకొని నాటకరంగంలో మధ్యమధ్య నడవడం తప్ప, హాస్య రసం స్వతంత్ర విహారం చేసింది లేదు. ఇటు భారతీయ వాఙ్మయమూ, అటు పడమటి రచయితల పోకడలూ ఆకళించుకొన్న కొందరు మేధావులు, హాస్యరసానికి దాస్య విముక్తి కలిగించి స్వతంత్ర ప్రతిపత్తిని ప్రసాదించారు."[22]

కథాకథనము ప్రధానముగా వ్యక్తినిష్ఠము. కథకునకు సమయోచిత ప్రజ్ఞా ప్రదర్శనము ఉండవలసిన ప్రాథమిక లక్షణము. ఈ ప్రజ్ఞాప్రదర్శనమునకు తక్కినవాని విషయ మెట్లున్నను ప్రాస్తావిక పద్యములు, ఛలోక్తులు, చమత్కారములు, హాస్యప్రసంగములు, పిట్టకథలు వాగ్రూపమైన సామగ్రి. ఈ సామగ్రి దాసుగారికి అపారము అనుటకు లోకము ఆయనకు ఆరతి పట్టుటే తిరుగు లేని సాక్ష్యము. కాని ఈ విషయము వ్యక్తినిష్ఠము.

దాసుగారి హాస్యము గ్రంథనిష్ఠమై యెంత యున్నదని గ్రంథములవైపు దృష్టి ప్రసరించినచో, దాసుగారు హాస్యరసప్రధానముగా సూటిగా వ్రాసిన గ్రంథము దంభపుర ప్రహసనము. అది లభింపలేదు. ఇక వారు సూటిగా హాస్య రసమునకు ఆలంబనముగా చిత్రించిన పాత్ర సారంగధరనాటక మందలి విదూషకుడు. ఈ విదూషకునకు వారు పెట్టినపేరు 'గిలిగింత' ఈ గిలిగింత యను నామకరణమే దాసుగారి హాస్యదృష్టికి తార్కాణము. ఈ గిలిగింత పెట్టిన రెండు గిలిగింతలు —

సారంగధరుని పావురము చిత్రాంగి మేడపై వ్రాల, ఆ పావురమును తీసికొనిరమ్మని సారంగధరుడు గిలిగింతను పంప, గిలిగింతకు చిత్రాంగి మేడయొద్ద చిత్రాంగి దాసియైన అంటింత ఎదురగును. అపుడు జరిగిన గిలిగింత అంటింతల హాస్యసంభాషణము-

అంటింత : (ప్రవేశించి) ఓరీ! ఓసీ! గిలిగింతగారూ! చాలా దినములకు నీరాక. నీవు నా మగఁడవైనచో నిన్ను నాపైఁటలో నిముడ్చుకొని దాఁచుకొనక పోదునా? యీ మామిడిపండ్లు కావలెనా?

గిలిగింత : కోఁతపండ్లుకావు. తట్టపండ్లునుం గావు. నీ- యీ రాలుగాయలు నాకెందుకు?

22. మధునాపంతుల సాహిత్య వ్యాసాలు- పు. 86

అంటింత : నిజమైన మగవాఁడవైనచో మరెంత గోటు చేయుదువో?

గిలిగింత : చేయుదునో, మానుదునో, రాలుగాయలం బండించకపోవుదునా? రసము పిండించకపోవుదునా? నీ బలు పెండించకపోవుదునా?[23]

ఈ సంభాషణమునందలి హాస్యము సహృదయైకవేద్యమే కదా. మామిడి పండ్లు హాస్యమును పోషించుటకు రంగస్థల మెక్కినవే కదా. 'రాలుగాయలు' ప్రాత సాహిత్యములో దొరకనివి.

మరియొక ఉదాహరణము-సారంగధరుని తండ్రి యగు రాజరాజనరేంద్రుడు పేటకు వెళ్లి తిరిగి వచ్చుచు గిలిగింతను చూచును. అప్పటికే చిత్రాంగి సారంగ ధరుని బలవంతముచేసి విఫలమనోరథ యగును. అప్పుడు రాజరాజనరేంద్ర ప్రభువుతో ఏమి మాటలాడవలెనో తెలియక మాటాడుచున్న గిలిగింత పలుకులు-

గిలిగింత : గిలిగింతా, వలవంతా, అంటింతా, ఎంట్రింతా, ఎకిరింత, చికిలింత, బాలెంత, చూలింత, కుకిణీబొంత, చింత మంచిపేర్లే. ఓహో! ఏలినవారు కనులపండువుగా విచ్చేసిరి. ఎన్ని సొట్టనక్కల పేఁటాడినారు? మరెన్ని గుడ్డికొంగలకు వలవైచినారు? ఇంకెన్ని చచ్చుతొండల కురిపన్నినారు? మరియునెన్ని యడవి దోమలంజంపి తెచ్చినారు? తమ పేఁటవైభవ మొకసారి పెలవిండు. వివేక సింహముం బట్టిరా లేదా? [24]

ఈ గిలిగింత మాటలలో మొదట తొట్రుపాటు, తరువాత ముఖ్యమైన విషయమును దాచుకొనలేక 'వివేకసింహముం బట్టిరా లేదా!' అని యనుటయు హాస్యధోరణిలో నున్నది.

రుక్మిణీకల్యాణకథలో రుక్మిణిని కృష్ణుడు తన యింటికి తీసికొనివచ్చినపుడు భర్తగదిలోనికి రుక్మిణిని పంపుచు సుభద్ర రుక్మిణిని 'గేలిచేసిన కీలుపట్టైను మాటలు'-

ప॥ వదినె! యెంతటివె ముద్దరాలవె-శా
బాసు-మోహముఁదెల్పఁ జాలవె! ॥వ

23. సారంగధర పు॥లు 26, 27
24. సారంగధర – పు॥లు 56, 57

అ। గదిమెదేల? తోటికాంతల సిగ్గైన
గరితవు-నాయన్నన్ గడు నలయించకు ।వ

1. పదంపడి పసినాటనుండియు వలచినావు సరోజలోచను
అదునెఱిగిరమ్మని రాయబార మంపుకొన్న వగల
వంకాయ ।వ

2. వెన్నదినెడుగాన కృష్ణుడు మెత్తన
కన్నెరో! నీ రాచకఠినతఁ జూపకు
పిన్నాడబిడ్డకుఁ బ్రియముగ గదిఁజారు
చిన్న మేనల్లుని శీఘ్రమె కనవలె

3. పన్నెదేలా గడుసుమాటల? వన్నెలాఁడిరో రాత్రిమించె
వెన్నునకుం సేవలంజేయుము-వెళ్లివచ్చెద రాము మరల [25] ।వ

ఇందలి మృదుహాస్యము పల్లవి యందలి ప్రతిపదముః అనుపల్లవి యందలి 'తోటికాంతల సిగ్గయిన గరితవు'; చరణము లందలి 'అదునెఱిగి రమ్మని రాయబార మంపుకొన్న వగలవంకాయ.', 'పన్నెదేలా గడుసుమాటల' అను పంక్తులు వ్యక్తము చేయగా, తక్కిన పంక్తులు ఈ హాస్యమునకు భళాభళి యనుచున్నవి. అన్నియు నొకయెత్తు 'వగలవంకాయ' యొక ఎత్తు.

భీష్మచరిత్ర హరికథలో వెనుక ఆడుదియైన శిఖండి భీష్మునితో యుద్ధము చేయుటకై అర్జునుని రథమెక్క, అపుడు 'వింతనవ్వున' భీష్ముడు శిఖండితో ననుచున్న మాటలు —

ప। మగవాడవైతివా? మగువ! యిప్పుడు నీవ
తగిలి నన్ను జయింపఁ దగనోచినావ ।మ

అ। ఎగచుమా బాణములు-నేమాను దొడుగఁజుమ
నగరె నీతోఁబోర-నాసాటివారెల్ల ।మ

25. రుక్మిణీకల్యాణము - పు॥లు 40, 41

1. నాఁడు భార్గవు ప్రాపునన్ మోసపోతివా?
నేఁడు పార్థుని దాపు నీకోర్కె నొడఁగూర్చు [26] ।మ

ఈ పల్కులు ఎగతాళి పలుకులు. 'మగువా! ఇప్పుడు నన్ను జయింప మగవాడవైతివా? నేను బాణములు మారుపేయను. నేడు నీకోరిక పార్థుని దాపున తీరును. నీవు నోచినావు' అను మాటలు హేళనాత్మకములైన హాస్యపు పలుకులు.

అంబరీషచరిత్ర హరికథలో దుర్వాసుని సుదర్శనచక్రము వెంబడింప, అతడు కైలాసమున కేగి పరమేశ్వరుని శరణము వేడ, పరమేశ్వరుడు తాను అశక్తుడనవియు, తాను వెనుక విష్ణుమాయచే పరాభవము నెందిన విషయము చెప్పు సందర్భములోని శివకేశవుల హాస్యసంభాషణము-

1. వినుము తొల్లి నాకడకు శ్రీవిభుం డొకనాఁడు రాఁగ
వినుతి చేసి యిట్లంటి నాస్థైర్యవిభవము చూపఁగ బాగ

2. ఆఁడుదానవై యల్లనాఁడు నీ వసురుల వలపించుగతి
నేఁడు నీప్రజ్ఞ చూపి నన్ భ్రమ పెట్టగలవె? శ్రీపతి!

3. అనుచు గర్వపడ మీసముందువ్వి హాస్యముగా నేఁబల్క
వనజాక్షుడు నాతో నిట్లనియెం బలుమరు చిఱునవ్వొల్క

కామము ద్రెంచినావు-మరి కంఠములో విషముంచినావు-బ
ల్పాపముల దాల్చినావు-సులభంబుగ మృత్యువు గెల్చినావు-దు
ర్భూమి వసించినా-వహహా-పుఱ్ఱెను జేతధరించినావు-నిన్
జామ భ్రమింపసేయుటెటు? స్థాణుడ! నిర్జిత పంచబాణుడా?

సగము మగవాడ! నీవు మీసమ్ముదువ్వి
నన్ను నెగతాళిసేయు మెంతయునునవ్వి

26. భీష్మచరిత్రము - పు॥లు 28, 29

ఎంతవాడను నిన్ను భ్రమింపజేయ?
దిస్సమొలవేల్పు! సెలవిమ్ము తిరిగివత్తు[27]

ఇవి హాస్యపు పలుకులు. గంగాధరుడు విష్ణునితో 'నీవు వెనుక ఆడుదానవై రాక్షసులను భ్రమపెట్టినట్లుగా నన్ను భ్రమపెట్టగలవా?' అని సవాలుచేయగా, విష్ణుడు హాస్యగర్భితముగా అతని గొప్పలు చెప్పి, 'నిన్ను భ్రమింపజేయగా నేనెంతవాడను?' అని సమాధాన మిచ్చును. ఈ విష్ణుని సమాధానము హేళనాత్మకము. తరువాత విష్ణువు మాయా భామవేషముతో వచ్చి శివుని పరాభవించును. 'దిస్సమొల వేల్పు! సెలవిమ్ము తిరిగివత్తు' అను పాదములో 'మరల వచ్చెదను. నీ గుద్దల నూడదీయించి నీ గర్వమును రూపుమాపెదను' అను వ్యంగ్య మున్నది.

రౌద్రరసము :

ప్రహ్లాదచరిత్ర హరికథలో తన తమ్ముడైన హిరణ్యాక్షుని సంహరించిన విష్ణుని సర్వేశ్వరుడని తన పుత్రుడైన ప్రహ్లాదుడు వాదించుచుండ, క్రోధముతో హిరణ్యకశిపుడు మండిపడినవిధము-

ప॥ వెరువవదేలరా తులువా నీకేది దిక్కు నాగ్రమోల ॥వె
అ॥ తరమా నాయాజ్ఞందాట సరిగా ముల్లోకములందైన ॥వె
చ॥ మెరయలేడు మిక్కిలి రవి మింట, వి
సరగబోదు కరువలి వడితోడన్
చురకదగ్గి మిగుల, జముడు ప్రాణుల
బొరిగొనండు నా సెలవు దప్పి
1. చెడుగా విష్ణుండే పీకుడని చెప్పెదా నీ నార్నాప్పిగా
వెడగా యటువంటివాడేనివాడు వేల్పుల నేజంపనెటుపోయె
కడుసిన్నితోడి బాలకులకు మోక్షమందాసబుట్టించి విష్ణుని బొ
గడి కులాచారముల్ జెరచు నిన్నుగడు దురాత్ముఁ జంప
బుణ్యమగు[28]

27. అంబరీషచరిత్రము – పు. 19
28. ప్రహ్లాదచరిత్రము పు. 26

తులువా! నాయాజ్ఞను పాటింపకపోయినచో ఈ మూడులోకాలలో నీకు దిక్కెవ్వడిరా? నా అనుమతిలేక సూర్యుడు వేడి నెక్కువ చూపలేడు. గాలి వేగముగా వీచదు. అగ్ని మిక్కిలి కాలదు. యముడు ప్రాణులను కొనడు. నీ నోరు నొప్పిపుట్టునట్లు విష్ణుడే వీరుడని చెప్పెదవేలరా? వాడంతటి వీరుడైన నేను దేవతలను చంపునపుడు ఎక్కడకు పోయె? మోక్షమని ఆశపుట్టించి తోటిబాలురకు కూడ విష్ణుభక్తి ప్రచారము చేయుచున్నావు. కులాచారములను పాడుచేయు నిన్ను చంపుటయే పుణ్యము- అను హిరణ్యకశిపుని క్రోధపూరిత మగు పలుకులలో నున్నది రౌద్రరసము.

మార్కండేయచరిత్ర హరికథలో, బాలమార్కండేయుని ప్రాణములు తీసి కొని పోవుటకు వచ్చిన యమ భటులు, అతని దరిచేరలేక, ఆ విషయమును యమునితో చెప్ప, ప్రళయానలమువలె రౌద్రాకారుడై యముడు, తపము చేయు చున్న మార్కండేయుని చెంతకు వచ్చి క్రోధముతో ననుచున్న మాటలు-

ప। ఔర కన్నుగానక నాయాజ్ఞ మీరితివా ।ఔ

అ। ఏరీ నీదిక్కు వచ్చు వారిపు ।ఔర

చ। సారసభవాండమందు నాదు శాసనముం ద్రిప్పఁజాలువార లె వ్వారు గానరాదు నీవనఁ దృణప్రాయముగద చూడు నా తమాస ॥ఔ

1. ఇంద్రునైనఁ బెకలింతు నా యు
పేంద్రునైనఁ గబళింతు చంద్రసూర్యాది గ్రహములుంగూడ
శాసింపఁబడు నావలన ని
స్తంద్రుఁడనై జగమునందుఁ దిరిగెద
సాంద్ర యశోనిధి న్గాలుండ[29] ॥నారౌర

ఔరా! బాలకా! కన్నుగానక నాయాజ్ఞ మీరితివా? ఇపుడు నీకు దిక్కెవరురా? బ్రహ్మాండమందు నాయాజ్ఞను దాటగలవార లెవ్వరు లేరు. ఇక నీవా తిరస్కరించు నది. నీవు నాకు గడ్డిపోచవంటివాడవు. ఇంద్రుని పెకలింతును. ఉపేంద్రుని

---

29. మార్కండేయ చరిత్రము, పు॥ లు 42, 43

కబళింతును. చంద్రసూర్యాది గ్రహములు నాచే శాసింపబడుచున్నవి. ఎదురులేక లోకములో తిరుగు కాలుడనురా. ఔరౌరా! నా యాజ్ఞను మీరితివా?- అని యొడలు తెలియని క్రోధములో యముడు పలుకుచున్న ఈ ఘట్టము రౌద్రరసము పోషింప బడిన ఒక ఘట్టము.

అంబరీషచరిత్ర హరికథలో చక్రానలజ్వాలలకు భయపడి దుర్వాసుడు మహేంద్రుని శరణువేడ, మహేంద్రుడు తాను అశక్తుడనని తెల్పుచు, వెనుక తాను పొరపడి కృష్ణునకు అపరాధము చేసిన వృత్తాంతమును వివరించును. ఆ వృత్తాంతములో శ్రీకృష్ణుడు తానే భగవంతుడనని గోపబాలకులకు చెప్పి, ఇంద్రునకై యాగములు చేయుట అనవసరమని బోధింప, ఇంద్రునకు కోపము వచ్చి మేఘములను పిలిపించి, వానితో అనుచున్నమాటలు -

ప॥ అహాహా యెంత విపరీతము నా గొల్లడొనర్చె ॥అ

అ॥ మహిలోపల నాయాగము మాన్పి కాఋలార్చె ॥అ

ఖి॥ గహనంబుల పశువులుం గడునర్చింపఁదగిన వఁట
ఇహీహీ త్రిభువనేశ్వరుఁడ నేఁదనపూజకుఁ దగనఁట ॥య

1. కర్మమే దైవమనుచు జ్ఞానము బోధించెన్
దుర్మదమున నన్ను మహేంద్రుని తృణీకరించెన్
పేర్మిశ్రుతి స్మృతి చోదిత విధులెల్లన్ వ్యర్థములఁట
ధర్మమె గోరక్షణమఁట తన మాటలె వేదములఁట ॥య

భళిర యాడింభ నాస్తికు పల్కు- నమ్మి
యాదవులు నన్ను మఱచిరి యవనిలోనఁ
గాపునన్ మీరు దబ్బునఁ గడు ప్రళయముఁ
బెంచి వారల కొంపలు ముంచిరండు[30]

ఆహాహా! ఆ గొల్లడు (శ్రీకృష్ణుడు) ఎంత విపరీత మొనర్చెను? నేను పూజకు తగనట. యాగములు మాన్పించి పాడుకూతలు కూయుచున్నాడు. కర్మమే దైవ

30. అంబరీషచరిత్రము - పు. 13

మని మహేంద్రుడనైన నన్ను గూడ తృణీకరించెను. గోరక్షణమే ధర్మమట. తన మాటలే వేదములట. తక్కినవన్ని వ్యర్థములట. ఓ మేఘరాజములారా! ఆ డింభ నాస్తికుని మాట నమ్మి యాదవులు నన్ను లెక్కచేయకున్నారు. మీరు వెంటనే ప్రళయము సృష్టించి ఆ గొల్లపల్లెను ముంచివేయుడు - అను ఇంద్రుని అవమానజనిత క్రోధపూర్వక ప్రతీకారవచనములుగల ఈ ఘట్టము ఒక రౌద్రరస ఘట్టము.

హరిశ్చంద్రోపాఖ్యాన హరికథలో హరిశ్చంద్రుడు విశ్వామిత్రునిచే సృజింపబడ్డ మాలగరితలు హరిశ్చంద్రుని రతిక్రీడలకు పురిగొల్ప, హరిశ్చంద్రుడు తిరస్కరించును. అపుడా మాలెతలు ఏడ్చుచుండ, 'ప్రళయాగ్ని విధమున రౌద్రమూర్తియై కౌశికుడు వచ్చి హరిశ్చంద్రునిపై మండిపడుచున్న ఘట్టము -

ప। ఔరౌర! క్రూరరాజాధమా!
నా యాశ్రమంబులోన నీకీ యల్లరేమిరా।ఔ
అ। ఏరకే నన్గానక నా పెంపుడు లేడి
నెంతయు నెదిరించి బెదిరించినదికాక ।యూ

1. వేటాడి యపవిత్రంపు భటులతో
గోటున నా యజ్ఞవాటమున విహరించె ।దా
2. నాకుఁ దెలుపఁబోక నాముద్దుకన్నెలఁ
జీకాకుపరచి శిక్షించినావే ।పూ

వీరి నేడ్పింపనేల - ఇవ్వారి నాదు
కన్నుఁగవకన్న నెక్కుడు కాఁగఁజూచు
కొందు నా ముద్దుకూతులఁ గొట్టితేమొ
పల్కుమా వేగ మత్కోపభాజనమ్మ![31]

ఔరౌరా! ఓరీ! క్రూరరాజాధమా! నా ఆశ్రమములో ఈ అల్లరేమిరా, నా పెంపుడులేడిని బెదిరించినావు. అపవిత్రులైన భటులతో నా యజ్ఞవాటమున

31. హరిశ్చంద్రోపాఖ్యానము, పు. 23

తిరుగుచున్నావు. నాకు తెలుపకుండ నా ముద్దుకన్నెలను ఏడ్పించినావు. కొట్టినావు. ఈ చేష్టలన్నియు ఏమిటికిరా? వేగమే పల్కుము – అని గద్దించు విశ్వామిత్రుని పల్కులు గల ఈ ఘట్టము ఒక రౌద్రరసఘట్టము.

భీష్మచరిత్ర హరికథలో అంబా నిమిత్తమై జరుగు యుద్ధమున, జామదగ్ని తన మాటవినక, తనతో యుద్ధమునకు తలపడ్డ శిష్యుడైన భీష్మునితో 'పటపట పండ్లు కొరుకుచు' నిప్పులు గ్రక్కుచున్న ఘట్టము–

ప॥ నిన్నటి జయమున కుబ్బి గర్వించు నీపని పట్టెద నేఁడు ॥ని

అ॥ పిన్న పెద్ద తారతమ్య మెఱుఁగవ పీచమడంచెదఁ జూడు ॥ని

1. కండక్రొవ్వు మెండు నీకుఁగలదని కన్నుగానవు కుమారా
కొండ యెంత వజ్రమెంత తెలియవు కొంచెమైన నారార ॥ని

మొన్నటివాఁడవు తెలిసిన
తెన్నునఁ బెద్దల నెదిర్చి తెగ నగ్గెదు నీ
కన్నమ్మ కడుపు చల్లగ
నున్నేనియు బ్రతికెదేమొ యోరీ కుఱ్ఱా!

ధర్మమనంగ సత్కర్మమ్ము, పెద్దల
వర్తనమున దాని భంగితోఁచు
నీతిగల్గిన సర్వభూతహితంబగు
బ్రహ్మఋషులతోడ వాదు తగదు
లతకుఁ బందిరిమాడ్కి రమణికి మగనిని
జతగూర్పఁదలఁచుట జడ్డితనమ?
పిల్లను గ్రుడ్డు తా వెక్కిరించిన యట్లు
గురునకు శిష్యుండు గఱపెఁ దగవు

యౌవన మదంబునం దగరాడనిమ్ము
కొమ్ములందాకి ఛీకొని కొండమీఁద

సహజశత్రువు నాకు నీ క్షత్రజాతి
కనుక నిన్ ద్రుంతుఁ జెల్లినఁ గాచుకొనుము[32]

ఓరీ! కుఱ్ఱా! నిన్నటి తాత్కాలిక జయమునకు ఉబ్బి గర్వించు చీపనిపట్టెదను. పిన్న పెద్ద తారతమ్య మెరుగక, కండక్రొవ్వు కలదని కన్నుగానకున్నావు కొండ శక్తివ్రజశక్తి కొంచెమైన తెలియకున్నావు. నిన్నమొన్నటి వాడవు. తెలిసినవాని వలె పెద్దల నెదిరించుచున్నావు. నీ కన్నతల్లి కడుపు చల్లనిదైన బ్రతికెదవేమో. మాబోటి పెద్దల వర్తనము వలన ధర్మమన నేమియో తెలియును. మాబోటి బ్రహ్మర్షులతో వాదుతగదు. రమణిని మగనితో చేర్చుట మూర్ఖత్వమా? సిల్లను గ్రుడ్డు వెక్కిరించునట్లు గురువునకు నాకు శిష్యుడవైన నీవు న్యాయము తెల్పెదవు. మదమున పొట్టేలు కొమ్ములతో కొండను ఢీకొనునట్లున్నది నీ పద్ధతి. నీ క్షత్ర జాతి నాకు సహజశత్రువు. కనుక నిన్ను చంపెదను. శక్తియున్న కాచుకొనుము అను పరశురాముని పల్కులు గల ఈ ఘట్టము ఒక రౌద్రరసఘట్టము.

వీరరసము :

ఉత్సాహాత్మకమైన ఈ వీరరసము ఉత్తమప్రకృతికము. ఈ వీరరసము దానవీరము, ధర్మవీరము, యుద్ధవీరము, దయావీరము అని ప్రధానముగా నాలుగు విధములు. 'సచ దానధర్మయుద్ధైర్దయయాచ సమన్వితశ్చతుర్ధాస్యాత్'[33]

భీష్మచరిత్ర హరికథలో, భీష్ముని జయించుట అసాధ్యమన్ని, కౌంతేయులు కృష్ణసహితులై చాటుగా రాత్రిసమయమున భీష్ముని చెంతకేగి, తమకు విజయము కల్గునట్టి మార్గము' చెప్పుమన, గాంగేయుడు తన్ను వధించు నుపాయమును చెప్పిన ఘట్టమొక దానవీరరసఘట్టము (పు. 27)

పితృకార్యసిద్ధికై తన సకల శక్తులను ధారవోయుట పుత్రుని విధి అని చాటి చెప్పినవాడు గాంగేయుడు. పితృసౌఖ్యమునకై రాజ్యమును, వివాహమును కాల దన్నిన దేవవ్రతుడు, భీష్మచరిత్ర హరికథలో శపథము చేసినభీష్ముడైన ఘట్టము ఒక ధర్మవీర ఘట్టము.

---

32. భీష్మచరిత్రము, పు॥లు 18, 19
33. సాహిత్యదర్పణః-తృతీయః-పరిచ్ఛేదః - శ్లో॥ 234

ప॥ నేనొల్లనిఁక రాజ్యభోగము నీ మనుమలే యేలనీ

అ॥ భూనాథుండు నీ కొమార్తెయు మోదపార్ణిధిఁదేలనీ ॥నే

1. బ్రతుకు వరకున్ బ్రహ్మచర్యవ్రతమునేఁ గావించెదన్
హితముగా నా కన్నతండ్రికి ఋణము తీర్చి తరించెదన్ ॥నే

తనయుఁడు కల్గినాఁడని మదంబునఁ బొంగెడు తల్లిదండ్రులన్
మనమునఁ గుందనీక కడు మన్ననతోఁడుత వారియాజ్ఞ చొ
ప్పునఁ జరియించు చుంట విధి పుత్రునకుం బితృకార్యసిద్ధికై
కనుకఁ బ్రతిజ్ఞ నీ విధముగా నొనరించితి ధీవరోత్తమా!

రాలనీ చుక్కలు కూలనీ కులగిరు
లిలఁ గ్రుంకనీ వార్ధులింకిపోని

ఆకస్మికముగ సూర్యాచంద్రముల్ గతుల్
దప్పనీ జగమెల్ల తల్లడిలని

పిడుగులు గురియనీ పెటిల్బ్రహ్మాండముల్
పేలాల పోలికం బేలిపడని

ప్రళయము పెట్టనీ భైరవుఁడు త్రిశూల
ధారుఁడై ఫాలనేత్రము తెరువని

యేఁడయెల్లైనఁగాని యొక్కింతయైన
నాప్రతిన తప్పిపోవదు నమ్మవలయు
అఖిల పావని నాతల్లి యయ్యోనేని
ధర్మమెప్పుడు నాతండ్రి తప్పఁడేని[34]

ఈ ఘట్టము నం॥లి 'హితముగా నాకన్నతండ్రికి ఋణము తీర్చితరించెదన్, వారి యాజ్ఞచొప్పునఁ జరియించుచుంట విధిపుత్రునకున్' అను భీష్మునిమాటల వలన, ఇందు పోషింపబడిన రసము ధర్మవీరము. 'రాలనీ చుక్కలు కూలనీ

34. భీష్మచరిత్రము – పు॥ లు 9, 10

కుల గిరులు....' అను సీసపద్యమున దాసుగారు భీష్ముని స్థిరసంకల్పమును సంగీతాత్మకముగా చదువుటకు అనువైనశైలిలో వెల్లడించినారు.

భీష్ముడు తన తమ్మునికొరకై రాజులనందరిని జయించి కాశీరాజపుత్రికలను మువ్వురను రథముపై నెక్కించుకొని తీసికొనివచ్చుట ఒక యుద్ధ వీరరస ఘట్టము.

ప। వీరులున్న నెవ్వరైన వీరల విడిపించుకొండు ॥వీ
అ। పోరిలోన మీకుఁగల్గు భుజాబలము చూపరండు ॥వీ
1. తమ్మునకుఁ బెండ్లి సేయఁదలఁచి వీరిఁగ్రైకొంట
ఇమ్మహిలో రాక్షసోద్వాహమ్ము క్షత్రియధర్మమంట ॥వీ

అనుచుం బల్కెడు గంగసూనుపయి నానాస్త్రాళి సాళ్వాది ము
ఖ్య నృపాలుర్గురియింప వాని నడుమన్ ఖండించి భీష్ముండ నే
క నరాధీశుల చెంతయున్ విరథులన్గావించి యడ్డేమి లే
క నిరాయాసముగా స్వకీయపురి వేడ్కన్జొచ్చెఁ బ్రఖ్యాతుఁడై[35]

'వీరులున్న నెవ్వరైన వీరల విడిపించుకొండు, పోరిలోన మీకుఁ గల్గు భుజాబలము చూపరండు' అను పల్లవి యందలి పలుకులు 'సవాలు' చేయు సందర్భములో ఎదురగు తొలిపలుకులు. ఇందు పోషింపబడిన రసము యుద్ధవీరము.

సావిత్రీచరిత్ర హరికథలో సత్యవంతుని మిషగా గొని దయావీర రసమును ప్రస్ఫురించిన ఒక ఘట్టము–

అంతట సత్యవంతుడు మహాటవిలో నొక వేటపోతు న
త్యంత రయంబునన్ బెనగి వ్యాఘ్రముఖాస్యము నుండి కాచి తా
నెంతయు లేతపచ్చికల నిచ్చికి నేపి భయంబువాపి వి
శ్రాంతి యొసంగి, బల్ కనికరంబు మెయిం దలపోసె నిట్టులన్

35. భీష్మచరిత్రము - పు. 11

ప॥ ఎందుకింత కనికారము డెందమ! నీకేమి కార్య ॥మె

అ॥ ఎందైన న్నీవునాజ్ఞ నెవరితరము తప్పింపగ ॥నెం

చ॥ అందముగా భూతంబుల కన్యోన్యం బాహారము
సందియంబులేదిది సహజంబు సృష్టిలోన గావున ॥నెం

1. నీరు నిప్పుఁ దిగఁబీల్చు నీటి నగ్గిఁ దెగగాల్చు
నారయ సరిబలములైన నవి రెండున్గలసి నిల్చు
ధారుణిలో హింసయు దయ కారము పరస్పరంబు
నూరకుండ మేల్కూడుల కున్నది దైవ మహిమా ॥యెం

ఎట్టియాకలియైనఁ జెట్టుకాయన్దుంపఁ
జెల్లవు చిప్పరైనఁ జిక్కలేవు
ఈఁగల న్బాధించి యెంతయుఁ గోర్కెయుఁ
దేనెపట్టులు తీయఁబూనుకొనవు
దవ్వులనుండి యందంబుగ పూలు గ
న్గొనుచుందువేకాని కోయఁబోవు
త్రొడరి న్నీపై వచ్చు దుష్టజంతువుఁ జంప
నొప్పవు నేర్పునఁ దప్పుకొనెదు

ఆత్మవలె నీ సమస్త చరాచరముల
నెంచి ప్రేమించు నీకు హింసించఁదగిన
వస్తువెయ్యది యింకెట్లు బ్రతుకవచ్చు
కటకటా! దయకన్నను గష్టమేది?

పెనిమిటికడ ముద్దుగునిసెడి గువ్వ స
డేల సాళువ డేగ యెగదదన్నె?
పచ్చిక జివురించి బలసిన డొంకల
కెగబాకి మేకపోతేల మేసె?

నీటిచెయొద్దున ద్రుళ్లి పాటపాడెడు కప్ప
జెట్టని పామేల పట్టెద్రించెగ?
కొండను ఢీకొను కొమ్ము విదిలించు
నేన్గును సింగ మదేల చంపె?

ఇజ్జగంబున నన్యోన్యహింసవలనఁ
బ్రబలు భూతంబు లిది స్వభావంబుగాన
కాని ప్రకృతి విలక్షణ కార్యమైన
యీశు తత్త్వము దయ నాకిదెట్లు వచ్చె?[36]

సత్యవంతుడు మహాటవిలో పులినోటబడ్డ పేటపోతును రక్షించి, ఇట్టికి లేత పచ్చికలను పెట్టి భయముపోగొట్టి, తనకు గల దయను గూర్చి ఇట్లు చర్చించుకొని నాడు-

దెందమా! ఎందుకు నీకింత కనికరము? శివుని అజ్ఞలేనిది ఏమియు జరుగదు గాదా. సృష్టిలోగల భూతంబులకు అన్యోన్య మాహారముగా భగవంతుడే కల్పించి నాడు. ఎంత ఆకలైనను చెట్టుకాయను ద్రుంపలేవు. తేనెటీగలను బాధించి తేనె పట్టులను తీయపూనుకొనవు. అందమైన పూలను దూరమందుండి చూచుచుండునే కాని కోయబోవు. నీపైకి వచ్చుచున్న దుష్టజంతువులనుండి తప్పుకొందువేకాని వానిని జంపదలపవు. సమస్త చరాచరములను ప్రేమించు నీకు హింసించదగిన వస్తువేమియు లేదే. ఇంక బ్రతుకుటెట్లు? లోకములో దయకన్న కష్టమైనది లేదుకదా. పెనిమిటి చెంత సుఖముగానున్న గువ్వను సాళువడేగ ఏల ఎగరదన్న వలెను? చిగిర్చిన లేతపచ్చికలను మేకపోతేల తినవలయును? నీటియొద్దునగల కప్పను పామేల మ్రింగవలయును? కొండను ఢీకొనగల ఏనుగును సింహమేల చంపవలయును? కాన చూడగా ఈలోకమున అన్యోన్యహింసవలన భూతములు బ్రతుకుట సృష్టిస్వభావము. కాని ప్రకృతి విలక్షణమైన ఈ దయ నాకెట్లు వచ్చెను? ఈ సత్యవంతుని అవేదనమంతయు దయావీరమే.

36. సావిత్రీచరిత్రము పు॥ లు 22, 23

భయానక రసము :

అంబరీషచరిత్ర హరికథలో దుర్వాసమహర్షి స్నానమున కేగి యెంతసేపటి కిని రాకపోగా, ద్వాదశఘడియలు దాటుచుండ, అంబరీషుడు బ్రాహ్మణానుమతమున సలిలభక్షణము సేయును. తన్ను విడిచి అంబరీషుడు పారణచేసెనను కోపముతో దుర్వాసుడు తన జటను దీసి నేలమీద కొట్టగా, ఆ జటనుండి భయంకరముగా కృత్య పుట్టును. ఆ కృత్తి ఆకార వర్ణనమొక భయానక రస ఘట్టము (పు-9)

ఈ అంబరీషచరిత్రముననే శ్రీకృష్ణుని మాటలు విని యాదవులు తన్ను ప్రార్థించుట లేదను కోపముతో ఇంద్రుడు మేఘరాజములను పిల్చి ప్రళయము సృష్టించి ఆ యాదవుల కొంపలను ముంచిరండు అని చెప్ప, అ మేఘములు పెను ప్రళయముగ యాదవుల ఘోషముపై వానకురియును. ఆ వానకు యాదవులు పొందిన భయమును వ్రాసిన ఘట్టము మరియొక భయానక రసఘట్టము.

గాఢాంధకారంబు కమ్మఁగ భయపడి
యొండొరులం బిల్చుచుండువారు
ఇండ్లకప్పులు మింటికెగరించు గాలికి
నోర్వఁజాలక భూమి నొదుగువారు
మెఱుపులతోఁ బుట్టు నేటిపిడుంగుల
మ్రోతలకున్మూర్ఛపోవువారు
ఏన్గుతొండములంతలేసి ధారలఁబడు
వానకు వడవడ వడఁకువారు

అకట యిదియేమి విపరీత మనెడువారు
ప్రళయకాలంబిదేయని తలఁచువారు
అశన నిద్రల నెఱుఁగక యడరువారు
నగుచుఁ గృష్ణుని వేడిరి యాదవు లిటు

ప॥ చిన్నికృష్ణ వేగ రారా మముఁ గన్నులెత్తి చూడవేరా ।చి

అ॥ కన్నతండ్రి నీకన్న దిక్కెవ్వారు కలరో భక్తమందార ।చి

1. ములుగుచున్నవి కొంపలెల్ల యేమూల నున్నావయో చెల్ల
ప్రళయకాలమువచ్చె ప్రాణంబులకు దెచ్చె పాడుదైవంబికే
వల్ల ।చి

2. ఉన్నసొమ్ములు పాడువారె మన యూరెల్ల చెర్వుగా మారె
అన్నన్న యింకేటి యాస మాపనితీరె నందరికి పస్తు
చేకూరె ।చి

3. ఇంతవరకు బ్రోవలేదా మమ్మిపుడు విడుచుట మర్యాదా
పంతమా మామీద బాలగోపాల నీభక్తులము కాపాడ
రాదా[37] ।చి

గాఢమైన చీకటికి భయపడి ఒకరినొకరు పిల్చుకొనువారు, ఇండ్లకప్పులను ఆకాశమున కెగిరించు గాలికి తట్టుకొనలేక భూమికి నొరుగువారు, మెరుపులతో గూడిన పిడుగుల మ్రోతలకు మూర్ఛపోవువారు, ఏనుగు తొండములంతలైన ధారలతో కురియుచున్న వానకు వణకువారు, అకట యిదియేమి విపరీతమనువారు, ప్రళయకాలమన్న నిదేయని తలచువారు, నిద్రాహారములులేక అడలువారునై కృష్ణుని గూర్చి 'ఓ కృష్ణా! నీకన్న దిక్కెవ్వరు? కొంపలు ములుగుచున్నవి. ప్రళయ కాలము వచ్చినది. ప్రాణాలమీదకు వచ్చినది. ఉన్నసొమ్ములు పోయినవి. ఊరంతయు చెరువు అయినది. అందరికి పస్తులైనవి. ఎక్కడనున్నావో! ఇంత వరకు మమ్ము కాపాడి యిపుడు విడచుట తగునా? మాపని యైనది. త్వరగా వచ్చి కాపాడుము'- అని భయాందోళనములతో ప్రార్థింతురు. ఇది భయానకరస ఘట్టము.

ఈ అంబరీషచరిత్ర హరికథలోనదే మరియొకఘట్టము. దుర్వాసుడు తన్ను సంహరింపదలచి వెంబడించుచున్న చక్రమునకు భయపడి ఎందరినో ప్రార్థించి,

37. అంబరీషచరిత్రము – పు. 14

వారు రక్షింపకపోగా తిరిగి అంబరీషుని చెంతకు వచ్చి శరణము వేడును. అంబరీషుని శరణు వేడునప్పుడు దుర్వాసుడున్న పరిస్థితి—

ప। వచ్చిపోతినే భూప నొచ్చుచున్నదే ।చ

అ। చచ్చిపోతిఁ జక్రపు మంట మచ్చికం జూడుమా కంట
పెచ్చుగ నెన్నఁడిక వెంట తెచ్చుకొన నిటువంటి తంట ।చ

1. కనులజూడవే భూప మనఁగఁ జేయవే
వనజనాభుని భక్తుఁడవని కనుగొనలేనైతి నయ్యో
తినియెద నీయెంగిలైన దిక్కుచూడవే భూప ।చ

2. పొట్టఁజీల్చుచున్నదె విడిచిపెట్ట నంచున్నదే
ఒట్టుపెట్టుకొన్ననాఁడ నొరులజోలికిఁ బోనటంచు
నెట్టన నీపాదములను పట్టు ముసలిబడుగునయ్యో ।చ

3. ఎందరి వేడితినే నేనెంత కుయ్యిడితినే
అందరు నోమందుఁడా! గోవిందుని భక్తుని దూరితెందుకు
క్రిందుమీఁదెరుఁగకటంచు నిందించి కాని కావరు[38] ।చ

ఓ అంబరీషభూపా! చక్రపుమంటకు చచ్చిపోవుచుంటిని. దయతో చూడుము. బుద్ధివచ్చినది. ఇటువంటి తప్పు ఇంకెప్పుడును చేయను. విష్ణుభక్తాగ్రేసరుడవని తెలిసికొనలేకపోయితిని. నా అహంకారము నశించినది. నీ యెంగిలైనను తినెదను. ఒట్టుపెట్టుకొనుచుంటిని. ఇక నెప్పుడు ఇతరులజోలికి పోను. నీ పాదములను పట్టుకొన్న ఈ ముసలివానిని రక్షింపుము. ఎందరిని శరణువేడితినో ఎంత ఏడ్చితినో! అందరు నీవంటి భక్తుని క్రిందుమీదెరుగక తిట్టినందుకు నన్ను నిందించిరికాని, ఎవరును రక్షింపలేదు. దయతో నన్ను రక్షింపుము— అన్న దుర్వాసుని మాటలన్నియు భయమునుండి పుట్టినవే. ఇదియొక భయానక రసఘట్టము.

38. అంబరీషచరిత్రము - పు. 27

సావిత్రీచరిత్ర హరికథలో సావిత్రి సావిత్రేయుని 'పాపపుణ్యము లన నేమి? వానికేయే ఫలములు కల్గును?' అని ప్రశ్నింప, ఆ సందర్భమున యముడు, తన భటులు దుర్మార్గులైన వారలను నరకమున ఎట్లు శిక్షింతురో వివరించిన ఘట్టము ఒక భయానకరసఘట్టము.

అలనాడు పరభామ నాశించి చూచిన
వీని పాపము కనుల్బెరుకుఁ డంచు
భర్తను మరిపించి పరునితో నవ్వెని
క్కులటకుఁ బండ్లూడగొట్టుఁడంచు
నితరకాంతన్గాఁగలించె నీ దుర్మార్గు
నగ్గి కంబంబున నదుముఁ డంచుఁ
బైకిఁ బతివ్రతవలె నటియించె నీ
పెంకె జెల్లం గోర్తవేయుఁ డంచు
పటుతరంబగు తర్జనభర్జనముల
వ్యభిచరించిన జనముకుఁబట్టి మిగుల
నాదుదూతలు నా ఘోర నరకమందుఁ
జెలఁగి తగునట్లు శిక్షలు చేయుచుంద్రు

పలురకంబుల దొంగవారలఁబట్టి కాళ్ళను జేతులన్
గులికితిట్లుచు ముక్కముక్కలు గొట్టి ముక్కుచెవుల్ హాళా
హాళిగఁగోయుచు నుప్పుకారము నద్ది య్యెరగా గాఁల్చి నూ
దులను గన్నుల గ్రుచ్చుచుందురు తోయజేక్షణ! నాభటుల్

మర్మంబెద్దియులేని మానవులకున్ బల్బాధ పుట్టించుచున్
ధర్మస్థానములోన వారి ధనమున్ వ్యర్థంబు గావించుచున్
దుర్మార్గంబున న్యాయవాది మిషనెంతో కూటసాక్ష్యంబులన్
నిర్మాణించెడు వారి నాలుకల ఖండింపింతు బాపోజులన్

పాలుచక్కెర ధాన్య ఫలములన్మాని దు
ష్టాశనులౌ మనుష్యాధములను
యంత్రవితతి నభీష్టార్థముల్ సలుపక
పశుల బాధించెడి పాతకులను
అధికారమున నంధులై వ్యర్థముగ సేవ
కులను బీడించెడి క్రూరమతుల
తమకు సంపదఁగోరి దైవతములకు జం
తువులను బలియిచ్చు దుర్జనులను
పలురకంబుల మఱియును ప్రాణిహింస
బరపు కఠినాత్ములంబట్టి విరచి కట్టి
మేని చర్మంబు లొలుచుచు మీఁద వేఁడి
చమురుఁ జల్లుచు నాభటుల్ సంతసింత్రు

తిట్టుచు తన తలిదండ్రులఁ
గొట్టుచు వారలకుఁ గూడుగుడ్డలిడక తా
పొట్ట బలియఁడిను దుష్టుని
బట్టి వడిఁ జీము నూతఁబడియఁ ద్రోయింతున్

లాతికొంపలుదీసి లంచముల్ మేయు మూ
ర్ఖులను రంపంబులఁ గోయుచుంద్రు
తగఁదీర్థదైవ నిందకుల నెల్లప్పుడు
మంచి నిప్పులఁ బొరలించుచుంద్రు
లేలి గురుద్రోహులం బలుశూలములఁ పొడి
పించి పాతరలఁ ద్రొక్కించుచుంద్రు
త్రుళ్ళి లోభులఁబట్టి నోళ్ళ మన్నుంగొట్టి
చెట్టులకున్ వ్రేలగట్టుచుంద్రు

పారిఁబారి వరకన్యాశుల్క-ములను దినెడు
కుత్సితుల డొక్క-(జీల్చి రాల్గొట్టుచుంద్రు
మరి కృతఘ్నులఁబట్టి మా నరకమందుఁ
జెలఁగి సకలశిక్షలకుఁ బాల్సేయుచుంద్రు[39]

నరకమునందు రకరకముల దుర్మార్గులకు యమభటులు వేయు ఈ శిక్షలు వినుటకే మిక్కిలి భయంకరములుగా నున్నవి. ఇది యొక భయానకరస ఘట్టము.

యథార్థరామాయణ హరికథలో విశ్వామిత్రుని వెంట రామలక్ష్మణులు అడవిలో నేగుచుండగా, ఎదురైన తాటక యొక్క భయంకరరూపము—

పదఘట్టనమునకుఁ బెదరి జంతులు పాఱఁ
బెనుహుంకృతికి దెసల్బీటదేఱ
వ్రేలాడుకొప్పున వెదురు డొంకలు చిక్కు-
వడి నేలనూడ్చు చప్పుడు నొనర్పఁ
గాళ్లకుఁదగులు వృక్షంబు లన్నియు గడ్డి
కాడలవలెఁ జాపకట్టుకొనఁగఁ
నడు గడ్డునకుమధ్య నాపాటి యీపాటి
యేళులుం గుట్టలు నిముడుచుండ
లోనికిం బైటికూర్పు పుల్గులను లాగ
నర కపాల ముక్తాభరణంబు లెసఁగ
నగ్ని కుండములట్లు రక్తాక్షు లలర
వచ్చి తాటక పిడుగులు వడగఁ బల్కె[40]

పాదముల చప్పుడునకు జంతువులు బెదరి పారిపోవుచుండ, హుంకారమునకు దిక్కులు బద్దలుకాగా, వ్రేలాడిన పెద్దకొప్పులో వెదుళ్ళపొదలు చిక్కువడి

39. సావిత్రీచరిత్రము పు॥ లు 45, 46
40. యథార్థరామాయణము - సీతాకల్యాణవిభాగము, పు. 68

నేలను ఊడ్చునట్లు చప్పుడుకాగా, కాళ్లకు అస్తుతగిలిన పెద్దపెద్ద వృక్షములు గడ్డి కాడలవలెనై చాపవలె కాగా, అంగకు అంగకు మధ్యలో అపాటి యీపాటి ఏరులు, గుట్టలు దాటుచుండగా, ఉచ్ఛ్వాసనిశ్వాసములతోపాటు జంతువులు లోనికి బైటకు తిరుగుచుండ, నరుల పుఱ్ఱెలు ముత్యాల అభరణమువలె నొప్పగా, ఎఱ్ఱని నేత్రాలు అగ్నికుండములవలె నుండ తాటక వచ్చి పిడుగులు పడినట్లు పల్కినదట. ఇది తాటకయొక్క భయంకరమైన బృహదాకారము. ఈ అకారవర్ణనము నందున్న రసము భయానకము.

బీభత్సరసము :

హరిశ్చంద్రోపాఖ్యాన హరికథలో హరిశ్చంద్రచక్రవర్తి వీరబాహుడను చండాలునకు సేవకుడై, కాటికాపరి యైన సందర్భము నందలి శ్మశాన వర్ణనము-

వెదుకునిచ్చోనలపైఁ బీనుంగు లొకచోట
నొకచోటఁ గుండల నుబుకు మంట
కటిక యొజ్జల మంత్రకర్మంబు లొకచోట
నొకచోట నత్తైనీరుడుకు తంపి
చచ్చినవాంద్రకు శకునముల్దీర్చు కా
కులొకచో నేడ్చుబందు లొకచోటఁ
బాతిన శవములఁ బైలాగు నక్క లొ
క్కెడ నొక్కచోఁ బ్రేవు లీడ్చు గ్రద్ద
లుండు ఘోరశ్మశానము దండఁజేరి
తనదు దుస్స్థితిఁ దలపోసి తలయు నూచి
వెల్లఁబడి పైకిఁజూచి నిస్పృహత నవ్వి
యీశ్వరునఁపుడతండు ప్రార్థించె నిట్లు[41]

పరమ జుగుప్సాకరములైన ఈ అంశము లన్నియు నిత్యము శ్మశానమున కన్పడునవి. ఇదియొక బీభత్సరసఘట్టము.

---

41. హరిశ్చంద్రోపాఖ్యానము - పు॥ లు 34, 35

గౌరమ్మ పెండ్లి హరికథలో గౌరమ్మ కడకు ముక్కంటి ముసలివేషముతో వచ్చి సరసము లాడును. పరమానహ్యాముగా నున్న ఆ ముదుసలి ఆకారము-

వలముగ వాచి పిల్లలుపెట్టి చీమూరు
నడుగుల నొరసి వ్రేలాడు పుచ్చె
బొడ్డుకయికి నంద్రబోనట్టు పొడవుగా
ముడుతల్రదో(గాడు పొడక పొట్ట
యెండిపోయిన లో(తు గుండియ కిరుతట్టు
సొట్టయై కదలాండు వట్టి రెట్ట
మురిగిపోయిన ముక్కు మొతీపెదవులు, పాచి
పట్టి విస్తు(గ్రమ్మ మిట్టపండ్లు
పుసులు వాజెడు మిడి(గుడ్లు బురక బొంది
యెలుకజానుగ వ్రేలిన వ్రేల్గు బెల్లు
గూనునడ్డి మొలద్దగుల్లొన్న పో(చ
గలుగు ముత్తయ విటిపాటు(డులికి పలికె[42]

పరమానహ్య జుగుప్సాకరమునైన ఈ ముదుసలి వర్ణనము నందున్నది బీభత్సరసము.

భీష్మచరిత్ర హరికథలో భీష్ముడు చేసిన యుద్ధము వలన గగ్గోలు చెందిన పాండవసైన్య పరిస్థితి-

విరిగెడు నరదము లొరిగెడి గుర్రముల్
తెగిపడు సిడములు త్రెళ్ళుకరులు
బంతులవలె ద్రుళ్ళు భటుల శిరంబులు
మొత్తంబులై యాడు మొండెములును

42. గౌరమ్మ పెండ్లి – పు. 7

ఘోడియగు శస్త్రాస్త్రములు మూలబడిన సా
రథులు మూర్ఛిల్లిన రథికవరులు
ఘన రాసులౌ మాంసఖండము లేరుల
సొబగున బారెడు శోణితంబు

గలుగు నట్టుల పాండవబలము ద్రుంచు
భీష్మవిక్రముంజూచి బీరమెడలి
యున్న నర్జును బరికించి వెన్నుఁడపుడు
తలను బంకించి యిట్లనె దాల్మి దొరగి[43]

ఈ పద్యము నందున్నది బీభత్సరసము.

యథార్థరామాయణములో కుంభకర్ణుడు చేసిన యుద్ధవర్ణనము- 'ఇట్లు కుంభకర్ణుఁ డేతెంచి యేఁడీ రాముఁడేడీ రాముఁడని సింహగర్జనలు సల్పుచు నోడు గఱచుచుఁ గపులఁ గొందఱస్త్రాల్సేతుల నల్లులమాడ్కి నేలరాయుచుఁ గొందఱ న్నెనగలవలె నమలుచుఁ గొందఱ న్వెన్నముద్దలకరణి మ్రింగుచుఁ గొందర న్దోమల లాగునఁ దోలుచుఁ గొందఱ న్బొడుమట్లు దిగబీల్చుచుఁ జెఱకు తోఁట విఱచి తిను మదపుటేనుఁగుతీరునఁ బచ్చిపుట్టలఁ గొమ్మల విదల్చుచు బలిసిన పచ్చికబయలునఁ జెలలాడు కొరపోతుటీవి వ్రైదలకుఁ దలపడిన యెల్గుబంటివిధమున నెండుపూఁతికకుప్ప న్దగిలిన కార్చిచ్చు చందమునఁ బ్రళయభైరవుని రీతి న్విజృంభింప నద్దనుజుని యుచ్ఛ్వాస నిశ్శ్వాసంబుల నవశులై చిక్కువారును, మరియును రోమకూప ద్వార ముల వెడలువారును గొండమీఁది చీమలబారుమాడ్కి నమ్మేటి రక్కసుని మేన సంచరించుచు మెలపునఁ దమ సూక్ష్మోపాధి సాహాయ్యంబున నయ్యసుర దెబ్బ తప్పించుకొనుచు నతని కనుముక్కుచెవులఁ జొచ్చి బాధించుచుఁ జచ్చుచుఁ నొచ్చు చుండ........[44]

కుంభకర్ణుని ఈ యుద్ధవర్ణన మంతయు బీభత్సమే.

---

43. భీష్మచరిత్రము – పు. 24
44. యథార్థరామాయణము - సామ్రాజ్యసిద్ధి, పు. 239

అద్భుతరసము -

సావిత్రీచరిత్ర హరికథలో అశ్వపతి మహారాజు సంతానార్థియై కులదేవతయైన సావిత్రిని గూర్చి అనశనవ్రతుడై తపమొనరింప, ఒకరాత్రి సావిత్రీదేవి ప్రత్యక్ష మగును. ప్రత్యక్షమైన సావిత్రీరూపము-

చేమంతిపూవుగ శీతాంశు గీలించి
యొప్పుగ గగనంబు కొప్పుబెట్టి
తారలన్ ముత్యాల చేరు చుక్క నమర్చి
నుదుటిపై సూర్యుడన్ బొట్టు దిద్ది
చందోయిగా మేరు మందరములఁజేర్చి
జలధితరంగముల్ వళులఁజేసి
రోమావళిన్ వనస్తోమంబు గావించి
ఘన జఘనము భూమిగా నొనర్చి
తన యధఃకాయ మఖిల పాతాళమగుచు
నశ్వపతి జ్ఞానదృష్టి యం దవతరించె
విశ్వరూపంబుతో డుత వేదమాత
పాలితాశ్రితవర్గ సువర్ణదుర్గ[45]

చంద్రుడు చేమంతిపూవుగా, ఆకాశము కొప్పుగా, నక్షత్రములు ముత్యాల చేర్పుచుక్కగా, సూర్యుడు నుదుటిబొట్టుగా, మేరు మందర పర్వతములు స్తనద్వయ ముగా, సముద్రతరంగములు వళులుగా, వనముల సమూహము రోమావళిగా, భూమి జఘనముగా, అఖిల పాతాళము అధఃకాయముగా విశ్వరూపముతో సావిత్రీ దేవి అశ్వపతి జ్ఞానదృష్టి యందు సాక్షాత్కరించెను. ఈ సాక్షాత్కారఘట్టము అద్భుతరస ఘట్టము.

ప్రహ్లాదచరిత్ర హరికథలో హిరణ్యకశిపుడు హరిచింతనామృతాస్వాదుడైన ప్రహ్లాదుని పలువిధాలుగా చంపప్రయత్నించినను, ఆ బాలుడు చెక్కుచెదరక

45. సావిత్రీచరిత్రము, పు. 12

యుండుటను జూచి, హిరణ్య కశిపుడు విస్మయమందిన ఘట్టము ఒక అద్భుతరస ఘట్టము. (పు॥ లు - 21, 22)

ఈ ప్రహ్లాదచరిత్రయందే - 'చక్రిని ఈ స్తంభమునందు చూపగలవా?' అని హిరణ్యకశిపుడు అడుగగా, 'అట్లే' యని ప్రహ్లాదుడు సమాధానమీయ, హిరణ్య కశిపుడు స్తంభమును భేదింప, నృసింహస్వామి ఆవిర్భవించిన విధము మరియొక అద్భుతరసఘట్టము.

ప॥ నర కేసరియై పొడమె నారాయణుఁడా కంబమున ॥న

అ॥ చరాచరేశుండు ప్రళయచండమార్తాండు పగిది ॥న

మి॥ సురలు పూలుకురియ నచ్చరలు నాట్యమాడఁ గిం
కరుఁడే ప్రహ్లాదుగావఁ గనక కశిపుఁ జంపి పోవ ॥న

గంభీర భీకర గర్జారవంబున
బ్రహ్మాండ భాండ కర్పరము పగుల
చటుల సటాచ్ఛటాచలన సంజాత ప్ర
చండ వాతాహతిన్ గొండలెగయ
కాలానలాభీల కీలాభజిహ్వా ప్ర
భావళిన్ జగమెల్లఁ జేవురింప
తరుణేందు భాసుర దంష్ట్రి నఖచ్ఛాయ
లలమి దిక్కులకు వెన్నెలలు గాయ
కరము లురమును శిరము సింగంబు మాడ్కి
నాభికిన్ గ్రిందిభాగము నరునిపోల్కి
నలర నరసింహరూపున నవతరించె
నాశ్రితపరాయణుండు నారాయణుండు[46]

డింభకుని మాట నిల్పుటకు భగవంతుడు స్తంభము నుండి ఉద్భవించుటయే అద్భుతవిషయము. ఆ ఉద్భవించిన భగవంతుడు నాభికి పై భాగమున సింహాకార

46. ప్రహ్లాదచరిత్రము, పు. 28

మున, నాభికి క్రిందిభాగమున నరాకారమున నుండుట మహాద్భుతవిషయము. ఇది యొక అద్భుతరసఘట్టము.

మార్కండేయచరిత్ర హరికథలో తపమునందున్న మార్కండేయుని యమ కింకరులు తీసికొనిపోవుటకు వచ్చి, ఆ బాలుని దరిచేరలేక యముని చెంతకు చేరి ఆ అద్భుతవిషయమును విన్నవించుకొనువిధము-

ప॥ అయ్యా మాతరమ్మగా దక్కుమారుని దరి జేర ॥న
అ॥ చయ్యన బట్టెదమన్న జ్వాలాజిహ్వుఁడై తోఁచు ॥న
1. ఏమిచోద్యమోకాని యే మాతని గాంచునపుడు
మా మనములు వైరముడిగి మరిగె శాంతివైరాగ్యము
॥అయ్యా
2. పంచశరాకారుఁ డతఁడు బాలసూర్యతేజుఁ డతఁ
డంచితంబుగ శివలింగము నర్చించుచునుండె నతం [47]
॥డయ్యా

బాలమార్కండేయుని తపశ్శక్తికి యమదూతలు విస్మయమందిన ఈ ఘట్టము ఒక అద్భుతరసఘట్టము.

భీష్మచరిత్ర హరికథలో భీష్ముడు తన కోరిక చొప్పున దేహత్యాగము చేయు ఘట్టము-

శ్రీకృష్ణు నప్పుడు చిత్తమందునిచి
సంయమచతురుఁడా శాంతనవుండు
ప్రాకటముగఁ బ్రాణవాయువు నూర్ధ్వ
ముఖము జేయఁగ నాత్మమూర్ధంబు వెడలి
లోకులాశ్చర్యాబ్ధిలో మున్గుచుండ
నాకసమంటె నుల్కాకార మొప్ప [48]

47. మార్కండేయ చరిత్రము, పు॥ 42
48. భీష్మచరిత్రము, పు॥ 36

మహాజ్ఞానియైన భీష్ముడు యోగశక్తితో దేహత్యాగము చేసిన ఈ ఘట్టము ఒక అద్భుతరసఘట్టము.

రుక్మిణీకల్యాణ హరికథలో శ్రీకృష్ణుని గదిలోనికి రుక్మిణిని సుభద్రాదులు పంప, గదిలోనికి ప్రవేశింపగనే శ్రీకృష్ణుడు విశ్వరూపముతో సాక్షాత్కరించును. ఆ ఘట్టము-

1. అప్పుడద్భుతముగ రుక్మిణీకాంత యక్షులు మిర్మిట్లుగొనవన్
   జప్పున మెరయగ కృష్ణునకున్ విశ్వరూపమెంతయు నొందువన్
2. వేలకొలంది శిరస్సులక్షులున్ వింతకరములుంబదముల్
   చాల వెలుంగగ జూచి మిగుల నాశ్చర్య భీతి సమ్మదముల్
3. ముప్పిరిగొన మైబుల్కరింప సమోన్మదాశ్రులు జడి గురియన్
   జప్పున సిగ్గును సంబంధ మెదన్మరచి భక్తిరస మొరియన్
4. ప్రసూనవర్షము వేల్పులు గురియింప జయనాదములు నింగిన్
   ప్రసరింప కేల్మోడ్చి సాష్టాంగపడి నుతించె నిబ్బంగిన్[49]

భార్య తన భర్తగదిలోనికి పోగా, భర్త వేలతలలతో కన్నులతో కరములతో పాదములతో కన్పడు ఈ ఘట్టమొక అద్భుతరసఘట్టము.

అంబరీషచరిత్ర హరికథలో శ్రీకృష్ణుడు యాదవులను, గోవులను రక్షించుటకై చిటికినవ్రేలిపై గోవర్ధనపర్వతమును అనాయాసముగ నెత్తుట-

ప॥ గోవర్ధనగిరి కేలనెత్తెన్ గోవిందు డంతన్
అ॥ చేవఁగనుంగొని మిక్కిలి నేనున్ సిగ్గుపడగ వింతన్ ॥గో
చ॥ ఈవైపునకు రండు మీరలందరు నించుకైన వర్షబాధ చెందరు
గోవులతోడుత తలిదండ్రులార కుఱ్ఱలార పెద్దలార యనుచున్

49. రుక్మిణీకల్యాణము, పు. 41

తనదు చేయి కామగాఁ బై ధరాధరంబున్ గుబ్బగా
ఘన వితాన మామీఁద బట్టఁగా బెనుము త్తైములాచుట్టు
చిన్నగాఁ
గొనకొని మిక్కిలి కుఱ్ఱవీఁడున్ కొండ దొడ్డదని శంకింపకుఁడీ
పనివడి నాదగు కేలల్లాడదు బ్రహ్మాండమెల్ల పైఁబడని
యని[50] ।గో

ఈ మాటలు తన్ను చక్రానలజ్వాల నుండి రక్షింపుమని వచ్చిన దుర్వాస మహర్షితో, తాను అశక్తుడనని తెల్పుచు చెప్పిన మహేంద్రునివి. బాలుడైన శ్రీకృష్ణుకు ఇంద్రుని అహంకారమును అణచుటకు, గో గోపకులను రక్షించుటకు, వ్రేలితో గోవర్ధనగిరి నెత్తుట అద్భుతవిషయము. ఇదియొక అద్భుతరసఘట్టము.

శాంతరసము :

సారంగధరనాటకమున, తానెంత ధర్మదీక్షాపరుడైనను చిత్రాంగికపట నాటకము వలన తన తండ్రి స్త్రీవ్యామోహమునకు చిక్కి తన్ను శిక్షింపనున్నాడని, తన మిత్రులైన గిలిగింత (విదూషకుడు) సుబుద్ధుల వలన తెలిసికొని, సారంగధరుడు వైరాగ్యముతో పలుకుచున్న పలుకులు-

సారం : దీనికేమి? చావున కిన్ని చావులు లేవుగదా! ఈ
పాపిష్టిలోకము విడచుటయే మేలు. సుబుద్ధీ! లెమ్ము
సర్వేశ్వరుం బాడి చిత్తశాంతిఁ జేసికొందము.

ప। ఓ పరమేశ్వరా! యో దీనమందారా!
యో దేవదేవ! నీ వెందుంటివో? ।ఓ

అ। ఈ పాపజన్మములిఁక నెత్తనీక మ
మ్మెట్లు కాపాడెదవో రక్షక! ।ఓ

1. సత్యంబు తెలియఁగఁజాలునె యొరునకు?

50. అంబరీషచరిత్రము - పు. 15

సర్వేశ! నీకుఁదక్క సత్యస్వరూప! ని
న్నరణువేఁడినాము సంసారభ్రమ మాన్చర ।ఓ

2. దిక్కులన్నింటికి దిక్కైన తండ్రీ! మా
దిక్కుఁజూచి కావరా నిక్కముగా నేము
నిన్నే కొలిచినాము నీలోన మముఁజేర్చర [51] ।ఓ

సత్యనిష్ఠను, ధర్మదీక్షను అర్థము చేసికొని గుర్తింపలేని ఈలోకమును విడుచుటయే మేలు అని నిర్ణయించుకొనిన సారంగధరుని ఈ వైరాగ్యపు పలుకులలో నున్నది శాంతరసము.

భీష్మచరిత్ర హరికథలో భీష్ముడు అంపశయ్యపై పరుండి సల్పిన పరమేశ్వర ధ్యానము-

ప। కొలిచెదను మదిఁ బుండరీకాక్షుని శుచిన హంసుని బరున్ ।కొ

అ। తెలియలేరెవ్వని మునులైన దివిజవంద్యు మహోత్తరున్

1. జగములను సృజియించె పెంచి సమయించు త్రిగుణాత్మునిన్
నిగమవేద్యునిన్ భవవైద్యుని నిత్యసత్య దయాఖనిన్ ।గొ

2. పిన్నకుం బిన్న మరి పెద్దకుఁ బెద్ద యగు పరమున్ హరిన్
వెన్నునిన్ నారాయణు నఖిల వేదమయు నే నిత్తరిన్ ।గొ

3. అగణితములగు తలలు కన్నులు నడుగులున్న సుధామయున్
సగుణ నిర్గుణ భక్తిగమ్యుని సత్యరూపుని నెంతయున్ ।గొ

4. ధరణిభారముమాన్ప దేవకితనయుఁడౌ ప్రభవిష్ణునిన్
పురుషోత్తముని సర్వజ్ఞునిఁ బుణ్యమూర్తిఁ గృష్ణునిన్ ।గొ

51. సారంగధరనాటకము - చతుర్థాంకము, పు. 73

సూర్యాత్ముని మహాత్ము సోమాత్ముఁ దార్క్ష్యాత్ము
క్షేత్రాత్ము సాంఖ్యాత్ము సిద్ధభవ్య
యోగాత్ము మోక్షాత్ము నుసు భువనాత్ముని
మాయాత్ముఁ దోయాత్ము మహిత సర్వ
వర్ణాత్ముఁ గాలాత్ముఁ బ్రథిత శేషాత్ము వే
దాత్ముని సర్వాత్ము నండజాత్ముఁ
గూర్మాత్మునిన్ ఘన క్రోడాత్మునిన్ మహా
బల నృసింహాత్ముని వామనాత్ముఁ

గొలుతుఁ గ్రోధాత్ము క్షత్రాత్మకుం ద్రికాల
ములను భోగాత్ముఁ గృష్ణాత్ము మోదమొప్పఁ
జెలఁగు కల్క్యాత్ము సూక్ష్మాత్ము శ్రీనివాసు
శంఖచక్రగదాధరు శార్ఙ్గధరుని[52]

సర్వసమర్థుడైన గాంగేయుని ఈ స్తుతియంతయు మోక్షేచ్ఛతో గూడినదే. ఇది దేవవ్రతాశ్రయమైన ఒక శాంతరస ఘట్టము.

సావిత్రీ చరిత్రమున సావిత్రి తన భర్తయైన సత్యవంతుని ఆయువు మరు నాటితో ముగియునని పతిప్రాణ రక్షణకై చేసిన దేవీస్తుతి ఘట్టమొక శాంతరస ఘట్టము. ఈ ఘట్టమున [పు. లు - 31 - 34] పతి ప్రాణరక్షణము ప్రధానాశ యము. నియమములు, ఆధ్యాత్మిక ధ్యానము, ఉపాసనము విభావములు.

మార్కండేయచరిత్ర హరికథలో చిరాయువు అగుటకు పరమేశ్వరారాధన మున మునిగిన బాలమార్కండేయుని ప్రార్థన-

ప। భీతభక్తపాలా నావెరపు మాన్పవేల
ప్రీత భూతజాలా గౌరీమనోనుకూల ।భీ

52. భీష్మచరిత్రము - పు॥ లు 30,31

1. పాలి కను దెంచు నాపలుకు లాలకించు
   కాలబాధమాన్పు నన్గరుణతోడఁ బెండు ।భీ

2. మించనీయవద్దు అరుదెంచుమా యీప్రొద్దు
   మంచికోర్కె కద్దు చెల్లించుమా నా ముద్దు భీ

   నత బృందాభయదాన! ఫాలవలపిన్యస్తోడురాట్సూన! సం
   తత సామాగమగాన! యోగిజనహృద్యన్మోక్షసంధాన! ప్రో
   ద్ధత హాలాహలపాన! రక్షితకసద్బ్రాహ్మాయణీమాన! సం
   గతకారుణ్యానదీన! శశ్వదపరోక్షజ్ఞాన। మృత్యుంజయా![53]

మార్కండేయుని ఈ తపశ్శక్తి యమదూతలను దరిచేరనీయలేదు. ఫాలాక్షుని ప్రత్యక్షము చేసికొన్నది. ప్రేతపతి అహంకారమును అణచినది. నియమనిష్ఠలతో పరమేశ్వరధ్యానముతో నిండిన ఈఘట్టము ఒక శాంతరస ఘట్టము.

ఇది నవరసతరంగిణీ గ్రంథకర్తలైన నారాయణదాసు గారి గ్రంథములలో కన్పడు నవరసపోషణమునకు మార్గసూచి.

## పాత్రపోషణము :

పాత్రలు రసమునకు ముఖ్యాలంబనములు. కవి లోకమునకు పెట్టెడి ఆనందభిక్షకు ప్రధానాధారములు. ఒక్క పాత్రనైనను లోకములో సజీవముగా నిల్పగల్గినచో కవి కృతార్థుడైనట్లే. సజీవపాత్ర నిర్మాణదక్షత సామాన్యకవులకు అందని అంశము. మహాకవులను వరించు విషయము. పాత్రనిర్మాణము బొమ్మ చెక్కినట్లు స్పష్టముగ నిర్మించుట మహాశిల్పులగు కవులకు కలము పట్టుకొనగనే కౌగలించుకొను కౌశలము.

వస్తుతత్త్వమునుబట్టి పాత్రలు ప్రధానముగా రెండురకములు. పురాణేతిహాసములలో ప్రసిద్ధములైన ప్రాతపాత్రలు. కవిచే కల్పింపబడిన క్రొత్తపాత్రలు. ఈ ప్రాత క్రొత్త పాత్రలను ప్రవేశపెట్టునపుడు కవులకు కొన్ని సాధకబాధకములు

---

53. మార్కండేయచరిత్రము – పు. 45

ఎదురగును. ప్రాతపాత్రలు సమయ పరిపాలితములు. అనగా ఈ పాత్రల జీవలక్షణ మిదివరకే లోకమున సుస్థాపితము. వీనిని తన గ్రంథమునందు కవి పునః ప్రవేశ మొనర్చునపుడు కవికి స్వేచ్ఛయుండదు. ఆ పాత్రల స్వభావలక్షణము నకు వ్యతిరేకముగా వర్ణింపరాదు. అవసరమైనచో స్థాపితమైన సహజస్వభావమును ప్రకాశవంతము చేయుటకు కల్పనలను చేసికొనవచ్చును. భాసాదులు పాటించిన పద్ధతి యిదే. అంతేకాని ప్రహ్లాదుని పితృవాక్యపరిపాలకునిగా, శ్రీరాముని పితృ విరోధిగా మార్చరాదు. కవి చేయు మార్పులు పాత్రల స్వభావములను ప్రకాశవంత ములు చేయునట్లుండ వలెనే కాని, పరమార్థభంజకములుగా నుండరాదు.

క్రొత్తపాత్రలను ప్రవేశపెట్టునపుడు కవికి ఈబాధ లేదు. ఈ క్రొత్త పాత్రలు ఇతని సొంతములు. వీని నిర్మాణ విషయమున కవికి సంపూర్ణస్వేచ్ఛ కలదు.

ప్రాత పాత్రల నిర్మాణమున క్రొత్తకవికి పాత్రచిత్రణాధికారముండదు. పాత్రపోషణాధికారము మాత్రమే యుండును. క్రొత్తపాత్రల నిర్మాణమున కవికి పాత్రపోషణాధికారమే కాదు, పాత్రచిత్రణబాధ్యత కూడ నుండునని సారాంశము.

ఇంతవరకు ఎందుకు చెప్పవలసివచ్చినదన్న - దాసుగారు చేపట్టిన పాత్ర లలో ఈ రెండురకముల పాత్ర లున్నవి. కాని ఈ రెండురకములలో క్రొత్త పాత్రలకన్న ప్రసిద్ధములైన ప్రాతపాత్రలే ఎక్కువ. ముందు ప్రాత పాత్రలను పరిశీలింతము—

దాసుగారి హరికథలలోని పాత్రలన్నియు ప్రాతగ్రంథములలో ప్రసిద్ధము లైన ప్రాతపాత్రలే. అనగా ఈ పాత్రల స్వభావములు దాసుగారు గ్రహింపక పూర్వమే స్థాపింపబడినవి. కనుక వీరి హరికథలలోని పాత్రలను పాత్రచిత్రణ దృష్టితోకాక, పాత్ర పోషణ దృష్టిలో పరిశీలింపవలసినదే.

ప్రహ్లాదచరిత్ర హరికథలో ప్రహ్లాదుడు -

ఇతరుల మనము నొప్పించఁడే కరు
ణా విశిష్టుఁడు తనకంత చెల్లియైనఁ

జోద్యమునకునయ్యెఁ జూడఁడే ధృతిశాలి
పరకాంతఁ దానెంత సరసుఁడైన

నఖిలజనంబుల కడఁకువఁ జూపునే
విజ్ఞాని తా దొరబిడ్డఁడైనఁ

దెలియనియట్లులఁ దిరుగునే తత్త్వవి
స్ఫూర్తి తా సర్వజ్ఞమూర్తియైన

వ్యసనముల కెదురుప్రక్క సత్యంపు మొక్క
అందపు తుదిమెట్టు తెలివి కాటపట్టు
జ్ఞానభాగవతాగ్రణి దానవమణి
అజునకున్ శక్తి సున్న ప్రహ్లాదు నెన్న [1]

ప్రహ్లాదునిలో గల భూతదయ, పరకాంతాపరాఙ్ముఖత్వము, విజ్ఞానము, వినయము, భగవద్భక్తి, మొదలగు భాగవతలక్షణము లన్నియు పోషింపబడినవి.

అంబరీషచరిత్రము నందలి -

స్థిరమతితోడన్ సర్వజగంబున్ శ్రీహరిమయమని యెంచున్
బరోపకారమె తనువెత్తుటకున్ ఫలంబని నిశ్చయించున్
మెలపున నాహారవిహారములన్ మితముగాఁగఁ జరియించున్
అల యంబరీషుఁ డెంతయు భాగవతాగ్రగణ్యుఁడై మించున్

అని ఉపోద్ఘాతముగా అంబరీషుని గూర్చి దాసుగారు సూటిగా అన్న పల్కులను -

ప॥ ఇఁక భోగములు చాలునే జీవేశ్వరి మన ॥ఇక

అ॥ ఇఁక భోగములు చాలు - నెందుకే వెయివేలు
ప్రకటమౌ శ్రీహరి భక్తి కడ్డులుగాన

చ॥ సకియనే నిశ్చింత నడవికిఁ జనెదనే - మునివృత్తితో నంట
సకలభూతసముండనై మరి శాశ్వతానందముం బొందెద ॥ఇక

1. ప్రహ్లాదచరిత్రము, పు. 13

1. సంసారమిదియెల్ల స్వప్నమునవలెఁ గల్ల
హంసపాదము దీని యందంతునో చెల్ల
కంసారినే నేకాంతముగొల్తునే జితేంద్రియుఁడనై
హంసస్వాధీనము సేసికొని యాత్మారాముఁడ నయ్యెద [2] ।నిక

అని అంబరీషుని నోటనే పల్కించిన మాటలను పూర్వమందున్న అంబరీషుని మూర్తికి సంప్రోక్షణమే.

భీష్ముఁడు తండ్రి పెండ్లికై తాను వివాహమును, రాజ్యమును త్యజించుట, అంబవలన తన గురుడైన పరశురామునితో యుద్ధము చేయుట, మొదలగు భారతాంశములను దాసుగారు భీష్మచరిత్ర హరికథలో పోషించినవిధము -

ప। నేనొల్లనిక రాజ్యభోగము - నీ మనుమలే యేలనీ
అ। భూనాథుండు నీకొమార్తెయు మోదవార్నిధిఁ దేలనీ ।నే
1. బ్రతుకువరకున్ బ్రహ్మచర్యవ్రతము నేఁగావించెదన్
హితముగా నాకన్న తండ్రికి ఋణముతీర్చి తరించెదన్ ।నే

అనునది దాసుగారు భీష్మునిచేత చేయించిన భీష్మమగు ప్రతిజ్ఞ. ఇట్లే తనకు తన గురువగు భార్గవునితో అంబానిమిత్తమై యుద్ధము జరుగునపుడు, భార్గవుడు మూర్ఛిల్లును. అపుడు భీష్ముడు బాధపడిన విధము -

ప। ఈఁగనైన వాలనీక నేఁగొల్చితిని నిన్నుఁ దొల్లి
అ। ఈగతి నొనరించితినా - యిప్పు డాచార్యదేవ ।ఈ
1. నిటలమునందుఁ గ్రొన్నెత్తురు నిర్ఝరంబులవలెఁబొర్లెడు
కటకట నీకిట్లుసేయఁగా వ్రాసెనా క్రూరవిధి ॥ఈ

మూర్ఛనుండి తేరుకొని జామదగ్ని తన శిష్యుని శక్తికి మెచ్చుకొనుచునే, కోపముతో చంపెద ననుచుండ -

---

2. అంబరీషచరిత్రము – పు. లు 5, 6

ప। ఏమి నేర్చున్న నీ కృపకాదా గురువర్య
అ। సామినేఁటికిఁబోరు చాలు సూర్యుఁడు గ్రుంకె

1. శరఁబుచొచ్చిన యంబ చాడీలు విని యిట్లు
చెఱపఁజూచితె నీదు శిష్యు వన్యాయముగ ।ఏ

2. పరమహానివి నీకుఁ బంతంబు తగునయ్య
దొరఁగెదన్ బ్రాణములు దుర్జయంబున కొప్ప[3] ।ఏ

అని భీష్మ డనును. ఈ యుద్ధములో భీష్ముడు గురువుకంటె పైచేయిగా నున్నను 'ఈఁగనైన వాలనీక నేఁగొల్చితిని నిన్నుఁదొల్లి, ఈగతి నొనరించితినా యిప్పుడాచార్యదేవ' అను పల్కులలో పూర్వపు శైష్యోపాధ్యాయికాస్మృతి, 'ఏమినేర్చున్న నీకృపగదా గురువర్య' అన్న పల్కులలో గురుభక్తి, 'దొరగెద న్ప్రాణములు దుర్ణయంబున కొప్ప' నను పల్కులలో ధర్మనిష్ఠ చక్కగా పోషింప బడినవి.

యథార్థరామాయణమున పుత్రకామేష్టి చేయదలచుకొన్న దశరథుని మనస్సును వివరించిన తీరు -

ప। కాలము మళ్లిన యీలు మగలేము
కలిగెదరెటు మాకు సుతు లిపుడు ।కా

అ। ఏల యీపిచ్చి యాసలో గురుశ!
ఋతువిరుద్ధమగు ఫల మెటులబ్బెడు ।కా

1. పండుగాని బీజక్షేత్రంబులు బాగుగ జతపడిన పంట
మండువేసవిన్ మంచుకురియుఁ బెట్లు?
హానివర్య! నాకో రెక్కడీరునా?

ఎండమావుల నీటినుండి యొట్టుల చల్వ
తెమ్మెర యేతెంచి తీర్చు దప్పి?

3. భీష్మచరిత్ర - పు॥ లు 9, 15, 17

కుందే లెదిరి తన కొనవాడికొమ్ముల
గ్రుచ్చి పులిన్ నేలఁగూల్చుటెట్లు?
ఫుట్టు గొడ్రాలి యొమ్ములు చేపునకువచ్చి
పసిబిడ్డ యాకలిం బాపుటెట్లు?
మట్టి విత్తున్నాట మఱి దానివలన నె
ప్పుడయిన మామిడి మొలుచు టెట్లు?

గాడినిప్పునఁ దామర కలుగుటెట్లు?
లెండమావుండు టెట్లు? లెద్దీను టెట్లు?
ముసలివారికిఁ బిల్లలు పుట్టుటెట్లు?
లాఉనూఱైన సాజంబు మాఉటెట్లు?[4]

దశరథుడు ఎంతకాలమునకు సంతతిలేక చింతచెంది, తరువాత పుత్రకామేష్టి చేయుట వాల్మీకిరామాయణము నందలి అంశము దాసుగారు ఈ ప్రసిద్ధాంశమును పోషించుటకు చేసిన పూర్వరంగ మిది. ఇంతకాలములేని సంతానము, ఈ ముసలి వయసులో పుత్రకామేష్టి చేసినను కలుగునా? అని దశరథుని సందేహము. అది అసంభవమని చెప్పుటకు అనేకములైన అసంభవములగు ఉపమానములను దశరథుడు చెప్పెను. ఇన్ని యుపమానము లిక్కడ వ్రాయుట దశరథుడు తనకు సంతానము కలుగుట అసంభవమని నిశ్చయించుకొని ఎంత బాధపడుచున్నాడో తెలుపుటకే. సంతానార్థియైన దశరథుని పాత్ర ఈ ఘట్టము వలన చక్కగా పోషింపబడినది.

ఇట్లు సంతానములేక బాధపడిన దశరథుడు సర్వ సుగుణాభిరాముడైన శ్రీరాముని విడిచియుండగలడా? పైగా నారబట్టలతో అడవికి పంపగలడా? కాని దశరథునకు ఆపరిస్థితి కైక కిచ్చిన వరముల వలన వచ్చినది. ఆ కైక కోరికను శ్రీరామునకు చెప్పలేక బాధపడును. కాని శ్రీరాముడు పితృవాక్యపరిపాలకుడై సంతోషముగా నడవి కేగును. ఈ వాల్మీకీయమైన అంశమును దాసుగారు తీర్చి దిద్దిన తీరు –

4. యథార్థరామాయణము - శ్రీరామజననము - పు॥ లు 41, 42

ప। తప్పునాడలేని నాతండ్రీ? చింతించెదేల?
యిప్పుడె నా పినతల్లి యభీష్టమ్ములఁ జెల్లింపుము ।త

1. తల్లిదండ్రులు కోరుదు రాత్మజులచేఁ తరియించుటకు
ఫలించె నాజన్మము నీపలుకు నిలుపు సాధనమై ।త

2. నిఖిలజ్ఞుఁడ వీ వెఱుఁగని నీతికలదె లోకంబున?
నఖిల జంతువులు స్వకర్మ మనుభవింపకతీరునా? ।త

దైవంబుచేత యంతయు మేలేసూచించు
దికర్చిచియంత్రం బుదీచివలెను
గానిచో( గైక నన్గానలోఁ బదునాలు
గేండ్లు మాత్రమె యుంచ నెంచుటెట్లు?
ఏలాభమబ్బునో యేను విదేశాట
నము సల్పకతన మన కులమునకు!
జననీజనకుల యాజ్ఞను నెరవేర్చెడు
భాగ్యము సుతులకుఁ బట్టుటెట్లు?

తల్లడిలనేల నీవంటి ధర్మమూర్తి?
సుధృఢసత్యవ్రతాసూన సూర్యకాంతి!
పుత్రమోహాంధకారంబుఁ బోవనూడ్చి
నాయనా! వేగ సెలవిమ్ము, పోయివత్తు [5]

'తప్పునాడలేని నాతండ్రీ! చింతించెదవేల?' అను పల్కులలో దశరథుని సత్యనిష్ఠ, 'నాతండ్రీ!' అను సంబోధనలో నేను నీకొడుకునుగానా? నేను నీమాట నెరవేర్పనా? అని అనియు, 'ఫలించె నాజన్మము నీపలుకు నిలుపు సాధనమై' అను పంక్తిలో తాను బాధపడుటలేదనియు, సంతోషపడుచుంటిననియు, 'అఖిల జంతువులు స్వకర్మ మనుభవింపకతీరునా?' అను పాదములో దశరథుని శాపము, తన శాపమును వ్యంగ్యముగా స్ఫురింపజేసెను. 'కైక పదునాలుగేండ్లు మాత్రమే

5. యథార్థ రామాయణము – శ్రీరామ పాదుకాపట్టాభిషేకము - పు. 108

క్రోరుటలో మనకులమునకు ఏలాభము కలుగనున్నదో, తల్లడిలవలదు అనుమానింపక వేగముగా సెలవిమ్ము. వోయివత్తును' అను మాటలు శ్రీరాముని ధీరోదాత్తతను చక్కగా పోషించినవి. 'సుదృఢసత్యవ్రతాసూన సూర్యకాంతి' అను సంబోధనము సందర్భౌచిత్యవంతము. 'దైవంబుచేత యంతయు మేలె సూచించు దిక్సూచియంత్రంబుదీచి వలెను' అను ఉపమానము పరమ రమణీయము.

పాతివ్రత్యమహాత్మ్యముచే యమునితో పోరాడి తన భర్తను బ్రతికించుకొన్న మహాసాధ్వి సావిత్రి. ఈమె మద్రదేశాధీశుడైన అశ్వపతి పుత్రిక. అశ్వపతికి మొదట సంతానముండదు. తరువాత సావిత్రీదేవి వరప్రసాదమున సావిత్రి పుట్టును. ఇది భారత కథ. సావిత్రీచరిత్ర హరికథలో దాసుగారు సంతానము లేక సంతాపమందుచున్న అశ్వపతి మనస్తత్త్వమును వివరించుచున్న విధము -

కొడుకు లెందరటంచుఁ గ్రొత్తవా రెవరైన
నడుగ నేనేమని నుడువువాఁడ
వడుగులు పెండ్లిండ్లు బుడుతల కొనరించు
చుట్టాల నేనెట్లు చూడఁగలను
సాలంకృతముగఁ గన్యాదానముం జేసి
యీనేను దరియింప నోచనైతి
నాకుఁగల్గిన విద్య వారాజ్యమంతయు
నెవ్వాని కిఁక నప్పగింపఁగలను
కడుపు ఫలియింపకుండిన కారణమున
నెంత యవ్వంతచేఁ గృశియించుచున్న
ప్రాణనాయిక నెటు సమాధాన పరతు
నేనుఁబున్నామనరకంబు నెట్లు గడతు[6]

భారతకథలో సంతానములేదని మాత్రమే యుండ, దాసుగారు సంతానము లేకపోవుట వలన అశ్వపతి పొందుచున్న సంతాపమును గూడ వివరించినారు. ఈ పద్యమున దాసుగారు చెప్పిన ఒక్కొక్క అంశము సంతానరహితులకు అనుదిన

6. సావిత్రీచరిత్రము పు॥ 11

ము హృదయమును చీల్చు ఒక్కొక్క వజ్రాయుధమేకదా. సంతానరహిత స్థితిలోనున్న అశ్వపతిపాత్రనీ పద్యము చక్కగా పోషించినది.

సావిత్రి సామాన్యప్రబంధనాయిక వంటిది కాదు. పతివ్రతాశిరోమణి. ఈ సావిత్రి పాత్రను దాసుగారు తీర్చిదిద్దినతీరు –

అఖిలకళాప్రౌఢి నందియు సుంతయుం
గర్వంబు దెలియని కమలగంధి
జగదేకమోహన సౌందర్యఖని యయ్యు
నద్దము చూడని ముద్దరాలు
ఒగి రాకుమారి యయ్యును భృత్యుల న్నిర
సనముచేయని శుద్ధసత్త్వమూర్తి
అతి సుకుమారాంగియయ్యు నార్తులఁజేరి
పనిఁబూని రక్షించు నెనరు కుప్ప

దానమున వేల్పుటావు సత్యమ్ము ప్రోవు
మెఱుఁగు మకుదంతి పల్కుల మేలుబంతి
శీలపుంగొట్టు ఖలులకుఁ జెంపపెట్టు
ఎలమి సావిత్రి కెనగలదే ధరిత్రి[7]

సావిత్రి లోకోత్తర సౌందర్య సౌకుమార్యములు కలదియైనను అంతకన్న సౌశీల్య సౌజన్యములు కలది అని ఈపద్యము సావిత్రీ పాత్రపోషణ బాధ్యతను సమర్థముగా నిర్వహించినది.

దాసుగారి పాత్రపోషణ సామర్థ్యమునకు ఒక మచ్చుతునక యైన ఈ పద్య మునకు డా। కొర్లపాటి శ్రీరామమూర్తిగారు చేసిన వ్యాఖ్యానము –

'ఒకింత కళాప్రౌఢి ఒదవిన ఎక్కడలేని గర్వము బలియుట పరిపాటి. అట్టిది సావిత్రి అఖిల కళాప్రౌఢి నందియును ఎంతమాత్రము గర్వము ఎరుఁగదు.

7. సావిత్రీచరిత్రము – పు. 15

అంత నిగర్వి. అది సుగుణము. కొసంత అందము కలదేని అద్దమునకు అంకితమై పోవుట అలవాటు. అట్టిది సావిత్రి జగదేకమోహనసౌందర్యఖని అయినప్పటికి అద్దము చేపట్టదు. అనఁగా మిడిసిపాటు లేదని అర్థము. సౌందర్యమునకు తగిన సౌశీల్యము అరుదైన విషయము. అందుకు సావిత్రి అపవాదము. అది మేటి గుణము. మేలి గుణము కూడ. ఏపాటి అధికారమున్నను పరిచారకులమీఁద ప్రభుత్వము చెలాయించుట నైజము. కాని రాకుమారి అయినను - అనఁగా సర్వాధికారము లున్నను - సేవకురాలను చిన్నచూపు చూడని శుద్ధసత్వమూర్తి సావిత్రి. రాజసప్రవృత్తికి విరుద్ధమైనది సత్వగుణము. అయినను సావిత్రి శుద్ధసత్వమూర్తి. అది మహాగుణము. ఒకమాదిరి సుకుమారత కలదేని ఒడలు వంగుట కష్టము. అట్టిది సావిత్రి అతి సుకుమారాంగి అయికూడ కోరి ఆర్తరక్షణముచేయు దయార్ద్రహృదయ. అంతేకాదు, దానపరాయణ, సత్యనిరత, శీలనిధానము. ఇది నారాయణదాసుగారి నాయికా వర్ణనము. నాయికా వర్ణన మనిన నఖశిఖపర్యంత ప్రత్యంగవర్ణనమయిన సముదాచారమును సంస్కరించిన వర్ణనమిది. అంతేకాదు. ఇతివృత్తమునకు తగినది. ఔచిత్యవిలసితము.[8]

నారదుఁడు కలహభోజనుడుగా ప్రాత గ్రంథాలలో ప్రసిద్ధిచెందినవాడు. ఈ అంశమును దాసుగారు మార్కండేయచరిత్ర హరికథలో గ్రహించి పోషించినారు.

మార్కండేయునకు మహేశ్వరుడు పదియారు వత్సరాల ఆయువు నొసగ, బ్రహ్మ పొరపాటున 'చిరాయుః' అని దీవించి, తరువాత తన పలుకును సత్యము చేయుటకు మార్కండేయుని తపమునకు పంపును. ఇక్కడ కలహమునకు అవకాశమున్నది. ఈ అవకాశమును గ్రహించి నారదుడు యముని కడకేగి ఉసికొల్పిన విధమిది-

ప। జముడా జనసముడా దురితచయదముడ ।జ

అ। సమయమిది నీదుశక్తిజూప జముడా

1. అరవిందసూతి యల్పాయుండగు
ధరణీసుతు నొకని దీర్ఘాయువుగ మరచి దీవించి
యిపుడు తనమాటు నెఱప నతని తపమందు నిలిపె ।జ

---

8. ఆదిభట్టనారాయణదాస సారస్వతనీరాజనము - పు 459

2. కనుక నీవు త్వరగ గౌతమీతటమునకు బోయి
యచట బాలుని మెడన్ ఘనపాశంబు దగిల్చి
నీదు శాసనమునకున్ లోబడ చేయుము జ।

మరియు విను - సర్వలోకే
శ్వరుఁడౌ చంద్రార్ధమౌళి శాసించె ధరా
సుర తనయుఁడు షోడశ వ
త్సరములు మన - బ్రహ్మ యెట్లు తప్పించునో కో!

అన విని యముఁడను - నా శా
సనమున కడ్డాచరింప శక్తులు గలరే
వనజభవుఁడు కాదా నిట
లనయనునికిఁగూడ దుస్తరంబగుఁ జుమ్మీ?

నారదుడు యముని కడకు వచ్చి కలహబీజము నాటగా, యముడు వనజభవుడేకాదు, ఆ నిటలనయనునకు కూడ నాశాసనము దాటగ శక్యమగునా? అని అహంకారముతో అనును. ఏమియు నెరుగని యముని రెచ్చగొట్టి కలహము కల్పించినాడు కదా కలహప్రియుడైన నారదుడు.

హరిశ్చంద్రుని భార్యయైన చంద్రమతి, భర్త సత్యరక్షణకై తాను గూడ కష్టముల పాలైన సహధర్మచారిణి - అను ప్రసిద్ధమైన అంశమును దాసుగారు హరిశ్చంద్రోపాఖ్యాన హరికథలో పోషించినవిధము-

'కౌశికుని అప్పును తీర్చి నిన్ను కలసికొందును. అప్పు దీర్చువరకు నాతో కష్టములపాలుకాక పుట్టింటి కేగుము' అని అన్న హరిశ్చంద్రుని మాటలకు, చంద్రమతి 'కటకటంబడి కన్నీళ్ళను గోట నెగరఁజిమ్ముచు డగ్గుత్తికతో' సమాధాన మిచ్చినతీరు -

---

9. మార్కండేయ చరిత్ర – పు. 35

ప। ఇట్టులాడితేమిరా నిన్నెడబాసి నే నిముసమోర్వగలనా ।ఇ

అ। నట్టడివినైన నీతోడ నున్న నాకేమిలోపమురా ప్రాణనాథా

1. పురుషు విడనాడి పుట్టింటనుండిన పొలతికి పరువుండునా
మరచితివా నన్బాయ ననుమాట - మరి నన్ను జంపి
తిరుగుమెచ్చటికైన ।ఇ

పతికిదూరమున్న సతి కిల్లరణ్యంబు
పాలుచేదు మరియు బ్రతుకుచావు
అకట! నిన్నుఁబాసి యరుగుమంటివి నాథ!
తోడి నీడ నీకుఁ దొలఁగు టెట్లు?[10]

'ఇట్టులాడితేమిరా' అన్నది అద్భుతమైన ప్రారంభము. 'ఇన్నిసంవత్సరములు కాపురము చేసి, నన్ను అర్థము చేసికొన్నదింతేనా?' అన్న బాధను వ్యక్తము చేయుచున్నది. తక్కినమాటలెల్ల ఈమాటకు వ్యాఖ్యానములు. 'తోడినీడ' అన్నది ప్రాత ఉపమాన మైనను సందర్భోచితము.

హరిశ్చంద్రునికథలో కౌశికప్రేరితుడైన ఒక విప్రుడు హరిశ్చంద్రుని దారాపుత్రులను కొని, పరమ క్రూరస్వభావుడై ఆ తల్లిబిడ్డలను ఏడ్పించెనన్న గౌరవకథార్థమును దాసుగారు, కపట విప్రుని మాటలలో యథార్థము చేయుచున్న విధము-

1. అటు పలవించెడు చంద్రమతి కడకు నరుదెంచెను యజమాని
పటు రోషముతో పరుషములాడుచు పలికె నిట్లు దయమాని

2. బాడిసెదానా - తెలవారిన పెద పండువను చెరుక లేదా
వేడి నీర్గాచి వేకువకుముందు వేగ మము లేపరాదా

3. ఏమి కష్టపడుచుంటి వింత సొమ్మిచ్చుకొంటినే తులువా
సోమరివై పూట పూట తట్టెడు చోడితోప తినగలవా

10. హరిశ్చంద్రోపాఖ్యానము – పు. 26

4. తరిపిదూడవలె నీ తనయుడు సుంతయైనం బనికిరాడా
సరిబాలురవలె తోటలకుపోయి సమిధ్లైన తేలేడా[11]

ఇవియన్నియు లోకములో అనాథలైన పనికత్తెలకు క్రూరులైన యజమానులు సల్పు సుప్రభాతములే.

సారంగధరుని కథలో చిత్రాంగి మోసపుమాటలను నమ్మి ప్రభువు కామోన్మత్తుడై సారంగధరుని కరచరణములను ఖండింపింప పూనెనను గౌరన కథాంశమును దాసుగారు సారంగధరనాటకమున వ్రాసినవిధము -

రాజు : 'అహా! సర్వేశ్వరా! యిది యెంత తలవంపు నాహృదయ సౌఖ్యము నేఁటితోసరి. మతేమున్నది - నేనెంత పరాక్రమశాలినైనను, మరెంతటి చక్రవర్తినైనను లోకములోఁ దక్కిన ఖ్యాతుల నే నెన్ని వహించినను నాకీ మచ్చపోదు గదా! జాతస్వపోష మెఱుఁగని మృగాదు లెంత ధన్యములు. ఒకపైపునఁ గ్రోధమింకొకవైపున సిగ్గును నొక్కపెట్టున నుబ్బి నాహృదయమునఁ బట్టఁజాలకున్నవి. ఆ పితృద్రోహిని ఖండించి నంత నీక్రోధము శాంతింపవచ్చును గాని లోకములో నాకీ నగుబాటు నాతోఁగాని పోదుగదా! ఇంకెక్కడి పౌరుషము? భార్యాదుఃఖములేని నపుంసకుఁ డెంతటి యదృష్టవంతుడో! ఉచ్ఛిష్టమైన చిత్రాంగిని నే నిఁక ముట్టకుంటయు, నా దుర్మార్గుని బ్రతుకనీకుంటయు నిదియే నానిశ్చయము.

తనదు నీడ తనకు దయ్యమైనట్టుల
నాకుఁదోఁచినాఁడు నా సుతుండు
తానొకటితలంప దైవమొక్కటి సేఁత
యకట! యెంత స్పష్టమయ్యె నిపుడు'[12]

ఈ పలుకులు సత్యము తెలిసికొను చారచక్షువు పలుకులుకాక, కామోన్మత్తుడైన జారచక్షువు పలుకులై గౌరనకథలోని ప్రభులక్షణము పోషించినవి.

చిత్రాంగి అనుచితప్రణయోపనిషద్రహస్యములను బోధించు నుపాధ్యాయులలో నొకతె. వాడనైపుణ్యమున వరూధినికి వరుసలు తిరుగవేయుటలో ఊర్వశికి, ప్రణయ

11. హరిశ్చంద్రోపాఖ్యానము - పు. 37
12. సారంగధర - పు. 65

పాఠములు చెప్పుటలో తారకు సహోదరి, సహపాఠిని. ఈ చిత్రాంగి యుక్తి సంపద, ఉక్తిసంపద కలసికూడ సారంగధరుని ధర్మబుద్ధిని లోగొనలేకపోయినవి. విఫలమైన చిత్రాంగికోపకారణము సారంగధరుని కరచరణముల ఖండన కార్యము నకు దారి తీసినది ఇది చిత్రాంగి పాత్ర జీవలక్షణము. ఈ లక్షణమును దాసు గారు సారంగధర నాటకములో పోషించినతీరు -

చిత్రాంగి తనలో తాననుకొనుచున్న పల్కులు -

నడుసముద్రములో దిగవిడిచినట్లు
డొడ్డచీఁకటి నూతిలోఁ ద్రోసినట్టు
లయ్యొ నాపని - వలచిన యతఁడులేక
నాకుమాత్రము దుఃఖపుం దనువిదేల?

కాని మోహము తగదని విడిల్చినాఁడు. వాని తప్పేమున్నది?- మొదట నాకుమాటాడఁబడినవాఁడు. ప్రధానము జరిగినది, అనవాళ్లంపుకొన్నాము. ఇట్టి హేతువుల వలన వానిం గోరినాను. నా తప్పేమున్నది? - ఉన్నపు డిద్దరి యందుం దప్పులున్నవి. నా తప్పునకేమిగాని, వాఁడంతచక్కని వాఁడేల కావల యును? వానియందే తప్పు - మొదట నన్యోన్యముం బ్రేమించి మధ్యను విఘా తము వచ్చి యిట్లిరువురము చచ్చుటకు విధి వ్రాసెను. నావంటి వలచినదానిం గాదన్న సారంగధరుఁడు చచ్చుట న్యాయమే - అయ్యో! మనసున్నవాఁడు కట్టు కొనకపోయె. కట్టుకొన్న వానిపై మనసు కుదరదాయె, స్త్రీ లనాథలు కదా! - కార్యము మించిపోయె నిఁక నా వెఱ్ఱిరాజు వానిం జంపుట రూఢి - కన్నెతనము నుండియు వానిపైఁ బ్రాణము పెట్టుకొన్న నా కొకసారి మోవి యిచ్చి యైనం దుష్టి పొందించక విడిల్చి పోయినాఁడు గావున, వానికిఁ దగిన శాస్తి యిఁక నే స్త్రీకిని నే వలచిన దేహ మొప్పగించకుండఁ జంపఁబడుటయే - మఱియు నింత చదువు చదువుకొనియు పేల్పువంటి సారంగధరునిం జంపించిన నాకు తగిన శాస్తి యీ వజ్రపుపొడి మ్రింగి చచ్చుటయే. మా యిద్దరి కింతయే దేవుఁడు వ్రాసినాఁడు. )అని విషముతోడి వజ్రపుపొడి మ్రింగి) ఇఁక చీఁకటిగదికిఁబోయి సుఖించెద. రమ్ము మృత్యువా! నీవు నాకు రుచించినట్లు మరెవ్వరికిం దోఁచఁబోవు. నాకు

సారంగధరునిపై గల్గు మోహము న్యాయమని లోకమెరుఁగనీ. ఒకసారి నా ముద్దుల సారంగధరునిం బొడకొని తుదిహాయి పొందెదను.'[13]

ఇది చిత్రాంగి లోకమున కందించిన అంతిమ సందేశము. కాదుకాదు. అంతిమసందేశమను మిషతో చిత్రాంగిపాత్రపై దాసుగారికి కల సానుభూతి-గౌరన కథలోని చిత్రాంగీ ప్రధాన లక్షణములను ఒక్కటికూడ వీడక పాత్ర పోషణము చేసియు, ఆ పాత్రపై సానుభూతిని ప్రదర్శించుట విశేషము.

యశోద తన బాలుని భగవంతుడని అనుకొనుటకన్న, కన్నపుత్రుడనుకొని యానందించుటకు ఇష్టపడిన తల్లి. బాలకృష్ణునకు బాలారిష్టములు కలిగినపుడెల్ల నెత్తిబాదుకొని రోదించినది. ఎవరైన కొండెములు చెప్పిన మొండిగా ఎదురు చెప్పినది. గోల చేసినపుడు కోప పడినది. ఱోటికి కట్టినది. నోటిలో బ్రహ్మాండము చూపిన మ్రొక్కినది. మరల తల్లియై లాలించినది. మూర్తీభవించిన మాతృప్రేమ యశోద. ఈ లక్షణమును నారాయణదాసు గారు శ్రీహరికథామృత హరికథలో పోషించినవిధము-

ఉ। కింకరోమి కిం వదామి కీర్తనీయ పుత్ర
త్వం కుతోగతోసి సంత్యజ్యమామముత్ర ।కిం

1. హాహా ధిగ్దుర్విధిం కథమాగతో భ్రమివాతః
ఆహా కిం త్వామేవాహార్షీ ద్దుర్వినీతః ।కిం

2. బాలక సత్వరమేహి పిబ పిబ మమ స్తన్యమ్
నాలికాయతనేత్ర వినాశయ మేదైన్యమ్

ఇహైవోపావిశః త్రుటితఫలిత జామిాఫలమనో
జిఘత్సన్నాక్రీడీ రిహపరిమృశం స్తర్ణకతనుమ్
ఇహైవవ్యాభాక్షీః త్సకలసవయోభ్యశ్చపిటకాన్
శిశుర్మేకిం వచ్మి భ్రమి పవనభూత స్తమహ్వాత[14]

13. సారంగధర - పు॥ లు 76, 77

14 శ్రీహరికథామృతమ్ – పితృబద్ధవిమోచనమ్ – పు. 49

ఇంతవరకు పూర్వగ్రంథాలలో ప్రసిద్ధాలైన పాత్రల జీవలక్షణములను దాసుగారు పోషించినవిధము. ఇక ఇక్కడనుండి దాసుగారు కల్పించిన క్రొత్తపాత్రల విషయము.

పాత్ర అనిపేరు రసమునకు అధారమగుట వలన వచ్చిన పేరు. పాత్రలు రసమునకు ప్రధానాధారములు. పాత్రల ప్రవర్తనలనుబట్టి రసము నిర్ణయమగును. ఈ ప్రవర్తనలు అనేకవిధములు. ఈ అనేకవిధాలైన ప్రవర్తనలకు అవకాశమిచ్చునది ఇతివృత్తము. కనుక పాత్ర - రసము - ఇతివృత్తము పరస్పరాశ్రయములైన అంశములు.

ఈమాటలు ఎందుకు చెప్పవలసి వచ్చినదనగా, దాసుగారు కల్పించిన పాత్రలను పరిశీలించునపుడు నూత్నకథాశ్రితములైన గ్రంథములే ఉపయోగించును అని చెప్పుటకు. దాసుగారు సొంతకథతో వ్రాసిన గ్రంథములు నాలుగు - 1. బాటసారి, 2. ట్రావెలరు, 3. సారంగధర[15], 4. తారకము. ట్రావెలరు బాటసారికి ఆయనయే చేసిన ఆంగ్లానువాదము. కనుక ట్రావిలరులో బాటసారిలో లేని అంశములేదు. ఇక మిగిలిన స్వతంత్రకథాగ్రంథములు బాటసారి, సారంగధర, తారకము.

బాటసారి గ్రంథమునందలి ఇతివృత్తము, పాత్రలు సంపూర్ణముగా దాసుగారి సొంతములే కాని, ఈ గ్రంథము గూఢార్థప్రబంధము. అందువలన ఈ బాటసారి యందలి పాత్రలు గూఢార్థప్రతిపాదన మనెడు ప్రధానలక్ష్యమును నిర్వర్తించు నిమిత్త మాత్రాధారములైన ప్రతీకలు మాత్రమే. కనుక ఈ గ్రంథమున సజీవములైన పాత్ర లుండుటకు అవకాశములేదు. దాసుగారికి కూడ ఈ గ్రంథమునందు సజీవపాత్రనిర్మాణము చేయవలెనను చూపులేదు. ఈ మాట అనుటకు ఆధారము దాసుగారు ఈ గ్రంథమునందలి పాత్రలకు నామకరణములు కూడ చేయక పోవుటయే.

ఇగ సారంగధర నాటకము. దీనిలోని రత్నాంగి, చిత్రాంగి, ప్రభువు, సారంగధరుడు, సుబుద్ధి అను ముఖ్యపాత్రలు ప్రాతపాత్రలే యైనను, క్రొత్తగా

15. 'సారంగధర' ఎట్లు స్వతంత్రనాటకమో సారంగధరనాటక సమీక్షలో వచ్చినది.

కల్పింపబడిన పాత్రలు కూడ కొన్ని కలవు. గిజగన్న, గిలిగింత, జబ్బన్న అను నామకరణము చేయించుకొన్న పురుషపాత్రలు, మంత్రి, మహాకవిగాయకశిరోమణి. పురోహితుడు నామకరణభాగ్యము కూడ నోచుకొనని పురుషపాత్రలు, వలవంత, అంటింత అను స్త్రీపాత్రలు. వీనిలో మరల గిలిగింత సంస్కృతరూపకము లందలి విదూషకుడే. గిజిగన్న చాకలి, అంటింత మగడు. జబ్బన్న 'హంతకనాయకుడు', వలవంత రత్నాంగి దాసి. అంటింత చిత్రాంగి దాసి. కనుక ఈ క్రొత్తపాత్ర లన్నియు చాల చిన్నపాత్రలు. ఇవి కేవలము కథాచక్రము నందు చిన్నమేకుల వంటివి మాత్రమే. ఇటువంటి చిన్నపాత్రలను సజీవపాత్రలుగా చేయవలెననెడి శ్రద్ధ సామాన్యముగా కలుగదు. దాసుగారికి కూడ కలుగలేదు. ఆపాత్రల స్వభావ ములను సూచించు నామకరణములు మాత్రము చేసి, చాలు అనుకొనినారు.

ఇక తారక గ్రంథములో ప్రధానపాత్ర తారకుడను బ్రాహ్మణుడు. ఈ తార కుడు సర్వవిధాల నారాయణదాసుగారే.[16]

సారాంశముగా తేలినదేమనగా, దాసుగారి గ్రంథము లందలి పాత్రలలో ప్రాచీనగ్రంథాలలో ప్రఖ్యాతములైన పాత్రలే ఎక్కువ. కొన్ని చిన్న పాత్రలను సృష్టించినను, అవి దాసుగారి పాత్రనిర్మాణశక్తికి ఉదాహరణములుగా పనికివచ్చునవి కావు. కనుక దాసుగారి గ్రంథములలో, వారెట్లు ప్రాతపాత్రలను పోషించిరో చూడవలసినదే కాని, క్రొత్తపాత్రల నెట్లు సృష్టించిరో అని చూచుటకు అవకాశము లేదు. దాసుగారు ఒక్క క్రొత్తపాత్రనైనను సజీవముగా సృష్టించుటకు ప్రయ త్నము చేయలేదు.

## వర్ణనావైభవము :

వర్ణనములు కవి ప్రతిభకు కొలతబద్దలు. కావ్యకారణకరణమైన ప్రతిభా లతకు ప్రాకుడు కొమ్మలు. కవి యని బిరుదప్రదానము చేయు ఉపకరణములు.

నానృషిః కవిరిత్యుక్త మృషిశ్చ కిల దర్శనాత్
విచిత్రభావ ధర్మాంశ తత్త్వప్రఖ్యాచ దర్శనమ్

16. 'తారకము' సమీక్షలో వ్రాసిన 'అన్యాపదేశధోరణి' అను అంశములో ఈ విషయము వివరింపబడినది.

స తత్త్వదర్శనాదేవ శాస్త్రేషు పఠితః కవిః
దర్శనాద్వర్ణనాచ్చాథ రూఢాలోకే కవిశ్రుతిః
తథాహిదర్శనే స్వచ్ఛే నిత్యేప్యాది కవేర్మునేః
నోదితాకవితాలోకే యావజ్జాతా న వర్ణనాః[1]

నారాయణదాసు గారి ప్రతిభకు ప్రతిబింబములైన వర్ణనలు వారి గ్రంథములలో కోకొల్లలు.

కవిభావకోశాగారమునకు ప్రకృతివర్ణనము ముఖద్వారము. ఆ తలుపుతట్టని కవియే యుండడు. ప్రకృతికి కవిని కవ్వించుటయే ప్రకృతి. ఆ ప్రకృతి తాను భగవత్స్వరూపమని తెల్పుటకో యన్నట్లు ఒక్కొక్క కవికి ఒక్కొక్క అవతారముతో ప్రత్యక్షమగును.

చిఱుతాల్పపై జిలజిలఁబాఱు సెలయేటి
నీటిపై లకుముకిదాఁటు చూచి
నానాట నలవాటుఁబూని మెల్లనఁ జేర
వచ్చు జింకల కూర్మిపాట చూచి
మడుగులఁజెఱలాడి బెడిదపు టొడ్డులఁ
బొలయించు నేనుఁగుపోటుచూచి

1. ఈ శ్లోకములు తౌతభట్టు వ్రాసిన కావ్యకౌతుకము నందలివని హేమచంద్రుడు తన కావ్యానుశాసనమున (పు. 316) చెప్పినాడు. తౌతభట్టు వ్రాసిన కావ్యకౌతుకము లభింపలేదు. తౌతభట్టు అభినవగుప్తుని గురువులలో నొకడు (లోచనము - ధ్వన్యాలోకము 25, 26 కారికల నడుమ).
ఋషికానివాడు కవి కాలేడని చెప్పబడినది. ఋషి యని యనుట దర్శనము వలననే కదా. విచిత్రభావములను, ధర్మాంశతత్త్వములను గ్రహింపగల ఖ్యాతియే దర్శనము. ఆ తత్త్వదర్శనము కవికి ముఖ్యమని శాస్త్రములలో చెప్పుచున్నను, ఆ దర్శనము వర్ణనగా మారినప్పుడే ఋషికి కవి యను ప్రసిద్ధి లోకమున కలుగును. అందువలననే మునియైన వాల్మీకికి తత్త్వదర్శనమున్నను, వర్ణన ఆయనచేయనంతవరకు లోకమున కవిత పుట్టలేదు.

దువ్వి ముద్దుగొనుచు దొడ్డ పులులతోడ
నాటాడు చెంచెత నీటుచూచి

వర్ణనము సేయుచున్ భూరివనములందుఁ
బలురకంబుల పిట్టల పలుకులకును
స్వరము గట్టుచుఁ జెట్టుల పట్టులందుఁ
బద్యములు వ్రాయు భాగ్యంబు పట్టునెపుడు[2]

ప్రకృతి దృశ్యములను పరికించి వర్ణనలు చేయుచు, పిట్టల పలుకులకు కట్టుచు చెట్లపట్టులపై పద్యములు వ్రాయుట మహాభాగ్యముగా భావించిన ఈ పలుకులు దాసుగారికి ప్రకృతిపై గల గాఢానురాగమునకు స్వతః ప్రమాణములు. ప్రకృతిచేత ప్రభావితులైన దాసుగారి ప్రకృతివర్ణనల ప్రకృతిని పరిశీలింతము –

ప్రభాతకాల వర్ణనము –

తప్పుబయల్వెడ్డచొప్పున నోడిన
వెరపునఁ జంద్రుఁడు వెల్లఁబారె
సిరిదొలంగినవాని పరివారమటు సన్న
సన్నఁగఁ జుక్కలు సాఁగఁదొడఁగెఁ
గ్రొత్తగాఁ గవగూడుకొన్న దంపతులకు
గుండియల్ ఝల్లనఁ గోడికూసె
దవ్వొంతయోఁగియుఁ దలక్రిందుపిట్టలు
దారితప్పక తమ తావు చేరెఁ

గలువలున్వాడెఁ దమ్మిపూవులును వీడెఁ
బులుఁగులున్ ప్రొద్దునకు మేలుకొలుపుపాడెఁ

2. సారంగధర – పు॥ లు 121, 22

బన్నులే కెల్లరికి నబ్బెఁ బైనుగాలి
తెల్లముగఁ దూర్పు బళ్ళున తెల్లవారె[3]

ఇందులోగల అంశములన్నియు ప్రత్యహప్రభాతమున ప్రత్యక్షము లగు నవియే. కాని వానిని వర్ణించినవిధ మద్భుతము. చంద్రుడు వెలవెలబారుట తప్పు బైటపడ్డవాని వలెను, ఓడినవానివలె నున్నదట. చుక్కలు మెలమెల్లగా మాయ మగుట ఐశ్వర్యము నశించిన వాని పరివారమువలె నున్నదట. పిట్టలు అరచుట మేలుకొలుపువలె నున్నదట. తెల్లవారుపేళ వచ్చి అందరిని ఆనందపెట్టుగాలి పన్నులేనిదట. ఇవి ఈ పద్యము నందలి చక్కని ఊహలు. తక్కినవి స్వభావ సుందరములైన స్వభావోక్తులు.

సంపూర్ణముగా స్వభావోక్తులతో నిండిన మరియొక ప్రభాతకాల వర్ణన పద్యము-

ఒంటిపాటునఁ బొక్కి యురువయి కెంపెక్కి
విన్ను తొూర్పునఁదూరె వేగుఁజుక్క
తెక్కలు జాడించి ముక్కును గోడించి
కొక్కొరోకో యని కూసెఁ గోడి
నీటితావులఁబారి తోఁటల గడితేరి
రెొడలు చల్లనసేయుచుండె గాలి
యైదుజాముల పద్దుగాఁ దోఁచునిఁకఁ బ్రొద్దు
పొడమెడు నని చాటదొడఁగె గంట

పట్టులెడఁబాసి పిట్టలు బయటఁబాఱె
దలలు తిక్కించి మొక్కలు చెలువుమీఱె
బలిమితోడుత నిద్దుర బరువుజాఱె
దెబ్బునస్వేసవిన్ రేయి తెల్లవాఱె[4]

వేగుచుక్క తూర్పున దూరుట, కోడికూయుట, చల్లనిగాలి వీచుట, గంటలు వినబడుట, పిట్టలు బైటకు వచ్చుట, మొక్కలు తలలెత్తుట, నిద్దురవదలుట, మొదలగునవన్నియును వేసవి తెల్లవారుజామును తెలుపు సంకేతములే.

---

3. యథార్థరామాయణము – సీతాకల్యాణవిభాగము – పు. 88
4. బాటసారి – ప. 61

వేగుజుక్క అంతర్ధాన వర్ణన -

'వెన్నెలకాచి కాచి ననవిల్తుని మామ చనంగ నీవు నీ
చిన్నెలఁజూపనేల కడుసిగ్గును మాలిన బేల' యంచుఁ ద
న్మన్ననచేయ రెవ్వరని మంచి చెలింబలె వేగుఁజుక్క హాం
జెన్నల లేఁతయెండయను చిచ్చునఁజొచ్చెననంగఁగ్రుంకెడిన్[5]

చంద్రాస్తమయము అయిన పిదప, సూర్యోదయకాంతులు ప్రసరింపగా వేగుచుక్క మాయమగుట ప్రకృతిసత్యము. ఈ సత్యమును 'వెన్నెలకాచి కాచి చంద్రుడు పోగా, సిగ్గులేకయున్నది అని తన్ను మన్నన చేయరను భావముతో వేగుచుక్క లేతయెండ యను అగ్నిలో పడినది' అని ఉత్ప్రేక్షించినారు.

సూర్యవర్ణన -

తూర్పుకొండకు జేగురు తొడుకుండ
చేతులం జాచి వచ్చిన లేతయెండ
జగములకు నెల్ల వాచి పెద్దగనుదోఁచి
చిన్నయాటకు వేడిమించెను మరీచి[6]

ప్రభాతకాలమందలి లేతయెండ, తూర్పుకొండకు ఎరుపురంగును తొడఁనటువంటి కుండ యట. ఆ లేతయెండ చేతులను చాచి వచ్చినదట. సూర్యబింబము మొదట పెద్దగా నుండుటకు కారణము లోకములను చూచుటకు మొగము వాచి యట. ఆ బింబము చిన్నదగుటకు వేడి యెక్కువగుచున్నదట.

ఔర! గారడి సూర్యుండ! అబ్బురంబు
కద బ్రదుకువలె నీ కరకౌశలంబు
అల్పభాగంబులన్ జూపి యధిక దివ్య
ములను గన్నట్టనీయక మోసపుచ్చు[7]

5. మేలుబంతి - పు. 172
6. రుక్మిణీకల్యాణము - పు. 25
7. బాటసారి - ప. 21

'ఇందు - నీ కిరణప్రసరణనైపుణ్య మాశ్చర్యకరమని ప్రకృతార్థము. కాని హస్తలాఘవవిద్య అద్భుతావహము గద అను నర్థాంతరచమత్కారము గూడ గమ్యమానము. అద్భుతత్త్వవిషయమై బ్రదుకుతోడి సామ్యము హృదయంగమము. పద్యాంతమున అల్పములైన ఆధిభౌతిక విషయములను ప్రకటించి అంతకంటె జీవికి పరమ ప్రాప్యములైన దివ్యముల గోచరింపనీయవను నుదాత్తగంభీరమైన యూహ మృదంగవాద్యమునకు ముక్తాయింపువలె నున్నది.[8]

మట్టమధ్యాహ్న వర్ణనము -

తమ్ము మాలినధర్మంబు తగదటంచుఁ
దలల నలరించు తమ మొదళులను గావఁ
బూని చాఁచిన నీడల ముడుచుకొనియెఁ
బాదపంబుల - నడుమింట భానుఁడొప్పె[9]

మట్టమధ్యాహ్నవేళలో చెట్లనీడలు పొట్టివగుట సహజము. ఆ సృష్టి సహజ లక్షణమును దాసుగారు చమత్కరించినారు. చాచిననీడలను చెట్లు కావలెనని ముడుచుకొనెనట. దానికి కారణము వాని తలలను రక్షించు మొదళ్ళను కాచుటకట. ఇట్లు చేయుటకు ప్రమాణము తమ్ముమాలినధర్మము తగదని యట.

స్వభావోక్తులతో నిండిన మాధ్యాహ్నిక వర్ణనలు రెండు -

ఆర్కైన నల్లాడసీక దిగ్బంధన
 ముగ గాలి చెమ్మటం బోదవె నుక్క
మిన్నంటి చెల్వాకై మెలపుతోడుత గ్రద్ద
 చాలుగ నిరుప్రక్కఁజాచె రెక్క
ముంగాళ్ళతోఁ జెట్టుమొదట గాతన్ద్రవ్వి
 కుదురుగఁ బడుకొనె గుంటనక్క
యెండమావులఁగాంచు చెంతయు దప్పితో
 వాడి పరువువెట్టె లేడిబక్క

---

8. ఆచార్య యస్వీజోగారావు గారు-కవృపీశ్రుతులు-సంపాదకీయము. పు. 15
9. సారంగధర- పు. 105

యొడళు లుడుకెత్తి తుమ్మెద లుడిగె సద్దు
రగులుకొను నగ్గికిం గనరాదు హద్దు
అడవి పందికి బురదనీర య్యె ముద్దు
నెలసెఁబనిరద్దు నిడువేసవి నడుప్రొద్దు[10]

నెమరువేయుచు లేళ్ళునీడలనాఁగె, లోఁ
బొదలలోఁ నెమళులు కుదురుకొనియె
లోఁతు మడుంగుల నీఁతాడె నేన్గులు
పందులు బురదలఁ బొదుకొనియెఁ
గొమ్మలపైఁ జేరుకొనియెఁ గోఁతులు పుల్గు
లన్నియుఁ దొర్రల నణఁగఁజొచ్చె
లోవలఁబడి పులు లావులింతలు దీసె
నొండులలోఁబాము లూర్పు లుచ్చె,

నడవిసందడితగ్గె, నల్గపల యందుఁ
జెలఁగి పొగచిమ్ముకొంచు కార్చిచ్చుహెచ్చె,
రెండుజాముల వేసవి మండిపడుచుఁ
గొండబీఁటలు వాఱంగ నెండకాసె[11]

ఆకైన కదలకుండ ఉక్కపోయుట, గ్రద్ద ఆకాశమున రెక్కలు చాచుట, నక్క గోతిలో పడుకొనుట, ఎండమావులను చూచి దప్పికతో లేడి పరుగులెత్తుట, తుమ్మెదల సద్దులేకుండుట ప్రజలు పనులకై తిరుగకుండుట, లేళ్లు నీడలందుండుట, నెమళ్లు పొదలలో చేరుట, ఏనుగులు లోతుమడుగులోనికి దిగుట, పందులు బురదలో పొర్లాడుట, కోతులు కొమ్మలపై నుండుట, పిట్టలు తొఱ్ఱలలో దాగుట, పులులు బయటికి రాక నిద్రించుట, పాములు పుట్టలలో నిట్టూర్చుట, కార్చిచ్చు

10. జానకీశపథము – పు॥ లు 19, 20
11. బాటసారి - ప. 12

హెచ్చుట, కొండలు బీటలువారుట, మొదలగునవన్నియు వేసవి మట్ట మధ్యాహ్నపు వేడిమివలన జంతుజాలములు పడు అవస్థలే.

సాయంకాల వర్ణనము -

ఉడుకెత్తి పొదాలనుమ్మడిగిన నీడలు
చల్లఁగఁదూర్పున సాగుచుండె
వడదాకి తొఱ్ఱల నడఁగిన పిట్టలు
ముదముగఁ బైటను మ్రోగుచుండె
కడువేడిమిన్ గ్రాగిన గాడ్పు హా
యిగ మంచుకొండకై యేఁగుచుండె
కొండను దిగి యెరకోఱకు బెబ్బులు లుమ్మి
రిగఁ బల్లములఁ జెలరేఁగుచుండె

పాములకుఁ బుట్టలోనుండి పడగ హెచ్చె
మడుపు నెడబాసి యేనుంగు లడవిఁజొచ్చె
ప్రొద్దు పడమటిమలకుఁ గెంపు జిగి తెచ్చె
నెగడి జానకి వాలుకన్నుఁగవ విచ్చె[12]

నీడలు పొడవగుట, పిట్టలు తొఱ్ఱలనుండి బైటకు వచ్చుట, గాలి చల్లబడుట, పులులు పాములు ఏనుగులు బైటకు బయలుదేరుట, పడమటికొండ ఎఱ్ఱబడుట, మొదలగునవి యన్నియును పశుపక్షాదుల సాయాహ్నకృత్యములే.

తన్ను వెంటఁదగులుచున్నట్టి కోడె చీ
కటుల కెదిరి నీల్చు కడిమిలేక

12. జానకీశపథము - పు. 22 - ఈసీసము నందలి గీతములో గల మూడవ పాదము 'ప్రొద్దుపడమటకున్ వ్రాలి ముద్దువచ్చె' అని ముద్రితపాఠము. గ్రహించిన పాఠము దాసుగారు చెప్పిన హరికథల పుస్తకములో దాసు స్వహస్తముతో మార్చి వ్రాసినది. దాసుగారు చేతపట్టుకొని చెప్పిన హరికథల పుస్తకము నా కందచేసినవారు శ్రీ కత్తా ఈశ్వరరావు గారు

పశ్చిమాబ్ధియందుఁ బడి దాగె సూర్యుండు
కాలమొక్క-రీతి గడుపఁగలమె?[13]

చీకటిపడుచున్నది. సూర్యాస్తమయమగుచున్నది - అను అంశమును. కోడెచీకటుల నెదిరించుబలములేక సూర్యుడు పశ్చిమాబ్ధిలో దాగినాడనుట, కాల మొక్క-రీతిగా గడపగలమా? అనుట ఒక ఊహ.

చంద్రోదయ వర్ణనము -

తరణియు బశ్చిమాంబుధికిఁ దారె విహంగము లుక్కి-పట్లకుం
బిరబిరఁబారెఁ జీకఁటులుమీరె సమీరుఁడు చల్లవారె నం
బరమునఁ గుందసూనముల మాడ్కి-ని రిక్క-లు జాలువారె బం
ధురగతి కైరవాప్తుఁడు దితెుండయి వెన్నెల వెండిగారగన్[14]

సూర్యుడు పడమటి సముద్రము చేరుట, పక్షులు గూండ్లకు వెళ్లుట, చీకటి బాగుగా వ్యాపించుట, గాలి చల్లబడుట, నక్షత్రములు మొల్లపూలవలె నేర్పడుట అన్నవి చంద్రోదయ సమయ పరిస్థితులే. ఇట్లు స్వభావోక్తులతోగాక, అలంకారి కముగా చేసిన మరియొక వర్ణన

ప్రొద్దు పండుటాకు పోలిక రాలెఁ గెం
జాయ చివురులెత్తెఁ గోయిల లనఁ
జెలఁగి కవిసెఁ జీకఁటులుఁ బూచెఁ జుక్క-లు
పైని చందమామ పండుదోఁచె[15]

సూర్యాస్తమయ చంద్రోదయములను ఒక వృక్షముతో పోల్చుట ఈ వర్ణ నము నందలి విశేషము. సూర్యుడు పండిన ఆకు విధాన రాలెనట. ఎరుపురంగు చివురులవలె, చీకట్లు కోయిలల వలె చుక్క-లు, పూచిన పుష్పాలవలె, చంద మామ పండువలె నున్నదట.

---

13. గజేంద్రమోక్షణము - పు. 9
14 మార్కం-డేయ చరిత్రము - పు. 22
15. గజేంద్రమోక్షణము పు. 10

పడమట విశ్రాంతిబడు రవి తన సిరి
　　నుదితుఁడౌ చంద్రున కొప్పగించె
జానకి సత్కీర్తి భూనభోంతరముల
　　నిండినయట్లు వెన్నెలలు గాచె
సెగమందమై పగల్ నిగురుగప్పి యడంగు
　　పాంథుల విరహంబు ప్రజ్వరిల్లె
సహజగాన కవిత్వశాలి దరిన్ శుష్క
　　శాస్త్రజ్ఞువలెఁ జుక్క సౌరుమాసె[16]

పడమటి దిక్కున విశ్రాంతి తీసికొనపోవుచు సూర్యుడు తన ఐశ్వర్యమును ఉదయించిన చంద్రున కొప్పగించెనట. జానకీదేవి సత్కీర్తివలె వెన్నెల భూమ్యాకాశముల మధ్య నిండినదట. పగలు నిగురుగప్పి యణగిన బాటసారుల విరహము అతిశయించినదట. సహజముగా కల్గిన గానకవిత్వమాధుర్యములు కలవానిచెంత కేవల శాస్త్రవేత్త కాంతిహీనుడైనట్లు నక్షత్రములు కాంతిహీనములైనవట. ఈ ఉపమానము 'ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభయే గరీయసి' అను అలంకారికుల శాస్త్ర సంస్కారము తెరవెనుక చేరి చెప్పించినది.[17]

అర్ధనిశీథ వర్ణనము -

ఆకసంబున నడుగంటె చుక్కలు అవ
　　లట్లు చీఁకటి నీట నలరుచుండెఁ
గరఁగిన వెండి నీర్వరపిన తీరున
　　నలలవాలుగ మీలు తలుకుమీఱె
మీఁదు క్రిందులఁబోల్చు మింటినట్టనడుమ
　　గారడియద్దమై కడలితోఁచె

16. జానకీశపథము - పు. 37
17. ప్రతిభైవచ కవీనాం కావ్యకరణ కారణమ్ వ్యుత్పత్త్యభ్యాసౌ తస్యా ఏవ సంస్కార కారకౌ నతు కావ్యహేతూ (వాగ్భటుడు)

దొప్పచేతులవలెఁ దూఁగాడు కెరటములే
గొప్పచందువలు జోకొట్టుచుండె
చుక్కజాడలఁ బొగయోడ చొక్కుచుండె
గాడు పెల్లెడలన్ జోల పాడుచుండె
నిగిడి గడియార మిదిగో పన్నెండు వేసె
నిఁకఁ జెలిమికాఁడ! మనము పండుకొనవలయు[18].

ఇది సముద్రములో నున్న పొగయోడలో కూర్చుంటి చేసిన అర్ధనిశీథ వర్ణనము. చీకటి అరెడి నీటికి అడుగున నున్న ఆకాశమున నక్షత్రములు రవ్వల వలె నున్నవట. అలలపై వాలుగా తేలుచున్న చేపలు కరిగించిన వెండినీరువలె తళుకుతో అతిశయించెనట. పైనుండి క్రిందిదాక యున్న సముద్రము ఆకాశమధ్యమున గారడి అద్దమువలె నున్నదట. గొప్పగొప్ప జంతువులను దొప్పచేతులవలె ఊఁగుచు అలలను జోకొట్టుచున్నవట. నక్షత్రములనుచూచి పొగయోడ పరవశించుచున్నదట. గాలి అన్నిదిక్కులను జోలపాడుచున్నదట. గడియారము పన్నెండుగంటలు కొట్టెనదట. ఈ ఊహలన్నియు పాతవాసనలేనివి. ప్రతిభా సురభిళములు.

తొలకరి వర్ణనము -

తొలి తెల్లకొండలవలె నున్న మొగుళులు
గొప్పలై నీలిరంగులఁ దనర్చె
దూదిపింజలలాగు దొడ్డమబ్బుల నేకి
కరువలి వఱపులుగా నొనర్చె
వెండిచబుకుఁ ద్రిప్పివేసిన యట్టులు
మెఱుముతోడుతఁ బెద్దయురుము పుట్టె
నేలఁగమ్మని తావి నెగడించు చందంద
వలుదలై లెక్కచినుకులు మొదలిడె

18. బాటసారి - ప. 135

మింటికి న్మంటికిఁ దఱచు మీఁఱవాన
యఱుఁగులను తీఁగెల బిగించి యూఁఱవవడి
వీణె వాయించు నెఱజాణ గాఁణమాఁడ్కి
నందముల గుప్పి గాలి పాడఁదొడంగె[19]

తెల్లకొండలవలెనున్న మేఘములు నీలిరంగులతో నొప్పినవట. గాలి పెద్ద పెద్ద మబ్బులను దూదిపింజలను ఏకినట్లుగా ఏకి వర్షములేకుండగ చేసినవట. మెఱపులతో గూడిన యురుములు వెండికొరడాతో త్రిప్పికొట్టినట్లున్నదట. నేలను మంచి వాసనలతో సుబాళింపజేయుటకు లెక్కపెట్టదగినన్ని చినుకులు స్థూలములై మొదలిడెనట. భూమ్యాకాశము లేకమగునట్లుగా వాన కురువ, అఱుగు లనెడి తీగెలను బిగించి అరవవడిలో వీణవాయించు నేర్పరివలె గాలి పాడదొడగెనట.

ఆమని వర్ణనము -

చెవ్రలకుఁ జిల్లుగఁ జెలఁగి కోయిలకూసె
సందడి పెండ్లిబాజాలు మ్రోసె
కన్నె వేపయుఁ దొగ్గున్న సమర్తాడెఁ
జలివేంద్రదాపున సంతగూడె
కమ్మమామిడితోట కాపుల పనిహెచ్చెఁ
బిల్ల గాలులు మురిపించి వచ్చె
గొడుగులు జొల్లెండ చిడిముడిఁజల్లార్చెఁ
దాటిముంజలు కడు దప్పిఁదీర్చె
కారడవి వెల్గెఁ బడవమికాదు గల్గె
సందెలింపాయెఁ గౌఁగిటల్ సడలిపోయె
ప్రొద్దు లేపారె మాపులు పొట్టివారె
ఆమని మొదలుపెట్టె బల్ హాయిపుట్టె[20]

19. బాటసారి - ప. 163
20. సావిత్రీచరిత్రము - పు. 22

కోయిలలు కూయుట, పెండ్లిండ్లు జరుగుట, చెట్లు చిగుర్చుట, దప్పికతో జనులు చలివేంద్రముల చెంతచేరుట, మామిడికాయలు వచ్చుట, సన్నగాలులు వీచుట, ఎండకు గొడుగులు చెప్పులు అండలగుట, తాటికాయలు వచ్చుట, అడవి కాలుట, పడవషికారులు పెరుగుట, సాయంకాలములు సౌఖ్యములుగానుండుట, కౌగిళులు సడలుట, పగళ్లు ఎక్కువగుట, రాత్రులు తగ్గుట, మొదలగున వన్నియు వసంతర్తువు గుర్తులే. ఈ వర్ణనమున పాత పుస్తకాల వల్లింపుకన్న ప్రకృతి పరిశీలనము మిన్నగానున్నది.

శ్రావణమాస వర్ణనము -

తేనెపట్టులవలె వానమబ్బులఁగ్రమ్మఁ
　　బైరుపంటలకెల్లఁ బ్రాపకమ్మ
జాజి చెంబేలి గొజ్జఁగి తావులం జిమ్మ
　　నేరేడు తాటిపండ్లూరకెమ్మ
ఏళ్ల జెర్వులనీళ్ల కెల్లరంగుల తీమ్మఁ
　　ద్రోవలందు నడంగఁ ద్రొక్కుడుమ్మ
నెఱయు నాఁగాఁకర నేతిదొండల కిమ్మ
　　మఱపించు ముసురుల మన్నుఁగ్రుమ్మ
చవక పచ్చికలుం గ్రొత్త జన్నిదమ్మ
వరినుడుచుపాట గుగ్గిళ్ల వాయనమ్మ
జాడలిడు వేట క్రొవ్వేల చేడెసొమ్మ
పావుకోళ్లమ్మ హాయియౌ శ్రావణమ్మ[21]

ఈ వర్ణనమున ప్రకృతిలక్షణములు, ఆచారములు ఓతప్రోతముగ పెనవేసి కొని యున్నవి.

21. మేలుబంతి - పు. 172

పౌష్యమాస వర్ణన -

ముంగిటవాకిళ్ళ ముగ్గులు జెన్నొందుఁ
గల్మికూర్పుల నెలగంటముందు
అత్తవారింటిలో నల్లుఁడున్న పసందు
వెల్గుచూపుల భోగివేగు సందు
పెతల కెల్లరికిఁ బేర్వేరునఁ బిలుపందు
రచ్చసందువగు సంక్రాంతిపొందు
పాటలాటలు దక్కఁ బనులన్నిటికి బందు
కనుమ జాతర పేదకాపువిందు

ప్రొద్దురాకకు నిట్టూర్పు పొగలఁజిమ్ము
క్రొత్తకాపును వడ్లును గుత్తకమ్ము
కుంపటుల్ గొంగళుల్ గోరుకొన్నసొమ్ము
పౌషమాసమ్ము సర్వ సంపోషణమ్ము[22]

ఇవియన్నియు తెలుగుదేశమున పౌష్యమాసపు వేడుకలే.

హేమంత వర్ణనము -

నీరపిపాసాఽతి మితాఁగతిరివ శీతే కఠోరగర్భిణ్యాః
స్వప్నావస్థా బహులా సందర్భవిహీన కావ్యరచనేవ[23]

శీతకాలమున దప్పిక గర్భిణీస్త్రీ నడకవలె చాలమితముగా నున్నదట. నిద్రా కాలము సందర్భశుద్ధిలేని కావ్యరచనవలె ఎక్కువగా నున్నదట. హేమంతర్తు వర్ణనలో అనౌచిత్యములతోగూడిన కావ్యములను పోలికగా చొప్పించుట విశేషము.

---

22. హరిశ్చంద్రోపాఖ్యానము - పు. 36
23. మేలుబంతి - పు. 172

మరియొక ఋతువర్ణనము -

'అంత న్గొండ యెక్కుడుపోల్కి, నూబి యిసుకలన్నడుచు విధంబున,
గొడిరాళ్ళన్ముండ్ల బర్విడు తెన్నున, బస్తుండు తెఱంగున, బల్మిన్జాగరంబుసేయు
కరణి, గాఢముగా నలవడిన వ్యసనముల మానుకొను వడుపున, స్వభావము నడ్డు
మాడ్కి కష్టతరమైన గ్రీష్మమున్గడిపి, కార్కొను మబ్బులంగని పించెములు విప్పి
శ్రీశైలాగ్రము న్గన్న మాత్ర నుల్లసిలు శివభాగవతుల వలె దాండవమొనర్చు నెమ
ళ్లను, జినుకులెపుడు పడునో యని దేవాలయ ప్రసాదమునకు గనిపెట్టుకొను తీర్థ
వాసులభంగి నోర్దెఱచుకొని చూచు చాతకంబులును, ప్రకృతి సంపర్కంబున సగు
ణులవలె దోచు పురుషుల చందంబున గ్రొమ్మొయిళుల నీలిచాయల న్గలినట్లుండు
మెట్టలును, నీటిగాలిం జల్లబాటి యాకలి తీరినవెన్క శాంతిన్వహించి యనుగ్ర
హంబు చూపు ప్రాణుల సొబగున సంచారయోగ్యంబులైన సైకతప్రదేశంబులును,
మింటితో సంధిజేసికొన బుడమి పంచిన రాయబారి తీరున నెగయు పరాగంబును,
గిటికీల సందున దళుక్కున మెఱసి దోబూచులిడు రాణివాసము వలె దటాలున దోచి
తోచకుండు తీగె మెఱుపులును, ద్రిస్థాయిక్రమంబున వినబడుచు ధృష్టులన్మానినులు
తమంత గౌగిలింపజేయు నురుములును, బతివ్రతాశాపంబుమాడ్కి నప్రతిహతంబు
లగు నశనిపాతంబులును, సజ్జనుల వలె గణనార్హంబులై పచ్చి వట్టివేళ్ళ తెన్నున
నేలగమ్మని తావి పుట్టించు వలుదచినుకులును, కర్పూరఖండములరీతి ముత్యాలసేనల
కరణి బుడమిబడు వడగండ్లును, సమరేఖలై యొండొంట గలియక వాయువశంబున
నొకప్పుడు ఋజువులై యింకొకవేళ నేటవాలులై సమానన్యూనభార విశేషంబుల
జూపు త్రాసుముండ్లపోల్కి గన్పట్టి రాజభటుల విధంబున ప్రచ్ఛన్న వస్తువులం
బయలుచేయుచు సాధువర్తనము రీతి గల్మషంబువాపుచు మిట్టు నుండి పల్లమునకు
దొర్లునట్లు సత్వరంబులై యగ్నిజ్వాలల సొబగున దేలచూపులభంగి నూర్ధ్వాగాములు
గాక ప్రేమదృష్టుల పొలపున గ్రిందుగ ప్రసరించుచు లేజవ్వని కేశపాశము వలె
గార్కొను వరిమొక్కల చెలువున నిబిడంబులైపడు సలిలధారలును, లంచగొండి
ధనమురీతి బాన గోష్ఠికాస్నేహముకరణి దొంగవినయము మాడ్కి ప్రసూత్యాది వైరా
గ్యము వలె నల్పజ్ఞుని గర్వము తీవిన్ సందర్భవిహీనాలాపము తెన్నున గపటనిష్ఠ
విధంబున సోమరి యొడలిరీతి స్వేచ్ఛపెఱిగి దుర్జనము భాతి రంధ్రాన్వేషణం బొన
ర్చుచు మంచిచెడ్డలరయక ప్రవర్తిల్లుచు మదపుటేనుగు కరణి నొడ్డుల బడగూల్చి
చెదురుతగులునెడ సుడివడియు శూరసైన్యమురీతి వెన్కనాగక త్రోవజించుకొని ముం

దంజపేయుచు జెత్తల నంచుగట్టి పొర్లిపారు వరదలును, ఘన స్వస్తి చెప్పునట్లు కుతప సంగీతము మాడ్కి విలంబమధ్యద్రుతలయ లింపార గుంపుకట్టి రొదవెట్టు కప్పలును, కెంపులు తాపిన తివాసి వలె నారుద్ర పురుగులన్మెఱయు పచ్చికబయళ్లును, సాత్వికాన్నదానమున నశించు పాపములమాడ్కి బథ్యాశనమున నుపశమిల్లు రోగంబుల కరణిన్ దైవభక్తి నుల్లనంతశ్శత్రువర్గంబు తెన్నున రూపుమాసిన కొండవోళ్లును, స్త్రీమనసు మాడ్కి లోతెలియగరాని జలాశయంబులును, వృద్ధుల యింద్రియంబుల తెఱంగున ననుపయుక్తంబులగు త్రోవలును, నూత్నాధికారులకు ప్రత్యుత్థానమొనరించు పౌరులవలె గ్రొత్తవిందుల బ్రతీక్షించు పూటకూళ్ళవాండ్ర చందమున వింత వింత సరసుల నగనిపెట్టు వెలయాండ్రపగిది న్గొప్పిన్నీటికెదురు నడుచు మిట్టమీలును జెలంగ, క్షేమ వార్త వలె సంతాపోపశాంతికరంబై దాతమాడ్కి బహుజీవన సంధాయకంబై తూచినట్లు సమానాహోరాత్రంబై వర్షాకాల మతిక్రమింప, సాధుహృదయంబుల తీరున బ్రసన్నంబులైన నీటిపట్టులును ధర్మసభల మాడ్కి నిష్పంకంబులైన మార్గంబులును శ్రీహరి భజనమందిరము కరణి న్విమలాభాంచిత విష్ణుపదంబును భాగవతసమాజంబుపోల్కి స్వచ్ఛజీవనంబును సత్ప్రభు పరిపాలనంబు పొలుపున సముల్లసిత కువలయంబును వణిగ్గృహంబు తెఱగున సకల ధన ధాన్యసమృద్ధంబును, మరీచరసము విధమున సమశీతోష్ణంబు నగు శరత్సమయంబున[24]

స్వరూపచిత్రణము -

నీలి కొండలన్ బోలు నెన్మేన దొగరు దు
 ప్పటి సంజ కెంజాయ పగిది మెరయ
స్వప్రతాపానల జ్వాల లనంగ నౌ
 దల మీరి పల్లజడలు వెలుంగ
నఖిల జగజ్జయ ప్రాప్తకీర్త్యంకురా
 కారత నెలవంక కోరలలర
నోలి ముప్పిరి గొన్న యుక్కుదూలమ్ముల
 నదగు చేతులఁ బెద్దగద చెలంగ

24. యథార్థ రామాయణము - పు.లు 182-184

ధరణి యడుగుల కదర - నమరులు బెదర
దిక్కులన్ గెల్చివచ్చెద దీవన లిడు
మన్న! యని నాకు మ్రొక్కు స్వర్ణాక్షుఁడేఁగ
ననుజునిన్ మళ్లిగన నోచనైతి నకట![25]

ఇది విష్ణువును చంపుటకై బయలుదేరి నప్పటి హిరణ్యాక్షుని ఆకారమును, హిరణ్యకశిపుడు స్మరించిన విధానము. హిరణ్యాక్షుని బృహదాకారము కనులకు కట్టినట్లుగా నున్నదీ వర్ణన

ఎక్కడఁజూచిన నక్కడనే వీని
రూపునఁ జిక్కె నాచూపుదోయి
యేవంకయున్లేని యిటువంటి రూపరి
కలఁడె నిజముగ జగమ్మునందు
మొల్ల మీసలు నగుమోము ముద్దులు మూట
గట్టెడు నిడువాలు కన్నుఁగవయు
సోగముక్కుంగ్రాల జుట్టెగు బుజములు
కడుసన్నంపుంగౌను వెడఁదఱొమ్ము

ఎంత సింగారమో బీరమంత కలిసి
యొడలు దాల్చెను సరియగు నొడ్డుపొడవు
మగఁడు నాకీతఁడైనఁ నేమనెద వీనిఁ
బెండ్లియాడిన వెలఁదియే వెలఁది బళిర[26]

శ్రీరాముని చిత్రపటమును చూచుచు సీత తలపోసిన విధమీ వర్ణనము. శ్రీరాముని ఏ శరీరభాగమును చూచినప్పుడు చూపులు ఆ శరీరభాగమందే నిల్చునట. అంతకన్న ప్రత్యంగసౌందర్య వర్ణన మేమి చేయవలయును? ఉంగరాలజుట్టనుట విశేషము.

25. ప్రహ్లాదచరిత్రము - పు. 7
26. యథార్థరామాయణము - సీతాకల్యాణవిభాగము - పు. 80

కొప్పు నిలువబడి విప్పినన్ నీలిగా
జులమలారముపోల్కఁ జెలఁగు నేల
ఏవంక గన్గొన్న నావైపుననె నల్ల
కల్వలు దండలు గట్టుచుండు
చిన్నారిపొన్నారి చిఱునవ్వు నవ్విన
జలజలముత్తెము లొలుకుచుండు
పలికినఁ గోయిలల్ చిలుకలు గోరలు
భ్రమసి భ్రమోగుచుఁ జేరబాఱుచుండు
బళిర! యాయింతి యద్దాని చెలువుచూచి
తీరవలెఁగాని కొనియాడ నేరితరము?
యాపెతో నొక్కసారి మాటైన నాడ
కున్న నీ మగబ్రతుకన్న యుత్తరిత్త[27]

ఇది సీతాసౌందర్యవర్ణనము. నిలబడి కొప్పువిప్పిన నేలమీద నీలిగాజుల మలారమువలె జుట్టుపడునట. అంత పొడవైన జుట్టు, అంత నల్లనిజుట్టు అన్న మాట. నీలిగాజుల మలారము పోలిక పాతబాణి కాదు. దాసుగారి వాణి. సీత యేవైపు చూచిన ఆవైపు నల్లకలువలదండలు కట్టినట్లగునట. ఇది అద్భుతమైన ఊహ.

మొకరితుమ్మెదల నారోసిన యట్టులు
ముంగురుల్ నొసటిపై ముద్దులూర
తెలిదమ్మిరేకులఁ దెగడు వాల్గందోయి
నెమ్మియు నోరుపు నెనరు దెలుప
పలుచాలు మల్లెమొగ్గలు చిపుర్వా తెర
కార్జాంపము బవిరిగడ్డ మమర

27. యథార్థరామాయణము – శ్రీరామ సుగ్రీవ మైత్రి విభాగము - పు. 162

కుంచపు మొదలటు గొప్పమెడయుఁ బెద్ద
తలుపువలెన్ రొమ్ము తనరుచుండ

భళిర! ముంగాళ్ళదాటు చేతులును మఱియు
నడుము పిడికిట నిముడు కుందనపుచాయ
యొడలు తిన్నని యేరాసి యొద్దుపొడువు
ఆడదేమితనిని మగవాఁడె వలచు[28]

ఇది కలలో కాంచిన సత్యవంతుని గూర్చి సావిత్రి చేసిన వర్ణనము. నొసటిపై గల ముంగురులు ధ్వనిచేయు తుమ్మెదల వారసుట, మెడమ కుంచము (కొలమానము) మొదలనుట క్రొత్త ఊహలు.

నిర్జిత పంచబాణుడైన స్థాణుని గర్వభంగము చేయుటకై విష్ణువు నారీరూపమున వచ్చినప్పటి ఆ మాయామోహినీ వర్ణనము.

ప॥ ఏరీ వాహ్వారీ యీ నారీమణికి సరి యీరేడులోకంబుల వే
సారి గులుకు మిటారి మదనుని కటారి యొయ్యారి యదోరీ
జదదాక్

1. తోయ్యాలి నెమ్మోము పున్నమచందురు-దోసిరాజనిపించురా
వయ్యారికొప్పు చమరీమృగవాలముపై కోతకోయించురా ॥యే
2. తెరవ బెదరుచూపులేడిపిల్ల దృష్టిం గిడ్డనిపించురా
తరుణి కెమ్మోవియు దొండపండు నొకతాకున గూలించురా॥యే

చిఱుగుంట కల్గిన చెక్కిలితో డుత
నద్దిరా యద్దమెట్లగునుసాటి?
ముక్కుప్రక్క మొదలు మోవిమూలవఱకుఁ
బొల్పారు వంక కే పోల్కిగలదు?

28. సావిత్రీచరిత్రము - పు. 18

హారాయలుగఁ బల్చాలు నొకవైపు గన్పఱచు
పిన్ననవ్వున కెటు వెన్నెల యెనఁ!
నడుమ చక్కని నొక్కు తొడరిన గడ్డము
పొలుపున కెద్దానిఁ బోల్చవచ్చు!
భళిర! యాత్మైకవేద్య స్వభావమహిమ
నుపమలుత్ప్రేక్షలుం దమయూహఁ బన్ని
తప్పఁబల్కుటగాక సత్యమునఁ దరమె!
యజునకైనను మఱివాని యబ్బకైన[29]

ఇట్లు దాసుగారి రచనమున శారీరకసౌందర్యవర్ణనములు మాటిమాటికి కన్పడు చుండును.

ఇక దాసుగారు వివిధవిషయాలపై చేసిన వర్ణన లనేకము[30] వానిలో మచ్చు నకు కొన్ని -

ఖరనామసంవత్సరములో ఆంధ్రదేశము భయంకర క్షామమునకు గురియైనది. ఆ భయంకర క్షామపరిస్థితులను కన్నులకు కట్టినట్లుగా దాసుగారు అక్షరరూపము చేసినతీరు -

మింటఁబవలు బొల్లి మేఘంబులున్ రాత్రి
తోఁకచుక్కయు నెప్డు తోఁచుచుండె
వాన యొక్కింతయు లేనికారణమున
నేళ్ళు చెర్వులు నూతు లింకిపోయె
పోఁతనీటన్ జవిపోయి కొంచెములగు
కూరగాయల వెల గొప్పదయ్యె

29. అంబరీషచరిత్రము - పు॥ లు 20,21
30. దాసుగారు ఆంధ్రదేశమునందలి ప్రసిద్ధ నగరాలపై, ప్రసిద్ధ వ్యక్తులపై ఇంకను అనేకాంశములపై చెప్పిన చాటువులు కొన్ని వందలు ఉన్నవి. ఇవియన్నియు 'మేలుబంతి' అను చాటుప్రబంధమున చేరినవి. వాని వివరములు మేలుబంతి' గ్రంథసమీక్షయొద్ద వచ్చినవి.

నిలువ చేసిన ధాన్యములు కొట్లలోనుండి
యంగళ్ల చేరక యణఁగియుండె

ధాన్యవర్తకు లడియాసఁ దగులుచుండ
నగరవర్తకులకుఁ బెద్ద దిగులుపుట్టె
పొలము కాఁపుల నాఁగళ్ళ మూలపట్టె
పశువు లెంగిలియాకుల పాలఁబడియె

త్యాగముచెడెఁ బేదలు కా
రాగృహముల్ దిండ్లకై చొరన్గడఁగిరి బల్
తీఁగలు చెట్లు న్మాడెన్
గ్రాఁగిన చముఁరువలె నెండ కాయుచు నుండెన్

వారుణజపములు పలుమాఱు చేయించి
చేయించి తుదకు విసిగెడు వారు

ఆయి లింగముగాఁగ వేయికుండలనీళ్ల
వెలిపించి పెదవులు విఱుచువారు

భక్తితోడ విరాటపర్వపారాయణం
బాచరించి నిరాశనందువారు

గొప్ప పిరంగులు కొండమీఁదన్నిన్ను
గుఱిపెట్టి పేల్చి వేసరెడువారు

కలియుగాంతంబిది యనుచుఁ దలఁకువారు
పాలకుల దోసమిదియని పలుకువారు
రేఁగి సిద్ధాంతులను వెక్కిరించువారు
నగుచు నన్నియెడల జనమడరఁజొచ్చె

పగలుడాఁగి రాత్రిపడినతోడనె తోఁచు
చుక్కలవలె స్త్రీలు సొంపుమీఱ

గములుగట్టి నీళ్ళకై బయల్వెడలుట
వయసువాండ్ర కన్నుపండువయ్యె

అంగనలకు శ్రమయయ్యెన్
గంగాధరులకును మిగిలి గర్వంబయ్యెన్
రంగుచెడె స్నాననిష్ఠలు
ఎంగిలిభాండముల శుద్ధి యిసుకయె చేసెన్

తొమ్మిదినూతులు తోడితిఁ గుండకు
సగమైనఁగాదని వగచునొకతె
తాఁటిచేఁదకు మడి దక్కమిఁదేనైతి
ముంతమునుఁగదంచు మూల్గునొకతె
బిందె బొరగిలంగఁ బెట్టి కూర్చుండి నీ
రెప్పటి కూరునం చేడ్చునొకతె
ఇంతదూరమువచ్చి యిఁక నెట్టులూరక
పోఁగల్గెదననుచుఁ బొగులు నొకతె
కాలుజాఱియు బావిలోఁగూలకొద్దుఁ
బట్టి బ్రతికి వచ్చితినని వడఁకు నొకతె
కడవ నడిదారిలోఁ గ్రిందఁబడి చెడ శివ
మెత్తినట్లార్చు చింటికి నేఁగు నొకతె

చీటులంటించి పోషింపఁజాలక పసు
లెచ్చటికైనఁ బోనిచ్చువారు
వర్తకుల్ నెత్తినోర్బాదుకొనుచుండ
దొమ్మిధాన్యపుకొట్లు దోఁచువారు
నీరయినను గడ్పనిండఁ ద్రావుటకు లే
కెండి వర్గయి పడియుండువారు

ఇదిగో వీసెడు పైఁడియుండుచేరెడు జొన్న
లైన నం చింటింట నడుగువారు

అన్నపానములకు నేడ్చు నర్భకులను
గాంచి యెంతయుఁ గన్నీరు గార్చువారు
మీకె బానిసలౌదుము మాకు గంజి
పోయుఁడని వీథులందు వాపోవువారు

తలుపులు మూసిలేవెచటఁ దాళము పెట్టకువేసిలేదు కు
క్కలయిన బంటులైన మఱి కావలియుండుట కానరాదు వీ
థులఁబడియుండినన్ ధనము దొంగిలఁబో రెవరైన సుంతయున్
భళిభళి రాజెవండు పరిపాలనమున్ గఱపట్లు చేసెడున్?[31]

కరవులో నీటికై కూటికై నాటిప్రజలు పడిన అష్టకష్టాలకు ఈ పద్యాష్టకము కవిత్వపు కళాయిగల దర్పణము.

అడవిని రాజ్యముగా మార్చిన దాసుగారి యూహ ఒకటి -

ధరణి తివాసి, వితానము విను, వ్రేలఁ
బడు దీపగోళము లుడులు, వెల్గు
చూపెడు దివిటీలు సూర్యచంద్రులు, కొండ
గాలిజంత్రము, తలగడలు ఱాలు
సౌధరాజము పర్ణశాల, కార్మికములు
ద్వారపాలురు, మంటి యరుగుగద్దె,
కరములు బంటులు, కాళ్లు గుఱ్ఱములు, దుం
పలు భోజనము, చెట్టుపట్ట దుస్తు

31. మేలుబంతి - పు॥ లు 162-65

జడలు సొమ్ములు, ధర్మరక్షణము ధనము
దుర్గముగుహ, యథాలాభతుష్టిపహాళి,
శమము మిత్రము, శుద్ధసత్త్వము సచివుఁడు,
యడవిరాజ్యము, మఱి మన మధిపతులము[32]

ఇట్లేచేసిన మరియొక యూహ. వీరబీభత్సరసములకు కదనరంగము రంగస్థలము. కల్యాణము శృంగారరసము తాళికట్టి అధికారము చెలాయించు శుభలగ్నము. ఈ విరుద్ధరసములకు దాసుగారు తమ ప్రతిభాబంధముతో బంధించి ప్రక్కప్రక్కన పీటలపై కూర్చుండబెట్టి వివాహము చేసిన విధము -

భూమిపీఠము, నభంబున్మేటిపందిరి,
బహుశస్త్రతతి సాక్షి వహ్నిగాఁగ
ముకుట తనుత్రాణముల నుండి డుల్లెడు
రవము త్తైముల్ దలఁబ్రాలుగాఁగ
జంబుక స్వస్తివాచకులకు శత్రుల
తలలెంతయు ఫలప్రదానములుగఁ
గూలెడి భటహాయ కుంభిభూరిధ్వను
లోలి బాజాబజంత్రీలుగాఁగ

బలువసంతము నెత్తురు వరదగాఁగ
నాకబలి ముగ్గులట్టు లాంత్రములు మెఱయ,
మఱియుఁ బగయొజ్జరంకృతి మంత్రములనఁ
బెండ్లియాడుదు సన్నహా విజయలక్ష్మి[33]

విద్యాప్రాశస్త్యమును వర్ణించిన పద్య మొకటి -

'రిఫ్లెక్టరుం' బోలి రెట్టిచేయును నైజ
మగు తెల్విదీపంబు నంటె విద్య'

---

32. యథార్థరామాయణము - పు. 129
33. సావిత్రీచరిత్రము - పు॥ లు 25, 26

కష్టకాలంబునఁగడు బీదరికమున
నల్లము నోదార్చుచుండు విద్య
దుర్వార దుర్మోహ గర్వాబ్ధిలోమున్గు
నప్పుడు పైఁదేల్చు తెప్పవిద్య
సర్వోపకారంబు సలుపఁగఁజాలెడు
నెల్లయంత్రముల పుట్టిల్లు విద్య
యట్టి విద్యలఁ బ్రతిఫలమడుగఁబోక
బోధచేయుచునుండు నీ మూగగురుల
పాత్రముల నిట్లు 'పబ్లికు' సొత్తుగాఁగ
నిచ్చు నాతని శ్రేష్ఠిగా మెచ్చరాదె[34]

తెలివి అనెడు దీపపుకాంతిని విద్య రిఫ్లెక్టరు వలె రెట్టింపుచేయుననుట, పుస్తకములు వ్రాసినవారు ప్రతిఫల మడుగక బోధచేయు మూగగురు లనుట దాసు గారి ప్రతిభాదీపకాంతులు. 'రిఫ్లెక్టరు, పబ్లికు' అను నాంగ్ల పదములను కూడ గ్రహించుట విశేషము.

రాచపుట్టులను తిట్టినతీరు -

ధనముల నాసించు దంభవిద్వాంసుల
యుత్తపాగ ట్టల కుబ్బియుబ్బి
కష్టార్జితంబుగఁ గాసైన తేలేక
కూటిసోమరియయి క్రొవ్వి క్రొవ్వి
తక్కులాడుట మాయ చిక్కులలోఁబడి
మోహంబులోపల మున్గిమున్గి
యందరికన్నఁదా నధికుఁడనని విఱ్ఱ
వీగి మీసలు పెనపెట్టి పెట్టి

34. మేలుబంతి - పు॥ లు 182-82

చదువులకుఁ జెంపపెట్టు దోసముల పట్టు
వ్యసనములకొట్టు పుణ్యకార్యముల తిట్టు
పాపములమెట్టు కడుబట్టబయలుగుట్టు
నీచు పనిముట్టు సత్తైమే రాచపుట్టు[35]

ఈలక్షణము లన్నియు రాచపుట్టులకు పుట్టుకతో పుట్టిపెరుగునవే. రాచపుట్టులకే కాదు, ఈ వ్యసనములన్నియు ప్రతి అధికారాంధుని ద్వారబంధమును వదిలిపెట్టక కావలికాయునట్టివే.

వెన్నెలలో వన్నెలాడుల ఆటల వర్ణనము -

సన్నపు వెలుఁగుతోఁ గిన్నెర జతఁజేసి
తేఁటు పొగడఁబాటఁబాడు నొకతె
యదిగోఁ జందురుఁడు నా కందె చూడుఁడీ యని
యేలిక మోము ముద్దిడు నొకర్తె
చెల్లరే వెన్నెల చీరఁగట్టితినని
తొడవులూడిచి నవ్వఁదొడఁగు నొర్తె
యీఁతలో నాకెవ్వ రెన యని నున్నని
రతనంపుఁ దిన్నెపైఁ బ్రాకు నొర్తు
కోయిలల వెక్కిరించుచున్ గూయు నొకతి
యొద్దియో తలపోయుచు నేడ్చు నొకతి
యేమి యల్లరి యని కనుఁబ్రామ నొకతి
సోలియాడెడు నొక్కతి చొక్కు నొకతి[36]

ఈ వర్ణనము జయదేవుని 'హరిరిహముగ్ధవధూనికరే....[37] అను అష్టపది యందలి 'శ్లిష్యతికామపి చుంబతికామపి రమయతి కామపి రామాం' అను చరణము

35. హరిశ్చంద్రోపాఖ్యానము - పు. 9
36. బాటసారి - ప. 56
37. గీతగోవిందమ్ - ప్ర. స. అష్టపది 4, పదము 7

నకు శీర్షపూజ. దాసుగారికి సంస్కృతకవులలో జయదేవుడన్న చాల పూజ్య భావము.

తాను పంపిన వర్తమానమును గౌరవించి వచ్చిన శ్రీకృష్ణుని దుర్గగుడిచెంత చూచి రథమును చేరుచున్న రుక్మిణీ వర్ణనము -

అడుగులు తడబాడ నడుము వడఁక సిక
    ముడి విడి పూవులు పుడమిరాలఁ
బుత్తడి మేన్నగుర్పొడువఁగ నానంద
    బాష్పముల్ గందోయిఁ బర్వుచుండ
సంభ్రమంబునఁ బైటజారఁగ సవరించు
    కరకంకణంబులు ఘల్లనంగఁ
జెక్కుటద్దంబులు చెమరింపఁ జిరునవ్వు
    ముద్దుమొగంబున మొల్కలెత్త
సందియము సిగ్గు వలపును సందడింపఁ
దన రథము చెంగట నలసటను నటించి
క్రాల్గన్నులారఁగఁ దనుఁజూచు కొమ్మను హరి
తేరిపైఁ జేయిచాచి రాఁదిగచెనంత[38]

సందియము, సిగ్గు, వలపులతో నిండిన రుక్మిణిలో కల్గిన సాత్త్వికభావముల వివరణమీ వర్ణనము.

ఇక దాసుగారి వచన వర్ణనార్తకి వేసిన వాలకముల కీలకము లనేకము. ప్రాబంధికశైలీశైలూషీ విలాసములు, ఉపమాలంకార సార్వభౌమత్వము వచనమున అడుగడుగున కనబడు అంశములు.

---

38. రుక్మిణీకల్యాణము - పు 31

కల్పనా శిల్పము :

వర్ణనలు, కల్పనలు రెండును రసనిర్వహణమునకు, పాత్రపోషణమునకు సహకరించు ప్రధానాంశములు. ఈ రెండును ఇతివృత్తమునకు సంబంధించినవే. కాని వర్ణనలు ప్రధానముగా కథాంశ వివరణములు. అనగా ప్రాతకథకే సందర్భో చితముగా ప్రతిభతో రంగరించి పూసిన క్రొత్తయూహలు. కల్పనలు కథాంశవివరణములు కావు. సందర్భోచితముగా ప్రధానకథకు కలిపిన క్రొత్త కథాఘట్టములు. వర్ణనములు భావములకు సంబంధించినవికాగా, కల్పనలు కథాఘట్టములకు సంబంధించినవి. ఈ కల్పనల కూర్పునేర్పు కల్పనా శిల్పము.

ఇట్లు కల్పనలు చేయుటకు ధనంజయుని అంగీకారమిది -

యత్త్రత్రానుచితం కించి న్నాయకస్య రసస్యవా
విరుద్ధం తత్పరిత్యాజ్యమన్యథావా ప్రకల్పయేత్ [1]

మెరుగుపెట్టబడిన ప్రాతనగలు క్రొత్తనగలవలె తళతళ లాడినట్లు ఈ క్రొత్త కల్పనముల వలన పరిచితపూర్వములైన అంశములే రసోజ్జ్వలములై క్రొత్తకాంతులతో ప్రకాశించును.

దృష్టపూర్వా అపి హ్యర్థా కావ్యేరసపరిగ్రహాత్
సర్వేనవా ఇవాభాంతి మధుమాస ఇవద్రుమాః [2]

---

1. దశరూపకము - 3 ప్రకాశము - 24 శ్లో. ఉత్తరార్ధము 25 శ్లో పూర్వార్థము- అందు (వస్తువునందు) ఏ కొంచెమైనను అనుచితమైన దున్నను, నాయకునికిగాని, రసమునకుగాని విరుద్ధమైన దున్నను, దానిని విడువనైన వలయును, వేరుగా కల్పింపనైన వలయును.
   పై శ్లోకమున మొదటి యెనిమిది యక్షరములకును 'యత్స్యాదను చితం వస్తు' అను పాఠాంతరము కలదు. అందు స్పష్టప్రతిపత్తియే కాని అర్థమునందు భేదములేదు.
2. ధ్వన్యాలోక ; చతుర్థ - శ్లో. 4 - అర్థములు ఇదివరకు చూచినవేయైనను, కావ్యమునందు రసపరిగ్రహణము వలన వసంతర్తు నందలి వృక్షములవలె నవ్యములై ప్రకాశించును.

ఇట్లు క్రొత్తగాచేసి చూపించుటే కవి ప్రతిభ. ఇట్లుచేయుట కవిబ్రహ్మలకు బ్రహ్మవిద్య కాదు. కాని బ్రహ్మసృష్టికి కలిబ్రహ్మ సృష్టికి నొక భేదమున్నది. బ్రహ్మసృష్టిలో ముందు కాంతి దానివెనుక శబ్దము పరువులెత్తును. కవిబ్రహ్మ సృష్టిలో ముందు శబ్దము, తరువాత శబ్దము నమసరించి కాంతి పరువులెత్తును.

కల్పనలు రసపోషణకు బాగుగా నుపకరించు నను రహస్యము నెరిగినవారగుటచే, దాసుగారు వారి గ్రంథములలో అనల్పముగా కథాకల్పనలను నిల్పిరి.

అంబరీషచరిత్ర హరికథలో విష్ణుచక్రము వెంటబడి తరుమగా దుర్వాస మహర్షి భయపడి పాకారిని పరమేష్ఠిని పరమేశ్వరుని శరణువేడును. ఈ సందర్భమున దాసుగారొక కల్పన చేసిరి. దుర్వాసమహర్షి శరణువేడగా ఇంద్రుడు తాను గోవర్ధనోద్ధారణ వృత్తాంతములో భంగమొందిన ఉదంతమును, చతుర్ముఖుడు గోవులను గోపబాలకులను మాయమొనరించి అవమానముపాలైన విషయమును శివుడు మాయామోహినీరూపములో వచ్చిన విష్ణువు వలన భ్రమకులోనైన కథను చెప్పి వారి అశక్తతలను చెప్పుదురు. దాసుగారు చెప్పిన ఈ మూడు కథలు భాగవతాంతర్భాగములే కాని, అంబరీషుని చరిత్రమునకు ఎట్టిసంబంధములేదు. ఈ మూడు కథలకు, అంబరీషుని చరిత్రతో సంబంధమును కల్పించినది దాసుగారిలేఖినియే. ఈ కల్పన వలన చతుర్ముఖ పరమేశ్వరులకన్న విష్ణువే శక్తిమంతుడని వివరింపబడినది.

రుక్మిణీకల్యాణ హరికథలో రుక్మిణి ముసలిబ్రాహ్మణునిచే శ్రీకృష్ణునకు సందేశము పంపుటయేకాక, ఆనవాలుగా నొక లేఖకూడ నిచ్చును. ఈ లేఖ దాసుగారి కల్పనము. ఈ కల్పనము వలన రుక్మిణి తన ప్రేమను తన ప్రియునకు తానై వివరముగా వెల్లడించుకొను అవకాశము చిక్కినది. ముసలిబ్రాహ్మణుడు సూచించుట ఔచిత్యము కాని, వివరించుట ఔచిత్యము కాదు కదా. రుక్మిణియే వివరించుకొనుట ఔచిత్యముగా నున్నది.

ఈ రుక్మిణీకల్యాణ హరికథలో మరియొక కల్పన కలదు. రుక్మిణిని శ్రీకృష్ణుడు ద్వారకకు తీసికొనివచ్చిన తర్వాత, శ్రీకృష్ణుని గదిలోనికి రుక్మిణి ప్రవేశింపగనే

గదిలో శ్రీకృష్ణుడు విశ్వరూపముతో దర్శనమిచ్చును. ఇట్లు రుక్మిణికి విశ్వరూపముతో శ్రీకృష్ణుడు దర్శనమిచ్చుట దాసుగారి కల్పనము. ఈ కల్పనమువలన ఒక ప్రయోజనమున్నది. రుక్మిణి శ్రీకృష్ణుని గూర్చి వినుటయేకాని ఇంతకు పూర్వము చూడలేదు. కనుక తాను ప్రేమించినవాడు సర్వేశ్వరుడను అభిప్రాయము ఈ విశ్వరూపసందర్శనము వలన స్థిరపడును. క్రొత్తగా గదిలో కలసికొన్న నూత్నదంపతులమధ్య ఒక సరసవినోదముగా గూడ నుండును.

శ్రీహరికథామృత హరికథ యందలి శ్రీకృష్ణజనన మను 'బిందువు' లో 'అహింసాపరమోధర్మః' అను లక్షణమునకు ఉదాహరణముగా లుబ్ధక కపోతోపాఖ్యాన కథను వ్రాసిరి. ఈ కథ శ్రీకృష్ణజనన కథతో సంబంధములేనిది. భారతము నందలి ఈ కపోతకథను ఈ కథతో అతికించినది దాసుగారే. ఈ కల్పనము వలన దాసుగారు ప్రచారము చేయదలచిన అంశము 'అహింస'. ఆ ప్రయోజనము సిద్ధించినది.

సావిత్రీచరిత్ర హరికథలో కథానాయికయైన సావిత్రి విశ్వమాతయైన సావిత్రీదేవ్యంశముగా చెప్పుట దాసుగారి కల్పన. సావిత్రి దేవ్యంశసంభూతగా కల్పించుట వలన సావిత్రీపావిత్ర్యము రవ్వలు రువ్విన కాంతిపొందినది.

ఈ సావిత్రీచరిత్రము నందలి మరియొక కల్పన. సావిత్రి భారతకథలో వలె సత్యవంతుని వినుకలి వలన ప్రేమింపదు. సావిత్రికి స్వప్నములో సత్యవంతుని దర్శన మగును. ఈ స్వప్నవృత్తాంతము దాసుగారి కల్పన. వినుకలికన్న కనుకలి బలవత్తరము. కనుక సావిత్రి మనస్సు సత్యవంతునిపై అధికముగా లగ్నమగుటకు ఈ స్వప్నదర్శన కల్పనము ప్రయోజనకరము.

జానకీశపథ హరికథలో చాలకల్పనలు కలవు. ఈ హరికథకు జానకీశపథ మనుపేరు పెట్టుటకు కారణము ఈ హరికథలో జానకి చేసిన శపథము దాసుగారి కల్పన యగుటయే.

'నిరతమున్ శ్రీరామపాదసరసిజంబులు మరువనేనిన్
మరియునే రామాజ్ఞదప్పక ధరణిలోఁ జరియింతునేనిన్

సురుచిరముగనే సాధ్వినైనచో నిపుడొక్క గడియలోనఁ
గురుపుదీరఁ బ్రజకు హాయిగాఁగురిపించుగాత పర్జన్యుఁడు వాన[3]

అని దాసుగారు జానకిచేత క్రొత్తగా చేయించిన శపథము. ఈ శపథమునకు రామాయణము నందు జానకి చేసిన శపథమునకు పోలికలేదు. 'మనోవాక్కాయ కర్మలచే శ్రీరామచంద్రుని తప్ప మరియొకరిని మనస్సులో నేను తలపనిమాట నిజమైనచో, తల్లియైన భూదేవి నాకు దారియిచ్చుగాక' అని వాల్మీకి రామాయణ (ఉత్తరకాండ - స. 110) మందలి జానకీశపథము. వాల్మీకి రామాయణమున శపథానంతరము, భూవివరము నుండి సింహాసనమురాగా, ఆ సింహాసనముపై కూర్చుండి జానకి రసాతలమున కేగును. సీతారాముల పునస్సమాగమ ప్రస్తావన లేదు. దాసుగారు క్రొత్తగా కల్పించిన శపథము 'వానకురియుట' కదా! శపథానంతరము వానకురియును. సీతరాముల పునస్సమాగమావకాశ మేర్పడినది. ఇట్లు హరికథను సుఖాంతముచేయుటయే దాసుగారు కల్పించిన క్రొత్తశపథము వలన ప్రయోజనము.

ఈ హరికథలో చిన్న చిన్న కల్పనలు చాలనున్నవి. వాల్మీకిరామాయణములో వలె సీతాపవాదమును భద్రుడను గూఢచారివలన గాక, శ్రీరాముడు మారు వేషములో నుండి తానే వినుట, సీతను గంగయొద్దున గాక ఏటియొద్దున లక్ష్మణుడు విడచుట, రామాజ్ఞను సీతకు లక్ష్మణుడు నోటితో సూటిగా చెప్పక ఎండ బడలికతో నిద్రించుచున్న సీతప్రక్కన రామాజ్ఞను ఒక పత్రముపై వ్రాసి వెళ్లుట, ఒంటిగా శోకించుచున్న సీతను వాల్మీకి శిష్యులు చూచి వాల్మీకికి చెప్పుటకాక వాల్మీకియే చూచుట, సీతకు వాల్మీకి మారుపేరుతో రహస్యముగా నుంచుట, సీతావియోగ దుఃఖముతో నిద్రించిన శ్రీరామునకు కలవచ్చుట, ఆ కలలో సీత కన్పడుట, తరువాత శివలింగదర్శన మగుట, మొదలగునవి దాసుగారు చేసిన కల్పనలు. భద్రుని వలనగాక శ్రీరాముడే అపవాదును వినుట వలన, వార్త సత్యమునకు సమీపమైనది. తానై వినుట వలన శ్రీరామునిలో బాధ యెక్కువగును. అప్పుడే నియమకాఠిన్యముతో అటువంటి కఠినాజ్ఞ నీయగలడు. గంగయొద్దునగాక ఏటియొద్దున సీతను విడచుట వలన, జీవద్వాహినియైన గంగవలెకాక, తాత్కాలికముగా అతివేగముగా ప్రవహించి మాయమగు ఏటివలె సీతాపవాదము తాత్కాలికమని సూచించుట.

3. జానకీశపథము - పు. 58

రామాజ్ఞను లక్ష్మణుడు పత్రముపై వ్రాసివెళ్లుట సుకుమారహృదయయైన సీతతో, అదరముగల లక్ష్మణుడు నోటితో చెప్పుటకు మొగముచెల్లకపోవుట, సీత యేమగునో యని భయపడుట, సీతను వాల్మీకియే చూచుట వలన వాల్మీకికి సీతదీనావస్థ ప్రత్యక్షముగా చూచుట యొకటి, తరువాత వాల్మీకి సీతను మారుపేరుతో ఆశ్రమమున కాపాడుట కవకాశ మేర్పడుట. శిష్యులు చూచి వాల్మీకికి చెప్పినచో సీతను మారు పేరుతో నుంచుటకు అవకాశముండదు కదా. శ్రీరామునకు సీత కలలో కన్పడుట శ్రీరాముని మానసికవేదనకు, శివలింగదర్శన మగుట శుభాంత మగునని సూచనలు. ఇట్లు దాసుగారు చేసిన చిన్నచిన్న కల్పనలు కూడ నిష్ప్రయోజనములు కావు.

యథార్థరామాయణము కల్పనలకు ఒక గని. ప్రస్తుతము మన యెదుట నున్న వాల్మీకిరామాయణము నందనేక ప్రక్షిప్తము లున్నవని దాసుగారి అభిప్రాయము. అందువలన వారికి నచ్చిన అంశములను ఇతర రామాయణముల నుండికూడ గ్రహించి చేర్చినారు. కొన్ని వారు చొప్పించినారు. వారు కల్పించిచొప్పించిన అంశములివి-

1. కాముని జయించితి ననుకొనుచున్న నారదునకు విష్ణువు గర్వభంగము చేయ, కోపముతో నారదుడు విష్ణుని మానవునిగా పుట్టుమని శపించును. విష్ణువు శ్రీరాముడుగా (మానవుడుగా) పుట్టు కారణములలో నిది యొంటి. ఈ యంశము తులసీరామాయణ మందలిది.

2. అహల్య పాషాణరూపనులో పడియుండును. ఇది అధ్యాత్మరామాయణ, పద్మపురాణము లందలి అంశము. దాసుగారి కథలో అహల్య రాయిగా మారినది గౌతముని శాపము వలన కాదు తనంతట తానే సతీమాహాత్మ్యముతో రాయిగా మారును. శాపావధిని గూడ తానే నిర్ణయించుకొనును.

3. సీతాస్వయంవరమునకు రాజులు చిత్రపటములు పంపుట, సీత రాముని చిత్రపటమును జూచుచు ప్రేమాలాపము లాడుట, సీతారాములు వివాహపూర్వమే ఉద్యానవనములో ఒకరినొకరు చూచుకొని పరవశులగుట - అను అంశములు దాసుగారి యథార్థరామాయణము నందున్నవి. ఈ అంశములు తులసీ రామాయణము నుండి గ్రహించినవి కావచ్చును (ఇవి యజ్ఞఫల నాటకమునను గలవు. కాని యప్పటికది వెలుగులోనికి రాలేదు).

4. తాను చేసిన పనికి కైక పశ్చాత్తాపమందును. ఇది అధ్యాత్మరామాయణాంశము.

5. సీతాపహరణ సమయమున రావణుడు సీతను భూమితోగూడ పెళ్లగించి నట్లున్నది. ఇది ఆధ్యాత్మరామాయణాంశము.

6. సీతాన్వేషణము చేయుచు సుగ్రీవుడున్న కొండప్రాంతమునకు రామలక్ష్మణులు వచ్చినపుడు, హనుమంతుడు రామలక్ష్మణులను తెలిసికొనుటకు వానర రూపముతోడనే వచ్చును. వాల్మీకీయము నందు వలె భిక్షుకుని రూపముతో రాడు.

7. రక్షింపుమని భయపడి పర్వెత్తుచున్న సుగ్రీవుని వెంటపడి తరుముచున్న వాలిని శ్రీరాముడు ఎదుటనుండియే బాణమువేసి చంపును. వాల్మీకీయము నందువలె చెట్టుచాటునుండి చంపడు.

8. సుగ్రీవుడు సీతను వెదికిపెట్టువరకు బ్రహ్మచర్యమును పూనును. వాల్మీకీయమునందు వలె భోగముల ననుభవింపడు.

9. సముద్రమునుదాటి లంకాద్వారమును చేరిన హనుమతో ద్వారపాలకురాలైన లంకిణి వాల్మీకిరామాయణము నందు వలె యుద్ధము చేయదు. యుద్ధము చేయకయే ప్రసన్నురాలై లోనికి పోనిచ్చును.

10. దుఃఖముతో తలనరుకుకొనబోవు జానకిని హనుమంతుడు చెట్టు దిగివచ్చి రక్షించును.

11. ఇంద్రజిత్తు హనుమంతుని రావణుని సింహాసనమునకు కట్టును. హనుమంతుడు తోకతో నిర్మించిన పీటపై కూర్చుండును.

12. సముద్రునిపై శ్రీరామునకు కోపమువచ్చు అవకాశము లేకుండగనే, సముద్రుడు సంతోషముతో పొంగి శ్రీరామునకు లొంగును.

13. ఇంద్రజిత్తు వేసిన అస్త్రమునకు వాల్మీకిరామాయణమునందు వలె రామలక్ష్మణులు మూర్ఛచెందరు. కపిసేన మాత్రమే మూర్ఛచెందును.

14. మండోదరి సహగమనము చేయును. ఇంద్రజిత్తు పెద్దకుమారుని యువరాజు చేయుదురు.

15. శ్రీరాముడు రావణవధానంతరము పుష్పకవిమానముపై వాల్మీకి రామాయణము నందువలె నేరుగా అయోధ్యకు వెళ్ళడు. ముందు నంద్రిగామము వెళ్లును.

ఇవి దాసుగారి యథార్థరామాయణము నందు ప్రవేశించిన అవాల్మీకీయము లైన ప్రధాన నూతన కథాంశములు.

సారంగధరనాటకమున గౌరనకథలో వలె రాజాజ్ఞచే భటులు సారంగధరుని కర చరణములు ఖండింపబడవు. జబ్బన్న యను సత్యమెరిగిన హంతకనాయకుని వలన సారంగధరుడు రక్షింపబడును. దీనితో గౌరనకథలోవలె కరచరణరహితుడై పడియున్న సారంగధరుని సిద్ధుడు వచ్చి రక్షించు అతిమానుషచర్యకు అవసరము లేకపోయినది.

ఇక హరికథలలో గౌరమ్మ పెండ్లి, ప్రబంధములలో బాటసారి. తారకము సంపూర్ణ స్వతంత్ర గ్రంథములు. వీనిలోని కథలన్నియు దాసుగారి కల్పితములే.

ఇవి నారాయణదాసుగారి గ్రంథములందున్న కల్పిత కథాంశములు, కల్పిత కథలు.

## అలంకారశోభ :

'అలం' అనగా ఆభరణము - 'అలంకారము' అన్న పదము 'అలం' నుండి యేర్పడినదే. అలంకారమన్నను ఆభరణమనియే అర్థము. దాదాపుగా ఆలంకారికు లందరు కొంచెమో గొప్పో అలంకారములను గూర్చి చర్చించుట వలనను. భామహోద్భటరుయ్యకాప్పయదీక్షితులు అలంకారములను గూర్చి ప్రత్యేకముగా గ్రంథములు వ్రాయుటవలనను, సాహిత్యశాస్త్రమును అలంకార శాస్త్రమనియు, సాహిత్య శాస్త్రవేత్తలను ఆలంకారికులు అనియు ననుటవలనను ఈ అలంకారములకు సాహిత్య శాస్త్రమునందున్న ప్రాధాన్యము వెల్లడియగుచున్నది. కావ్యనిర్వచనమున'.......... అనలంకృతీపునఃక్వాపి' (కావ్యప్రకాశము - ప్రథమోల్లాసము) అని అన్న మమ్మటుని ఖండించుచు, పీయూషవర్ష జయదేవుడు -

'అంగీకరోతి యః కావ్యం శబ్దార్థావనలంకృతీ
అసౌనమన్యతే కస్మాదనుష్ణమనలంకృతీ"[1]

---

1. చంద్రాలోకము- 1-7 - ఎవడు కావ్యము అనలంకృతముగా నుండ వచ్చునని అంగీక రించునో, అతడు నిప్పువేడి లేకుండగ నుండునని ఎందుల కంగీకరింపడు ?

అన్నమాటలు అలంకారముల ప్రాధాన్యముపై అలంకారికులకున్న చూపుకు నిదర్శనములు.

నారాయణదాసుగారి సాహిత్యసంపద యంతయు అలంకారములమయమే యైనను ఎక్కువగా పెత్తనము చెలాయించినవి శబ్దాలంకారమైన అంత్యానుప్రాసము, అర్థాలంకారమైన ఉపమ. ఈ రెండింటికి దాసుగారు ప్రాధాన్యమిచ్చుటకు కారణ మిది - హరికథ లాబాలగోపాలమున కుద్దిష్టములు. అంత్యప్రాసలు సర్వజనాకర్షకసాహిత్యప్రభాస్ఫులింగములు. ఉపరి రచన కొక సంగీతపు మొలాము వేయునట్టివి. ఉపమ కవియొక్క సువిశాల లోకజ్ఞతకు తగిన తార్కాణము. ఉపరి భావముయొక్క ఝుటితిస్ఫూర్తికి చక్కని సంచకారము.

అంత్యానుప్రాసమునకు ఉదాహరణములు కొన్ని -

బొజ్జనుండ్రాళ్ళ నించిన గుజ్జువేల్ప!
పాప జన్నిదములు వెలవంకదాల్ప!
రమ్ము భక్తుల భవసాగరమునఁదేల్ప
తగునె నాబోటి నీదు తత్త్వంబుఁబోల్ప?[2]

పికు చిట్టవల్లింపు తబ్బిబ్బుపాట -
పొసఁగ గొంతు తెలవలేని ముక్కుమాట -
కంపుతీఁగ ఫరంగి వాయింపుతాట-
యనువుకాదు తెనుఁగుచోట-నలవపాట[3]

ఆంధ్రగీర్వాణహూణభాషాళి చేవు
బహుల విద్యార్థినోములపంటకావు
శ్రీమదానందగజపతి చేతిప్రావు
విజయనగరము కాలేజి వెల్గుచూపు[4]

---

2. మేలుబంతి - పు. 1
3. దెబ్బకు దెబ్బ - అడ్వర్టయిజరు - 1-4-1942
4. మేలుబంతి - పు. 61

తీయున మెత్తన తేటతెల్లంబు
నుడులలో నచ్చతెనుంగు నయంబు
వాడుకన్దొలినాటుపల్కుల నద్దప్ప
మరిలేదు మానిసి మాటలగొప్ప[5]

జానుగానుండు ఫలవృక్షసంకులంబు
లలితబహువిధఖగమృగకలకలంబు
పూర్వవేలాసమాప సముజ్జ్వలంబు
అఖిలపురుషార్థకలిత సింహాచలంబు[6]

దాసుగారు శబ్దాలంకారముల నాదరించె ననుటకు ఈ ఉదాహరణములు చాలును.

ఇక అర్థాలంకారములు - అర్థాలంకారములలో అధికాధికముగా దర్శన మిచ్చునది ఉపమాలంకారము. "ఇంచుమించుగా దాసుగారి ప్రతిపద్యము చదువరి పెండ్లికొడుకునకు సాలంకారకన్యాదానమే. అందలంకారముల వైవిధ్యము గలదు గాని దాసుగారు ఉపమకు తాళిగట్టిరి అని ఆచార్య యస్వీజోగారావుగారి పరిశీలన సారాంశవాక్యము[7] 'కవిత్వమునకుఁ బ్రాణ ముపమ గదా" అని రాజరాజ నరేంద్రునిలో పరకాయప్రవేశముచేసి దాసుగారన్న మాటయే.[8] కనుక దాసుగారి ఉపమోపజ్ఞకు అగ్రతాంబూలమిచ్చుట విజ్ఞత.

వలయరేఖకుఁబోలి వశమె తెల్పంగ నీ
కాదిమధ్యాంతము లప్రమేయ!
యెల్లజగంబుల కీవె యధారము
లెక్కలకన్నింటి కొక్కటివలె

5. అచ్చ తెనుగుపల్కుబడి పు. 1 – ఈ అచ్చతెనుగు పల్కుబడి గ్రంథము ఆదినుండి అంతమువరకు అంతయు అంత్యానుప్రాసాలంకారభూషితమే.
6. మేలుబంతి – పు. 98
7. కచ్చపీశ్రుతులు – సంపాదకీయము – పు. 19
8 సారంగధర – పు 9

ధర్మమువై పె యెంతయు జోగుచుందువు
బలువువంకన్ ద్రాసుములు విధమునఁ
బెఱుగవు తరుగవు విభజింపఁబడవు శూ
న్యాంకమువలె సకలంక చరిత!

పిన్నకుం బిన్న పెద్దకుం బెద్దనీవు
కొలతకందవు నిన్నెన్న నలవికాదు
చెలఁగు సరిబేసివైయె నీవు తలఁచినంత
భక్తమందార! భరదూర! పరమపురుష![9]

ఇది భగవంతుని కొలుచుటకు ప్రయత్నించినతీరు. ఇందలి గణితశాస్త్రోప మానములు అదృష్టపూర్వములు.

వేసవియెండైనఁ బ్రియమగుచుండు ని
ల్లాలి చూపుల పొలయల్కమాడ్కి
హితమయ్యెడు నకాల హిమపాతమయ్యు వి
వాహమందలి యుపవాసమట్లు
పరమప్రకృతియయ్యు బహుఫలదంబగు
ననవరతంబు పితృతాజ్ఞకరణి
అభ్యున్నతంబయ్యు నతిసులభంబగు
సాధులన్ భగవత్ప్రసాదమువలె

చెమటపట్టని తావు - సౌఖ్యములప్రోవు
అలసటలగొట్టు - దొరలకు నాటపట్టు
క్రూరజంతుల వేర్వితు - క్షోణినత్తు
కనుక నీ నీలగిరియె స్వర్గంబుతునుక[10]

9. యథార్థమాయణము -పు - 137
10. మేలుబంతి - పు. 105

ఇది నీలగిరిని ఉపమించినరీతి. నీలగిరి దృశ్యములవలె ఈ ఉపమానములు నిరుపమానములు. ఎత్తుగీతిలోని అంత్యప్రాస, ఉపమానముల భావ సౌందర్యము నకు పరవశించి గంతులువైచుచున్నట్లున్నది.

పల్లమువంకఁ బ్రవర్తించె నీర్విశే
 ష్యము జాడఁజను విశేషణముభంగి
అటవి కార్చిచ్చులకాదేశమై కొండ
 వరద యాగమమయ్యెఁ జెరువులకును
అల ప్రకృతిప్రత్యయము లట్టి లన్యోన్య
 మెడయ కేళ్ళుం గాల్వలేకమయ్యె
కర్మభావప్రయోగములందుఁ దప్పని
 యాత్మనేపద మట్టిలలరెఁ గప్ప

వడి నలౌకికవిగ్రహవాక్యము గతిఁ
గోకిలరవంబు వాడుకల్లేకయుండె
పల్లవిత బహువ్రీహి సంపటలమగుచుఁ
బ్రబలివ్యాకరణమువలె వాన వెలిసె[11]

ఇది వర్షమును ఉపమించిన విధము. ఉపమానము లన్నియు వ్యాకరణ శాస్త్రసంప్రదాయము లగుట విశేషము. శాస్త్రానందమునందే మునిగితేలు వైయాకరణులను గూడ వశము చేసికొని, శాస్త్రానందముతోపాటు సాహిత్యానందము కూడ కల్గించి పరవశింపజేయగల పద్యమిది -

ధర్మార్థమెగచు మత్స్యముల లంకించు
 గ్రద్దలగతి బంతికోలలు చలింప

11. జానకీ శపథము - పు. 59

అస్వతంత్రవు బ్రతుకట్టులిట్టు ల్లూలఁ
గొట్టఁబడిన చెండ్లు మిట్టి పడఁగ
రాణివాసపు తెరలాగంటరాక మ
ధ్యస్థమా జాలు మర్యాద నిలుప
యజ్ఞవాటమువలె స్వచ్ఛమై నున్నని
హద్దులనాటపట్టలనుచుండ

భటులు మగ్గపుకండెల పగిది తిరుగ
ఓటమి న్గెల్పు లెక్కించు మాట చెలఁగ
అలక నారాయణ గజేంద్రుఁ డతిలఘువుగ
వేడుకలుమీరఁ గందుకక్రీడ సల్పె[12]

ఇది విజయనగరాధిపతియైన అలకనారాయణగజపతి కందుకక్రీడను (టెన్నిసు ఆట) ఉపమించినతీరు. ఉపమానము లన్నియు దాసప్రతిభా భాస్వంతములేయైనను, ఆటమధ్యలో నుండు తెర (నెట్) రాణివాసపు తెరవలె అంటరానిదనుట పరమాకర్షణీయముగా నున్నది.

ఒకసారి పావుర మొదిగివచ్చినయట్లు
వానకోయిల పిట్టపలికినట్లు
ఒకపరి మేల్పటా నొడిసిపట్టినయట్లు
మించుతో మబ్బు గర్జించునట్లు
ఒకమారు వెన్నెలలొలికి కాసినయట్లు
కొలనిలో జలకేళి సలుపునట్లు
ఒకతూరి గవ్వ గిలకరించినట్టులు
చేడెతో పూలచెండ్లాడునట్లు

---

12. మేలుబంతి - పు. 26

చిన్నినాయన్న నీపాట వెన్నముద్ద
లేసినట్టులు, జువ్వాల నెగిచినట్లు
సన్నచెంబేలిజాజులు జల్లినట్లు
చిన్నపూఁదేనె పైఁబయి చిందునట్లు[13]

ఇది ఆనందగజపతి ఆస్థానగాయకగ్రామణియైన పప్పు వెంకన్నగారి గాన మాధుర్యమును ఉపమించిన విధము. గాత్రమాధుర్యమువలె ఈ ఉపమానము లన్నియు సున్నితములు. మానసికానందప్రదములు.

పాలుపొంగు చూపిపై మూఁతలు బిగించి
పడెడుపోల్కి డెందముడికి నిదుర
నైన నుబ్బికనులయందు నీరై పొర్లు
చెలియవంత యెంత చెప్పదాన[14]

ఇందు ఉపమింపబడిన విషయము 'భర్తృవియోగదుఃఖముతో నున్న ఇల్లాలి కన్నీరు'. పాలుకాగి పొంగుచూపి పై మూతలను బిగించి పడినవిధముగా మనస్సు ఉడికి ఉబ్బిన కనులనుండి కన్నీరు పొర్లుచున్నదట. ఈ వుపమానము ప్రాత గ్రంథాల పాతరత్రవ్వితీసినది కాదు. దాసుగారి పరిశీలన కూపము నుండి వూరినది.

శ్వాన సంగతి యటు సంసారమిది సౌఖ్య
మామీఁద బహుళదుఃఖాకరంబు
పానకాల్రాయని బలుదుప్పివలెను భో
గేచ్ఛయెన్నటికి శాంతించబోదు
ఆకాశమందు నల్పటు తనపై బాంధ
వప్రీతి గల్గుట భ్రమకృతంబు
ఎనుముతోకనప్టై యీతకు దిగినట్లు
క్షోణీపతుల నమ్మి కొల్చుచుంట

13· శ్రీనారాయణదాస జీవిత చరిత్ర - శ్రీ మరువాడ వేంకటచయనులు పు. 251

14. బాటసారి – ప. 169

అనుచు రూఢిగఁదెలిసి సత్యంబు దయయు
గడిమిదప్పక ధర్మార్థకామములను
పరహితంబుగ సల్పెడి భాగవతులు
సంతతానంద పదవికి సాదుచుంద్రు[15]

సంసారసౌఖ్యము కుక్కబుద్ధితో, భోగేచ్ఛ పానకాలరాయని దప్పికతో, బంధుప్రీతి నభోనైల్యముతో, రాజసేవ ఎనుముతోకను పట్టుకొని ఈతకు దిగుటతో పోల్చబడినది. కుక్కబుద్ధి స్థిరములేనిది. మంగళగిరి పానకాలరాయని దాహము నకు అంతములేదు. ఆకాశము నలుపురంగులో నున్నదనుకొనుట భ్రమ. ఎనుము తోక ఈతకు నమ్మదగినదికాదు. ఇట్లు ఈ ఉపమానములన్నియు సార్థకములు, సుపరిచితములు.

బలయుతుని శూలజాడ్యంబు పట్టినట్లు
లుత్తముని దుష్టకామిని యొడసినట్లు
ధ్యానవంతుని నిద్దుర పూనినట్లు
సమదగజమును మొసలి వాజాంచి పట్టె[16]

ఇక్కడ మదకరిని మకరి పట్టుట అన్నది ఉపమింపబడిన విషయము. ఈ ఉపమానములన్నియు చక్కగా నున్నవానికి కలుగుచిక్కులే. లోకమున నిత్యము తటస్థించు నవస్థలే.

రెమ్మఁదాల్చిన యెలమావి కొమ్మమాడ్కి
బాలకునిఁ జంకఁబెట్టి యప్పంకజాక్షి
సూదివెంబడి దారంబు మాదిరిగను
ధరణిసురువెంట నేఁగు నత్తెరువునందు[17]

15. సావిత్రీచరిత్రము పు. 6
16. గజేంద్రమోక్షము – పు. 13
17. హరిశ్చంద్రోపాఖ్యానము – పు. 32

ఇది ధరణీసురుని వెంట అమ్ముడుపోయిన హరిశ్చంద్రుని భార్యాపుత్రులు వెళ్లటను గూర్చి చెప్పిన పద్యము. తల్లికొడుకులను కొమ్మరెమ్మలతో, బ్రాహ్మణుని వెంటబడియేగు చంద్రమతిని సూదివెంటబడిపోవు దారముతో పోల్చుట చక్కగానున్నది. రెమ్మకొమ్మను వీడకయుండునది. దారము సూదిని అనుసరించుటతప్ప వేరే దారి లేనిది.

ఎఱ్ఱచీరఁజూచి వెఱ్ఱియెనలు వెట్టి
పరుగులిడుచు నార్చు బఱ్ఱెఁబోలి
ప్రతిభగాంచి యోర్చు ప్రాజ్ఞతలేమిఁ బై
కుబ్బి శక్తిహీను లుల్కు-చుంద్రు[18]

ప్రతిభను చూచి యోర్చలేని శక్తిహీనులను ఎఱ్ఱచీరను చూచి బెదురు బఱ్ఱెలతో పోల్చి చెప్పిన ఈ శక్తికి గురువు లోకము.

ఒకటిసున్ననుగూడి యున్నప్పు పదిగతు
    లందు పోలిక మాయనొంది యతఁడు
తొలుతను బదివేషములఁజూపు నెవ్వాని
    జాడల జంగమసంఖ్య పెరుగు[19]

ఒకటి అను అంకె సున్నతో గూడి పదియను అంకె అయినట్లు, భగవంతుడు మాయతోగూడి పదివేషములను జూపెనట. ఒకటి అను అంకెను ఏకేశ్వరుడైన భగవంతునకు, విలువలేని సున్నను మాయకు, పది అను అంకెను దశావతారములకు ఉపమానములుగా చెప్పుట అనిదంపూర్వము.

ఎన్నఁగఁగోరనప్పు లభియించును సంపద తాలిబొమ్మకున్
సన్నుత పూజమాడ్కి-, బెలుచం దనుగోరిన రాదులచ్చి బల్

18. మార్కండేయచరిత్ర - పు. 7
19. గజేంద్రమోక్షణము - పు. 6

చన్నులు మాసకమ్మకటు, చావకతీరని గూనివంపు లా
గున్నది స్వేచ్ఛలేని బ్రతుకో జనులార! యింకేటి సౌఖ్యముల్?[20]

కోరని రాతిబొమ్మకు పూజ కలిగినట్లు, సంపద కోరనప్పుడు కలుగునట. కోరుకొనినపుడు మాసకమ్మకు చన్నులు రానియట్లు సంపద కోరుకొన్నపుడు రాదట. ఈ స్వేచ్ఛలేని బ్రతుకు ఇష్టములేకపోయినను మోయు గూనివంటిదట. ఈ ఉపమానములకు జన్మస్థలము దాసుగారి మనఃక్షేత్రము.

పానగోష్ఠి నెమ్మివలెఁ గొన్ని కాల్వలు
వానకురియునంతవఱకుఁ దోఁచి
పంకశేషములయి యింకెడున్, మఱికొన్ని
మన్ననపుడు సుజనమైత్రిఁ బోలు[21]

కాలువలను మద్యపానగోష్ఠితో నుపమించినది దాసుగారి లోకజ్ఞత.

సంజకెంజాయచే నంజనాచలమటు
కావిదుస్తుల నీలికాయమమర
నిగుడ మేరుశిఖర మినచంద్రుల
వలెఁ దలకుండలంబులు వెలుఁగఁ
గ్రొమ్మెఱుంగులతోడి క్రొక్కారు మబ్బట్లు
తారహారముల నెద విలసిల్లఁ
గొండలన్మల్లెపూచెండులగతి నెత్తఁ
జాలిన శూలము కేలఁదనర

ప్రళయ భైరవువలెఁ దాండవము సలుపుచు
నట్టహాస మఖనిశబ్ద మపహసింపఁ

20. సావిత్రీచరిత్రము - పు. 5
21. మేలుబంతి - పు. 169

గోట గోడనొక్కడుగునదాటి కుంభ
కర్ణుఁడేతెంచెఁ గపులు నల్గడలఁబాఱ[22]

'ఇరుగడ మేరుశిఖర మినచంద్రులవలెఁ దలకుండలంబులు వెలుంగ' అనునది మాఘుని ఘంటామాఘునిగా జేసిన శిశుపాలవధలోని భావమునకు (4-20) బందువుగా నున్నది.

స్వచ్ఛాయాం దర్పణేపశ్యన్ యుధ్యతే చటకోయథా
మాయాయాం స్వం వీక్షమాణం తథామూఢో విముహ్యతి[23]

మాయావృతుడైన మూఢమానవుడు దర్పణములో తన నీడతో తాను యుద్ధముచేయు పిచ్చుకవంటివాడట.

దృశ్యాప్యదృశ్యా సదసత్ స్వరూపా
త్వదీయమాయా భ్రమకారణం సా
దిగంతరేఖావదతీంద్రియం తే
తత్త్వం జగన్నాటకసూత్రధారః[24]

భ్రమకారణమైన భగవంతుని మాయను దిగంతరేఖతో పోల్చుట చమత్కారమైన ఉహ. దిగంతరేఖ ఊహలలో ఉన్నది. నిజముగా ఉన్నదనుకొనుట భ్రాంతికదా.

---

22. యథార్థరామాయణము - పు॥లు 238-39
23. శ్రీహరికథామృతమ్ - పు. 82
24. తారకము - ప్రథమ - 15 - ఓ జగన్నాటక సూత్రధారీ! నీ మాయ చిత్రమైనది. అది దృశ్యము, అదృశ్యము. సత్తు, అసత్తు అది సకల భ్రాంతి కారణము. అది దిగంతరేఖ వంటిది. నీతత్త్వము అతీంద్రియము

భేదోయథా కాండ తరంగయో ర్న
స్యాత్తే స్య లోకస్య తథైవ దేవ
సర్వప్రపంచ స్త్వయి కల్పితో వా
స్థాణౌ భవేద్దస్యురివభ్రమేణ[25]

నీటికి, కెరటమునకు భేదము లేనట్లుగా భగవంతునకు ప్రపంచమునకు భేదములేదనుట మరియొక చక్కని పోలిక.

యమునాప్రముఖా నద్యోగంగాయాం సంప్రవేశనాత్
తస్యానామైవాప్నువన్తి పత్యుర్గోత్రం యథా స్త్రియః[26]

యమున మొదలగు ప్రముఖ నదులు గంగలో చేరి గంగానది యనుపేరు పొందుట, వివాహానంతరము స్త్రీలు భర్తృగోత్రములను పొందినట్లున్నదట. ఒక భౌతిక సత్యమునకు మరియొక సంప్రదాయ సత్యమును ఉపమానముగా చెప్పుట ఇందలి విశేషము.

సొగసైనపురుషుని మగువ చేరుచునుండు
పల్లంబు వంక నీర్వాఱునట్లు'[27]
'తప్పు బయల్వడ్డచొప్పున, నోడిన
వెరపునఁ జంద్రుఁడు వెల్లఁబాఱె

25. తారకము - ప్రథమ - 13 ఓదేవా! నీటికి, తరంగమునకు భేద మెట్లు లేదో, అట్లే నీకు ప్రపంచమునకు భేదము లేదు. సర్వప్రపంచము నీయందు కల్పితము. మొద్దును చూచి దొంగ అనుకొన్నట్లు ఇదంతయు భ్రమ.

26. కాశీశతకమ్ - శ్లో. 92

27. యథార్థ రామాయణము - పు. 48

సిరి దొలింగినవాని పరివారమటు సన్న
సన్నఁగఁజుక్కలు సాఁగఁదొడఁగ"[28]

'దైవంబుచేత యంతయు మేలె సూచించు
దిక్సూచియంత్రంబుదీచి వలెను'[29]

మోద భేదము లొక్క మొగి నెండయున్వాన
కలసినయట్టు తమ్మలము చుండ[30]

'కొప్పు నిలువఁబడి విప్పినన్ నీలిగా
జల మలారముపోల్కి చెలఁగునేల'[31]

'రిఫ్లెక్టరుంబోలె రెట్టిజేయును నైజ
మగు తెల్విదీపంబు నంటి విద్య'[32]

'సహజగానకవితాశాలిదరిన్ శుష్క
శాస్త్రజ్ఞువలెఁ జుక్కసౌరుమాసె'[33]

'బంతు లెగర్చిన పగిదిఁ గాలజ్ఞతన్
జాతిమూర్ఛనలొప్ప స్వరముబాడు'[34]

ఇక వచనమున దాసుగారి ఉపమాశక్తికి ఉపమానము లేదు. మానవుని విజ్ఞానమంతయు దాని కసరత్తునకు గరిడిసాలయే. ఒక్కొక్క చిన్న అంశమునకు ఎన్నెన్ని ఉపమానములో! మచ్చునకు కొన్ని –

---

28. యథార్థరామాయణము పు. 88
29. ,, పు. 108
30. ,, పు. 162
31. ,, పు. 250
32. మేలుబంతి – పు. 181
33. జానకీ శపథము – పు. 37
34. దాసుగారు వ్రాసిన 'హరికథ' అను వ్యాసము – ఆంధ్రపత్రిక – సంవత్సరాది సంచిక (1911)

'వ్యర్థము' అను అంశమునకు -

శ్రీరామచంద్రుడులేని యీ పాడుకొంప యయోధ్యలో నుండుట - 'వృద్ధుని వివాహమాడినట్లు, లూసరక్షేత్రమున విత్తులు చల్లిన పోల్కి, నపుంసకిసేవించిన కరణి, సముద్రములో వానకురిసినచందమున, నపాత్రుల కిచ్చిన దానముచొప్పున, గ్రుడ్డి కద్దము చూపిన తెన్నున, జెవిటి చెంత సంకీర్తనరీతి, బోసినోటికిఁ జెఱకు ముక్క లందించ్చిన లాగున, నీటవ్రాసినమాడ్కి, నరణ్యరోదనము చాడ్పున, మూర్ఖున కొనర్చిన సదుపదేశముభాతిఁ, గృతఘ్నునకుఁ జేసిన మేలు విధమున, నరసికుని కడ వినియోగించిన విద్య తెఱంగున, లుబ్ధుని ధనము పగిది, నస్వతంత్రుని బీరసుతీరున, ధర్మశూన్యుని బ్రతుకు భంగి, నూతదంపువలె వ్యర్థము కదా' అని అయోధ్యానగర ప్రజలు బాధపడిరట.[35]

'పరువుదక్కించుకొనుట దుస్తరము' అను అంశమునకు -

తన భార్యనెంట నిడుకొని విదేశాటనంబుచేయువాడు - 'మొద్దునోబ్ధించు నొజ్జవలె, సన్నిపాతచికిత్సచేయు వైద్యునికరణి, శ్లేషప్రబంధమల్లు కవిమాడ్కి, నెలుగుబంటి నెదుర్కొను పేటకానిపగిది, తుపానున నోడనడుపునోడంగి భంగి, గడపై గిఱితిరుగు పీటివాని పోల్కి, ద్రుతకాలంబున నురుకు జారులు జూపు సంగీతజ్ఞుని పొలుపున, కారకార్థవాద మొనరించు శాబ్దికుని చందమున, అధ్యారోపాపవాదంబుల నిరూపించు నద్వైతిచెలువున, అనుమానంబు సాధించు నైయాయికుని తీవిన్, విధిలిఖితము నృతియించు మౌహూర్తికుల వడుపున, లంచగొండి న్గొలుచు సత్యశీలుని గమనికన్, మ్లేచ్ఛాధీనుండగు నార్యుని విధమున, లుబ్ధురాలితో కాపురముచేయు దాతలాగున, సంసారమున జిక్కు ముముక్షువు తెఱంగున పరువు దక్కించుకొనుట దుస్తరము గదా.'[36]

'కర్తవ్యాలోచనము' అను అంశమునకు -

హనుమదంగద జాంబవదాది కపివీరులు శ్రీరామచంద్రభక్తిపరవశులై - 'కష్టైలోకైలాసమేగ నుంకించు ముముక్షువుల లాగున, పూర్వపశ్చిమ భూగోళంబు

35. యథార్థరామాయణము - పు॥ - లు 144-15
36. ,, - పు॥ లు 119-20

లకు రాకపోకలకై యేకబిలము ద్రవ్వయత్నించు క్షేత్రగణితజ్ఞులవలె, కుజమండల ముతో తంత్రీవార్త లేర్పఱ్చ నూహించు శిల్పుల కరణి, రసభస్మము చేయనెంచు వైద్యుల చందమున, సగుణపరమాత్మ నిరూపణమునకై తంటాలుపడు తార్కికుల సొబగున, పృథివ్యాప్తేజోవాయువులు తప్ప నితరద్రవ్యమే లేదని సిద్ధాంతీకరింప దేవులాడు నాస్తికుల చెలువున, భూతహింసమాన్పింప దొరకొను కారుణికులరీతి కర్తవ్యమాలోచింపుచు' [37]

'కుశలవుల రామాయణగాన మాధుర్యము' అను అంశమునకు -

'అబ్బాలకులు తుమ్మెద రొదలమాడ్కి, తంత్రీనాదంబుల హెచ్చరింప కోయిలలు మ్రోగునట్లు, నెమళ్లు కూయుభంగి, బొట్లు పేలుకరణి, తారాజువ్వ లెగయు లాగున, డింకీ పావురంపు మొగ్గల తీరున, మేల్బటాసామొనర్చినగతి, చక్రంబులు తిరుగు చొప్పున, పెగ్గూపోసీల ఖదసువలె, అరబ్బీగుఱ్ఱంబులను డాంబాజీ పసందున, నేపాళపు బుంగలాడు నట్లు, నీటిపై విసరునప్డు చిల్లపెంకు లెగురు గమనికను, సన్నజాజులు జల్లు తెరంగున, కపురంపుటనటి పండ్లొలచు భంగి, మలయ మారుతము వీచు సొబగున, కొండ ప్రక్కల మాటిమాటికి హెచ్చు తగ్గులం బొర్లిపడి సుడిగొని రేగు సెలయేటి కెరటంబుల విధంబున, పూలచెండ్లాను పొలుపున, గవ్వలు గిలకరించురీతి, తేనియలూరు తెన్నున, చిత్తజల్లులాగున, పన్నీరొలుకు పోల్కి, పండుపెన్నెల కాచు పోడిమి, అమృత సారంబుగరిమ నిరుపమానంబుగ పల్కురాగభేదంబులం ద్రిస్థాయి గ్రామ మూర్ఛన లొప్పఁ బెకుక్కు తాళంబుల దశప్రాణంబులేర్పడం బ్రస్ఫుట చ్ఛందో వ్యాకరణార్థంబుల నవరసంబు లుట్టిపడ వాడవాడల శ్రీరామ చరితంబు పాడుచు నుండ.' [38]

ఇది అయోధ్యానగర వీథులలో కుశలవులు చేయుచున్న రామాయణ కథాగాన మును ఉపమించిన విధము. ఈ ఉపమానములన్నియు దాసుగారికి గానము వలె పరమానంద ప్రదములు- ఇన్ని ఉపమానముల నుపయోగించుకొని కూడ 'నిరుపమానముగ' కుశలవులు పాడుచుండిరనుట దాసుగారి గాన ప్రీతికి నిదర్శనము.

37. యథార్థరామాయణము - పు॥ లు 192-93
38. జానకీశపథము - 43

దాససాహిత్యమునుండి గ్రహించిన ఈ కొన్ని ఉదాహరణముల వలననే దాసుగారి ఉపమానసంపద జలధితరంగములవలె గణనాతీతమని స్పష్టము. అసంఖ్యాకములేకావు, అస్పృష్టపూర్వములు కూడ. ఈ ఉపమానసంపద యంతయు దాసుగారి అనేకజ్ఞత అర్జించిన స్వీయస్థిరాస్తి.

ఉపమాలంకారానంతరము దాసుగారి రచనలో తరచుగా దర్శనమిచ్చు అలంకారము స్వభావోక్తి. స్వభావోక్త్యలంకారమన ఉన్నదియున్నట్లు చెప్పుటమాత్రమే యని యనుకొనుట పొరపాటు. ఉన్నదియున్నట్లు చెప్పిన స్వభావోక్తి యగును కాని స్వభావోక్త్యలంకారము మాత్రము కాదని సాహిత్యదర్పణము నందలి స్వభావోక్తిః దురూహార్థస్వక్రియారూప వర్ణనమ్' అను లక్షణమును వ్యాఖ్యానించుచు మహామహోపాధ్యాయ పి. వి. కాణే పండితుడు చెప్పిన మాటలివి –

1. The description must be charming.
2. The description must be in reference to the 'క్రియా' and 'స్వరూప' of an object, such as child, lower animals, etc.
3. The actions and characteristics described must be peculiar to the object described and must not be such as to be common to it and others.
4. The description must be faithful and not hyperfolical.[39]

స్వభావోక్త్యలంకారమునకు రెండు ఉదాహరణములు –

ఒకలు బాగుగఁదోమి యుడుకు నీళులఁ బోసి
    పాలుపుగఁ గురులార్చి బొట్టు పెట్టి
ముచ్చట లెన్నొచు బూచిబూచి యటంచు
    పొట్టనిండఁగఁ జల్ది బువ్వనేపు
దలకి నే పడినప్పు దబ్బున వచ్చి త
    న్నుం దిట్టి కొంచు నన్నుబ్జగించు
నయ్య నాపయి నల్గు నప్పుడీ తప్పుగా
    వందగు నంచుఁ దా వచ్చునడ్డు

39. Notes on Sahitya Darpana by P. V. Kane, p. 306

అట్టి నాతల్లి యిపుడెట్టు లపలుచున్న
యదియొ? ఘోర తపంబుల నాచరించి
నన్నుఁగన్నట్టి తండ్రి యెట్లున్న వాఁడొ?
నారదా! వారినోదార్చఁ జేరరాద.[40]

ఇది బాలమార్కండేయుడు తన తల్లి లాలనలను నారదుని చెంత తలపోసిన విధము. చిన్న పిల్లలను పెంచు కన్నతల్లులకు మాత్రమే యుండునవి కదా ఈ దివ్య చర్యలు.

తొలుదొల్తఁ గాలుసేతులు కొంచెము కదిల్చి
యొప్పుగ నొకప్రక్క కొత్తిగిల్లి
వెండియుఁ బిమ్మట వెలికిలఁబడి బొజ్జ
యున్ ఔమ్ము నెగయ లోనూర్పుదీసి
బడలికన్ గన్నుఁగవన్ నీరుజారఁగ
మైవిరపునను బిట్టావులించి
పిదప మెల్లన చూపువిచ్చి యిల్లాలి నె
మ్మొగము కన్పడ, జిఱునగవు నవ్వి.
శివశివా యంచుఁ గూర్చుండి చివురుబోఁడి
యింతసేపయ్యెనను లేపకేల జాగు
చేసినావని మిగుల నచ్చెరువు వంత
సంతసము ముప్పిరిగొనంగ నింతి పల్కె[41]

ఇది సావిత్రీ సతీమాహాత్మ్యముతో పునర్జీవితు డగుచున్న సత్యవంతుని వర్ణనము. స్వభావోక్త్యలంకారమునకే అలంకారమీ పద్యము.

---

40. మార్కండేయ చరిత్ర - పు- 37
41. సావిత్రీ చరిత్రము - పు. 48

ఇక ఉత్ప్రేక్షాలంకారమునకు ఒండురెండు ఉదాహరణములు -

విశ్వేశ్వరాభిషేకాయ సతి భాగీరథీజలే
కాశ్యాం కోఽమాం వాంఛతీతి నారికేళో న జాయతే[42]

విశ్వేశ్వరాభిషేకమునకు గంగాజలముండగా నన్నెవడు కోరుకొనును? అను కారణముతో కొబ్బరిచెట్టు కాశిలో పుట్టలేదట. హేతువుకానిదానిని హేతువుగా చెప్పుటచే నిందలి యలంకారము హేతూత్ప్రేక్ష.

త్రిగుణైరేవ సంసారచక్రం భ్రమతి తత్త్వతః
బ్రువన్నితీవానడుద్భిశ్శకటో గచ్ఛతి త్రిభిః[43]

సంసారచక్ర మెప్పుడు త్రిగుణములతో తిరుగుచుండును అని చెప్పుచున్నదా యన్నట్లు మూడు ఎద్దులతో గూడిన శకటము తిరుగుచున్నదట. ఇది యొక ఉత్ప్రేక్ష.

ఇక దాసుగారి లేఖినీశ్లేషాశ్లేషములు కొన్ని -

నవరసరుచివేదీ సర్వభూతానువాదీ
లలితచరణచారీ సాధ్వలంకారధారీ
పరవశసుఖయోగశ్చిత్రసంకల్పభోగః
కవిరివ స కుమారః ప్రస్తుతో భూదుదారః[44]

ఈ శ్లోకమున కుమారతారకునకు, కవికి శ్లేషింపబడినది. కుమారతారకుడు అన్ని రుచులను తెలిసికొన్నవాడు. సర్వప్రాణులను అనుకరించుచున్నవాడు. మెత్తని పాదాలతో నడుచుచున్నవాడు. మంచి ఆభరణములను ధరించినవాడు. పరవ

42. కాశీశతకమ్ - శ్లో. 84
43. కాశీశతకమ్ - శ్లో. 83
44. తారకమ్ - ప్రథమసర్గ - శ్లో. 59

శించిన సుఖముతో, చిత్రమైన ఆలోచనలతో నున్నవాడు. కవి శృంగారాది నవరసముల నెరిగినవాడు, సర్వసృష్టిని సాహిత్యమున ప్రతిబింబింపజేయువాడు. మృదువైన కవిత్వపంక్తులలో చరించువాడు. ఉపమాద్యాద్యలంకారములను కూర్చువాడు. పరవశించి కవితాసుఖములో, లోకోత్తరములైన ఊహలలో నుండువాడు. ఇట్లు బాలతారకుని చేష్టలు, కవిచేష్టలు శ్లేషబంధముతో యుగంధరము చేయుట జరిగినది.

వాతప్రకోపం శమయన్దీపయన్జఠరానలమ్
నౌ తనోరూర్జయ ధాతూన్వైద్యాయమాస నావికైః[45]

ఈ శ్లోకమున నౌకను, వైద్యునితో శ్లేషించుట జరిగినది. వాయుతీవ్రతను తగ్గించుచు (వాతరోగమును తగ్గించుచు), ఇంజను నిప్పును రగుల్చుచు (జఠరాగ్నిని రగుల్చుచు), కావలసినవన్నియు సమకూర్చుకొనుచు (ధాతువులను సమపరచుచు) నావికులు ఓడను వైద్యునివలె చేసినారు.

ఎదిరిపట్టున్జేరు టెట్లు నాకోడి
పదును కొలంది నా వాలుచూపువాఁడి[46]

ఈ ద్విపదలో దాసుగారు వారి ప్రతిపక్షములో చేరుట సాధ్యమగునా? నా కోడి (కోడిపుంజు) ఎదుటివారి దగ్గర నుండునా? కోడిపుంజు అనగా ప్రతిభ. సమయము వచ్చినకొలది నావాలుచూపు వాడి. నూరినకొలది ఆవాలు (ఆ కత్తి) వాడి (వాదర). నూరిన కొలది ఆవగింజలకు ఘాటెక్కువ అని ఇంకొక అర్థము. ఇది వారి బుద్ధితీక్ష్ణత. ఇట్లు మొత్తము సూచనలేని శ్లేషతో వ్రాయుట చాలకష్టము. అందులకే దాసుగారు -

ఈ యద్లుదోయి లాగిం కొక్కఁదాని
జేయఁజాలిన మాసిసే నల్వసాని[47]

45. తారకమ్ - మూడవసర్గ - శ్లో 3
46. మేలుబంతి . పు. 141
47. మేలుబంతి . పు. 141

అని ఈ అడ్డుదోయి (ద్విపద) వలె ఇంకొక దానిని వ్రాయగల్గిన మనుష్యుడే సరస్వతి యని పందెము వేసినారు.

చక్రభ్రమణ కరత్వాత్కుదృష్టిభిర్గూరం వర్జమానత్వాత్
శ్రుత్యన్త ఖేలనత్వాత్ మశక! త్వామేవ మాధవం మన్యే[48]

ఈ శ్లోకమున దోమకు, విష్ణువునకు శ్లేష. ఓ మశకమా! చక్రభ్రమణ కరత్వము వలనను (చక్రమును త్రిప్పుట, గుండ్రముగా తిరుగుట), కుదృష్టుల చేత (భూలోకముపై గల దృష్టిచేత, చెడుదృష్టిచేత) దూరమును వర్జించుట వలనను. శ్రుత్యంతఖేలనము వలనను (వేదాంతవిహరణము, చెవిచెంత తిరుగుట) నిన్ను మాధవునిగా అనుకొనుచున్నాను అని భావము.

దాసుగారు శ్లేషను తక్కువగా ఆదరించినను, నిరాదరణమునకు కారణము అసామర్థ్యము కాదు అనుటకీ యుదాహరణములు చాలును. ఇవి దాసుగారి గ్రంథ కోశాగారములో గల అలంకారముల తళతళలు.

## భా షా వే ష ము :

అభిప్రాయప్రకటన సాధనములలో నుత్తమోత్తమమైనది భాష. ఈ భాషను ఏకభర్తయై యేలెడివాడు కవి. ఒక కులసతియే తన పతిచెంత వివిధ సందర్భము లలో దాసిగా, మాతగా, మంత్రిగా నెట్లు ప్రవర్తించునో, అట్లే కవితాకాంతకూడ కవిచెంత భావభారమునకు కగిన నడకలతో, అలంకారములతో వైవిధ్యమును ప్రదర్శించుచు ప్రవర్తించును. పతివ్రతకు గుణసౌందర్యముతోపాటు సౌందర్యగుణము కూడ నుండిన భర్తయెట్లు అధికతరముగా స్వాధీనమగునో, అట్లే భాషకూడ లక్షణానుకూలతతోపాటు రసికహృదయాకర్షణ లక్షణము కూడ కల్గియున్నచో పాఠకులు కవికి పాత్రలవలె వశులగుదురు.

భాషాదృష్టితో విభాగించినచో, దాసుగారి గ్రంథములలో రెండువంతులు మిశ్రాంధ్రము, ఒకవంతు సంస్కృతము, ఒకవంతు అచ్చాంధ్రము [నాటుతెనుగు]

---

48. మేలుబంతి - పు. 159

కన్పడును. రచనలదృష్టితో పరిశీలించినచో దాసుగారి సాహిత్య జీవితకాలము మూడుభాగములుగా కన్పడును. ప్రథమభాగములో మిశ్రభాషపై, ద్వితీయ భాగములో గీర్వాణాంగ్లాది భాషలపై, తృతీయభాగములో అచ్చాంధ్రము [నాటుతెనుగు] పై శ్రద్ధచూపినట్లు కన్పడును.

మిశ్రభాష :

మిశ్రభాష యనగా తత్సమ తద్భవములతో గూడిన భాష. దాసుగారి ఉపలబ్ధగ్రంథములలో మొదటిదియైన అంబరీషచరిత్రము ఈ మిశ్రభాషతో వ్రాసినదగుటచేత, ప్రారంభదశలో ఈ మిశ్రభాష యెట్లున్నదో తెలిసికొనుటకు అవకాశమున్నది. ఆ అంబరీషచరిత్రము నుండి ఒక్క ఉదాహరణము -

పాతాళగంగ నుపాయంబునం బైకి
రప్పించవచ్చు యంత్రములచేత
మెలపున జీవనదులఁ గాల్వలం దీసి
నీరు వలయుచోట్ల నింపవచ్చు
పర్వతములఁగల బలు నీటిధారల
నెప్పట్టులకునైనఁ ద్రిప్పవచ్చు
వేయేల మఱికొన్ని వెరవులఁ గోరిన
వేళ వాన గ్గురిపించవచ్చు

కర్మమునగానిదెద్దియుఁ గానరాదు
కర్మమే దైవతము జగత్కారణంబు
కర్మవశమున స్వర్గాధికారమందు
వాని కిటు లంచమిచ్చుట వట్టి వెర్రి - పు॥ లు 12, 13

ఈ అంబరీషచరిత్రము వ్రాసినది క్రి. శ. 1884 లో. అప్పటికి దాసుగారి వయస్సు ఇరువది సంవత్సరాలు. ఇరువదియేడు సంవత్సరాల వయస్సులో [క్రి. శ. 1891] వ్రాసిన మార్కండేయచరిత్రము నుండి ఒక్క ఉదాహరణము -

శారద చంద్రికా విమల చారు శరీర - సమస్తజీవనా
ధార-భుజంగహార-వినత త్రిదివాంచితవార-వేద సం
చార-తమోవిదూర-గిరిజాసుమనోధన చోర-భక్త మం
దార-లలాట లోచన వినాశిత కామవికార - శంకరా! (పు-18)

మధ్యవయస్సులో [క్రీ. శ. 1903] వ్రాసిన శ్రీసూర్యనారాయణ శతకము నుండి యొక యుదాహరణము —

పాముం జావదు కఱ్ఱయును విఱుగదన్ వార్తానుసారంబుగా
సామర్థ్యంబున వస్తుశోధనయెడన్ శంకాసమాధానముల్
సీమంబొందవుగాన జ్ఞానమునఁ దుష్టింజెందరాదెందునన్
స్వామీ! నీ పదభక్తియోగమునఁదప్పన్ సూర్యనారాయణా!
ప. 95

దాసుగారు క్రీ. శ. 1910 ప్రాంతముదాక సంస్కృతమున గ్రంథమేదియు వ్రాయలేదు. అప్పటివరకు వ్రాసిన గ్రంథము లన్నియు ఈ మిశ్రభాషయందే. అనగా దాసుగారు నలువదియారు సంవత్సరముల వరకు శ్రద్ధచూపిన మిశ్రభాషా యోషా వేషమిది.

సంస్కృతభాష : దాసుగారు చేసిన సంస్కృత రచనలు – 1. కాశీశతకము 2. రామచంద్రశతకము, 3. తారకము, 4. పురుషార్థసాధనము, 5. చాతుర్వర్గ్య సాధనము, 6. దశవిధరాగనవతికుసుమమంజరి, 7. శ్రీహరికథామృతము, 8. రుబాయతు సంస్కృతీకరణము, 9. మృత్యుంజయాష్టకమ్, 10. కావ్యనక్షత్ర మాల, 11. చాటువులు, 12. అద్వర్జయిజరు అను పత్రికలో వ్రాసిన విజ్ఞాపనమ్, విచారణా, దుఃఖస్వభావః, దేశారిష్టమ్, వైపరీత్యమ్, నిర్ణయః, అను శీర్షికలు, ఆంధ్రపత్రికలో వ్రాసిన 'త్రిలింగ దేశప్రశంసా', విడిగా వ్రాసిన వేదపాఠకః, మొదలగునవి.

త్రిలింగదేశమును గూర్చి, త్రిలింగదేశభాషను గూర్చి చెప్పిన శ్లోకములలో కొన్ని -

సమశీతోష్ణస్థిత్యా సంతత ధనధాన్యభోగ సంపత్త్యా
విద్యావినయవిభూత్యా త్రిలింగదేశశ్చ కాస్తివిఖ్యాత్యా

తృణకాష్ఠజలసమృద్ధః సంతత పావనకులీన పరిశుద్ధః
శిష్టాచారనిబద్ధః త్రిలింగదేశః ప్రసిద్ధకవివృద్ధః

త్రిలింగదేశభాషైవ పరుషాక్షర వర్జితా
విస్పష్టా సర్వసులభా స్వతంత్రా సార్వలౌకికా

త్రిలింగభాషైవాస్మాకం నాంధ్రిభాషా కదాచన
వయం ప్రమాదతోహ్యంధ్రా ఇత్యాఖ్యాతా నసంశయః

త్రిలింగభూదేవభూమిః త్రిలింగనరఏవ నా
త్రిలింగభాషైవభాషా నాత్రి కార్యవిచారణా[1]

కవిని, కావ్యమును గూర్చి వ్రాసిన ఇరువదియేడు శ్లోకములలోనివి కొన్ని-

నృత్యన్గాయన్ స్వరచితం కావ్యమాలాపయన్కవిః
స్వయం తీర్త్వా తారయతి సంప్రదాయా త్పరానపి

సరసం సందర్భశుద్ధ మపూర్వం లక్షణాన్వితమ్
సాహిత్యం సుప్రసన్నం స్యాత్ గుణాలంకార భూషితమ్

సంగీతమపి సాహిత్యం కవిపండిత శబ్దవత్
పర్యాయ పదతాంయాతి కావ్యత్వ ముభయోర్యతః

సంగీతం పుష్పముద్దిష్టం సాహిత్యం తద్రజః స్మృతమ్
ఆస్తికత్వం ఫలం ప్రోక్తం కైవల్యమ్ రస ఈరితమ్[2]

---

1. త్రిలింగదేశ ప్రశంసా – ఆంధ్రపత్రిక - 23-11-1941
2. కావ్యనక్షత్రమాలా - మేలుబంతి - పు. 136

దాసు గారికి సంస్కృత భాషపై, శ్లోకరచనపై ఎంతటి ప్రభుత్వమున్నదో ఈ శ్లోకములే సాక్ష్యములు.

నాటు తెనుగు : అచ్చ తెనుగునకు దాసు గారు పెట్టిన పేరులు నాటు తెనుగు, సీమ పలుకులు. ఈ నాటు తెనుగునకు, వ్యాకర్తల అచ్చతెనుగునకు నొక భేదమున్నది. వ్యాకర్తలు చెప్పిన అచ్చతెనుగు నందు తద్భవము లుండును. దాసుగారి నాటు తెనుగులో తద్భవముల స్పర్శ కూడ నుండదు. చిన్నయసూరి చెప్పిన 'త్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు' అనుదానికి మారు పేరు నాటు తెనుగు. 'దేశ్యము' అను పదము సంస్కృత వాసన కలదగుట కాబోలు తెనుగు పేరులైన నాటు తెనుగు, సీమ పలుకులు అని కల్పించుటకు కారణము.

తెలుఁగు మాటాడువారలు తెలుఁగువారు
కాన చెడుగులౌ యాంధ్రులు కాదు కనుక
ఆంధ్ర రాష్ట్రము మాది, నే మాంధ్రులమని
చెప్పుకొనరాదిఁకఁ దెల్గుసీమవారు[3]

అను మాటల వలన తెలుగు మాటాడు ప్రజలను ఆంధ్రులని, తెలుగు సీమను ఆంధ్ర రాష్ట్రమనియు ననుటకూడ దాసుగారికి నిష్టము లేదు. కారణము పురాణాదులలో ఆంధ్రులను చెడుగులని/మ్లేచ్ఛ జాతివారని/అనుటయే.

ఈ నాటు తెనుగును గూర్చి చాటుచాటుగా గుసగుసలాడుకొను వారికై దాసు గారు వెలిబుచ్చిన అభిప్రాయము లివి.

'పేల్చు బాసను పేల్చు బాసచేతనే పేల్చు బాసరాని వారి కెఱింగించుట కొఱ గాని పని[4]

'మొట్టమొదట వెగటుగాఁ దోఁచిన దినుసైనం జవిచూచిన కొలంది నల వాటుయై నింపుగాక మానదు కనుక నోర్మిగల మంచి చదువరులకీ నా పన్నిక కొస ముట్ట నారసిన కొలఁదిఁ జవిగొల్పక తీరదు.[5]

---

3. మేలుబంతి - పు. 87
4. వెన్నునివెయిపేర్ల వినకరి - వివరము - పు. 23
5. ఉమరుకైయాము/తెలుగు పీఠిక/ - పు. 13

'తమ సీమపల్కు పరువు నిల్పుకొను తగు చదువరులు తమవారి చెంగటన్దమ తేఁటనాటు పల్కునఁదప్ప వ్రాఁతలన్వల్లించుకొని యెదువు తెచ్చుకొన్న వచ్చీ రాని లాఁతి యాటపాటమాటమీటల న్గోటుసల్ప నోడుదురు- నిక్కమగు తెలుఁగు వాఁడఅవయేసన్నాడునా – యిటబుట్టు వెవ్వఁడైన తనబిడ్డఁడు మలకపోలిక నుండఁగోరునా – ఎవ్వని మట్టునకు వాఁడే యెక్కువ-యెవని గొప్ప వానిది - పరువైనవాఁడు లాఁతివానివలె వాలకము వేయనీయకొనునా-యెదిరికిన్లొంగునా-తనకుఁ దోచినట్లు పాడి యాడి వ్రాఁతకూఁతల న్నెఱపేర్చుకొనున్గాని పైవారలత్రోవఁ ద్రొక్కునా - ఏ సీమ వారి కాసీమ న్దొల్లింటినాటినుండి వాడుకలో నున్న యాట పాట మాట మీట మెలపులో జమైనింపు – ఎవరి వంటలు వారి వెవరి నడవడికలు వారివే సీమపల్కు లాసీమవారల కింపు.[6]

తర్కసహములైన ఈ అభిప్రాయములను ఖండిచుట కష్టము.

'తెనుఁగన్నఁదెనుఁగా? కలితీలేని తెనుఁగు. నాటుతెనుఁగు. తెలగన్న, తిమ్మన్న, మున్నగు మున్మున్న కైసరులు అంకఁనుడిమార్పులను (తద్భవములను) పెరనాడుపల్కులను (అన్యదేశ్యములను) గల్పుకొని బుల్పుపొల్పునఁ దెనుఁగు వహుల (పుస్తకముల) సల్పిరిగాని, నాటుతెనుఁగు తేటమాటలతో నిబ్బరముగాఁ గబ్బములల్ల నొల్లరైరి. వారి పేదయాదలో నంత యూఁదు దిటము లేదనవలె. మరి మన నారన్న యడియరియో నారాయణదాసు జబ్బచఱచి పని ముంగిటి కురికి యెల్లచట్టముల, నెల్లమినుకుల, ప్రాఁబల్కు తలమిన్నలసైతము తేటనాటు తెనుఁగు మాటమూటలతో నవారిగా సవారి సేసిరి. దినుసులలోఁగాని, సరకుల వంతులలోఁగాని, దేనికిఁగాని, యే. పగడ యంకునుడికైనఁ దెనుఁగు నుడి దొరకక తడఁబడి యుడిగినదిలేదు. పలురకముల కమ్మని నుడికూర్పులు తెలుగులకయి యసలు పుట్టువులఁబెట్టి తన మిడుకు కలిమిబంటపొలము నలుపుకొనిరి.'[7] అని పొగడిక లందుకొన్న ఈ తెనుగు లెంక ముచ్చటపడి మచ్చిక చేసికొన్న నాటు తెనుగువంక చూపునిల్పుదము.

నారాయణదాసుగారు నాటుతెనుగున పన్నిన పొత్తములు తొమ్మిది. ఆ కబ్బములకు వారు పెట్టినపేరులే వారి అచ్చతెనుగు ముచ్చటకు మచ్చులు.

---

6. గొరమ్మ పెండ్లి - కుదురు - పు॥లు 11, 12
7. శ్రీ మిన్నకంటి గురునాథశర్మ గారు – తెనుఁగురవ (తల్లివిన్కి పీఠిక) పు. 18

1. వెన్నుని వెయిపేర్ల వినకరి (విష్ణుసహస్రనామ సంకీర్తనము)
2. మొక్కుబడి (ఋక్సంగ్రహము, దేవతాప్రార్థనము)
3. మన్కిమిన్కు (ఆయుర్వేదము, మన్కి-ఆయువు, మిన్కు-వేదము)
4. నూఱుగంటి (నూరుకథల సంపుటము)
5. పేల్పుమాట (భగవద్గీత)
6. పేల్పువంద (స్వామిశతకము)
7. సీమపలుకువహి (అచ్చతెనుగు నిఘంటువు, వహి-పుస్తకము)
8. గౌరమ్మ పెండ్లి (గౌరీకళ్యాణము)
9. అచ్చతెలుగు పల్కుబడి

వీనిలో మొదటినాలుగు మూలములున్న గ్రంథములు. మిగిలిన ఐదు మూలములు లేని స్వతంత్ర గ్రంథములు. ఈ గ్రంథము లందలి నాటుతెనుగు భాషకు కొన్ని ఉదాహరణములు-

అచ్చతెనుగుశతకమైన 'పేల్పువంద' నుడి ఒక పద్యము-

పులిపొదువుఁ బిదుకఁ బోవచ్చుఁ గాని ని
　　న్దలఁపని చెనఁటిచెంతఁ జనరాదు
పామునోటన్గయిఁ బఱుపవచ్చుఁగాని ని
　　న్గనఁబోని ప్రముక్కుఁడి నెనయరాదు
మొసలిగలుఁగు నేట మునుఁగవచ్చుఁగాని ని
　　న్నెన కెడు ములుచ తిండి తినరాదు
వెఱ్ఱినేపి చెలిమి పెరయవచ్చుఁగాని ని
　　న్నమ్మని తులువ కొల్వుఁ గొనరాదు
ఏని నిక్కము తక్కిన దెల్ల కల్ల
యనుచుఁ గూడుకూటములకుయ్యాడు కొంటె
పల్కువినరాదు, జాళువా వలువవాల్ప!
రెంటగ్రాగుడు తిండి మెట్టంటువేల్ప! ॥ప॥-19

గౌరమ్మ పెండ్లి హరికథలో - పరమేశ్వరుని భర్తగా పొందగోరి భయంకరమైన తపము చేయుచున్న గౌరమ్మ చెంతకు వచ్చి, తపము మానుమని పరమేష్ఠి పలుకుచున్న విధము-

'ఎవనిఁగూర్చి సల్పుచుంటి విట్టి బెటుకాఁక ।యె
తపులుఁదానె నిన్నాబిలితాల్పు తాళలేక ।యె

కోరి పెండ్లియాడు నిను న్గుబ్బలి విలుకాఁడు
పేరు నింగినేల లేలు వేల్పుల మెకిమీఁడు ।యె

కడఁగి నీ కోరుకొన్న మగండు వాఁడె
యంగమెులవేలు పీడెందున్నై నఁగనఁడు
నచ్చి నీయొద్దకు న్దానె వచ్చి నిన్నుఁ
గలియు బతిమాలుకొని యింకఁ గాఁకమాను' పు-6

పొరపాటునగూడ ఒక్క తద్భవపుముక్క కూడ లేక రచన యెట్లు చక్కగా సాగినదో తెలిసికొనుటకు ఈ ఉదాహరణములు చాలును. చక్కగా సాగుటయేకాక, కృత్రిమతకు చిక్కకుంపుట విశేషము.

దాసుగారికి ఈ అచ్చతెనుగునెచ్చెలిపై ముచ్చట ఎంత పెచ్చుమీరినదన్న-

మొలక లేఁతతనము తలిరుల నవకము
మొగ్గసోగతనము పూవి తావి
తేనె తీయఁదనము తెలుగునకే కాని
మొఱకు కఱకు దయ్యపు నుడికేది?[8]

8. ఈ పద్యము అనేక పాఠాంతరములతో కన్పడుచున్నది. ప్రస్తుత పాఠము పివరి రోజులలో దాసుగారు స్వహస్తముతో వ్రాసికొన్నది. ఇది వారి వ్రాతతో అనుబంధముగా నిచ్చుట జరిగినది.

అని దేవభాషను నిందించుటదాక పోయినది. నాటుతెనుగు గొప్పతనమును గూర్చి ప్రత్యేకముగా వ్రాసిన పుస్తకము 'అచ్చతెలుఁగు పలుకుబడి'. ఈ గ్రంథము నందు కూడ మాటిమాటికి దయ్యపుసను (దేవభాషను) దుయ్యపట్టుదురు.

తానెర్గి యెర్గింపఁదగు నాటుమాట
బ్రతుకు హాయిగ బయల్పడు నెల్లచోట
వింట నల్గిన మిన్నై వేలుపుబాస
తగదు మానిసులకా దయ్యపుగోస
ఎల్ల తెలిసినదే తెల్గుబాస
తక్కినదంతయు న్దయ్యపుగోస
ఒండొరులకు నేస్తమొనరింపఁజాలు
మానిసులకు నాటు మాటలే మేలు    ద్విపదలు. 28-31

'వేల్పుమాట' గ్రంథములో బత్తుఁడు (అర్జునుడు), నల్లపేల్పు (శ్రీకృష్ణుడు) చేయు వేదాంతబోధ సంపూర్ణముగా నర్థమగుటకు -

మునుపటికంటె నిప్పుడు కొంత దారి
యగపడుచుండె నీ యూసరాఁచేత
తెల్లముగా నచ్చ తెనుగుతోఁజెప్పు    పు-30

అచ్చ తెనుగులో చెప్పుమనుట, దాసుగారికి అచ్చతెనుగుపై గల అభిమానమే కారణము.

దాసుగారు వారి నాటు తెనుగు పొత్తములలో లోకమున ప్రసిద్ధములై స్థిర పడిన సంజ్ఞలకు కూడ నాటుతెనుగుభాషలో క్రొత్తగా పేరులు పెట్టిరి.

ప్రసిద్ధములైన కొన్ని పద్యసంజ్ఞలకు వారు పెట్టిన నాటుతెనుగు పేరులు-

| | |
|---|---|
| ఆటవెలఁది | గెలుపు |
| తేఁటగీతి | ఇలపేల్పు |

| | |
|---|---|
| సీసము | ఒజ్జ |
| సీసమాలిక | తల్లి |
| ద్విపద | సైఁదోడు |
| మంజరి | బడి |
| తరువోజ | కన్నబిడ్డ |
| మధ్యాక్కరము | చదువునేర్పు |
| కందము | తండ్రి, మూపు |
| ఉత్పలమాల | కలువదండ |
| ఉత్పలమాలిక | పాలబువ్వ |
| చంపకమాల | తుమ్మెదకంటు |
| మత్తేభవిక్రీడితము | పుట్టిల్లు, ఏనుఁగుచెఱలాట |
| శార్దూలవిక్రీడితము | పుట్టుచేవ, బెబ్బులిచెఱలాట |
| మత్తకోకిల | ముద్దుపల్కు, గండుకెంపుకంటి |
| భుజంగప్రయాతము | మేడ |
| పంచచామరము | పెండ్లి వేడుక |
| స్రగ్విణి | దొడ్డకాపురము |
| పృథ్వి | చక్కదనము, అందము |
| కవిరాజవిరాజితము | కోరనికోర్కె |
| ఏకరూపావృత్తము | మంచినడత |
| కవికంఠభూషణము | గండపెండెరము |
| మణిమాల | వియ్యము |
| ప్రీతివృత్తము | బారసాల |
| మహాస్రగ్ధర | నగుమోము |
| ఉపేంద్రవజ్ర | పెత్తనము |
| వనమంజరి | గొప్పబ్రతుకు |
| మధురాక్కరము | ఇల్లాలు |

| | |
|---|---|
| మహాక్కరము | తెగువ |
| ఇంద్రవంశము | కైవారము |
| శిఖరిణి | మేల్గడన |
| ప్రియంవద | పెద్దపేరు |
| చంద్రశ్రీ | ఈవి |
| సుముఖి | తనివి |

ఇట్లే ప్రసిద్ధరాగములకు, సంజ్ఞలకు దాసుగారు క్రొత్తగా పెట్టిన తెనుగు పేరులు కొన్ని -

| | |
|---|---|
| శ్రీ | కలిమి |
| వసంతము | ఆమని |
| కేదారగౌళ | పొలముగౌరు |
| సూర్యకాంతము | వేడి |
| ఝంఝూటి | చెంజోటి |
| దర్బారు | దొరకొలువు |
| ముఖారి | నోటిపగ |
| శంకరాభరణము | లేనెల |
| పూర్ణచంద్రిక | వెన్నెల |
| కాంతామణి | పెండ్లాము |
| రాగము | అవలి |
| పల్లవి | ఎత్తుగడ |
| అనుపల్లవి | తోడు |
| చరణము | అడుగు |

ప్రసిద్ధసంజ్ఞలకు దాసుగారు క్రొత్తగా పెట్టిన ఈ నామములను వెంటనే గుర్తుపట్టుట కష్టము. పాఠకులకు ప్రసిద్ధసంజ్ఞలు పరిచితములైనట్లు ఈ క్రొత్త పేరులు పరిచితములుకావు కదా. ఇంతవరకెందులకు? దాసుగారు వారి జనన వివరమును-

'నెత్తురుగంటియేడు తూఁపురిక్క నెలబూది పెద్దవారము రేయి పదిగడియలకుఁ బాలకీ బొంగుచుక్క నాలవ యడుగున నేఁబుట్టితినఁట'[9] అని వ్రాసికొనిరి. నెత్తురుగంటి యేడు - రక్తాక్షిసంవత్సరము, తూఁపురిక్కనెల - శ్రావణమాసము, బూది-కృష్ణ చతుర్దశి, పెద్దవారము (ఇది మిశ్రసమాసము, 'పెద్దవంతు' అని అనవలసినది;) పాలకీబొంగుచుక్కనాల్గవ యడుగు- మఖానక్షత్రచతుర్థపాదము అని వెంటనే తెలి యుట కష్టము.

ఇట్లు కష్టమని యన్న దాసుగారు అంగీకరింపరు. నాటుతెనుగు భాషా పద ములను తెలిసికొననివారిని గూర్చి 'తెలుఁగునోప్రమరులు వెదకి యేర్చికూర్చుకొన నేరకపోయిరి' అని మందలించిరి. నాటుతెనుగుభాష అంత సమర్థమైనదా? అను సందియముగలవారికి 'నేలదినుసులన్నిటిం గూర్చిన పలుకులను నాటుతెనుఁగునఁ గొదువ సుంతయును లేదు' అని వారి సమాధానము. ఈ మాటలపై లోకమునకు నమ్మకము కుదురుటకై వారు చేసి చూపించిన క్రియాఫలము 'సీమపలుకువహి' అను నాటుతెనుగుపదముల నిఘంటువు.

ఈ సీమపలుకువహి పీఠికలో సంస్కృతపదాలవలె నున్న నాటుతెనుగు పదాలను, సంస్కృతమందు నాటుతెనుగునందు సమానరూపముతో కన్పడుపదాలు, పారశీక పదాలని భ్రమకల్గించు నాటుతెనుగు పదాలను, తద్భవము లనిపించు నాటు తెనుగు పదాలను, నాటుతెనుగు అవునా? కాదా? అనిపించు పదాలను పట్టికలు పట్టి కలుగా కొన్నివందలను అకారాది క్రమములో తెలిపినారు. ఈ విధముగా నచ్చ తెనుగు పదాల పరిశోధన దాసుగారికి పూర్వము గావించినవారు లేరనుట, ఆ గ్రంథ పీఠికను చూచినవారికి సాహసోక్తి అనిపింపదు.

మచ్చునకు, సంస్కృతమునందు నాటుతెనుగు నందు సమానరూపముతో కన్పడుపదాలు ఐదారు -

| పదము | సంస్కృతార్థము | నాటుతెనుగర్థము |
|---|---|---|
| గురువు | దేశికుడు | పరుగు |
| గాత్రము | శరీరము | స్థూలము (లావు) |

9. మొక్కుబడి - ప్రారంభము

| | | |
|---|---|---|
| పంకము | బురద | పాలు (క్షీరము) |
| తల్లి | యువతి | మాత |
| ముసలి | బలరాముడు | వృద్ధుడు |
| మూల | ఒక నక్షత్రము | మధ్యభాగము (విదిక్కు) |
| కల | చంద్రకళ | స్వప్నము |

గురువు, గాత్రము, పంకము అనుపదములు సంస్కృతపదములు మాత్రమే యనిపించును. తల్లి, ముసలి, మూల, కల, అను పదాలు తెనుగుపదాలని మాత్రమే యనిపించును. ఇట్లు వారు చెప్పిన పదములెన్నో! చెప్పినతీరులెన్నో! ఒక్కొక్కపదము దాసుగారి పరిశ్రమను ప్రచారముచేయు ఒక్కొక్క చాటింపుడప్పు.

ఆంగ్లేయపదాలు : దాసుదారి గ్రంథభాషలో, ముఖ్యముగా హరికథల పీఠికలలో ఆంగ్లభాషాపదములు చెదురుమదురుగా కన్పడును.

ఉపకార మెంతయో యొనరించు ముసలి బ
క్కలఁజంపనమ్ము 'మార్కెట్టు' ఁజూచి
... ... ...
'బ్రాందికి' ఁదోడుగా భక్షించు బ్రాహ్మణ
'ప్రొఫెసర్ల' చే 'బీఫు' ముక్కఁజూచి[10]

సరదాగా చెప్పిన చాటువులలో సందర్భోచితముగా ఆంగ్లేయపదములను వాడుట కన్పడును. రెండు ఉదాహరణములు-

'రిఫ్లెక్టరుం' బోలి రెట్టిజేయును నైజ
మగు తెల్విదీపంబు నంటివిద్య'[11]

చోడవరము 'డిస్ట్రిక్టుమునసబు' అయిన శ్రీ బుఱ్ఱా రాజలింగశాస్త్రి గారి పీడోక్కలు సందర్భమున చెప్పిన దొకటి-

---

10. హరిశ్చంద్రోపాఖ్యానము – పు. 6
11. మేలుబంతి – పు. 181

ప॥ ఫేర్వెల్ఫేర్వెల్బిరాజలింగ-శర్వాణీప్రియ పాదజలజాతభృంగ
1. ఫేర్వెల్ఫేర్వెల్విమలాంతరంగ-సర్వదాజనహితసత్యప్రసంగ
2. లాంగ్లివ్‌లాంగ్లివ్ లబ్ధాచ్ఛవర్ణ-ఆంగ్లేయాంధ్రవిద్యాపరిపూర్ణ
3. ఫేర్వెల్ఫేర్వెల్భితాత్రిభంగ-గర్వితకామాంధకారపతంగ[12]

స్వీయచరిత్రమైన 'నాయెఱుక' లో అన్యదేశ్యపదములతో, వైరిసమాసములతో, వ్యావహారికపదములతో భాష చాలస్వేచ్ఛగా నుండును. రాజమండ్రి టౌను హాలు' వర్ణనము నందలి కొన్ని పంక్తులు-

'అమెరికాలో సైన్టిస్టు వీనసులో మిరపకాయలతోట కనిపెట్టినాడనియు.... సురేంద్రనాథ్‌బెనర్జీ గారు స్వరాజ్యముం గూర్చి లెక్చరులో భూమిని మన్నుచేసి వేసినారనియు....లండన్ టెలిగ్రాముసుబట్టి చూడగా ప్రయివేటుశెక్రటరీగారికి ఇండియాయొక్క యభివృద్ధికై యాలోచన పుట్టకలదనియు, అల్లాబాదులో గొందరిని ప్రోసిక్యూషన్ జేసిరనియు....గవర్నరుగారు ఫలానా తేదీ మూడుగంటలకు పదేసి మినిట్లకు విజయనగరం మహారాజావారిని కలుసుకొని అయిదుగంటలకు వాల్తేరు రైలుప్లాట్‌ఫారమున నద్రస్సందుకొని ప్రెసిడెన్సీలోని భాగ్యపాటి స్థలములన్నియు జూచుకొని మరియు స్వదేశమునందు సెటిల్ కాబోవుచున్నారనియు....,[13]

సూక్తి శుక్తిజములు :

దాసుగారి వృత్తియే తన ప్రజలకు మంచిమాటలను ఆడుచు పాడుచు చెప్పుట ఇక ఈ లక్ష్యమునకు అక్షరాకృతులు వారి కృతులు. కనుక సూక్తి శుక్తిజములకు వారి రచనలు ఒక రత్నాకరమగును-వారిసూక్తుల నన్నింటిని వ్రాయుట యన్న వారి గ్రంథముల నన్నింటిని తిరిగి వ్రాయుటే, అందువలన సారంగధర నాటకమునుండి మాత్రమే కొన్ని-

1. నగర కృత్రిమములకన్న వనగిరి సహజములు రమ్యములు (పు. 10)
2. వలపు పాటయును వానియంతట నవియే కలుగవలెనుగాని యొరులు మప్పిన నేపాటి వచ్చును? (పు. 21)

12. మేలుబంతి - పు. 52
13. నాయెఱుక - పు. 175

3. పాపపు బుద్ధిగలవారు గోడను జూచి సయితము చెదరెదరు (పు-23)

4. లిఖిత మెన్నటికిని గూడదు (పు-24)

5. నిప్పుదాపున వెన్న యెట్లు కరుగకుండును (పు-25)

6. ఎంత వానినైనను కొలువులొంగదీయును (పు-56)

7. మంచినడతకలదాని యందు చదువు పరిశుద్ధ పాత్రయందున్న భక్ష్యమువలె నింపవును (పు. 45)

8. నీతులు పోత పాలవంటివి (పు- 54)

9. జారత్వదోషమెరుగని మృగాదు లెంతధన్యములు (పు-65)

10. భార్యాదుఃఖము లేని నపుంసకు డెంతటి యదృష్టవంతుడో [పు. 65]

11. పాడు మనుష్యుల కన్న పశువులు నయము [పు- 71]

12. చావున కిన్ని చావులు లేవు [పు- 73]

13. వింతలేని యావు లింత పుట్టుటెట్లు? [పు - 78]

14. స్త్రీ హృదయము చాపక్రింద నీరు వంటిది [పు-78]

15. పాతివ్రత్యము దేవుడు ఈ రెండును శబ్దమాత్రములే కాని యనుభవములో లేవు కాబోలును [పు - 78]

16. స్థితులు కట్టు వస్త్రముల వంటివి.

దాసుగారి సూక్తి శుక్తిజ సంపదనుండి కన్నులు మూసికొని సంగ్రహించినవి మాత్రమే ఇవి.

ఇది దాసుగారి లేఖిని ప్రసవించిన భాషాకాలిక రూపురేఖలు. దాసుగారు అనేక సాహితీప్రక్రియలలో సిద్ధహస్తులైనను. ప్రసిద్ధి హరిదాసుగా నెట్లువచ్చెనో, అట్లే నైకవిధ భాషాయోషావేషములను వారు ప్రదర్శించినను, దాసుగారు అనగనే గుర్తువచ్చునది నాటుతెనుగు.

**అనువాదావతారము :-**

అనువాదముచేయుట సొంతముగా గ్రంథముల్రాయుటకన్న కష్టకార్యము. సొంతముగా గ్రంథముల్రాయుటకు ఒకభాషపై అధికారమున్న చాలును. అనువాద

యితకు మూలగ్రంథభాషపై, అనువాదభాషపై, ప్రభుత్వముండవలెను. అందులకే కొఱవి గోపరాజు -

ఈ సరసోక్తి కావ్యమొకఁ డిమ్మల సంస్కృతభాషనచ్చుగాఁ
జేసిననట్లపీఁడు మఱిచేయుట యేటిదె యంచుఁ జెప్పఁగాఁ
జేసి యనాదరంబురకచేయకుఁడీ-విలుకాఁడు తూటుగా
నేసిన నందె పాఱమఱియేసిన వానిద నూటి గావునన్[1]

అని అనువాదయితృ ప్రావీణ్యమును ప్రశంసించినది. దాసుగారు బహుభాషా వల్లభులు. అందువలన వారి లేఖిని బహుభాషాప్రభుత్వము ప్రదర్శించినది.

దాసుగారి అనువాద గ్రంథములు ఆరు- 1. నవరసతరంగిణి, 2. ఉమరు ఖైయాము రుబాయతు, 3. నూఱుగంటి, 4. వెన్నుని వెయిపేర్ల వినకరి, 5. మొక్కుబడి, 6. తల్లివిన్కి.[2]

1. నవరసతరంగిణి : దీనిలో ప్రపంచప్రసిద్ధ మహాకవులైన షేక్స్పియరు కాళిదాసుల కవిత్వములను నవరసములుగా విభజించి ఆంధ్రీకరించుట జరిగినది. ఈ ఆంధ్రీకరణము ద్వివిధము. షేక్స్పియరు ఆంగ్లమునకు మిశ్రాంధ్రము, కాళిదాస సంస్కృత ప్రాకృతములకు అచ్చాంధ్రము.

2. ఉమరుఖైయాము రుబాయతు : ఈ గ్రంథమున దాసుగారు చేసిన అనువాదము నాలుగువిధములు. మూలమైన ఖైయాము రుబాయీకి ఒక సంస్కృతానువాదము, ఒక అచ్చతెనుగు అనువాదము. అదేవిధముగా ఫిట్జెరల్డు ఆంగ్లానువాదమునకు ఒక సంస్కృతానువాదము, ఒక అచ్చతెనుగు అనువాదము.

3. నూఱుగంటి : దీనిలో ఈసప్ నీతికథలనుండి నూటిని గ్రహించి వచనమున తెనుగునకు అనువదించుట జరిగినది. ప్రతి వచన కథాంతమున, ఆ కథా నీతిసారమున ఒక గీతపద్యమున వ్రాయుట జరిగినది.

---

1. సింహాసన ద్వాత్రింశిక – ప్రథమ - 35
2. ఈ గ్రంథముల నెట్లు అనువదించినది, ఆయా గ్రంథముల సమీక్షలలో ఉదాహరణములతో వివరించుట జరిగినది. ఇక్కడ వ్రాసినది దాసుగారి అనువాద గ్రంథములలో కన్పడు సూత్రప్రాయమైన అనువాద ప్రణాళిక.

4. వెన్నుని వెయిపేర్ల వినకరి : దీనిలో వ్యాసభారతము నందలి అనుశాసనిక పర్వమునందున్న భీష్మయుధిష్ఠిర సంవాదమను అధ్యాయమునవచ్చు ప్రసిద్ధమైన విష్ణుసహస్రనామస్తోత్రమును గ్రహించి, ఆ నామములను అకారాదిక్రమముగా చేర్చి వివరించుట కరిగినది. దీనిలో సంస్కృతనామములను తత్సమములుగానే వ్రాసిరి. ఆ తత్సమనామములను అచ్చతెనుగుపద్యములలో వివరించుట మాత్రము జరిగినది. అనగా సంస్కృతనామములకు అచ్చతెనుగు అనువాదము లేదు. ఆ నామముల వివరణము అచ్చతెనుగులో కన్పడును.

5. మొక్కుబడి : దీనిలో మూడువందలనాలుగు ఋక్కులను స్వరవరిచి దర్వులుగా మార్చి, అచ్చతెనుగుప 'ద్యములుగా అనువదించుట జరిగినది. అనగా ఈ గ్రంథమున దాసుగారు చేసిన పనులు రెండు. ఋక్కులను స్వరపరిచి దర్వులుగా మార్చుట, ఆ ఋక్కులను అచ్చతెనుగుపద్యములుగా అనువదించుట. ఋక్కులన్నియు పదిరకముల దర్వులుగనే పేర్చబడుట ఒక విశేషము.

6. తల్లి విన్కి : దీనిలో బ్రహ్మాండపురాణాంతర్గతమైన ప్రసిద్ధమైన లలితాసహస్ర నామములను వ్యాఖ్యానించుట జరిగినది. మొదట సంస్కృత నామము నిచ్చి, తరువాత నామార్థము, నామవివరణము మంజరీద్విపదలో వివరించుట జరిగినది.

ఈ అనువాదగ్రంథములకు సంబంధమున్న భాషల వివరములు-

1. సంస్కృతము నుండి తెనుగు : మొక్కుబడి యను నామాంతరము గల ఋక్సంగ్రహము, నవరసతరంగిణి గ్రంథమునగల కాళిదాసుని సంస్కృత శ్లోకములు, విష్ణుసహస్ర నామములు. లలితాసహస్రనామములు.

2. ప్రాకృతము నుండి తెనుగు ; నవరసతరంగిణి గ్రంథములో అనువదించిన కాళిదాసుని ప్రాకృత శ్లోకములు.

3. ఆంగ్లము నుండి తెనుగు : నవరసతరంగిణి గ్రంథములో అనువదించిన షేక్స్పియరు మహాకవి గ్రంథముల ఆంగ్లఘట్టములు, ఉమరుఖైయాము రుబాయతు గ్రంథములో అనువదించిన ఫిట్జెరల్డు ఆంగ్లపద్యములు.

4. ఆంగ్లము నుండి సంస్కృతము : సరదాగా మేలుబంతిలో సంస్కృతీకరించి చేర్చిన కొన్ని షేక్స్పియరు ఆంగ్లఘట్టములు, ఉమరుఖైయాము గ్రంథములో సంస్కృతీకరించిన ఆంగ్లపద్యములు.

5. పారశీకము నుండి తెనుగు : ఉమరుఖైయాము రుబాయతు గ్రంథములో తెనుగునకు అనువదించిన ఖైయాము కవీంద్రుని పారశీకము.

6. పారశీకము నుండి సంస్కృతము : రుబాయతు గ్రంథములో సంస్కృతమునకు అనువదించిన ఖైయాము పారశీకము.

7. సంస్కృతమునుండి ఆంగ్లము : ముచ్చటపడి ఆంగ్లానువాదము చేసి మేలుబంతి గ్రంథములో చేర్చిన కొన్ని కాళిదాసుని సంస్కృతశ్లోకములు-మచ్చున కొక అనువాదము -

తన్వీశ్యామా శిఖరిదశనా పక్వ బింబాధరోష్ఠీ
మధ్యేక్షామా చకితహరిణీప్రేక్షణా నిమ్ననాభిః
శ్రోణీభారాదలసగమనా స్తోకనమ్రా స్తనాభ్యాం
యా తత్రాస్తే యువతి విషయే సృష్టిరాద్యేవ ధాతుః

She who is there, a lovely and dslicate woman of middle age, sharp-toothed, scarlet lipped, tender waisted, gazzle eyed, deep navelled, slow footed on account of heavy loins, slightle bent down by breasts, is like the first female creation of thy creator[3]

ఇట్లు అనువాదగ్రంథములలో కన్పడు భాషలను పరామర్శించిన పిదప, ఈ భాషానువాదములలో కన్పడు దాసుగారి ప్రణాళిక[4]

1. సంస్కృతమును ఆంధ్రీకరించునపుడు పొరపాటున గూడ తత్సమపదమును గ్రహింపరు.

---

3. మేలుబంతి - పు॥ లు 216-17
4 అనువాదగ్రంథములలో నిచ్చిన ఉదాహరణము లన్నియు ఈ లక్షణములకు లక్ష్యములే.

ఈ మాటలకు 'ఆంగ్లేయభాష కాంధ్ర మొనర్చునెడ నాంగ్లేయభాషాపదముల వాడుపెట్లు తగదో, దేవభాష నైలిగించునపుడు తత్సమ మట్లుపయోగింపరాదు' అని వీరు పెట్టుకొనిన నియమమే ప్రమాణము[5]

2. ఆంగ్లభాషను ఆంధ్రీకరించునపుడు కూడ తత్సమపదరహితమైన నాటు తెనుగు పెత్తనమే యెక్కువ. తత్సమపదము లుండకూడదను కఠిన నియమము మాత్రములేదు.

3. అనువాదధోరణి 'మక్కికిమక్కి' గా కాక, తెనుగుభాషకు, తెనుగు వాతావరణమునకు దగ్గరగా నుండును.

4. అనువాదమున సంక్షిప్తత వీరి సొమ్ము.

దాసుగారి అనువాదప్రణాళికను గూర్చి - 'అనువాద మెప్పుడును అహో మూలచ్ఛేదీతవపాండిత్యమ్మనునట్లు నేలవిడిచినసాము కారాదు. అట్లని మూలమునకు చిత్తము బత్తెమనుచు అయినదానికి కానిదానికి మక్కికి మక్కిగా నుండగూడదు అనువాదభాషయొక్క స్వభావజీవలక్షణమునకు తగినట్లు తజ్జాతీయతా వాతావరణమునకు తగినట్లు సహజత్వమును కలిగియుండవలె. స్వతంత్రతపేరిట మూలాతిరేక సాహసము తగదు. అనుసరణపేరిట మూలవిధేయసాధ్వసము వలదు. ఈ అనువాద ధర్మముల కనుగలముగనేయున్నది దాసుగారి కృషి. స్వతంత్రకృతిప్రణేతయైనవాడు అనువాదయితయైనచో, ఆత డెదిరికౌశలమును గుర్తింపగలడు. తన కౌశలమును దాచుకొనలేడు, ఆ యనువాదము రాణించును అని నిరూపించిరాయన' అన్న ఆచార్య యస్వీజోగారావుగారి వాక్యములు సత్యములు.[6]

---

5. నవరసతరంగిణి - తీరిక – పుట - 12

6. కవ్యపీఠ్రుతులు - సంపాదకీయము – పు॥ 40, 41

# ౮. సంస్కార భూమికలు

మీసములేరు లేరు హరిమీఁదఁ గథల్ ప్రచరించు వారనన్
మీసము లుంచి యీ తెలుఁగు మేదిని నాటను బాట నేటియా
దాసున కంజలించెద యథార్థకథాకథనైక కీర్తికిన్
వ్యాస పరాశర ప్రభృతి భాగవత ప్రతిమాన మూర్తికిన్[1]

## భక్తి పథము

దాసుగారి కళాకల్పకము హరికథాకథనముతో అంకురించి, ఆ కథాకథన బలముచే తల్లిదండ్రులు పెట్టిన సూర్యనారాయణ అను పాతపేరు రాలిపోయి నారాయణదాసు అను పేరుగా చిగిర్చి, అరువది సంవత్సరాలు అదేపనిగా దేశము నందలి నలుమూలల హరికథలను చెప్పి హరికథాపితామహ బిరుదమున పుష్పించి, హరికథాప్రక్రియను జగజ్జ్యోతిగా ఫలింపజేసిన నారాయణదాసుగారు మేటి హరిదాసు అన్నది స్థితవిషయస్థాపనము.

హరికథలు ఆస్తికబుద్ధి ప్రచార లక్ష్యప్రధానములు. కనుక ఈ హరికథాకథన వృత్తిని చేపట్టు హరిదాసుల మనఃప్రవృత్తి ఆస్తికతామయమై యుండుట సాధారణ విషయము. ఇక కావలెనని కోరుకొని, ఎక్కడనో నక్కియున్న హరికథా ప్రక్రియను చేతబట్టి బహుళప్రచారము కావించిన దాసుగారు ఆస్తికబుద్ధి కలవారగు టలో ఆశ్చర్యమేమున్నది? పైగా వీరు ఈ హరిదాసవృత్తిని చేపట్టినది జీవనోపాధి కొరకై కాదు, కళాతృష్ణతృప్తికై, వారానందించి ఇరుగుపొరుగు వారలను ఆనందింపజేయుచు ఆస్తికమార్గప్రచారమునకై. అంతేకాక కళలు భగవదారాధన సాధనము లైనపుడే అవి సార్థకములని వీరు మాటిమాటి కనుమాట.

---

1. కళాప్రపూర్ణ శ్రీ పెన్మెత్స సత్యనారాయణరాజు - పీఠిక–వ్యాసపీఠము అను దాసుగారి వ్యాసముల సంకలన గ్రంథము.

వేల్పులం గొల్చుకొనుటకు వీలుకాని
యాటపాట చదువులెల్ల బూటకములె
కూటికై దేవులాడు టాటోటు టంకు
బొంకు టకటొంకు బడి మునిముచ్చుపనులె[2]

వేల్పులను గొల్చుటకు పనికిరాని చదువులెల్ల వ్యర్థములని చెప్పిన ఈమాట చాలదా దాసుగారు మహాభక్తులనుటకు?

ఇక దాసుగారి రచనలవైపు చూపు పెట్టినచో వీరు వ్రాసిన హరికథలు పదునాలుగు - 1. ధ్రువచరిత్రము, 2. అంబరీషచరిత్రము, 3 గజేంద్రమోక్షణము, 4. మార్కండేయచరిత్ర, 5. రుక్మిణీకల్యాణము, 6. హరిశ్చంద్రోపాఖ్యానము, 7. ప్రహ్లాదచరిత్ర, 8. భీష్మచరిత్ర, 9. సావిత్రీచరిత్రము 10. యథార్థరామాయణము, 11. జానకీశపథము, 12. గోవర్ధనోద్ధరణము, 13. శ్రీహరికథామృతము, 14. గౌరమ్మ పెండ్లి. ఇవియన్నియు భగవత్కథా సంబంధులే. ఆస్తిక్యబోధ ప్రధానదృష్టికలవే.

మచ్చునకు ఒండు రెండు ఉదాహరణములు -

నీవే సర్వంబని నిశ్చయించినవాఁడు
భవరోగ మంటఁడో పద్మనాభ!
త్వద్దివ్య నామామృతముఁ గ్రోలువాఁ డిహ
భోగంబు లొల్లఁడో భోగిశయన!
నీ పదాంబుజ భక్తి నిరతుఁడౌ వాఁ డన్య
కర్మముల్ సేయఁడో జ్ఞానరూప!
నీదు దాసులతోడ నేస్తమందినవాఁడు
పరుల సేవించఁడో పరమపురుష!

---

2. మేలుబంతి - పు. 129

నీవలన బ్రతుకున్ గాంచు నేను నిన్ను
మోసపుచ్చఁగఁబూనితి మూఢుఁడనయి
అక్కటా! గ్రుడ్డు పిల్లను వెక్కిరించు
నట్లు మాధవ! గోవింద! హరి! ముకుంద![1]

అని సర్వేశ్వరుని సర్వవిధాల గొల్చుటకు అలవాటుపడిన భక్తుని లక్షణమును వివరించిన విధమిది.

దేవ దేవ నీమహిమము దెలియ నెంతవారరా ముని
భావనా మహేశ పతిత పావనాశ్రితావనా ॥దేవ

ఏ॥ ఈ వనపర్వతవాహినులీయిన శశి నక్షత్రము
లీ విలసత్ప్రాణికోటు లెల్లయు నీ నీడలుగద ॥దేవ

1. కలలోని పదార్థములటు కల్లలుగానియెడ నీజగముల
శూన్యంబైన యాకాశమెటుల భరియించె
పలుమాటలేల చిత్త్రభమలీ ప్రకృతివిధమ్ములు
తెలిసి నిన్ను సేవించిన దీయు జనన మరణమ్ములు[2]

ఈ సృష్టియంతయు భగవంతుని నీడలు అనియు ఆ భగవంతుని నమ్మిన తప్ప ప్రాణులకు జననమరణబాధ వదలదని నమ్మట ఆస్తికప్రాణికి ఆయుః స్స్థాయువుకదా.

ఇక దాసుగారు వ్రాసిన శతకములు ఏడు. అవి- కాశీ, రామచంద్ర, ముకుంద, సూర్య, మృత్యుంజయశివ, సత్యవ్రత, రెంటచ్రాగుడు తిండిమెట్టంటు పేల్పు శతకములు. వీనిలో ఒక్క సత్యవ్రతశతకము తప్ప తక్కినవన్నియు భక్తి సంబంధులే.

---

1. అంబరీషచరిత్రము - పు॥లు 17, 18
2. మార్కండేయచరిత్ర - పు॥లు 48, 49

మచ్చునకు ముకుందశతకము నుండి -

పొందుగ నిన్నుం బాడుట
కుం దప్ప మఱొక్కవృత్తిఁ గొల్పింపకు న
న్నుం దయతో నారాయణ!
కందళితానందమూలకంద! ముకుందా! - ప. 94

ఇందలి లౌకికదంభము
లందున నామనసు నిల్ప కనవరతము నిన్
జెందించుము నారాయణ!
కందళితానంద మూలకంద! ముకుందా! - ప. 46

ఇక దాసుగారు వ్రాసిన మృత్యుంజయాష్టకము, బాలరామాయణకీర్తన, పేల్పు మాట, మొక్కుబడి, తల్లివిన్కి, వెయిపేర్ల విసకరి మొదలగునవన్నియు భక్తి భావభాండాగారములే.

దాసుగారి గ్రంథములలో అచ్చతెనుగు పలుకుబడి, తర్కసంగ్రహము, వ్యాకరణసంగ్రహము, నవరసతరంగిణి, రుబాయతు, మన్కిమిన్కు, సీమపల్కు వహి మొదలగు ననేకవిధాల గ్రంథములున్నవి. ఇవి భక్తికి సంబంధించినవి కావు. కాని ఆస్తికసిద్ధాంతమునకు విరుద్ధములైనవి మాత్రము కావు. నాస్తికతను ప్రచారముచేయు భావము దాసుగారి నలువదియాఱు గ్రంథములను కంచు కాగడాలతో కనినను కన్పడదు.

దాసుగారి వేషము, భాష, వృత్తి, ప్రవృత్తి .... అవి యివి అననేల? సర్వము భగవంతుని నమ్మిన భక్తుని లక్షణానుసారులే. దాసుగారు పొట్టభక్తులు కారు. పుట్టుభక్తులు.

త్యాగరాజు సంగీతమును, పోతరాజు సాహిత్యమును భగవదన్వేషణ కర దీపికలుగా చేసికొనగా, ఈ హరిదాసరాజు సంగీతసాహిత్యముల రెండింటిని రెండు నేత్రములుగా జేసికొని భగవంతుని అన్వేషించిన మహాభక్తశిఖామణి.

కళాకేళి :-

మానవబుద్ధి పరిధిలో పరిభ్రమించు సంస్కారగ్రహములు రెండు. 1. శాస్త్రము, 2. కళ. శాస్త్రము మానవబుద్ధి పరిశ్రమకు ఫలితము, కళ మానవునిలో దాగియున్న వాసనలకు ప్రతిబింబము, శాస్త్రము ప్రయత్న సాధ్యము, కళ అప్రయత్నదత్తము, శాస్త్రము వస్తునిష్ఠము, కళ వ్యక్తినిష్ఠము, శాస్త్రము సత్యదృష్టిప్రధానము, కళ సౌందర్యదృష్టి ప్రధానము, శాస్త్రము వ్యుత్పత్తికి రూపాంతరము, కళ ప్రతిభకు ప్రతిరూపము.

శాస్త్రప్రావీణ్యము (వ్యుత్పత్తి) మిక్కిలి అవసరమైన అంశమైనను, కళాకౌశలము (ప్రతిభ) లేనిచో శోభింపదను మాటకు

అవ్యుత్పత్తి కృతోదోషః శక్త్యా సంవ్రియతే కవేః
యస్త్వశక్తి కృతస్తస్య ఝటిత్యేవ భాసతే[1]

అని అలంకారికుల ప్రమాణము కూడ నున్నది కదా. దాసుగారు కూడ-

సహజగాన కవితాశాలి దరిన్ శుష్క
శాస్త్రజ్ఞువలెఁ జుక్క సౌరు మాసె[2]

అని ప్రకృతి వర్ణనలో కావలెనని అలంకారికుల ఈ శ్లోకార్థమునకు అద్దము పట్టినారు.

దాసుగారిని ప్రధానముగా పాణిగ్రహణము చేసిన కళలు సంగీత నాట్యములు.

సంగీతము :

ఈ సంగీతకళారహస్య నిధికి నామమాత్రముగానైనను గురువు అనుస్వారమే (శూన్యమే) యైనను, ఈ సంగీతకళ అనుస్వార మగుట (స్వరమును అనుసరించి వచ్చుట) దైవకృప.

ఐదవయేటనే పార్వతీపురమునందు రామానుజుల రంగయ్య అను పుస్తక విక్రేత ఆశ్చర్యపడునట్లుగా భాగవతపద్యములు మంచినీళ్లప్రాయముగా చదువుట,

---

1. ధ్వన్యాలోకః - ఉద్యో, 3- 5,6 కారికల మధ్యగల పరికర శ్లోకము.
3. జానకీ శపథము - పు, 37

పదేండ్ల వయసున మాతామహ స్థలమైన వంతరాము గ్రామములో బొబ్బిలి సంస్థాన వైణికులైన శ్రీ వాసా సాంబయ్యగా రంతటివారు దిగ్భ్రాంతి చెందునట్లు యథేష్ట రాగలయలతో పాడుట, విద్యార్థిదశయందే సంగీతములో పరిసరగ్రామ ప్రజలను పరవశింపజేయుట, మొదలగునవి పుట్టుకతోడనే దాసుగారికి దైవానుగ్రహము వలన రాగతాళజ్ఞాన మబ్బినట్లు తెలుపు సాక్ష్యములు.

బందరు పట్టణములో తమ శ్రోతృరంజకగాత్రముతో విరోధులను గెలిచి విజయధ్వజము నాటుట, మద్రాసు, మైసూరు మొదలగు పట్టణములలో సంగీతశక్తి వలన అనేకములైన ప్రశంసలను సన్మానములను పొందుట, విజయనగరమున రెండుతాళములతో పల్లవి పాడుట యందు ప్రవీణుడైన సుబ్రహ్మణ్యఅయ్యరు అను దాక్షిణాత్యుడే నిశ్చేష్టుడై తన వీరఘంటాకంకణము విప్పదీసి నమస్కరించునట్లుగా అయిదుతాళములతో పల్లవిపాడి పంచముఖీపరమేశ్వర బిరుదముతో ప్రసిద్ధి చెందుట, అనిదంపూర్వముగ సంగీతసాహిత్యాత్మకమైన అసాధ్యాష్టావధానము సల్పుట, ముప్పది యైదు రాగాంగములతో కీర్తనలను వ్రాసి జానకీ శపథహరికథ నొక సంగీత కళా ఖండముగా నిర్మించుట, తొంబదిరాగములతో రాగనామ నిర్దేశము చేయుచు సర్వతాళాత్మక పంచజాత్యేక తాళముతో సస్వరముగ దశవిధరాగనవతికుసుమమంజరి యను నొక అపూర్వదేవీ స్తవమును కూర్చుట, ఋక్కులను స్వరపరిచి దర్వులుగా నాంధ్రీకరించి అద్భుతగ్రంథమగు మొక్కుబడిని వ్రాయుట, మొదలగునవి దాసుగారి అసామాన్య సంగీతశాస్త్రవైదుష్యమునకు జోహారు లందుకొను సాక్ష్యములు.

ఇక వీరి పర్జన్యగర్జాగంభీరగాత్రశక్తికి, మాధుర్యమునకు, సంగీతశాస్త్ర పాండిత్యవీరమునకు పామరులు, పండితులు, ప్రభువులు వారు వీరననేల? విన్న ప్రతి రసికుడు పరవశించి చేసిన ప్రశంసలు లెక్కవేసి చెప్పవలెనన్న, వారెన్ని సారులు పాడిరో లెక్కవేయుటే.

మచ్చునకు కొన్ని గగుర్పాటులు -

1. విన్నామురా పాట-కన్నామురా నృత్య
   విన్యాసవీచికల విహరించు మధురిమలు

2. పలుకుతేనెలజిల్కు పద్మజుని రాణివిర
   కవిత వేదవ్యాసు గంభీర వాక్కురా  ।విన్నా

3. ఆ నటక ల  నృత్య మా నాట్యగతులతో
కరగించు లాస్యాల భరతముని యాడెరా  ।విన్నా

4. సంగీతవిద్యలో చక్రవర్తివి నీవు
మహతీ విపంచికా మహనీయ రూపమను  ।విన్నా

5. శంభో పదమ్ములో అంభోధి యరచెరా
కాళ్ల గజ్జెల మ్రోత కంపించె కులగిరులు  ।విన్నా

6. సప్తదశవర్ణాలు లిప్తలై నడచెరా
వాగ్గేయకారకా! ప్రజ్ఞాధురంధరా![2]  ।విన్నా

పరియొకరి ఆనందము -

స్వరము నుచ్చస్థాయి పయికొని విహరించి
యంతలో మంద్రంబు ననుకరించు

పైనుండి క్రిందకుఁ బూనినచో స్వర
మందక యెంతయు నధిగమించు

పాట బాడుచునుండు భరతమాడు మనుండు
బహురీతి గీతులఁ బలకరించు

ఆడునో పాడునో యభినయ మందునో
పై చేయి యగుచునె వన్నెఁగాంచు

ఇంతవఱకును లేఁడెందు నిట్టివాఁడు
నింక ముందును గల్గఁబోఁ డెంచిచూడ

2. శ్రీ అత్తిలి సూర్యనారాయణమూర్తిగారు - నాయెరుక - పూజా పుష్పములు
పు. 12

సతతముండును నిండు తేజమ్ము నొంది
ధార్మికుండు నారాయణదాసు జగతి[3]

ఇంకొకరి అనుభూతి -

చిల్ల పెంకేట వాలుగఁ జెర్వునందు
విసరగాఁదేలి వలయంబు లెసఁగునట్లు
పాట నారోహ మవరోహ పాటవంబుఁ
దప్పకుండఁగఁ బాడెను దా సొకండె[4]

సంగీతరసికులు పరవశించి దాసుగారికి అర్పించిన బిరుదము లివి - లయబ్రహ్మ, సంగీతసాహిత్య సార్వభౌముడు, పంచముఖీపరమేశ్వరుడు, గాయక వైణిక శేఖరుడు.

పండితులన్నట్లు 'దాసుగారికి నొడలంతయు లయయే'.

'ఆతఁడు చేయిత్రిప్పిన ముఖాంబుజము న్వీరియంగఁ జేసినన్
మూఁతిబిగించినన్ గనులు మోడ్చినఁగాళ్ల కదల్చి మోపినన్
బాతగజూచినన్ లయప్రభావము తాండవమాడుచుండు నా
జాతకుఁడెట్టి పుణ్యమును సల్పెనొ! తా లయబ్రహ్మమెంతకున్'[5]

నాట్యము :

నేడు లోకమున నాట్య, నృత్య శబ్దములను ఒకే అర్థమున ప్రయోగించుట జరుగుచున్నది. కాని శాస్త్రదృష్టితో పరిశీలించినపుడు వీని అర్థములు వేరు. ప్రాచీనాలంకారశాస్త్రగ్రంథమైన భరతుని నాట్యశాస్త్రము నందు 'నృత్య' అను శబ్దమే కన్పడదు. 'నృత్త, నాట్య' అను బబ్దములు మాత్రమే కన్పడును.

---

3. శతావధాని శ్రీ భమిడిపాటి అప్పయ్యశాస్త్రిగారు - నాయెుక - పూజా పుష్పములు-పు॥ లు 26, 27.
4. శ్రీ ఆదిభట్ట సూర్యప్రకాశం గారు – పైది - పు. 44
5. శ్రీ కట్టా గోపాలముగారు - నాయెుక–పూజాపుష్పములు – పు- 33

'నృత్త-నాట్య-నృత్య' పదముల సంబంధమును గూర్చి డాక్టరు పోణంగి శ్రీరామ అప్పారావు గారు చేసిన సమన్వయ మిది-

'కరణ-అంగహార సంపన్నమైనది నృత్తము. ఇది అర్థములను బోధించదు. కేవలము అవయవ విన్యాసములతో కూడియుండును. నాట్యము నాలుగు విధములగు అభినయములతో కూడియుండును. నృత్తము నందలి అంగ విన్యాసమును, నాట్యము నందలి అభినయమును కలిసినచో 'నృత్య' మగును. భరతుడే ఈ సమ్మేళనము చేసినట్లు కన్పట్టుచున్నది. ఇట్టిదానికి 'నృత్య' మనుపేరు తరువాత వాడుకలోనికి వచ్చినది. కాగా నృత్తము మొదట జనించినది. తరువాతిది నాట్యము. ఈ రెండింటి సమ్మేళనమే నృత్యము[6] .'

'తాండవం నటనం నాట్యం లాస్యం నృత్యంచ నర్తనమ్'[7]

అను అమరసింహుని మాటలవలన ఆకాలమునాటికే (క్రీ. శ. నాలుగవ శతాబ్దము) 'నాట్య, నృత్య' అనునవి పర్యాయపదములైనవని తెలియుచున్నది.

భరతుని నాట్యనిర్వచన మిది -

యోऽయం స్వభావో లోకస్య సుఖదుఃఖసమన్వితః
సోऽఙ్గాద్యభినయోపేతో నాట్యమిత్యభిధీయతే'[8]

భరతుని ఈ నిర్వచనము ప్రకారము, 'నాట్య' మనగా - సుఖదుఃఖములతో గూడిన ఈ లోకస్వభావమును అంగాద్యభినయములతో ప్రయోగించు రూపకము.

కాని నేడు 'నాట్య' మను పదము 'నృత్య' మను నర్థమున వ్యవహరింపబడు చున్నది. భరతనాట్యము, కూచిపూడినాట్యము, మొదలగునవి.

'నాట్యము' అను పదమును ప్రాచీనుడైన భరతుడు 'నటన' అను నర్థమున ప్రయోగింపగా, నేడు 'నృత్యము' (Dance) అను నర్థమున వ్యవహరింపబడు

---

6. నాట్యశాస్త్రము-డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు-పు. 20
7. అమర కోశము – ప్రథమకాండము - నాట్యవర్గము
8. నాట్యశాస్త్రమ్-అధ్యా. 1, శ్లో. 119– సుఖదుఃఖసమన్వితమైన ఈ లోక స్వభావము అంగాద్యభినయోపేత మగుచు 'నాట్య' మనబడును.

చున్నదని సారాంశము. 'నాట్యము' అను శబ్దమునకు గల ప్రాచీనార్థమైన 'నటన' అర్వాచీనార్థమైన 'నృత్యము' రెండును దాసుగారిలో ఉండుట విశేషము.

పాత్రోచితమైన నటనలో దాసుగారు అసాధారణప్రజ్ఞకలవారు. సమకాలీన ప్రసిద్ధనటులకు సైతము ఆశ్చర్యము కలిగించు నటన వారిది.

స్త్రీపాత్రలను ధరించి నటించుటలో మేటి యని ప్రశంస లందుకొన్న శ్రీ స్థానం నరసింహారావుగారంతటివారే ఒకసారి విజయనగర మందు 'బళ్ళారి రాఘవ మెమోరియల్ అసోసియేషను, వారు నిర్వహించిన సభలో దాసుగారి నటనా నైపుణ్యమును ప్రశంసించిన విధము -

'శ్రీ నారాయణదాసు గారు నటకావతంసులు. ఆయనకు ఇతర నటులకు చాల భేదం వుంది. మాటవరుసకు నేనే ఉన్నాను అనుకోండి. 'జహ్వారీబాయి' వేషం వేస్తాను. చీరకట్టి రైకతొడిగి కొప్పుముడిచి కాటుకపెట్టి మొగమునకు (మీసములేనిదానికి) కోటా పూస్తాను. ఆపు తొడుగులన్నీ ధరిస్తాను. తీరా స్టేజీమీదకు వచ్చి జహ్వారీపాత్ర నభినయిస్తుంటే పైటజారినా సర్దుకోటం అలవాటు లేక మానివేయగా ఒక ప్రేక్షకుడు వెటకారంగా 'కిటికీ మూసేయమ్మా' అంటాడు. నాటకంలో అభినయిస్తున్నది 'స్థానం' అంటారు కాని జహ్వారీబాయి అనే భ్రమ వారికి నూటికి నూరుపాళ్లు కలుగదు. ఇంతచేసినా నేను ప్రేక్షకులకు భ్రమ కల్గింప లేకపోయాను.

ఇక శ్రీ నారాయణదాసు గారికి పైన పేర్కొన్న పరికరములేవీ లేవు సరి కదా కాళ్ళకు గజ్జెలు, చేతిలో తాళపుచిప్పలు, సింహతలాటపు మురుగులు, మూతికి అందమైన మీసలు, లాంగని బిరుసుజుత్తు క్రొమ్ముడి, దానిపైన పూలదండ, గంధంమీద అత్తిన కుంకుమబొట్టూ ప్రస్ఫుటంగా కనబడుతూ వుంటాయి. అందులో ఆడుది అని భ్రమింపజేసే పరికరా లేవి? అయినప్పటికి ఆయన కథామధ్యలో 'రుక్మిణి యిలాగ అన్నది' అని బుగ్గమీద వేలుపెట్టుకొని అభినయిస్తే నిజంగా రుక్మిణియే ఎదురుగుండా వున్నదా? అనుకుంటాము. మూతిమీద మీసాలు మరిచి పోతాము. ఇదీ ఆయన విశిష్టత. మాకూ ఆయనకు ఎంతదూరమున్నదో గమ నార్హము'.[9]

---

9. శ్రీ నారాయణదాసుగారి జీవితవిశేషాలు - శ్రీ కర్రా సూర్యనారాయణ- నారాయణదాస శతజయంత్యుత్సవ సంచిక-సంస్కృతి సమితి, వీరాల, పు.242

దాసుగారి పాత్రోచిత నటనకు 'స్థానం' వంటివారు చేసిన ఈ ప్రశంస చాలదా? ఇక దాసుగారి నృత్యమును గూర్చి కొంత–

దాసుగారికి పూర్వము, హరికథలలో సమయోచితమైన అభినయమున్నట్లు కన్పడును గాని, నృత్యమున్నట్లు కన్పడదు. హరికథలలో సంగీత సాహిత్యములతో పాటు నృత్యమునకు కూడ ప్రాధాన్య మిచ్చినది దాసుగారే. వీరికి పూర్వమున్న కథకులు పాటలమేటులు మాత్రమే. అందులకే వారి హరికథలు శ్రవఃపర్వములు మాత్రమే. దాసుగారు పాటలమేటియే కాదు, ఆటలమేటికూడ. అందులకే ఈయన హరికథలు పాటలతో శ్రవఃపర్వములేకాక, ఆటలతో చాక్షుషక్రతువులుకూడ. అందులకే దాసుగారికి లోకము 'ఆటపాటలమేటి' అని బిరుద మిచ్చి సత్కరించుట.

దాసుగారి నృత్యమున కానందించి రసికులు వేసిన తాళములలో మచ్చున కొకటి–

> 'ఒక చరణంపుటందె పురుషోచిత తాండవశైలి చింద వే
> ఱొక పదనూపురమ్ము లలనోచిత లాస్యవిలాసమాడ నీ
> వొకఁడవె వాచికాభినయ మొప్పఁగ పాత్రలు పెక్కుదాల్చి నా
> టకగతి యక్షగానముల డక్కఁగ నేలితి దాస సద్గురూ![10]

'నాట్య' కళను కూడ దాసుగారు ఏ గురువు చెంత చిరతలదెబ్బలు తిని నేర్చుకొనలేదు. దేవదత్తమువంటి గాత్రముతోపాటు ఈ నాట్యకళ కూడ దైవదత్తమే.

## లోకాలోకనము :

రచన పదునుగా నుండుటకు, సమాజమునకు సమీపముగా నుండుటకు రచయితకు తప్పనిసరిగా నుండవలసిన లక్షణము లోకజ్ఞత. ఈ లోకజ్ఞత పూర్వగ్రంథపఠనము వలనకన్న, లోకపరిశీలనము వలన కలుగునది యెక్కువ. పండితులకు 'దేశాటనము' కూడ చాలముఖ్యమని పెద్దలనునది అందులకే.

---

10. నాయెఱుక-పూజాపుష్పాలు-పు.35-శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు

నారాయణదాసుగారికి ప్రామాణిక పఠనగ్రంథము, ఆదర్శగ్రంథము లోకమే. వారు తమ పందొమ్మిదవయేట (1883) కళాజీవిగా (హరిదాసుగా) జీవితమును ప్రారంభించినది గ్రంథములను చదివి నేర్చుకొని కాదు. లోకములో నున్న హరిదాసును (కుప్పుస్వామివాయుడు) జూచియే.

రచయితకే లోకజ్ఞాన మవసరమైనపుడు, నిత్యము ప్రజాసమూహము ఎదుట మెప్పులను కప్పములుగా గొనవలసిన సభారంజకవిద్యలను గూర్చి చెప్ప వలసినదేమియున్నది? సభారంజక లక్ష్యప్రధానములైన విద్యలలో హరికథా గానము కూడ చేరును గదా. అందులకే 'హరికథాగానము గొప్ప లాయరు వృత్తివలె నెన్నియో ప్రజ్ఞలున్నగాని బాగుగా నెరవేరదు'[1] అని పెద్ద లనుట. న్యాయవాద వృత్తి వలె, అవధానవృత్తివలె హరికథ కథనవృత్తి కూడ ప్రతిదివస ప్రసవము. వెనుకటి గొప్పలు అప్పుడు పనికిరావు. ఎప్పటికప్పుడే క్రొత్త. ప్రతిపర్యాయము ప్రత్యక్షమగు ఈ సంకటపరిస్థితిని గూర్చి శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి గారి స్వానుభవాత్మకములైన పలుకులిట స్మరణీయములు –

> చేసితినో? యెవండెఱుఁగు? చేయనె లేదొ? శతావధాన మం
> బా! సకలేశ్వరీ! గతమునందరు నమ్మరు, నేఁడెటో రసా
> భాసముగాక యుండఁగఁ గృపన్గను, మెప్పటికప్పుడే యిటుల్
> దోసిలియొగ్గు నీతఁడని తోఁచి త్యజించెదవేమొ శాంకరీ![2]

ఇక అరువది సంవత్సరాలు వేల సభలలో చెప్పిన కథలనే చెప్పియు లక్షలాది ప్రజలను ఆనందడోలికలలో నూపి, రససామ్రాజ్య పౌరులుగా మలిచిన కథక చక్రవర్తియైన దాసుగారి లోకజ్ఞతను తూచుట వారిని అవమానము చేయ చూచుటే.

వారికథలు సదస్సునుబట్టి క్రొత్తక్రొత్త అవతారము లెత్తెడివి. కొన్ని వ్యాకరణాది శాస్త్రచర్చావేదికలు. కొన్ని పాట 'కచేరీ' లు, కొన్ని సాహిత్య సభలు .... అవి యివి యననేల? వారి ప్రతికథ సభాభిరుచికి సాక్షాత్కరించిన

1. నారాయణదాస జీవితచరిత్రము- శ్రీ మరువాడ వేంకటచయనులు గారు – పు. 37

2. శతావధానసారము . పు. 139

రసదేవత. వారి హరికథలలో కథ నిమిత్తమాత్రము. సభారంజకత్వము అప్రమత్తసూత్రము. అందువలననే వారి బహుముఖప్రజ్ఞ కథన నిష్ఠమైనంతగా కథానిష్ఠము కాదు. కనుక సంగీతనాట్యముల వలెనే దాసుగారు కథన సమయమున ప్రదర్శించిన లోకజ్ఞతా ప్రభుత్వమును కొలుచుటకు అవకాశము తక్కువ. ఇక కొలుచుటకు ఇప్పుడున్న ఆధారములు వారి శక్తిలో ఏకదేశలేశములైన వారి గ్రంథములే.

దాసుగారి లోకజ్ఞత వారి రచనలందు ఆద్యంతము అల్లుకొనియున్న వల్లరియే. దిక్ప్రదర్శనముగా రెండు ఉదాహరణములు :-

1. కొండొకచో లుబ్ధుని ధనంబువలె నిష్ప్రయోజనంబులగు నూసర క్షేత్రంబుల మెండుకొనియు, కొండొకచో వ్రతభ్రష్టు మొగముకరణి వెల్తిపడియు, కొండొకచో మాఱుమనువు తెన్నున నందడి తగ్గియు, కొండొకచో బ్రహ్మసమాజంబు జాడ ద్విజకుల బాహ్యంబయి, కొండొకచో పాశ్చాత్య విద్యా పాఠశాలలం బోలి ద్రవ్యమాత్రైక గమ్యంబై, కొండొకచో గ్రామ్యభాషాకావ్యంబు కైవడి నీచజనప్రియంబై, కొండొకచో క్షూరభూపతి క్రతువుల గరిమ ప్రభూత బలిప్రియంబై, కొండొకచో తురుష్కపురంబు చొప్పున మద్యగంధబహుళంబై, కొండొకచో నాదునిక చాతుర్వర్ణ్యంబు పోలుపున సంకీర్ణంబై పరవశంబై దుర్వినీతంబై కొండొకచో నవనాగరక జీవనంబు సొబగున కాంచన ప్రధానైక గౌరవంబై నిరర్థకంబై దుష్పథంబై, కొండొకచో బాలికన్ జెట్టవట్టిన ముసలిచాయ నిర్లజ్జంబై కర్కశంబై, కొండొకచో కన్యాశుల్కము మాదిరి విప్రకృతంబై, కొండొకచో కాపురుష గణంబుభాతి ననుదారువై, కొండొకచో బాల్యవివాహవిధమున మన్మథదూరంబై ప్రియానభిజ్ఞంబై, కొండొకచో పాషండసంరక్షణంబునం బెరిగిన యార్యకుమారుని గమనిక కులధర్మశూన్యంబై వెలయు ఘోరాటవి[3]

ఘోరాటవీవర్ణన వంకతో ఇందు బైటపడినది దాసుగారి లోకజ్ఞతయే.

2. సోదెలు, పుక్కిటి పురాణములు, మెట్ట వేదాంతములు, పౌరోహిత్యము జ్యోతిషము, వైద్యము కొందరికి పుణ్య వశమున ధనార్జనమునకు దోడ్పడుచున్నవి.

---

3. యథార్థరామాయణము – పు. 67.

సింహాద్రి యప్పుడసై యుంటిని జూడుమి, నల్లబండనై యుంటని జూడుమీ నరుడా" యిట్లు కొప్పు విరిబోసి తలనాడించుచు దేవతలావేశించినట్లు సోదెలు చెప్పువారికి దప్పి తీర నోట బాలు బోయుచు గుగ్గిలపు పొగ వేయుచు నొదల జందనము రాయుచు పండ్లారగింప జేయుచు ప్రశ్నములు వేసి యుత్తరములు వినుచు దక్షిణ బెట్టువారును, "ఆంజనేయుడు సంజీవ పర్వతమును దెచ్చుచుండగా భరతుడొక కోలతో గొట్టినపుడు కొండతో గూడ హనుమానుడు రామనామోచ్చారణము సేయుచు నేలగూలగా జూచి భరతుడు తన కరస్పర్శన మాత్రమున హనుమంతుని మూర్ఛదేర్చి యొకబాణాగ్ర మున గొండతో గూడ నాంజనేయులనునిచి యా బాణమును రాముని చెంత నెగిచె" ననగా సంతోషించి పురాణములు చెప్పువారికి సత్కారము సేయువారును, 'జగత్తు కల్ల నేనెవరు నీ వెవరు అంతయు బ్రహ్మయే" యినెడు మెట్ట వేదాంతి కాపూట బత్తెమొసగువారు, "నేను మీ యమ్మ గారి తద్దిన ముల్లి బచ్చల కాడ వంకాయ మొదలగు కూరలు పనికిరావు మీ తల్లి వైతరణీనది దాటుటకు గోదానము చేయక తీరద"ని పెక్కురకములగు కర్మముల జేయించు పురోహితులకు ధనధాన్యము లిచ్చి యాదరించు వారు, నేడమావాస్య సూర్యగ్రహణ పుణ కాలము నేడు పద మూడింట వర్జ్యము, గొల్లవాని చేత నున్నది కుంచ మీ యేడు పంటలకు లోపము లేదు పగలు సూర్యుడు కాన్పించును, రాత్రి చుక్కలు కనబడును. నీకు గ్రహ చారము బాగున్నది. రాహువు ముందు శని చుట్ట కాల్చుచు దూర్పు మొగముగా గూర్చున్నందున దేశారిష్టము కలుగు నని చెప్పు జ్యోతిష్కునకు డబ్బిచ్చువారు, "ఈ యౌషధము కనక సుందరి శుద్ధిచేసిన రస విష గంధకములతో తయారైనది, యేడు మాత్రలు మూడు పూటలు సరీగా తూచి పుచ్చుకొన్నచో మీ యామ వాత ముపశమించును రోగి చేయి చూచినాను. మీ రెందరేమో భయపడుచున్నారు గాని నాకెంత మాత్రమును భయములే" దనుచు వ్యాధి కుదిరనచో తన ప్రజ్ఞయనియు లేనిచో నపథ్యదోషముకాని దైవముకాని కారణంబనియు పల్కు భిషక్కులకు సొమ్మిచ్చువారును సర్వదేశములలో కలరు.[4]

ఈ యుదాహరణములు దాసుగారి లోకాలోకన లోకమునకు చిత్రపటము మాత్రమే.[5]

---

4. నా యెరుక పు॥ లు 203, 204
5. దాసుగారి లోకజ్ఞతకు నిదర్శనములు 'సాహితీ కోణములు' అను శీర్షికలో కోకొల్లలు.

## చమత్కార చారుత్వము :

సహృదయుని ఆకట్టుకొను సాధనములలో చమత్కారము చాల ముఖ్యమైనది ఈ 'చమత్కారము' ను హాస్యమునకు పర్యాయ పదముగా ప్రయోగించుచుదురు. అది పొరపాటు. ప్రతి హాస్యోక్తి చమత్కారజనక మగును కాని ప్రతి చమత్కారోక్తి హాస్యజనకము కాదు. హాస్యము శాస్త్రవాసన లేని సామాన్యునకు గూడ నందుబాటులో నుండు నంశము. కాని చమత్కార మట్లుకాదు అది యే శాస్త్ర సంప్రదాయము తోడనో ముడిపడి యున్నచో, ఆ శాస్త్ర ప్రవేశము లేనివానికి కొరకరాని కొయ్య యగును. అంతేకాదు, చమత్కారము హాస్యరసము తోడనే కాక ఏ రస సంబంధమైనను గల్గియుండవచ్చును.

ఉదాహరణమునకు -

పల్లమువంకఁ బ్రవర్తించె నీర్విశే
 ష్యము జాడఁజను విశేషణముభంగి
అడవి కార్చిచ్చుల కాదేశమై కొండ
 వరదయాగమమయ్యెఁ జెరువులకును
అల ప్రకృతిప్రత్యయము లట్టు లన్యోన్య
 మెడయ కేళ్లుం గాల్వ లేకమయ్యె
కర్మభావప్రయోగంబులం దప్పని
 యాత్మనేపదమట్టు లలరెకప్ప
వడి నలౌకిక విగ్రహవాక్యము వలెఁ
గోకిల రవప్రయోగంబులేక యుండె
పల్లవితబహువ్రీహి సంపటలమగుచుఁ
బ్రబలి వ్యాకరణమువలె వాన వెలిసె[1]

1. జానకీశపథము – పు. 59

వైయాకరణఖసూచి యగు పాఠకుడు కేవల శబ్దార్థజ్ఞానముచే ఈ పద్యములో కవి సూచించిన చమత్కారము నందుకొనలేడు. దీనిలోని చమత్కారము వ్యాకరణ శాస్త్రప్రవేశమున్న పాఠకునకే అర్థమగును.

అంతమాత్రమున సాహిత్యములోని ప్రతి చమత్కారము శాస్త్రపాండిత్య ప్రభావితమై యుండునని అర్థముకాదు. శాస్త్రవాసనకూడలేని చమత్కారముండ వచ్చును. ఉదాహరణమునకు -

మొసలిచేఁ బట్టువడి నీటమునిగియున్న
గజమును సుదర్శనంబునఁగాచు శౌరి
మోహమునఁబట్టువడి భవమున మునుంగు
మనలఁగూడ సుదర్శనముననె కాచు[2]

ఈ పద్యములోని చమత్కారమును గ్రహించుటకు 'సుదర్శనము, సు-దర్శనము' అని విడదీసికొనగలుగు సాహిత్యపరిజ్ఞానమున్న చాలును.

ఈ రెండు ఉదాహరణము లందలి చమత్కారములకు హాస్యముతో నెట్టి సంబంధములేదు కదా.

ఇక దాసుగారి చమత్కార నర్తకికి ప్రదర్శనావకాశము కలిగిన రంగస్థల ములు మూడు. 1. గ్రంథస్థలములు, 2. చాటువులు, 3. సంభాషణములు.

గ్రంథస్థములు :

కోరికల కడ్డుతగిలెడు వారిలోన
గొప్పవాఁడవుగాన నిన్గొల్వ వలసె
అడ్డుదగిలెడువాఁ డెక్కుడైన యప్పు
డేడుకొన కేమిచేయుదు? విఘ్ననాథ[3]

2. గజేంద్రమోక్షణము – పు. 8
3. గజేంద్రమోక్షణము పు. 2

శుభకార్యారంభమున విఘ్నోపశాంతికై గణనాథారాధనము సంప్రదాయము. ఇక్కడ దాసుగారు కూడ ఆ సంప్రదాయదృష్టితోడనే గ్రంథారంభమున విఘ్నేశ్వరుని ప్రార్థించినారు. కాని ఈ ప్రార్థించుటలో నొక చమత్కారమున్నది. 'కోరికలకు అడ్డువచ్చెడివాడే గొప్పయైనపుడు, వేడుకొనక ఏమిచేయుదును?' అనునది చెప్పుచు ప్రార్థించుట చిన్న చమత్కారము.

యథార్థరామాయణ హరికథను దాసుగారు వారి ధర్మపత్నియైన నరసమ్మగారికి అంకితమిచ్చుచు, ఆమెనామమును శ్లోకములో చమత్కారముగా చొప్పించినారు.

రసనా నరసమ్మె ఇచ్ఛతి త్వదధర సుధయా వినా ప్రియే[4]

'ఓ ప్రియా! నీ అధరసుధతప్ప నా నాలుక మరియొక రసమును కోరదు' అని తాత్పర్యము. ఈ అర్థములో చెప్పినదానిలోని 'రసనానరసమ్మెఇచ్ఛతి' అను పదముల కూర్పు ఒక చమత్కారము. న రసం మే ఇచ్ఛతి అను సామాన్యార్థము కల పదముల కూర్పులో 'నరసమ్మ' అని వారి భార్యా నామము కూర్చుట ఇచటి చమత్కారము.

గజేంద్ర మోక్షణ కథలో గజేంద్రుడు ఆర్తితో భగవంతుని ప్రార్థించి ప్రార్థించి, విసువుపుట్టి నిందించుట గజేంద్రునకు పోతనగారు నేర్పిన విద్య. ఆ మార్గముననే ప్రయాణించుచు దాసుగారు గజేంద్ర మోక్షణ హరికథలో చేసిన ఒక చమత్కారము —

దేశి–ఆటచాపు :

ప॥ ఏమిటికింక రావీ వెందున డాగినావు?

అ॥ ప॥ నీమము జేసినావా? నేరము లెంచినావా? ॥ఏ

1. ఆపద తటస్థించెనా? యప్పుల మునిగిపోతివా?
   పీపునఁ గొండపడెనా? వెతల నొంటరివైతివా? ॥ఏ

---

4. యథార్థరామాయణము - సామ్రాజ్యసిద్ధివిభాగ ప్రారంభము - పు. 224

2. బలుకంబమున గట్టిరా? బలికై యొప్పగించిరా?
అల నిజ జనకుఁజంపిరా? యాలినిఁ జెరగొనిరా?
కల్లును ద్రావినావా? చెల్లెల నవమానించిరా?
కాళ్లు సేతులు లేవా? కళ్ళెము నోటనిడిరా? ।ప

3. దూషణజేసితినని దోషములెంచకు స్వామీ
పోషణజేసినగాని నీకవె పదివేషములవు పోని ।ప

4. ఎంతనియోర్తు నీ బాధ? చింతలు తీర్పరాదా?
సుంతయు దయలేదా? పంతమాయెనా నామీఁద? ।ప

5. విజయనగరపాలా! వెతలను బాపవేల?
విజిత దుష్టశీలా! వేణుగోపాలబాల[5] ।ప

మకరిబాధ తట్టుకొన శక్తిలేక కరీంద్రుడు దూషణ ప్రారంభించినాడు. 'ఇంత చేతకానివాఁడవా?' అని అవతారములలో తటస్థించిన కొన్ని అపదలను గుర్తుకు తెచ్చినాడు. 'ఏమిటి కింకరావు? ఎందున దాగినావు?' అని 'ఇప్పుడు మరల అపదలపాలైనావా!' యని సామాన్య బాధలను అడిగినట్లు అడుగుచు వ్యంగ్యముగా దశావతార విశేషములను స్ఫురింపజేసినాడు. ఇట్లు స్ఫురింప జేయుట ఇక్కడగల చమత్కారము.

సారంగధర నాటకములో - సారంగధరుడు, సుబుద్ధి, గిలిగింత వారి పావురములను ఎగురవేయ, సారంధరుని పావురము చిత్రాంగి మేడపై వ్రాలిన సందర్భములో ఆ ముగ్గురి సంభాషణము -

సారం : నేస్తమా! యా పావురమును దీసికొని వచ్చుటకీ నపుంసకలింగమును బంపింతమా?

---

5. గజేంద్రమోక్షణము - పు॥ లు 22-24

సుబుద్ధి : చిత్తము
సారం : ఓరీ!
గిలి : తాము చదువుకొన్నవారు కదా? ఓరీ! యేలింగము?
సుబు : ఓరీ కాకోసి యనవలెనా?
గిలి : ఇద్దరి కిద్దరే, ఇదేనా మీరు చదివిన వ్యాకరణము? ఓరీ యోసులకు మధ్యగా నన్నుఁ బిలిచినందప్పు నేఁబలుకనే పలుకను.
సారం : ఇఁక నవ్వులు చాలింది మా పినతల్లి –
గిలి : మాపిన తల్లి (పు॥ లు 19,20)

ఈ చిన్న సంభాషణమున గిలిగింతచేత దాసుగారు ఎంత గిలిగింతలు పెట్టించినారు. నపుంసకలింగమును ఎట్లు సంబోధింపవలెను? అన్నది ఒక వ్యాకరణ చమత్కారము. 'మా పినతల్లి' అనుదానిని 'మాపిన తల్లి' అని మార్చి పలికినది ఇంకొక చమత్కారము.

సారంగధర నాటకములో మరియొక చమత్కారము – గిలిగింత చిత్రాంగి మేడ చెంతనుండి పావురమును తేకుండగ రాగా, సారంగధరుడు తన పావురమును గూర్చి అడుగగా, గిలిగింత చెప్పిన చిత్రాంగి సందేశాత్మక సమాధానము –

గిలి : అయ్యా! పావురమా? మీ పినతల్లిగారు తల్లి యొద్దకుఁ గొరకు వచ్చుట కేమి యభ్యంతరము? వ్రతములోనున్న నా యొద్దకుఁ బేడి నంపనేలా? యని దెలుప సెలవిచ్చినారు. ఆ పావురముం బట్టించి వారియొద్దనే యుంచుకొన్నారు. (పు. 32)

ఈ వాక్యములలోని 'అభ్యంతర మేమి? వ్రతములో నున్న నా యొద్దకుఁ బేడి నంపనేలా?' అను మాటలోని అర్థాంతరము చమత్కార జనకము.

సారంగధర నాటకములో నింకొక చమత్కారము– సారంగధరుడు పావురము కొరకై చిత్రాంగి చెంతకేగి నమస్కరింప, చిత్రాంగి తన ప్రణయోపని షత్పాండిత్య ప్రదర్శనము చేసిన ఘట్టము–

సారం : అమ్మా! మా తండ్రిగారు వేఁటకు వేంచేయునపుడు మంత్రితోఁ గొన్ని రాచకార్యములనుఁ గూర్చి నన్ను మాట్లాడుమని సెలవిచ్చినారు. ప్రొద్దు

పోవుచున్నది గనుక వేఁబోవలెను. కటాక్షించి బిడ్డనికి సెలవిప్పించ గోరెదను.

చిత్రా : నిన్నుఁ గటాక్షించి యెవతె విడువఁగలదు? మంత్రితో నావల రాచకార్యములకేమిగాని, నాతో నీ వలరాచకార్యములఁ జూడుము (పు. 40)

'కటాక్షము' అను శబ్దమును సారంగధరుడు 'కృపావీక్షణము' అను అర్థములో ప్రయోగింప, చిత్రాంగి ఆ 'కటాక్ష' శబ్దమునే 'కడకంటి చూపు' అను అర్థములో ప్రయోగించినది. అట్లే సారంగధరుడు రాచకార్యములన, చిత్రాంగి వలరాచకార్యములని వల వేసినది. వలరాచకార్యములన కంతుని గంతులని సంగీత సాహిత్యవిద్వాంసుడైన సారంగధరుడు గ్రహింపలేదా? ఇది యొక చమత్కారము.

రుక్మిణీకల్యాణ హరికథలో రుక్మిణీ సౌందర్యవర్ణనము చేయుచు రుక్మిణి వయసు చెప్పినవిధ మొక చమత్కారము -

కాయజుకటారి కలికి మిటారి హా
హాయిర నెమ్మోముతీరు నోయమ్మయురచందురుసొగసు నా
రాయణదాస నుతిమీరు వయసు ముద్దుగారు పు-7

ఇందులోని 'వయసు ముద్దుగారు' అను దానిలోనున్నది చమత్కారము. 'ముద్దులుకారు వయసు' అని ఒక అర్థము. 'పన్నెండుసంవత్సరములవయసు అని మరియొక అర్థము. దుగ- రెండు, మూడు + దుగ - ముద్దుగ ($3 \times 2 = 6$), ముద్దుగ + ఆరు ($6 + 6 = 12$.)

శ్రీ హరికథామృత హరికథ సంస్కృత భాషలో వ్రాసిన హరికథ. దీనిలో తెలుగుఛందస్సంబంధమైన సీసమును (యతిప్రాసలతో, ఎత్తుగీతతోసహా) వ్రాసినారు.

పాహి ప్రసన్నరూప దయాకలాప స
త్యాలాప సర్వలోకైక దీప
విజ్ఞాన కన్ద గోవిన్ద ముకున్ద ని
త్యానన్ద సుస్మితాస్యారవిన్ద

పద్మావిలోల తాపత్రయోన్మూల స
త్కీర్తి విశాల సద్ధర్మ పాల
భవ పాతక త్రాస వైకుణ్ఠ వాస స
జ్జీత వేద నిశ్వాస చిద్విలాస

జలధర శ్యామ దేవతా సార్వభౌమ
భవ్య నుతి పాత్ర పతిత పావన చరిత్ర
భక్త మన్దార కైవల్య పద విహార
హే జగన్నాథ సంశ్రిత హృద్విబోధ. పు-17

ఇట్లు సంస్కృతచ్ఛందమునకు సంబంధము లేని నియమములతో సంస్కృత భాషలో వ్రాయుట ఒక చమత్కారము.

సావిత్రీచరిత్ర హరికథలో అలంకారముల పేరులు వచ్చునట్లుగా సత్యవంతుని సౌందర్యవర్ణన చేసినారు.

కందున్న పున్నమచందురుఁ గాదంటి
మో వీని మోమున కుపమ యేది?
అబ్జముల్వాడు నఁటన్న నిక్కందోయి
కగు నెచ్చట నిదర్శనాతిశయము?
పన్గుతొండమ్ము లిస్సీవంకలన వీని
హస్తమ్ములకును దృష్టాంతమున్నె?
మతి యనంగుండగు మరుని కీతనితోడ
నకియరో! సుంతైన సమ మదెట్లు?

సహజ సద్గుణసౌందర్య శాలినికైన
సతతదోషాధిక కురూపయుతునకైన
స్థాన! యొందు కలంకారశాస్త్ర గరిమ
యింక నీయందకాని వర్ణించుటెట్లు? పు-లు 18,19

ఈ పద్యమునందు 'ఉపమ, నిదర్శనము, దృష్టాంతము, సమము' అని అర్థాలంకారనామములను కూర్చుట ఒక చమత్కారము.

ఈ సావిత్రీ చరిత్రమునందే దాసుగారు చేసిన మరియొక చమత్కారము ప్రతికీర్తన చివరలో, ఆ కీర్తన పాడవలసిన రాగనామమును చొప్పించినారు. మచ్చునకు ఒక ఉదాహరణము -

కుంతల వరాళి - చతురస్ర.

ప॥ పిలిచిన పలుకవేదే ములుకే - లలితా
శ్రుతి పంజర పుంజిలుకే ॥పి
అ॥ పలుమరువాడా - నే నిను నమ్మలేదా!
పాలించు నీ దాన గాదా మర్యాదా ॥పి
1. సరగున రమ్మా - తరియించె సుమమ్మా
భక్తాళి మానస మరాళీ కుంతలవరాళీ ॥పి పు- 33

ఇక్కడ 'కుంతలవరాళి' అను రాగ నామమును కథానుగుణ సంబోధనముగా మార్చి చొప్పించుట చమత్కారము.

చాటువులు : కథానూత్రము ఏ మాత్రము లేకుండగనే రసికవరుని కట్టి వశపరచు కొనగల శక్తికలది చాటువు. ఈ రసికజన మనోరంజకశక్తియే 'చాటువు' అను పేరు తెచ్చినది. దాసుగారు చెప్పిన వందల చాటువులలో కొన్ని-

పిఠాపురముపై చెప్పిన ఒక చతుర్భాషాసీసము –

భ్రాజతే కుక్కుటేశ్వర మాధవాలయా
　　భ్యాం నభశ్చుంబి సౌధాంతరేణ
హాసిల్లా మిూషజహాతాబ్నమూన బి
　　హీంష స్తు నౌషిర్ద్విహీర సాల
గావుసూర్యారావ్దిరాజా బహాదుర్ది
　　చారిటబ్రిబూల్ ప్లెజంట్సు శ్రవి
చదువులపుట్టిల్లు చల్లగాలి న్వైద
　　జల్లుఁబాగ ద్తలివెల్లఁజెల్లు

నేటిపంటల టెంకి కల్మి మెడలంకి
బెస్తుఠాని న్గోడావరీ యాస్ద్టిసీజె
మజ్జపీర్వ్యజవాల్జవాల్ మిూర్జనాన
పీఠికాపురమ స్తి త్రివిష్టపమివ[6]

తెనుగు ఛందమున నాల్గుభాషలలో వ్రాయుట దీనిలోని చమత్కారము. ఇట్లే సంస్కృత పారసీకాంగ్లేయాంధ్ర భాషలలో కాకినాడపై చెప్పిన ఇంకొక పద్యము-

కాకినాడ వద్వైతరణం క్వాపినాస్తి
శహరె శేర్ కాకినాడ ఆస్మా పరస్తహ
పేరడైజ్ కోకొనాడ ఇస్ ఫేక్ట్ డబుల్లు
కల్మి చదువుల పుట్టిల్లు కాకినాడ[7]

---

6. మేలుబంతి - పు 97 - ఇది వ్రాసినతేది 19-[illegible]-1931

7. దాసుగారి చేతివ్రాతతో నేను సంపాదించిన ఈ పద్యమును అనుబంధముగా నిచ్చితిని. ఇది వ్రాసినది 1935 లో.

దాసుగారు అంగ్లపదములను కలిపి కృతులు వ్రాయుచుందురు. ఇది వారి సరదా. ఒక్క ఉదాహరణము :-

చోడవరము 'డిస్ట్రిక్టు మునసబు' గారైన శ్రీ బుఱ్ఱా రాజలింగశాస్త్రిగారిపై చెప్పిన సందర్భమునందలిది -

ప॥ ఫేర్వెల్ఫేర్వెల్బిరాజలింగ శర్వాణీప్రియ పాదజలజాతభృంగ
1. ఫేర్వెల్ఫేర్వెల్వి మలాంతరంగ సద్వదాజనహితసత్యప్రసంగ
2. లాంగ్లివ్ లాంగ్లివ్ లబ్ధాచ్ఛవర్ణ-అంగ్లేయాంధ్రవిద్యాపరిపూర్ణ
3. ఫేర్వెల్ఫేర్వెల్భితాత్రిభంగ-గర్వితకామాంధకారపతంగ[8]

దీనిలో 'ఫేర్వెల్, లాంగ్లివ్, బి. రాజలింగ' అను అంగ్లభాషాపదము లుండుట చమత్కారము.

ఇక మశకమును మాధవునిగా మార్చిన ఒక మాటల మాయ :

చక్రభ్రమణకరత్వా త్కుదృష్టిభిర్దూరం వర్జ్యమానత్వాత్
శ్రుత్యంతఖేలనత్వాత్ మశక! త్వామేవ మాధవం మన్యే[9]

చక్రభ్రమణకత్వము, కుదృష్టి, శ్రుత్యంతఖేలనము' అను పదములలో గల రెండవ అర్థముతో, దోమను విష్ణువుగా చెప్పుట ఇందలి చమత్కారము.

బందరు పట్టణములో దాసుగారు పంతులుగారి మేడపై సంగీతసాహిత్యము లతో అసాధ్యాష్టావధానము చేయగా, దాసుగారి ప్రతిపక్షులలో ఒకరైన శ్రీ నాదెండ్ల పురుషోత్తమశాస్త్రిగారు 'బుధవిధేయిని' పత్రికలో దాసుగారి అవధానమును 'చిన్నపనులగుంపు' అని తేలికగా వ్రాసిరి. దానికి దాసుగారు కోపముతో నొక చాటువును చెప్పిరి. ఈ చాటువును విని శ్రీ చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రిగారి యంతటి వారే ముచ్చటపడి కంఠస్థముచేసిరి. అంత ఆకర్షణశక్తిగల ఆ చాటువిది-

8. మేలుబంతి - పు. 52
9. మేలుబంతి - పు. 159 - ఈ శ్లోకతాత్పర్యము 'అలంకారశోభ' అను శీర్షికలో వ్రాయుట జరిగినది.

అలి మొగలకాయె అత్త నీ పాలాయె
మజ్జిగ తియ్యపులాయె బుధవిధేయ
నేతి బీరకాయ రీతి నీ పేరాయె
ఉత్తముండ! పురుషోత్తముండ![10]

ఈ పద్యమున పురుషోత్తముడైన విష్ణువునకు, నాదెండ్ల పురుషోత్తమశాస్త్రి గారికి అన్వయమగునట్లు అర్థన్వయముండుట చమత్కారము.

[illegible] రాజమండ్రిపై ఒకసారి చెప్పిన చాటువు –

స్థలమహాత్త్వంబుపస్థలమహాత్త్వంబు నీ
యూర నేకాని నోయూర లేదు
జలమహాత్త్వంబు లంజలమహాత్త్వంబు నీ
యూర నేకాని నోయూర లేదు
మలమహాత్త్వంబు దోమల మహాత్త్వంబు నీ
యూర నేకాని యేయూర లేదు
... ... ...[11]

'స్థల – ఉపస్థల; మల – దోమల' అను పదములతో రాజమహేంద్రవర యథాస్థితిని చెప్పుట ఇందలి చమత్కారము.

దాసుగారు చాటువుగా చెప్పిన ఒక అద్వితీయమైన ద్విపద –

ఎదిరిపట్టు [illegible] నా కోడి
పదునుకోలంది నా [illegible][12]

10 శ్రీ మదాదిభట్ల నారాయణదాస జీవితచరిత్రము – శ్రీ [illegible] వేంక-చయనులుగారు - పు. 81.
11. ఈ చాటువును నేను సేకరించితిని. మిగిలిన పాదములు [illegible]
12. మేలుబంతి - పు: 141

ఈ ద్విపదలో - 'నాకు ఓడిపోయి ప్రతిపక్షములో చేరుట ఎట్లు సాధ్యపడును అనునది సామాన్యార్థము. 'నా కోడి (కోడిపుంజు) ఎదుటివారిని చేరునా' అనునది విశేషార్థము. రెండవపాదములో 'సమయము వచ్చినకొలది నా వాలు సూపు వాడి' అనునది సామాన్యార్థము. 'నూరినకొలంది ఆ వాలు (కత్తి) వాడి (వాదర)' అనియు, నూరిన కొలది ఆవాలు (ఆవగింజలు) ఘాటు ఎక్కువ' అనియు విశేషార్థములు. ఈ యస్గదోయి (ద్విపద) ఎంత గొప్పదన్న దాసుగారే, ఇటువంటి ద్విపదను వ్రాసినవాడు సరస్వతీరూపమని

'ఈ యస్గుదోయిలా గింకొక్కదాని
జేయఁజాలిన మానిసే నల్వసాని'

అని పందెముగా వ్రాసినారు. ఇట్లు మామూలు మాటలతో రెండు అర్థాలు వచ్చునట్లుగా, పైగా అంత్యప్రాసముతో అలంకరించుట ఇందలి చమత్కారము.

ఒకసారి దాసుగారు శ్రీవారాణియొద్ద రుక్మిణీకల్యాణకథను చెప్పుచు, సందర్భోచితముగా 'రాధారుక్మిణుల సంవాదము' అను కీర్తన ఆశువుగా చెప్పిరి.

రాధ : మిరమిరచూడ్కుల నాసామికిన్ దిష్టిపెట్టకే
హారిదరి సేనున్నయప్పు డతివ నీ పప్పుడకదే ।మిర

రుక్మి : పరమపురుషుఁజూడకున్నవారి కన్నులెందుకే
అరయఁగ దేవునిపెండ్లికి నక్క। యందరు పెద్దలె ।పర

రాధ : చక్కని చిన్నదానవని చాల విఱ్ఱవీగకే
నక్కయని నన్ వెక్కిరించి తక్కులాడి నిక్కకే ।మిర

రుక్మి : మిక్కిలి హరిభక్తిలేని మేనిసొగసులెందుకే
అక్కవై తివమ్మవైన నందుకే నేమందునే ।పర

రాధ : కడు గయ్యాళిగంప గడుసుమాటలాడకే
సరిసడి నీకును నాకును సంబంధమెట్లులే ।మిర

రుక్మి : వడిగ మేనల్లు నత్తవలచి ముద్దరాలగునే
కడలియువ్వు నడవియుసిరికాయ చందమాయెనే ।పర

రాధ : నేరమీరి పిన్న పెద్ద తారతమ్య మెరుంగవే
కాను రాచదాన! చెంపకాయలిప్పుడు తిందువే ।మిర

రుక్మి : మీను గొల్లవారుగాన నేరమీను లుచితమే
నారాయణదాసుల కెన్నడును భయముకల్గదే[13] ।పర

ఈ సపత్నులకయ్యమందంతయు నున్నది ఉక్తిచమత్కారమే కదా. ఈ చమత్కారసంభాషణ ఘట్టములో వ్యాకరణమర్యాద ననుసరించి 'అక్క-నక్క, అత్త-నత్త' అను రూపములను గూర్చుట ఒక్కలి సందర్భోచితము.

ఆ కాలమున బొంగు మహాలక్ష్మి యనెడి వేశ్యాంగన యుండెడిది. అ రూపాజీవ యింట పలువురు సంగీతజ్ఞులు చేరి భంగు సేవించుచు, ఆ 'నిషా' తో వారివారి కౌశలములను ప్రదర్శించుచుండెడివారు. దాసుగారు కూడ ఆ యింటికి వెడలి భంగు సేవించుచుండెడి వారు. ఒకసారి భంగు సేవించి ఆ వెలవెలది కోవెలలో నొక పాటను ఆశువుగా పాడిరి.

మాలచ్చిభంగు పాట - నీ - నృచ్చుకొన్నపూట - కడు
మెచ్చు నాదు పాట - జగమెల్ల నా కొక ఝాటు ॥మా
చెలువైన నోటి చుట్ట - యొక - చేత సోడాము చిట్ట
తోలువార్ల నన్నుపొగడ్తు - తెలవారేదాకాలద్దు[14] ॥మా

ఒకసారి దాసుగారు కథ చెప్పుచున్నపుడు, వారు ప్రదర్శించుచున్న రాగ తాళమును సరిగా గుర్తింపలేక వాయించుచున్న 'వయొలినిస్టు' ను మెత్తగా నిట్లు మొత్తిరట.

13. శ్రీ మజ్జాడాదిభట్ట నారాయణదాస జీవితము – శ్రీ మరువాడ వేంకట చయనులు గారు - పు॥ లు 133-34 - ఈ కీర్తన దాసుగారి ముద్రిత రుక్మిణీకల్యాణ హరికథా గ్రంథములో జేరలేదు.

14. నారాయణదాస జీవిత చరిత్రము – మరువాడ వేంకట చయనులు పు॥ 52

నిగమ పద గరిమ మాదారి - పాపగాని పని నీ దారి
గాఁగా నీ పని సరి గాదపా-నీదారి నీదారి మాదారి మాదారి
మరి మాపని నీ దరిని దగదపా - దారి దప్ప పసగద్దా
పస మాపగా సరిగాదపా - పని సప్పగరి - పద పద.

అప్పటి కప్పుడే స్వరాక్షరములతో అశువులో అర్థవంతముగా అల్లుట ఇందలి చమత్కారము.[15]

సంభాషణములు : దాసుగారి సంభాషణ చమత్కారములు అనంతము. సంభాషణములలో ఏదో ఒక చమత్కారము చూపించనిది వారికి తోచెడిదికాదు. కాని ఆ సంభాషణ చమత్కారములు చాలవరకు అవి విని ఆనందించిన శ్రోతల తోడనే అంతరించి పోయినవి. చెదురుమదురుగా మాత్రము కొన్ని లోకమున నిలిచినవి.

ఒకసారి కొందరు దాసుగారిని 'హరికథాప్రక్రియను మీరే కనిపెట్టినారా? అదివరకెన్నడైన కలదా?' అని ఆసక్తితో అడుగగా దాసుగారు చమత్కారముగా చెప్పిన సమాధాన మిది –

'లేకేమి. చూడు. ఎండవేళ పొలముపను లేమియులేక తీరుబాటుగా నున్న సమయమందు పల్లెటూరిలో రావిచెట్టు నీడను జనులందరు కతియపురికట్టి చూచుచు వినుచు నానందించుచుండగా నొక మాలదాసరి వేపచెక్కగంధము పూసికొని కాళ్లకు గజ్జెలు కట్టుకొని వెనుక నొకడు ఆఁ యని నోటితో, శ్రుతి వేయుచుండగా, పాడి యాడి యేదో యొక కథ విన్పించుట చూడలేదా? వాని వేపగంధమునకు మారు మంచిగంధముపూత. నోటిశ్రుతికి తంబురాశ్రుతి మొదలగు మార్పులు చేసినానే కాని వేరుగాదు[16]

15. శతజయంత్యుత్సవ సంచిక – పు- 55
16. శ్రీమమజ్జాడాదిభట్ల నారాయణదాస జీవితచరిత్రము - శ్రీ మరువాడ వేంకట చయనులు గారు పు. 39

ఈ సమాధానము చమత్కారముగా చెప్పినదేకాని వాస్తవముకాదు. దాసుగారు కుప్పుస్వామినాయుని హరికథను జూచి ఆకర్షితులై హరిదాసుగా మారినట్లుగా వారే చెప్పుకొనిరి.

ఒకసారి ఒక మిత్రుడు దాసుగారితో 'దాసుగారూ! మీ వలె హరికథలు చెప్ప గల్గెడివాడు ఇంకొకడుండడు. మీతోనే 'End' అనియన, దాసుగారు 'అలాగు నేమీకాదు. నా పేరే 'AND' (A — Adibhatla, N= Narayana, D=das). అని సమాధానమిచ్చిరట. మిత్రుడు ఎండ్ (End) అనియన, దాసుగారుకూడ ఎండ్ (And) అను ఉచ్చారణముతో నున్న ఆంగ్లపు మాటను మార్చి తనపేరునకు అన్వయించి చమత్కారముగా వ్యాఖ్యానించిరట.

ఒకసారి కొందరు మిత్రులు దాసుగారి యథార్థరామాయణనామమును గూర్చి 'దాసుగారూ! మీరు వ్రాసిన రామాయణము మాత్రమే యథార్థమా? వాల్మీకివ్రాసిన రామాయణము యథార్థముకాదా?' అని ప్రశ్నింపగా, దాసుగారు 'అవును నేను వ్రాసిన రామాయణమే యథార్థరామాయణము, యథా–అనుకొన్నంత, అర్థ–ధనమును సంపాదించిపెట్టు, రామాయణము' - అని చమత్కారముగా చెప్పిరట.

రాజమండ్రి టౌనుహాలులో ఒకరు శ్రీవీరేశలింగముపంతులుగారితో దాసుగారి హరికథను గూర్చి 'నిన్నటిరాత్రి యిత డత్యద్భుతముగ హరికథ చెప్పి సభికులను రంజింపజేసెనట' అని అనగా వీరేశలింగముపంతులు గారు 'ఛీ యేమి హరికథలు. వెధవ హరికథలు. బండబూతు హరికథలు' అని అనిరట. దానికి వెంటనే దాసుగారు 'పంతులుగారికి సహవాసబలముకాబోలు నెల్లప్పుడు విధవాస్మరణము చేయుచుందురు' అని చమత్కారముగా సమాధానమిచ్చిరట.[17] వీరేశలింగముగారు విధవా వివాహములు చేయించెడివారు కదా! పంతులుగారిని దాసు గారు 'విచిత్రవివాహకర్త' అని అనుచుండెడి వారు.

ఒకసారి విజయనగర ప్రభువైన ఆనందగజపతి తనదర్బారులో 'దాసుగారూ మీ సంస్కృత పద్య మేదైన చదువుము' అని కోరగా, దాసుగారు వారి శ్రీహరికథామృత హరికథలోని 'నసాజయతు శూన్యవాక్ తవ మమేవ సంతాపయుక్' అని చదువగనే, సభలోని ఒక వైష్ణవకవీశ్వరుడు 'తవచమేచ సంతాపయుక్' అని

17. నాయెఱుక - పు. 176

యుండిన బాగుండునని దిద్దెనట. దాసుగారు దానికి 'సామీ! యిదివరకు సంగీతమున వైణికశిరోమణిగారొక చకారము పెట్టిరి కాని కవిత్వమున తాము రెండుచకారములు పెట్టుట మరింత వింతగానున్నది. తమ దిద్దుబాటుతెల్వి మిక్కిలి శ్లాఘ్యము' అని చమత్కారముగా త్రిప్పికొట్టి, వైష్ణవకవీశ్వరుడు నోరుతెరిచెనట. ప్రభువు ప్రక్కలు పట్టుకొని నవ్వెనట.[18]

ఒకసారి శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారు దాసుగారు విజయరామ గానపాఠశాలకు ఏబదియేండ్లకు పైబడిన తరువాత అధ్యక్షులైరను అంశమునుగూర్చి దాసుగారితో 'ఏభైయైదేళ్ళ యువకులు' అని అనెనట. దానికి దాసుగారు 'కాదురా నీకు లెక్కలురావు. నేను అప్పటికి పదేళ్ళవాణ్ణి' అని స్వామిగారితో నన్నారట. అనగా పదిసంవత్సరములనుండిమాత్రమే లోకము తన్ను గుర్తించినదని దాసుగారి భావము. అంతటితో ఆగక దాసుగారు 'ఒరే తాతా! అందరూ ఉద్యోగం నుంచి విశ్రాంతి తీసుకొనే వయస్సుకి విజయనగరసంస్థానంవారు నాకు ఉద్యోగం ఇచ్చారు అప్పటికి తెలిసింది వారికి నేనెవణ్ణో?' అని నవ్విరట. దానికి పద్మనాభ స్వామిగారు 'విచిత్రమే' అని యనగా, దాసుగారు 'విచిత్రం అనేది నాజీవితంలో లేదు. అంతా సహజమే నాకు. ఇంటగెల్చి రచ్చగెలవమన్న సామెత నాపట్ల తారుమారయింది. మైసూరూ, మద్రాసూ, గుంటూరూ, గుడివాడా, ఇలా పై ప్రదేశాలలో నేను విజయభేరి మ్రోగించాక విజయనగరము సంస్థానములో సన్మానం పొందాను, అంటే ఏమిటర్థం? రచ్చ గెల్చి ఇంటగెల్చానన్నమాట' అని సమాధానము చెప్పిరట.[19]

ఒకసారి దాసుగారియొద్ద మహామహోపాధ్యాయ బిరుద మెవరికైన నీయ వచ్చునా? అను చర్చరాగా, దాసుగారు 'అతడు పరిశ్రమచేసి పఠిననాటు గుర్తించి హెచ్చరించుటకుగా నీ బిరుదియ్యబడెను గనుక తగునా? యను ప్రశ్నము రాకూడదు. నిజముగా అమాటయొక్క అర్థమునుబట్టి చూచినయెడల నీశ్వరునికి తప్ప యెవ్వరికిని వర్తించదు' అని అనిరి. మరియొకరు 'దేశమంతటను వ్యాకరణ పండితుడని ప్రఖ్యాతిపొందిన పండితున కీయవచ్చునా?' అని అడుగగా దాసుగారు 'యెక్కములు వల్లించి యప్పగించిన శ బిరుద మిచ్చెదవా?' అని యెకసక్కెము లాడిరి. 'మరెవరికి ఈ బిరుదము తగును?' అని అడుగగా, శ్రీ దాసుగారు తన

18. నా యెఱుక . పు. 231

19. పూర్ణపురుషుడు-కవిరత్న శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారు-పు. 143

పొడుముకాయ చేతబట్టుకొని 'చూసు ప్రశస్తముగా పొడుము తయారుచేయువానికి బిరుదు మియ్యవచ్చును. అనగా వింత సృష్టి యొనరించువానికే ఈ బిరుదు తగును' అని చమత్కరించిరి.[20]

పిఠాపురమురాజా దాసుగారికి వైజాగుపైనుండి నూటపదారు రూపాయిలు, పాగాలు, పంచలచాపులను ఇచ్చి 'సంతుష్టిపొందుడు. నే నప్పులో నుంటి, చంద్రునకొక నూలుపోగు. ప్రతిసంవత్సరము మీకిట్లు ముట్టు చుండును' అని, అంతటితోనాగక 'అసంతుష్టోద్విజోనష్టః' అని అన, వెంటనే దాసుగారు 'సంతుష్ట ఇవ పార్థివ' అని చమత్కరించిరి. ఈ చమత్కారమునకు ఆ ప్రభువు ఆనందించి, తాను గవర్నరు సభకు వెళ్లుటకై క్రొత్తగా కుట్టించుకొన్న అంగీని వారికి స్వయముగా తొడిగిరి.[21]

దాసుగారు విశాఖపట్టణములో విద్యార్థిగానున్నపుడు, విజయనగర సంస్కృత కళాశాలకు ప్రిన్సిపాలు శ్రీ రామానుజాచార్యులు గారు. వీరికి సాహిత్యముపైనున్న ఆసక్తి సంగీతముపై లేదు. ఒకసారి వారు గుఱ్ఱపు బండిపై వెళ్లుచుండగా, బండి ఆపి నమస్కరించి 'అయ్యా! సంగీతసాహిత్యము లన్నారు కాని సాహిత్యసంగీతము లనలేదు' అని చెప్పి దాసుగారు వెళ్లిపోయిరట. ఆ ప్రిన్సిపాలు గారు ఈ బాలుని సంగీతాభిమానమునకు ఆశ్చర్యపడెనట.[22]

ఒకసారి ఆనందగజపతి, దాసుగారు కాలక్షేపమునకై అగ్గిపుల్లల నొడ్డుచు జూదమాడుచుండిరి. ఆనందగజపతికి మూడు ఆసులు, దాసుగారికి మూడు రాజులు వచ్చెను. దాసుగారు అత్యుత్సాహముతో పుల్ల లొడ్డుచుండగా, రాజు 'దాసుగారూ! మీరు నన్ను గెల్వలేరు' అని ఆసుపట్టు చూప, దాసుగారు, 'మహాప్రభూ! సరసుడైన ప్రభువు ఒక్కడు దొరకుటే కష్టము. అట్టిస్థితిలో ముగ్గురు ప్రభువులు నాచేత

---

20 శ్రీమదజ్ఝాడాదిభట్ట నారాయణదాసజీవితము - శ్రీ మరువాడ వేంకట చయనులుగారు పు॥లు 187-88

21. నాయెఱుక పు. 12

22. శ్రీ మదజ్ఝాడాదిభట్ట నారాయణదాసజీవితము - శ్రీ మరువాడ వేంకట చయనులు గారు పు. 30

చిక్కినారు. ప్రాణమైన నొద్దెవను గాని పట్టు విడిచెదనా?' అని మూడురాజులను చూపించి నవ్వెనట. ఆనందగజపతి ఆమాటలకు ఆనందించి 'క్రిందపడినను మీదినుండియే మాటాడుచున్నారు' అని అనెనట.[23]

ఒకసారి సుబ్రహ్మణ్యఅయ్యరు అను దాక్షిణాత్యుడు దాసుగారి యొద్దకు వచ్చి 'నేను రెండు చేతులతో రెండు భిన్నతాళాలు వేయగలను. నా యీవిద్యకు మెచ్చి పెద్దలు విజయఘంటాకంకణము తొడిగినారు. నన్ను అందరు ఘంటా అయ్యరు అని అందురు' అని గర్వముగా పల్కగా, దాసుగారు వెంటనే 'అలాగా! మరి జోలేదిరా? గంటయ్యరూ!' అని చెప్పకొట్టిరట. తరువాత తమ పంచముఖీ ప్రదర్శనముతో దాసుగారు ఆ అయ్యరుకు కంకణము తీయించినారు.[24]

ఒకసారి విజయనగరమున పండితసభ జరుగుచుండ, దాసుగారు అక్కడ కేగి, ఆ చర్చలో తలదూర్చగా, అక్కడనున్న ఒక పండితుడు 'నీవీ చర్చలోనికి రావద్దు' అని యన, దాసుగారు నవ్వుచు 'సంగీతమంటే వారు రావద్దంటారు. సాహిత్యమంటే మరియొకరు, వ్యాకరణమంటే నింకొకరు, అన్ని శాస్త్రములు మీరే గుత్తకొంటే నాకేదైనా స్థానమున్నదా? లేదా?' అని యనిరట. అప్పుడక్కడ నున్న శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు నవ్వుచు 'దాసుగారూ! మీ స్థానమొకచోటకాదు. అన్నిటిలోను మీకు ప్రత్యేకమైన ముఖ్యస్థానమొకటి యియ్యనక్కర లేకుండగ మీరే ఆక్రమించుకున్నారు' అని అనిరట.[25]

ఒకసారి కాకినాడ గానసభలో దక్షిణదేశ విద్వాంసులు పల్లవి పాడుచుండ, దాసుగారు తన ప్రక్కనేయున్న శిష్యుడైన సుబ్బయ్యతో 'సుబ్బయ్యా! ఆ మనుష్యులేమి చేయుచున్నారు' అని హాస్యముగా అడుగగా, సుబ్బయ్య "బాబూ! సంగీతము పాడు చున్నారు' అని బదులుచెప్ప, దాసుగారందులకు "ఆఁ సంగీతమా! గుద్దులాట కాదు కదా' అని చమత్కరింప అందరు నవ్విరట.[26]

---

23. పూర్ణపురుషుడు-కవిరత్న శ్రీ యామిజాల పద్మనాభస్వామి- పు॥లు 119-20
24. పైది పు॥ లు 162-63
25. శ్రీ మదజ్జాడాదిభట్ల నారాయణదాస జీవితము-శ్రీ మరువాడ వేంకట చయనులుగారు . పు. 50
26. - పైది - పు. 67

ఒకసారి విజయనగర ప్రభువైన అలకనారాయణ గజపతి దాసుగారిని నీలగిరి తీసికొనివెళ్లెను. గజపతి మిట్టపల్లములుగా నున్న ఆ కొండల త్రోవలో కారును చాలవేగముగా నడుపుచుండగా, ప్రక్కనే కారులో నున్న దాసుగారు 'కొంచెము వేగము తగ్గింపుడు' అన గజపతి 'నేను నడుపుచుండ మీకు భయమెందులకు?' అనిరట. దాసుగారు వెంటనే 'అందుకే, అందుకే' అని చమత్కారముగా సమాధానము చెప్ప, గజపతి నవ్వు ఆపుకొనలేక కారునుకూడ ఆపవలసి వచ్చినదట.

ఒకసారి విశాఖపట్టణమున శ్రీ ప్రభల లక్ష్మీనరసింహముపంతులుగారు దాసుగారిచేత హరికథ చెప్పించుచుండగా, జయపురాధీశ్వరులైన శ్రీ విక్రమదేవవర్మగారు వచ్చి కూర్చుండకుండ నిలబడియే హరికథ వినుచుండిరట. "కూర్చుండుడు" అని అక్కడవారనగ, విక్రమదేవవర్మగారు "దాసుగారు నిలబడి హరికథ చెప్పుచుండ నేను కూర్చుందునా?' అని అనిరట. దానికి దాసుగారు "అయ్యా! నేను నిలబడి చెప్పుటలేదు. ఆడుతూ పాడుతూ చెప్తున్నాను. కనుక మీరు కూర్చుండవచ్చు" అని చమత్కారముగా నన సదస్సు ఒకసారి పొంగినదట.

దాసుగారికి చదువుట బాగుగా వచ్చిన తరువాత లాంఛనప్రాయముగ శిష్టుకరణముల బడిలో అక్షరాభ్యాసము చేయించుట జరిగినది. ఈ అంశమును దాసుగారు వారి మనుమడైన శంబర సూర్యనారాయణశాస్త్రితో "ఒరే తాతా! మూడు మనువులు దాటి నాల్గో మనువుకు సిద్ధంగా వున్న ఆసామికి పెండ్లి చేసినట్లు నా కక్షరాభ్యాసం చేసారురా" అని చెప్పిరట.

ఒకసారి పాలకొండ గ్రామములో భూమిని వేలము వేయుచుండ, ఆ పొలము వారి పొలమునకు ప్రక్కదగుటచే, దాసుగారు కొనదలచి 250 రూపాయలకు పాడ, మరియొక వెలమదొర 300 రూపాయలకు పైపాట పాడెనట. అప్పుడు దాసుగారు 'నాపాటకు పైపాట ఉన్నదా?' అనుచు ఇంకను ఎక్కువగా పాడిరట. ఈ మాటల లోని అర్థాంతరము స్పష్టమే కదా.

ఒకసారి సుప్రసిద్ధ నటులైన శ్రీ స్థానము నరసింహారావు గారు దాసుగారిని దర్శింప, నరసింహారావు గారి ఆకారమును జూచి "రోషనారావేషం కడతావట నువ్వేరా అబ్బీ! నీపేరు విన్నాన్లే. అదేమిటోయ్ ఇలా ఉన్నావ్! ఆపేరుకు చిక్కేవా? లేక ఆపేరే నీకు చిక్కిందా?' అని చమత్కరించిరట.

ఒకసారి కాకినాడలో దాసుగారు యథార్థరామాయణము హరికథ చెప్పుచుండిరట. ఆకథలో ముక్కుచెవులు కోయబడిన శూర్పణఖ ఖరాసురుని చెంతికేగి 'ఏమందునే దయ్యము నాకింత తెచ్చెనే' అను ఏడుపుపాటను 'అహిరి' రాగములో దాసుగారు కొంతపాడి, వెనుక పాటగాడైన పేరి బాబులయ్యకు వదిలిపెట్టెనట. అందుకున్న బాబులయ్య పాటలో స్వరము తప్పెనట. వెంటనే దాసుగారు "చూశారా! ఏడుపులో అన్నమ్మరాగాలు వస్తాయి. స్వరంకట్టి ఏడుస్తారటండీ" అని పండితులు ఆక్షేపించకముందే సమయస్ఫూర్తితో పలికిరట.

ఇట్లు జనశ్రుతిలోనున్న దాసుగారి సంభాషణముల చమత్కారములు కోకొల్లలు. ఇప్పటికే ఈ తరమువారికి అందక అనేకములు అదృశ్యములైనవి.

అరువది సంవత్సరములు కొన్నివేల హరికథలు చెప్పి ప్రజలను రంజింపజేసిన దాసుగారిచే ఉచ్ఛిష్టముకాని చమత్కారముండునా? అసాధారణ చమత్కారశక్తిని కొలవబూనుట మిన్నందినవాని పొడవును కొలవబూనుటే, కడలిరాయుని యొడినుండి బయల్వెడలు అలలను గణింపబూనుటే.

## విమర్శన వాదర :

కవి భావభాండాగార ప్రభువు. రసరాజ్యరమణుడు. చర్మచక్షువుల, చారచక్షువుల సహాయముతోగాక ప్రతిభాచక్షువుచే లోకమును పరిశీలించు చక్రవర్తి. ఇతని భావకిరణములకు అడ్డుగోడలు లేవు. అవధులులేవు. ఇతని ఈ ప్రతిభావీక్షణమే అనేకాంశములను విమృశించును. ఈ విమర్శనముతో నింకొకరు ఏకీభవించక పోవచ్చును. ఎవరిత్రోవ వారిదే. ఎవరిచూపు వారిదే. ఏకత్వములో అనేకత్వము ప్రదర్శించు ఈ శక్తియే కవికి భేదించు ప్రధానాంశము.[1]

దాసుగారి నిశితపరిశీలనదృష్టి ప్రసరించి, విషయములను విమర్శించిన విధానమే ఈ విమర్శన వాదర –

---

1. అనేకత్వములో ఏకత్వముదర్శించుట తత్త్వము, ఏకత్వములో అనేకత్వము ప్రదర్శించుట కవిత్వము–ఆచార్య యస్వీజోగారావుగారు, 'కర్ణకథార్ణవము' అను బృహత్పద్య ప్రబంధపీఠిక.

అటపాటలు :

సంగీతసాహిత్యములు రెండు ఈ ఆటపాటల మేటికి రెండు నేత్రములు. వారికి వానిపై వామ దక్షిణ వ్యత్యాసభావము కూడ లేదు. రెండును వామనేత్రములే, రెండును దక్షిణనేత్రములే. ఆ సంగీతసాహిత్యముల అవినాభావ సంబంధమును సరస్వతీ స్తనంధయులైన దాసుగారికి రకరకములుగ స్ఫురించిన విధమిది—

'సంగీతసాహిత్యాత్మకమై విద్య రెండు విధముల నున్నది. సంగీతము పని మఱియు సాహిత్యము ఆ పనినొనర్చు తెలివి, దృశ్యము సంగీతము దృక్కు—సాహిత్యము, సంగీతము జగమును, సాహిత్యమాత్మయును, సంగీతము పౌరుషము సాహిత్యము దైవము, సంగీతము భోజ్యము, సాహిత్యము భోక్త, లోకోపకారము సంగీతము, లోకోపకారము సలుపు నేర్పు సాహిత్యము, సంగీతము ప్రకృతి, సాహిత్యము పురుషుడు, సంగీతము లౌకికము, సాహిత్యము పారమార్థికము, సంగీతము జగత్తు, సాహిత్య మీశ్వరుడు, సంగీతము వికృతి, సాహిత్యము ప్రకృతి, సంగీతము జీవితము, సాహిత్యము మరణము, సంగీతము మిథ్యయు ననిత్యమును, సాహిత్యము వాస్తవమును శాశ్వతమును, సంగీతము సగుణము, సాహిత్యము నిర్గుణము.[2]

ఈ సంగీతము 'ముక్కు చెవులట్లు మేనితో పుట్టవలయును. ఈవు దంచుము ప్రక్కలే నెగురవైతును'[3] అనునట్లుండరాదనియు పరిశ్రమ ప్రదర్శనముగాకాక, ప్రకృతి సిద్ధముగా నుండవలెనని వీరన్న మాటలు—

క్రొత్తగా గవకూడు కొన్న యాల్మగల స
యాటకు మించిన యాట యేది?
లేయీడున న్గోర్కె లేకయే వెలువడు
పాటకు మించిన పాట యేది?
తల్లి దండ్రుల గొడి న్బిల్లల జిలిబిలి
మాటకు మించిన మాట యేది?

2. జగజ్జ్యోతి – ద్వితీయ – పు. 370
3. మేలుబంతి – పు. 116

కూటమి ముద్దుల గుసగుస లీలల
మీటకు మించిన మీట యేది?

కూటికై దేవులాడెడు కొంటె యాట
పాటలివి యెల్ల వెలయాలి వగల మాడ్కి,
పూటకూళ్లింటఁ గొసరిడు బువ్వలాగు
రొక్కమున్వెచ్చపెట్టు, పర్వు చెడగొట్టు[4]

లోకమందలి ప్రతివ్యక్తి ఆటపాటలకు పనికిరాదని దాసుగారి స్వానుభవ పూర్వకమైన సందేశము.

'ఆటపాటల నేర్పరులగు లౌకికమనుష్యులు గంధర్వు లనబడుదురు. కామ్య కర్మపరులగు శ్రోత్రియు లాటపాటలకు పనికిరారు. సుందరాకారము లేనివాడు గంధర్వుడు గానేరడు. కాబట్టి యాటపాటల కందగాడు తప్ప కురూపి తగడు.'[5]

ఆటపాటలు మైకపు విద్యలనియు, అవి యేజాతి సంసారస్త్రీలకైనను నేర్ప రాదని దాసుగారి అభిప్రాయము.

ఆటపాటల మరులుకొన్నట్టివారు
కాపురమునకుఁ గొఱగారు - కనుకఁ గోరి
మగువలకు మైకపు చదువు మప్పరాదు
తెల్వితేటలుగల నాల్గుతెగల మగలు[6]

లోకములో గద్యపద్యగీతములను గొణుగుచు పడవరాదని దాసుగారను చున్న మాటలు-

4. మేలుబంతి - పు. 111
5. గానము అను వ్యాసము. పు. 1
6. మేలుబంతి - పు. 117

'పఠనశక్తి జనరంజకము కానపుడు రుచ్యముగఁ జదివి సుస్వరముగఁ బాడలేనపుడు ఛందోలయలతోఁ బనియేమి? మనసులోఁ జదువుకొనుట చెల్లును గాని యెలుగెత్తి సుస్వరముగఁ బఠించినపుడుకదా గద్యపద్యగీతముల సార్థకము. కేవల వర్ణాత్మకముగఁ జూచి మాత్ర మెఱుంగుటకు గద్యపద్యగీతము లన్నియు నొక్కటియే.'[7]

సంగీతకళను అపమార్గము పట్టించువారలు రెండురకములని యనుచున్న మాటలు-

'సంగీతకుతారములలో నానపేసిన గొడ్డళ్లు, నానపేయని గొడ్డళ్ళని రెండు తెఱంగులు. సహజ కృత్రిమ సంగీతములు వ్యయప్రయాసలతో వినుచుం గనుచు వెఱ్ఱియానంద మానందించుచుండియు నాడెము కట్టలేక నందిం బందియనియుం బంది నందియనియుం దెలిసినట్లు నటించి యభిప్రాయమిచ్చు రసికమ్మన్యులు మొదటి మచ్చు. సంగీతమందభిరుచియే లేనివారు రెండవరకము. లోకమందలి ముదిరిన మనుజులలోఁ బలువురీ రెండువిధములలోఁ జేరినవారే.'[8]

తలయూపుట, మెడను త్రిప్పుట, శరీరమంతయు నెగురవేయుట వ్యాయామమగును గాని సంగీతము కాదని దాసుగారి హేళనము.

తెనుగుభాష యరవల దొడపాటకు సరిపడదనియు, తెనుగు నసహ్యించుకొనెడి యరవలను తెనుగుపాటలను పాడనీయక వెలివేయవలెనని దాసుగారి తీవ్ర విమర్శ.

రెండునాల్కల త్రైర్వాడ గాంధ్రప పాట
వారిచే చమురంటని బాతుచేట
మనము తెలుఁగు వారమిఁక నేమఱక యఱవ
బొల్లి యొకిరింత వాలక మొల్లదగదు

7. అంబరీషచరిత్ర - ఉపోద్ఘాతము - పు. 1
8. నవరసతరంగిణి – పీఠిక

ఎవని నటనతేఁజూచి యెల్లవా రడఁకువ
కొందురో వానిదే గొప్పయాట
ఎవని కుత్తుక విననెంతురో యందఱు
వానిదే కడు మెన్నయైనపాట
ఒరుల మేలున కెవఁ డొడలప్పగించునో
యా వానిదే నిజమైన మాట
ఎవఁ డిష్టపిగ్గుల నెల్ల మెప్పించునో
యవ్వానిదే సుభమైన మీట

మాటపాటాటమీట లెచ్చోటనైనఁ
నెల్లముఁగ కనువారి కెల్లనెపుడు
పిన్న పెద్దలకు స్నేనవేల కెవఁడు
నలుపునో హాయి యట్టివాఁడె లయకాఁడు[12]

ఇవి దాసుగారికి ఆటపాటలపై గల అభిప్రాయములలో ప్రధానములైనవి.

కవులు - కవిత్వము :

దాసుగారికి సంస్కృతకవులలో జయదేవుడన్న, ఆంధ్రకవులలో పోతన యన్న గౌరవము మెండు.

పూర్వకవు లందఱున్ గడు పూజ్యులందు
భాగవతులయి గోస్తనీపాకముగను
కృతులొనర్చు నధిపుల సంస్కృతమున జయ
దేవుఁ దెనుఁగునఁ బోతనం దెలిసి యెంతు[13]

వీరియువురిపై గౌరవముంచుటకు కారణములు, వారు భాగవతులగుట, వారి రచనలు గోస్తనీపాకమునందుండుట.

12. ఆంధ్రగాయక మహాజనసభ - అధ్యక్షోపన్యాసము - 27-6-31
13. మేలుబంతి - పు. 148

ఎవని నడతఁజూచి యెల్లవా రడఁకువ
గొందురో వానిదే గొప్పయాట
ఎవని కుత్తుక విననెంతురో యందఱు
వానిదే కడు తెన్నయైనపాట
ఒడల నోలున కెవఁ డొడలప్పగించునో
యా వానిదే నిజమైన మాట
ఎవఁ డిగ్గుపొగ్గుల నెల్ల మెప్పించునో
యవ్వానిదే సుఖమైన మీట

మాటపాటాటమీట లెచ్చోటనైనఁ
జెల్లముఁగ కనువారి కెల్లనెపుడు
పిన్నపెద్దలకు స్వేనవేల కెవఁడు
సలుపునో హాయి యట్టివాఁడె లయకాఁడు[12]

ఇవి దాసుగారికి ఆటపాటలపై గల అభిప్రాయములలో ప్రధానములైనవి.

కవులు - కవిత్వము :

దాసుగారికి సంస్కృతకవులలో జయదేవుడన్న, ఆంధ్రకవులలో పోతన యన్న గౌరవము మెండు.

పూర్వకవు లందఱున్ గడు పూజ్యులందు
భాగవతులయి గోస్తనీపాకముగను
కృతులొనర్చు నధికుల సంస్కృతమున జయ
దేవుఁ దెనుఁగునఁ బోతనం దెలిసి యెంతు[13]

వీరియువురిపై గౌరవముంచుటకు కారణములు, వారు భాగవతులగుట, వారి రచనలు గోస్తనీపాకమునందుండుట.

12. ఆంధ్రగాయక మహాజనసభ - అధ్యక్షోపన్యాసము - 27-6-31
13. మేలుబంతి - పు. 148

పద్యకావ్యములందు రఘువంశము, నాటకము లందు ఉత్తరరామచరితము, గద్యకావ్యములందు కాదంబరి వీరిని ఆశ్చర్యపరచిన గ్రంథములు.

కాళిదాసుని రఘువంశకావ్యముఁగను
గొనియు భవభూతి నాటకమును జదివియు
బాణు గద్యమరసియుఁ గవనము చెప్ప
వెఱవఁ జద్దిర! నావంటి వెఱ్ఱివాఁడు[14]

కావ్యరచన చేయగల్గినవాడు వాల్మీకి యొక్కడే. శాస్త్రరచన చేయగల్గిన వాడు వ్యాసు డొక్కడే యని వీరిభావము.

కావ్యరచనకు వాల్మీకి కావలయును
తగు వ్యాసుఁ డొకఁడె శాస్త్రంబుఁ దెలుప
శక్తిలేమి నెఱిఁగియు లజ్జనొందని
వేత్తవలె నటియించెద విధివశమున[15]

మహాభారతము నాంధ్రీకరించిన కవిత్రయముపై దాసుగారికి సద్భావము లేదని, 'వాగ్గేయకారహర్యక్ష' బిరుదాంచితులైన శ్రీ శర్మా అప్పయ్యగారి భారతమున కభిప్రాయ మిచ్చుచు పల్కిన ఈ పంక్తులు సాక్ష్యములు.

బ్రహ్మహోతన్న పన్నని 'భారతంబు'
కొఱఁత నీతోడ నచ్చెరా! కొంత తీరె
... ... ...
'భారతము' వేల్పు నుడువులంబట్టి తెలుఁగు
ముక్కుమున్ముక్కు దోపిరి - ముందుగాని
త్రొక్కఁజాలరు ...[16]

14. మేలుబంతి పు. 148
15. జగజ్జ్యోతి - వంశావళి - పు 7
16. శ్రీకృష్ణావతార భారతము - పీఠిక - 3, 12 పద్యములు

ఈ పంక్తుల వలన కవిత్రయముకన్న, పోతన్నపై గౌరవము మిన్నయని స్పష్టము. కవిత్రయమువారి ఆంధ్రీకరణము స్వతంత్రత లేనిదని దాసుగారి విచిత్రవిమర్శ.

ప్రపంచమునంతయు వారి కావ్యములలో ప్రతిబింబింపజేసిన మహానుభావులు ఆంగ్లకవియైన షేక్స్పియరు, సంస్కృతకవియైన వ్యాసుడుమాత్రమే అని వీరి యుద్దేశము.

"తన కావ్యదర్పణంబున జగమునెల్లఁ జూపిన మహానుభావుఁడు భారతీయులలో వ్యాసుఁడు నాంగ్లేయులలో షేక్స్పియరని నా యభిప్రాయము.[17]

కాళిదాసు, షేక్స్పియరుల శక్తులను పోల్చినవిధము-

"కాళిదాసుఁడు షేక్స్పియరునివలె స్వతంత్రుడు కాఁడతని కవిత్వము వాల్మీకి వ్యాసకవిత్వముల ననుసరించినది. భారతీయ గ్రంథములలోని యూహలన్నియుఁ గలిపినచో షేక్స్పియరుని యూహలగునేమో, యెన్ని మహానదులు కలిసి పాఱినను సముద్రమున కొక మూలకు వచ్చునా? .... పూర్వులలో వాల్మీకి వ్యాసులు, నవీనులలో జయదేవ మాఘ భవభూత్యాదులు గ్గాళిదాసునకు సమానులో లేకధికులోగాని, లోకము నందలి కవులలో షేక్స్పియరునకు సమానుఁడుగాని యధికుడుగాని లేఁడనవచ్చును.[18]

ఆంగ్లకవియైన షేక్స్పియరుని ఆకాశమున కెత్తిన మరియొక భారతీయకవి యుండడు. ఏకభాషాపరిచయస్థుల మాటవలెగాక, ఆంధ్రాంగ్లగీర్వాణభాషలపై అధికారముగల దాసుగారి ఈ కితపత్రము మిక్కిలి విలువైనది. దాసుగారు షేక్స్పియరును అంత ఆకాశమునకెత్తి కూడ, అతని ప్రఖ్యాత నాటకమైన "హేమ్లెటు" లోని లోపములను విమర్శించినాడు. ఇట్లే కాళిదాసుని శాకుంతల నాటకమును దుయ్యబట్టినారు. ఒక్క శాకుంతల నాటకమునే కాదు, అతని ప్రఖ్యాతములైన మూడు నాటకములను తీవ్రముగా విమర్శించినయొక్క వాక్యము.

---

17. నవరసతరంగిణి - పీఠిక - పు. 8
18. ,, పు. 11

"విక్రమోర్వశీయ శాకుంతల మాలవికాగ్నిమిత్రములలో నాయకులు వేశ్యా నొకడు, వేశ్యకూతు నొకఁడు, వేశ్యావేషమున నున్నదాని నొకఁడు క్రమముగా వలచి యగ్నిహోత్రసాక్షిగాఁ బరిణయమాడుకొన్న భార్యల న్వంచించిరి.[19]

ఈ వాక్యము దాసుగారి నిశితవిమర్శనదృష్టి ఎంత సూక్ష్మాంశములపై కూడ ప్రసరించునో వివరించును.

ఇక వారికాలమున కన్పడుచున్న తెలుగుకవితను విమర్శించిన విధానము—

పూర్వప్రబంధముల పోల్కి-కై చొచ్చిన
 యాఁగనంటించెడు హీనుఁడొకఁడు
ప్రౌఢకల్పనలని పన్ని తనకుఁదానె
 యర్థంబెఱుఁగలేని వ్యర్థుఁడొకఁడు
కృతిని నిఘంటువు వెతకి ముదురు తాటి
 ముంజవలెన్ జేయు మూర్ఖుఁడొకఁడు
తేట తెల్లంబని తెన్గుబాసను బట్టి
 తెరచి చూపించెడి దేబె యొకఁడు

కలివశంబున శారద కలుషయయ్యెఁ
బిదపకాలంబునఁ దలంపు పిచ్చియయ్యె
అచ్చుచవకయ్యె మూఢులు మెచ్చురయ్యె
అహహా! యెందుకు కవులైరి యాధునికులు?[20]

ఇట్లు నిషేధమార్గములను తెలిపి, ఇకకవిత యెట్లుండవలయునో విధి మార్గమున వివరించిన విధ మిది—

సాఁగి కమ్మచ్చునన్ వచ్చు తీఁగకరణి
సాలెపురుగు కడుపులోని నూలువలెను

---

19. నవరసతరంగిణి పీఠిక - పు॥ లు 18, 19
20. ప్రహ్లాదచరిత్ర - పు॥ లు 4, 5

దబ్బునన్ బొర్లిపడు కొండఁధారవోలిక-
సహజకవిత బయల్వెడలి సన్నుతిగను[21]

ఇట్లు సహజకవిత పుట్టవలెనని చెప్పి, ఆ కవితారచనా విధాన మిట్లుండవలె నని చెప్పుచున్నాడు-

'స్వతంత్రముగఁ గథను గల్పించి యపూర్వముగ నూహలం దెల్పుట, యతుకలుంచక పద్యము లల్లుట, పండిత పామర రంజకముగ మృదు మధురోచిత శబ్దంబులం బొందుపర్చుటయుం గవిత్వమున ముఖ్యాంశములు. సర్వసాధారణాను భవమున్ యథోచితంబుగఁ దెల్పి జనుల హృదయంబులకెల్ల రసముప్పతిలంజేసి నీతి నుద్బోధించుటయే కవితకుఁ దగు ప్రయోజనము.[22]

ఇవి దాసుగారు కవులను, కవిత్వములను విమర్శించుచు చెప్పిన అభిప్రాయ ములలో ప్రధానములైనవి.

సమకాలీన సమాజము :

సమకాల మందలి సంఘములో దాసుగారు తీవ్రముగా విమర్శించిన విషయ ములు బాల్యవివాహములు, నాటసాత్త్వములు, ఉద్యోగుల దుర్మార్గములు.

'ఒహో, యీ పంచె కొండ రూపేమి, బోషినోటి తీరేమి, దెబ్బదవపడి యేమి, బారసాఁపీటపై పడకచు కూర్చున్న సొంపేమి, ముసలికాలమునకు ముచ్చట్లని యెగతాళిచేయుచు కొందరు'[23]

'కొండొకచో బాలికన్ జెట్టపట్టిన ముసలిబాయ నిర్లజ్జంబై, కర్కశంబై కొండొకచో కన్యాశుల్కము మాదిరి విప్రకృతంబై .... కొండొకచో బాల్య వివాహమువిధమున మస్తకమూలంబై, ప్రియాసభిజ్ఞంబై .... [24]

21. మేలుబంతి - పు. 147
22. నవరసతరంగిణి – పీఠిక - పు. 3
23. యథార్థరామాయణము – పు. 87
24. ,, – పు. 67

'శ్రీరామచంద్రుడులేని యీ పాదుకొంప యయోధ్యలో నివసించుట వృద్ధ వివాహమాడినట్టులు .... వ్యర్థముకదా!'[25]

'తరుణభార్యా ప్రథమప్రసూతికై యధికధనవంతులగు వయసుమళ్లిన మగల బోలి కన్ ....'[26]

'పోరిపోరి వరకన్యాశుల్కములను దినెడు
కుత్సితుల డొక్కజీల్చి రాల్గొట్టుచుంద్రదు'[27]

'వీనులం గన్యాశుల్కముపాటె - వెడబడుగు పెండ్లాడె
... ... ...
ముత్తైదువని మొజ్జునిగెడె-నో త్రిబిడ్డను బుస్తె కనుబడె[28]

'ముసలిముద్దకుం గడుం బసిపాప కర్థపుం
బేరాశతోం జేయు పెండ్లి జూచి'[29]

'పశుహింస బాల్యవివాహ కన్యావిక్ర
యంబు లెవ్వాని రాజ్యమున లేవు'[30]

ఈ విధముగ సందర్భమును కల్పించుకొని దాసుగారు బాల్యవివాహములను, కన్యాశుల్కములను తీవ్రముగా విమర్శించినారు.

ఇక సంఘములో దుర్మార్గులగు ఉద్యోగులను, కూటసాక్ష్యములతో, ఇచ్చకములతో బ్రతుకువారిని, అసత్యవాదులను, నీతిరహితులగు పలురకముల వారిని మాటికి విమర్శించినారు. మచ్చునకొకటి రెండు సందర్భములు -

---

25. యథార్థరామాయణము – పు. 114
26. ,, - పు. 193
27. సావిత్రీ చరిత్రము – పు. 46
28. హరిశ్చంద్రోపాఖ్యానము - పు. 5
29. హరిశ్చంద్రోపాఖ్యానము - పు. 6
30. ,, పు. 8

"ఒకచోట సాధులఁ డికమకలం బెట్టి
బాధించి మను న్యాయవాది జనము
లొకచోట రాజులయొద్ద నిచ్చకములఁ
బల్కుచు నెగడు విద్వత్కులమ్ము
నొకచోట లంచము లొడిసి మ్రింగుచు దంభ
మెయ్యనఁజూపు నుద్యోగిగణము
నొక్కచో చెలివేత లెక్కించుకొనుచు రూ
కలఁదీయు పీఠాధికారిబలము

లక్కటా! వీరలే యిపుడవనియందు
సకలజన సూత్రధారులై సాగుచుండ్రు
మారికిన్ వలె వీరికి మనుజులెల్ల
వడఁకుచుందురు కలికాలవశముచేత[31]

మర్మంబెద్దియులేని మానవులకున్ బల్వాదు పుట్టించుచున్
ధర్మస్థానములోన వారి ధనమున్ వ్యర్థంబు గావించుచున్
దుర్మార్గంబున న్యాయవాదిమిషతో కూటసాక్ష్యంబులన్
నిర్మాణించెడువారి నాలుకల ఖండింపింతు బాపోజులన్[32]

ఇక నవనాగరక సంఘమును గూర్చి దాసుగారికి సదభిప్రాయములేదను మాటకు 'కొండొకచోఁ నవనాగరక జీవనంబు సొబగునఁ గాంచన ప్రధానైక గౌరవంబై, నిరర్థకంబై, దుష్పథంబై .... [33] అను కల్పించుకొని తెచ్చిపెట్టిన ఉపమానము సాక్ష్యము. ఇట్లు ఉపమానములతోగాక, సూటిగా 'రాజమండ్రి టౌను హాలు వర్ణనము'న నవ నాగరక సమాజ వ్యర్థజీవితమును విమర్శించినవిధ మొక మంచి యుదాహరణము

---

31. మార్కండేయచరిత్ర - పు॥ లు 8, 9
32. సావిత్రీ చరిత్రము . పు. 45
33. యథార్థరామాయణము - పు. 67

"ఉదయమునుండి సాయంకాలమైదుగంటలవర కుద్యోగముల నలసి డస్సి యచట గాలయాపనము చేసికొనుటకై కొందరు, ఇంటిబాధ పడజాలక కొంతసేపైన నొంటిగ సుఖముండుటకై కొందరు, గుఱ్ఱపుబండ్లపై బైసికిళ్లపై నుండియు వచ్చి తమ డాబు చెలాయించుటకై కొందరు, తగిన యధికార్ల సహవాసము దొరుకును గదా యని యిచ్చకములు బల్కుచు నాత్మలాభముకై కొందరు, ఇంటిలో గూరనార చూచుకొనక న్యూస్‌పేపర్ల టప్పాల రుచిమరగి మరింత మనఃక్షోభ నొందుటకై కొందరు, ప్లీడర్లుద్యోగులు కలిసిటప్పాలు కొట్టువారు, పనికిమాలిన వృద్ధ ఘటములు పెన్షనుదార్లు మొదలుగ బలురకములు క్లబ్బుపురుషులు, టెన్నిస్సులో నాట కొంచెము గాని సోడా మొదలగు దిక్కుమాలిన మాదిగనీళ్ల కడుపున కామాధిక్యముగ మెండుగద్రాగు పడుచువాండ్రును, బాలెల్లెటు దిరుగునో యట్లు శిరస్సులు ద్రిప్పుచు ఒరుగుచు, ప్రతికక్షి కేననో గాని పాకెట్‌చేసినపుడు విధిలేక మెచ్చుచు, మాటిమాటికి స్కోరడుగుచు, మిస్సైనపుడెల్ల స్క్రూకొనకును తన చేతి బాటునన్ద్రేలి మొదటి కిం జీమసుద్దవ్రాయుచు రెష్టుపుచ్చుకొనియు మిస్‌పాకెట్‌చేసి తెల్లబోవుచు, ప్రతికక్షి దా కూహకపు సలహాలిచ్చుచు, గెల్పుగోరి బుద్ధి తీక్ష్ణపర్చుకొనుటకై మాటిమాటికి బొటనుబీల్చుచు చుట్టగాల్చుచు, సొమ్ము కొల్లపెట్టి యుద్ధమైన నీళ్లద్రావుచు, దెబ్బతప్పిపోయినపుడు స్క్రూటిప్పు రబ్బరరగిపోయినదనియు నేటి కరుసము బాగు లేదనియు, నభీష్టానుసారముగ దెబ్బ తగిలినపుడు తనలో దా మెచ్చుకొని చెంగటి వారి మోములను గర్వముతో జూచుచు పెకలినవ్వులు నవ్వుచు, మ్లేచ్ఛతమే మాట్లాడుచు, యూరోపియన్ డ్రస్సులు వైచుకొని బేజరురుగ దనను సొడుచేయుచు, తద్దినమైన మానుకొని తప్పక ప్రతిదినము బిలియర్డ్సాడు హీనసత్వులును, బురద నీట ద్రొక్కబడినట్లాపిరిదీయక ఫ్రాన్సుదేశములో నొక గాడిదకు క్రోతిబుట్టిన దనియు, నమెరికాలో సైన్టిస్టు పీనసులో మిరపకాయలతోట కనిపెట్టినాడనియు, రష్యాచక్రవర్తిగారి గడ్డములో నొక పెంద్రుక తెల్లబడినదనియు, జపానుయుద్ధములో నాడది మగవానిపై కెక్కి మీసము లాదదీసెననియు, మన చక్రవర్తిగారు మనదేశము సుసుపటికన్న నెక్కువక్షేమతో బరిపాలించుటకు ఖరారుచేసినారనియు, సురేంద్రనాథ్‌బెనర్జీగారు స్వరాజ్యముం గూర్చి లెక్చరులో ఘామిని మన్నుచేసినా రనియు, నరవిందఘోషుగారు లండనులో మనకొరకై బాధపడుచు మాలదాడు వినుచున్నారనియు, లాల్‌మోహనరాయిగారు క్రోతిసీలబొఱకు చందమున ముప్పుతెచ్చు కొన్నారనియు, బొబ్బిలిమహారాజావారుగవర్నరుగారి సభలో జీతమునకు గుదుర్కు

న్నారనియు, జాతివిచక్షణమాని హిందువు లంద రేకవర్ణముగ నున్నగాని మనదేశము బాగుపడదని లాల్‌మిత్రగారుపన్యాస మిచ్చిరనియు, నొక నబాబుగారు మొన్నసాయంకాలము పొద్దెంక నొక నరునకు మూడుతున్కలు చేసిరనియు, లండన్ వెళ్ళగానుమున్ముట్టి చూడగా పైప్రిపేటు సెక్రటరీగారికి ఇండియా యొక్క యభివృద్ధికై యాలోచన పుట్టకలదనియు, స్వదేశీమీటింగు చేసినందుకు అల్లాహాబాదులో గొందరిని ప్రోసెక్యూషన్ జేసిరనియు, జనులు చచ్చి సున్నమైనారనియు, నిచటి పేసవిబాధకు దాళలేక మైసూర్మహారాజావారు నీలగిరికొండలు పట్టిరనియు, మరియొక జమిందారుగారు సముద్రపుపొట్టోడ్డు జేరుకొనిరనియు, గవర్నరుగారు ఫలానా తేదీ మూడుగంటల పదేనుమినిట్లకు విజయనగరం మహారాజావారిని కలుసుకొని అయిదుగంటలకు వాల్తేరు రైలుప్లాటుఫారమున నద్రపృందుకొని ప్రసిడెన్సీలోని భాగ్యపాటి స్థలములన్నియు జూచుకొని మరియు స్వదేశమునందు సెటిల్ కాబోవుచున్నారనియు, వెర్రికుక్క కాటునకు బకోడీలు తినుమని జర్మను డాక్టరుపదేశించెననియు, ఫ్రీమేసన్ మీటింగులో నానాజాతి వారందరు కలిసి యన్న పానముల దృప్తిచెందిరనియు, మొదలగు వార్త లడిగినవారితో నడుగనివారితో దెల్పుచు వార్తాపత్రికల నూపిరిదీయక చదువుకొనుచు దలలాడించు వార్తా లాలసులును - బ్రిడ్జి కంప్లీటయినది పేకాటలో నింత సొగసైనయాట యీ క్లియరెన్సు గాన యురోపియన్సట్లు సొమ్ము కొల్లబెట్టుకొనెదరోయి యిటువిను యూరోపియన్సొసైటీయని చీట్లాట ముదుసలివారును, రాజు ఆట కట్టి హాహా యిహిహీ మరియొక యెత్తు వేయుదుమా? ప్యాన్! స్వీట్సున్నాయా యేదీ యొక పెప్పర్మెంటు తెమ్మనుచు నేమో మిక్కిలి లోతుగ నాలోచించుచు, సంతలో మతిలేక బంటుముందు మంత్రిని బెట్ట యెత్తిమ్మని పీకులాడుచు, నూలులేని సంతగడబిడచేయు చదరంగపుటాటగాండ్రును మెండుకొను క్లబ్బులో .... [34]

పరిణామసిద్ధాంత సమన్వయము :

దశావతారములను సృష్టిపరిణామ క్రమానుసారముగా వివరించుట.

పరిపూర్ణుండగు పరబ్రహ్మ సర్వప్రపం
చాకారుండై తనయందుండ దానె
యుపతరించు యభివ్యక్తుడగు నీ జగమెల్ల
నతనికి నాటపట్టయి చెలంగు

---

34 నాయెుక - పు॥లు 174-76

నొకటి సున్నను గూడి యున్నప్పు పదిగతు
లందుఁ బోలిక పూయనొంది యతఁడు
తొలుతను బది వేషములఁ జూపు, నవ్వాని
జాడల జంగమసంఖ్య పెరుగుఁ
గేవల జలచరజీవులలోఁ జేప
పది వేషములలోన మొదటి మచ్చ
దీని రెక్కల జాడనాని పై కెగిరెడు
పక్షులు బుట్టె నాపైని, నాల్గు
కాళ్ళతో భూజలగతులందుఁ దాఁబేలు
రెండవరకముగా నుండు, దీని
వలె పంచనఖములఁ బరఁగు నసవి పంది
మూఁడవ యది, దీని మొదలు చేసి
తోఁకలుగల మృగలోక మంతటిలోన
సింహము నాల్గవ చెల్వు, తోఁక
గలుకక చేతులుఁ గాళ్లేర్పడఁగఁ బొట్టి
యగు మేనుగల్గి మాటాడగలుగు
మనుజుఁడై దవతీరు, మఱి వానికన్న ధై
ర్యంబు కాంతియు బుద్ధినలరునట్టి
మనుజుఁ డాఱవపోల్కి, జనలోక పాలన
దక్షుఁడై యుత్తమోత్తముఁడుగాఁగ
నెగడు భూభర్త యేడగు వేష మదియు వృ
ద్ధికి మేర యంతతోఁ దీసివేత
క్రమముగా సృష్టికిఁ గలుగు నెన్మిదియవ
వేషము మత్తున వెలయుచుండు

తోఁకమ్మిదవరూపు వికృతవేషమ్ము మఱియుఁ
బదియువది మృగలీలతోఁ దరఁగుఁ దుదకు
భూమిచరములు జలములమున్గు, సృష్టి
యెల్లయును జెను మిగులు సర్వేశుఁ డొకఁడు[35]

దశావతారములను జలమునుండి పుట్టి జలప్రళయములో అంతరించు సృష్టి పరిణామక్రమానుసార జీవులుగా అన్వయము చేయుట ఇందలి విశేషము. మత్స్య కూర్మవరాహనారసింహ వామన పరశురామ శ్రీరామ బలరామ బౌద్ధ కల్కులు పురాణ ప్రసిద్ధ దశావ తారములు.

ఈ అవతారములకు సృష్టి పరిణామక్రమమును ముడి పెట్టిన విధానమిది-

కేవలము జలచరమైనది చేప (మత్స్యము). తరువాత జలగతితో పాటు భూగతి కూడ కలిగిన తాబేలు (కూర్మము). తరువాత తాబేలువలె పంచనఖములతో నుండు అడవి పంది (వరాహము). తరువాత తోకలు కలిగిన మృగము సింహము (నారసింహ). తరువాత తోకలేక పొట్టి కాళ్ళేతులతోగూడి మాటాడ కలిగిన మానవుడు (వామన). తరువాత మాటాడుటేకాక సౌందర్యము బుద్ధి కలిగిన మానవుడు (పరశురామ). తరువాత జనలోక పాలన దక్షుడైన ఉత్తమ మానవుడు (శ్రీరాముడు) ఇక ఇక్కడనుండి మరల మానవుడు పతనమయి మత్తులో నుండుట (బలరామ). తరువాత మృగప్రాయుడైన మానవుడు (కల్కి). తరువాత భూమి చరములన్నియు జలములో మునిగి పోవుట.

ఇట్లు దశావతారములను సృష్టిపరిణామ సిద్ధాంత పరముగా అన్వయించుట దాసుగారి విషయ విమర్శన విద్యకు నికషదృషదము.

స్వమ్మతమతము :

దాసుగారు లోకములోగల ప్రసిద్ధమతసిద్ధాంతములను పూర్వపక్షముచేసి వారికి సమ్మతమైన మతమును స్థాపించిన విధము –

35. గజేంద్రమోక్షణము - పు॥ లు 6, 7

ఆదికారణ మెన్నరాదు కాప్రన స్వభా
వము లోకమనిచెప్పు బౌద్ధమతము
జగమబద్ధము బ్రహ్మ సత్యం బటంచు నెం
తయు బోధపర్చు నద్వైతమతము
సగుణుఁ డీశుఁడు ప్రపంచమునాని [illegible]
భూతి యందు గణించు ద్వైతమతము
ఇహమె నిక్కము పరంబెల్లఁ గల్ల యటంచుఁ
దెల్లముసేయు నాస్తికమతంబు
ఇన్నిమతములలో సారమెంచి యెంచి
దయయు నిర్మోహమున్ భక్తి ధర్మబుద్ధి
నాల్గిటన్ గ్రమముగఁ బొంది నయముమీఱ
జయము మన మందవలయునో సభ్యులార![36]

ఉన్నదె జరుగుచున్నదఁటంచు ని
ర్లక్ష్యంబు జూపెడు లక్ష్యమతులు
నున్నదానికి లేనిచిహ్నల నలరించి
నామంబుదిద్దెడు న్యాయమతులు
నున్న దెఱుంగక యున్నట్లు దెల్పంగఁ
జాలుట లెక్కించు సాంఖ్యరతులు
నున్నది మన మనుకొన్నది సత్య వి
శేషమున్నదను విశేషగతులు
ఉన్నఁ జెల్లును లేకున్న నుత్తమంబు
సందియంబేల? తలఁపుల శాంతిబూనఁ
దనెడు యోగవ్రతులు కలియుండు శాస్త్ర
వాదమాత్రులుగా నపవాదు గొంద్రు[37]

---

36 అంబరీషచరిత్రము - పు. 3

37. మార్కండేయచరిత్ర - పు॥ లు 7, 8

ద్వైతంబుండుట యుక్తికాదు మఱి యద్వైతంబు ప్రత్యక్ష భా
వాతీతం బటుగానఁ గర్మములుసేయన్మానరా డెంతయున్
ద్వైతాద్వైతసమంబు బ్రహ్మమనుచున్ ధర్మంబు నిర్మోహియై
ఖ్యాతిన్నిల్పినవాఁడె యుత్తముఁ డనంతా! సూర్యనారాయణా[38]

ఇట్లు బౌద్ధ ద్వైతాద్వైత నాస్తికాది మతముల లక్ష్య (?) న్యాయ సాంఖ్య వైశేషికయోగాది దర్శనములను తెలిపి, వానిలోగల లోపములను బైటకుచూపి, ఆ సిద్ధాంతకర్తలను 'శాస్త్రవాదమాత్రులు' అని నిందించి, నిర్మోహియై భక్తిభావ భరితధర్మ బుద్ధి కలవాడే యుత్తముడని సిద్ధాంతము చేసినారు.

క్రతుక్రథన ఖండనము :

క్రతుక్రథన మనగా యజ్ఞయాగాదులలో నలుపు జంతుబలి. దాసుగారు ఈ జంతుబలులను పనికట్టుకొని తీవ్రముగా విమర్శించినారు.

'గగనారవిందంబుఁ గైకొందుమని నేక
లంబట్టి పినుక జన్నంబు జూచి'[39]

'తమకు సంపదగోరి దైవతములకు జం
తువులను బలియిచ్చు దుర్జనులను'[40]

శ్రుతిలోగల ఉత్తమమంత్రమైన 'న హింస్యాత్సర్వభూతాని' (ఏభూతము నైనను హింసింపరాదు) అనుదానిని ఆదరింపక, అధమమంత్రమైన 'పశుమాలభేత' (పశువును చంపవలయును) అనుదానిని అనుసరించి నీచులవలె జంతుబలులను ప్రోత్సహించుచు పండితమానులై విఱ్ఱవీగు విప్రుల వివేక శూన్యతను విమర్శించిన విధానము -

---

38. సూర్యనారాయణ శతకము - ప. 82
39. హరిశ్చంద్రోపాఖ్యానము – పు. 6
40. సావిత్రీచరిత్రము - పు. 45

చెఱకు తీపి యనఁగఁ జేరి యద్దానిని
వేళ్ల మోయ నమలు వెడఁగు పగిది
వేదవాక్కులెల్ల విధులని పశుహింస
సలుపు కూళ భోగములను గోరి[41]

శ్రుతిప్రకారము ఒకవేళ బలిచేయదలచుకొన్నచో, మానవులను బలియిచ్చి అంత్యమున ఆ యజమానికూడ అగ్నిలో ఆహుతికావలెను. స్వార్థముతో, ప్రాణముల తీపిపై, ఆపనిచేయరు అని విమర్శించుచున్న విధానము -

యజ్ఞము మోక్షదాయకమగు పశుహింస
విధిచోదిత మటన్న వేదవాక్కు-
లన్నియుఁ దా నమ్మి యజమానుఁ డెంతయు
సాహసధైర్య విజ్ఞానములను
మానవులనుబట్టి మఱి యూపములఁ గట్టి
ముక్కుచెవుల్ నోరుమూసి చంపి
వసఁదీసి యగ్గిం గోపల వ్రేల్చి తాఁగూడ
నంత్యహోమంబుగా నగ్నిలోనఁ

బడి మృతిఁబొందవలెనని నుడువు శ్రుతులఁ
జెనటు లిప్పు డలక్ష్యంబుచేసి తమకుఁ
బ్రాణము బెల్లమని సోమయాజిపీఁట
లొంద మేకలఁగోయుచు నుందు రకట[42]

ఇట్లు విమర్శించి, ఇక యజ్ఞముచేయించు వైదికపండితులపై మండిపడుచున్న విధము -

41. సావిత్రీచరిత్రము – పు - 8
42. ,, పు॥ లు 8, 9

స్వర్గములోన రంభాభోగమిట బహు
 మానముగోన యజమానుఁడొకఁడు
దక్షిణార్థమై బకధ్యానంబు సల్పుచుఁ
 బండితమ్మన్యుఁడో బ్రహ్మయొకఁడు
సకలక్రియలఁ బృథక్జనముల నియమించి
 దంభుఁడై తిరుగు నధ్వర్యుఁ డొకఁడు
కడుపు కక్కుర్తికై కమురుకంపున కోర్చి
 యుక్కిరిబిక్కిరౌ హోత యొకఁడు

శ్రుతులసారంబు తెలియక క్రతువులందుఁ
బశువులం జంపి సౌఖ్యమల్పంబు గొందు
రుచితమెఱుఁగక యిదియె విధ్యుక్తమంచుఁ
గ్రూరకర్ములకుం దయ దూరము గద[43]

ఈ పశుహింసకు వ్యతిరేకులు గనుకనే, దాసుగారు వారి గ్రంథములందు మాటిమాటికి మాంసాశనమును గూడ విమర్శించుచుందురు. మచ్చునకు రెండు ఉదాహరణములు -

ఆయురారోగ్యకరములై యతిశయిల్లి
పాలు చక్కెర ధాన్యముల్ ఫలములుండ
జంతువులఁబట్టి తిననేల జాలిమాలి
జ్ఞానవంతులమనుకొను మానవులకు?[44]
"మహన్మాంసాశను లచ్చోట స్వైరవర్తన"[45]

సందర్భమును కల్పించుకొని దాసుగారు అనేకాంశములను విమర్శించిన విధాన మిది.

---

43. సావిత్రీచరిత్రము - పు॥ లు 7, 8
44. హరిశ్చంద్రోపాఖ్యానము - పు. 5
45. అంబరీషచరిత్రము - పు. 5

## ధిషణావిశ్లేషణము :

ధిషణ అన బుద్ధిలేక మేధాశక్తి. ధిషణా విశ్లేషణమన మేధాశక్తి యందుండు అంతరములు. ఈ మేధాశక్తి జీవి జీవికి భేదించుట సృష్టి లక్షణము. ఈ మేధా శక్తియే జీవులకు లోకములో తరతమ భేదములను కల్పించునది. సామాన్య మానవునకు కవికి, కవికి మహాకవికి భేదమును నిర్ణయించునది. సామాన్య మానవుడు కవి యగుటకు, కవి మహాకవి యగుటకు ఏయే మేధా విశేషము లుండవలెనో విశ్లేషించి, అవి దాసుగారిలో కొలుచుట ఈ ప్రకరణ లక్ష్యము.

మహామనీషి మనీషామంజూష యందలి అరలు - 1. అనుశీలన (observation) 2. ఆలోచన (thought), 3. వివేచన (diserition), 4. అవగాహన (Understanding), 5. ఊహాశాలిత (imagination), 6. ధారణ (memory) 7. అనుభూతి (feeling), 8. భావము (idea), 9. ఉద్దేశము (attitude).

ఈ అంశములు చూచుటకు ప్రత్యేకములుగా అనిపించుచున్నను, ఒకదాని కొకటి సంబంధములేనివి కావు. సూచీసూత్రసత్రదళ న్యాయమున అంతర్లీనముగా క్రమవికాససూత్ర సంబంధమున్నవే. ఈ క్రమవికాసమునకు వివరణము-

1. అనుశీలన :

అనుశీలన మన పరిశీలనము. లోకములో అడుగుపెట్టిన ప్రతిప్రాణికి ఇది ప్రాథమిక లక్షణము. మనుగడకు మొదటిమెట్టు. ఈ అనుశీలన ప్రతిప్రాణి సాధారణ లక్షణమైనచో, మరి మహామనీషి లక్షణములలో దీనిని ప్రత్యేకముగా చేర్చుటెట్లు? అను శంకకు అవకాశమేర్పడును. దీనికి సమాధాన మిది, మనీషి కూడ తక్కిన సామాన్యమానవులు చూచిన ప్రపంచమునే చూచుచుండును. కాని తనకున్న విలక్షణ వీక్షణముతో వీక్షించును. ఆ మేధాశాలి కవియైనచో అతని ఆ విలక్షణ దృష్టియే కవిత్వసృష్టికి మూలమగును. సామాన్య మానవుల భౌతిక నేత్రములకు కన్పడు సృష్టియే యితని దృష్టితో మరియొక సృష్టిగా మారును. సామాన్యమానవునకు చంద్రుడు చంద్రుడుగా మాత్రమే కన్పింపగా, కవికి ఈ చంద్రుడు ఏ ప్రియురాలి ముఖముగనో, ప్రకృతికాంత నుదుటి తిలకముగనో, కాశ్మీరశంభులింగముగనో దర్శన మిచ్చును. ఏకత్వములో అనేకత్వము ప్రదర్శించుటయే కవితాజీవలక్షణ మగుటచే, కవికి కవికి కూడ వీక్షణము నందు విలక్షణత

యుండును. కాన వర్ణనమందు కూడ కవులకు వైలక్షణ్య ముండును. విలక్షణ వీక్షణ విశేషులైన కవులలోనే ఒకరి కొకరికే పొత్తుండనపుడు, ఇక భౌతికదృష్టి గల సామాన్యమానవులతో పొత్తుండునా? కనుక సామాన్య మానవుని అనుశీలన కేవలము భౌతికమైనదనియు, మేధావి అనుశీలనయు విలక్షణ సుందరమైనదనియు సారాంశము.

ఏ అనుశీలన లక్షణము దాసుగారి పుట్టువునకు తోబుట్టువు అనుటకు 'మొట్ట మొదట మదీయ త్వక్ఛ్రోత్ర రసనా ఘ్రాణ చక్షుః ప్రవృత్తిహేతువు మజ్జనని యయ్యెను నా చూపులకు నా తల్లి మోము, నా చెవులకు నాతల్లి పల్కరింపు, నా జిహ్వకు నా తల్లి చన్బాలు, నా మేనికి నాతల్లి పొదిగిలియును దొలుదొల్త యనుభూతము లయ్యెను. క్రమక్రమముగా నా జ్ఞప్తి పెరిగినకొలది తప్పటడుగుల తోనే నా తల్లి దండ్రులు మొదలగు ప్రాణబంధువులను, సంతత పరిచారకులను, పృథివ్యప్తే జోవాయువులను, అతంకావకాశములను, క్షుత్పిపాసలను, హేయాదేయ వస్తువు లను, ప్రియాప్రియ కృత్యములను, భయశోకకారణ విషయములను గుఱుతుపట్ట గల్గుచుంటిని'[1] అని స్వీయలోపములనే దాచుకొనకుండ బహిర్గతముచేయు సత్యసంధు లైన దాసుగారి మాటలు ప్రబల ప్రమాణములు.

ఇక దాసుగారి అనుశీలన లక్షణమునకు సాక్ష్యములుగా ఒండు రెండు లక్ష్యములు—

> పెక్కు-పెక్కు- యోజన్ల వెంటనే చిఱునవ్వు
> సనుసను నడుము బుస్సలిడుట పాల
> గ్రుక్క-గ్రుంగినంత గునగున లాడెడి
> వేస్క-దలిసి యనుభవించనైతి[2]

ఇది పసిపాప పద్ధతి. ఈ పద్యసారపాఠమును దాసుగారు మూగగురువులైన పసిపాపల చెంత నేర్చుకొన్నదే గదా.

---

1. నాయెఱుక - పు॥ లు 7, 8
2. మార్కండేయచరిత్రము - పు. 5

పరులకుఁ గనరాని వెరపున నొండొరు
  సొలపునఁ గ్రేఁగంటఁ జూచుకొంట
వంగిలేచుచుఁ బరస్పరము లాఘవమున
  దోసిళ్లఁ దలఁబ్రాలు పోసికొంట
లంకెవడిన చెంగులన్ సప్తపది ద్రొక్క-
  తడబాటున మిథము తగులుకొంట
మనసులఁ గల్పిన కనుల కన్యోన్యమున్
  జల్వ కప్రపుబుక్కఁ జల్లుకొంట
బలువసంతపుబిందెలోఁ బరగునుంగ
రంబు వెదకుచుఁ గెంగేలు రాచుకొంట
మొలకనవ్వులు నవ్వుచు ముద్దుగొంట
నవవధూవరచేష్ట లందముల పంట

తలుపు తెఱచుపాట తడబడి యొండొరుం
  బేర్కొన సిగ్గునవ్వైనగులాట
కెంగేలు గలిపిన సింగారపు పచారు
  నడ్గ్గున నివాళి నందు సౌరు
అఱకొర్కి మడుపుల నందించుకొను నేర్పు
  నిముసమ్ములోన వేసములమార్పు
ఇక్కవలఁ బుపుచెండ్లేయు జాణతనంబు
  నెగసక్కెముల మొక్కనగుల డంబు

గడుసుముద్దు వినీవినపడని సుద్దు
కన్నుమెలపు కడుగ్రొత్తకొన్న వలపు
క్రొత్త యాలుమగలు గయికొన్న పగలు
పూని గడియించు టెటు? నల్వకైన గాని[1]

1. యథార్థరామాయణము – పు. లు 92, 93

మధ్యలో నుండు బ్రహ్మముడికి తప్ప మరెవ్వరికిని తెలియని క్రొత్త యాలు మగల వగలను పసికట్టి పట్టుకొని గుట్టు బట్టబయలు చేసినది అనుశీలనమే కదా.

ఆలోచన :

అనుశీలనము నిరంతరము చేయునపుడు, ఆ అనుశీలిత ద్రవ్యమూలస్వభావ మును తెలిసికొనవలెనని నలిపెడి ప్రయత్నము ఆలోచన.

తరతరాలనుండి తర్కములో తిరుగుచున్నను తరుగనిది స్వర్గనరకముల సద సత్సంశయ సమస్య. ఆ చర్చలో తలను దూర్చిన వీరి ఆలోచన -

బ్రతికియున్నంతకు స్వర్గనరకముల
సంగతిఁ దెలియ నసాధ్యముగద
తరలినవారలు పరలోకవార్తలు
చెప్పిరా మనతోడ నెప్పుడైన?
మర్త్యుల నోళ్లలో మలయు వేదములకుఁ
గనఁగన నొక ముక్కమొనయుఁగలదె?
దీపమారినయట్లు తెల్విశూన్యంబగు
దేహాంతముల యందుఁ దెల్లముగను
మనకు గగనారవింద వర్ణనము లేల?
యిహమునందున స్వమతాభివృద్ధిమీఱ
నెల్ల రన్యోన్యమైత్రికి హేతువైన
ధర్మవర్తన మెపుడైనఁ దప్పఁజనదు[4]

ప్రభాకరుడు ప్రతిదినప్రాహ్ణమున ప్రతిప్రాణికి సుప్రభాతము పలికి కరము లతో తట్టిలేపు మిత్రుడు. అతని ఉదయమునకు కదలని కవిహృదయ ముండదు. ఇక సూర్యనారాయణుని భక్తులైన దాసుగారికి ఒక్కొక్క కిరణము ఒక్కొక్క ఆలోచన పుట్టింపదా? ఒక్క ఆలోచన -

---

4. భీష్మచరిత్రము - పు. 5

నలుసైనం భువిలోనఁజూపి, పరిమాణం బెంతయో కల్గు చు
క్కలకుం జాటొనరించి, భూమిజలమింకం జేసి, ధారాధరం
బుల మింటం గలిగించి, శూన్యమునకుం బాత్రతఁ గల్పించు రా
యెలమిన్ నీకరకౌశలం బహహా! మాయీ సూర్యనారాయణా![5]

భానుమంతుని ఈ అత్యద్భుతమైన కరకౌశలఘనత అన్నింటిని ప్రోగుచేసి నది అనుశీలన వలన కలిగిన ఆలోచనయేకదా.

పుట్టిన ప్రతిజీవికి కోరుకొనకయే సాయుజ్యము ప్రసాదించునది మృత్యు దేవత. ఆ మృత్యుదేవతను గూర్చి దాసుగారు చేసిన ఆలోచన -

అప్పగవేయకుండ, మఱి యర్థము దొంగిలకుండ శత్రువుల్
చొప్పడకుండ, పాలకులు జూచినఁగాని, సమస్తసౌఖ్యముల్
చప్పునఁ బారఁద్రోలి యవశంబయి వచ్చెడు నాస్పదంబ్యముల్
రొప్పగఁజాలినట్టి చతురుం డొకఁడున్నఁ గనంగ వచ్చునే?[6]

ఎంత ప్రజానురంజకుడైన ప్రభువైనను, చావుదయ్యపుపీడను వదిలింపలేడు అని వీరికి మృత్యుశక్తిపై కలిగిన ఆలోచన.

'సత్యము, అహింస' నేనుగొప్ప, నేనుగొప్ప అని పోటీపడు దిక్కాలాద్యనవచ్ఛిన్నములైన ఉత్తమోత్తమ ధర్మములు. అట్టి సత్యమునను లోకమున పట్టిన దౌర్గత్యమును పరిశీలించి చేసిన బాధామయమైన దాసుగారి ఆలోచన -

ధనముల నాశించి తగని బేరము చెప్పు
వర్తకు నోటికి వడకి వడకి
దీనుల కొంపలు దీసెడు 'ప్లీడరు'
కూటసాక్ష్యంబులఁ గుంది కుంది

5. సూర్యనారాయణశతకము – ప. 5
6. మార్కండేయచరిత్రము – పు. 9

మిగుల లంచము మేసి నిగిడెడు నుద్యోగి
కలమునఁ గన్నీరు గార్చి కార్చి
సోమరిపోతులై సోదెలు పల్కెడి
మతగురువుల చెంత మాడి మాడి

యెట్టులుంటివి? చెప్పుమా, యెల్ల వేద
సరసులం గ్రాల్చు రాయంచ! సాధుమైత్రి
గడపు చకోరి! సత్యులాంగనలసొమ్మ!
సువ్రతమ్ముల ముఖ్యమ్మ! సూనృతమ్మ![7]

వివేచన :

ఆలోచన చేయునపుడు ఎదురగు అనేక సమస్యలలో ఏది ముఖ్యమో, ఏది సమంజసమో, ఏది సత్యసమీపమో యని చర్చించుకొని మూలస్వభావమును తెల్పు కొను లక్షణము వివేచన.

ఉదాహరణమునకు వేదమున 'న హింస్యాత్సర్వభూతాని' [ఏజీవిని హింసింపరాదు] అను మంత్రమున్నది. అట్లే 'పశుమాలభేత' [పశువును చంపవలెను] అను మంత్రము కూడ నున్నది. ఈ రెండును పరస్పరవిరుద్ధ సిద్ధాంత స్థాపకములు. అప్పుడు ఈ రెంటిలో నేది గ్రహింపవలెను? ఏది సమ్మతము? అను సమస్య ఎదురుకాగా, దాసుగారి 'వివేచన' చెప్పిన తీర్పిది –

మొగి 'న హింస్యాత్సర్వభూతాని' యను శ్రుతి
నాదరింపక 'పశుమాలభేత'
యనునట్టి యధమమంత్రానుసారంబుగ
నల నీచకులము లెల్లమ్మ కొఱకు
బలులిచ్చు తెలుఁగునఁ బండితమాన్యులై
విప్రుల మంచును విఱ్ఱవీఁగి

7. హరిశ్చంద్రోపాఖ్యానము పు. 6

జన్మంబునం బేదజంతువులం జంపు
కటికి రాజులకును గలదె ముక్తి?

ఉపనిషత్తులు శ్రుతికాంత కూర్ధ్వభాగ
మందహింసను స్థాపించు, నదియు నోము
కనుఁ జధశకాయ మాపెకుఁ గర్మకాండ
మాని పశుహింసఁ జెల్ల సపాన మచాటు[8]

లోకములో మానవకల్పితమై ఇప్పటికి పూరణముకాని ఒక రావణకాష్ఠము చాతుర్వర్ణ్య సమస్య. ఈ చిక్కు సమస్యలో చిక్కిన ప్రజలకు దాసుగారి 'వివేచన' చెప్పిన విధము -

'యజ్ఞాది పుణ్యకర్మములు, గర్భాధానాది షోడశకర్మములు, జప తపములు, తీర్థస్నానోపవాసాదివ్రతములు, వర్ణాశ్రమధర్మములును, పరలోకమును, ధర్మార్థ కామమోక్షసాధనములును, సకల ప్రాయశ్చిత్తములను కేవలము స్వార్థ త్యాగపరు లయి లోకోపకారముగా జీవించు పుణ్యాత్ముల కొఱకే ప్రాచీన మహర్షులచే విధింప బడెను. జనవంచకులై భూతద్రోహమాచరించు కుక్షింభరుల నిమిత్త మెంత మాత్రమును గాదు. బ్రాహ్మణధర్మము జ్ఞానము, క్షత్రియధర్మము ప్రజారక్ష ణము, వైశ్యధర్మము కృషి వాణిజ్యాదివ్యాపారము, శూద్రధర్మము సకల సజ్జన పరిచర్య. ఈ నాలుగుధర్మములు కలిగి లోకోపకారమొనర్చువారె కులము కల వారు. భూతద్రోహులై, వంచకులై, కుక్షింభరులైన దుర్జనులెల్ల జాతిభ్రష్టులే. ప్రత్యేకము వీరు బ్రాహ్మణులు, వీరు క్షత్రియులు, వీరు వైశ్యులు, వీరు శూద్రులు నని జనులకు జాతులు లేవు. లోకోపకారపరాయణుడగు నొక్క సజ్జనుడె నిత్యా నిత్య వస్తువివేక దశలో బ్రాహ్మణుడై, ధర్మాచరణదశయందు క్షత్రియుడై, కృష్యాది క్రియానిర్వర్తనదశ యందు వైశ్యుడై, బాలవృద్ధదీనార్తసాదుసేవాదశ యందు శూద్రుడై సార్థకజీవనమున చాతుర్వర్ణ్యధర్మముల గడుపుచుండును.'[9]

---

8. సావిత్రీచరిత్రము - పు. 8
9. జగజ్జ్యోతి - ప్రథమ -పు॥ లు 15, 16

నిష్పాక్షికము, సత్యసాక్షికము నైన దాసుగారి ఈమాట పాటించినచో లోకములో కులాలగోల నేలకూలును.

పరోపకారముకన్న మిన్నయైనది సున్నయని, 'ఆ పుణ్యము చేయలేదు, ఈ పుణ్యముచేయలేదు' అని చింతించు మానవునకు దాసుగారి 'వివేచన' చేసిన కర్తవ్యబోధ -

పసుల జన్నమునఁ జంపఁగనేల? నాకలి
గొన్న భూతమ్ముల కన్నమిడుఁడు
నోరు నొవ్వఁగ వేదపారాయణములేల?
నందఱిమోాల సత్యము పలుకుఁడు
తీర్థయాత్రల డస్సి తిరుగులాడఁగనేల?
నార్తుల కెల్ల సహాయపడుఁడు
సంన్యాసి భిక్షు వెంచఁగనేల? మన తోటి
సాటివారలకునై పాటుపడుఁడు

ఎందుకింకఁ వేయిమాట లీయిలనుసర్వ
జనుల కుపకారముగ నడువని మనుజుఁడు
జపతపంబులు నిష్ఠలు సలుపుటెల్ల
బూడిదంబోయు పన్నీటి పోల్కిగాదె[10]

ఈ కర్తవ్యబోధ -

'శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిషు
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్'

అను ప్రసిద్ధ శ్లోకభావమునకు ప్రాణ బంధువు.

---

10. భీష్మచరిత్రము - పు॥ ౚ 2, 3

అవగాహన :

వివేచనదృష్టితో నిరంతరము చూడగా చూడగా కలుగు పరిశీలితద్రవ్య తత్త్వసంపూర్ణ సాక్షాత్కారము అవగాహన.

ఈ అవగాహనశక్తి దాసుగారిలో నెంతగా కలదన్న, ఇంతటి అవగాహన శక్తి ఒక్క మానవునకుండుటకు అవకాశముండునా? అని అనిపించునంతగా కలదు. ఏ గురు శుశ్రూషలేకయే స్వీయావగాహనశక్తి వలన సంగీతము, నాట్యము, వ్యాకరణము, వేదాంతము, ఆయుర్వేదము, నాలుగయిదు భాషలు .... అవి యివి యననేల? ఒక కళాతృష్ణ గల మానవుడైనను ఒక్కక్షణము వ్యర్థముచేయకన్నను, ఇన్ని విద్యలను స్వాధీనము చేసికొనుటకు ఒక జీవితకాలము చాలునా? అని ఆశ్చర్యము కలిగించు నన్ని విద్యలను దాసుగారు అవగాహన చేసికొన్నారు. అందులకే శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు - 'దాసుగారు పాణినీయంలో గూడా తగుమాత్రం ప్రవేశం సంపాదించారన్నది సత్యదూరం కాదు, అయితే అందులో యెవరి శిష్యులు అంటే, అందులోనే కాదు యెందులోనూ కూడా యెవరి శిష్యులు కాదు'[11] అని ఒకసారి అన్నది.

'అస్తి సర్వేషాం మహానుభావానాం విద్యార్జనార్థం
గురోరావశ్యకతా నారాయణదాసస్య కోऽపి గురుర్నదృశ్యతే'[12]

అని శ్రీ కర్ణ వీర నాగేశ్వరరావు గారు పలికినది.

ఈ పలుకులు ప్రత్యక్షర సత్యములు. దాసుగారు తమ అవగాహనశక్తి వలన స్వాధీనము చేసికొన్న విజ్ఞాన మపారము. అనువాద గ్రంథాలలో కన్పడు వారికి గల సంస్కృత ప్రాకృత హిందీ పారశీకాంధ్రాంగ్ల భాషలపైగల ప్రభుత్వము. వేదములు, స్మృతులు, అష్టాదశపురాణాలలో మానవునకు ముఖ్యములైన ఆయుర్వేదాంశముల నెన్నింటినో ప్రోగుచేసి 'మిక్కిమిక్కి' అని యొక గ్రంథముగా వ్రాయుట; తొంబది రాగములలో రాగనామనిర్దేశము చేయుచు సర్వతాళాత్మక పంచ జాత్యేక తాళముతో సస్వరముగా అమ్మవారిపై నొక అపూర్వ సంగీతప్రబంధము

11. కథలు-గాథలు – ద్వితీయసంపుటము – పు. 664
12. వజ్రపాతః - పు. 2

వ్రాయుట; పంచముఖీ, షణ్ముఖులను చూచి సంగీతవిద్వాంసులే నిశ్చేష్టులగు నట్లుగా ప్రదర్శించుట, సంగీతసాహిత్యాత్మకమైన 'అసాధ్యాష్టావధానము' సలుపుట శతాధిక శీర్షికలతో భారతీయ విజ్ఞానభాండాగారముగా జగజ్జ్యోతి అను గ్రంథముగా వ్రాయుట, తద్భవవాసన కూడ లేని 'నాటుతెనుగు' లో అనేక రచనలు చేయుట, నాటుతెనుగు పదముల నిఘంటువును 'సీమపలుకువహి' అను పేరుతో సమకూర్చుట, గూఢార్థమయమైన 'బాటసారి' అను ప్రబంధమును వ్రాయుట; మహాభాష్యనిష్ణా తులకే ఆశ్చర్యము కలిగించు ప్రౌఢప్రయోగములతో 'తారకము' అను సంస్కృత ప్రబంధమును గూర్చుట మొదలగు పరమాశ్చర్యజనక కార్యముల నెన్నింటినో సాధి కారముగా నిర్వహించినారు. ఇక వారి గ్రంథములలో, గ్రంథపీఠికలలో, ముఖ్య ముగా నవరసతరంగిణి, సీమపలుకువహి గ్రంథపీఠికలలో వారు తెలిపిన నూతనాంశ ములు సహస్రాధికములు.

ఊహాశాలిత :

అవగాహన వలన కలిగిన వస్తుతత్త్వసంపూర్ణ సాక్షాత్కారసత్యము, సృష్టి లోపభూయిష్ఠ మని తెలియజెప్పగా, ఆ లోపభూయిష్ఠ సృష్టికి లోపపూరణము చేయుచు కళాత్మకముగా భాష్యము చెప్పదలచుట ఊహాశాలిత.

నిరుపేదలకుఁ గుక్కమురికి సంతానమ్ము
కోటీశునాలికి గొడ్డటికము
చేతన్న నగరూపిఁ జేరనీయదు చెల్వ
యుందకానికి లోని యుంగు స్తున్న
మృష్టాన్న మారోగ్యహీనుల కుండును
దినగలవారికిఁ దిండిలేదు
దాతను ముంగాళ్ళఁదన్ని యోఁగడు కల్మి
కడులోభివానినిఁ గౌఁగలించు

ఉన్నవారున్నదని యొప్ప నుర్విలోన
లేదనుచుఁ గుందెదరు సిరిలేనివారు

చూడ నీలోకమంతయు శోకహతము
సత్యముం దయ గల్గిన జనము తప్ప[13]

ఏదియో యొక లోపముతో ఈ లోకమంతయు శోకహతమే యని చేసిన భాష్య మిది.

ప్రొద్దు పండుటాకుపోలిక రాలెఁ గెం
జాయి చివురులెత్తెఁ గోయిల లనఁ
జెలగి కవిసెఁ జీఁకటులుఁబూచెఁ జుక్కలు
పైని చందమామ పండు తోఁచె[14]

ఇది చంద్రోదయ వర్ణనము. చంద్రోదయాత్పూర్వము ప్రొద్దుక్రుంకుట, ఎఱ్ఱనికాంతులు ప్రసరించుట, చీకటులు వ్యాపించుట, చుక్కలు కన్పడుట అనునవి ప్రకృతి ప్రకృతి. ఈ సందర్భమును చక్కని ఊహతో మిళితముచేసి, ప్రొద్దు క్రుంకుటను పండిన ఆకు రాలినట్లుగా, ఎఱ్ఱనికాంతులను ప్రసరించుటను చిగుర్చుటగా, వ్యాపించిన చీకటులను నల్లనికోయిలలుగా, చుక్కలను పూలుగా, చంద్రోదయమును పండుగా చిత్రించి, ఈ సందర్భమును ఒక వృక్షముగా ఊహించుట జరిగినది.

ఇంతకుపూర్వము వచ్చిన ఉదాహరణమున లోపభూయిష్ఠమైన సృష్టిని వ్యాఖ్యానించుట జరుగగా, ఈ ఉదాహరణమున లోపప్రసక్తి తీసికొనిరాక, కేవల సృష్టినే వ్యాఖ్యానించుట జరిగినది, భేద మిదే.

భగవంతుడు విశ్వస్వరూపుడని భక్తుల విశ్వాసము. భక్తులైన దాసుగారు ఆ విశ్వస్వరూపతను వ్యాఖ్యానించుచు చేసిన ఇంకొక ఊహ —

జలధులు రోమకూపములు, శైల్యము లద్రులు, సూర్యచంద్రు ల
క్షులు, పవనంబు లూరుపులు, శుక్లము వర్షము, మిన్ను శీర్ష, మి

---

13. సావిత్రీచరిత్రము - పు. 5
14. గజేంద్రమోక్షణము - పు. 10

య్యాల జఘనంబు, మేను జగమెల్లయున్నై వెలుఁగొందునే విభుం
డలఘుఁడనంతుఁ డవ్యయుఁ డనాది గురుండగువానిఁ గొల్చెదన్[15]

భగవంతుడు ఊహల కతీతుడు. ఊహల కతీతుడైన భగవంతుని ఉపమాన సాధనములతో కొలిచిన ఊహ –

వలయ రేఖకుఁబోలి వశమె తెల్పంగ నీ
 కాది మధ్యాంతము లప్రమేయ
ఎల్ల జగంబుల కీవె యాధారము
 లెక్కల కన్నింటి కొక్కటి వలె
ధర్మము వైపె యెంతయు జోగుచుందువు
 బలువువంకన్ త్రాసు ములు విధమున
పెరుగవు తరుగవు విభజింపఁబడవు శూ
 న్యాంకమువలె నకలంక చరిత!

చిన్నకుం జిన్న పెద్దకుం బెద్దవీవు
కొలఁత కందవు నిన్నెన్న నలవి కాదు
చెలఁగు సరిజేసితై నీవు తలఁచినంత
భక్తమందార! భవదూర! పరమపురుష[16]

ఉపమేయము వక్తకు స్పష్టముగా తెలిసి శ్రోతకు తెలియనపుడు, వక్తకు శ్రోతకు స్పష్టముగా తెలిసిన ఉపమానము వలన, వక్త శ్రోతకు ఉపమేయమును తెలియబరచుట లోకస్థిత వ్యవహారము. అలంకారముల ప్రయోజనము కూడ నదే. ఈపద్యమున ఉపమేయము వక్తకు గూడ స్పష్టముగా తెలియదు. కాని అత్యద్భుతములైన ఉపమానసామగ్రిచే ఉపమేయ స్వరూపమును తెలియపరుచుట జరిగినది. ఈ యుదాహరణము దాసుగారి ఊహాసౌధ శిఖరాగ్రము.

---

15. గజేంద్రమోక్షణము పు. 19
16. యథార్థరామాయణము – పు. 137

భగవంతుని దాసుగారు సృష్టించలేదు. దాసుగారికి పూర్వమే భగవంతుని సృష్టి లోకమున జరిగినది. కాన భగవంతుడు దాసుగారికి పూర్వుల సృష్టిలో లభించినవాడే. కాన ఈ ఊహ సృష్టికి వ్యాఖ్యానము.

హరిశ్చంద్రచక్రవర్తి పాలనలోనున్న అయోధ్యానగర ప్రజలను దాసుగారు ఊహించిన పద్ధతి -

జయతు సత్యమని చక్కగా నుదుటిపయి వచ్చపొడుచునా నిన్
అయయో త్రొక్కితినా చీమ నెంత దయమాలితి నను జ్ఞానిన్
వడ్డిగొనక మరి పత్రముగట్టక పదులిచ్చుచుండు వానిన్
గ్రుడ్డియై ముష్టిగొనక యేదయిన కూలిచేయు నభిమానిన్
అతిథి లేడొక్కడైన నొంటి నెట్లారగింతు ననువానిన్
బ్రతుకెల్ల పరోపకారమునకని పాడెడు పుణ్యనిధానిన్[17]

ఇది అయోధ్యానగర పౌరుల వరనము కాదు. దాసుగారి కిష్టమైన ఆదర్శ రాజ్యమునందలి ప్రజలు. రాజ్యప్రజలందరు ఇంత సజ్జనులగుట సృష్టిలో జరుగని విషయము. కనుక నిది సృష్టిలోగల లోపము. ఈ అయోధ్యాప్రజల వర్ణన మిషతో దాసుగారు సృష్టిలోప పూరణము చేసిన ఊహ ఇది.

ధారణ :

ఊహలు గుంపులు గుంపులుగా ముసురుకొనగా, వానిని నేమరువేసికొనుచు అదుపులో పెట్టు సంయమనశక్తి ధారణ. ఇది ఒక విధముగా రాజశేఖరుడు చెప్పిన కారయిత్రీ భావయిత్రీ శక్తులకు (ప్రతిభకు) తోడుపడు అంతర ప్రయత్నమైన సమాధి వంటిది.[18] మరి యొక విధముగా ఆంగ్ల కవియైన Words worth చెప్పిన Tranquility వంటిది.

---

17. హరిశ్చంద్రోపాఖ్యానము - పు. 13
18. సమాధి రాంతరః ప్రయత్నో బాహ్యస్త్వభ్యాసః, తావుభాపి శక్తి ముద్భాసయతః సా కేవలం కావ్యే హేతుః - కావ్యామీమాంసా చతుర్థోఽధ్యాయః

దాసుగారికి ఒక చిన్న అంశమునకు గుంపులు గుంపులుగా ఊహలు ముసురు కొను ననుటకు ేయు పదులకొలది ఉపమానములే ప్రమాణము. ఎన్నియో స్ఫురించగా వానిని నెమరుపేసికొని వానిలో సందర్భోచితములైనవానిని మాత్రమే గ్రహించునట్లు చేసినది ధారణ.

చేపలు గింజుకొనుట అను చిన్న అంశమును దాసుగారికి తోచిన ఊహలు-

'మృత్యువుల దప్పించుకొన ప్రయత్నించు వైద్యుల పోల్కి, తప్పని ప్రకృతి న్విదల్చుకొన నుంకించు ముముక్షువుల మాడ్కి, పదార్థనానాత్వము న్నిరూపించు నైయాయికుల భాతి, లగ్ననిర్ణయముచేయు జ్యోతిష్కులవలె, స్వతంత్ర పరిపాలనము న్గోరిన కలియుగ భారతీయుల తీరున, స్వకీయ జననమరణ స్థితుల న్వర్ణింప దొరకొను కవి లాగున నెట్లు గింజుకొనుచున్నవో యమ్మిట్టమీలు.'[19]

హనుమదంగద జాంబవదాది కపివీరులు సీతాన్వేషణము సలుపు శ్రద్ధను ఊహించిన విధము -

'ఒకప్పుడు దశదిశలన్ సంశయముతీరక చూచినచోటె పలుమార్లు చూచుచు, ఒక్కపేళ నెల్లసందులు లోయలు నెఱియలు గుహలు మూలలు వెదకుచు కొమ్మ లాకులు చివుళ్ల యడుగులు న్గూడ దిరుగవైచి శోధించుచు, దేవతాప్రత్యక్షమునకై భాగవతులమాడ్కి, పాతాళజలధారోత్పతనము కొఱకు యంత్రకూప ఖనికుల వలె, భిషక్ప్రమాపేశమునకై విషమజ్వరార్త బంధువుల రీతి, ఆరోగ్యస్నానమునకై దీర్ఘ రోగుల చాడ్పున, తరుణభార్యా ప్రథమప్రసూతికై యధిక ధనవంతులగు వయసు మళ్లిన మగల పోలిక, కారాగృహవిముక్తికై బందీలచొప్పున, సువృష్టికై క్షామ పీడితుని తీరున, విద్రాళనపానంబులకై పస్తున్న దేహధారుల కైవడి, నిత్యసంతుష్టికై సంసారుల వడుపున సీతా సందర్శనార్థమై ప్రతీక్షించుచు....'[20]

నెట్టుకొని ఎన్నియో యూహలు ముసురుననియు, ఆ యూహలను నెమరు వేసికొని తగినవానినే గ్రహింతురనియు చెప్పుటకు ఈ ఉదాహరణములు చాలును.

---

19. యథార్థరామాయణము - పు. 78
20. ,, పు. 193

నేను నేనని వచ్చి పైబడు ఊహ లన్నింటిని దాసుగారు తుదిరూపము దిద్దు వరకు ధారణ చేయగలరా? అను సందియమునకు తావే లేదు. ఒక్కరాత్రికి రాత్రియే అంబరీషచరిత్రమును వ్రాసి ధారణపట్టి మరునాడు మహాద్భుతముగ చెప్పిన దిట్ట. అనిదంపూర్వముగ 'అసాధ్యాష్టావధానము'ను నిర్వహించినవా డీయన. ఇక హరికథలలో ప్రసంగములలో వీరి రసనపై లాస్యముచేయు ప్రాస్తావిక శ్లోకములు, పద్యములు సముద్రతరంగముల వలె అనంతములు.

**అనుభూతి :**

అవగాహన వలన కలిగిన వస్తుతత్త్వసంపూర్ణ సాక్షాత్కారముతో పుట్టిన ఊహలను ధారణచేసికొనగా కలుగు మహాకవిత్వైక సాధ్యమగు నవనవోన్మేషమైన ఆత్మసాక్షాత్కారము అనుభూతి.

అవగాహన వలన కలిగిన సాక్షాత్కారము సంపూర్ణమైనదే యైనను, అది కేవలము వస్తుగతమైనది మాత్రమే. ఈ ఆత్మసాక్షాత్కారము వస్తుతత్త్వసాక్షాత్కారమును ప్రతిభాముద్రతో కళాత్మకముగా తీర్చిదిద్దునటువంటిది. వస్తుతత్త్వ సాక్షాత్కారము సామాన్య కవికి కూడ కలిగి, అతడు కూడ నూహించును, అతడు కూడ ధారణ చేయును. కాని మహాకవి లక్షణమైన ఈ ఆత్మసాక్షాత్కారమును పొందలేడు. కవికి మహాకవికి భేదము కల్గించునది ఈ అనుభూతియే.

కవికి మహాకవికి భేదమును తెల్పుచు ఆచార్య యస్వీజోగారావుగారు– 'కవి సామాన్యుడైతే అతడే విషయము నేయుపాధి నాశ్రయించి ఆవిష్కరించుచున్నాడో తేలిపోవును. అదే మహాకవియైతే అతడు సర్వమును అనుభూతి సాక్షికముగనే ఆవిష్కరించినట్లుండును. అయితే మహాకవియును సామాన్యకవి వలె సంఘోష జీవియే. ఇరువురి అనుభవపరిణాహమునకు నొక యవధి యుండును. అతడెంత మహాకవియైనను తత్కావ్యగత సర్వవిషయములు నతని అనుభూతి పరిధిలోనివే యైయుండుటకు నవకాశము లేదు. కాని యతడు ప్రతివిషయమును తన ప్రతిభా ప్రకర్షమున మనశ్చక్షువు ముందు సాక్షాత్కరింపజేసికొని అంతస్సన్నిధి చేసికొని తా ననుభవించినట్లుగనే ఆవిష్కరించును. అందులకే సామాన్యకవుల వాక్కులు చెవికెక్కవు. మదికెంచవు. అందు పేలత్వమే గాని మార్దవ ముండదు. కాఠిన్యమే గాని మసృణత్వ ముండదు. మహాకవుల వాక్యములు సద్యోహృద్యములు

సహృదయసైపేద్యములు, శక్తిమంతములు, అర్థగంభీరములు, చిరస్మరణీయములు'[21] అని వ్రాసిన వాక్యములు మహాకవి మనఃప్రవృత్తికి అధికార సూత్రములు.

దాసుగారి అనుభూతులు కొన్ని -

ధరణిం జీకటివేళ దవ్వు వెలుఁగుం దర్శించు కందోయి కి
న్మఱి యేవస్తువులైనఁ దోఁచనటు, నిన్ ధ్యానించు నవ్వాని క
ద్దిర యీలోకవికారముల్ మది రవంతేనిం గనన్రావు గా
యరయంగాఁ దన జీవితంబున మహాత్మా! సూర్యనారాయణా[22]

'మనస్సు భగవంతునిపై కేంద్రీకరించినపుడు ఈ లోక విషయములేవియు పట్టవు' అను అనుభూతిని ఒక సృష్టిసత్యమైన ఉపమాన సహాయముతో సహృదయుని చెంత చేర్చినారు.

జలమందజ్ఞతచేఁ బొరంబడిశ్రమన్ జానున్నచీమన్ గృపన్
బలుమాఱొడ్డున నైచినం దిరుగ నాపం బద్దియుం జేరు న
ట్లిల దుష్కార్యములందు మున్గునను నీవెంతో దయన్ దేల్చినన్
భళిరా సల్పెద నేరముల్ మఱియు నప్పా! సూర్యనారాయణా![23]

'చెడుపైపు మనసు పరుగిడుట' అన్న అంశము క్రొత్తది కాదు. కాని చీమ సహజలక్షణముతో పోల్చి చెప్పిన ఈ పద్యభావము ఎంతయో హృదయాకర్షణ శక్తి గడించుకొని క్రొత్తదిగా నైనది.

కలవోవ కష్టముల్ దొలఁగిస యట్టుల
నప్పఁ దేలిన నూపిగాడిసట్లు

---

21. కవ్యపీఠశతులు - సంపాదకీయము - పు॥ లు 10. 11
22. సూర్యనారాయణశతకము - ప. 75
23. ,, ప. 38

పెను నగాధముదాటి వెల్లడిఁ గనునట్లు
చెదరిన సిరి మళ్లి చేరినట్లు
సతతశంకితము విస్పష్టంబునైనట్లు
మూర్ఛఁదేరినఁదెల్వి మొనఁదునట్లు
ఆస విడుచు నర్థమది యుట్టిపడ్డట్లు
ముప్పను గారడి ముగియునట్లు

హాయిగా రాచదంపతు లర్భకుండు
బ్రతుకఁగని కౌశిక మునీంద్రుఁ బ్రస్తుతించి
యెల్ల దేవతలకు మ్రొక్కి ఋషుల కెరలి
యెంతయుం గల్మి పుట్టిలో యిల్లుఁజేర[24]

ఈ పద్యమునందు గ్రహించిన కష్టములు, ఆ కష్టములు తొలగినపుడు కలుగు ఆనందములు సామాన్యమానవునకు గూడ నందుబాటులో నున్నవే. ఈ అంశము లన్నియు అనుభూతి వలయము నందలి వాకిళులే.

భా వ ము :

అమూర్తస్థితిలోనున్న అనుభూతి, అభివ్యక్తీకరణవాహకముగా మారుట యే భావము.

'అనుభూతి' అను అంశమున కిచ్చిన ఉదాహరణము లన్నియు, అనుభూతి అభివ్యక్తీకరణముగా మారుటయే కదా. కనుక ఆ ఉదాహరణము లన్నియు 'భావము' అను అంశమునకు కూడ సరిపోవును.

అయినను ఒక్క ఉదాహరణము -

'పతి దూరదేశంబు పట్టిన యపుడు
సతి వాని చిత్రంబు సరగునఁదెచ్చి
కనుఁగొని యుప్పొంగుఁ గన్నీరు గారుఁ

24. హరిశ్చంద్రోపాఖ్యానము – పు. 54

గొనియాడు మనవి గైకొనుమని వేడు
నతిభక్తిఁగొల్చు నాథాయని పిల్చు
బ్రతిమాలు పదములపైఁబడి సోలుఁ
దనగతిఁగని పొక్కు ధైర్యంబు దక్కు
తనదు సొమ్ముఁదీయు ధర్మంబుసేయుఁ
బెనిమిటి చరితంబు వినిపించువారిఁ
గని గారవించు సత్కథల నాలించు
నటువలె మనము నిత్యంబు సర్వేశుఁ
బటమున భావించి బ్రతుకుట మంచి'[25]

భక్తుడు చేయవలసిన భగవదారాధన మిషతో దాసుగారు, పతి దూరముగా నున్నపుడు సతి పతిని గూర్చి సలుపు సగుణోపాసన ప్రకారమును చిత్రించినారు. దాసుగారు దేశముల వెంట ఎప్పుడు తిరుగుచుంట వలన, దాసుగారి భార్యయైన నరసమ్మగారి కింట ఈ సగుణోపాసన దినచర్య యైనది. ప్రతిభాకాంత వరించిన పురుషులకు స్వీయకాంత ప్రతిభ పట్టకుండుట, కాలాంతరమున పశ్చాత్తాపము చెందుట ఎక్కువగా కన్పడు విషయము. ఇది దాసుగారు భార్యను జూచి పొందిన అనుభూతి.

ఉద్దేశము :

వ్యక్తిత్వముద్ర పడిన భావము 'ఉద్దేశము' అనగా బైట ప్రపంచము నుండి గ్రహించిన వస్తువిష్టమైన 'భావము' పై స్వీయసంస్కార ముద్ర పడిన సందర్భ మనుట.

హరియనీ సేవఁడని యందు రేని యతండె
ముఖ్యకారణమన్ని భూతములకు
ఆకాశమట్టుల నంతయు నిండియుఁ
దానెద్దియుంగాక తనరుచుండు

25. ప్రహ్లాదచరిత్రము - పు. 23

విద్యా పారంగతుఁడై, తృణీకృతపురందరుఁడై, దీర్ఘాయురారోగ్య భోగభాగ్య ప్రాభవాంచితుఁడై, నభూతో నభవిష్యతి యను గొప్ప మెప్పంది కేవల స్వతంత్ర వైదిక జీవన వృత్తిన్నరగుచుఁ దాఁ దరించి పరులఁ దరింపఁ జేయు విష్ణు భాగవతోత్తముండీ జగమున నలరారుట మిక్కిలి యరుదు" [29]

ఇక దాసుగారు వారి గ్రంథములలో, గ్రంథ పీఠికలలో అనేకాంశములపై వెలిబుచ్చిన ఉద్దేశములు బండ్లకు బండ్లు.

ఇట్లు మహామనీషి మనీషాలక్షణములైన అనుశీలన, ఆలోచన, వివేచన, అవగాహన, ఊహాశాలిత, ధారణ, అనుభూతి, భావము, ఉద్దేశము దాసుగారి మేధా సౌధములో కలిసి కాపురమున్నవని సారాంశము.

---

29. యథార్థరామాయణము - పీఠిక - పు - 26.



## ౨. స్థానప్రతిష్ఠ

చిఱుతాళముల జత చే ధరించినఁ జాలు
లయతాళములు శుభోదయము పలుకు

కాలిగజ్జె లొకింత ఘల్లుమన్నంజాలు
భరతమ్ము నీముందు శిరసువంచు

వీణతంత్రుల మునివ్రేళ్ల సోకినఁజాలు
సంగీతవాహిని పొంగిపొరలు

గంటంబుఁబూని క్రీఁగంటఁ గాంచినఁజాలు
కవిత నీయెదుట సాక్షాత్కరించు

నేఁటి కథకులందు నీపేరు చెప్పక
గజ్జెకట్టువాఁడు కానరాఁడు
తెలుఁగువెలుఁగు దేశదేశాల నింపిన
హారిక థాపితామహా! నమోఽస్తు[1]

---

1. ఉదయశ్రీ-తృతీయభాగము-కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

స్థాన ప్రతిష్ఠ యనగా, ఆంధ్రసాహిత్యమునందు ఆదిభట్ల నారాయణదాసు గారి స్థానమును ప్రతిష్ఠించుట.[2]

నారాయణదాసుగారికి ఆంధ్రరసికహృదయములు ఎన్నుకొని పట్టముకట్టిన గౌరవబిరుదము 'హరికథా పితామహుడు'. దాసుగారు చేపట్టకముందు నామమాత్రముగా మూలలందు నక్కియున్న హరికథాప్రక్రియ, దాసుగారు చేపట్టిన తరువాత తెలుగుదేశము నందలి ప్రతివీథికి పరిచయమైనది. పామరులను పలకరించి అలరించుటయేకాక, పండితుల చూపును కూడ తనవైపు త్రిప్పుకొన్నది. ద్వారములను తెరపించి రాజాస్థానములందు 'తైతక్క' లతో కులికినది. అరుదశాబ్దములు సాటి సాహితీప్రక్రియలతో పోటీపడి, గజారోహణాది ఘన సత్కారముల నందుకొన్నది. సమ్మోహనశక్తిచే తెలుగుదేశమును హరిదాసమయము చేసినది. ఇట్లు ఇంతగా హరికథకు మారుతవేగ ప్రచారము కావించి, ప్రాణప్రతిష్ఠచేసి జనాకర్షణ యంత్రము కట్టినవారు దాసుగారు. కనుకనే వీరు హరికథా పితామహులు.

దాసుగారు 'సహజ గానకవిత్వశాలి'. ఆ కారణముచేతనే హరికథా జీవితము ప్రారంభమైనది మొదలు వారి కథలను తప్ప మరియొకరి కథలను చెప్పలేదు. వారు సహజకవి యగుటచేతనే, వారి గ్రంథము లందలి వర్ణనలు అతిశయోక్తులతో ఆకాశసౌధములలో విహరింపక వస్తుతత్త్వదర్పణములైన స్వభావోక్తులతో, సమాజ మానవునకు పరిచితములైన ఉపమానములతో నిండినవి. దాసుగారి గ్రంథములలో ప్రతిభాప్రతిబింబములు, కవి బిరుదప్రదాన సమర్థకములు నైన వర్ణనలు కోకొల్లలు. ఒక్క ఉపమాలంకారనిర్వహణము చాలు దాసుగారు మహాకవి యనుటకు. దాసుగారి రచనలలో కవిత్వము లేదనుట, అరువది సంవత్సరాలు ఆంధ్రప్రేక్షకులు పొందిన ఆనందమును త్రోసిపేయుట. దాసుగారు సామాన్య హరికథా కథకులే కారు, మహాకవులు కూడ.

దాసుగారు ఊహాశాలియైన కవులే కారు, విద్వద్విద్వద్వరులు. భగవద్దత్తమైన ప్రతిభను పాదుచేసికొని స్వయంకృషిదోహదముల వలన మహావ్యుత్పత్తిఫలములను పొందినవారు. గురుశుశ్రూషలేకయే సంస్కృత ప్రాకృత హిందీ పారశీకాంగ్లాంధ్రాద్యనేక భాషలను, తర్క వ్యాకరణ వేదాంతాయుర్వేదాద్యనేక శాస్త్ర

2. ఈ విభాగమునందు నిర్ణయించిన అంశములకు సంపూర్ణ వివరణములు వెనుక ఆయా సందర్భము లందు వచ్చినవే.

ములను, శ్రుతి స్మృత్యష్టాదశపురాణముల సారమును స్వాధీనము చేసికొన్నవారు. ఒక వాక్యములో చెప్పవలెనన్న, గురుమంత్రోపదేశము లేకుండగా ఇంతగా వ్యుత్పత్తిని స్వాధీనము చేసికొన్నవారు ఈ శతాబ్దములో లేరన్నది వాస్తవము. వాక్త్సవముకాదు.

దాసుగారు మహావ్యుత్పత్తిఫలముల నారగించి జీర్ణముచేసికొన్న మహాభక్తులు. మనస్సంన్యాసులు. వారి సర్వశక్తులు భగవత్ప్రసాదములనియు, ఆ శక్తులన్నియు భగవదారాధనసాధనములైనపుడే సార్థకములనియు అధీతిబోధాచరణప్రచారణములతో జీవితమును గడిపినవారు. హరిదాస జగద్గురువులైన భగవచ్ఛిష్యులు.

ఇక నైకకళాప్రపూర్ణులైన దాసుగారు తెలుగు సాహిత్యము నందలి యనేకాంశములకు ప్రథములు.

దాసుగారికి పూర్వమందున్న హరికథాప్రదర్శనములలో నృత్యమన్నది లేదు. ఉన్నది సందర్భోచితమైన అభినయము మాత్రమే. హరికథా కథనమున సంగీతమునకు నృత్యమునకు బాగుగా స్నేహము కలిపిన ప్రథములు దాసుగారు.

తెలుగుభాషలో స్వీయచరిత్రరచనమునకు దాసుగారే ప్రథములు. వీరి 'నాయెఱుక' రచనాదృష్టిలో ప్రప్రథమాంధ్రస్వీయచరిత్ర (1898-1903 మధ్య కాలమున)

ఉమర్ఖయాము వ్రాసిన రుబాయీలను, ఈ రుబాయీలకు ఫిట్స్‌జెరల్డు చేసిన ఆంగ్లానువాదమును సంస్కృతీకరించిన వారిలో వీరే ప్రథములు.

షేక్స్పియరు కాళిదాసుల గ్రంథముల నన్నింటిని పరిశోధించి, వారి గ్రంథ ఘట్టములను నవరసములుగా విభాగించి తెనుగున కనువరించినవారిలో వీరే ప్రథములు.

ఆంగ్లసాహిత్యమున గల 'ఎల్లిగరి' పద్ధతిలో వ్రాసిన వీరి 'బాటసారి' ప్రబంధము, తెలుగులో వెలసిన గూఢార్థ గ్రంథములలో ప్రథమము.

సంస్కృతమున భట్టికవి వ్రాసిన 'రావణవధమ్' (భట్టి కావ్యమ్) ప్రౌఢ ప్రయోగప్రదర్శనదృష్టితో వ్రాసిన గ్రంథము. దాసుగారు సంస్కృతభాషలో వ్రాసిన 'తారకమ్' గ్రంథము కూడ దాని ఆకృతిగణమే. మహాభాష్య పరిపాలకు లకు గూడ దిగ్భ్రాంతి కల్గించునట్లుగా ప్రౌఢాతిప్రౌఢ, గూఢాతిగూఢ సంస్కృత ప్రయోగములతో సంస్కృతప్రబంధము వ్రాసిన తెలుగువారిలో వీరు ప్రథములు.

'దశవిధరాగనవతికుసుమమంజరి' అని వీరు అమ్మవారిపై వ్రాసిన తొంబది రాగముల సంగీతప్రబంధము, సంగీతప్రపంచమున ఏకైకభానూదయము. ఇది యిప్పటికిని ద్వితీయములేని ప్రథమ సంగీతప్రబంధము. గాన భారతికి అనన్వయా లంకారము.

బహుభాషావల్లభులైనను, దాసుగారనగానే భాషాపరముగా వెంటనే గుర్తుకు వచ్చునది 'నాటుతెనుగు' ఈ పేరు కూడ వీరి కల్పనమే. తద్భవముల పొడకూడ లేని శుద్ధదేశ్యాంధ్రభాషా ప్రచారకులలో ప్రథములు.

భరతముని నాట్యశాస్త్రము నుండి అగ్రతాంబూల మందుకొనుచున్న అలంకా రము ఉపమ. ఈ ఉపమాశైలూషి ప్రతి కవికి కొంచెమో గొప్పో తన విలాసము లను చూపినను సంపూర్ణముగా స్వాధీనమైనది సంస్కృతకవియైన కాళిదాసునకు అని పెద్దలసుద్ది. (ఉపమాకాళిదాసస్య....) తెలుగున ఆ ఖ్యాతికి అర్హులు దాసుగారు. 'ఉపమా ఆదిభట్టస్య' అని యనదగినంతగా వీరీ యలంకారమును పోషించిరి. వీరి గ్రంథములలో స్వీయస్థిరాస్తి అని చెప్పదగిన ఉపమానసంపద వాములు వాములు. ఇట్లు తెలుగున అధికాధికముగా ఉపమను ఉపయోగించుకొన్నవారిలో ఇప్పటికిని దాసుగారే అనుయాయులులేని ప్రథములు.

ఇంతటి ప్రతిభావల్లభులు, ఇంతటి వ్యుత్పత్తిసంపన్నులు కనుకనే, ఆత్మ విశ్వాసముతో దాసుగారు మిత్రులతో 'నావంటివాడు వెయ్యిసంవత్సరాల కొకడైనా పుడ్తాడా?' అని యనుచుండెడివారట. ఈ మాటలు వారిశక్తి నెరుగని వారికి అతిశ యోక్తి అనిపించునేమోకాని, ఎరిగిన వారికి స్వభావోక్తియే.

దాసుగారు "సహజ పాండిత్య విలాసుడు" "శృంగార సర్వజ్ఞుడు" "ఆట పాటల మేటి" "కవిగాయక కథక మహర్షి" "సంగీత సాహిత్యసార్వభౌముడు"

"మహాకవి గాయక శిరోమణి" "పంచముఖీ పరమేశ్వరుడు" "లయబ్రహ్మ" "హరికథా పితామహుడు" "ఆంధ్రదేశ భూషణము".

దాసుగారు హరికథా కథనాంత మందు గానము చేయు మంగళమే ఈ కృతికి మంగళ మహాశ్రీ.

సర్వభారతీయా అపి పరస్పరమైత్ర్యా మోదన్తామ్
ఉర్వీ మండలమనవరతం కృతయుగధర్మా వర్తన్తామ్
వాగ్దేవీ కృపయా నితాన్తమ్ ॥వాగ్దేవీ॥
ప్రతివత్సర మీదృగ్గానసభా పత్తనేషు జాయన్తామ్
సతత మాసేతుశీతనగం సత్సంగ గుణా గీయన్తామ్
వాగ్దేవీ కృపయా నితాన్తమ్ ॥వాగ్దేవీ॥



# ౪ గ ము - సహకార గ్రంథములు

అగ్నిపురాణమ్ - చౌకంబా ప్రతి

అధ్యాత్మసంకీర్తనలు - తాళ్లపాక అన్నమాచార్యులు, తిరుమల తిరుపతి దేవస్థానము, తిరుపతి

ఆంధ్ర ధ్వన్యాలోకము - శ్రీ పేదాల తిరువెంగళాచార్యులు, గుంటూరు.

ఆంధ్ర ధ్వన్యాలోకము - శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, విజయనగరం.

ఆంధ్ర యక్షగానవాఙ్మయచరిత్ర - ఆచార్య శ్రీ యస్వీజోగారావు, ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు.

ఆంధ్ర వాగ్గేయకారచరిత్రము - శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, ఆకాశవాణి, విజయవాడ

ఆదిభట్ల నారాయణదాసు - శ్రీ గుండవరపు లక్ష్మీనారాయణ, జె. కె. సి. కళాశాల, గుంటూరు

ఉదయశ్రీ-కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, పట్టాభిపురము, గుంటూరు

కచ్ఛపీశ్రుతులు - రచయితల సహకారసంఘము, గుంటూరు

కథలు-గాథలు - శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కడియము

కాళిదాసగ్రంథములు - కాళిదాసు (వివిధ ప్రచురణలు)

కావ్యప్రకాశః - మమ్మట కవిః

కావ్యమీమాంసా - రాజశేఖరః

గీతగోవిన్దమ్ - జయదేవకవిః (వావిళ్ళ ప్రతి)

చంద్రాలోకః - పీయూష వర్ష జయదేవః

తిరుపతి వేంకటకవులు - ఆచార్య దివాకర్ల వేంకటావధాని

తెలుఁగు భాషలో ఛందోరీతులు - శ్రీ రావూరి దొరసామిశర్మ

దశరూపకమ్ - ధనంజయః

తెలుగు హరికథా సర్వస్వం - ఆచార్య శ్రీ తూమాటి దొణప్ప, నాగార్జున విశ్వవిద్యాలయము, గుంటూరు

దాక్షిణాత్య సాహిత్యసమీక్ష - డా॥ జి. నాగయ్య, శ్రీ వేంకటేశ్వర విద్యాలయము, తిరుపతి

ధ్వన్యాలోకః - ఆనందవర్ధనః (చౌకంబా ప్రతి)
నాట్యశాస్త్రమ్ - భరతమునిః (బరోడా ప్రతి)
నాట్యశాస్త్రము - డా॥ పి. యస్. ఆర్. అప్పారావు, హైదరాబాదు
నారాయణదాసు గ్రంథములు - [వివిధ ప్రచురణలు]
నీతికథామంజరి - కందుకూరి వీరేశలింగము
పార్వతీపరిణయము - శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి, బరంపురము
పూర్ణపురుషుడు - శ్రీ యామిజాల పద్మనాభస్వామి, మద్రాసు
బాలవ్యాకరణము - చిన్నయసూరి
భగవద్గీత - వేదవ్యాసః
భాస్కర రామాయణము - ఆనందాశ్రమ ప్రతి
మధునాపంతుల సాహిత్యవ్యాసాలు
మృదంగవాద్యబోధిని - శ్రీ మలుగావు కృష్ణదాసు
రామాయణమ్ - వాల్మీకిః [వావిళ్ళ ప్రతి]
లక్షణశిరోమణి - కొత్తపి వేంకటరమణకవి
వజ్రపాతః - కర్రవీర నాగేశ్వరరావః
వాయుపురాణమ్ - చౌకంబా ప్రతి
శతావధానసారము - శ్రీ తిరుపతి వేంకటకవులు, కడియము.
శ్రీ ఆదిభట్టనారాయణదాస చరిత్రము - శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మ, గుంటూరు
శ్రీ ఆదిభట్టనారాయణదాస సారస్వత నీరాజనము - రచయితల సహకార సంఘము, గుంటూరు
శ్రీ నారాయణదాస జీవితచరిత్రము - శ్రీ పెద్దింటి సూర్యనారాయణదీక్షితదాసు, నర్సాపురము
శ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాస జీవితచరిత్రము - శ్రీ మరువాడ వేంకట చయనులు, రాజమండ్రి
శ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాస శతజయంత్యుత్సవ సంచిక - సంస్కృతి సమితి, చీరాల
శ్రీమదాంధ్ర మహాభారతము - కవిత్రయము [వావిళ్ళ ప్రతి]
శ్రీ మహాభాగవతము - బమ్మెరపోతన [అకాడమీ ప్రతి]

సాహిత్యదర్పణః - విశ్వనాథః [చౌకంబా ప్రతి]
సింహాసనద్వాత్రింశిక - కొఱవి గోపరాజు (ఆంధ్రసాహిత్య పరిషత్తు ప్రతి)
స్వీయచరిత్రము - కందుకూరి వీరేశలింగము

Adibhatla Narayanadas – Sri Vasanta Rao Brahmaji Rao, Vijaya Nagaram
Notes on Sahitya Darpana - P. V. Kane, Motilal Banarsidas, Varanasi
Shakespeare Complete Works - Shakespeare - English Language book Society, London

## వ్యాసములు :

దెబ్బకుదెబ్బ - శ్రీ నారాయణదాసు - అడ్వర్టయిజర్ (1-4-42)
నాట్యకళ - సంగీతనాటక అకాడమీ, ఫిబ్రవరి, 1965
బయలాట - శ్రీ ముట్నూరి సంగమేశం - ఆంధ్రప్రభ, సచిత్రవారపత్రిక [4-1-1966]
భారతీయసంస్కృతి హరికథలు - శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, ప్రొద్దుటూరు
సరస్వతీ పత్రిక, కాకినాడ
హరికథ - శ్రీ నారాయణదాసు - ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1941
హరికథా పరిణామము [రేడియో ప్రసంగము జనవరి, 1968] శ్రీ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసు

ప్లుతము.

# సంబంధ సమాచారము

త. దాసుగారి జాతకము

క్రి. చెళ్లపిళ్ల - అదిభట్ల

ట. పద్యావృత్తులు

ధి. దస్తూరి

మి. పంచముఖీ ప్రదర్శిని

తో౦. దాసుగారి గ్రంథములు

# త. దాసుగారి జాతకము

రక్తాక్షి సంవత్సర శ్రావణ కృషచతుర్దశీ సౌమ్యవాసర పూర్వరాత్రౌ దశ ఘటికోపరి మఘానక్షత్ర చతుర్థచరణే పార్వతీపుర ప్రాగ్దిశ్యేకయోజనదూరే సువర్ణ ముఖీనదీ తీరస్థితాజ్జాడగ్రామేఽహముత్పభూవకిల (31-8-1864)

తాత్కాలికస్ఫుట నవగ్రహస్థితిగతీ సూర్యసిద్ధాంతరీత్యా వక్ష్యమాణే నిర్ణీతే భవతః

అజ్జాడగ్రామస్యోత్తరాక్షాంశాః - 0-18-40-0

| | | | |
|---|---|---|---|
| రవేఃస్థితి | 4-16-14-22 | గతిః | 0-0-58-5 |
| చంద్రస్యస్థితిః | 4- 6-36-20 | గతిః | 0-0-766-55 |
| కుజస్యస్థితిః | 1- 9-26-32 | గతిః | 0-0-28-30 |
| బుధస్యస్థితిః | 5-11-37- 7 | గతిః | 0-0-45-0 |
| గురోస్స్థితిః | 7- 1-56-53 | గతిః | 0-0-44-0 |
| శుక్రస్యస్థితిః | 5- 0-28-23 | గతిః | 0-1-11-49 |
| శనేస్థితిః | 5-21-8-24 | గతిః | 0-0-20-8 |
| రాహోఃస్థితిః | 6-24- 8-52 | గతిః | 0-0- 3-11 |
| కేతోఃస్థితి | 12-24-9-52 | గతిః | 0-0- 3-11 |

# కి. చెళ్ళపిళ్ళ - ఆదిభట్ల

(భారతి - అక్టోబరు - 1979)

చెళ్ళపిళ్ళ అంటే తిరుపతి వేంకట కవుల్లో ఒకరైన వేంకట శాస్త్రిగారు. ఆదిభట్ల అంటే హరికథా పితామహులైన ఆదిభట్ల నారాయణదాసుగారు. అదేం దైవ చిత్రమో కాని, ఈ ప్రతిభా వంతుల జీవితాల్లో సాదృశ్యాలు అనేకం కన్పడతాయి. ఆ సాదృశ్యాల్ని వివరించడం ఈ వ్యాస లక్ష్యం.

శాస్త్రిగారు, దాసుగారు ఇద్దరూ, చెరో ప్రక్రియను బహుళ ప్రచారంచేసిన ప్రక్రియా ప్రచారకులు. శాస్త్రిగారు అవధాన ప్రక్రియను, దాసుగారు హరికథా ప్రక్రియను తెలుగుదేశంలో ప్రతి బజారికి పరిచయం చేసినవారు. శాస్త్రిగారు చేపట్టడానికిముందు అవధాన ప్రక్రియ, దాసుగారు చేపట్టడానికిముందు హరికథా ప్రక్రియ లోకంలో లేకపోలేదు. ఉన్నా, ఈ రెండు ప్రక్రియల్ని సంపూర్ణంగా ఎరిగినవాళ్లు అక్షరాస్యుల్లో ఎంతో తక్కువే. కొంత మందిచేతమాత్రం నామమాత్రంగా పలకరింపబడుతూ ఎక్కడెక్కడో చెదురు మదురుగా వున్నయ్. ఇట్లా ఎక్కడెక్కడో మారుమూలల్లో అసూర్యంపశ్యలుగ, అనాథలుగా నక్కివున్న ఈ ప్రక్రియలు ఈ కళాకారుల కరగ్రహణంతో సాటి ప్రక్రియల్తో పోటీబడ్డాయి. కొన్ని దశాబ్దాలు ప్రభుత్వం చేశాయి. పండితుల దగ్గరనుంచి పామరులదాకా అందర్నీ పలకరించాయి. శతావధాని అంటే వేంకటశాస్త్రిగారనీ, హరిదాసు అంటే నారాయణదాసుగారు అని వెంటనే గుర్తుకు వచ్చేటంతగా, ఈ ప్రక్రియలకి ప్రాణ ప్రతిష్ఠ చేసి జనాకర్షణ యంత్రం కట్టిన ప్రక్రియారాధకులు వీళ్లిద్దరు.

ఈ మహామహులిద్దరూ నానారాజ సందర్శనం చేసి గజారోహణం మొదలైన అనేక సన్మానాల్ని పొందినవారు. అవధానాలనే వంకతో శాస్త్రిగారు, హరికథలనే వంకతో దాసుగారు రాజాస్థానాలన్నింటినీ శారదా పీఠాలుగా చేసినవారు. రాజాస్థానా లన్నింట్లో, అవధానాలంటూ శాస్త్రిగారు సాహిత్య సరస్వతికీ, హరికథలంటూ దాసుగారు సంగీత సరస్వతికీ అరతు లిప్పించినవారు. ఇట్లా ఈ ఇద్దరూ రాజాస్థానాలకు సరస్వతీ పురోహితులు.

వీళ్లిద్దరూ అపారంగా శిష్య సంపద కలిగినవారు. దానికి కారణమిది. ఈ ఇద్దరూ చేపట్టకముందు ఆ ప్రక్రియల్ని ఆసరా చేసుకొని కవులు కాలక్షేపం చేసే వాళ్లు. ఈ శారదా తనయులు చేపట్టిన తర్వాత, ఆ ప్రక్రియలే వీళ్లిద్దర్నీ ఆధారం చేసుకొని బ్రతికాయి. మహాజ్యోతులై వెలిగాయి. అట్లా మహా జ్యోతుల్లాగా వెలుగుతున్న ఈ ప్రక్రియల్ని చూసిన ప్రతివాడూ ఆకర్షింపబడ్డాడు. అంతే ఇక వీళ్లిద్దరికీ **అపారంగా** శిష్య సంపద చేకూరింది. ఈ శిష్యకోటి దేశం అంతా ఎట్లా వ్యాపించిందంటే, దేశంలో గజ్జె కట్టినవాడల్లా దాసుగారి శిష్యుడే, పద్యం అల్లగలిగిన వాడల్లా శాస్త్రిగారి శిష్యుడే.

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వేంకట శాస్త్రుని గూర్చి అన్నమాటల్లో ఒక పద్యం -

తన యెద యెల్ల మెత్తన-కృత ప్రతి పద్యము నంతకంటె మె
త్తన-తన శిష్యులన్న నెడదంగల ప్రేముడి చెప్పలేని మె
త్తనయయి-శత్రు పర్వత శతారము, సత్కవి చెళ్ళపిళ్ళ వెం
కన గురువంచుఁ జెప్పికొనఁగా నది గొప్ప తెలుంగు నాఁడునన్.

అట్లాగే చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు నారాయణదాసు గారిపై చెప్పిన పద్యాల్లో ఒకటి-

దాసు నారాయణునకు నీతండు, నీని
దాసు లెల్లఁగల హరిదాసులెల్ల
నొక్క హరిదాసులేకాదు, నిక్కమితని
యెడల నాదృతి లేని వాఁడెవఁడు పుడమి.

ఆధునికుల్లో ఈ ప్రక్రియల్ని చేపట్టిన వాళ్ళల్లో, వీరిద్దరికీ ప్రత్యక్ష శిష్యులో, పరోక్ష శిష్యులో, పరంపరా శిష్యులో, ఏకలవ్య శిష్యులో కాని వాళ్లు లేరన్నది సారాంశం. జన్మ వంశానికి సంబంధించిన జ్ఞాతులకంటె, విద్యావంశానికి సంబంధించిన జ్ఞాతులు ఎక్కువగా కలవారు ఈ సరస్వతీ స్తనంధయు లిద్దరు.

శాస్త్రిగారు, దాసుగారు చేపట్టి అనుభవిస్తున్న ప్రక్రియా నిధులు వంశ పారంపర్యంగా వచ్చినవికావు. గురు శుశ్రూషా లబ్ధాలు అంతకంటె కావు. కేవలం

దైవదత్తాలు. శాస్త్రిగారు అవధాన నిర్వహణ నైపుణ్యం, అట్లాగే దాసుగారు హరికథా కథన సామర్థ్యం ఎవరి దగ్గరా అక్షరాభ్యాసం చేయించుకోలేదు. శాస్త్రి గారికి మాడభూషివారు, దాసుగారికి కుప్పుస్వామి నిమిత్తమాత్ర ప్రేరకులు.

వీళ్లిద్దరూ ద్రావిడులు. భారద్వాజ గోత్రులు. భారద్వాజ గోత్రులగుటచే కాబోలు వీళ్ళ ప్రక్రియలు భరద్వాజుని విందులైనాయి. ఆ భారద్వాజునికి (ద్రోణునకు) ఒక్కడే ఏకలవ్య శిష్యుడు. ఈ భారద్వాజులకో ఏకలవ్య శిష్యులు అనేకం.

సందర్భాన్ని కల్పించుకొని అయినాసరే, వీళ్ళ మనస్తత్వాల్ని గ్రంథాల్లో నింపడం వీళ్లిద్దరికీ బాగావున్న అలవాటు. అంతదాకా ఎందుకూ? వీళ్ళే వీళ్ళ గ్రంథాల్లో పాత్రలుగూడ అయ్యారు. శ్రవణానందం మొదట వ్రాసినప్పుడు దాంట్లోనాయకుడు వేంకట శాస్త్రిగారే కదా.[1] ఇట్లాగే తిరుపతి వేంకటకవులు వ్రాసిన ప్రభావతీ ప్రద్యుమ్నం అనే నాటకంలో మూడు వంతులు వ్రాసింది వేంకటశాస్త్రి గారు. ఈ నాటకంలో శాస్త్రిగారు శుచిముఖిని అవధానిగా చిత్రించారు. అట్లాగే నారాయణదాసుగారు తారకము అనే సంస్కృత స్వతంత్ర ప్రబంధంలో నాయకుడైన తారకుణ్ణి (రాక్షసుడైన తారకుడుకాడు) మహాసంగీత విద్వాంసుడుగా చిత్రించారు సారంగధర నాటకంలో మహాకవి గాయక పాత్రను ఒకదాన్ని సృష్టించారు. ఈ తారకుడి పాత్రలో, మహాకవి గాయక శిరోమణి పాత్రలో కనబడేది దాసుగారే.

వీళ్లిద్దరికీ తల్లిదండ్రులు పెట్టిన పేర్లు వేరు. లోకంలో పిలిచేపేర్లు వేరు. వేంకటశాస్త్రిగారికి తల్లిదండ్రులు పెట్టినపేరు వేంకటాచలం. లోకవ్యవహారంలో ప్రసిద్ధి కెక్కిన పేరు వేంకటశాస్త్రి అని కదా. అట్లాగే నారాయణదాసుగారి తల్లి దండ్రులు పెట్టిన పేరు సూర్యనారాయణ. లోకవ్యవహారంలో ప్రసిద్ధికెక్కిన పేరు నారాయణదాసు అని కదా. ప్రజలు వీళ్ళ పేర్లను అదేపనిగా జపించడంచేత కాబోలు, వీళ్లిద్దరి పేర్లు ఇట్లా అరిగిపోవడానికి కారణం. పేరు పెరిగినకొద్దీ పేరు తరగడం పెద్దల్లో కన్పడే ఒక వింత లక్షణం.

ఈ ప్రక్రియా పితామహు లిద్దరూ వాళ్ళ అవతారాల్ని చాలించడంలో కూడా సాదృశ్యం వుండడం ఇంకో విచిత్రం. శాస్త్రిగారు మహాశివరాత్రినాడు, దాసుగారు

---

1. చూడుడు నా వ్యాసం 'తిరుపతి వేంకటకవుల రచనా విభాగము' స్రవంతి_ ఆగష్టు - 1973.

త్యాగరాజస్వామి జయంతినాడు వాళ్ళ ప్రతిభా సరస్వతుల గుర్తులను మాత్రం భూమిపై వదిలి స్వస్థానాలకు ప్రయాణం చేశారు. పర్వదినాలు స్వస్థాన ప్రయాణాలకు మంచివి కాబోలు.

వీళ్ళిద్దరూ మీసాల పండితులు. సర్వతంత్ర స్వతంత్రులు. దోషవిరోధులు. గుణ పక్షపాతులు, యథేచ్ఛా శృంగార విహారులు, బహుగ్రంథకర్తలు, కృతి స్వీకర్తలు, గజారోహణాది ఘన సత్కారాలను అనేకం పొందిన శారదామాతలు.

ఈ సమప్రతిభు లిద్దరూ సమకాలికులు కూడా కావడం చేత, ఒకరి ప్రతిభను మరొకరు చూసి మురిసిపోవడం కూడా జరిగింది. ప్రశంసించుకోవడం కూడ జరిగింది.

వేంకట శాస్త్రిగారు దాసుగారిపై చెప్పిన పద్యం

ఆది భట్టితండయ్యేను హరికథలకు
ఆది భట్టితండయ్యె గేయపు ఫణితికి
ఆది భట్టితండయ్యె నాట్యంపు కళకు
ఆది భట్టితండయ్యె లోకాద్భుతులకు

నారాయణదాసుగారు వేంకటశాస్త్రిగారిపై చెప్పిన పద్యం –

ఉభయ భాషాకవులలో సమున్నతిఁగని
సకల రాజ సభలయందు జయముగాంచి
శతవధానంబు సల్పు పండితులు లేరు
భళిర-తిరుపతి వేంకటేశ్వరులు దక్క.

ఇట్లా ఈ సార్వస్వేతేయు లిద్దర్లో సాదృశ్యాలు అనేకం వుండటం, వాళ్ళిద్దరిలోవున్న దైవాంశ ఏకమేకం అని లోకం గ్రహించడానికే.

శ్రీ గుండవరపు లక్ష్మీనారాయణ

# ౮. పద్యావృత్తులు

దాసుగారు మొదట చాటువులుగా చెప్పిన కొన్ని పద్యములను తరువాత వారి గ్రంథములలో చొప్పించిరి. వాని వివరము లివి—

1. 'మొలక లేతబిరుసు చిలిరుల నవరసము.'

మేలుబంతి - 141 సారంగధర - 8

2. 'సాగిరమ్మెచ్చునన్ వచ్చు తీగ కరణి'

మేలుబంతి - 147 సారంగధర - 9

3. 'పూర్వప్రబంధము పోల్కి-నై వచ్చిన
యూగ నంటించెడు హీనుడొకడు'

మేలు - 188 ప్రహ్లాద - 4

4 'ఘన శంఖమోయన కరంబు పూరించి
మేలుగా శ్రుతిలోన మేళగించి'

మేలు - 149 ప్రహ్లాద - 5

5. 'చీటులంటించి పోషింప జాలక పసు
లెచ్చటి కైన బోనిచ్చు వారు'

మేలు - 164 యథార్థ - 52

6. 'తలుపులు మూసితేవెచట, తాళము పెట్టుటలేదు....'

మేలు - 165 యథార్థ - 52

7. 'పల్లము వంక బ్రవర్తించె నీర్విశే
ష్యము జాడ జను విశేషణము భంగి'

మేలు - 166 జానకి - 59

8. 'రిఫ్లెక్టరుం బోలి రెట్టి జేయును నైజ
మగు తెల్వి దీపంబు నంటి విద్య'

మేలు - 181 ప్రహ్లాద - 14

9. 'అలరు తేనియలూరు దలిరుల జిగి మీదు
విన్న గలుపు దీరు బెంగుళూరు'

మేలు - 106 నాయెదుక - 195

10. 'తరచుగ నల్లి తాపుర తంపరగ జివు
రించెడి విద్యల మించు నెద్ది'

మేలు - 89 నాయెదుక - 158

11. 'ఏ దినంబున శోక మెరుగని బుధులెల్ల
కన్నీటి వరదలు గార్చినారు'
మేలు - 58 నాయెరుక - 113

12. 'స్మిత పూర్వాస్య సరోజ మున్నత భుజాశ్లిష్టంబు....'
మేలు - 58 నా యెరుక - 113

13. 'ఆశ్రితుల పాలి దాక్షిణ్యపరుల యొద్ద
శౌర్యముం గోవిదుల కడ సాత్త్వికతయు'
మేలు - 220 నాయెరుక - 227 సారంగ - 3

14. 'సన్నని మబ్బులో మెరయు చందురు పోల్కి మొగంబు....'
మేలు - 32 నాయెరుక - 209

15. 'వాణీ విలాసాక్షి చకోర చంద్రం
సౌజన్య సంతాన విభూతి సాంద్రం'
మేలు - 33 నాయెరుక 209

16. 'ఏయమ్మ పాలింప నెల్ల హిందువులకు
నిర్భయ భోజన నిద్రలౌదవె'
మేలు - 41 నాయెరుక 219

17. 'వార్తాకో నాగవల్లీ చ వనభోజన వైభవం
శ్రీ పాఠశాలా గోజాతిః మైసూరీవ నకుత్రచిత్'
మేలు - 106 నాయెరుక - 217

18. 'అజ్జాడ నా పుట్టినట్టి కుప్పమ్మ
నా తలిదండ్రులు పరసమ్మ చేన్లు'
మేలు - 225 నాయెరుక - 234

ఇక మొదట ఒక గ్రంథములో వ్రాసిన పద్యము తరువాత ఇతర గ్రంథము లలో చొప్పించిన వివరములు -

19. 'కలయందె త్తెడు మేనుతోచెడు ....'
బాటసారి - పద్యము 109, నాయెరుక - 225 సారంగధర - 69

20. 'మునుపు నీటిలోన మున్గి యూపిరి యాడ
కున్న మాడ్కి నిడుమ లొందు చుంటి'
బాటసారి - పద్యము 178 సారంగ - 110

21. 'తమ్ముమాలిన ధర్మంబు తగదటంచు
దలల నలరించు దమ మొదళులను గావ'
బాటసారి - పద్యము - 29 సారంగ - 102

22. 'ఇతరుల మనసు నొప్పించ దే కరుణావి
శిష్టుడు తనకెంత చెల్లియైన'
సారంగ - 80 ప్రహ్లాద - 13

